## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్థం మహానుభావులైన శ్రీ రామకృష్ణ మఠ్ వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) రామకృష్ణ మఠ్ వెబ్ సైట్: http://www.rkmath.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## రామకృష్ణ మఠ్ వారి వెబ్ సైట్

## http://www.rkmath.org

Archives

www.rkmath.org/prabhaarchives

Home | Universal Temple | Activities | Languages | Human Excellence | Health | Publications | Downloads

Magazine | Telugu Books, CDs & Posters | Online Shopping

About | Archives | Subscription

+ Aa - What's New Our Location

Would you try to wash dirt with dirt? Will sin cure sin, weakness cure weakness? Strength, O man, strength, say the Upanishads, stand up and be strong.

- Swami Vivekananda

Donate | Serve with us | Contact Us

Universal Temple

- Temple
- Arathi
- Bhajans
- Festivals
- Rama Nama
- Worship

Activities

- Weekly discourses
- Relief
- Library
- Retreats
- Anna Danam
- Balanarayana Seva
- Vidya Danam
- Jnana Danam
- Satsangas
- Diksha

Ramakrishna Prabha Magazine Archives

Submit

2012

2011

Click to read

Click to read

Click to read

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౩౪ ౧౯౭౭ - జనవరి : నల - పుష్యము సంచిక ౧

## విషయసూచిక

## శ్రీ వివేకానంద జీవితచరిత్ర

(శ్రీ చిరంతనానందస్వామి ప్రణీతము)

ఇందు శ్రీ స్వాములవారి జీవితమున నింతకుపూర్వము గ్రంథస్థములుగాని ముఖ్య సంఘటన లెన్నియో శ్రీవారి సోదర శిష్యులవలన విని వ్రాయబడినవి. ఇది శ్రీస్వాములవారి సంపూర్ణ చరిత్ర!

నిర్దుష్టమైన భాష, అందమైన అచ్చు, ఆకర్షకమైన రూపము.

432 పుటలు వెల : రూ. 4-00

(పదవ కూర్పు)

## శ్రీ శారదాదేవి జీవిత చరిత్ర

రచయిత :

శ్రీ చిరంతనానందస్వామివారు

శ్రీ రామకృష్ణభగవానుని సతీమణియు ఆదర్శమాతయు, యోగినియునగు మహనీయురాలి దివ్యచరిత్ర. ప్రతి స్త్రీయును పురుషుడును చదువవలసిన గ్రంథము. తియ్యని తెలుగు. పాలవంటి శైలి.

ఆఱవకూర్పు.

పుటలు : 246 వెల : రూ. 4-00

## బాలల వివేకానందుడు

బెంగాలీ మూలము :

శ్రీ నిరామయానందస్వామి

అనువాదకులు :

శ్రీ కరణం రంగనాథరావు

జగద్విఖ్యాతుడైన వివేకానందస్వామి జీవితచరిత్ర బాలబాలికలకు సులభముగా అర్థమగునట్లు రచింపబడినది. స్వామివారి బాల్యవిశేషములు శ్రీ రామకృష్ణుల సాంగత్యము పాశ్చాత్యదేశములకు పయనము మాతృదేశమున వారి కార్యక్రమము మనోహరముగ సంగ్రహింపబడినది.

పుటలు : 80+viii వెల : రూ. 2-00

(రెండవ ముద్రణము)

## రామకృష్ణోపనిషత్తు

తమిళ రచయితలు :

శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్యులుగారు

ఆంధ్రానువాదకులు :

గౌ॥ న్యాయమూర్తి

శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు

శ్రీరామకృష్ణ దేవుని దివ్యోపదేశ వాక్యము లాధారముగాగొని, వానిని విరివి పఱచి, మనోహర కథా రూపముగను, సంభాషణరూపముగను అమర్చబడినది.

128 పుటలు వెల : రూ. 3-75

ఇట్లు వ్రాయుడు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004

# బ్రహ్మానందబోధనలు

(ఆధ్యాత్మిక పరిప్రశ్నములు)

శ్రీ చిరంతనానందస్వామి

బ్రహ్మానందబోధనలు (శ్రీ బ్రహ్మానందస్వామి జీవితోపదేశములు) అను గ్రంథము నుండి బ్రహ్మానందవాణి యను పేర ఇందు ఉపదేశములు మాత్రము సంగ్రహింపబడినవి. పాఠకుల సౌకర్యార్థము స్వామి సంగ్రహ చరిత్రయు చేర్పబడినది. స్వామి యుపదేశములు ఆధ్యాత్మికతత్త్వములను సాధనయందలి రహస్యములను అరటిపండొలిచి ఇచ్చినట్లు విశదీకరించును.

పుటలు : 272 + XXI వెల : రూ. 4–75

(ప్రథమ ముద్రణము)

# భక్తియోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఆధునికుల చిత్తము నాకర్షించురీతిని, అమోఘవచనములతో, విమర్శకదృష్టితో శాస్త్రప్రమాణములతో భక్తితత్త్వమును శ్రీ వివేకానందస్వాములవా రిందు విపులముగా ప్రదర్శించి యున్నారు. మూల గ్రంథములలోని ప్రమాణవచనములును వానికి టిప్పణములును సులభశైలియందు వ్రాయబడి యున్నవి.

(ఏడవ కూర్పు)

(121+4 పుటలు) వెల : రూ. 4–00

# కర్మయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు శ్రీ స్వాములవారు కర్మయోగతత్త్వమును అరటిపండొలిచినట్లు విశదీకరించియున్నారు కర్మమెటుల మోక్షసాధనమో స్పష్టీకరించియున్నారు.

(అష్టమ ముద్రణము)

(146+8) పుటలు వెల : రూ. 4–00

# గురూపదేశములు

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వామి

శ్రీ గురుదేవుని మానసపుత్రు డనబరగిన శ్రీ బ్రహ్మానందస్వామి గురుముఖము నుండి వచ్చిన యుపదేశములను యథాతథముగ గ్రహించి వానియందు ముఖ్యములగు వానిని సంగ్రహించి యాంగ్లమున రచించిరి. వాని యనువాదమే ఈ గ్రంథము. ఇందు గృహస్థులకు సాధకులకు వలయు సూక్తు లెన్నియో వివరింపబడియున్నవి.

పుటలు : 168 వెల : రూ. 2–00

తొమ్మిదవ ముద్రణము

ఇట్లు వ్రాయుడు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004.

# మనవి

## రచయితలకు

1. జనరంజకమైన శైలిలో సంస్కృతి మతము తత్త్వ శాస్త్రములకు సంబంధించినవి ఉన్నత విలువలను గూర్చినవి అయిన రచనలుసంచికలో ప్రచురణార్థము పంపవచ్చు.

2. రచనలు సంచికలో మూడు లేక నాలుగు పేజీలకు మించకుండా ఉండాలి. ఇంకా పెద్దవైన రచనలు ప్రచురించడం సాధ్యం కాకపోవచ్చు.

3. తగినన్ని స్టాంపులు జతచేస్తే తప్ప, ప్రచురింపబడని రచనలు త్రిప్పి పంపబడవు.

4. సంతరించిన రచనలలోని అభిప్రాయాలకు సంపాదకులు బాధ్యత వహించరు.

5. ఆహూతములైన రచనల ప్రచురణలో కూడా తుది నిర్ణయం సంపాదకులది.

ఇతర వివరాలకు :

సంపాదకుడు
శ్రీరామకృష్ణప్రభ, P. B. 635
మైలాపూర్, మద్రాసు-4.

## చందాదారులకు

1. శ్రీరామకృష్ణప్రభ సంపుటం ప్రతి ఏటా జూలైనుంచి ప్రారంభమౌతుంది. ఏమాసం నుండి అయినా చందాదారులు కావచ్చు.
2. చందాపైకం మనియార్డరు ద్వారాగాని క్రాస్డ్ పోస్టల్ ఆర్డర్, క్రాస్డ్ బ్యాంకుడ్రాఫ్టుల ద్వారాగాని ('శ్రీరామకృష్ణ మఠము, మద్రాసు' అను పేరిట) పంపవచ్చును. మనియార్డరు కూపనులో అడ్రసు వివరాలు సరిగా వ్రాయాలి.
3. చందాదారులు ఉత్తర ప్రత్యుత్తరాలలో తమ చందాదారు సంఖ్యను ఉదాహరిస్తూ విలాసం స్పష్టంగా వ్రాయాలి.
4. మూడు నెలలకు మించిన అడ్రసు మార్పిడి ఆ ముందటి నెల మొదటి వారంలోగా తెలియజేయాలి.
5. సంచిక సాధారణంగా నెల ఆఖరి వారంలో అందుతుంది. అందకపోతే మరుసటి నెల మొదటి వారంలోగా తెలపాలి.
6. చందాదారులకు మా ప్రచురణలపై నెలలో 5% తగ్గింపు ఉంటుంది.

వివరాలకు :

మేనేజర్
శ్రీరామకృష్ణప్రభ, P. B. 635
మైలాపూర్, మద్రాసు-4.

## ప్రచురణకర్తలకు

శ్రీ రామకృష్ణప్రభలో మతతత్త్వశాస్త్ర సంస్కృతి విషయికములైన తెలుగు ప్రచురణలు సమీక్షింపబడుతాయి. సమీక్షకై రెండు ప్రతులు పంపవలసి ఉంటుంది.

—సంపాదకుడు.



'అఖిలవిభు శరణొందుము, యా క్షణంబ యతనికృప నీదు ననుభూతి కందు వత్స'.

-శ్రీ శారదామణి.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౩౮ ౧౯౭౭ - జనవరి : : నల - పుష్యము సంచిక ౧

ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ!

## ప్రార్థన

## శ్రీరామకృష్ణ కర్ణామృతము

తన్మర్త్యతాధి గమనస్య పరంహి లిఙ్గం
తజ్జీవనస్య పరమా రమణీయతా చ
యద్రామకృష్ణ చరణస్తను వాఙ్మనోభి
రాస్వాద్యతే సతతమాత్మ సమర్పణేన.

శ్రీరామకృష్ణుని చరణసన్నిధిని ఆత్మార్పణము చేసికొని మనోవాక్కాయములచే నిరంతరము అతనిసేవ చేయుటవలన కలుగు బ్రహ్మానందానుభూతియే మానవజీవితమునకు సార్థక్యము. అదియే మానవజీవితమునకు నిజమగు రమణీయత.

యాగో న పాలయతి యోగరుచిర్నపాతి
జ్ఞానం న రక్షతి తపాంసి న తారయన్తి।
శ్రీరామకృష్ణ పాదయోస్తు విశుద్ధ భక్తి
స్తన్నిర్నిమిత్త కరుణా చ కరోతి రక్షామ్॥

యజ్ఞయాగములు రక్షింపలేవు. యోగనిరతికాని జ్ఞానముకాని కావలేవు. ఘోర తపములు ఆదుకొనలేవు, శ్రీరామకృష్ణుని పాదపద్మములందు విశుద్ధమైన భక్తి ఆయన నిర్హేతుకమైన యనుగ్రహము మాత్రమే మనలను రక్షింపగలవు

'వట్టి పాండిత్యముద్వారా మానవు డేమి సాధింపగలడు? కావసిన దేమన, ప్రార్థన ఆధ్యాత్మిక సాధన. ఇందేశ్ (అను ఊరి) గౌరి పండితుడు భక్తుడుకూడ. అతడు కాళీమాత ఆరాధకుడు. అప్పుడప్పుడు అతడు ఆధ్యాత్మికావేశమున మునిగిపోయెడివాడు. అతడు దివ్యజననిస్తోత్రమును పఠించునపుడు అతనిప్రక్క పండితులు వానపాములవలె తోచుదురు. వాడుకూడ భావపరశత కలిగెడిది.

'మొదట నతడు దురభిమానగ్రస్తుడగు శక్తి ఆరాధకుడు. తులసీదళములను[1] తాకకుండుటకు వానిని రెండు పుల్లలతో ఎత్తెడువాడు. తరువాత అతడింటికి పోయెను. తిరిగి వచ్చినపిమ్మట ఇక మరల ఆవిధముగ ప్రవర్తింపలేదు. హైందవ పురాణగాథల కతడు చెప్పుకోదగిన వ్యాఖ్యానము చేసెడివాడు. రావణుని పదితలలు పది ఇంద్రియములకు ప్రతీకలని అతడనును. కుంభకర్ణుడు తమస్సునకు ప్రతీక, రావణుడు రజస్సునకు, విభీషణుడు సత్వమునకును ప్రతీకలు. అందువలననే విభీషణుడు రాముని యనుగ్రహముసంపాదించెను.'

*　　　*　　　*

[గౌరీ పండితుడు తన తపముచే నొక దివ్యసిద్ధిని సంపాదించెనని గురుదేవు లనిరి. శాస్త్రవాదమునకు పిలువబడినపుడెల్ల అతడు 'హా రే రే రే' అనుశబ్ద పురస్సరముగా 'లంబోదరజననీ నిస్సహాయుడనగు నేను నిన్ను తప్ప ఇంకెవరిని శరణు వేడగలను' అను శ్లోకపాదమును కొన్ని తడవలు పెద్దగా నుచ్చరించుచు ఆ సభాస్థలమును ఇంటిని ప్రవేశించువాడు. ఆ శబ్దములు వీరభావము నుద్దీపింప జేయును.] మేఘగర్జనమువలె గంభీరమగు కంఠముతో ఆచార్యశంకరుల దేవీ స్తోత్ర శ్లోక పాదమును, వీరభావమును ప్రకటించు దాని [illegible] నోటినుండి విని సభ్యులందరును చెప్పరానిభీతికి లోనయ్యెడివారు. దీనివలన రెండు ఫలితములు కలిగినవి. మొదటి[illegible] శబ్దము [illegible] [illegible] సంఘర్షణముగ జాగృతమయ్యెడి [illegible] ప్రతిధ్వనులను గాథ [illegible] పెట్టి [illegible] చేయుటవలన వారి శక్తి [illegible] [illegible]ంచెడివాడు. ఆ శబ్దమును విన్న [illegible] ఉచ్చరించు మనుష్యులవలెనుండి అగ[illegible] జబ్బు చరణమును గౌరి సభయందు ప్రవేశించి కాళ్లు మడచి కూర్చుండెడివాడు. ఢిల్లీ చక్రవర్తుల సభయందువలె మోకాళ్లు రెండును ఎదురు జోడించి పాదములు వెనుకకు పెట్టి కూర్చుండి [illegible] పాదములపై [illegible]గెడివాడు.

*　　　*　　　*

'తాను అజేయుడుగ నుండుచు ఇతరుల శక్తి నపహరించుటయను గౌరీ పండితుని శక్తి ఇక్కడ తెలియబడి అతనికి శాశ్వతముగ నష్టమైనదని దివ్యజనని తెరువారి తనవారి వాతో చెప్పెను. అతని శ్రేయమునకై జనని ఆశక్తిని "ఇక్కడికి" (గురుదేవులలోనికి) ఆకర్షించివేసెను.'

*　　　*　　　*

' "ఇందరు జనులు నా వద్దకు వచ్చునట్లు చేయుటకు నాకు తెలిసినవిద్యయేమి?" అని నేను అప్పుడప్పుడు అనుకొనెడివాడను. వైష్ణవ చరణుడు గొప్ప పండితుడు. అతడు నాతో నిట్లనెడువాడు. "నీవు మాటలాడు సంగతులన్నియు నేను శాస్త్రములలో కనుగొనగలను. కాని నేను నీ వద్దకేల వత్తునో తెలియునా? వానిని నీ నోటి నుండి వినుటకు వత్తును." '

1. తులసీదళములు విష్ణువునకు ప్రియమైనవి. విష్ణువునకు సంబంధించిన దేనినైనను దురభిమానియగు శక్తి ఆరాధకుడు ద్వేషించును. అట్లే శక్తికి ప్రియములైనవానిని అట్టి వైష్ణవుడును ద్వేషించును.

'భగవంతుడు మానవరూపమున క్రీడించుచున్నాడని విశ్వసించినచో అతనికి సంపూర్ణ జ్ఞానము వచ్చినట్లేయని వైష్ణవచరణు డనెడి వాడు. ఆ సమయమందున నేను దానిని ఒప్పుకొనెడి వాడనుకాను. కాని అతడు చెప్పినది సరియే యని ఇప్పుడు గ్రహించుచున్నాను. మానవుడు ప్రేమను మార్దవమును ప్రకటించు చిత్రములను వైష్ణవచరణుడు ఇష్టపడెడివాడు.'

కాళీ గౌరాంగుల అభేదమును సాక్షాత్కరించు కొనగలిగినచో నిక్కపుజ్ఞానము లభించునని గౌరి యొకనాడనెను. బ్రహ్మమేదియో అదియే శక్తి, కాళి. ఆ బ్రహ్మమే మానవరూపముదాల్చి గౌరాంగుడయ్యెను.

*  *  *

'వైష్ణవచరణుడు నాతో నిట్లనెను: ''ఒకడు తన ప్రియురాలిని తన ఇష్టదైవముగ చూడ గలిగినచో అతడు తన మనస్సును సులభముగ భగవంతుని వైపునకు త్రిప్పగలడు.'' కామార్పుకూరువద్దనున్న శ్యామ్‌బజారులోని స్త్రీ పురుషులు, ఒక మతశాఖకు చెందినవారు, పరస్పరము ఇట్లనుకొందురు ''నీ వెవరిని ప్రేమించుచున్నావు?'' ''నేను ఫలానావ్యక్తిని ప్రేమించుచున్నాను'' ''అయిన అతడే నీ భగవంతుడని ఎఱుగుము.'' ఇది వినినంతనే నేను వారితో నిట్లంటిని ''అది నా పద్ధతి కాదు. అందరు స్త్రీలను నేను నా తల్లిగనే భావింతును,'' వారు గొప్పలు చెప్పుదురు కాని పతిత జీవనము గడుపుదురని నేను కనుగొంటిని. అప్పుడు ఆ స్త్రీలు తమకు మోక్షము కలుగునా యని నన్నడిగిరి. నేనంటిని ''ఆఁ. ఒక పురుషునే సంపూర్ణముగా నమ్మియుండి అతనినే భగవంతునిగా చూచినచో మాత్రమే. ఐదుగురు పురుషులతో నివసించిన మీకు మోక్షము లభింపదు.'' '[4]

నీ గురువుయొక్క సదుపదేశములను శ్రద్ధతో వినుచు జీవాత్మ పరమాత్మల ఐక్యము ననుభవింప ప్రయత్నించుము. 'తత్త్వమసి' అని ఆయన ఉపదేశము. ఆ స్థితిని అందుకొనుటకు నీకు గురువుయొక్క అనుగ్రహము అత్యవసము

గురువుయొక్క అనుగ్రహభాగ్యమును పొందుటకు మొదట నీవు తత్త్వమసి అను పదములను అర్థము చేసికొనవలెను. 'తత్' అనగా 'పరమాత్మ' 'త్వమ్' అనగా 'జీవాత్మ.' 'అసి' అనగా 'ఉన్నావు.' కనుక ఆ ఉపదేశమునకు, జీవాత్మ పరమాత్మ రెండును ఒకటియే అని యర్థము. పరమాత్మ జీవాత్మ రెండును ఒకటియే కనుక వానిని విడదీసి చెప్పుటకు వీలులేదు. వానికి ప్రత్యేకములగు గుణములను ఆస్వాయించి చెప్పుటకుకూడ వీలులేదు.

*  *  *

పంచభూతములచే నిర్మింపబడినది పరిచ్ఛిన్నమైనది నశ్వరమైనది అయిన శరీరము ఆత్మకంటె భిన్నమైనది. ఆత్మకు ఆది అంతములు లేవు. అది అవినాశి. అది ఈ శరీమును సృష్టించును. దీనినిగూర్చి బాగుగా చింతించి ఆత్మను తెలిసికొనుటకు ప్రయత్నింపుము.

*

2. కాళీ భక్తులకును గౌరాంగ భక్తులకును నడుమ పచ్చుగడ్డివేసిన భగ్గుమగును.

3. కర్తాభజ, నవరసిక మొదలగు వైష్ణవశాఖలు. ప్రేమభావమున స్త్రీ పురుషులు కలిసి జీవింపవలెనని వాని బోధ. పరస్పరము దేవునిగా భావించుచు ఆ ప్రేమను క్రమముగా ఉన్నతోన్నతస్థాయికి కొనిపోవలెను. చరమావస్థయందు భౌతికప్రేమనుకూడ భగవత్ప్రేమగనే సాక్షాత్కరించుకొనవలెను. ఇది దుస్సాధ్యమైన సాధన.

4. చూ. Sri Ramakrishna the Great Master P. 518-9.

'నేతి, నేతి,'' అను ఈ పద్ధతిద్వారా ఆత్మ యనగా ఖచ్చితముగా నేదో తెలిసికొనుటకు ప్రయత్నింపవలెను. మంచిచెడ్డల మిశ్రమమైన ఈ ప్రపంచమును ఇట్లు పరీక్షించుచు దాని సారమును గ్రహించి తక్కినదానిని వదలివే యుము. మామిడిపండు రసమును గ్రహించి టెంకను పారవేయునట్లే. ఆత్మకు జన్మ మృత్యువులు లేవు. దానికి బాల్యము లేదు. యౌవనము లేదు వృద్ధాప్యమును లేదు.

5. 'నేతి' అనగా ఇది కాదు అని యర్థము. ఆత్మ ఈ శరీరముకాదు మనస్సుకాదు ఇత్యాది.

ప్రభాప్రసారము
(సంపాదకీయము)

# శ్రీ వివేకానందస్వామి



మహాపురుషుల ఉపదేశములకు వారి జీవితము లే నిండైన వ్యాఖ్యానములు సార్థకములైన ఉదాహరణములు. వారి జీవితములలో మనోభావనలు మాటలు చేతలు ఏకరూపములై విలసిల్లుటను గమనింపగలము. 'మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మనామ్' అనికదా ఆర్యోక్తి. కాని అతిసరళమైన ఈ నిర్వచనమునందు అపారమైన యర్థము ఇమిడియున్నది. మానవుడు ఊహింపగలుగు సద్గుణములన్నియు, సత్యభాషణము పవిత్రత శ్రద్ధ నిస్స్వార్థత నిష్పాక్షికమైన ప్రేమ మొదలైన సుగుణములన్నియు అందు చేరిపోవును. 'బహవో దుర్లభాశ్చైవ, యేత్వయాకీర్తితాగుణాః' ఇట్టి సద్గుణములన్నియు ఒక్కచోట రాశిపడుట నిజముగా దుర్లభమే. అయినను మానవులకు అట్టి ఆదర్శమును ప్రకటింపగోరి అవతార పురుషులు మానవ రూపమును ధరించుచుందురు. అట్టివారిలో కాలమానమున మనకు అత్యంతసన్నిహితుడు శ్రీవివేకానందస్వామి.

భగవత్సాక్షాత్కారమునకై ప్రయత్నించువారికి కూడ మనసును మాటను ఏకముచేయుట అను సాధనను శ్రీరామకృష్ణులు విధించిరి. శ్రీవివేకానందస్వామియు 'పరిశుద్ధుడవుగ పవిత్రుడవుగనుండుము. తేజస్సు అదియే వచ్చును.' అని యొక శిష్యునికి వ్రాసియుండిరి. వారి ఉపదేశము లన్నింటికిని ఇదియే మూలసూత్రము. వారినోట వెలువడిన ఈ మాటల ప్రభావము అపారము. అవి ఆతని బలమును పవిత్రతను పరితయందు ఉజ్జ్వలముగ చేసినవి. కారణమేమి? ఆతని త్రికరణ శుద్ధియే. అది ఆయనకు అనుక్షితవిషయమై అనుభవసిద్ధమైనది కనుకనే ఆయన పలుకులు కేవలము ఉత్సాహవచనములుకాక అనుభవ సత్యములై నెగడుచున్నవి. ప్రస్తుతమున ఆయన ఉపదేశములను ఆచరణములను ఒక కొంత జ్ఞప్తికి తెచ్చికొందము.

## సత్యభాషణము

స్వామిజీకి సత్యమునెడకల గౌరవము అపారము. శ్రీరామకృష్ణులకువలెనే ఆయనకును సత్యమే పారమార్థిక జీవనమునకు పునాది.

''నిరుత్సాహపడకుడు. సత్యవాక్కు ఒక్కటి కూడ నష్టము కాజాలదు. యుగయుగములుగ అది చెత్తలో మరుగుపడి యుండవచ్చును. కాని ఎప్పుడో యొకప్పుడు అది వెలువడి తీరును. సత్యము అవినాశ్యము. సచ్ఛీలము అవినాశ్యము పరిశుద్ధత అవినాశ్యము.'' అని నల్లరాయివంటి సందేహములను సైతముచీల్చుకొని పోవు నిశ్చయ బుద్ధితో స్వామిజీ ఒక శిష్యునకు వ్రాసెను. అదిఎట్లు సంభవమైనది? అతడు స్వయముగ కేవలముసత్యతత్పరుడగుట వలననే. బాల్యమునుండియు ఆయనకు సత్యమనునది యొక సహజసంపద. జీవితాంతమువరకు ఆ సత్యముకొరకై ఆయన పెనగులాడుటను చూడగలము. అట్టి యొక సంఘర్షణమే ఆయనను శ్రీరామకృష్ణులవద్దకు కొనివచ్చినది. ఇక అది విచార ప్రపంచమునందును కర్మప్రపంచమునందును ప్రాచ్యపాశ్చాత్యములలో ఎట్టియద్భుత ప్రభావమును చూపినది!

ప్రాణమిత్రులకు సైతము మనసు విరిగి పోగలుగు సందర్భములందు కూడ ఆయన సత్యమునే యనుసరించెను. 1. 2. 1895 న ఆయన మేరిహేల్ కన్యకు వ్రాసిన యుత్తర మొక యుదాహరణము. అందాయన ఒక ప్రెస్బిటేరియను పెద్దమనిషితో తనకు గలిగిన తీవ్రవాదమును గూర్చి వ్రాయును. ''ఎప్పటివలెనే ఆయన చాల ఉద్విగ్నుడై కోపపరవశతతో తిట్టసాగెను. పిమ్మట ఈ విషయమై శ్రీమతి బుల్ నన్ను తీవ్రముగ మందలించినది. అట్టి సంఘటనలు నాకార్యమునకు ఆటంకములట. నీ యభిప్రాయములుకూడ అవియేమైనట్లున్నది.'' ఈ ఇద్దరు వనితలును ఆయన హితకాంక్షులువిశ్వాసపాత్రులైన సమర్థకులును. కాని సత్యము విషయమున ఆయన యెవరినిగాని గణింపడు. ఆయనయే అనినట్లు ''ప్రాపంచిక పురోగతికి తీయగా మాటలాడుట ఎంత ఆవశ్యకమో నాకు చాల బాగుగ తెలియును. అట్లుండుటకు నేను సర్వప్రయత్నమును చేయుదును. కాని అంతరమగు సత్యమును వంచింపవలెననినచో ఇక నేనాగిపోవుదును... నాకు సమదర్శిత్వమునందు విశ్వాసము. సామాన్య మానవునకు ఆతని 'దైవ' మగు సంఘపుటాజ్ఞలను పాలించుట విధి, కాని అమృతస్య పుత్రులు అట్లెన్నడును చేయరు. ఇది శాశ్వతి సత్యము. జనవాక్యమును పూజించువారు క్షణములో రూపుమాసి పోవుదురు. సత్యమును పాలించువారు శాశ్వతముగ జీవింతురు.''

సత్యమార్గము పూలబాట కాదనుట నిస్సంశయమే. కాని ఒక ఆధ్యాత్మిక మార్గదర్శకుడు సంఘముయొక్క ముద్దుముచ్చటలను తీర్చుచు దానిని వినాశమునకు పోనీయజాలడు. ఆయనకొక జీవనదీక్షయున్నది. సమాజమునతడు తన ఎత్తునకు ఉద్ధరించవలసియున్నది. పేరుప్రతిష్ఠలు సంపద సౌందర్యములు మేడిపండని ఆట్టివారికి తెలియును. కనుకనే వాని నికృష్టతను గర్హించుచు వాని గుట్టు వెల్లడిచేయుదురు. సత్యమేవ జయతి అని వారికి స్పష్టముగ తెలియును. నమ్మకముకాదు, తెలియును. సత్యమును స్వామిజీ అనంతశక్తివంతమైన అమ్ల పదార్థముతో పోల్చును, 'అది ఎచ్చటపడినను తనదారిని తొలుచుకొనిపోవును. మెత్తని పదార్థములలో తత్క్షణమును నల్లరాయిలో ఆలస్యముగను, కాని తొలిచివేయుటమాత్రము తప్పదు.' ఆ ఉత్తరముననే ఆయన ఇట్లు వ్రాయును. 'సోదరీ, తీయగానుండి ప్రతి పచ్చియబద్ధమునకు ఒదగియుండజాలనందుకు విచారించుచున్నాను. కాని అది నావలనకాదు. నే నెంతో ప్రయత్నించితిని. కాని నావలనకాదు. చివరకు ఆ ప్రయత్నము వదలుకొంటిని. భగవదిచ్ఛ. సత్యభగవానుడా! నీవే నాకు మార్గదర్శకుడవుకమ్ము. ఈ పరిసర ప్రపం

చపు తప్పటడుగులను అనుగమించుచు లోనున్న సత్యవాణిని నేనేల నిరాదరింపవలెను?' వివేకానందస్వామి సత్యమునకు మూర్తరూపము. ఈ ఉత్తర ప్రత్యుత్తరములపిదప మేరి హేల్ కన్యగాని శ్రీమతి బుల్ కాని స్వామీజీపట్ల గౌరవాదరములను కోల్పోయిరని తలపకుందుము గాక. తుదివరకును వారిరువురు ఆయనకు బాసటయై నిలిచిరి. ఇట్టి సంఘటనలు వారి జీవితమున అసంఖ్యాకములు. కాని ఆయన ఎన్నడును లొంగలేదు. అసత్యమనిన సహజసిద్ధముగ ఆయనకు జుగుప్స.

## నిస్స్వార్థత

ఇక తేజమనుటలో స్వామీజీ యుద్దేశమేమి? ఒక ఉదాత్త లక్ష్యమునకై మరణమును సైతము గణింపక ఎట్టి వ్యతిరేక పరిస్థితులనైనను ఎదుర్కొనుచు కార్యరంగమున దుముకు బలము ఉత్సాహము శక్తి. ఇట్టి అద్భుతములను సాధింపగలది పవిత్రత నిస్స్వార్థతల తేజమే. మరియొక సందర్భమున స్వామీజీ ఇట్లు ఉద్ఘాటించెను. 'గుర్తుంచుకొనుడు, ఇది జీవితానుభవము: మీరు నిజముగా ఇతరుల శ్రేయమునే కోరితిరేని యావద్విశ్వము మీకెదురై నిలిచినను మిమ్ము బాధింపజాలదు. శ్రద్ధావంతుడవై నిజముగా స్వార్థరహితుడవైనచో, నీయందున్న భగవద్భక్తి ఎదుట అది చూర్ణమై పోవును.' సంపూర్ణముగ నిస్స్వార్థపరులు కండని తన అనుయాయుల నాయన ఉద్బోధించెను. ఒక సంస్కృత శ్లోకము నాయన తరచుగా ఉదాహరించెడువాడు 'ధనాని జీవితంచైవ పరార్థే ప్రాజ్ఞ ఉత్సృజేత్, సన్నిమిత్తే వరంత్యాగో వినాశే నియతే సతి.' ధనమును జీవితమునుకూడ ఇతరులకొరకై ప్రాజ్ఞుడు త్యజింపవలెను. చావు నిశ్చయమైయుండగా ఉత్కృష్ట కార్యమునకై మరణించుటయే శ్రేష్ఠము. ఏలన మానవజీవితమును చక్కగా వినియోగించుటకు ఇదియే ఉత్తమ మార్గమని ఆయన యనెను. ఇంగర్‌సాల్ ఒకప్పుడు ఆయనతో నిట్లు పలికెను. 'ఈ ప్రపంచమును పూర్తిగా అనుభవించుటనే నేను నమ్ముదును. పండును పూర్తిగా పిండుకొనవలెను. మనకు నిశ్చయముగ తెలిసినది ఈ ప్రపంచమే' స్వామీజీ ఇట్లు బదులాడెను. 'ఈ ప్రపంచమను పండును పిండుటకు నాకు శ్రేష్ఠతర మార్గము తెలియును. దానివలన నాకెక్కువ లభించును, ఏ భయమును లేదని నాకు తెలియును. కనుక పిండుటలో నాకానందము. నాకు బాధ్యతలు లేవు. భార్యాపుత్రులు ఆస్తిపాస్తులు అను బంధము లేదు. సకల మానవులను నేను ప్రేమింపగలను. ప్రతియొక్కడును నాకు భగవంతుడే. మానవుని భగవంతునిగ ప్రేమించుటయందలి ఆనందము నూహింపుము! నీ పండును ఈ విధముగ పిండుము. పదివేలరెట్లు నీకు లభించును. ప్రతియొక్క బిందువును సంపాదించుకొనుము.'

ఇంగర్‌సాలుని 'నమ్మిక' యును స్వామీజీ 'తెలియు' టయును గమనార్హములు. ఇంగర్‌సాలు పంచేంద్రియ ప్రపంచమున మాటలాడుచున్నాడు. అతనికి ఏదియు నిశ్చయముగ తెలియదు. స్వామీజీ తన గురుదేవుల కటాక్షము వలన ఏనాడో సర్వమును భగవన్మయముగా దర్శించినాడు. కనుకనే అతని నిర్ధారణ.

మరియొకసారి స్వామీజీ ఇట్లు ఘోషించెను. 'నిస్స్వార్థముగ నుండుట బొత్తిగా స్వార్థమే లేకుండుట–అదియే మోక్షము. ఏలన లోనున్న మానవుడు చచ్చును. భగవంతుడు మాత్రమే మిగులును.' ఇవి ఋషివాక్కులు. మంత్రద్రష్ట పలుకులు. అతి స్పష్టములు. అర్థద్వైవిధ్యములేనివి. మోక్షమునకు అతి సులభమైన మార్గమును సూచించునవి. కాని దానిని పాటింపవలెను. ఇతరులకొఱకై ప్రగాఢముగ నిష్కామముగ పరిశ్ర

మింపవలెను. తన గతి యేమగునను ఆలోచనయే ఉండరాదు. ఆయన దీనిని స్వయముగా ఆచరించి చూపెను. 'ఆయనకు తనను గూర్చిన ధ్యాసయే ఉన్నట్లు తోచదు. ఎల్లప్పుడును ఎదుటి వ్యక్తియందే ఆయనకు ఆసక్తి.' ఇవి ఆయన అమెరికా దేశీయుడైన మిత్రుని పలుకులు. నిండు హృదయముతో స్వామిజీ ఇట్లు పలికెను. 'రాత్రింబవళ్లు గుండె నెత్తురు ధారపోసి ఇతరులకై పరిశ్రమించిన చో జీవితమున ఏదీ అసాధ్యమేయు ఉండదు. తెలియునా?' మరియొకసారి ఇట్లనెను. 'మనకు మనగూర్చిన యాలోచన లేనపుడే మన శ్రేష్ఠతమ పరిశ్రమ జరుగును. మహత్తమమైన ప్రభావము ప్రసరించును.'

## విశ్వమానవప్రేమ

కాని నిస్స్వార్థత పరిపూర్ణమగు స్వార్థరాహిత్యమును పాటించుటకు వట్టి మేధః పరాక్రమము చాలదు. స్పందించు హృదయ ముండవలెను. విశ్వమానవప్రేమ యుండవలెను. స్వామిజీకి ఇది తలమునకలుగనుండెను. అదియే ఆయనను అమెరికా దేశమునకు పంపినది-దుర్భర దారిద్ర్యమున మూల్గుచున్న భారతీయ జనానీకము పరిస్థితిని మెరుగు చేయుటకై ధనమార్జించుటకు. ఆయనకు మతానుష్ఠానమనగా ఏడ్పు మొగముతో నుండుట కాదు, ఇతరులను చులకన చేయుట కాదు. 'సకలమానవజాతిపట్లను ప్రేమసహానుభూతి, అదియే మతానుష్ఠానలక్షణము.' అని యాయన పలికెను, ఈ లక్షణము మనకు కావలసినంత యున్నదని భ్రమింపకుందుముగాక. దీనినిగూర్చియే స్వామిజీ హెచ్చరించియున్నాడు. 'సర్వమానవులును సోదరులు అను నోటిమాటలు కాదు మానవజీవితముయొక్క ఏకత్వమును అనుభవింపవలెను. అంతయు అనుకూలముగ నున్నప్పుడు సోదరు డనుటకు ఎల్లరును సంసిద్ధులే. కాని వారి స్వార్థమునకు ఏకొంచెపులోపము కలిగినను ఇక కబర్దార్! ఇది మానవతను ప్రేమించుట కాదు. స్వార్థమే సానుభూతి ముసుగు వేసికొనియున్నది. బహుజనహితమునకై ప్రతివ్యక్తియు ఆత్మబలిదానము నొసగగల, ప్రతియొక్క వ్యక్తియు సంఘశ్రేయముకై ఏకైక లక్ష్యముతో పాటుపడుచున్న, సమాజము ఏ దేశమునగాని ఏర్పడలేదు. అందు సందేహము లేదు. అట్టిది ఏ కొంచము మానవులలో సాధింపగలరు. భగవంతుడు ఎన్నుకొనిన అట్టివారు తమను చరితార్థులుగ భావించుకొనవలెనే కాని అందు గర్వమునకు తావులేదు. 'ప్రకృతిచేతనే అందరును సహాయమును పొందుచున్నారు. మనము లక్షలమందిమి లేకపోయినను పొందుదురు ఇతరులకు సాయము చేయగలుగుట యొక విశిష్టమగు అవకాశము. దానివలన మనము ధన్యులమగుదుము. కనుక ప్రపంచమున కేదియో చేయుచున్నామనెడి భావమును మీ మనస్సునుండి తరిమి వేయుడు. మీనుండి ప్రపంచమున కేసహాయమును అక్కరలేదు, ఎవడైనను తాను ప్రపంచమునకు సహాయము చేయుటకు జన్మించితి ననుకొనినచో అట్టి వట్టి గర్వము స్వార్థపరతమాత్రమే, సానుభూతి వేషము వేసికొనినవి.' ఆయన స్వయముగా జీవితాంతమును వినయశీలి.

ఆయన జీవితమున నొకసంఘటన. స్వామిజీ మఠావరణమున శ్రమించుచున్న కొందరు సంతాలు కూలీలతో భాషించువాడు. వారి కష్టములు వినగా స్వామి కనులవెంట నీరు కారెడిది. కూలీలు తమ కథనమునాపి స్వామిని పొండని ప్రార్థింతురు. వారినే ఒకనాడు మృష్టాన్న తృప్తులనుగ చేసి స్వామి వారియందు సాక్షాత్ నారాయణునే దర్శించెను.

## సంకల్పశుద్ధి దృఢవిశ్వాసము

మానవసౌభాగ్యమునకై పరిశ్రమింపగలుగు ప్రేరణశక్తి వైరాగ్యమువలననే జనించును.

కేవలము బాహ్యవైరాగ్యమువలననే గాక అంతరవైరాగ్యమువలన. ఆ పరిశ్రమ ప్రారంభమునగాని మధ్యగాని అంతమునగాని ఎట్టి స్వార్థమును ఉండరాదు. అదియే సంకల్పశుద్ధి. గమ్యమునకు సరియగు మార్గము నెన్నుకొంటిమను దృఢవిశ్వాసమున్నగాని సంకల్పశుద్ధి ఏర్పడదు. ఏమార్గమున విజయము పొందవలెనన్నను ఇవి రెండును పునాదులవలె ఆవశ్యకములే. 'మానవాతీతమగు జ్ఞానము పొందితిమను నటకులకు దూరముగ నుండు'డని స్వామి హెచ్చరించెను. ఆధ్యాత్మిక జీవితమున కిదియే గొప్ప ఆటంకము. ఫలితములు మనకు అతిత్వరలో కావలెను. అప్రయత్నముగ కావలెను. ఇది సాధ్యమా? కాదు. అయినను మానవులు సిద్ధులకై పరువులిడును. కాని నిజముగా శ్రద్ధావంతులైనవారికి ఎందరో మహానుభావులు అభయదానముచేసిరి. స్వామిజీ కూడ వారివలెనే అనుచున్నాడు, 'సత్యము పవిత్రత నిస్స్వార్థత–ఇవియున్నచో అతనిని అణచగలశక్తి ఈలోకమునగాని లోకాంతరమునగాని లేదు.' దీనికి ఆయన జీవితమే నిదర్శనముకదా!

## బ్రహ్మచర్యము

'మనోవాక్కాయములందును సర్వకాల సర్వావస్థలయందును పాటించునదే బ్రహ్మచర్యము.' అని స్వామిజీయనెను. బ్రహ్మచర్యపు విలువను తెలుపుటకు స్వామిజీకంటె తగినవక్త దొరకదు. ఆయన మూర్తీభవించిన పవిత్రత, శ్రీరామకృష్ణుడు ఆయన ఉజ్జ్వలమగు అగ్ని యనెను. 'మాయ నరేంద్రునకు పదియడుగుల దూరమున నిలిచిపోయినది. తనవలలో అతనిని చిక్కించుకొనలేకపోయినది.' అనెను. అట్టిస్వామిజీ బ్రహ్మచర్యము నిట్లు ప్రస్తుతించెను. 'పవిత్రుడైన మానవుడు మాత్రమే ఓజశ్శక్తిని మెదడునకుకొనిపోయినిలువయుంచుకొనగలడు. కనుకనే అదిసర్వోన్నత సుగుణముగ నెన్నబడినది.' 'బ్రహ్మచర్యము లేక ఆధ్యాత్మిక బలము లేదు. మానవజాతికి బ్రహ్మచర్యము అద్భుతమగు నియమనశక్తి నిచ్చును. ఆధ్యాత్మిక నేతలందరును బ్రహ్మచర్యము నవలంబించినవారే. అదియే వారికి శక్తి నిచ్చినది.' 'బ్రహ్మచర్యమును పాటించుటవలననే శ్రద్ధావిశ్వాసములు కలుగును. దానివలన సమస్త పాండిత్యమును అల్పకాలముననే వశము చేసికొనవచ్చును. ఏకసంథాగ్రాహియగును. ఈ బ్రహ్మచర్యము లేకపోవుటయే మన వినాశమునకు కారణము.' ఈ విధముగ స్వామి యనేక పర్యాయములు నుడివెను. ఆజీవితమంతయు అట్టి బ్రహ్మచర్యమునకు వివరణయేకదా!

శ్రీవివేకానందుని జీవితము నొకసారి చదివినను మనము పేర్కొనిన గుణములనేకాక దైవభక్తి ఆత్మవిశ్వాసము మొదలగు ఆయన బోధలకు గూడ ఆయన జీవద్భాష్యమని తెలియవగును. అట్టిమహాపురుషుని తగినవిధముగ గౌరవించుట మనకు సాధ్యమా? ఆయన అడుగుజాడలలో నడువ ప్రయత్నించుటద్వారా ఆయనకు ప్రీతికలిగింతముగాక.



# మాతృదేవిచరణసన్నిధి

ఆంగ్ల గ్రంథము:
ఎట్ ది హోలీమదర్స్ ఫీట్

అనువాదము:
పి. గణపతిశాస్త్రి

"అనేక జన్మలలో ఏ ఒక్కరు ఎల్లప్పుడు దుఃఖితులు కాజాలరు. తాము చేసిన కర్మఫలితాలే తాను అనుభవిస్తూటారు. అంతా కార్యకారణాలశృంఖలతో ముడిపడిఉన్నది. అంతే."

"అయితే అంతా కర్మల ఫలితమేనా?" అడిగాను.

"కాక మరేమిటి నాయనా?"

"అయితే అమ్మా, మానవుల దుష్టసత్కర్మల మూలకారణ మెచ్చట ఉన్నది? 'పూర్వజన్మలోనే' అని మీ రనవచ్చును. అయితే ఆ పూర్వ పూర్వజన్మలతోబాటు ఈ కర్మజాలాన్నింటికీ మూలకారణ మెచ్చట ఉన్నది?" అని తిరిగి నేను నా జిజ్ఞాస వెల్లడించుకున్నాను. దాని మీద అమ్మ అనుగ్రహించారు.

"ఒక్క పచ్చగడ్డి పోచకూడా ఆ భగవానుని ఆజ్ఞ లేనిదే చలించదు నాయనా. ఒక వ్యక్తికి మంచి సమయం వచ్చినప్పుడు అతని ఆలోచన ప్రార్థనవైపు తిరుగుతుంది. చెడుకాలం దాపురించినపుడు అంతా చెడుగే. అది అంతా ఆ భగవానుని సంకల్పానుసారంగానే సాగిపోతూంటూంది. ఆ భగవంతుడు తన సాధనాల ద్వారానే తన కృత్యాలన్నీ నిర్వహించుకుంటాడు. నరేన్‌కి (వివేకానంద) స్వతః అంతటి మహనీయశక్తు లేమున్నాయి? భగవంతుడు అతనిద్వారా కొన్ని ఘనకార్యాలు నిర్వర్తించ దలుచుకున్నాడు. కనకనే నరేన్ అంతటివాడయినాడు. అంతే. ఆ భగవానునికి తన కర్తవ్యాలేమో విస్పష్టంగా తెలుసును. అయితే ఎవరయినా ఆత్మార్పణం కావించుకున్నంతలోనే ఆ స్వామి అతనికన్నీ స్వయంగా తానే సమకూరుస్తాడు. ప్రతివ్యక్తి ప్రతీది ఓరిమితో సహించాలి, అన్నీ ఆయా కర్మల ఫలితాలే కనక తాను పూర్వం చేసిన దుష్కర్మఫలితం ఈ పుట్టుకలో సత్కర్మల ఫలితం తుదముట్టిస్తున్నది."

"ఈ నాటి కర్మఫలిగం పూర్వజన్మల కర్మ పరిణామం తుదముట్టించగలదా అమ్మా?" నేను మళ్లీ అడిగాను.

"ఎందుకు తుదముట్టించదు? నీవు ఒక మంచి పని చేస్తే అది గతజన్మలో నీ దుష్కర్మల ఫలితం రూపుమాపివేస్తుంది. ఎవరయినా ఆ భగవంతుని నామం జపించి ప్రార్థించి మనసారా ధ్యానించినఎడల పాపకృత్యాల ఫలితాలన్నీ పటాపంచలవుతాయి."

ఉద్బోధన కార్యాలయము: ప్రార్థన మందిరము: ఆనాటి ప్రొద్దుటివేళ అమ్మ నేను ప్రసంగించుకుంటున్నాము. ఆ సందర్భంలో మాతృదేవి అన్నారు.

"ఠాకూరు నన్ను విడనాడి వెళ్లిపోయిన తరవాత నేను కామార్పుకూరులో ఒంటరిగా నివసించేదాన్ని. ఆ సమయంలో 'నాకొక్క కుమారుడయినా లేడే! ఇంకేవీ లేదే! ఇక బ్రతికిఉండటే మాత్రం ప్రయోజనమేమిటి?' అని భావించేదాన్ని. ఆపైన ఠాకూరు ఒకనాడు నా సమక్షంలో సాక్షాత్కరించి ఓదార్చారు.

'ఎందుకలాగ మథనపడుతున్నావు? ఒక్క కొడుకయినా లేడే! అనుకుంటున్నావు. ఇదిగో నీకు రత్నాలనంటి కుమారుల నిచ్చాను. నిన్ను అసంఖ్యాకులు ఎల్లప్పుడు అమ్మా! అమ్మా! అని పిలిచేసమయం రాబోతున్నది.'

"నేను బృందావనానికి వెళ్లుతున్న సమయంలో ఠాకూరు నేను కూర్చున్న రైలుపెట్టె కిటికీలోనుంచి కనపడి 'నీదగ్గిరఉన్న నాఇష్టకవచం బహు

భద్రం సుమా! అది ఎక్కడున్నా పోగొట్టుకుంటావేమో! జాగ్రత్త!' అని హెచ్చరించారు.''

''ఆయన ఇష్టకవచం నేనప్పుడు ధరిస్తూ అర్చించేదాన్ని. ఆ తరవాత నేనది బేలూరు మఠానికి ఇచ్చివేశాను. ఇప్పుడు దాని కక్కడ పూజ జరుగుతున్నది.''

''ఈ ఏడాది ఠాకూరు జన్మదినోత్సవం సందర్భంలో అది పోయిందమ్మా. పూలతోను బిల్వదళాలతోను కలిపి ఆ కవచం గంగానదిలో పడవేశారు. రాముబాబు కుమారుడు బుసి ఏటి ఆటు పోటుల సమయం లో అక్కడ అడుకుంటూంటే ఆ కవచం మళ్లీ కనిపించింది. ఆ విధంగా తిరిగి దానిని మఠంలో చేర్చడం జరిగింది.'' అని దాని ఇటీవలి కథ చెప్పాను నేను.

''అది ఠాకూరు స్వంత కవచం. దాన్ని కంటికి రెప్పలా కాపాడుకోవాలి'' అన్నారామె.

ఆ తరవాత బేలూరు మఠాన్ని గురించి కొనసాగిన మా సంభాషణ సందర్భంలో అమ్మ అన్నారు.

''గంగ అవతలి ప్రదేశంలో ఒక ఇల్లున్నట్టు, దానిలో ఠాకూరు నివసిస్తున్నట్టు నా కెల్లప్పుడు అనిపిస్తూండేది. ఇప్పుడు అక్కడ బేలూరు మఠము దాని పరిసరంలోఒక అరటితోట ఉన్నాయి. మఠనిర్మాణం ప్రారంభం కాకమునుపు మొట్టమొదట అక్కడ భూమి కొనడం జరిగింది. ఆ తరవాత నరేన్ నన్ను ఒకనాడు అక్కడికి తీసుకువెళ్లి ఆ పరిసరాలన్నీ చూపించి 'అమ్మా, ఇది మీ సొంతభూమి. మీ రింక హాయిగా ఇష్టం వచ్చినట్టు ఎంతో ఆప్యాయంగా ఇక్కడ సంచరించవచ్చును.' అన్నాడు.

''నేనొకమారు బోధగయ మఠం సందర్శించాను. అక్కడ సన్యాసులందరికి సమస్త సౌకర్యాలు అమరిఉన్నాయి. ఎక్కడా ఏ విధమైన లోటూ కనబడ లేదు. నేనప్పుడెంతో దుఃఖించి ఠాకూరు నుద్దేశించి 'ప్రభూ! నా సంతానానికి ఎక్కడా నిలువచే తావుగాని తిన తిండి గాని లేవు. నా బిడ్డలు ఇంటింటికి వెళ్లి బిచ్చమెత్తుకుంటున్నారు. వారందరికీ ఇటువంటి మఠాలుంటే ఎంత బాగుంటుంది!' అని ప్రార్థించాను. చిట్టచివరకి ఠాకూరు సంకల్పంవల్లనే బేలూర్‌లో మఠనిర్మాణం జరిగింది.

''నరేన్ ఒకసారి నా దగ్గిరికివచ్చి 'అమ్మా, మఠానికి మరికొంత భూమి కావాలన్న ప్రార్థనతో 108 బిల్వదళాలు ఠాకూరు సన్నిధిని సమర్పించాను. కర్మ ఫలించక తీరదు గదా! ఎప్పుడో ఒకనాడు మఠానికా భూమి లభించి తీరుతుంది.' అన్నాడు.''

మధ్యాహ్న భోజనం ముగించినపిమ్మట నేనొకనాడు తాంబూలంకోసం ఉపక్రమించిన కార్యాలయం పైఅంతస్తుమీదికి వెళ్లాను. ఆ సందర్భంలో అమ్మ అన్నారు. ''నరేన్ ఒకనాడు నాదగ్గిరికివచ్చి 'అమ్మా, ఇటీవల ప్రపంచంలో ప్రతిది శూన్యంలోకి ఎగసి పోతున్నట్టు అనిపిస్తున్నది' అన్నాడు. నేనతని నవ్వి 'నాయనా! అయితే నన్నుకూడా శూన్యంలోనికి ఎగరగొట్టి వెయ్యకు సుమా!' అన్నాను. దానిమీద నరేన్ 'అమ్మా, మిమ్మల్ని శూన్యంలోకి లీనం చేస్తే ఇక నేనెక్కడ నిలబడగలను? నా కాధారమేది? గురుపాదపద్మాలే శూన్యాలన్న జ్ఞానం కేవలము అజ్ఞానమే, గురుదేవుని పాదపద్మాలే లేవన్న జ్ఞానానికి, నిలబడడానికి నెలవేదిఉన్నది?' అన్నాడు.

అదలా వివరించిన పిమ్మట అమ్మ ఇలాగన్నారు. అయితే యథార్థ సంపూర్ణ జ్ఞానోదయం జరిగిన పిమ్మట మరి భగవానుని ఉనికి వేరుగా స్ఫురించదు. సత్యజగన్మాతృ స్వరూపం మాత్రమే అప్పుడు గోచరిస్తుంది. చిట్టచివరికి ఆ తల్లి సృష్టిలో సర్వత్ర సాక్షాత్కరిస్తుంది. అప్పుడిక అంతా ఒకటే! అంతే!'' (సశేషము)

# సౌఖ్యము

## చిర్రావూరు వెంకట్రావు

సుఖమును కోరుట మానవస్వభావము. సుఖమెట్లు కలుగును? లభించిన సుఖమెట్లు వృద్ధిపొందును? దుఃఖము పోవుటకు మార్గమేమి? అను విచారణ చేయుటలోనే మానవునిజీవితము ముగియుచున్నది. మానవుడే సత్కార్యమును ప్రారంభించినను, యేదేవునిపూజింపతలచినను, ధర్మార్థకామమోక్షములను చతుర్విధ పురుషార్థఫలప్రాప్తి కలుగవలయుననియే సంకల్పము చేయుచున్నాడు. అట్టియే కాని సుఖదుఃఖముల తారతమ్యమును గుర్తింపగలేక పోవుచున్నాడు. ఈ విషయమై శాస్త్రములు, పురాణములు కూడ సరియైనమార్గమును తెలుపుటలేదు. ఇష్టమైనదే సుఖమనియు, ద్వేషమైనదే దుఃఖమనియు నిర్ణయించుచున్నవి. కాని ఇష్టమైనవన్నియు సుఖమిచ్చునని చెప్పుటకు వీలులేని పరిస్థితులనేకములు జీవితములో కనబడుచున్నవి. దప్పికగలవానికి నీరిష్టముగా నుండును. నీటివల్ల దాహశాంతి కలిగి సుఖమిచ్చినను జలమును సుఖమని చెప్పుట యుక్తముకాదు. ఏటిలో మునిగినవానిని సుఖములో మునిగినాడని చెప్పగలమా? విద్యుచ్ఛక్తి మనకెన్నివిధములుగానో సహాయపడుచున్నది. సుఖము నిచ్చుచున్నది. దానిని కూడ మనకిష్టమైనదానినిగానే చెప్పవచ్చును. అయినను కొన్నిసమయములందు ప్రాణాపాయముగూడ చేయుచున్నది. కాబట్టి ఇష్టమైనవన్నియు సుఖములు కావని చెప్పవచ్చును. అలాంటప్పుడు సుఖమనున దేది? కొంతమంది శాస్త్రకారులు దుఃఖనివారణమే సుఖమని చెప్పుచున్నారు. అప్పుడు సుఖము దుఃఖమను రెండు వేదనలు లేవనియు, ఒకటి లేకపోవుటయే, వేరొకదాని స్వరూపమనియు తేలుచున్నది. ఆకలిబాధను భోజనముతోను, దాహబాధను జలపానముతోను, రోగబాధ నౌషధముతోను నివర్తింపజేసికొనుటయే సుఖమగుచున్నది.

ఈవిషయమునే వేదాంతశాస్త్రములుగూడ నిర్ధారణ చేయుచున్నవి. మనుజునకు సంభవించు సర్వదుఃఖములకు తృష్ణ లేక కోరిక మూలమనియు, కోరినదానిని సాధించుటలోగాని లేక సంప్రాప్తించక పోవుటవలనగాని దుఃఖము ప్రాప్తించుననియు. దానిని నివారించుటయే సుఖమనియు చెప్పుచున్నవి. దీనినిబట్టి సకలదుఃఖములకు వెనుక తృష్ణయుండి తీరవలెనని తేలుచున్నది. విచారణచేసి చూచిన నీ విషయముకూడ నిజమని తోచదు. నిత్యము భోజనము చేయుటవలన సుఖము కలుగుచున్నది. ఆ భోజనము చేయుటకుముందు తృష్ణామూలకమగు దుఃఖము లేదు. ఒక బాలునకు కలకండముక్క నిచ్చిన మిక్కిలి సంతోషించును. ఆ సంతోషమునకు ముందు పటికబెల్లమును తినవలెనను కోరికగాని, దానివలన గలుగు దుఃఖముగాని లేదు. హఠాత్తుగా వానికి సంతోషము కలిగినది. కాబట్టి సుఖమునకు, సంతోషమునకు తృష్ణామూలకమైన దుఃఖనివారణమే ప్రధానమగుటకు వీలులేదు. సుఖదుఃఖములు కావడికుండలవలె రెండునియు సంసారచక్రమున పైకి క్రిందికి తిరుగుచు నొకదానివెనుక నొకటి వచ్చుచు పోవుచుండుననియు, సుఖదుఃఖములలో నొకదాని ననుభవించననే వేరొకదాని యనుభవము తెలియదనియు, లోకానుభవము కలవారు చెప్పుచున్నారు.

కాని కొన్నిసుఖములు దుఃఖానుభవములేకయే వచ్చుటను జూచుచున్నాము. కాబట్టి తృష్ణ, లేక కోరిక యనుదానిని విడుచుటవలన లాభము లేదు. అంతమాత్రమున సుఖము రానేరదు.

తృష్ణలేని మానవుడు సుఖసాధనకై ప్రయత్నము చేయుట సంభవింపదు. ప్రయత్నహీనుడు ఫలితమును సాధించుటకు సమర్థుడుకాడు. బాహ్యావస్తువులకు నింద్రియములకు తగిన సంయోగమును గలిగించుకొని మనుజుడు తాత్కాలిక సుఖ మనుభవించుచున్నాడు. బాహ్యావస్తువులు స్థిరములు కాకపోవుటచే వానివియోగమువలన దుఃఖించుచున్నాడు. ఒక్కొక్కప్పుడు బాహ్యావస్తువులతో జ్ఞానేంద్రియ కర్మేంద్రియములకు సంబంధము కలిగియున్నను, మనస్సు సహాయము చేయనప్పుడు తాత్కాలిక సుఖమునుకూడ పొందలేక పోవుచున్నాడు. ఇందువలన సుఖానుభవము పొందుటకు మనస్సు ప్రధానమైనదని చెప్పవచ్చును. ఆ మనస్సు చంచలమైనది. దానిని స్వాధీనపర్చుకొనుటకు నిత్యనైమిత్తిక కామ్యకర్మలను చేయుమని వేదములు చెప్పుచున్నవి. ఆ కర్మలు పూర్వజన్మ పాపములను హరించి జ్ఞానమార్గమునకు దోహదము చేసినను కర్మఫలముల ననుభవించుటకు మరల మరల పుట్టుట దుఃఖము లనుభవించుట సుఖమునకై దేవులాడుట కలుగుచునే యున్నది. కావున విధాయకమైన కర్మలు చేయుటవలన కలిగిన జ్ఞానసహాయముతో మనస్సును నిగ్రహించి ఫలాపేక్షలేక కర్మలను చేయుటయే మానవుని కర్తవ్యము. అనగా తానుచేయు కర్మలకు తగిన ఫలము కావలెనను కోరికను వీడవలయును. అంతేకాని కర్మచేయవలెనను కోరిక, లేక తృష్ణను మాత్రము వదలకూడదు. అందువలన మనస్సు శుద్ధమగును. సుఖము కలిగినను దుఃఖము కలిగినను లెక్కచేయక తత్ఫలితములను సమానముగా ననుభవించుశక్తి కలుగును. తరుగని సౌఖ్యములకై యింకను ప్రయత్నములు సాగించును. తద్వారా బాహ్యప్రపంచములో సుఖములేదని గుర్తించి ఆత్మస్వరూపమును గుర్తించుటకు ప్రారంభించును. ఆత్మజ్ఞానము కలిగినవెంటనే బాహ్యప్రపంచములో ప్రతివస్తువునందును తన యాత్మయే కలదని గుర్తించును. ఆ యాత్మదర్శనమే సత్యము నిత్యము బ్రహ్మానందమనియు, తరుగని సౌఖ్యములనిచ్చు పరమాత్మయనియు తెలుసుకొను జ్ఞానమును కలుగజేయుచున్నది. వెంటనే తా నా బ్రహ్మామందు లీనమై శాశ్వతమైన సుఖానందము లనుభవించి సర్వులను సుఖింపజేసి లోకకల్యాణమొనరించు శక్తికలవాడగును—

ఓమ్ తత్ సత్

# లోకో భిన్నరుచిః

## పేరూరి పురంజయుడు

'పొడుగు' గంట కొట్టేశారు. పిల్లలందరూ పొలోమంటూ ఇళ్లకు పరుగెత్తుతున్నారు. కొందరు బంతులెగరేస్తూ మైదానంలోకి పరుగులు పెడుతున్నారు. కొందరు హాబీరూములో గంభీర భావంతో విశ్వామిత్ర సృష్టి చేయడానికి ఏకాగ్రచిత్తులై తరలిపోతున్నారు. ఈ చిన్నారుల కోరికలలో ఎంత వైవిధ్యం అనుకుంటూ నిలబడ్డాను. ఒంటరి ఇంటికి పోదామా వద్దా అన్నం తలో మరొక చిన్నారి, ఇవాళ నాటకం రిహార్సలు సార్. చూద్దురుగాని రండి సార్ అంటూ పిలుచుకుపోయాడు.

వాళ్ల నాటకశాలలో ప్రవేశించి బాలసట

కులకు ఇబ్బంది కలగకుండా వెనకగా కూర్చున్నాను. మంచినాటకమే. నచికేతుడి కథ. యముడి ఇంటి అరుగుపైన నచికేతుడు మూడు రోజులు పస్తుండవలసి వచ్చింది, తిరిగివచ్చిన యముడు నొచ్చుకని ఎంత అపరాధం జరిగిపోయింది అని విచారించి, ఆ మూడు రోజులకుగాను మూడు వరాలిస్తాను కోరుకొమ్మంటాడు. నచికేతుడు వరాలు కోరుతున్నాడు.

మూడవ వరం. పాలుగారే బుగ్గలతో ఈ అభినవ నచికేతుడు అడుగుతున్నాడు ''అయ్యా, మనిషి చనిపోయాక అతడు ఉన్నాడని కొందరంటారు. లేడని మరికొందరంటారు. దీని సంగతేమిటో మీవలన తెలుసుకోవాలని ఉన్నది. ఇది నా మూడో వరం.''

ఒళ్లంతా పులకించిపోయింది. నాటకంలోనే అన్నా, అన్నవాడికో విన్నవాళ్లకో ఒకరికైనా జిజ్ఞాస కలుగకమానదు. ఎన్నెన్ని ఘనకార్యాలు చేసినా ఎలాంటి నీచకృత్యాలు చేసినా జీవితంలో చావు తప్పదు. చనిపోయాక ఉంటామో ఉండమో నిర్ధారణగా తెలిస్తే ఈ జీవితం ఇలాగే గడుపుతామా? ఏ విద్య అయినా ఎవరోఒకరు చెప్పగలరు కాని చావు తరువాత ఏమున్నదో మృత్యుదేవత తప్ప ఇంకెవరు చెప్పగలరు? అందుకే నచికేతుడు అడుగుతున్నాడు.

యేయం ప్రేతే విచికిత్సామనుష్యే
ఽస్తీత్యేకే నాయమస్తీతి చైకే।
ఏతద్విద్యామనుశిష్టస్త్వయాఽహం
వరాణామేష వరస్తృతీయః॥

దేవుళ్లను ప్రార్థించేటప్పుడు ఆ కోరిక కోరు ఈ కోరిక కోరు అని వాళ్ల నాయన నచికేతుడికి నేర్పలేదు గాబట్టె సరిపోయింది. తన కోరిక తానే నిర్ణయించుకున్నాడు. లేకపోతే మంచి మార్కులు రావాలనో పేసయితే చాలనో అడగడూ? యముడు నీకు వజ్రవైడూర్యాలిస్తాను, భూప్రపంచానికంతటికీ రాజును చేస్తాను. దేవతలు అనుభవించే సౌఖ్యాలన్నీ నీవు అనుభవించు నీకు ఇష్టంవచ్చినంతకాలం జీవించు అని ఎంత ఆశ పెట్టినా లొంగక 'భూమిపైన నివసిస్తూ ఉన్నా, ఉన్నత విలువలు తెలిసిన ఎవడు దీర్ఘజీవనంతో తృప్తిపడి భోగభాగ్యాలలో సారమేమీ లేదని తెలిసీ వాటిలో ఆనందాన్ని అనుభవించగలడు? దేవతలకుకూడా అర్థంగాని ఆ విషయం తప్ప తెలుసుకోదగినది మరొకటేదీ లేదు. నచికేతుడు ఇంకొకవరం అడగబోడు' అని ఘంటా మోగించి చెప్పాడు యముడికి. నచికేతుడి కోరిక అది.

చిన్నప్పటినుండీ అర్థమవుతూఉన్న వేదఘోషలమధ్య పెరిగాడు కాబట్టీ పూర్వసుకృతంవల్లనూ తండ్రిగారి 'ఆశీర్వాద' బలంవల్లనూ యముడిని ముఖాముఖీగా చూడగలిగాడు కాబట్టీ వివేచనాపరుడు కాబట్టీ నచికేతుడు అలాంటి వరం కోరుకున్నాడు. అందరూ అలాగే అడగగలరా?

కృష్ణబలరాములు మధురానగరికి వెళ్లినపుడు అక్కడ ఒక నేతగాడు మెత్తమెత్తటి వస్త్రాలు రంగురంగుల వస్త్రాలు ఎన్నో ఆభరణాలు తెచ్చి నివేదనం చేశాడట చాలా సంతోషంతో. ఈ నేతగాడు ఏ కోరికా కోరకపోయినా శ్రీకృష్ణుడు '....వాయకుని శుశ్రూషన్ మహాప్రీతుడై సారూప్యంబును లక్ష్మియున్నొసగె నైశ్వర్యాది సంధాయియై.' బహుశా అతడి మనసులోని కోరిక శ్రీకృష్ణుడికి తెలిసే వుంటుంది.

ఆ తరువాత సుదాముడనే మాలాకారుడి ఇంటికి వెళ్లారు కృష్ణబలరాములు. వాడు భయభక్తులతో అర్ఘ్యపాద్యాదులన్నీ ఇచ్చి పూజచేసి ఘనసురభిదామములు తెచ్చిఇచ్చాడు. ఆ పూలమాలలకు సంతోషపడి శ్రీకృష్ణుడు నీకేంవరం కావాలోకోరుకో ఇస్తాను అంటాడు. దానికివాడు

నీ పాద కమల సేవయు
నీ పాదార్చకులతోడి నెయ్యమును నితాం
తాపార భూతదయయును
దాపసమందార నాకు దయసేయగదే!

అని మాత్రం కోరుకుంటాడు. దండలు చేసి అమ్ముకునేవాడికి ఎంత విచక్షణాజ్ఞానం ఉన్నది! నిజమైన చదువంటె అదీ. ఏది శాశ్వతమో ఏది అశాశ్వతమో చట్టున తెలుసుకొనే జ్ఞానం.

అక్కణ్ణించి బయలుదేరిపోతూ ఉంటే దార్లో వాళ్లకు కుబ్జ ఎదురైంది. ఆమెకు ఒళ్లు మూడు వంకరలు. కంసుడి దాసి. శ్రీకృష్ణుడు మురిపించి అడగగా ఆయన అందానికి మురిసిపోతూ తనకు అందం లేదని కించపడుతూ

"....యా కుమారుల
తనువులు నగవులును వీక్షితమ్ములు మాటల్
దన చిత్తము గరగించిన
ననులేపనములిచ్చె వారి కబల ప్రియము తోన్."

అవన్నీ సింగారించుకుని శ్రీకృష్ణుడు దయతో ఆమె అడగకుండానే భువనమోహనమైన అందాన్ని ప్రసాదించాడు. కానీ ఆమె కోరేవరం!

వేంచేయుము నా యింటికి
పంచశరాకార యనుచు పై[illegible]ంగాక
ర్షించి హరిఁ దిగిచెగామిని
పంచాశుగ బాణజాల భగ్నహృదయయై.

దాసి కాబట్టి ఎలాంటి మంచి సంస్కారమూ ఒంటబట్టలేదు కాబట్టి ఆమె శరీర సౌఖ్యాన్ని మాత్రమే కోరగలిగింది. అయినా మనసులో ప్రేమ అనే మధురభావం ఉండి అర్ద్రం చేయకుంవలన ఏదో ఒక రూపంలో భగవంతుడైన కృష్ణుడి అనుగ్రహం పొందగలిగింది కదా.

ప్రేమ నిండుగా ఉంటే ఏ కోరికలూ కోరరు. అంతకుముందు శ్రీకృష్ణుడు తన గొల్ల పరివారంతో ఒకసారి అడవిలోకి చాలాదూరం వెళ్లిపోయాడు. అందరికీ ఆకలేసింది. శ్రీకృష్ణుడన్నాడుగదా, అదుగో అక్కడ బ్రాహ్మలంతా యజ్ఞం చేస్తున్నారు. అక్కడికిపోయి మా పేరు చెప్పి అడగండి అన్నం పెడతారు అని. ఈ పిల్లలందరూ పోయి ఆ బ్రాహ్మల్ని మంచిమాటలు చెప్పి అడిగితే వేదవేదాంగాలు అన్నీ అధ్యయనం చేసిన ఆ మందమతులు అన్నం లేదు పొమ్మన్నారట. శ్రీకృష్ణుడు మళ్లీ పంపగా గొల్లలు ఈసారి ఆ మునుల భార్యల దగ్గరికి పోయి అడుగుతారట. వెంటనే వాళ్లు రామకృష్ణులను చూడాలని ఉత్సాహపడుతూ షడ్రసోపేతాలైన భోజనాలను కుండలలో నింపుకుని సముద్రంలో చేరడానికి పరుగులుతీసే నదులలాగ బయలుదేరారట, ఎంతయినా అమ్మలు గదా. బిడ్డలు కడుపార తినాలనితప్ప వేరేకోరిక వాళ్లకేముంటుంది?

బిడ్డలు మగలును భ్రాతలు
నడ్డముచని వలదనంగ నటుదలఁడని మా
జొడ్డుచు జగదీశ్వరునకు
జడ్డన నన్నంబు గొనుచు జనిరా సుదతుల్.

జగదీశ్వరుడికి అన్నం పెట్టాలన్నదే వారి ఒకే ఒక్క కోరిక. దానికి ఎవరి అడ్డమూ వారు సహించలేరు.

ఏ కాలంలోనయినా భగవంతుడిని గుర్తించగలిగేవాళ్లు కోరే కోరికలతీరే వేరు. శ్రీరామకృష్ణదేవుల జన్మస్థలమైన కామార్పుకూరులో శ్రీనివాస్ అనే అధమవర్ణుడు ఒకడు ఉండేవాడు. అధమవర్ణుడైతేనేమి భగవద్భక్తిలో అతనిదే అగ్రాసనమని చెప్పవచ్చు. గవ్వలతో గాజులు చేసి అవి అమ్మి పొట్టపోసుకునే కుటుంబం వాళ్లది. బహుశా అటువంటివాళ్లకే సహజస్ఫూర్తివల్ల భగవంతుడి నిజస్వరూపం కనిపిస్తుందేమో. ఈ శ్రీనివాసుడు ఒకసారి శ్రీరామకృష్ణులను, అప్పటి

కాయన తొమ్మిది పదేండ్ల బాలుడు, ఏకాంత ప్రదేశానికి తీసుకుపోయి ఆయనకు పూజచేశాడట! దేవుడికోసం చేసిన పూలమాలను శ్రీరామకృష్ణుల మెడలోనే వేశాడు! నైవేద్యంగా అంగడిలో కొన్ని తీపి పదార్థాలను తినిపిస్తూ ఆనందాశ్రువులు రాల్చాడు. ఈ దాసుడిని దయతో అనుగ్రహించాల్సిందని అతడు కోరినవరం!

అలాగే వాళ్లింట్లో ధని అనే కమ్మరివనిత చంద్రమణీదేవికి సహాయం చేస్తూఉండేది. ఈమె హస్తాలద్వారానే శ్రీరామకృష్ణుడు ఈలోకంలో పడ్డాడు. ఈమెకు కూడా శ్రీరామకృష్ణులపట్ల భగవంతుడిమీద ఉన్నంత ప్రేమ. ఆమె కోరిన వరం ఏమంటే ఉపనయనం నాడు తన చేతుల ద్వారా శ్రీరామకృష్ణుడు ప్రథమభిక్ష స్వీకరించాలని! శ్రీరామకృష్ణులది ఉత్తమ బ్రాహ్మణ వంశం. ఈమెది కమ్మరికులం. ఇంట్లోవాళ్లు ఒప్పుకుంటారా? అయినాసరే, ఆరోజు ఎంత గొడవ జరిగినా శ్రీరామకృష్ణులు తాను ఇచ్చినమాట నిలబెట్టుకుని ధని నుండే ప్రథమభిక్ష స్వీకరించారు. ఈశ్వరార్పణంచేసి బిచ్చంవేసినా పరమపదం వస్తుందట. ఇక సాక్షాత్తు భగవంతుడే భిక్ష స్వీకరిస్తే ఎలాంటిఫలమో!

పరమేశ్వరార్పణంబుగ
బరజనులకు భిక్షయిడిన బరమపదమునం
బరగెదరట తుది సాక్షా
త్పరమేశుడు భిక్షగొన్న ఫలమెట్టిదియో!

అని శ్రీకృష్ణుడికి అన్నంపెట్టిన మునిపత్నులనుగురించి శుకయోగీంద్రుడే అంటాడు మరి. ఫలితం సంగతి ఎలా ఉన్నా వాళ్లకుండిన కోరిక అంతా ఆయనకుఅన్నంపెట్టాలనిమాత్రమేకదా.

లక్షణంగా పొట్టగడుస్తూఉంటే ఈ భగవంతుడూ వరాలూ సరేగాని పూటగడవడమే కష్టంగాఉండేరోజులలో పొట్టకూటి వరాలుకాక వేరే కోరికలుంటాయా? ఏమో!

వివేకానందస్వామి తన ఇంట్లో అందరూ రోజు గడవడానికి నానా అవస్థలూ పడుతుంటే ఇక భరించలేక శ్రీరామకృష్ణుల దగ్గిరికివెళ్లి తన కష్టాలు తీర్చవలసిందని అడుగుతాడు. ఇలాంటి కోరికలు నేను కోరలేను నీవేపోయి కాళికాదేవిని అడుగు. నీవేది అడిగితే అది ఇస్తుంది అని పంపించారాయన. దేవి ప్రత్యక్షం కాగానే అంతా మరిచిపోయి జ్ఞానం భక్తి వైరాగ్యం మాత్రం కోరుకుంటాడు! ఇలా రెండుసార్లు జరిగాక మూడవసారి తానే తన కోరికలకు సిగ్గుపడి జ్ఞానం భక్తి వైరాగ్యం మాత్రం ఇవ్వు, ఇంకేమీ అక్కర్లేదని వేడుకుంటాడు.

దేవుడికే వదిలిపెట్టితే ప్రశస్తమైన వస్తువేదో ఆయనే అనుగ్రహిస్తాడుగదా. కాని అలా వదిలిపెట్టడం ఎవరికిసాధ్యం! శ్రీరామకృష్ణులు శ్యాంపుకూర్‌లో ఉండినపుడు కాళీపూజచేయాలని సంకల్పించారు. ఆయన ఆదేశంప్రకారం అన్ని సంభారాలూ ఏర్పాటయ్యాయి. కాని ఆయనమాత్రం కదలరు మెదలరు. ఉదాసీనంగా కూర్చున్నారు. ఇది చూస్తూ చూస్తూ అక్కడ చేరిన భక్తులంతా వింతపడుతూ ఉంటే గిరిశ్ చంద్రఘోషు ఆనందోద్రేకంతో ఆ పూజాపుష్పాలు తెచ్చి జై భవతారిణీదేవికీ జై అంటూ శ్రీరామకృష్ణుల పాదపద్మాల చెంత సమర్పించాడు. దానితో శరీరమంతా పులకించగా శ్రీరామకృష్ణులు గాఢసమాధిలో ప్రవేశించారు. కాళికాదేవియే ఆయనలో ఆవిర్భవించినట్లు దివ్య తేజస్సుతో ఆయన ముఖం వెలిగిపోతూ ఉండగా భువనమోహనమైన మందహాసం అందరినీ సమ్మోహితులను చేస్తూండగా ఆయన చేతులు రెండూ వరదాభయముద్రలను అప్రయత్నంగా ధరించాయి. దాంతో అక్కడ ఉండిన మహేంద్రనాథ్ రామచంద్ర దేవేంద్రనాథ్ మొదలైన భక్తులు పెద్దలూ పిన్నలూ అందరూ

గంధపుష్పాలతో ఆయన పాదకమలాలను పూజించారు. ఆ సమాధినుండి ఈ లోకానికి వచ్చిన మీదట శ్రీరామకృష్ణులు కాళీమాతకు ఉద్దేశించిన నైవేద్యాలన్నీ కొంచెంకొంచెం స్వీకరించి ఆ భక్తులందరికీ జ్ఞానమూ భక్తి వర్ధిల్లేటట్లు వరదానం చేశారు.

సరే, కృష్ణుడో రామకృష్ణుడో యముడో ఎవరో ఒక దేవుడే ప్రత్యక్షంగా కనిపిస్తే అలాంటి కోరికలు పుట్టాయనుకొందామా అంటే ఆ దేవుడు అర్చారూపంలో లెక్కలేని దేవాలయాలలో ఇంటింటా కూడా వేంచేసి ఉండె. అలాంటి సీతారామలక్ష్మణులను పూజించే చరితార్థుడైన త్యాగరాజస్వామి పేరు తెలియని ఆంధ్రుడెవడు? ఆయన ఏనాడూ భోగభాగ్యాలు కోరలేదుకదా! కాబట్టి దేవుడి అనుగ్రహంలో లోపమేమీ లేదు. కొడుకుపుట్టాలి మంచి కట్నంరావాలి లాటరీ గెలవాలి రోగాలుపోవాలి ఇలాంటి కోరికలు కోరేమనం ఎంత బుద్ధిహీనులం!

ఎందుకుసార్ నవ్వుతున్నారు? బాగా చెయ్యలేదా సార్ అని అడుగుతూ ఉన్నాడు 'నచికేతుడు.' రిహార్సలు ఎప్పుడో అయిపోయింది. అంతా సర్దేసి ఇంటికి పోతున్నారు. 'అయితే నీకు యముడు వరమిస్తానంటే నీ కోరిక ఏమిటి నాయనా?' అని అడిగాను లేస్తూ. 'నాకు డాక్టరు కావాలని ఉంది సార్.' మంచిదే. వీడు భవరోగ వైద్యుడే అవుతాడేమో. వివేకానందుడే చిన్నప్పుడు గుర్రబ్బండికి సారథి కావాలని కలలు కనేవాడు మరి.

# భక్త రామప్రసాద్

శ్రీ దయాత్మానందస్వామి

(గతసంచిక తరువాయి)

## జగజ్జననీ దర్శనము

ఇక రామప్రసాదుని హృదయము మాతృదర్శనమునకై తహతహలాడసాగెను. సదా పంచవటియందు పంచముండీ ఆసనస్థితుడై 'జననీ, కన్పింపవా, దర్శన మీయుమమ్మా'యని అతి దీనముగ ప్రార్థించుచుండెడివాడు. గానములతో, పూజా, జప ధ్యానములతో సమయ మెట్లు గడచుచుండెనో యాతడెరుగడయ్యెను. ఒకింత భోజనసమయము తప్ప ఆతడికి సమయమంతయు పంచవటియందే గడుపసాగెను. దినదినమాతని పరితాపము పెరుగుచుండ ఏకాదశి, అమావాస్య, పూర్ణిమ మరియు ఇతర విశేష పర్వదినములందిక ఇంటికిరాక పంచవటియందే సమయము సాధనలతో గడుపసాగెను. ఆతని మనోవిహంగ మిపుడు ప్రాపంచిక రాజ్యము నతిక్రందవిడచి ఉత్తుంగ ఆధ్యాత్మిక గగనమున విహరింపసాగెను. ఐనను మాతృదర్శనముకాదే! ఇక కర్తవ్యమేమి? గతి యేమి? దుఃఖ, నైరాశ్యములతో హృదయము నిండెను. ఈ జీవితము నందిక భగవద్దర్శనము కాదేమో? కాని ఆశాకిరణములచే అపుడపుడు మనస్సొకింత లాఘవమగుచుండెడిది. "రత్నాకర మెపుడు శూన్యము కాదుగదా ఒకింత ప్రయత్నముచే రత్నములు దొరకనిచో నిరాశుడవు కావలదు. ప్రసాదు తన మనస్సున కొకింత బోధించుచుండెడివాడు. ఓ మనసా హృది సముద్రమునందు 'మాతృ'

నామ ముచ్చరించి మునుగుము. రత్నాకర మెపుడును శూన్యము కాజాలదు. ఒకటి రెండు ప్రయత్నములతో రత్నములు దొరకనిచో మరెంత పూనికతో ప్రయత్నింపుము, 'జ్ఞాన' సముద్రమున 'శక్తి' యనెడు రత్నము కలదు. 'భక్తి' యున్నచో నీకది లభించును. కాని జాగ్రత్త! కామ, క్రోధాదులనెడు ఆరు శత్రువులు సదా ఆహారలోభముచే తిరుగుచున్నారు. కనుక వివేకమనెడి 'పసుపు' నలదుకొని దుముకుము. అపుడవి నీకడకు చేరవు. లెక్కలేని రత్నములు, మాణిక్యము లచట పడియున్నవి. ప్రయత్నించినచో ఆ రత్నములు నీకు దొరకునని ప్రసాదుడు చెప్పుచున్నాడు.''

వెంటనే ద్విగుణీకృతోత్సాహముతో సాధనమగ్నుడగును. అనవరత మిక భావపూర్ణ కవిత్వ మాతని హృదయమునుండి వెలువడసాగ దర్శనమిమ్మని జగజ్జననితో అతి దీనముగ వేడుకొనెడివాడు. అమ్మా, తారా,! ఎంతకాల మిట్లుండెదను? నాగతి ఏమగునిక? కాతర ప్రార్థనలతో ఇట్లు ఎన్ని అమావాస్యలు, ఎన్ని నిశీథములు గడచిపోయెను! కాని? ప్రసాదుని మనస్సు క్రోధముతో, అభిమానముతో నిండిపోయినది.

''జననీ, నేను భక్తిహీనుడను, భజనహీనుడను, క్రియాహీనుడను, దీనుడను. నీవో తరియింపగల 'తార'వు. ఎన్నిదినములిట్లిక భవసాగరమున ఉండగలను? చివరకు నాగతి యేమగును? కుపుత్రుడైనను, సుపుత్రుడైనను తల్లికి ఇరువురియెడ సమానదృష్టి, ఈ విషయము నీకు అవిదితమా? ఐనచో ఓ తారా! నన్ను తరింపచేయక యుపేక్షించుటెందుకు?'' కాని తల్లి హృదయము కరుగదే!

''అమ్మా! ఇక అమ్మా, అమ్మా యని నిన్ను పిలువను. నన్నెంత బాధించుచుంటివి. ఇంటింటికిపోయి బిచ్చమెత్తుకొని తిరుగుదును గాని అమ్మా' యనుచు నేనిక నీవద్దకు రాను. తల్లి జీవించియేయుండ పుత్రుని కింత దుఃఖము ఇదేమివిచిత్రమోగదా! జననియొక్క ఇదేమి రీతియో తల్లియే పుత్రునికి శత్రువయ్యెను. రాత్రిబగళ్ళు ప్రసాదుని భావన-జనని మరెన్నిసార్లు సంసార యమయాతనల నిచ్చునోగదా!

ఆ హృదయ విభేదక పరితాప మా జగజ్జననినే తపియింపజేయ ఇంకెంత సేపామె తాళగలదు? తన ప్రియపుత్రుని నయనానంతరాశముల నిక దాగుకొన నసమర్థ. జగజ్జనని ప్రసాదునికి తన దివ్యదర్శన మొసగెను. ఇక ప్రసాదుని ఆనందము వర్ణింప నెవరికి తరము! తన మనోభావముల నాతడిక ఎవరితో చెప్పగలడు? ఎవరాతని నర్థము చేసికొనగలరు! ఆనందముతో ఆతడు నాట్య మొనరింపసాగెను, గాన మొనరింపసాగెను. కన్నీరు కార్చసాగెను.

## మాతృమరణము : శవసాధన

ఒకసారిమాత్రమే దైవదర్శన మొందిన రామప్రసాదు మనస్సు దానితో తృప్తి నొందకపోయెను. సర్వభూతములయందు సర్వదా భగవంతుని గనుటే యాతని లక్ష్యము. తన లక్ష్యసిద్ధికై యాతడు మరింత పూనికతో సాధనలను జేయదొడగెను. ఈ కాలముననే తల్లి సిద్ధేశ్వరీదేవి చనిపోయెను. తండ్రి మరణానంతరము మిత్రమహాశయులు పంపించుచున్న ముప్పది రూప్యములు, కృష్ణచంద్రు డొసగిన పొలమునుండి రాబడితో నాతఁడు నిశ్చింతుడై సాధనలను చేయుచుండెడివాడు. తల్లి సిద్ధేశ్వరీదేవి కూడ కుమారుని ధర్మభావములను గని యాతనికిక సంసారబాధ్యతల నప్పగింప ననిచ్ఛుకయై తానే ఎట్లో వర్ధాప్యమునందును కుటుంబమును నిర్వహించుచుండెను. పొలములను సరిగా జూచువారు లేకుండుటచే ఆ రాబడికూడ చాల తక్కు-

వైయుండెను. తండ్రి మరణము ప్రసాదునకు తలపై పిడుగు బడినట్లయియుండ తల్లి మరణ మాతని మనస్సున విపరీత భావమును చూపటైను. ఇక సంసారమున తనకేమి బాధ్యతలు లేనట్లు అయ్యెను. తల్లి యున్నంతవరకు ఆమెను జూచుటకైనను ఇంటికి పోయెడువాడు. కాని ఇప్పుడిక సర్వబంధవిముక్తుడవోలె ఎప్పుడో కాని ఇంటికి పోవుచు మిగిలిన సమయమంతయు సిద్ధాసనముననే గడుపసాగెను. రామప్రసాదుని కుటుంబముకూడ ఇపుడు పెద్దదైనది. ఆతనికి రామదులాలు, రామమోహన్ అను ఇద్దరు పుత్రులు, పరమేశ్వరి, జగదీశ్వరి యను పుత్రికలు కల్గిరి. దినదినము ఆదాయము తగ్గిపోవుచుండ కుటుంబవ్యయము మాత్రము ఎక్కువగుచుండెను. కాని సర్వసహిష్ణు, సద్గుణయుక్త పతివ్రతయగు భార్య సర్వాణి పతి మనోభావమును గుర్తించి ఒకింతైనను దుఃఖముగాని విసుగుగాని ప్రదర్శింపక కుటుంబభారమును తానే వహింపసాగెను.

తంత్రశాస్త్రములందు శవసాధనకొక విశిష్ట స్థాన మీయబడినది. ఇందు సాధకుడు అమావాస్యనిశియందు శవముపై కూర్చొని జప, ధ్యానములు చేయుచు రాత్రి గడపవలయును. ఈ సాధనచే సాధకుని భయ, లజ్జాదులు దూరమగుటయేగాక, తీవ్ర వైరాగ్యాదులుకూడ లభించును. కాని సామాన్యులకీ సాధనచేయుట అసంభవమనియే చెప్పనగును. ఈ సాధన చేయునప్పుడు శవము ప్రాణవంతమయి సాధకుని నానా భయకర దృశ్యములతో భయపెట్టుచు, అతి మనోహర దృశ్యములతో మనస్సును చెదరగొట్టుచు వివిధరీతుల అతనిని తన లక్ష్యసిద్ధి నుండి చ్యుతిచేయుటకు తీవ్ర ప్రయత్నము చేయును. సాధకుని మనస్సపుడు దృఢముగ, నిర్భయముగ, ఏకాగ్రముగ, అత్యంత జాగరూకమైయుండనిచో ప్రాణాపాయముకూడ కలుగుట సంభవము.

రామప్రసాదు శాస్త్రానుసారముగ ఊరి ప్రక్కనగల శ్మశానమునందొక అమావాస్య నిశియందు ఈ శవసాధన మొనర్పసాగెను. ఆతడు రాత్రియంతయు తీవ్ర జప, ధ్యాన, ప్రార్థనలచే గడపెను. రాత్ర్యవసానకాలమున ఆతని భక్తికి మెచ్చి వరాభయకరా, ఆద్యాశక్తి మహామాయ తనయునంగు బిడ్డనికి తన దివ్యదర్శన మొసగెనను జనశ్రుతి కలదు.

ఈ సమయముననే ఆతని దేహమొక కమనీయమగు కాంతితో ప్రకాశించుచుండ చూచిన వారి హృదయములు భయగౌరవములతో నిండిపోయెనట. మఱియు భక్తి, నమ్రత, శిశుసులభవ్యవహారములు అన్ని హృదయముల నాకర్షించుచుండెడివి. ఆతనిని దర్శించి ధన్యులగుటకై చాలమంది దూర దూరములనుండి వచ్చుచుండెడివారు. రామప్రసాదుకూడ అందరిని ఆదరపూర్వకముగ సత్కరించి తన సంభాషణములతో, పాటలతో వారి హృదయములను భక్తి సంతోషములతో నింపుచుండెడివాడు. కాని సమయమంతయు భక్తులతో గడపుచుండెనని కాదు. తన సాధనలనుండి ఏకొంచెము సమయము దొరికినమాత్రమేయని గ్రహింపవలయును.

## నాతల్లి 'తారా' (ఆమార్) నిరాకారా: సిద్ధావస్థ

క్రమముగ రామప్రసాదు సాధనారాజ్యమున ద్రుతముగ అగ్రసరుడై చివరకు జగన్మాతృకృపా విశేషముచే సాధన చరమసీమయగు బ్రహ్మైక్యభావము నొందెను. ఇదియే సిద్ధావస్థ ఈ అవస్థయందు సాధకుడిక సిద్ధుడై జగత్తునంతటిని భగవన్మయముగా చూచును. ఇందు సాధకునకు ఇఁకెప్పుడు విధ్యుక్త ఉపాసనాదులన్నియు సహజముగనే త్యక్తములగును. సాధారణముగ ఈ సిద్ధావస్థ నొందినవాని శరీరము

ఇరువదియొక్క దినములలో ఎండుటాకువలె పడిపోవును. కాని ప్రారబ్ధవశముచేగాని, దైవేచ్ఛచేగాని శరీరమున్నచో జీవించియున్నంతవరకు లోకకల్యాణమునకై తోడ్పడుచుండును. రామప్రసాదు జీవితాంతిమువరకు మనోహరమైన కీర్తనలను రచియించుచూ, జగజ్జనునికి వినిపించుచూ తద్ద్వారా భగవన్నామ ప్రచారము చేయసాగెను. బ్రహ్మశక్తులు అభేదములనియు, నిర్విశేష నిరాకార బ్రహ్మమే సృష్టిస్థితి సంహార కార్యములొనర్చునపుడు బ్రహ్మ, విష్ణు, శివ, కాళియను వివిధ నామములచే పిలువబడుననియు ఆతడు ప్రత్యక్షానుభవముచే గ్రహించెను. క్రింది రచనలచే అతని ఈ యనుభవము స్పష్టము కాగలదు.

ఒకచో పాడుచు: ఒరే! ప్రసాదుడా! వేదములు పరమ సత్యములు. నా తల్లియగు తార నిరాకార పరబ్రహ్మ. (ఐనచో) ధాతు, పాషాణ ప్రతిమలతో నీకింకేమి పని? మనోమయ ప్రతిమను నిర్మించి హృత్పద్మమునందు ప్రతిష్ఠింపుము. ఇంకొకచో: త్రిభువనమే మాతృరూపమని తెలిసికూడ మట్టిబొమ్మలకట్టి పూజసేయు బుద్ధి నీకేల? యని పాడెను.

మరొకచోట పాడుచూ: ఈసారి చక్కగా విచారించితిని. ఒక 'భావుకుని'నుండి 'భావము'ను గ్రహించితిని. రాత్రిలేని యొక దేశమునుండి వచ్చినవానిని పొందితిని. నాకిక దినమేమి? సంధ్యయేమి? సంధ్యను వంధ్య నొనర్చితిని. నిద్రనే నిద్రబుచ్చి సదా యోగమున జాగరూకుడనై యుంటిని. భుక్తి ముక్తులిక నాకు అరచేతి అమలకములు. ప్రసాదుని ఉక్తి:—శ్యామా (జననియే) బ్రహ్మయని గుర్తించి ధర్మకర్మములను దూరముగ త్యజించితిని.

## అలౌకిక ఘటనలు

మహనీయుల జీవితములలో ననేక అలౌకిక ఘటనలు కాన్పించుచుండును. దీనిలో ఆశ్చర్యము లేదు. అఘటనఘటనా పటీయసియగు మాయ ఎవ్వని యధీనమో అట్టి ఈశ్వరుడే భక్తాధీనుడయి, భక్తుల యోగక్షేమముల వహించుచుండ ఇది యాశ్చర్యము కానేరదు. కాని సామాన్యులీ ఘటనలనే గోరంతలు కొండంతలుగా చేయుచుందురు. కాని మహనీయు లిట్టి విషయములను గమనీయముకూడ చేయరు. శ్రీరామప్రసాదుని జీవితమునకూడ ఇటువంటి కొన్ని ఘటనలు సంఘటిల్లినవి.

రామప్రసాదునకు జగదీశ్వరియను పుత్రిక కలదని ముందే జెప్పబడినది. ఒకప్పుడాతడు తన పాడువడిన పూరింటి గిడ్డిగోడను మరామతు చేయుచుండెను. జగదీశ్వరి యపుడు గోడ ఆవలి నుండి తండ్రిచేతికి త్రాడునిచ్చుచు సహాయము చేయుచుండెను. ఆమె కొంతసేపిట్లు తోడ్పడి వేరొక పనిమీద తండ్రికి చెప్పకయే వెళ్ళిపోయినది. పని పూర్తిచేసుకొని తిరిగివచ్చి చూచుసరికి మరామతు కార్యమంతయు దాదాపు పూర్తియైనది. జగదీశ్వరికిది ఆశ్చర్యముగా కాన్పించెను. తాను లేనప్పుడు తండ్రికెవరు త్రాడునందించిరో బోధపడక, 'నాన్నా, ఇంతసేపు నీకు త్రాడు నెవరు అందించుచుండిరని ప్రశ్నించినది. ఈసారి రామప్రసాదు చకితుడయినాడు. ఎందుకమ్మా, నీవేకదా! అడుగుచుంటివేలయని ప్రశ్నింప తాను కార్యాంతరమున అక్కడనుండి వెళ్ళి చాలసేపైనదని యామె పల్కెను. ఆలోచనాపరుడయ్యెను రామప్రసాదు. 'జగదీశ్వరి' యే జగదీశ్వరి రూపమున తనకింతవరకు తోడ్పడుచుండెనని యాతడు గ్రహించెను. ఇక భావావేశమున గద్గదకంఠుడై పాడసాగెను. 'ఓ మనసా! తల్లి చరణములను వీడియుండుటేల? ఓ మనసా! శక్తిని ఆరాధింపుము, ముక్తిని పొందెదవు. ఎటువంటి మందమతివో. జనని పుత్రికారూపము ధరించి నీ ఇంటిని సరిచేసిపోయెను. కను

లున్నను కాంచలేవైతివి గదా!

మరొకప్పుడు అతిలావణ్యవతియగు నొకస్త్రీ రామప్రసాదుని పాటలు వినగోరి వచ్చెను. ఆమెను కూర్చొనమనిచెప్పి యాతడు స్నానము చేయ వెడలెను. తిరిగివచ్చిచూడ ఎవరును కన్పింపలేదు. ఇటునటు పరికించిచూడ ప్రసాదుని దృష్టి గోడపైబడెను. 'నేను అన్నపూర్ణను. నీపాటల వినగోరి వచ్చితిని. నాకిప్పుడు సమయము లేదు. వేచియుండజాలను. కాశీకివచ్చి పాటలు పాడి విన్పింపుము' యని గోడపై వ్రాత కన్పించినది. ప్రసాదుని మనస్సు వర్ణనాతీత క్షోభను అనుభవించెను. స్వయముగా అన్నపూర్ణయే తన పాటలను విన తనవద్దకు వచ్చియుండ, స్నాననెపముతో తానా యవకాశమును పోగొట్టుకొనెను. కాని చేయునదేమిగలదు? ఆతడు త్వరలో కాశీకి పయనమయ్యెను. కాని ఆతడు త్రివేణి సమీపము జేరువరకు 'అన్నపూర్ణ' కలలో కన్పించి 'నీవిక కాశికి పోనవసరములేదు. ఇక్కడనే పాడిన జాలునని' పల్కెను. ఆనందముతో మనస్సు పూర్ణమైపోవ ప్రసాదుడు సద్యోరచిత బహుగానములను భక్తియుక్తుడై పాడి జగజ్జననికి వినిపించి తృప్తి నొందెను.

## 'దక్షిణా యైతిని' అంత్య దినములు

ప్రతిసంవత్సరము దీపావళీ అమావాస్య రాత్రి రామప్రసాదు ఇష్టదేవతయగు కాళీపూజను చేయుచుండెడివాడు. స్వహస్తములతో కాళీమూర్తిని నిర్మించి, మనోహరముగ అలంకరించి ఆదిన రాత్రులు భావవిభోరుడై క్రొంగ్రొత్త గానములను రచియించి జగజ్జననికి వినిపించుచుండెడివాడు. ఈ కాళీ పూజా దర్శనార్థము వందలకొలది జనులాదినమాతని గ్రామమునకు వచ్చుచుండెడివారు. అదొక రమణీయ దృశ్యము ప్రసాదుని కాళీపూజ అపుడొక అపూర్వ శక్తిపూర్ణ ఆధ్యాత్మిక వాతావరణమును సృజించుచుండెడిది. అచటనున్న వారి మనసపుడు తాత్కాలికముగానైనను యొక అపూర్వభావ, ఆనంద రాజ్యమున విహరించుచుండెడిది.

తుది పూజ. ఈ సంవత్సరముకూడ పూర్వమువలె కాళీపూజ సమీపించెను. యథావిధిగా ప్రతిమను నిర్మించి రామప్రసాదు పూజాసన్నాహములు చేయదొడగెను. చేయవలసిన అన్ని కార్యములను యథాపూర్వముగా చేయుచున్నను ఈసారి ఆతనియందొక క్రొత్త మనోభావము—అన్యమనస్కత, నిర్లిప్తభావము కనబడుచుండెను. భవనాటకమున అవసానాంకము సమీపించెనని రామప్రసాదు గ్రహించెను కాబోలు. బహుశః అందుకే—ఓ మనసా శీఘ్రముగ రమ్ము, 'తారా' యను నొక తీరమునకు వచ్చినది. ఆవలకు పోదలచినచో త్వరితము రమ్ము. నొక ఇక శీఘ్రముగ పయనించును. సంధ్యా సమయమయినది, చీకటి యావరించుచున్నది. దుఃఖసాగరమును తరింపగోరుదువో త్వరితము రమ్ము. ఈ 'భవ' బజారునందింకెంత కాలము వృథా తిరుగులాడెదము! ఓ మనసా, ఈసారి రామప్రసాదుడు భవపాశములను ఖండించి తారా నొకయందు కూర్చుండి ఆవలకు పోవుచున్నాడు' అని పాడినాడు.

కాని దర్శనార్థులకీ క్రొత్త భావమేమో బోధపడలేదు. క్రమశః పూజాదినమాసన్నమైనది, నిర్విఘ్నముగ కీర్తనాదులతో సంపన్నమైనది. మరుసటిదినము. ప్రతిమను విసర్జించు సమయము దాపయ్యెను. మంగళఘటమును శిరస్సుపై నిడుకొని కాళీకీర్తనలను పాడుచు రామప్రసాదు భాగీరథిని చేరెను. పవిత్ర సురసరియందు ఆకంఠ నిమగ్నుడై 'విదాయ' కీర్తనలను పాడసాగెను. ఒకటి తరువాత ఒకటిగా నాలుగు క్రొత్తపాటలను రచియించి జగజ్జననికి వినిపించసాగెను. అందు ఇదే చివరి పాట; అమ్మా, తారా (నా

సంగతిక) నీకు జ్ఞాపకమున్నదా? నన్ను మోసముచేసి పారిపోయితివిగదా! సరి నేనుకూడ (నీ సంగతిని) చూచెదను. దక్షిణా (కాశీ) బలమున నా మనస్సుకూడ దృఢము. అమ్మా, అందుకే నేనూ 'దక్షిణా' నైతిని. 'దక్షిణా ఐతిని' అను పదము ముఖమునుండి వెలువడినతోడనే ఆతడు పాంచ భౌతిక దేహమునువీడి జగజ్జననీ పాద పద్మములందు చిరతరముగ విలీనుడయ్యెను. ప్రియ పుత్రుని పాంచ భౌతిక దేహమును తనలో నిడుకొని ప్రవహింపసాగినది పవిత్ర గంగానది.

# మతము - అనుభవము

శిష్టా లక్ష్మీనారాయణ

మత్కర్మ కృన్మత్పరమో మద్భక్త
సంగవర్జితః
నిర్వైరః సర్వభూతేషు యః స మామేతి
పాండవ ॥ గీత XI 55

## మానవుడు – ధ్యేయం :

జీవరాసు లన్నిటిలోనూ మానవుడు మిన్న. ఈ ఆధిక్యం దేనిమీద ఆధారపడి ఉన్నది? ఈ ప్రశ్నకు సమాధానం అంత సులభమైనది కాదు. స్థూలంగా చూస్తే మానవుడికి ఇతర జీవరాసులకీ చాలా సామ్యం కనబడుతుంది. ఆహారం నిద్ర సంతానోత్పత్తి మొదలైన విషయాలలో మానవుడు ఇతర జీవరాసులు ఒకటే. అయితే మానవుడి ప్రతిశోధనలోనూ తను ఈ జీవరాసు లన్నిటిలోనూ విశిష్టమైనవాడు తన స్థితి చాల ఉన్నతమైనది అన్నస్ఫురణ వేదన కానవస్తుంది. ప్రతి పనిలోనూ మాటలోనూ ఈ వైశిష్ట్యాన్ని ప్రస్ఫుటింపచేయాలి అన్న తపన కానవస్తుంది. నిరంతర సంఘర్షణలు ఆ వేదన వెనుక మానవునిలో నిరంతరం వెలిగే ఈ ఆధిక్యతతో కూడిన వేదన ఉంది. అదీకాక మానవునిలో తన జీవిత ధ్యేయాన్ని గూర్చిన తపన స్పష్టంగా కనబడుతూ ఉంటుంది. అయితే ఏదిఅయితే తనగమ్యం అనుకుంటున్నాడో ఏది అయితే తన జీవితధ్యేయం అనుకుంటున్నాడో అది ఒకనాడు చేరేది గానీ లేక అనుభవంలోకి పూర్తిగా వచ్చేదిగానీ కాదు. కాని అంతమాత్రాన నిర్దిష్టమైన గమ్యం లేదని కాదు. అంటే ఈ గమ్యం చేరుకొని విశ్రాంతిని పొందేది కాదు. గమనంలోనే గమ్యముంది, నిరంతర శోధనలోనే ధ్యేయముంది. ఈ గమ్యం యొక్క స్వరూపమేమిటి? లక్షణమేమిటి? అన్న ప్రశ్నలు జిజ్ఞాసువుల్ని నిరంతరం వేధిస్తూనే ఉన్నాయి. ఈ వేదననుండే ఎన్నో మతాలు ఎన్నో సిద్ధాంతాలు ఉద్భవిస్తున్నాయి. ఎన్నో ఆవిష్కరణలుకూడా ఈ నిరంతర సత్యాన్వేషణనుండే ప్రభవిల్లుతున్నాయి. శాస్త్రజ్ఞుడైనా తత్త్వవేత్త అయినా కళాకారుడుఅయినా ఈసత్యశోధనలో ఎన్నోవిషయాల్ని మానవాళిముందు ఉంచుతు న్నారు. వీరంతా వివిధమార్గాలలో ఒకేసత్యం వైపు పయనిస్తున్నవారనే చెప్పాలి. సత్యం జడమైనదికాదు. అది నిరంతర సృజనాత్మకమైనది. కాబట్టి ముఖ్యంగా శోధకులు సాధకులు వేసే ప్రతి అడుగు ఆ దిశగానే మనల సందర్శి నడిపిస్తోంది. ఈ నిత్యచైతన్యవంతమైన గమనమే మానవజీవితగమ్యంగా చెప్పవచ్చు. ఇదేజ్ఞానం ఇదేలక్ష్యం.

సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే
గీత IV 33

అంటే జీవితధ్యేయం జ్ఞానాన్ని అణువణువులో అడుగడుగునా అనుభవంలోకి తెచ్చుకోవటంలోనే ఉన్నది అని.

మతము :

ఒకవ్యక్తి ఈ భౌతికావసరాలను సౌఖ్యాలను మించి ఆలోచించలేక పోయినట్లయితే ఆ వ్యక్తికీ చతుష్పాదపశువుకూ పెద్ద తేడాలేదు. నిరంతరం మార్పుకు లోనయ్యే ఈ చరాచర జగత్తుకిమించిన సత్యం ఒకటి ఉంది అది కేవలం ఈ పాంచభౌతిక ఇంద్రియముల కగోచరమైనది అన్న ఆలోచన మానవునిలో ఎంతో జిజ్ఞాసను కలుగచేస్తుంది. ఈరకమైన జిజ్ఞాసనుండే మతం ఉద్భవిస్తుంది. అందుకనే రాధాకృష్ణన్ మానవ జీవితాన్ని గురించి "Human life has no meaning if it is not inspired by an unquenchable yearning for contact with the eternal" అంటాడు.

అదీకాక జీవితంయొక్క అర్థం ఔచిత్యం ఈ రకమైన ఉత్కృష్టమైన ఆలోచనలోనూ పరమానుభవంలోనే ఉన్నాయి. ఆ ఉన్నతమైన ఆలోచన పరమానుభవంలోకి తర్జుమా కానపుడు అది చాలా అనర్థాలకు దారితీస్తుంది. అందుచేతనే సాధనకు ఆ పరమానుభవం పొందిన మహర్షులు శ్రవణమనన నిదిధ్యాసన అన్న మూడుదశలను సూచించారు. ఆర్షసంప్రదాయాలో మతంయొక్క ఆవిర్భావం, పరిణతి, చరమ లక్ష్యం ఆ పరమానుభవంగా పేర్కొన్నారు. అందుచేతనే యాజ్ఞ్యవల్క్యుడు జీవితధ్యేయాన్ని వివరిస్తూ—

యోవా ఏతద్ అక్షరమ్ గార్గీ అవిదిత్వా
స్మాల్లోకాత్ ప్రేతి స కృపణః ।
అతః ఏతద్ అక్షరమ్ గార్గీ విదిత్వా
స్మాల్లోకాత్ ప్రేతి స బ్రాహ్మణః ॥

'గార్గీ ఎవరైతే ఈ క్షయంకానిదాన్ని అనుభవంలోకి తెచ్చుకోకుండా ఈ ప్రపంచాన్నుంచి నిష్క్రమిస్తారో వారినిచూచి జాలిపడాలి. ఎవరైతే ఈఅనంతసత్యాన్ని అనుభవంలోకి తెచ్చుకొని ఈ ఇహయాత్ర చాలిస్తారో వారే నిజమైన బ్రాహ్మణులు (బ్రహ్మజ్ఞానాన్ని పొందినవారని).

అన్నిమతాలు ఈ విషయాన్నే వివరంగా చెపుతున్నాయి. అయితే వారు సూచించే మార్గాలు వేరుకావచ్చు. ప్రతిమతం ఈ పరమసత్యాన్ని అనుభవంలోకి తెచ్చుకోవటమే జీవిత సారంగా సర్వస్వంగా ప్రబోధిస్తున్నాయి. బైబిల్ old testament లో "O god, thou art my God; early will I see thee, my soul thirsteth for thee, my flesh longth for thee in a dry and thirsty land, where no water is." Psalm LXIII-1 ఇటువంటి పరమానుభవం సార్వజనీనమైనది. మతాలెన్ని అయినా అనుభవం ఒకటే. ఈ అనుభవం సనాతనమైనది. ఈ విషయాన్నే, ఎన్నో వాగ్వివాదాలకు లోనవుతూ మానవులు దానవులుగా తయారవుతున్న సమయంలో, ఈ యుగంలో శ్రీరామకృష్ణపరమహంస అవతరించి ఈ మౌలికసత్యాన్ని తమ అనుభవంద్వారా ప్రపంచం నలుమూలలా చాటారు. వారి శిష్యులగు శ్రీవివేకానందస్వామి ఈ సత్యాన్నే మానవాళికి అందించారు.

శ్రీవివేకానందవాణి :

1893 లో షికాగోలో జరిగిన విశ్వమతమహాసభ ప్రపంచచరిత్రలో మరపురాని సంఘటన. సనాతనధర్మచరిత్రలోనే నూతనశకాన్ని ప్రారంభించిన శ్రీస్వామివారి వాహిని. ఈ సభయే సనాతనధర్మ సౌరభాన్ని శ్రీ స్వామివారి అమరవాణిద్వారా మానవజాతికి అందించినది. స్వామివారి వాణి మతదురహంకారంతో అలమటించిపోతున్న కొందరికి జ్ఞానభిక్ష పెట్టినది. క్రైస్తవమతమే సర్వస్వంకాదని అంతికమించిన అనుభవమే ఊపిరిగాగల సనాతనధర్మం అన్ని మతములయందు అంతఃస్యూతంగా ఉందని అస

లు అనుభవంలేకుండా మతం మతం కాదని స్వామివారివాణి గర్జించింది ఈమహాసభలోనే. స్వామివారు సభలో 'వివిధప్రదేశములలో పుట్టిన నదులన్నియూ ఎంతోదూరం ప్రయాణం చేసి తుదకు సముద్రమున సంగమించునట్లే వివిధ జాతులకు చెందిన మానవులు వివిధములైన ఆరాధనామార్గములను అనుసరించుచూ చివరకు ఆ సర్వేశ్వరునే చేరుకొంటున్నారు' అని అన్నారు. స్వామివారి సర్వమత సమరసభావం ఆ సభకు వేంచేసిన ప్రతినిధులను సమ్మోహితులనుచేసింది.

ఆ సభలో స్వామివారు ఇలా అన్నారు: "వేదాంతము సర్వధర్మసమన్వయం. వివిధపూజావిధానములు. ఆరాధనాధోరణులు అవాఙ్మానసగోచరమైన ఆ పరమసత్యాన్ని అనుభవంలోనికి తెచ్చుకునే మార్గాలు మాత్రమే. ఆరాధనమార్గం మాత్రమే. ఆత్మ నిత్యము, అద్వితీయము. భేదభావములన్నియు అజ్ఞానమునకు తార్కాణములు. మరణము కేవలము ఈభౌతిక శరీరమునకు సంబంధించినది. అహంకారనాశనము భగవత్సాక్షాత్కారానికి మూలము. అహంకారం అన్ని సంఘర్షణలకి, పతనానికి చివరికి నాశనానికి కారణం. మానవుడు అమరుడు. మానవుని పాపి యనుటకంటె మహాపాపం మరియొకటిలేదు. విగ్రహారాధన ధ్యానమునకు తోడ్పడుతుంది, ప్రార్థన కర్మకాండ చిత్తశుద్ధికి తోడ్పడుతుంది.'

స్వామివారు ఎన్నడూ ఏమతమునూ తూలనాడలేదు. వారు అన్ని మతములలోని అమరసందేశాన్ని ఆకళించుకొని అనుభవంతో సనాతన ధర్మం ఎంత సార్వజనీనమైనదో సార్వకాలికమైనదో వివరించిరి. మతంయొక్క ఆత్మ అనుభవం, ఆచరణ. అనుభవం మూర్తీభవించిన మహామనీషి. కావుననే స్వామి వాణి శతకోటి వీణలై సభలోని ప్రతినిధుల నందరినీ సమ్మోహితుల్ని చేసింది. నేడు ప్రపంచంలో ఎన్నో మతాలున్నాయి. అయినా వాటిప్రభావం వాటి ప్రవక్తలు ఇహలోకాన్ని వీడగానే తగ్గిపోతున్నది. దీనికి కారణం ఒకటే. ప్రవక్తలయొక్క అనుయాయులు కేవలం వారిమాటలను అనుసరిస్తున్నారేగాని వారి అనుభవాన్ని గ్రహించటంలేదు అనుభవాన్ని గ్రహించటానికి అనుభవమే కావాలి అందుచేతనే సనాతనధర్మ సంప్రదాయం ఎంతోమంది మహామహుల అనుభవాలతో నిరంతరం తుష్టినిపుష్టిని పొందుతోంది.

ఈ సంప్రదాయంలో ఎందరో మహాత్ములు వారి అనుభవాలతో మానవాళికి కొత్త వెలుగునుచూపించారు. గతశతాబ్దంలోనూ ఈశతాబ్దంలోనూ ఈవెలుగును శ్రీపరమహంస శ్రీవివేకానందస్వామి మానవాళి సమైక్యతను మతాల ఏకత్వాన్ని వారి అనుభవపురస్సరంగా చాటారు. అందుచేతనే ఈనాటికీ వారి ప్రభావం ఎన్నో సాంఘిక సంక్షేమ కార్యక్రమాలద్వారా ఆధ్యాత్మిక అనుభవాలద్వారా ప్రపంచం నలుమూలలా అజ్ఞాన తిమిరాన్ని పటాపంచలు చేస్తోంది.

మతం శరీరం అయితే మతానుభవం ఆత్మ వివిధ ఆరాధనాపద్ధతులు అంగములు. సత్యావిష్కరణే మతంయొక్క లక్ష్యం. ఇదియే మానవజీవితధ్యేయం.

యే యథామాం ప్రపద్యంతే తాంస్తథైవ
భజామ్యహం
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ
సర్వశః ॥ గీత IV 11



# మహాకవి త్యాగరాజు

## యామిజాల పద్మనాభస్వామి

''విశ్వశ్రేయః కావ్యం
తదదోషౌ పరిష్కృతౌచ వాగర్థౌ
సావాక్యా రసవృత్తిః
సాధ్యోహిరసో యథాయథం కవిభిః''—

కావ్యం లోకక్షేమంకరమై ఉండాలి. నిర్దుష్టములు సుసంస్కృతములున్నూ అయిన వాగర్థముల సంపుటీకరణమే కావ్యం. రసస్ఫోరకమైనదే వాక్కు. కవుల ప్రతిభావ్యుత్పత్తులపై రసము ఆధారపడి ఉంటుంది—అని పై శ్లోకానికి సారం. అది పలికిన మహానుభావుడు తెలుగు వాఙ్మయ జగతికి సృష్టికర్తగా నిలిచి నేటివరకు నివాళు లందుకుంటూన్న నన్నయభట్టారకుడు.

'వాక్యం రసాత్మకం కావ్యమ్' అని ఆలంకారికుల నిర్వచనం.

విశాల విశ్వములో విహరిస్తూన్న ప్రాణి జీవితానికి రసమే ప్రాణం. నీరస జీవితానికి ఎందునా పరిగణన ఉండదు. బండిబరువు గ్రంథం నీరసమైతే కావ్యమనిపించుకోదు. హృదయాన్ని కదిలించేది ఒక్క వాక్యమైనా ఆశశీనముగా నిలుస్తూ ఉంటుంది.

లౌకికమూ అలౌకికమూ అని కావ్యజీవితమును విభజించిచూస్తే కొన్ని కావ్యాలు సామాజిక జీవితాన్ని ప్రబోధించేవీ కొన్ని పారమార్థిక జీవితాన్ని ఉద్బోధించేవీ అయి ఉంటాయి. మన ప్రాచీన వాఙ్మయము అంతా పైకి లౌకికంగా కుటుంబజీవిత కథలను చెప్తూన్నట్టు కనిపించినా వేదోపనిషన్మార్గ ప్రదర్శకమయే ఉందనడానికి వెనుదీయనక్కర లేదు. దీనికి భారతేతిహాసం ప్రథమ సాక్షి. భాగవతం పారమార్థిక ప్రబోధకం అంటే కాదనేవారుండరని నా నమ్మిక, అయితే ముమ్మూర్తులా పారమార్థిక జీవిత ఫలబోధకములైన గ్రంథాలు చాలా తక్కువ లెక్కలో ఉన్నాయనే చెప్పవచ్చు.

మానవజీవితం కైవల్యసాధనకు ప్రధానమైన ఉపకరణం. ముక్తి కోరుకునే దివ్యులు కూడా మానవలోకానికి దిగిరావలసిందే. ఆ లాటి జీవితం ప్రాప్తించిన తరువాత ఆరంభములో పానకంలాగున్నా క్రమేణ హాలాహలం వంటి సాంసారిక సుఖాలకు మనస్సొగ్గి చెడిపోవడం మంచిమనిషి చెయ్యవలసే పనికాదని పూర్వకవులు ఎన్నివిధాలుగానో బోధించడం చూస్తూనే ఉంటాము. కాని యీ జీవితం నక్కజేలకాయవంటిదిగానే గడుస్తూ ఉంటుంది. 'కర్మణో గహనాగతిః' శ్రీరామకృష్ణులు కర్మజ్ఞానభక్తిమార్గాలను వివరిస్తూ భక్తికి ప్రాధాన్యం ఇచ్చి 'సులభంగా తరించండి' అనగా, ఆయన శిష్యుడు వివేకానందస్వామి స్వదేశవిదేశాలలో ఆకాశమంత గొంతుతో చెప్పిన బోధ 'అవును' అని అంగీకరించిన వ్యక్తి ఆచరణలో అడుగు పెట్టకపోవడం ఏమనాలో తెలియదు.

ప్రస్తుతానికి వస్తే – వేదవేదాంత పారమార్థిక సత్యమును అరటిపండు ఒలిచి చేతపెట్టినట్టు సున్నితములైన మాటలతో సూటిగా చెప్పిన మహానుభావుడు అపరవాల్మీకి శ్రీ త్యాగరాజస్వామి అని సర్వేసర్వత్ర ఐక్యకంఠంగా అంగీకరించవలసిన సత్యం. ఆ మహాత్ముని హృదయం సరిగా అర్థంచేసుకునే శక్తిలేకపోయినా అర్థం చేసుకున్నంత – నాలుగుమాటలలో చెప్పాలని అనుకున్నాను. అలా అనుకున్నదానికి రూపకల్పన ఈ అక్షర సంపుటి:

'మహాకవి' అని ఆయన పేరుకి ముందు ఒక పదం ఉంచాను గమనించండి. ఏవో గేయాలు చెప్పిన తంబురాదాసుడు మహాకవా అని బాహాటంగా అనకపోయినా అటూ ఇటూ చూసి

అనుకునేవారున్నారు, ఉంటారు... అలాటివారికి సూత్రప్రాయంగా సమాధానం చెప్పడమే యీ వ్యాసం లక్ష్యం... ముందుగ పారంపరికమైన చిన్న సంఘటన ఒకటిచెప్పి తరువాత త్యాగరాజయ్యగారిని గురించి వ్రాస్తాను.

శుద్ధచ్ఛాందసులు నలుగురు దారిద్ర్యబాధ పడలేక భోజరాజుని దర్శించి ధనం సంపాదించమని ధారానగరానికి ప్రయాణంకట్టి నగరం చేరారట! అప్పటికి జాము ప్రొద్దెక్కింది. త్రోవ ప్రక్కనే ఒక కోనేరు, కోనేటిగట్టున అమ్మవారి గుడి. ఆ నాల్గుమూర్తులూ కోనేటిలో స్నానం వగైరా తీర్చుకుని గట్టెక్కి చెట్టుక్రింద కూర్చుని కవిత్వం కట్టడానికి ఉపక్రమించారట! కొంతసేపటికి ఒకడు

'భోజనం దేహి రాజేంద్ర!...' అని ఆపైన రెండవవాణ్ణి చెప్పమన్నాడట! ఆ ప్రబుద్ధుడు కొంతసేపటికి

'ఘృతసూప సమన్వితమ్——' అని ఊరకున్నాడు. మిగిలిన ఇద్దరూ భూమీ ఆకాశం చూస్తూ గుటకలు వేస్తున్నారేగాని అక్కరం ఒక్కటీ అక్కరకు రాలేదు. దైవికంగా ఆ సమయానికి కాళిదాసు అమ్మవారిని పూజించడానికి అక్కడకువచ్చి యీ ప్రబుద్ధుల వాలకంచూసి విషయం తెలుసుకుని జాలిపడి

'మాహిషంచ శరచ్చంద్ర

చంద్రికా ధవళం దధి' అని మిగతా పద్యం పూర్తిచేసినట్టు వారి భోజనం కోరిక చక్కగా పూర్తిచేసి వెళ్లండయ్యా అని సాదరంగా పంపాడట. ఆ నలుగురి ఆనందానికి అంతులేదు. నగరంలో ప్రవేశించారు. ఏ సద్గృహస్థు ఇంటనో ఆ పూట ఆతిథ్యం స్వీకరించి రాచదర్బారుకి వెళ్లారు. భోజరాజు కొలువుతీరి ఉన్నాడు. నలుగురూ రాజానుమతితో నిండోలగములో ప్రవేశించారు. సుస్వరంగా పనసచెప్పి రాజుని ఆశీర్వదించారు. విభూతి పూతలతో రుదురాక పేర్లతో ఉన్న నలుగురూ సామాన్య విప్రవేషాలు ధరించిన శివుడులాగా ఉన్నారు.

భోజుడు వారిని సగౌరవంగ సవినయంగ అడిగాడు, 'ఏమి కావాలో ఒక్క శ్లోకంలో చెప్పవలసింది' అని. ఆ మహారాజు వేదశాస్త్రాలపై గౌరవంలేనివాడు కాడుకాని కవిత్వం అంటే మనసిచ్చి మైమరచిపోతాడు. సహజంగా కవి ఆయనే మరి,——

వెంటనే నలుగురూ వేదపనస చెప్తున్నట్టుగానే ఉదాత్తానుదాత్తస్వరితాలతో పైశ్లోకం చెప్పారు. భోజుడు వారి పఠన పద్ధతికి లోలోన నవ్వుకుని అయ్యా! మూడు నాలుగు పాదాలు మీరు చెప్పినవేనా? అని అడిగాడు. నలుగురూ బిత్తరపోయి ఒకరి మొగం ఒకరు చూసుకుంటూ ఏమిచెప్పాలో తోచక కిందుమీదవుతూన్నారు. అంతలో కాళిదాసుగారు దయచేసి రాజుగారికి కసింతదూరంలో ఉన్న తన ఆసనంపై ఆసీనులయారు. వెంటనే ఈ నలుగురూ ఆయనను చూపి ఆయన చెప్పారని చల్లగా మెల్లగా అనేశారు. 'అలాగే అనుకున్నాను. ఆ రెండు పాదాలకూ అక్షరలక్ష లిస్తున్నాను' అని వారికి తృప్తిగా ధనమిచ్చి పంపివేశాడు....

'మహారాజా! నేతితో పప్పుతో భోజనం పెట్టు అని వారి రెండు పాదాలకూ అర్థం.

'శరత్కాలపు వెన్నెలలాగా స్వచ్ఛమైన గేదె పెరుగుకూడా వడ్డించు——అని కాళిదాసు చెప్పిన పాదాలకు తాత్పర్యం.

కాళిదాసు చెప్పినదానితోనే భోజనంపూర్తి అవుతుంది. ఎంత పప్పూ, నెయ్యీ వేసినా పెరుగో లేక మజ్జిగో ఉండాలి కదా! ఆది ఎలా చెప్పాలో ఆ ఛాందసులకు తోచలేదు. మహాకవి చెప్పి భోజనమూ శ్లోకమూ పూర్తిచేశాడు. కాని కాళిదాసు చెప్పిన పాదాలకే అక్షర

లక్షలు లభించాయి. కారణం ? అది మహాకవి వాక్కు. ఆ పుంభావ సరస్వతి నోట వచ్చిన వాక్కు శరచ్చంద్ర చంద్రికా ధవళమైన దధి లాగే ఉంది. కనుక అక్షరలక్షలు సంపాదించింది. ఆ విశేషం గ్రహించిన సరసుడు కనుక భోజుడు అలా గౌరవించాడు కాళిదాస వాక్సారమును కాళిదాసు లేక సరస్వతి లేక చతుర్ముఖుడు మాత్రమే తెలుసుకుంటారుగాని మావంటి వారు తెలుసుకోలేరన్నాడు మల్లినాథసూరి.

అదిగో ఆ కాళిదాసుగారివంటి మహాకవి మన త్యాగయ్యగారు. చూడండి.

అలకలల్లలాడగ గని
ఆరాణ్మునియెటు పొంగెనో
చెలువుమీరగను మారీచుని మదమణచే
వేళ॥ అల॥

ముని కనుసైగ దెలిసి శివ
ధనువును విరిచే సమయ
మున త్యాగరాజవినుతుని మోమున
రంజిలు॥ అలక॥

ఈ కృతిలో ముందు ఊనషోడశ వర్షుడైన రామచంద్రుని ఆకృతి చూడగలిగితే త్యాగరాజస్వామి మహాకవితాకృతి చూసే అదృష్టం పట్టుతుంది. దీనిలో చెప్పిన సంఘటనకు ఆధారమైన ఆదికవి కావ్యములో ఈఘట్టాలలో యీలాటి భావకల్పనగాని సౌందర్య ప్రకటనగాని లేదు. వాల్మీకులవారి రామాయణం బాలకాండ తిరగవేసి చిత్తగించ గోరుతున్నాను. ఇక్కడ నా లేతమనసు చూచినది విన్నవిస్తున్నాను. కోవిదులు అవధరించవలసిందని మనవి:

నిండా పదారేళ్లులేని నూనూగు మీసాల నూత్నయౌవనుడు. రాచబిడ్డడు. గోముగా పెరిగినవాడు. ఎక్కడ ? ఎండ కన్నెరగని అంతఃపురములో. అదీకాక కలగక కలగక ముసలిదంపతులకు షష్టిపూర్తి అయాక కలిగిన ముద్దుల పట్టి. ఇన్నిటికీ తోడు అపురూపమైన మైచాయ గలవాడు. చెంపకు చేరెడేసి కళ్లూ శ్రీకారానికి ఓంకారం జతచేసే వీనులూ కఱినంక బొమలూ బింబాధరం నలువమొసలో ముత్యాలకంటె అష్టమినాటి అర చందురునివంటి పసందైన నుదుట, వలపు కస్తురితిలకం. నిద్దపుటద్దాలవంటి మెరుగు చెక్కిళ్లు చెక్కిళ్లకు మెరుగుపెట్టే జులపాలూ, కౌసల్యానందవర్ధనుని చక్కదనానికి చుక్కలు. సుషమా శోభితమైన దశరథతనయుని మోము సర్వకాలసర్వావస్థలయందునూ 'నగుమోమే'!.. సౌకుమార్యమూ సౌందర్యమూ పోటీపడే పాలపొంగు వయసులో ఉన్న చిన్నారిరాముడు విశ్వామిత్రుని యాగసంరక్షణకు పాదచారియై అడవులలో విల్లమ్ములు ధరించి వెళ్తున్నాడు.

విశ్వామిత్రుని యాగం కాకుండా పాడుచేసే రాకాసి తాటక. దాని కొడుకు సుబాహుడు, మేనల్లుడు మారీచుడు దానికి అంగరక్షకులు. సమయం వచ్చింది. చిన్నారిరామన్న విల్లు తామ్మంది, తాటక దానికొడుకు సుబాహుడు నామరూపాలు లేకుండా రామశరాగ్ని జ్వాలలకు ఎండుపుడకలైపోయారు. . . మాయలమారి మారీచుడు మిగిలాడు. నా మాయను గెలిచే దిట్ట లేడని వాడి మదం. ఆ మదం అణచడం ఆక్షణం వరకు ముల్లోకాలలో మూర్తిపై మీసం ఉన్న ఏ మగవానికీ సాధ్యం కాలేదు. మిసిమి జవ్వనపు పసతో మిసమిసలాడే రాచబిడ్డడు విల్లు సారించి ఒక్కమారు తల ఊచాడు. ఆ ఊపులో రాచ మగటిమి తోచలేదు. ఏదో అలక్ష్యం కోపం రేఖా మాత్రముగానైనా వెలువడలేదు. ఏదో సింగారం. అది ఏలాటి సింగారం. ఆ రాజీవలోచనుని నగుమోముపై అటూ ఇటూ కొదమ తుమ్మెదలు ఆడుతున్నాయా అనే భ్రమ చూపరులకు కలిగించి. నిజానికి అవి తుమ్మెదలుకావు. ఉంగరాల నీలాల ముంగురులు. వాటికి అక్షర

రూపమైన అభినయం – ఏమిటది?

'అలకలల్లలాడగ'–ఇంత అందం ఒలికింది త్యాగయ్యగారి పల్లవిలో, అది అపూర్వ రమణీయ భావకుసుమవల్లరి. సమాసాల నిడుపు లేదు. కనిపించని కమనీయభావానికి రూపుదిద్దిన ముద్దైన నుడుల ఒడుపు అది. చిందర వందరగా ఆడ లేదు. 'అల్లలాడాయి' ఆ అలకలు. ఆ ఆటలో అలుక లేదు. ఆ నాడే కాదు లోకవిద్రావణుణ్ణి రావణుణ్ణి చూసిననాడేనా రాముని నెమ్మోమున అలుక పొడమలేదు. ఎప్పుడూ రాముడు 'నగుమోము'వాడే. అలాటి నగుమోముపై అలకలు అల్లలాడగ ఆ రాణ్ముని (రాచతపసి) ఎంత పొంగెనో? సర్వావస్థలకూ దూరమైన ముని జీవితములో ఆనందం పాలపొంగులాగా పొంగింది. ఈ పొంగు అచ్చ తెలుగు క్రియ. ఆ రాణ్ముని ఆ అందం కనులారాచూసి దుష్టరాక్షస శిక్షా సమయములో ఇంత నిర్లక్ష్యభావన గలవాడా యీ చిన్నారిరాముడు. రౌద్రరసానికి బదులు అద్భుతం – దానితో చూచాయగా లలిత శాంతం అని అలకల చలనములో అపర సృష్టికర్త చూసి 'పొంగడం' అనూహ్యం...

ఇద్దరూ ఏకగోత్రి సంజాతులే. 'నా వాడు రాముడు. నా రాముడెంత ధీరుడు! ఎంత గంభీరుడు! ఎంత సుందరుడు!...వివిధ భావశబలిత మయింది రాణ్ముని హృదయాంబరం. ఆ భావశబలత చెరగని ముద్ర వేసింది తిరిగి శివ ధనుర్భంగ సమయములో ఇంద్రధనువులాగ.

'ఈధనువు ఈలాటిదీ ఆలాటిదీ...'అని జనకుడు చెప్పడం అయింది. 'రామా! చూడవోయ్ వింటిని' – అన్నాడు విశ్వామిత్రుడు. ఈ మాట ఆది కవిది.

త్యాగరాజకవిరాజు విశ్వామిత్రుని నోట ఏమీ అనిపించలేదు. కనుసైగ చేశాడట! అది తెలిసి, (అర్థం చేసుకుని) పదారేళ్ల దశరథరాముడు శివ ధనువును కాస్త తల ఆడించి చూశాడు. ఆకర్షించాడు. ఆ సమయంలో రఘువరుని మోమున 'అలకలు అల్లలాడగ' చూసి ఆ రాణ్ముని ఎటు పొంగెనో! అంటారు త్యాగయ్యగారు.

మాయలమారి మారీచుని మదమణచే వేళ ఎంత నిర్లక్ష్యభావమో ఆనితర సాధ్యమైన శివ ధనురారోపణ సమయమునకూడా అంత నిర్లక్ష్య భావమే కనిపించింది రాముని నెమ్మోమున 'అల్లలాడే అలకల' ఆటలో అంత అందంగా ధైర్య స్థైర్య వీర్య ప్రకటన చేసిన జగదేకవీరుడు రఘు వీరుడు. కనుక ఆలాటి సమయములో రాణ్ముని ఆ అందచందాలను చూసి ఎంత పొంగినా పొంగవచ్చు. అందం, అందం అని జటా, ఘనా చెప్తున్నావు. ఇది నీ సొంత పల్లవా? అని తొందరపడి అనవద్దంటాను ఆ మహాకవి కృతిలోనే ఆ 'అందం' ఉంది. అనుపల్లవి ఆరంభంలోనే 'చెలువు మీరగను' అనే అందమైన ప్రయోగం ఉంది. మారీచుని మదమణచే వేళ శివధనువును విరచే వేళ త్యాగరాజవినుతుని మోమున చెలువు మీరగనే అలక లల్లలాడాయి. ప్రయోగ సౌందర్యం గ్రహించగలగాలి మరి.

బంగారానికి వెలిగారంలాగా పల్లవీ అనుపల్లవీ విడదీయరాని ప్రగాఢాన్వయ సంబంధం కలవై 'చెలువు' మీరాయి. ఆ మహాకవి 'కృతులు' చాలావరకు ఈలాటి సమన్వయ సరళి కలవై ఉంటాయని అనుకోవచ్చు. ఇక్కడ ఆ 'చెలువు'లో ఉంది, 'చెలువు' అంతా.

ఆ నాడు చెప్పని ఆదికవి త్యాగయ్యగా అవతరించి తెలుగుజాతికి ఎంతో ఇష్టం కనుక రామ సౌందర్యాన్ని ఇంత చెలువుగా చెప్పిన దివ్య వాక్చిత్రం ఇది. ఏగడిదీరిన చిత్రకారుడూ వేయ

లేని చిత్రం. భవ్యభావభరిత మహా కవితా
ఛ్ఛత్రం...
శ్రీరాముడు భువనమోహన రూపాభిరా

ముడు– అని యీ'కృతి'మధ్యమావతిగా వేనోళ్ల చాటుతూంది. ప్రస్తుతానికి ఇది 'అవసర నైవేద్యం.'

# భక్తిరత్నావళి

మూలము : విష్ణుపురి

అనువాదము : విష్ణుచిత్తుడు

(తృతీయ విరచనము)

## 7

అట్టి భక్తిని అభ్యసించుటవలని ఫలితమును శ్రీశుకుడు వర్ణించుచున్నాడు.

శ్రుతః సంకీర్తితోధ్యాతః పూజితశ్చాదృతోపివా
నృణాం ధునోతి భగవన్ హృత్స్థో జన్మాయుతాశుభమ్॥ (12-3-46)

భగవంతునిగూర్చి వినుచుండినను కీర్తించినను ధ్యానించినను పూజించినను అతనికే అర్పించుకొనినను అట్టిమానవుల హృదయములందు ఆ భగవంతుడు నివసించుచు జన్మజన్మముల నుండి సంపాదించిన పాపముల నన్నింటిని నశింపజేయును.

## 8

ఆ ఫలితమునే కుంతీదేవి వర్ణించుచున్నది.

శృణ్వన్తి గాయన్తి గృణన్త్యభీక్ష్ణశః స్మరన్తి నన్దన్తి తవేహితం జనాః
త ఏవ పశ్యన్త్యచిరేణ తావకం భవప్రవాహోపరమం పదాంబుజమ్॥ (1-8-36)

నిన్నుగూర్చి వినుచుండువారు నిన్ను స్తుతించువారు నిన్నుగురించి మాటలాడువారు నిన్నే స్మరించుచు నీయందే ఆనందించువారు అగు భక్తులు జననమరణప్రవాహమును అరికట్టు నీ పాదపద్మములను అతిశీఘ్రముగ చేరుకొందురుగాక!

నిక్కపు భక్తులు మోక్షమును కోరరనియు భగవంతుని సేవించు అవకాశమునే కోరుదురనియు వృత్రుడు వచించుచున్నాడు.

అహం హరే తవ పాదైకమూల దాసానుదాసో భవితాస్మిభూయః
మనః స్మరేతాఽసుపతేర్గుణానాం గృణీతవాక్ కర్మకరోతుకాయః॥ (6-11-24)

దేవా! నీ భక్తులకు దాసుడనుగ నేను మరల మరల జన్మింతునుగాక. ప్రాణేశ్వరా, నీ గుణగణములనే నా మనస్సు మరిమరి స్మరించునుగాక. వానినే నా జిహ్వా కీర్తించుగాక. నా శరీరము నీ సేవాకృత్యములనే నెరవేర్చుగాక.

## 10

జన్మబంధమువలని బాధలు భక్తుని బాధింపవని మైత్రేయుడు చెప్పుచున్నాడు.

అశేష సంక్లేశశమం విధత్తే గుణానువాద శ్రవణం మురారేః
కుతః పునస్తచ్చరణారవిన్ద పరాగసేవారతి రాత్మలబ్ధా॥ (3-7-14)

భగవంతుని గుణవైభవమును కేవలము వినుచుండిననే జననమరణపరంపరవలని అపార దుఃఖము నశించును. అట్లుండగా హృదయాంతరాళమున ఆతని పవిత్ర పాదపద్మములనే ధ్యానించుచు ఆనందింపగలిగినచో ఇక నెట్టి సౌఖ్యము లభింపగలదో కదా!

# వార్తలు-విశేషాలు

## క్రీస్తుజయంతి

మద్రాసు శ్రీరామకృష్ణమఠము (మైలాపూరు)న 24-12-76 వ తేది సాయంకాలము క్రీస్తుజయంతి భక్తిప్రపత్తులతో నిర్వహింపబడినది. దైనందిన సాయంకాలిక ఆరాత్రికానంతరము ఆకర్షణీయముగా అలంకరింపబడిన క్రీస్తు చిత్రపటమునకు హారతి నైవేద్యములు జరిగినవి. తదనంతరము శ్రీమత్ గభీరానందస్వామి బైబిలునందలి నేటివిటి ఘట్టమును పఠించిరి.

మఠాధ్యక్షులు శ్రీమత్తపస్యానందస్వామి ఉపన్యాసకులు శ్రీమత్ నిత్యబోధానందస్వామి వారిని సభకు పరిచయము చేసిరి. వారుపూర్వము మద్రాసు మఠమున ఆంగ్ల మాసపత్రిక వేదాంత కేసరి సంపాదకులుగ నుండిరి. బాధితుల సహాయ కార్యక్రమములలో ముఖ్య భారమును వహించుచుండిరి. ఆపిదప రాజమండ్రి మఠాధ్యక్షులుగ కొంతకాలముండిరి. మరికొన్ని బాధ్యతాయుత కార్యములను నిర్వహించిన పిదప స్విట్జర్లాండులోని జెనీవాయందు నూత్న కేంద్ర స్థాపనార్థమై పయనించిరి. ఇప్పటికి ఇరువది సంవత్సరములుగ వారచ్చట శ్రీరామకృష్ణ వేదాంత ప్రచారము గావించుచున్నారు. ఆంగ్లము ప్రచారముకాని ఆ దేశమున ప్రచారార్థమై వారు అచ్చటనే ఫ్రెంచిభాషయందే వేదాంతమున డాక్టరేటు పట్టమును పొందిరి. క్రైస్తవదేశమునందు చిరకాలముగనున్న వారు క్రీస్తుజయంతి సందర్భమున నుపన్యసించుటకు అన్ని విధముల తగియున్నారు.

శ్రీమత్ నిత్యబోధానందస్వామివారు తమ ప్రసంగమున శ్రీరామకృష్ణుల క్రైస్తవ సంప్రదాయ సాధనను పేర్కొనుచు క్రైస్తవ శ్రీరామకృష్ణ సంప్రదాయములను తులనాత్మకముగ పరిశీలించుచు శ్రీరామకృష్ణుల అనుభూతియొక్క, సమాజముపై శ్రీరామకృష్ణుల అనుభూతియొక్క ప్రభావమును వివరించిరి.

శ్రీరామకృష్ణులు క్రీస్తును శంభుమల్లిక్ ఇంటను దక్షిణేశ్వరమున పంచవటియందును దర్శించి ఆయన చప్పిడి ముక్కునుకూడ ప్రస్తావించియున్నను క్రీస్తు చారిత్రక పురుషుడనుటకు ఆధారములు లేవు. క్రైస్తవమతమున శంకరాచార్యులనదగు ఆక్వినాస్ మహాశయుడు క్రీస్తుకు పూర్వమే క్రైస్తవమత ముండెననియు క్రీస్తు క్రైస్తవ సంప్రదాయమును మించిపోయినాడనియు అనెను.

ఇట్లున్నను క్రీస్తుయొక్క భగవత్తత్త్వము మనకు ప్రస్తుతాంశము. అతడు భగవంతుడు అవతారపురుషుడు భగవత్కింకరుడు తత్కారణముననే మానవసేవకుడు. మానవతకే ప్రాణము లర్పించినాడు.

క్రీస్తుభగవంతుడు అవతారపురుషుడుకూడ. ప్రకృతిని నియమించి అనేక అద్భుత కార్యములనుచేసి తన శక్తిని ప్రదర్శించుటచేత భగవంతుడు (భగమనగా శక్తి.) క్రైస్తవత్రినిటీయందుండి దిగివచ్చుటచేత అవతారపురుషుడు. మానవుల నుద్ధరించుటకై అతని అవతరణము. కనుకనే గీతాప్రోక్తమగు అహమాదిశ్చ మధ్యంచ భూతానామంత ఏవచ అను లక్షణమునకు తగియున్నాడు.

భగవంతుడు మానవులయందలి భగవంతు నర్చించుటకై మానవరూపము దాల్చినాడు. మానవులపై ఆతని కెంత ప్రేమయనగా వారిని సేవించుటకై తన పుత్రునే పంపినాడు. మానవుని యాతనలనుండి రక్షించుటకై మితిలేని దయతో భగవంతుడే స్వయముగా పూనుకొనినాడు. ఈ దృష్ట్యా మాత్రమే క్రీస్తు మానవసేవకుడు. క్రీస్తు మానవుల ప్రతినిధిగా భగవంతునితో ఒప్పందము చేసికొనినాడు. తనను బలి చేసికొని మానవులను రక్షించినాడు. ఆయన లాస్ట్ సప్పర్‌నందు ఈ ఒప్పందము జరిగినది. బ్రెడ్ అనగా శరీరము అనగా ఏకీకరణమని భావము. వైన్ అనునది మానవుని విముక్తుని చేయుటకు అంగీకారసూచకము. ఆ సంఘటనయందలి భావమే మానవ విమోచనమునకై చేసికొనిన ఒడంబడిక.

శ్రీరామకృష్ణులుకూడ తన భగవత్త్వమును అనేక పర్యాయములు స్వయముగనే ప్రకటించియున్నారు. సదా భావముఖమున నుండుచు నిర్వికార నిరాకారబ్రహ్మమును మాయాబద్ధమగు ప్రపంచమును ఏకకాలముననే దర్శించినారు. పరిత్రాణాయ సాధూనాం అను గీతయందలి అభయదానమును నిరూపించుటకే వారవతరించిరి. శ్రీరామకృష్ణులుకూడ తమ ప్రాణముల నర్పించి మానవుల నుద్ధరించిరి. శ్రీవివేకానందస్వామియే వారు రచించిన ప్రార్థన గీతమున ప్రాణార్పణ జగిత తారణ అని కీర్తించిరి. భగవంతుడు భక్తవిధేయుడను సంప్రదాయము ననుసరించుటయేగాక శ్రీరామకృష్ణుడు తన శిష్యుడగు శ్రీ వివేకానందస్వామినికూడ మానవసేవకై నియోగించెను. ప్రతియొక్క మానవుడును ముక్తుడగువరకు మరల మరల వత్తునని శ్రీరామకృష్ణుడు అభయదానము చేసెను. ఆయన యాతన అంతయు మానవుల పాపములను స్వీకరించుటవలననే.

ఈ విధముగ శ్రీరామకృష్ణునియందు రెండు సంప్రదాయములు సంగమించుచు శాంతిస్థాపనము చేయుచున్నవి. మత దురభిమానము అనావశ్యకమని నిరూపించుటయేగాక ప్రతి మానవునకును క్రీస్తు అనుభవము కలుగగలదనికూడ నిరూపింపబడుచున్నది. పర్యవసానమున ఏ సంప్రదాయమును నిందించినను అది దైవదూషణమే అగునని తెలుచున్నది. భక్తి అనునది సంప్రదాయముల నతిక్రమించుచున్నది. తత్కారణమున అది సమన్వితమగు సామాజిక జీవనము

నను మతమును సాధనముగ చేయుచున్నది. మనలను మనము సంపూర్ణముగ మార్చివేసికొని ఇతరులనుకూడ మార్చగలుగు శక్తియే భక్తి. భక్తుడు ఎల్లప్పుడును సర్వభూతములకును ఆత్మార్పణము చేసికొనియుండును. సమాధియనగా సమాజముతో నేర్పడు సంపూర్ణమైన ఐక్యము. అట్లుగానిచో దానికి అర్థముండదు.

ఈ విషయములే మరియొక రీతిగ ఆధ్యాత్మిక జీవనముయొక్క ఆవశ్యక లక్షణములను సూచించుచున్నవి. ఆధ్యాత్మికానుభూతి గలిగిన గురువుతో మానసికమైన సంబంధము, శిష్యునితో భగవంతునివైపు నడిపించి గురువుయొక్క సంబంధము, భక్తి మాత్రమే యొసగగల ధైర్యోపేతమగు ఆత్మార్పణము.

ఉపన్యాసాంతమున భక్తగణమునకు ప్రసాద వినియోగము జరిగినది.

## శ్రీ శారదాజయంతి

మద్రాసు శ్రీరామకృష్ణమఠమున 13-12-76 న శ్రీ శారదాదేవి జన్మదినోత్సవము వైభవముగా జరిగినది. మఠాంగణమున శ్రీ శారదాదేవి చిత్రపటము మనోహరముగా నలంకృతమై ప్రీతి గొల్పుచుండగా ఉదయము 5 గంటలనుండి సంకీర్తనము ఉపనిషత్పఠనము భజనలు ప్రారంభమైనవి. 11 గంటవరకు విశేషపూజ హోమము నిర్వర్తింపబడినవి. తదనంతరము సమావిష్టులైన భక్తజనులకు ప్రసాదవితరణము జరిగినది. ఆ సాయంకాలము ఆరాత్రికానంతరము శ్రీచిద్ఘనానందస్వామివారు మాతృదేవి జీవితమున (తమిళము) కొంతభాగమును పఠించిరి. శ్రీమత్తపస్యానందస్వామివారు ఆంగ్లమున ప్రసంగించుచు మాతృదేవిని భగవదవతారమని పూజలు చేయుట మాత్రమేగాక మానవిగా ఆమె గడపిన జీవితమునుండి మనమెన్నియో పాఠములను నేర్చుకొనవలసియున్నదనిరి. ఆమె ప్రేమను సహనమును ఆధ్యాత్మిక జీవితమును పేర్కొనుచు తన్మయులై ప్రసంగించిరి.

ఆ వారమంతయు (14 నుండి 18 డిసెంబరు వరకు) సాయంకాలము తమిళమున శ్రీమద్రామాయణముపై ప్రసంగములు నిర్వహింపబడినవి.

19-12-76 ఆదివారమున బహిరంగోత్సవము నిర్వహింపబడినది. ఆ సాయంకాలము 3-30 నుండి 5-30 గంటలవరకు శ్రీ శారదాదేవి భజన మండలివారు భక్తిగీతములను పాడిరి. 5-30 నుండి శ్రీ మత్తపస్యానందస్వామి అధ్యక్షతను బహిరంగసమావేశము ప్రారంభమైనది.

అధ్యక్షుల పరిచయవాక్యముల అనంతరము శ్రీమతి రాధాసదాశివమ్‌గారు తమిళమున మనోహరముగ శ్రీ శారదాదేవి జీవితమును బోధలను క్రోడీకరించిరి. శ్రీమత్ అమృతానంద స్వామి ఆంగ్లమున ప్రసంగించుచు మన దేశమున మాతృపూజకుగల ముఖ్యస్థానమును వివరించిరి. శ్రీ శారదాదేవి జగన్మాతయగు ప్రేమమూర్తియనియు సర్వజనులును ఆమె వాత్సల్యమునకు పాత్రులేయనిరి. శ్రీరామకృష్ణులే స్వయముగ శ్రీ శారదేవియందు జగన్మాతను ప్రతిష్ఠించిరి. జనులను తరింపజేయుటకు వారే శ్రీ శారదాదేవిని నిలిపి చనిరి. ఉపన్యాసమును ముగించుచు మాతృదేవి యభయవాక్కులను ఇట్లు గుర్తుచేసిరి. "నీవేమి చేసినను నీకొక అమ్మ ఉన్నదని గుర్తుంచుకొనుము."

శ్రీమత్తపస్యానందస్వామి సమాపక వాక్యములను పలుకుచు మాతృదేవియొక్క దివ్యత్వము కంటె మానవత్వమే మిక్కిలి ప్రధానమైనదని పలికిరి. సాధారణముగ మాతృదేవిని గూర్చి ప్రసంగించునపుడు దుర్గ కాళి మొదలగు దేవతలతో తులనాత్మక విచారణము చేయుదురు. ఆ విధముగ దివ్యత్వమనగా ఏదోయొక శక్తిని మాహాత్మ్యమును చూపుటగా దిగజారిపోవును.

ఈ విధముగ ప్రేమ అను అంశమునుగూర్చి ఆలోచించుటమాని శక్తినిగూర్చియే మరిమరి చింతించుట ఏర్పడును.

మహాత్ముల జీవితములు వారి జీవితకాలమున అతి సామాన్యములుగ కన్పించును. మనకు ఆరాధ్యదైవమగు సీతాదేవియు అంతఃపురమునుండి అడవికి పోయెను. రాక్షసునిచే అపహరింపబడి అగ్ని పరీక్షకు గురియయ్యెను. తిరిగి వచ్చినపిమ్మట మరల ప్రవాసితురాలయ్యెను. ఆమె జీవితమున ఆమెకు గలిగిన సత్కారమట్టిది. ఆమె మహత్వమును గుర్తించుటకు కొన్ని యుగములు ఒక వాల్మీకియు కావలసివచ్చినది. సీతా హృదయమును ఆయనయే ప్రకటింపగలిగినాడు. కష్టములు దుఃఖములతో నిండిన సీతాదేవి జీవితము మానవవిలువలకు గనియైనది.

వారి యవతరణమున అట్టహాసము ఆర్భాటము ఏమియు నుండదు. అతిసామాన్యము గ తోచువారి జీవితమునందలి మాహాత్మ్యమును గుర్తించుటకు గొప్ప మానసికపరిణతి అవసరము. సాధారణులు వారి వైభవముతో కన్నులు చెదరి వారి విశిష్టతలను గుర్తింపలేరు. మాతృదేవి జీవితము ఆద్యంతము విశిష్టము. వైభవరహితము.

మాతృదేవి జీవితము సీతాదేవి జీవితమువలెనే దుఃఖభరితమైనది. సాంసారిక క్షోభలు మాతృదేవి జీవితముననే ఇంకను ప్రగాఢముగ కన్పించును. ఆమె అనుభవింపని బాధలు దుఃఖములు భరింపని అన్యాయవర్తనములు ఏవియు లేవు. ఈ సంఘటనలన్నింటిద్వారా ఆమె మాతృత్వము ప్రకటితమైనది.

ఆమె పొలములకు అన్నము తీసికొని పోయెను. తమ్ములను పెంచి పెద్దచేసెను. వడ్డువంచుట మొదలగు ఇంటిచాకిరీ అంతయు చేసెను. దుర్గ కాళి మొదలగువారివలెకాక మనయందరివలెనే ఇంటి భారమును మోసెను. ఆమె జీవితమంతయు ఒక నిరంతర సేవామయమగు తపము. శరీరము కార్యాచరణముసేవ అను ఆరాధనను చేయుచుండగా మనస్సు ధ్యానసమగ్నమై ఆరాధన చేయుచుండెను.

మాతృత్వపు ఔన్నత్యమును ప్రకటించుచు ఆమె ఎల్లప్పుడు తనపట్ల అపరాధములను సహించుచు క్షమించుచు తన పుత్రుల అల్పబుద్ధిని పొరపాటులను భరించెను. సమర్థులగు పుత్రులపైకంటె బలహీనులు నిస్సహాయులు అగు పుత్రులయందే ఆమెకు కనికరము మెండు. ఆమె వాత్సల్యమెంత నిస్సీమమనగా అమ్మా అని పిలిచిన ఎవనినిగాని ఆమె నిరాకరింపజాలదు. తాత్త్విక సిద్ధాంతమగు సర్వమానవ సమైక్యత మాతృవాత్సల్యముద్వారా శారదానందస్వామిని అంజద్‌ను సమానముగ చూచుటలో నిరూపితమైనది.

కాలము గడచుకొలది మాతృదేవి రూపచిత్రము వర్ధిల్లుచున్నది. భగవదవతారములు ఆవిధముగ వారి నిర్యాణానంతరమే పరిపూర్ణతకై ఎదుగుచుండును. వారి ఘనతను వాల్మీకి వ్యాసులవంటివారే చిత్రింపగలరు. నిజమగు ఆధ్యాత్మికతను వెదకువారికి ఆమె జీవితము నిజముగా అద్భుతము.

సమావేశము సమాప్తియైన పిదప ప్రసాద వితరణము జరిగినవి.



## వివేకానందసింహగర్జనము

శ్రీ చిరంతనానందస్వామి

భారతీయులను ధీరజనులను చేయుటకు శ్రీవివేకానందస్వామి యొసగిన యుద్బోధనలనుండి అమూల్యములు ఉత్తేజకరములు అగువచనములను పెక్కింటిని రచయిత సేకరించి యనువదించిరి. శరీరమును పులకింపజేసి మనస్సును లోగొను రచన.

పుటలు : 30 వెల : 20 పైసలు.

## సర్వం విష్ణుమయం జగత్

అనువాదకుడు :

శ్రీ చిరంతనానందస్వామి

శ్రీ వివేకానందస్వామి లండను నగరమున నొసగిన గాడ్ ఇన్ ఎవ్విరిథింగ్ అను ఉపన్యాసమున కిది యనువాదము. మతధర్మములపై స్వామి యుపన్యసించుచు మానవ జీవితోద్దేశమును జీవన విధానమును మనోహరముగ ఈశావాస్యోపనిషత్తుకు ధారాళ వ్యాఖ్యగ వివరించియున్నారు.

పుటలు : 36 వెల : 35 పైసలు.

## యువకులకు వివేకానందుల పిలుపు

అనువాదకులు :

బి. ఎస్. ఆర్. ఆంజనేయులు

నవభారతయువత నుద్బోధించుచు శ్రీ వివేకానందస్వామి యొనర్చిన యుపన్యాసములనుండి మేటి రత్నములను సేకరించి ఆంగ్లమున వివేకానంద స్పీక్స్ టు యంగ్ మెన్ అను పుస్తకము ప్రచురితమైనది దాని కిది యనువాదము. యువకులయందు ఆత్మవిశ్వాసమును దేశభక్తిని కార్యతత్పరతను ప్రోత్సహించు అమూల్య సంకలనము.

పుటలు : 56 వెల : 75 పైసలు.

ప్రథమ ముద్రణము.

## పారమార్థిక సంభాషణలు

అనువాదకులు :

కందుకూరు మల్లికార్జునంగారు

మాతృదేవి శ్రీ శారదాదేవి, శ్రీ బ్రహ్మానందస్వామి, శ్రీ ప్రేమానందస్వామి, శ్రీ తురీయానందస్వామి శ్రీ శివానందస్వామి శ్రీ శారదానందస్వామి అనెడి ఆర్గురు జ్ఞానసిద్ధుల అమూల్యములగు భాషణము లిందున్నవి. నిత్యనూతనములగు పారమార్థిక సమస్యలకు వారిచ్చు ఉపదేశములు ఆధ్యాత్మ సాధకుల కత్యంతము ఉపయోగకరములు.

పుటలు: 424 వెల : రూ. 6-50

ట్లు వ్రాయుడు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004

## తాపత్రయ చికిత్స

శ్రీ రామకృష్ణానందస్వామి

జిజ్ఞాసువులకు భక్తులకు ఆర్తులకు శ్రీ స్వామివారు అమృతవర్షము వంటి యుత్తరములు వ్రాసి యుండిరి. వాని యందలి విశేషాంశముల సంపుటీకరణమే తాపత్రయ చికిత్స. ప్రపంచము నందలి తాపత్రయ సంతప్తులకు ఈ చిన్ని పొత్తము శాంతి ప్రదమగుట నిస్సంశయము.

పుటలు: 64+VIII    వెల: రూ. 0–60

మూడవ ముద్రణము

## శ్రీరామకృష్ణ పరమహంస నీతికథారత్నములు

అనువాదకులు:

శ్రీ చిరంతనానందస్వామి

మనోహరములు చమత్కారములు తత్త్వార్థబోధకములు అగు శ్రీరామకృష్ణుల నీతి కథలలో విశిష్టమగువాని నెన్నుకొని విషయానుగుణముగ విభజించి యనువదించిరి. హృద్యమగు శైలి.

పుటలు: 84+VI    వెల: రూ. 2–50

నాలుగవ ముద్రణము

## నా జీవితము జీవనకార్యము

## శ్రీ వివేకానందస్వామి

అనువాదకులు:

శ్రీ కందుకూరి మల్లికార్జునం

భారతదేశ ప్రజలు లక్షలాదిగ వెతల పాలై కుందుచుండుటను చూచి ఆయన హృదయ మెట్లు రక్తాశ్రువులు కార్చుచుండెనో తన మాతృదేశమును మరల పూర్వ తేజోవైభవముతో దీపించునట్లు చేయుటకు ఆయన సంకల్పించిన మార్గ మెద్దియో ఇందు ప్రస్ఫుటముగ తెలియుచున్నది.

పుటలు: 61+ii    వెల: రూ. 1–25

(రెండవ ముద్రణము)

## శ్రీరామకృష్ణపరమహంస జీవిత సంగ్రహము

శ్రీ చిరంతనానందస్వామి

మహిమాన్వితమగు శ్రీ రామకృష్ణ పరమహంస జీవిత విశేషములు ఇందు రమణీయమగు శైలిలో వర్ణింపబడి యున్నవి. లోకమునకు శ్రీరామకృష్ణులు కావించిన యుపకారము వారి యుపదేశ సారముకూడ చక్కగా వివరింపబడినవి.

పుటలు: 48    వెల: రూ. 0–75

నాలుగవ ముద్రణము

ఇట్లు వ్రాయుడు:

మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 600004.

# మా తెలుగు ప్రచురణలు

శ్రీ రామకృష్ణులపై : రూ. పై.

శ్రీ రామకృష్ణ కథామృతము 8-00
(క్యాలికో) 12-00
శ్రీ రామకృష్ణ జీవిత చరిత్ర 10-00
,, (క్యాలికో) 14-00
శ్రీ రామకృష్ణ బోధామృతము 8-00
,, (క్యాలికో) 15-00
శ్రీరామకృష్ణోపనిషత్తు 3-75
శ్రీ రామకృష్ణ పరమహంస
నీతికథారత్నములు 2-50
గురూపదేశములు 2-00
శ్రీ రామకృష్ణ పరమహంస
జీవిత సంగ్రహము 0-75
నా గురుదేవుడు 1-25
శ్రీ రామకృష్ణ దివ్యవాణి 1-50

శ్రీ శారదాదేవిపై :

శ్రీ శారదాదేవి జీవిత చరిత్ర 4-00
శ్రీ శారదా ప్రసంగములు 3-00
శ్రీ శారదాదేవి 2-50

శ్రీ వివేకానందస్వామిపై :

శ్రీ వివేకానంద జీవిత చరిత్ర 4-00
బాలల వివేకానందుడు 2-00
శ్రీ వివేకానంద సంపూర్ణ గ్రంథావళి
10 సంపుటముల సెట్టు (సాదా) 65-00
,, ,, క్యాలికో 73-50
విడి సంపుటములు ఒక్కొక్కటిసాదా 5-00
,, ,, క్యాలికో 6-50
సందేశ తరంగిణి (మొదటి భాగము) 4-00
,, (రెండవ భాగము) 5-50
జ్ఞానయోగము (ముద్రణలో)

రూ. పై.

భక్తియోగము 4-00
రాజయోగము 6-25
కర్మయోగము 4-00
వివేక సూర్యోదయము 4-00
యువకులకు వివేకానందుల పిలుపు 0-75
శ్రీ వివేకానంద సింహగర్జనము 0-20
సర్వం విష్ణుమయం జగత్ 0-35
భారత యువజనులారా! 3-00
ప్రబోధ రత్నాకరము 2-50
శ్రీ వివేకానంద లేఖావళి
(మొదటి భాగము) 2-25
,, (రెండవ భాగము ముద్రణలో)
హిందూ మతము 4-00
అనుష్ఠాన వేదాంతము 2-50
ప్రాచ్యము, పాశ్చాత్యము 1-25
షికాగో నగరోపన్యాసములు 1-00
కులము, సంస్కృతి, సామ్యవాదము 3-00
భారతదేశము 2-00
భారతీయ మహిళ 2-00
నా సంస్కరణ యుద్ధ విధానము (ముద్రణలో)
నవీన భారతదేశము 0-40
పవహారి బాబా (ముద్రణలో)
నా జీవితము, జీవిత కార్యము 1-25
గురు, శిష్య సంవాదములు (ముద్రణలో)

శ్రీమద్భగవద్గీత :

శ్రీమద్భగవద్గీత 9-00
(టీకాతాత్పర్య విశేషార్థసహితము)
పారాయణగీత తాత్పర్యసహితము 3-75
మూలము 2-00

సంపాదకులు : శ్రీ చిద్ఘనానందస్వామి.

శ్రీ ఎమ్. బాలసుందరం గారిచే ఫ్రీడమ్ ప్రెస్. (మద్రాసు-600021) న ముద్రింపబడి,

శ్రీ చిద్ఘనానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మద్రాసు-600001) నుండి ప్రచురింపబడినది.

శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౩౪    ౧౯౭౭ - ఫిబ్రవరి : నల - మాఘము    సంచిక ౨

## విషయసూచిక

## శ్రీ వివేకానంద జీవితచరిత్ర

(శ్రీ చిరంతనానందస్వామి ప్రణీతము)

ఇందు శ్రీ స్వాములవారి జీవితమున నింతకుపూర్వము గ్రంథస్థములుగాని ముఖ్య సంఘటన లెన్నియో శ్రీవారి సోదర శిష్యులవలన విని వ్రాయబడినవి. ఇది శ్రీస్వాములవారి సంపూర్ణ చరిత్ర!

నిర్దుష్టమైన భాష, అందమైన అచ్చు, ఆకర్షకమైన రూపము.

432 పుటలు వెల : రూ. 4-00

(పదవ కూర్పు)

## శ్రీ శారదాదేవి జీవిత చరిత్ర

రచయిత :

శ్రీ చిరంతనానందస్వామివారు

శ్రీ రామకృష్ణభగవానుని సతీమణియు ఆదర్శమాతయు, యోగినియునగు మహనీయురాలి దివ్యచరిత్ర. ప్రతి స్త్రీయును పురుషుడును చదువవలసిన గ్రంథము. తియ్యని తెలుగు. పాలవంటి శైలి.

ఆఱవకూర్పు.

పుటలు : 246 వెల : రూ. 4-00

## బాలల వివేకానందుడు

బెంగాలీ మూలము :

శ్రీ నిరామయానందస్వామి

అనువాదకులు :

శ్రీ కరణం రంగనాథరావు

జగద్విఖ్యాతుడైన వివేకానందస్వామి జీవితచరిత్ర బాలబాలికలకు సులభముగా అర్థమగునట్లు రచింపబడినది. స్వామివారి బాల్యవిశేషములు శ్రీ రామకృష్ణుల సాంగత్యము పాశ్చాత్యదేశములకు పయనము మాతృదేశమున వారి కార్యక్రమము మనోహరముగ సంగ్రహింపబడినది.

పుటలు : 80+viii వెల : రూ. 2-00

(రెండవ ముద్రణము)

## శ్రీరామకృష్ణోపనిషత్తు

తమిళ రచయితలు :

శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్యులుగారు

ఆంధ్రానువాదకులు :

గౌ॥ న్యాయమూర్తి

శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు

శ్రీరామకృష్ణ దేవుని దివ్యోపదేశ వాక్యము లాధారముగాగొని, వానిని విరివి పఱచి, మనోహర కథా రూపముగను, సంభాషణరూపముగను అమర్చబడినది.

128 పుటలు వెల : రూ. 3-75

## బ్రహ్మానందబోధనలు

(ఆధ్యాత్మిక పరిప్రశ్నములు)

శ్రీ చిరంతనానందస్వామి

బ్రహ్మానందబోధనలు (శ్రీ బ్రహ్మానంద స్వామి జీవితోపదేశములు) అను గ్రంథము నుండి బ్రహ్మానందవాణి యను పేర ఇందు ఉపదేశములు మాత్రము సంగ్రహింపబడినవి. పాఠకుల సౌకర్యార్థము స్వామి సంగ్రహ చరిత్రయు చేర్పబడినది. స్వామి యుపదేశములు ఆధ్యాత్మికతత్త్వములను సాధనయందలి రహస్యములను అరటిపండొలిచి ఇచ్చినట్లు విశదీకరించును.

పుటలు : 272 + XXI వెల : రూ. 4-75

(ప్రథమ ముద్రణము)

## భక్తియోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఆధునికుల చిత్తము నాకర్షించురీతిని, అమోఘవచనములతో, విమర్శకదృష్టితో శాస్త్రప్రమాణములతో భక్తితత్త్వమును శ్రీ వివేకానందస్వాములవారిందు విపులముగా ప్రదర్శించియున్నారు. మూలగ్రంథములలోని ప్రమాణవచనములును వానికి టిప్పణములును సులభశైలియందు వ్రాయబడి యున్నవి.

(ఏడవ కూర్పు)

(121+4 పుటలు) వెల : రూ. 4-00

## కర్మయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు శ్రీ స్వాములవారు కర్మయోగతత్త్వమును అరటిపండొలిచినట్లు విశదీకరించియున్నారు. కర్మమెటుల మోక్షసాధనమో స్పష్టీకరించియున్నారు.

(అష్టమ ముద్రణము)

(146+8) పుటలు వెల : రూ. 4-00

## గురూపదేశములు

అనువాదకులు :

శ్రీచిరంతనానందస్వామి

శ్రీ గురుదేవుని మానసపుత్రుడనబరగిన శ్రీ బ్రహ్మానందస్వామి గురుముఖము నుండి వచ్చిన యుపదేశములను యథాతథముగ గ్రహించి వానియందు ముఖ్యములగు వానిని సంగ్రహించి యాంగ్లమున రచించిరి. వాని యనువాదమే ఈగ్రంథము. ఇందు గృహస్థులకు సాధకులకు వలయు సూక్తులెన్నియో వివరింపబడియున్నవి.

పుటలు : 168 వెల : రూ. 2-00

తొమ్మిదవ ముద్రణము

# మనవి

## రచయితలకు

1. జనరంజకమైన శైలిలో సంస్కృతి మతము తత్త్వ శాస్త్రములకు సంబంధించినవి ఉన్నత విలువలను గూర్చినవి అయిన రచనలు సంచికలో ప్రచురణార్థము పంపవచ్చు.

2. రచనలు సంచికలో మూడు లేక నాలుగు పేజీలకు మించకుండా ఉండాలి. ఇంకా పెద్దవైన రచనలు ప్రచురించడం సాధ్యం కాకపోవచ్చు.

3. తగినన్ని స్టాంపులు జతచేస్తే తప్ప, ప్రచురింపబడని రచనలు త్రిప్పి పంపబడవు.

4. సంతగించిన రచనలలోని అభిప్రాయాలకు సంపాదకులు బాధ్యత వహించరు.

5. ఆమూలాతములైన రచనల ప్రచురణలో కూడా తుది నిర్ణయం సంపాదకులది.

ఇతర వివరాలకు :

సంపాదకుడు
శ్రీరామకృష్ణప్రభ, P. B. 635
మైలాపూర్, మద్రాసు-4.

## చందాదారులకు

1. శ్రీరామకృష్ణప్రభ సంపుటం ప్రతి ఏటా జనవరి నుంచి ప్రారంభమౌతుంది. ఏమాసం నుండి అయినా చందాదారులు కావచ్చు.
2. చందాపైకం మనియార్డరు ద్వారాగాని క్రాస్డ్ పోస్టల్ ఆర్డర్, క్రాస్డ్ బాంకు డ్రాఫ్టుల ద్వారాగాని ('శ్రీరామకృష్ణ మఠము, మద్రాసు' అను పేరిట) పంపవచ్చును. మని యార్డరు కూపనులో అడ్రసు వివరాలు సరిగా వ్రాయాలి.
3. చందాదారులు ఉత్తర ప్రత్యుత్తరాలలో తమ చందాదారు సంఖ్యను ఉదాహరిస్తూ విలాసం స్పష్టంగా వ్రాయాలి.
4. మూడు నెలలకు మించిన అడ్రసు మార్పిడి ఆ ముందటి నెల మొదటి వారంలోగా తెలియజేయాలి.
5. సంచిక సాధారణంగా నెల ఆఖరి వారంలో అందుతుంది. అందకపోతే మరుసటి నెల మొదటి వారంలోగా తెలపాలి.
6. చందాదారులకు మా ప్రచురణలపై వెలలో 5% తగ్గింపు ఉంటుంది.

వివరాలకు :
మేనేజర్
శ్రీరామకృష్ణప్రభ, P. B. 635
మైలాపూర్, మద్రాసు-4.

## ప్రచురణకర్తలకు

శ్రీ రామకృష్ణప్రభలో మతతత్త్వశాస్త్ర సంస్కృతి విషయికములైన తెలుగు ప్రచురణలు సమీక్షింపబడుతాయి. సమీక్షకై రెండు ప్రతులు పంపవలసి ఉంటుంది.

-సంపాదకుడు.




'అఖిలవిభు శరణొందుమ, యా క్షణంబ యతనికృప నీదు ననుభూతి కందు వత్స'.

— శ్రీ శారదామణి

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౩౮ } ౧౯౭౭ – ఫిబ్రవరి : : నల – మాఘము సంచిక ౨

ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ!

## శ్రీరామకృష్ణ కర్ణామృతము

శుశ్రూషితే గురుపదే నియమః కిమర్థం
        తచ్ఛాసనే ష్వనుస్మృతేషు జపః కిమర్థమ్।
చేత్స్నాతి తద్రజసి తీర్థజలం కిమర్థం
        తద్భక్తి రస్తి యది మోక్ష సుఖం కిమర్థమ్॥

శ్రీగురుదేవుల పాదసేవ చేసినచో ఇక వేఱు నియమసాధన లేల? వారి యానతులు శిరసావహించినచో ఇక వేఱు జపములేల? వారి పాదధూళియందు స్నానము చేసినచో ఇక వేఱు తీర్థస్నానములేల? వారిపట్ల భక్తియే కుదిరినచో ఇక మోక్షసుఖమది యేల?

భక్తే స్తథా భగవతస్సమనుగ్రహస్య
        నైవావయన్తి సకలార్థవిదోఽపి హేతుమ్।
ఏతే క్వచిత్ సుకృతినోఽపి న సంలభన్తే
        దుష్కర్మిణోఽపి కుహచిత్తు సమాప్నువన్తి॥

నిజమగు భక్తిలాభమునకు భగవదనుగ్రహమునకు కారణములు సకలశాస్త్రముల నెఱిగిన విద్వాంసులకే తెలియవు. ఏలన కొన్ని పర్యాయములు సజ్జనులకుకూడ ఇవి లభింపవు. అంతియగాక దుర్జనులకు సైతము లభించుచుండును!



# శ్రీ రామకృష్ణస్మృతులు

'అట్లు నాకు పూర్ణాభిషేకమున[1] దీక్షనిచ్చి ప్రతిదినమును అసంఖ్యాకములైన తాంత్రిక సాధనలను బ్రాహ్మణి నాచే చేయించినది. ప్రస్తుతము నాకా సంగతులన్నియు అన్ని సమయములందును జ్ఞాపకము లేవు. కాని జగజ్జనని కృపవలన ప్రేమికుల పరమ సౌఖ్యమును నిశ్చల చిత్తముతో చూడగలిగిన రోజు గుర్తున్నది. అందు భగవంతుని ఆనందలీల తప్ప అన్యమును చూడలేదు. మనస్సు సాధారణమగు మానవభావముల పొంతకు దిగజారుటకుబదులు ఉన్నతోన్నతముగ నెగయుచు తుదిని గాఢ సమాధిలో లీనమయ్యెను. బాహ్యస్పృహ వచ్చినపిమ్మట బ్రాహ్మణి ఇట్లనుట వింటిని. "మిక్కిలి కష్టసాధ్యమగు నొక తాంత్రిక సాధన లక్ష్యమును నీ విప్పుడు అందుకొంటివి. భగవద్భావమున ప్రతిష్ఠితుడవైతివి." వీరభావమున చేయు పూజయందు ఇది చరమ సాధన.

'అల్పకాలము పిదప తాంత్రిక పద్ధతిలో నేను స్త్రీరూపమునకు పూజ చేసినపుడు అది ఇంకొక భైరవి సహాయముతో పగటిసమయమున ఎల్లర సమక్షమునందు దేవాలయపు నాటమందిరమున చేసితిని. అది పూర్తియైన పిమ్మట శాస్త్ర విధిననుసరించి ఆమెకు నమస్కరించితిని. నేను ఆ విధమున పూర్తిచేసిన వీరభావమున పూజకు సంబంధించినవానిలో అది ఆఖరి విధి. అందరు స్త్రీలయందును నా మనోభావము, శిశువునకు తల్లిపట్లనుండు భావము, ఆ సుదీర్ఘ తాంత్రిక సాధనకాలమున చెక్కుచెదరక యుండినట్లే ఆ సమయమున నెన్నడును ఒక చుక్క మద్యమునను నేను స్వీకరింపజాలకుంటిని. కారణ[2] మను పేరు ఉచ్చరించినంతనే అది నాయందు జగత్కారణ సాక్షాత్కారమును ప్రబోధింపగా నేను పూర్తిగా దానియందు లీనుడ నయ్యెడివాడను. అట్లే అట్టి ఇతరములగు మాటలను వినినంతనే జగత్కారణము నా ఎదుట ప్రత్యక్షమయ్యెడిది, నేను సమాధిగతుడ నయ్యెడివాడను.'

* * *

'ఏ [తాంత్రిక] సాధనయందుగాని సిద్ధిని పొందుటకు నాకు మూడు దినములకంటె ఎక్కువ కాలము పట్టలేదు. ఏదైన నొక సాధన నెత్తుకొనినపుడు హృదయపూర్వకమగు ఉత్కంఠతో ఆ సాధన ఫలిత సాక్షాత్కారమునకై దివ్యజననిని మరి మరి ప్రార్థింపగా ఆమె అనుగ్రహించి మూడు దినములలోనే విజయము నొసగెడిది.'

* * *

['మీరేల ఆధ్యాత్మిక సాధనలు చేయవలసి వచ్చెనని యొక భక్తుడడిగెను.] 'శివుని భర్తగా పడయుటకు దివ్యజననికూడ కఠోరమగు సాధనలను చేయవలసెను. ఆమె పంచతప మాచరించెను. చలికాలమున నీటియందు మునిగి సూర్యుని తదేకదృష్టితో చూచును. సాక్షాత్ శ్రీకృష్ణుడే ఎంతయో సాధన చేయవలసెను. నాకెన్నియో యౌగిక అనుభవములు కలిగినవి. వాని విషయములను నేను వివరింపజాలను. బిల్వ వృక్షముక్రింద నా కెన్నియో ఉజ్జ్వలమైన దివ్యదర్శనములు కలిగినవి. అచ్చట నేను తంత్రములలో చెప్పబడిన వివిధ సాధనలను అభ్యసించితిని, నాకు మానవకపాలములు మొదలగు వస్తువు లెన్నియో కావలసెను. నాకై బ్రాహ్మణి ఈ వస్తువులనన్నింటిని సేకరించెడిది. ఎన్నియో యౌగిక ఆసనములను నే నభ్యసించితిని.'

* * *

'బిల్వవృక్షముక్రింద నేను తాంత్రిక సాధనల నభ్యసించితిని. ఆ సమయమున పావన తు

1. తాంత్రిక సాధనలయందు సంపూర్ణదీక్ష.
2. వంగభాషయందు 'కారణ' శబ్దమునకు కారణమనియు మద్యమనియు రెండర్థములు.

కిని ఇతరములగు మొక్కలకును ఏ భేదమును నేను చూడజాలకుంటిని. ఆ స్థితిలో నేను కొన్ని సార్లు నక్కల ఉచ్ఛిష్టమును[3] తింటిని. రాత్రియంతయు బయటనుంచిన ఆహారమును తింటిని. అందులో కొంతభాగమును పాములు తదితర ప్రాణులు తినియుండవచ్చును. అవును. అట్టి వస్తువులను నేను తింటిని,

'కొన్ని పర్యాయములు నేను కుక్కపై సవారి చేసితిని దానికి లూచీలు తినిపించుచు అందులో కొంత నేనును తినెడివాడను. ప్రపంచమంతయు భగవంతునిచేతనే నింపబడియున్నదని నేను గుర్తించితిని. అజ్ఞానమును నశింపజేయక ఆధ్యాత్మిక సాక్షాత్కారము లభింపదు. కనుక నేను వ్యాఘ్రభావమును వహించి అజ్ఞానమును మ్రింగివేయుదును.'

*　　*　　*

'నేను మొదట ఈ మహోన్నత స్థితి నందు కొనినపుడు నాకు కాళీమాతను పూజించుటగాని నైవేద్యమును సమర్పించుటగాని సాధ్యము కాకుండెడిది. ఈ విషయమై దేవాలయాధికారి నన్ను దూషించెనని హలధారియు హృదయుడును నాతో చెప్పిరి. కాని నేను నవ్వి యూరకుంటిని. నాకెంతమాత్రమును కోపము రాలేదు.

3. కొన్ని తాంత్రిక పూజలందు కాళి సహచరులగు నక్కలకు ఆహారము నివేదింతురు.

# జ్ఞానము

ప్రకాశముచేత తప్ప వస్తువులు కనిపింపనట్లు సమ్యగ్విచారముచే తప్ప జ్ఞానము లభింపదు.

అజ్ఞానమునందు సర్వమును సృష్టింపబడుచున్నది. జ్ఞానోదయమున సర్వమును ప్రళయము నొందుచున్నది.

అద్దమువలె మనస్సు పరిశుద్ధమైనపుడు జ్ఞానము అందు ప్రస్ఫుటమగుచున్నది. కనుక మనస్సును పరిశుద్ధము చేయుటయందు శ్రద్ధ వహింపవలెను.

నిరంతరము శ్రద్ధాయుతము అగు అభ్యాసముచే జ్ఞానము అజ్ఞాన కలుషితమైన జీవాత్మను పరిశుద్ధపరచి పిదప తానును అదృశ్యమగుచున్నది. కటకచూర్ణము బురదనీటిని పరిశుద్ధపరచి పిదప తానును అదృశ్యమగునుకదా.

రాగద్వేషాదులతో నిండియున్న ఈ ప్రపంచము స్వప్నమువంటిది. మానవుడు అజ్ఞానమున నున్నంతకాలము అది యథార్థమువలె తోచును. జ్ఞానోదయము కాగనే ఆ ప్రపంచము మిథ్యయగును.

నిరంతర ధ్యానమనెడు కాష్ఠమథనముచే జ్ఞానజ్వాల రగులును. అజ్ఞానమనెడు ఇంధనము నది సంపూర్ణముగ దహించును.

తత్త్వ సాక్షాత్కారమువలన కలుగు జ్ఞానము, దిక్కును గూర్చిన భ్రమను సూర్యుడు తొలగించునట్లు, అహంకార మమకార లక్షణయుతమగు అజ్ఞానమును తత్క్షణమే నశింపజేయును.

ప్రభాప్రసారము
(సంపాదకీయము)



# భక్తశరణ్యుడు

"ఆధ్యాత్మికుడవుగ నుండుము. తత్త్వమును నీవే సాక్షాత్కరించుకొనుము" అనునదే మానవతకు నా గురుదేవుని సందేశము. నీ సోదరమానవుని కొరకై త్యాగము చేయుదువని ఆయన అభిలాష. నీ సోదరునిపై నీకు గల ప్రేమనుగూర్చి మాటలు పోగులుపెట్టుట చాలించి ఆమాటలను రుజువు చేయుటకై ప్రయత్నింతువని ఆయన అభిలాష. త్యాగమునకు సమయము వచ్చినది. సాక్షాత్కారమునకు సమయము వచ్చినది. ఇక ప్రపంచమునందలి అన్ని మతములయందును సామరస్యమును చూడగలవు. కీచులాటలు అనావశ్యకములని తెలియగలవు. అప్పుడు మాత్రమే నీవు మానవతకు సహాయము చేయుటకు సిద్ధముగ నుండగలవు. అన్ని మతములయందును అంతఃసూత్రమైన ఏకత్వమును ప్రకటించి స్పష్టము చేయుటయే నా గురుదేవుని జన్మకారణము. ఇతర గురువు లందరును వారి వారి పేరులు గల ప్రత్యేక మతములను బోధించిరి. కాని ఈ పందొమ్మిదవ శతాబ్దపు గురువరేణ్యుడు తన ఘనత ఏమియు చెప్పుకొనలేదు. ఏమతమును కాని కొంచెపరుపక అన్నింటిని అతడట్లే నిలిపెను. ఏల? నిజమున కవి యన్నియును ఒకే యొక సనాతన ధర్మమునందలి యంగములే యని గుర్తించినాడు కనుక. స్వీయ అనుభవముచేత అన్ని మతములకును గమ్యము ఒకటే అనియు, ప్రతి మతమును ఒక విషయమునే బోధించుటకు ప్రయత్నించుచున్నదనియు, భేదమంతయు చాలవరకు రీతిలో ననియు ఇనుమిక్కిలి భాషలోనే ననియు ఆయన తెలిసికొనినాడు. మౌలికముగ అన్ని మతములకు అన్ని శాఖలకు గమ్యము ఒక్కటియే.

—శ్రీ వివేకానందస్వామి.

శ్రీరామకృష్ణుడు భక్తశరణ్యు డనునపుడు భ ప్రత్యేకముగ నిర్వచనము నీయవలసి యున్నది. ‘స్వస్వరూపానుసంధానమ్ భక్తిరిత్యభిధీయతే’ అని శ్రీశంకరులును ‘సాత్వస్మిన్ పరమప్రేమరూపా’ యని నారదులవారును సాంప్రదాయికజ్ఞానభక్తిమార్గములలో నిర్వచనముల నిచ్చిరి. ఆ రెండింటి యుద్దేశమును ఒకటియే యని సమర్థించు పండితులున్నను సాధారణ జనులకు వానిలో వైవిధ్యము భాసింపకమానదు. కనుక భగవంతుని రూపముననో పరబ్రహ్మము రూపముననో ఆ పరతత్త్వమును అనుభవగతము చేసికొనవలెనను ప్రగాఢవాంఛయే భక్తి యనినచో శ్రీరామకృష్ణునిపట్ల భక్తికి సరియగు అర్థము కుదురును.

ఇక భక్తులను పదముకూడ కేవలము హిందువులకు మాత్రమేగాక అట్టి వాంఛగల సకల మానవులకును వర్తించును. భగవదనుభవమును సిద్ధాంతరీత్యా అంగీకరింపని క్రైస్తవాది మతములున్నను వానిలోకూడ సెయింట్ థెరెసా సెయింట్ ఫ్రాన్సిస్ బ్రదర్ లారెన్స్ మొదలగు వారందరును భగవదనుభూతిని పొంది దానిని బోధించినవారే. సిద్ధాంతము ప్రకారము, క్రీస్తు మాత్రమే ఏకైక ఉద్ధారకుడని యంగీకరించి చర్చికి నియమిత పర్యాయములు పోవుచు నియమిత ధనమిచ్చుచు నియమిత కర్మల నాచరించినచో అతడు ఆదర్శప్రాయుడైన క్రైస్తవుడు. ఇట్లు నియమావళి అనుష్ఠానము, హృద్గతమైన ఆరనికోరిక అను రెండు విభాగములు ప్రతి మతమునందును

మనకు కల్పించును. కొన్ని మతములు అనుష్ఠానమునే పరమార్థముగా చేసివేయగా తదితరములు అనుష్ఠానమును భగవద్వాంఛకు ద్రోహదముగా స్వీకరించును. మతమనగా తత్త్వసాక్షాత్కారమే యను శ్రీ వివేకానందస్వామి నిర్వచనము నంగీకరించినచో ఇక భగవద్భక్తులకు క్రైస్తవ మహమ్మదీయ హైందవాది విభేదములు నిలువవు, యావత్ప్రపంచమున గల ఇట్టి భక్తులకే శ్రీరామకృష్ణుడు సర్వశరణ్యుడగుచున్నాడు.

వాంఛ ఎల్లరకును సమానమే యైనను ఆయా మతములు వాని వాని గమ్యములను లువిధములుగా వర్ణించుచుండగా వానిమధ్య సామరస్య మెట్లేర్పడునను సంశయము సమంజసమే. పరిశీలించి చూచినచో, మతస్థాపకులు తమ యనుభవమును వెలిబుచ్చుటలో సిద్ధాంతము లేర్పడినవి. ఈ సిద్ధాంతములను అనుభవము ద్వారా సర్వదా నిరూపించుకొనగలుగు అనుయాయులసంఖ్య క్రమముగా తగ్గిపోవుటచేత సిద్ధాంతములకు కాలక్రమమున పాచిపట్టి ఆ పాచియే పరమార్థమని వాదులాడువరకును దిగజారును. మతములమధ్య వివాదములను పరిశీలించినచో కేవలము గ్రంథ పాండిత్యముచేతనే అగ్రేసరులై భగవద్దర్శనమునకు కనీసపు టర్హతలైన క్షమ సహనము దయ సానుభూతి మొదలగు లక్షణములు లేనివారే వాది ప్రతివాదులగుటను గమనింపగలము. వారిలో ఏ ఒక్కరికైనను నిజమగు భగవత్సాక్షాత్కారము కలిగినచో ఇతరులు అవశ్యము దానిని గుర్తింపగలరనుటకు సంశయింప పనిలేదు. చారిత్రికముగ కూడ శ్రీమద్రామానుజులు యజ్ఞకీర్తితో శాస్త్రవాదము చేసిన ఘట్టము దీని కుదాహరణము. ఇరువదియొక్క దినములు వాదించియు శ్రీమద్రామానుజులు పండితుడగు యజ్ఞకీర్తి అద్వైతమును భంజింపలేకపోయెను. కడపటిరాత్రి దుఃఖముతో తన భగవంతుని ప్రార్థించి మరునాడు వాదార్థమైరాగా యజ్ఞకీర్తి వారి తేజమును గాంచి తత్త్వమును దర్శించు ప్రయత్నమును మాని ఇన్నాళ్లును నిరర్థక గ్రంథాలోడనముతో వ్యర్థము చేసితినని పరితపించుచు వారికి పాదాక్రాంతుడయ్యెను. ఇట్లు భగవదనుభవమును పొందిన మతస్థాపకు లిరువురు కలసినచో వారేమిచేయుదురనుట మనకు ఊహగనే మిగులును. ఈ విషయముననే శ్రీరామకృష్ణుని విశిష్టత సర్వశరణ్యత మనకు స్పష్టముకూడ అగును.

శ్రీరామకృష్ణుడు భగవత్సాక్షాత్కారమునకు గాఢమగువాంఛ తప్ప వేరొక 'అధికారము' అక్కరలేదని తమ జీవితమున ప్రథమాధ్యాయమున నిరూపించెను. ఆయనకు ప్రప్రథమమున మాతృదర్శన మగువరకును ఏ గురు సహాయముకాక తన హృదయపు టారాటమే ఆలంబనమైనది. కేవలము దాని ఫలితముగనే ఆయన భవతారిణి సాక్షాత్కారమును పొందగలిగెను. ఆ పిదపనే భైరవి బ్రాహ్మణి తోతాపురి మొదలగు 'గురువు' లందరును వచ్చి ఆయా మార్గములను ఆయనకు బోధించి వారివద్ద తమ చివరి పాఠములను నేర్చుకొని పోయిరి. ఈ విషయమును గమనించినచో వివిధ మతస్థాపకులు ఒకచోట సమావేశమైన ఫలితమే శ్రీరామకృష్ణుడు సకల మతములను అభ్యసించుటద్వారా కలిగినదనుట విశదమగును. భైరవి బ్రాహ్మణికి గల అద్వైతాసహనమును తానే గొప్ప భక్తురాలననెడు దుర్గర్వమును ఆయన ప్రత్యక్షముగనో పరోక్షముగనో మాన్పెను. అట్లే తోతాపురికి ద్వైతభావమునందుగల అపహాస్యదృష్టిని పోగొట్టెను. ఆ విధముగనే క్రైస్తవుల మహమ్మదీయుల మతములనుకూడ అభ్యసించి వాని తాత్త్విక సత్యమునుకూడ ప్రకటం

చెను. కర్తాభజులవంటి సంశయాస్పదమార్గము కూడ గమ్యమును చేర్చగలదని ఆయన కనుగొని ఎందరు మానవులో అన్ని మార్గములని తన మతమును స్థాపించెను.

ఇట్లు ఆయన మతస్థాపనవలన ఇతర మతములన్నియు ఉన్మూలితములు కాలేదు. పైగా అవియన్నియు పునః సుస్థిరముగ ప్రతిష్ఠింపబడినవి. ఎవరైనను తమ మతమునందు విశ్వాసమును కోల్పోవనక్కఱలేదు. అన్ని మతముల సత్యత్వమును శ్రీరామకృష్ణులు తమ యాచరణద్వారా ప్రతిష్ఠించియున్నారు. ఏ మతము నవలంబించువారికైనను ప్రోత్సాహకుడు మార్గదర్శకుడు సంశయనివారకుడునై శ్రీరామకృష్ణుడు వెలసియున్నాడు. ఆ దృష్టితో ఆయన శ్రద్ధాళువులగు ఏ మతావలంబులకైనను గురువగుచున్నాడు. తన బోధనలను తన జీవితమున ఆచరించువాడేకదా నిజమైన గురువు?

శ్రీరామకృష్ణుడను నొకవ్యక్తి, వ్యక్తమగు తత్త్వమునే గుర్తింపని జ్ఞానులకు విభిన్న దైవతముల నంగీకరించు వివిధభక్తులకు గురువులనే అంగీకరింపని ఇతర మతములకును గురుడు అనుట అసంగత వాక్యముగా తోపవచ్చును. కాని ఆయన జీవితమే ప్రత్యక్షప్రమాణముగ ఎదుటనుండగా దానిగురించి ఊహాపోహలు సిద్ధాంత రాద్ధాంతములు చేయుటయే అసంగతమైన విషయము. ఆయన పోషకులలో మొదటివాడగు మథురనాథుడు ఆయనను శివునిగా కాళీమాతగా దర్శించెను. భైరవీబ్రాహ్మణి ఆయననుతన ఇష్టదేవతయగు రామచంద్రునిగా దర్శిచెను. వైష్ణవచరణుడు భగవదవతారముగ నంగీకరించెను. గౌరీకాంత తర్కభూషణుడు అవతారములకు మూలమగు పరతత్త్వమే శ్రీరామకృష్ణుడనెను. అఘోరమణీదేవి ఆయనను బాలగోపాలునిగ సాక్షాత్కరించుకొనెను. ఇట్లు ఆయనయందు తమ తమ ఇష్టదైవములను దర్శించిన భక్తుల జ్ఞానులగూర్చి వ్రాయవలసినచో వారిజీవితమును మరల వ్రాయవలసియుండును. కనుక శ్రీరామకృష్ణుడు యావత్ప్రపంచమునకును ఆశ్రయుడు అని చెప్పుట స్వభావోక్తియే యగును. దేశాంతరములందు సైతము వివిధ మతావలంబులు శ్రీరామకృష్ణుల బోధలను గుర్తించి తదనుగుణముగ తమ జీవితములను దిద్దుకొనుటయు శ్రీరామకృష్ణుని విశ్వజనీతకు తార్కాణమగుచున్నది.

ఇది ఇట్లుండ ప్రపంచమున నింకను మత విభేదములు కలహములు అశాంతియుండుట కేమి కారణమనిన మతములపట్ల చిరకాలముగ నేర్పడిన భ్రాంతి తొలగకుండుటయే. ఆచారములే మతలక్ష్యమని దృఢముగ విశ్వసించువారు అనేకులు. భగవత్సాక్షాత్కారమును మతలక్ష్యముగ నంగీకరించి దానిని సాధింప ప్రయత్నించు మానవులసంఖ్య యధికమగుకొలది సర్వమత సాక్షాత్కారములను సాధించున శ్రీరామకృష్ణుడు ఇతోధికముగ ప్రపంచమున గురుత్వము వహింపవలసి వచ్చును.

ఆ కారణముననే అనాదికాలమునుండియు మతమనిన సాక్షాత్కారమే యని తెలిసిన భారతీయులు శ్రీరామకృష్ణు నాశ్రయించి త్వరితగతిని తాము జన్మసాఫల్యమును బడసి ఇతరులకుత్సాహజనకులు కావలసియున్నది. తన జీవితముననే ఎల్లరకును అనుసరణీయముగ జీవించిన శ్రీరామచంద్రుడును, యే యథామాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్ అని అభయమిచ్చిన శ్రీకృష్ణుడును కలసి శ్రీరామకృష్ణుడుగ ఈ పర్యాయము విచ్చేసిరనిన ఆయన సర్వభక్తశరణ్యుడనుటలో సంశయమేమున్నది!

---

# మాతృదేవిచరణసన్నిధి

ఆంగ్ల గ్రంథము:
ఎట్ ది హోలీమదర్స్ ఫీట్

అనువాదము:
పి. గణపతిశాస్త్రి

(గతసంచిక తరువాయి)

ఉద్బోధనకార్యాలయము, ప్రార్థనమందిరము:

పూజకోసం మాతృదేవి బిల్వదళాలు పూలు మొదలయినవి సేకరిస్తున్న సమయమది. నేనా తరుణంలో ఆమె ఫోటో కొత్తకాపీ ఒకటి చూపించి "దీనిలో మీ పోలిక బాగా వచ్చిందా అమ్మా" అని అడిగాను.

అమ్మ: అవును, పోలిక బాగానే వచ్చింది. కానీ నేనంతకుమునుపు బాగా పుష్టిగా ఉండేదాన్ని. ఈ ఫోటో తీసినప్పుడు జోగేన్‌కి (యోగానందస్వామి) ఎంతో జబ్బుగా ఉంది. అందువల్ల ఆ దిగులుతో నేను చాలా సన్నబడ్డాను. ఆసమయంలో నేనెంతయినా వేదన పాలయ్యాను. జోగేన్ పరిస్థితి తిన్నబడగానే నాఆరోగ్య పరిస్థితికూడా బాగుపడింది. కాని అతని పరిస్థితి దిగజారగానే ఎంతో దుఃఖించాను. విదేశీయ మహిళ సారాబుల్ ఈ ఫోటో తీసింది. నేను మొట్టమొదట ఫోటో తియ్యడానికి అంగీకరించలేదు. కాని ఆమె కాదు కూడదని బలవంతం చేసింది. "అమ్మా, నేనిది అమెరికా తీసుకువెళ్లి పూజచేసుకుంటాను" అని అర్థించింది. చిట్టచివరికి ఆమే ఈ ఫోటో తీసింది."

"మీదగ్గరఉన్న ఈ శ్రీరామకృష్ణుల ఫోటో చాలా మంచిది. దానినిబట్టి ఆయన ఎలాగుండేవారో గ్రహించుకోవచ్చును. దానిలో ఆయన పోలిక బాగావచ్చిందా?" నే నడిగాను. దానిమీద మాతృదేవి అన్నారు.

"అది చాలా మంచిఫోటో. అది ఒక బ్రాహ్మణునిది. దానినిబట్టి మరికొన్ని కాపీలు తీశారు. ఒక కాపీ ఆయనదగ్గరకూడా ఉన్నది. అది కాళీమాత మూర్తిలాగ చాలా నల్లగా ఉంది. కనక అది తిరిగి ఆ బ్రాహ్మణుని కిచ్చివేశారు. ఆయన దక్షిణేశ్వరంనించి వెళ్లిపోతూ అది నాదగ్గిర దిగవిడిచారు. దానిని మిగిలిన దేవతల చిత్తరువుల దగ్గిరఉంచి పూజచేస్తూండేదాన్ని. నే నప్పుడు నహబత్ కిందిగదిలో నివసించేదాన్ని. ఠాకూరు ఒకనాడు అక్కడికి వచ్చి ఆ ఫోటో కేసి చూసి "ఇదంతా ఏమిటి" అని ప్రశ్నించారు. నహబత్ కిందిగదిలో అవతలివైపున మెట్ల కిందిభాగంలో మేమప్పుడు వంటచేసేవాళ్లము. ఆతరవాత ఒకనాడు బిల్వదళాలు పుష్పాలు సేకరించి ఠాకూరు ఆ ఫోటోముందుంచి పూజచేశారు. ఆ ఫోటో అదే! ఆ బ్రాహ్మణుడు మళ్లీ తిరిగి రాలేదు. అందుచేత అది నాదగ్గిరే ఉండిపోయింది."

"అమ్మా, ఠాకూరు సమాధిలో ఉన్నప్పుడు ఆయనముఖంలో ఎన్నడయినా దుఃఖం పొడకట్టిందా?" నే నడిగాను.

"లేదు! ఆయనముఖంలో ఎన్నడూ విషాదచ్ఛాయకూడా గోచరించలేదు! సమాధిలో ఎల్లప్పుడు ఠాకూరు వదనంలో చిరునవ్వు తరళించేది."

నేను: "ఠాకూరు భావసమాధిలో ఉన్నప్పుడు ఆయన పెదవులమీద చిరునవ్వు చెంగలించి ఉండవచ్చును. అయితే తాము కూర్చుని ఉన్నప్పుడు తీసిన ఫోటోనుగురించి ప్రసంగిస్తూ ఆయన అది అత్యున్నతమయిన ఆధ్యాత్మికస్థితిలో ఉన్నప్పుడు తీసినదని అన్నారు. అప్పుడుకూడా ఠాకూరుముఖంలో దరస్మితం రేకెత్తిందా?"

అమ్మ: "సమాధిస్థితిలో ఎల్లవేళలా ఠాకూరు ముఖంలో చిరునవ్వుమాత్రమే నేను గమనించాను."

నేను: "శ్రీరామకృష్ణుల శరీరచ్ఛాయ ఎలాగుండేది?"

అమ్మ: "హరిదళంలా పచ్చగా ఉండేది. ఆయన సదా ధరించే బంగారుకవచంచాయతో శరీరచ్ఛాయ మేళవించేది. నేను ఠాకూరు శరీరానికి నూనె రాసినప్పుడు పచ్చనికాంతి పైపైకి ప్రజ్వలిస్తూ ఉండేది. ఒకప్పుడు పచ్చని వ్యక్తి ఒకాయన కాళీదేవాలయానికివచ్చారు. అప్పుడు ఠాకూరు నాతో 'మేమిద్దరము పంచవటిలో పచారు చేస్తూంటే గమనించి ఎవరివన్నె ఎక్కువ పచ్చగా ఉన్నదో నిర్ణయించి చెప్పాలి' అన్నారు.

"అలాగే ఆ ఇద్దరు [పచా]రు చేస్తూంటే గమనించాను. ఆయన వన్నెకన్న ఆ రెండవవ్యక్తి శరీరచ్ఛాయే చూపువాసి పచ్చగా ఉన్నట్లు నాకనిపించింది. ఆ వన్నెలో రవంత ఎక్కువ తేడా మాత్రమే కనిపించింది. అంతే!"

'ఠాకూరు ఎప్పుడు కాళీదేవాలయానికి వెళ్లినా జనం కన్నార్పకుండా ఆయనవైపే చూస్తూ 'అదిగో, ఆయన వెడుతున్నారు!' అంటూ ఆశ్చర్యపడుతూండేవారు.

"ఠాకూరు లావుగా ఉండేవారు. మథురబాబు ఆయన కూర్చోవడానికి పెద్దపీట ఇచ్చారు. భోజనం సమయంలో ఆయన దానిమీద కూర్చున్నప్పుడు అది తగినంత పెద్దదిగా కనిపించేది కాదు. ఆయన అంగవస్త్రం కట్టుకుని గంగలో స్నానానికి వెడుతున్నప్పుడు జనం విస్తుపోయి చూస్తూండేవారు.

"అంతేకాదు. ఠాకూరు విచారంగా ఉండగా నేనెన్నడూ చూడలేదు. పిన్నలతోను పెద్దలతోను ఆయన ఎంతో ఉల్లాసంగా కాలం గడుపుతూ ఉండేవారు. కామార్పుకూరులో ఉన్నప్పుడు ఆయన పొద్దున్నే లేచి 'నాకు ఆ యా కాయగూరల వంటకాలు తినాలనిపిస్తూంది. అవి ఈవేళ వండాలి' అని అంటూండేవారు. నేను లక్ష్మీతల్లి కలిసి అవి అన్నీ సిద్ధం చేస్తూండేవాళ్లము. మరికొన్నాళ్లు గడిచిన తరవాత ఆయనే తిరిగి అన్నారు.

'ఇదేమిటి నేనిలాగయిపోయాను! పొద్దున్న లేచీ లేవగానే తిండిమీదే దృష్టి! ఛీ, ఛీ! ఎంతటి సిగ్గుచేటు!'' ఆపైన నన్నొకనాడు పిలిచి 'ఈ వేళనించీ నాకోసం ప్రత్యేకించి ఏమీ వండనక్కరలేదు. నీవు ఏది వండితే ఏది వడ్డిస్తే అదే తింటాను' అన్నారు.

"దక్షిణేశ్వరంలో ఉన్నప్పుడు ఆయన ఎప్పుడూ గ్రహణితో బాధపడుతూండేవారు. అందుకే ఆరోగ్యం బాగుపడడంకోసం ఇంటికి వెడుతూండేవారు. ఆతరువాత తరుచు అనారోగ్యం వల్ల ఆయనకు తమశరీరంమీదే ఏహ్యాభావ కలిగింది. ఆపైన దానిమాటే ఎన్నడూ పట్టించుకోలేదాయన.

"ఈనాడు ఆయన శిష్యులు కోకొల్లలు. ఎక్కడచూసినా ఠాకూరు శిష్యులే! ఆరోజుల్లో ఒకప్పుడు వారికి చాలా సుస్తీ చేసింది. ఆ తరుణంలో ఇరవైరూపాయలు చందా ఇవ్వవలిసి వస్తుందని ఒకశిష్యుడు ఆయనదగ్గిరికి రాకుండా వెళ్లిపోయాడు.

"ఇప్పుడు ఠాకూరుసేవకంత ఇబ్బంది ఏదీ లేదు! ఆయనకిప్పుడు అందరూ నైవేద్యం సమర్పిస్తారు. కాని అదంతా తామే ఆరగిస్తారు. ఆయనకిప్పుడు సుఖాసనం సమర్పిస్తే అక్కడే కూర్చుండిపోతారు. శయ్యమీద పవ్వళింపజేస్తే అక్కడే ఉండిపోతారు. ఇప్పుడు ఠాకూరు ఒక చిత్తరువే కదా!

"ఆయన బలరామబాబును మొట్టమొదట కాళీమాత విగ్రహం ప్రక్కనే సందర్శించారు. బాబు శిరస్సుమీద తలపాగా, ఆయన చేతులు రెండూ జోడించి నిలుచున్నారు. ఆయన ఆకృతి ధోరణి ఎప్పుడూ అంతే! బలరామబాబు ఎన్నడూ ఠాకూరు పాదాలు స్పృశించలేదు. ఆయన వైఖరి అవగాహన చేసుకుని 'బలరామ్! నాకాళ్లు

నొప్పి పెడుతున్నదయ్యా! కాస్త పట్టు!' అని అంటూండేవారు. కాని బలరామ్ వెంటనే నరేన్ గాని రాఖాల్ గాని ఇంకెవరయినా దగ్గిల్లో ఉంటే వారిని పిలిచి 'ఇదిగో, ఠాకూరు కాళ్లు పట్టు. నొప్పితో బాధపడుతున్నారు' అని ప్రోత్సహించేవాడు.''

''నేనొకప్పుడు మహారాజ్‌ను (శ్రీ బ్రహ్మానందస్వామి) శ్రీరామకృష్ణుల శరీరచ్ఛాయ సంగతి అడిగాను. 'ఆయన మాలాగే ఉండేవారు' అన్నారు ఆయన'' అన్నాను నేను.

అమ్మ: ''వాళ్లు చూసినప్పుడు ఆయన అలాగే ఉండి ఉండవచ్చును. అప్పటికి ఆయన పూర్వపు ఆరోగ్యము శరీరం వన్నె బాగా మారిపోయాయి...

''నేను దక్షిణేశ్వరంలో ఉన్నప్పుడు గుమ్మం దాటి ఎప్పుడూ వీధిలో అడుగుపెట్టలేదు. ఆలయంలో గుమాస్తా 'ఆమె ఇక్కడే ఉంటున్నారని విన్నాను. కానీ నేనెన్నడూ చూడనేలేదు' అంటూండేవారు.

''ఒక్కొక్కప్పుడు రెండు నెలలదాకా నాకు ఠాకూరు దర్శనమే లభించేదికాదు 'ప్రతిదినమూ ఆయన దర్శనభాగ్యానికి నీ వేమి పుణ్యం చేసుకున్నావు?' అని అనుకుంటూ నన్ను నేనే సమాధాన పరుచుకునేదాన్ని. గంటల తరబడి నిలబడి మాగది తడకల మధ్యనించి ఠాకూరు దర్శనంకోసం ఉవ్విళ్లూరిపోతూ భజనకీర్తనల గానా లాలకించేదాన్ని. అలాగ అదేపనిగా నిలబడడంవల్లనే నాకు కీళ్లవాతం ప్రారంభమయింది. 'అడివిలో పక్షినిపట్టి పంజరంలో రాత్రింబగళ్లు అదేపనిగా బంధిస్తే దానికి కీళ్లవాతం వస్తుంది. అప్పుడప్పుడు బయలుదేరి ఇరుగు పొరుగుల నొకసారి పలకరించి వస్తూండు.' అని అంటూండేవా రాయన. తెల్లవారుజామున నాలుగు గంటలకే లేచి నా స్నానం ముగించుకునేదాన్ని. మధ్యాహ్నం గడచినతరవాత నహబతు మెట్లమీద రవంత ఎండ పడుతూండేది. ఆసమయంలో నా జుట్టు ఆరబెట్టుకునేదాన్ని. ఆ రోజుల్లో నాకు పెద్ద తలకట్టుండేది. నేనుండేగది చాలా చిన్నది. దానిలోనే అనేకరకాల సామానులుండేవి. తనా బీసించి ఉట్టెలతాళ్లు వేలాడుతూండేవి. నేను రాత్రి నిద్రపోయే సమయంలో ఉట్టిలో పెట్టిన కుండలో చేపలు కదిలిన గలగలధ్వని వినబడుతూండేది. ఠాకూరుకోసం సంఘిచేపలు జాగ్రత్త చేస్తూండేదాన్ని. ఒక్కమరుగుకోసం తప్ప నేనింక మిగిలిన ఇబ్బందు లేవీ పడలేదు.

''ఆహా! ఆ రోజుల్లో ఎలాంటి భజనకీర్తనలదేపనిగా వినబడుతూండేవి! ఠాకూరు మాటిమాటికీ సమాధిలో మైమరిచేవారు! అప్పుడప్పుడు నాతో బాటున్న గౌర్దాసికికూడా సమాధిస్థితి కలుగుతూండేది!''

అప్పటికప్పుడే ఠాకూరు సాయంకాలార్చన సమయం సమీపించింది. అది మాతృదేవి స్వయంగా నిర్వర్తించే అలవాటు. నేను మేడమీదినించి కిందికి వెళ్లాను. ఆ తరవాత ప్రసాదం స్వీకరించడానికి మళ్లీ పైకివచ్చాను. అమ్మ కాళ్లు దక్షిణంవైపు చాచి సాలపత్రాలలో ప్రసాదం ఉంచి పంచి పెడుతున్నది. నేను అదీ ఇదీ కావాలంటూ వరండాలో కూర్చున్నాను. మాతృదేవికి అందుబాటులో లేని వస్తువు ఒకటి కావాలనుకున్నాను. అనవసరంగా ఆమెకా శ్రమ కలిగించడం ఎందుకనుకుని నేనే దానికోసం చేయి చాపాను. ఆ సమయంలో నా మోచేయి అమ్మ పాదం స్పృశించింది. మాతృదేవి వెంటనే 'అయ్యో' అనుకుని క్షమాపణగా చేతులు జోడించింది.

''ఇంతమాత్రానికి అంతటి క్షమాపణ ఎందుకమ్మా!'' అన్నాను నేను. అయినా అమ్మ కెంతమాత్రము ఊరట కలగలేదు. ''నాయనా! నా

దగ్గిరికి రా! నిన్నొకసారి ముద్దు పెట్టుకుంటాను.'' అన్నది మాతృదేవి. చిట్టచివరికి నేను సమీపించాను. ఆమె నా చిబుకం చేతితో అందుకుని, ఆ చెయ్యి ముద్దు పెట్టుకున్నది. మాతృదేవికి అప్పటికిగాని పూర్తిగా సంతృప్తి కలుగలేదు.

ఈ విధంగా ఆమె తన అంతేవాసులను దేవుళ్లలాగా గౌరవించింది. కన్నబిడ్డలవలె ఆప్యాయంగా ఆదరించింది. (సశేషం)

# ముక్తిదం బెద్ది?

వెలుదండ రామేశ్వరరావు, M. A., B. Ed.

1

గురువు బ్రహ్మంబు, విష్ణువు కూడ గురువె,
ఈగురువె దేవు డరయ మహేశ్వరుడును,
గురువె సాక్షాత్పరబ్రహ్మ; కరుణ కబ్ధి,
అట్టి శ్రీగురుదేవుని కంజలింతు.

మనసు గల్గిన వాడౌను మానవుండు
మనసె కారణ మాగద మహిత గతిని
బంధమోక్షముల్ రెంటిని బట్టికూర్ప;
కనుక మనసు గూర్చి తెలివిగనుట మిన్న.

శుద్ధ చిత్తంబు మోక్షంపు సొబగు జూపు;
మలిన చిత్తంబు బంధముల్ మనకు బెంచు
కనుక కర్తవ్య మేమన్న వినఁగదోయి
చిత్తశుద్ధికి యత్నముల్ సేయుటొకటె.

మలినవస్తు సంగతినున్న మలినమౌను
మనసు; విషయవృత్తులు రేగ దినదినంబు;
విషయవాసన లేనోయి విషమువోలె
అఖిలదుఃఖ కారణమౌచు హానిగూర్చు.

5

మంచివారల జతనున్న మంచిమనసు
సహజముగ గల్గు; తానొక సజ్జనుడగు;

మంచిమనసుతో నొనరించు మంచిపనులు
నిత్యమీమానవుని మహనీయు చేయు.

చిత్తవృత్తి నిరోధంపు సిద్ధి బడసి
నిత్య కైవల్యపదమున నిలిచినట్టి
యోగి పుంగవు పదముల సాగిలబడి
మ్రొక్కి శరణొందు మిద్దియే ముక్తిదంబు.

సర్వం శ్రీరామకృష్ణార్పణమస్తు.

---

ఓం

# "అద్భుతము లీనాటికీ సాధ్యములే"

## వేదాంతం సుబ్రహ్మణ్యం

ఈ విశాల విశ్వమందంతటిలోనూ మన పరమ పవిత్రమగు భారతావని అనాదినుండీ పారమార్థిక చింతనకు అత్యంత విశిష్టతను, అసమానమగు ప్రత్యేకతను చేకూర్చి, మానవ జీవిత లక్ష్యమునకు అజేయమైన మార్గదర్శిగా ఏర్పడగల గౌరవాన్ని సంతరించుకున్నది. ప్రతిక్షేత్రంలో పేరు ప్రఖ్యాతులు సముపార్జించుకున్న వ్యక్తులు ఎందరో యిక్కడ వెలిగారు, మన మాతృమూర్తి యశస్సును ప్రకాశమానంగా నలుమూలలా వ్యాపింపచేశారు. వీరందరిని ఎన్నోరెట్లు మించిన భగవత్స్వరూపులకుగూడ మన దేశం ఆలవాలమయింది. వారి జీవితములు సర్వ మానవజాతి శ్రేయస్సుకు ఆదర్శప్రాయములని విజ్ఞులు, పండితపామరులు ఏకగ్రీవంగా అంగీకరించారు. కృష్ణభగవానుడు ధర్మము క్షీణించి, అధర్మము మిక్కుటమగుచున్న పరిస్థితులలో, కలియుగమందు ముఖ్యముగా, తాను స్వయముగా అవతారమెత్తి దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేయుదునని చెప్పిన సూక్తికి ప్రబలతార్కాణంగా శంకర భగవత్పాదులు, రామానుజులు, వల్లభాచార్యులు వంటి మతగురువులేకాక, ఎందరో మహానుభావులు జన్మించి, పతితమవుతున్న సంఘాన్ని ఉద్ధరించి, అన్నిటికంటె హెచ్చుగా మానవసేవయే మాధవసేవ అనే సత్యాన్ని బోధించటమేకాక తామవలంబించి, చూపి, భగవంతునియందు లీనమై జీవన్ముక్తి పొందగలిగారు. వీరు చేపట్టిన మార్గములు అనేకములు; గమ్యం మాత్రము ఒక్కటే. భిన్నత్వంలో ఏకత్వమగు దైవత్వాన్ని నిస్సందేహంగా నిరూపించుటలో వీరందరు కృతకృత్యులైనారు. వీరిలో కొందరు సకల శాస్త్రములు క్షుణ్ణంగా చదివి, నిదిధ్యాస మననాదులవల్ల వాటినన్నిటినీ గ్రాహ్యం చేసుకొని జ్ఞానమార్గ మవలంబించారు. మరికొందరు వేర్వేరు రీతులలో భక్తిమార్గంలో పయనించి ఈశ్వర సాన్నిధ్యం చేరుకున్నారు. ఇంకా కొందరు కర్మమార్గంలోనే నిర్వాణం పొందగలిగారు. వీరందరి జీవితములు పరిశీలించిన, స్వామి దిలీప్ కుమార్ రాయ్ వచించిన ''అ

ద్భుతము లీనాటికీ సాదృశములే'' అన్న సత్యం తేటతెల్లముగా బోధపడుతుంది.

ఈ కోవకు చెందినవారిలో పురుషులున్నారు, స్త్రీలున్నారు. కాని, సాధారణంగా వారందరు బ్రహ్మచర్యాశ్రమంనుంచే సాధన కుపక్రమించినవారు, లేక గృహస్థాశ్రమాన్ని త్యజించి ముక్తిపథం పట్టినవారు. అయితే, ఒక్కటే విశేషం. దంపతుల్లో భార్యగాని, భర్తగాని ఒక్కరే ఈషణత్రయాలను జయించి భగవానుని సాక్షాత్కరింప చేసికొని తరించినవారిని మామూలుగా చూస్తుంటాము.

శ్రీ రమణమహర్షి మొదలైనవారు బ్రహ్మచారులుగాఉండే భగవదవతారములుగా పరిణతి చెందారు. శ్రీ జిల్లెళ్లమూడి మాత, మొదలగువారు సంసారములోంచి విముక్తులై పరబ్రహ్మస్వరూపులు కాగలిగారు. శ్రీ అరవిందులు గూడ ఈ మార్గమే అవలంబించారు.

అత్యంత అద్భుత సంఘటన శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి దంపతుల జీవితంలో కనపడుతుంది. వీరిద్దరికి లోకసహజమగు వివాహమయింది. కాని, ప్రతి స్త్రీమూర్తిని, అంటే పసిశిశువు మొదలుకొని పండు ముదుసలి వరకు, జగన్మాత స్వరూపంగా వీక్షించగలిగిన శ్రీరామకృష్ణులకు, వారి భార్య శ్రీ శారదాదేవిగూడ మాతృసమానమే అయింది. జగద్గురువులలో ఈ దంపతులు అత్యున్నత స్థానాన్ని అలంకరిస్తారనటంలో సందేహమేమీ లేదు. ఇద్దరూ భగవదవతారములే అని నిస్సందేహంగా నిరూపించుకున్నారు. వారిద్దరు కృష్ణభగవానుని ఈ క్రింది రెండు శ్లోకములకు వీసమంతయు తక్కువకాని పరమపావనులు, పరబ్రహ్మస్వరూపులు:

విద్యా వినయ సమ్పన్నే
బ్రాహ్మణే గవిహస్తిని
శుని చైవ శ్వపాకే చ
పణ్డితా సమదర్శినః॥

ఇహైవ తైర్జిత స్సర్గో
యేషాం సామ్యే స్థితం మనః
నిర్దోషం హి సమం బ్రహ్మ
తస్మా ద్బ్రహ్మణి తే స్థితాః॥

శ్రీరామకృష్ణులు దేవీసాన్నిధ్య సాక్షాత్కారము పొంది, నిర్వికల్ప సమాధియందే జీవితమంతయు గడపక, సంకీర్తనానంద పారవశ్యముతో తన శిష్యులను, జనబాహుళ్యమును సంతసపరుస్తూ, సుప్రసిద్ధ వ్యక్తులతో సమావేశములు జరుపుతూ, చివరివరకూ ప్రపంచమునకు మహోన్నత సేవచేసి, అసంఖ్యాకులను పునీతులుగా చేయగలిగారు.

అన్నిటికన్న ఎక్కడగు విశేషం వారి భావి దృష్టిపథం. ముందు ముందు రాబోయే తాత్వికతనావస్థను సరిగా ఊహించుకొని, ఎలాటి హీన పరిస్థితుల్లోనైనా, మన సనాతన ధర్మరక్షణకు పటిష్టములైన పునాదులను నిర్మించారు. తత్ఫలమే రామకృష్ణమఠ స్థాపన, దీనికి మూలపురుషుడగు వివేకానందుడు ప్రప్రథమంగా వారి వద్దకు వచ్చినపుడు శ్రీరామకృష్ణులు ఆతనితో ముచ్చటించిన విధానము చిరస్మరణీయము. దానినిగూర్చి శ్రీ వివేకానందులే ఇట్లు ప్రకటించిరి.

''...ఠాకూర్ అకస్మాత్తుగా లేచి నా చేయి పట్టుకొని నన్ను...ఏకాంత ప్రదేశమునకు తీసికొనిపోయిరి. అచట నాకేదియో ఉపదేశ మొనర్తురని తలచితిని; కాని, నా ఆశ్చర్యమేమని చెప్పుదును?...ఆనంద పారవశ్యమున అశ్రుధారలు జాలువాఱ, 'ఎంత కాలమునకు వచ్చితివోయి తండ్రీ? ఇంతవరకెట్లు నిర్దాక్షిణ్యము వహించితివోయి?' అని వివశులై పలికిరి. భావాతిశయ మించుక శాంతించినంతనే మరల ఆయన,

'నాయనా, చాలకాలము నీకోసము వేచియుంటిని. లౌకిక జనుల తుచ్ఛ ప్రసంగములను విను టచే నా చెవులు మండిపోయినవి. ఆహా! నా ఆత్మానుభవములనుగూర్చి యొక రసజ్ఞునితో ముచ్చటించుట కెంతగా పరితపించితినోయి! ఇక నీతో ప్రసంగించి యీతాపమును చల్లార్చు కొందును' అని (ముదితాంతరంగులై) వచించిరి. అంతట బద్ధాంజలులై నాయెదుట నిలిచి, 'ప్రభూ! నీవు నరుడను ఆ సనాతన ఋషివని—మానవ కోటి బాధలను బాపుటకై ఆవిర్భవించిన నారాయణుని అవతారమవని—నే నెఱుగుదును' అని పలుకసాగిరి!—అనంతర మాయన స్వహస్తములతో వెన్న, కలకండ, మిఠాయిని నాచే దినిపించి, 'మరల నొంటరిగా, శీఘ్రముగా, రావల యును జుమీ!' యని నన్ను ఒడంబరిచి పంపిరి.''

అప్పటికి వివేకానందుడు కాలేజీలో విద్య బడిసి, బ్రాహ్మసమాజమున చేరి, భగవద్దర్శన కాంక్షతో పరితపిస్తున్న ఒక సామాన్య యువ కుడు మాత్రమే. విగ్రహారాధనను తీవ్రముగా నిరసించుచున్న నరేంద్రుని (వివేకానందుని) పరివర్తనము ఆయన మాటలలోనే విస్పష్ట మగుచున్నది:

''గురుదేవుని యీ మహాద్భుత స్పర్శ వెను వెంటనే నా మనస్సున అపూర్వ పరిణామము కల్గించెను. నిజముగా బ్రహ్మేతర వస్తువు ప్రపంచమున లేనేలేదని కనుగొని దిగ్భ్రాంతుడ నై తిని!...(అట్లు అనేకదినములు గడిచిన తర్వాత) ప్రపంచము స్వప్నప్రాయముగా సాగెను...శాస్త్రవాక్యలు మిథ్య కావని తోచెను. అద్వైత వేదాంత సిద్ధాంతముల నిక నిరాకరింపజాలక పోతిని.''

అయితే, ఒక్క విషయం మనమందరము జ్ఞాపకముంచుకోవాల్సి ఉన్నది. కఠిన పరీక్షలకు తాళనిదే నరేంద్రుడు శ్రీరామకృష్ణుని ప్రియ శిష్యుడు కాలేదు. తాను స్వయంగాగూడ ఘోర కష్టములకు గురికావలసి వచ్చెను. వీటినన్నిటిని అధిగమించి, నరేంద్రుడు వివేకానందునిగా విశ్వవిఖ్యాతి గాంచిన వాడాయెను.

ఇటులనే, సర్వమానవ వ్యసనములకు అల వాటుపడి, ఓ నాటక సమాజమును స్థాపించు కొని, అహర్నిశలు లౌకిక వ్యాపారములతోనే కాలం గడుపుతున్న గిరీష్ ఘోషును తన ప్రియ శిష్యునిగా పరివర్తనచేసి, ఆ నాటకములనే వ్రాస్తూ, ఆ నాటకములనే నటిస్తూ, దేశభక్తి తోపాటు పరమాత్మునిలో లీనం కాగలిగిన శక్తిని ప్రసాదించగల మహిమ ఒక్క రామకృష్ణునికే సాధ్యమయింది. మొదట ఆతని దుర భ్యాసములను కేవలం నిషేధాత్మకమైన ఆజ్ఞల వలన అంతగా ప్రయోజనము లేదనియు, సమన్వయాత్మకము, శీల నిర్మాణాత్మకము, మనస్తత్త్వాను గుణమునగు బోధలే ఫలవంతమగున నియు ఎంచి, వాటివలన ఆసించిన పరిణామము గూడ లేకపోవుటవలన, ఆతని బాధ్యత యావత్తు వీరే వహించి, తాను భగవచ్చింతన గూడ చేయనవసరంలేదని తెలిపిరి. దానితో గిరీశుడు కర్తృత్వభావమును పూర్తిగా విడనాడి సర్వ విషయములందును—అందులకు తనకు ప్రత్యామ్నాయముగా భాసింపసాగిన శ్రీరామకృష్ణుని యిచ్ఛను—అనుసరించి నడచుకొనబూనెను. ఇక నాతనికి నిరంతరము శ్రీరామకృష్ణ చింతయే! దానితో గిరీశుని ఆత్మసమర్పణము పరి పూర్ణమై, లోకాదర్శమై యొప్పెను.

ఈ భగవత్స్వరూప దంపతుల సంబంధం సంపూర్ణంగా బోధపడటానికి ఒక్క సంఘటన చెప్తే సరిపోతుంది:

శ్రీ శారదాదేవి ఒకనాడు ప్రాణేశ్వరుని పాదకమలములను తన కరపల్లవముల నొత్తుతూ ''నన్నుగూర్చి మీరేమని తలచెదరు?'' అని

ముఖపద్మమున చిరునవ్వు వెలయ ప్రశ్నించగా, శ్రీరామకృష్ణు డిట్లు సమాధానమిచ్చెను: "ఆలయమున ఆరాధింపబడుచున్న ఏ తల్లి ఈ శరీరమును కన్నతల్లియై యిపుడు నహబత్తున (శ్రీ శారదాదేవి ఉంటూండే మందిరం) నివసించుచున్నదో, అ తల్లియే యిపుడు నా పాదములు ఒత్తుచున్నది." శ్రీరామకృష్ణుడు మరియొకప్పుడు కొందరు భక్తులతో "నా భార్య నా పాదములు ఒత్తును, కాని పిమ్మట నేనామెకు నమస్కరింతును" అని తెల్పెను.

శతాబ్దములనుండి సామాన్య మానవుని మేధస్సుకు, బుద్ధికిగూడ అంతుపట్టక తికమక పెట్టున్న ద్వైత, విశిష్టాద్వైత, అద్వైతములన బడు త్రిమత సిద్ధాంత సమన్వయ సామరస్యముల విశదీకరణ శ్రీరామకృష్ణుడీ విధముగా చేసెను.

"బ్రహ్మసాక్షాత్కార విషయమున అద్వైతము తుదిమాట. అది మనస్సునకును వాక్కునకునుగూడ అతీతమగుటచే, కేవలము సమాధి స్థితిలో అనుభూతి మొనర్చుకొన దగియున్నది.

మనస్సుచేతను, బుద్ధిచేతను విశిష్టాద్వైత పర్యంతము మాత్రమే గ్రహించి వాక్కులలో తెలుపనగును. ఆ స్థితిలో నిత్యము, లీలయు (అనగా బ్రహ్మము, జగత్తును) గూడ తుల్యముగనే నిత్యము (యథార్థము). భగవానుని నామము, ధామము, భగవానుడును చిన్మయమే.

విషయరాగము ప్రబలముగాగల సాధారణ మానవులకు ద్వైతభావము, అనగా నారద పాంచరాత్రమున ఉపదేశింపబడియున్నట్లు బిగ్గరగా నామ సంకీర్తన చేయుట మున్నగునవి ప్రశస్తము, శ్రేయస్కరము."

అంటే, ఈ మూడు మానవుని ఆధ్యాత్మిక వికాసమునందలి క్రమావస్థలని కనుగొని, వివిధ మానసిక దృక్పథములకు అనుగుణమగునివి భగవత్ప్రాప్తి మార్గమున క్రమసాధనములేకాని యెంతమాత్రము పరస్పర విరుద్ధములు కావని బోధపరిచెను.

బ్రాహ్మసమాజ మతస్థాపకులలో ఒక ముఖ్యుడైన కేశవ చంద్రసేనునకు బదులు చెప్పుతూ, "ప్రతివాని పాదధూళికి ధూళిని నేను. ఎవ్వరైనను ఇచటికి తమ దయా విశేషమున వచ్చుచో వత్తురు గాక!" అన్న శ్రీరామకృష్ణుని వినయము సాధారణముగా మరెచ్చటనైన కాన వచ్చుట దుర్లభము.

ఆయన గృహస్థ శిష్యులలోకెల్ల అగ్రగాముడైన గిరీష్ ఘోషు "శ్రీరామకృష్ణు డెల్లరను తన నమస్కారాయుధముచే (వినయముచే) జయించెను," అని సర్వదా వచించెడువాడు.

శ్రీరామకృష్ణుని ఉపదేశ సారాంశము సత్యనిష్ఠ. ఈ విషయములో వారి జీవితము శ్రీరామ సత్య హరిశ్చంద్రాదులను స్ఫురణకు తెస్తుంది. ఈ ప్రస్తుత శతాబ్దములో మహాత్మాగాంధి మరల ఒక్క శ్రేష్ఠమైన ఉదాహరణగా ఈ సూత్రాన్ని తానాచరించి దాని ఔన్నత్యాన్ని సకలజనులకు ఆచరణీయమైనదని బోధించిన భాగ్యం మనదేశాని కబ్బింది. శ్రీరామకృష్ణు డెప్పుడును తనమాటను జవదాటి యెరగడు. ఒకవేళ తన వాగ్దానమును మరచినను, వారి నిష్ఠాపూరితములైన మనశ్శరీరములే దానిని జ్ఞప్తికి తెచ్చెడివి. సత్యనిష్ఠనుగూర్చి శ్రీరామకృష్ణుని దృఢాభిప్రాయం వారి ఈ క్రింది మాటలవల్ల అర్థమవుతుంది :

"కలియుగమున సత్యనిష్ఠయే తపస్సు. సత్యవ్రతమే ముఖ్యమైన వ్రతము. సదా సత్యసంధుడై యుండునట్టివాడు భగవానుని గనజాలును. పుష్పాంజలినై అమ్మనిట్లు ప్రార్థించితిని: 'అమ్మా, ఇదిగో నీ జ్ఞానము ; ఇదిగో, నీ అజ్ఞానము – రెంటిని గైకొని నీయందు నిర్మలభక్తిని నా కనుగ్రహింపుము. ఇదిగో, నీ శౌచము ; ఇదిగో, నీ

అశౌచము – రెంటిని స్వీకరించి నీయందు నాకు విశుద్ధ భక్తినిమ్ము....ఇదిగో, నీ శుభము; ఇదిగో, నీ అశుభము – రెంటిని గ్రహించి నీ పాద పద్మములయందు వినిర్మలభక్తిని ప్రసాదింపుము.' కాని నేను, 'ఇదిగో, నీ సత్యము; ఇదిగో, నీ అసత్యము – రెంటిని స్వీకరింపుము' అని చెప్ప జాలనైతిని.''

వీటన్నిటినిమించి, శ్రీరామకృష్ణుల శిష్య శిక్షణమందలి మూలసూత్రం కఠోపనిషత్తునందలి ఒక్క శ్లోకముతో విశదమవుతుంది.

''నావిరతో దుశ్చరితాత్
నాశాన్తో నా సమాహితః
నాశాన్తమానసోవాపి
ప్రజ్ఞానేనైవ మాప్నుయాత్.''

ఎవ్వడు దుర్మార్గములు వీడడో, ఎవ్వడు ఇంద్రియములను నిగ్రహింపడో, ఎవ్వడు ఏకాగ్రచిత్తుడు కాకుండునో, ఎవ్వడు చిత్తశాంతిని బొందకుండునో, అట్టివాడు విశేషజ్ఞానముచేనైతము ఆత్మను బొందజాలడు.

దీనినే ముచ్చటగా మూడు ముక్కలలో పొందుపరిచారు.

''శుద్ధమనస్సు, శుద్ధబుద్ధి,
శుద్ధాత్మ - ఈ మూడు నొక్కటియే.''

ఈ ప్రస్తుత పరిస్థితుల్లో, ముఖ్యంగా క్లిష్టమైన ఆర్థికరంగంలో, జీవితమేగొప్ప సమస్యగా ఏర్పడటం మూలాన, దానికి తోడు ఐహిక సుఖాలు దినదినము వృద్ధి కావటంతో, మానవుడు తన యావత్తు సమయాన్ని అనవరతము నిత్యావసరాలకు ధారపోయవలసి వచ్చింది. అందుచేత, ధర్మం అడుగంటిపోవటం సంభవించింది. దేవుని పేరు తల్చుకొనటంగూడ కష్టమయింది. దీని పర్యవసానం వర్ణాశ్రమ ధర్మవిచ్ఛేదం, పాప విస్తరణ. వీటన్నిటివల్ల మూఢత్వం ప్రబలి

అనన్యాశ్చిన్తయన్తో మాం
యేజనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం
యోగక్షేమం వహామ్యహమ్॥

అన్న భగవానుని నుడిని మానవుడు మరిచిపోతున్నాడు. ఇలాటి తరుణాల్లో భగవదవతారములు ప్రపంచంలో వెలిసి పెడత్రోవ పట్టున్న ప్రజానీకాన్ని మరలించి మోక్షపథగాములుగా చేయటంకన్న కావలసినదేమున్నది? ఇది అత్యంత అసహజంగా కన్పడినప్పటికీ, శ్రీరామకృష్ణ శ్రీశారదాదేవివంటి వారివల్ల సంభవము అగుటచే, ''అద్భుతము లీనాటికీ సాదృశము లే'' అని చెప్పకతప్పదు.

# సువృత్త పంచచామరమ్

## పద్మనాభస్వామి

స్థలే, జలే, జనే, వనే సమాన వాస వాసితం
విలాస వాగ్విశిష్ట వేద వాదబోధ వర్ధనం
మృదుం హృదా సదావచో గభీర సత్యభాషణం
జగద్గురుం విచింతయామి రామకృష్ణ మీశ్వరమ్.

నివృత్త షోడశీ కళా ప్రపూర్ణ మాతృకార్చనం
ప్రవృత్త సత్యపాలన క్రియాత్త రామ సద్గుణం
ప్రశస్త తాత్త్విక ప్రవృత్తి కృష్ణ దివ్య జీవనం
జగద్గురుం విచింతయామి రామకృష్ణ మీశ్వరమ్.

* * *

ఫలానుమేయ వశ్యవాగ్విలాస తోషితాంబికం
కులీన హీనవర్ణ భేద తూలదాహ కాంబకం
మనోహరార్థ వైదిక ప్రబోధ వాక్సుధానిధిం
జగద్గురుం విచింతయామి రామకృష్ణ మీశ్వరమ్.

* * *

సనాతనోక్తి సద్వివేక బోధనైక వార్తికం
పవిత్ర శారదావచో వికాస శారదాంబరం
నరాకృతిం పినాకినో ర్గదాధరం భవాశ్రితం
జగద్గురుం విచింతయామి రామకృష్ణ మీశ్వరమ్.

* * *

వివేకభాను వర్ధనం విచిత్ర నైజవర్తనం
మతానుయాయి సాధురీతి దర్శనైక మర్శనం
ప్రకృష్ట భారతీయ ధర్మభాషణైక భూషణం
జగద్గురుం విచింతయామి రామకృష్ణ మీశ్వరమ్.

*

కవీంద్ర సన్మనాభసూక్తి భావబంధుర ప్రభం
సువృత్త పంచచామరం సమర్పితం జగద్గురోః
భవాబ్ధి కల్మష ప్రణాశ సాధనం భవేదిదం
తథా కరోతు శారదాంబికా కృపా సుధాఝురీ.

# శ్రీ శారదామాత

**పి. జయశ్రీ, విశ్వోదయ బాలికోన్నత పాఠశాల, కావలి.**

క్రీ. శ. 1853 సంవత్సరమున మార్గశీర్ష బహుళ సప్తమికి సరియైన డిశంబరు నెల 22 వ తారీఖున మాతృశ్రీ శారదాదేవి జన్మించినది. బంగాళాదేశమున కలకత్తా నగరమునకు పడమటిదిశగ అరువది మైళ్ళదూరమున జయరామవటి అను గ్రామము కలదు. ఆ జయరామవటిలో శ్రీరామచంద్ర ముఖర్జీయను బీద బ్రాహ్మణుడు నివసించుచుండెను. అకలంకమయిన రామభక్తి అతడు భద్రపరుచుకొన్న ధనము. అతని భార్య శ్యామసుందరీదేవి రూపసి. రూపముకంటెను

ఆమె శీలము మరింతగొప్పది. ఆమె శీలమునకు శిరోభూషణము, పవిత్రమయిన, నిశ్చలమైన దైవభక్తియే. ఈ పవిత్ర దంపతులకు శారదా దేవి జన్మించెను. ఒకనాడు శ్యామసుందరీదేవి సిహోరు అను పల్లెటూరులోని ఒక దేవాలయమున కేగి తిరిగివచ్చుచూ దారిలో ఒక మర్రిచెట్టు నీడన విశ్రమించెను. అట్టి సమయమున ఆ చెట్టు పైనుండి ఎఱ్ఱనిపట్టు పరికిణీ ధరించి, చూడ ముచ్చటగానున్న ఐదేండ్ల బాలిక దిగివచ్చి శ్యామసుందరీదేవి మెడకు తన చేతులను పైనవైచి తల్లీ! నేను మీ యింటికి వచ్చుచున్నాను. అని చెప్పి ఆమె గర్భమున ప్రవేశించినట్లు అయ్యెను. చాలాసేపటివరకు శ్యామసుందరీదేవి ఒడలు తెలియలేదు. చివరికెట్లో ఆమె యిల్లు చేరుకొని, జరిగినదంతయు తన భర్తకు చెప్పగా నాతడు ఆ నాటినుండియు భక్తి ప్రపత్తులతో నామెను స్పృశింపనయినను, స్పృశింపక తొలగి సంచరించుచుండెను. ఆ దివ్యానుభూతియే శారదా దేవి పుట్టుకకు మూలకందము.

బాల్యమునందామె ఎంతో శ్రమించి తన తల్లితండ్రులకు సేవ చేసెడిది. తోటి పిల్లలవలె ఆమెకు క్రీడాసక్తిలేదు. ఆమెకు జగడములన్నను యిష్టములేదు. మిక్కిలి సరళస్వభావము కలిగి ఉండి కాళికాదేవి, లక్ష్మీదేవి మున్నగు దేవతామూర్తులను పూజించుచుండెడిది. దేవతా పూజయే ఆమెకు పరమోత్సాహము నిచ్చెడిది. పుట్టుకకు తరువాత ఆమె జీవితమున నడచిన మహోదంతము కళ్యాణమే. నవకుసుమ కోమలములైన మారేడుదళమును పరమేశ్వరుని పాదపద్మముల కర్పించినట్లు, ఐదవఏటనే ఆమెను శ్రీరామకృష్ణునికిచ్చి వివాహము కావించిరి. అప్పటికి శ్రీరామకృష్ణుని వయస్సు 23 యేండ్లు. పరమేశ్వరి పాదములను దర్శించు తహతహలో ఆతడు దేహస్పృహను కోల్పోయి కలకత్తాకు సమీపమునగల దక్షిణేశ్వర ఆలయమున సాధన చేయుచుండెను. అతనిని సరిగా అర్థము చేసికొనలేని అచటివారు అతనిని పిచ్చివాడనిరి. అతని స్థితి బాగుపరచుటకు తగిన కార్యము వివాహమే యని ఎంచి తల్లితండ్రులు అతనికి సంబంధములను వెదకుచుండిరి. అపుడు రామకృష్ణుడు వారితో యిట్లనెను, "ఈ ఊరు నా యూరు ఏల వెతకెదరు. నాకై బ్రహ్మ వ్రాసిపెట్టిన కన్య జయరామవటిలో రామచంద్ర ముఖర్జీయింట నున్నది." ఆమె ఐదేండ్ల బాలిక యగుట వారికి నిరుత్సాహజనకముగా ఉన్నను ఆసంబంధమునే స్థిరపరచిరి. వివాహమయిన తరువాత కొన్నాళ్లకు శ్రీరామకృష్ణుడు అత్తవారింటికేగెను. ఆ వయస్సునందు ఆమెకు ఎవ్వరూ చెప్పకపోయినను, స్వయముగా తానే భర్తను సమీపించి ఆయన పాదములకు మ్రొక్కి విసనకర్రతో విసురుచూ నాతనికి ఉపచారములు చేసెడిది. అవిచూచి అందరును నవ్విరి.

ఆమె తన పదమూడవయేట భర్తకడకు పంబడెను. అచట వారిరువురును కలసి కొంతకాలముండిరి. తాను సన్యాసియయ్యెను. తన్నే నమ్ముకొన్న నా బాలిక నాతడు విడనాడలేదు. తన యవ్యాజానురాగముచే నామె హృదయమును చూరగొనెను. ఆ తరుణమున నాతడు ఆమెకు ఎన్నో యపురూప శిక్షణలనిచ్చి ఆమెను తన శిష్యురాలిగా చేసికొనెను. ముచ్చటగా మూడు నెలలు గడిచినపిదప రామకృష్ణుడు దక్షిణేశ్వరమున కేగెను. శారదాదేవి జయరామవటికి వచ్చెను. ఆమె శరీరము జయరామవటిలో నున్న, హృదయమంతయు దక్షిణేశ్వరములోనే శ్రీరామకృష్ణుని చరణ సరోజములలో బద్ధమాయెను. జయరామవటిలోనున్నను ఆమె, తన భర్త యిచ్చిన శిక్షణలను సదా స్మరణకు తెచ్చుకొనుచు శ్రద్ధతో వాని నాచరించెడిది. అది

మొదలుగా రామకృష్ణుడే ఆమెకు గురుదైవము, ఇష్టదైవముగా నేర్పడెను. భర్తనుమించిన పరమదైవము లేడని యామె యుద్దేశ్యము. ఒకనాడొక శిష్యుడు పూర్తిగా సన్యసింపదలచి తన భార్యతో "నీకు నేను కావలెనా? భగవంతుడు కావలెనా?" అని ప్రశ్నించెనట. "నాపై ఏల ఆధారపడెదవు? భగవంతుని నమ్ముకొనుము" అని చెప్పెదమని అతడా ప్రశ్నను వేసెను. ఆమె ఆసంగతి మాతృదేవికి చెప్పగా "నాకు భర్తయే గావలెను. భగవంతుడక్కరలేదని చెప్పకపోయితివా?" అని ప్రత్యుత్తరమిచ్చెనట.

ఒకనాడామె జయరామవటిలో తన భర్తను గూర్చి వింతగా చెప్పుకొనుటను విని భర్తకడ కేగవలెనని నిశ్చయించుకొని ఆయనవద్దకు పోయి, అతనినిచూచి వీరినేనా, ప్రజలు పిచ్చివాడనుకొనుచున్నది అని ఆశ్చర్యపడెనట. ఒకనాడామె తన భర్తచెంత "నాకు ఒక కొడుకైనను ఉండరాదా?" అని మనసులో చింతించగా నాతడు "ఒకరు నిద్దరుకాదు నీసంతానము ఈభూమండలమంతయునువ్యాపించియుండును" అని ప్రత్యుత్తర మిచ్చెను. 1873 వసంవత్సరమున మే నెల 25 వ తేదీన శ్రీరామకృష్ణుడు షోడశీపూజను నాచరించెను. ఈ పూజయందు రామకృష్ణుడు తన భార్యను జగజ్జననిగా పూజించి తన సర్వస్వమును ఆమె పాదములవద్ద ధారపోసెను. ఆమె పాదముల చెంతనుంచినది స్థూలమైన జపమాలికయేకాదు. తన యనుభవములతో గ్రుచ్చిన అపురూపరత్నమాలిక. రామకృష్ణుని జీవితము త్రిజగన్మోహనమయిన మధురకావ్యము దానిని పవిత్రమైన శారదాదేవికే అతడర్పించెను.

ఆమె అంతఃకరణమును వర్ణించుటకు మాతృభావము ఒక్కటిచాలును. ఒకనాడొకశిష్యుడామెను "నీవేమితల్లివి?" అని ప్రశ్నించగా ఆమె "నేను భౌతిక కారణమైన తల్లికంటె నపారమునగాధము అయిన ప్రేమనువర్షించుతల్లిని" అని చెప్పెను. ఆమెపాదములు పాపములుచేసిన వారు స్పృశించినప్పుడు భగ్గు, భగ్గుమని మండెడివి. పదేపదే గంగాజలముతో ప్రక్షాళనము చేసికొనినగాని ఆ మంట శాంతించెడిది గాదు. ఆ విషయము తెలిసిన ఒక శిష్యుడు ఆమె పాదములను స్పృశించుటకు జంకుచుండగా నామె లాలనగా "రా నాయనా! రా సంశయింపకుము. మరి మాజన్మకు ప్రయోజనమేమి?" యని పిలిచెను. శిష్యులకు ఆమె ఎన్నో సేవలు చేసెడిది. ఒక శిష్యుడు గజ్జిచే బాధపడుచుండగా ఆమె తన చేతితో ముద్దలు కలిపి నోటిలో పెట్టెడిది. ఒక శిష్యురాలి కూతురు తివాచీకి అశుభ్రపరచగా నామె తనే స్వయముగా దానిని శుభ్రపరచెను. ఇంచుమించుగా ఆమె సేవలుపొందని శిష్యులేలేరు. అదియు నుపదేశము "మంచిగంధపుచెక్క నరగదీసినట్లు సాధనచేసిన భక్తుడు పరిమళించును" అని ఆమె చెప్పెను. "చంద్రునిలోకూడ కళంకమున్నది కాని సచ్చిదానందమూర్తి, నాజీవితమున కళంకమును లేశమైన జారనీయకుము" అని ఆమె దేవుని ప్రార్థించును. ఆమె తనశిష్యులతో "రామకృష్ణుడే నాగురువు, దైవము, అతడే ప్రకృతి, అతడే పరుడు, క్షుద్రదేవతలనుండి పరాత్పరుని వరకు అన్నియు నాతడే" అని పల్కెను.

1886 వ సంవత్సరము ఆగస్టు 16 వ తేదీన రామకృష్ణుడు మరణించెను. అతడు మరణించిన పిదప ఆమె తనవలన ఏమిచేయను ఉపయోగము లేదని ప్రాయోపవేశము చేయగా రామకృష్ణుడు ఆమెకు తేజోరూపమువలన కనిపించి "అట్లు చేయకుము. నీవు చేయవలసిన పని చాలాయున్నది. లోకమునందలి ప్రజలు మురికిగుంటలలోని పురుగులకంటె హీనముగా నున్నారు.

వారి నుద్ధరించుటకే నీ వుద్భవించితివి'' అని చెప్పెను. ఆమె తన శిష్యులతో, సోమరులు అనవసరమయిన వ్యాసంగములందు దిగుదురు. కావున ఒక నిముసమయినను సోమరితనము పనికిరాదు'' అని చెప్పినది. 1954 వ సంవత్సరమున మార్చినెల ప్రబుద్ధ భారతి యను పత్రికయందు "Mothers Grace'' అనగా తల్లి అనుగ్రహము అను వ్యాసమును చదివినచో మాతృదేవి యుపదేశము లందలి వైశిష్ట్యము తెలియును. మాతృదేవి అగాధ కరుణా స్వరూపురాలు. ఆమె శీలము గతానుగతికమైనది కాదు అందును స్వతంత్రమైన వికాసమున్నది. ఒకనాడు ఒక ప్రవర్తనలేని స్త్రీ ఆమె వద్దకు వచ్చినపుడు రామకృష్ణుడా స్త్రీని రానివ్వవలదని శారదాదేవికి చెప్పిరి. నిప్పువంటి ఆమె శీలమునకు చెదలంటదని ఆతనికి తెలుసు అయినను లోక సంగ్రహార్థము ఆమెకు అట్లు చెప్పెను. అమె ఆ కట్టడిని పాటింపలేదు. రామకృష్ణుడు తిరిగి దానిని ప్రస్తావించలేదు. శారదామాత మహాత్మ్యము అగాధమయినది. ఆమె లోకమునకు గావించిన మేలునుగూర్చి ఆలోచించినచో మనమాశ్చర్య నిమగ్నుల మగుదుము. ''బూడిదలో పొరలిన పిల్లివలె ఆమె మహాత్మ్యమును దాచుకొనుచున్నది'' అని రామకృష్ణుడు చెప్పెను. మాతృదేవి నెఱపిన లోకహిత మపారము. దానిని గూర్చి వివరించుట ఎవ్వరికిని సాధ్యముకాదు. కానీ ఏదో చంద్రుని కొక నూలుపోగు అనునట్లు ఆమె జగజ్జన హిత బుద్ధినిగూర్చి కొంచెమయినను స్ఫురింప చేయవచ్చును.

మాతృదేవి 1912 వ సంవత్సరమున మూడవసారి కాశీయాత్రకు వెళ్ళినప్పుడు అచ్చట తన శిష్యులు రామకృష్ణుని పేరిట జరుపుచున్న సేవా కార్యక్రమములకు సంతసించి వారికి పది రూపాయలు చందా నొసగెను. ఆ పది రూపాయలను నేటికిని ఆమె శిష్యులామె జ్ఞాపకార్థము పెట్టెలో భద్రపరచియున్నారు. రామకృష్ణుడొకసారి యామెను పరీక్షించుటకై "నీవు నన్ను సాంసారిక జీవనమునకు లాగుటకు వచ్చితివా?'' యని ప్రశ్నించగా నామె ''లేదు. నేను మిమ్ము సంసార జీవితమున కేల లాగవలెను? మీరు ఎన్నుకొనిన మార్గముననే మీకు సాయము చేయుటకు వచ్చితిని'' అని చెప్పెను. ఆ సమాధానమునకు రామకృష్ణుడు సంతసించెను. 1919 వ సంవత్సరమున మాతృదేవికి భయంకరమైన జ్వరము వచ్చెను. క్రమముగా పరిస్థితి దిగజారినది. ఆమె కాళ్ళు రక్తహీనతచే ఉబ్బు చూపినవి. ఆమె శిష్యులందరును మాకేది దారి? అని ఏడ్చిరట. 1920 వ సంవత్సరమున జూలై 20 వ తేదీన రాత్రి 1-30 గంటలకు దేహమును చాలించెను. చనిపోవుటకుముందు శరీరము బిగుసుకొనిపోయి ముఖము నల్లబడి, ముఖమునుండి ఒక దివ్యజ్యోతి బయటికి వెలువడెను. మరణానంతరము పూజా సమయమున దుర్గాదేవివలె ప్రశాంతముగా నుండెను. అపుడు శిష్యులు ఆమె నిటు ప్రార్థించిరి.

ఓం సర్వమంగళ మాంగళ్యే! శివే!<br>
సర్వార్థ సాధికే శరణ్యే! త్ర్యంబకే దేవి!<br>
నారాయణి! నమోస్తు తే.<br>
ఓం, శాంతిః, శాంతి, శాంతిః.

శ్రీరామకృష్ణసమితి (శింగపేట) శ్రీ శారదాదేవి జన్మదినోత్సవ సందర్భముగా 8, 9, 10 తరగతుల బాల బాలికలకై నిర్వహించిన వ్యాసరచన పోటీయందు ప్రథమ బహుమతి నందిన దీ వ్యాసము—సం॥.



# అనుష్ఠానము

## వె. వి. సిద్ధారెడ్డి

ప్రస్తుత లోకమున వాచాజ్ఞానము ప్రబలి అనుష్ఠానము సన్నగిలుచున్నది. దీనినే శ్రీ వశిష్ట మహర్షులవారు "వాచావివేకము అవివేకముతో సమానమని" శ్రీరామచంద్రులవారికి బోధించెను. శ్రీకృష్ణపరమాత్మలవారు గీతయందు లక్ష్యమునుగూర్చి ఒకింతజెప్పి లక్ష్యసాధనను గూర్చి ఎక్కువగా జెప్పెను, ధ్యేయమును ఒకింత జెప్పి ధ్యానమునుగూర్చి విస్తారముగా బోధించెను. సాధ్యమును మితముగాజెప్పి సాధనను మిక్కుటముగ ప్రతిపాదించెను. ప్రస్తుత మానవలోకములోనున్న లోపమేమనగా! లక్ష్యము మీద ఉన్నంత ఆసక్తి లక్ష్యసాధనమీద లేకపోవడమే, ఎంతటి అగాధ సముద్రమైనను చిన్నపడవ నాధారముగా జేసికొని అవలీలగ దాటవచ్చును. అలాగే అనుష్ఠానమునందున్న చిన్న చిన్న సాధనలు నియమముగ అభ్యసించుటవలన మోక్షము జేరవచ్చును "నశ్రేయో నియమంవినా" నియమబద్ధమయిన జీవితము లేనివారు పశుతుల్యులే యగుదురు. భోజనాది కార్యక్రమమునకు ఎట్లు నియమమును పాటించుచున్నారో. అలాగే ప్రార్థన, జప, ధ్యానవిచారణాదులను అనుదినము నియమము తప్పక అనుష్ఠించవలయును ఆహారనియమము, నివాసనియమము, బ్రహ్మచింతనములను రత్నత్రయముల మూటెని ముముక్షువులు జీవితాంతమువరకు పాటించవలయును. సాధన లేనిచో భౌతికశక్తులు కూడా లభింపనేరవు ఇక అధ్యాత్మిక శక్తుల గూర్చి వేఱుగ జెప్పవలయునా? దీనినే శ్రీ వేమనార్యులవారు "సాధనమున పనులు సమకూరు ధరలోన" అని వక్కాణించెను. "రసరీ ఆవత జాతతో శిల్ పర్ హోతనిశాన్" కఠినమైన రాతి నేలమీద చీమలు రోజూ నడచినచో దానిపై ఒకదారి ఏర్పడగలదు, కఠినమగు శిలను భేదించు సామర్థ్యము అల్పమగు చీమకెట్లు కలిగినది? అభ్యాస ప్రాబల్యముచే, నిరంతర ప్రయత్నముచే, అలాగే బావిగట్టుపై ప్రతిదినము కుండను పెట్టుచుండినచో కొంతకాలమునకు గట్టుపై కుదురు ఏర్పడగలదు, రాతిని ఖండించు సామర్థ్యము కుండ కెట్లేర్పడినది? నిరంతరసాధనచే! అలాగే భయంకరమయిన అజ్ఞానమును జీవుడు ఆత్మవిచారణానుష్ఠానాదులచే పటాపంచలు జేసివేయగల్గుచున్నాడు.

"అజ్ఞోఽపి తజ్ఞతామేతి
శనైః శైలోఽపి చూర్ణ్యతే
బాణోఽప్యేతి మహాలక్ష్యం
పశ్యాభ్యాస విజృంభితమ్" వ॥ గీత

అభ్యాసముద్వారా అజ్ఞాని జ్ఞానియగుచున్నాడు. ప్రతిరోజు కొంత కొంత కొట్టుచుండినచో కొండకూడ పిండి పిండి అయిపోవుచున్నది. గురి బాగుగ అభ్యసించినట్లయిన సుదూర లక్ష్యమునుకూడ బాణము ఛేదించి వేయుచున్నది. అభ్యాసమువ కిట్టి ప్రభావముకలదు. మరియు

"ప్రయత్నాద్యతమానస్తు
యోగీ సంశుద్ధ కిల్బిషః
అనేకజన్మ సంసిద్ధ
స్తతోయాతి పరాంగతిమ్" భ॥ గీత

పట్టుదలచే ప్రయత్నించునట్టి యోగి పాపరహితుడై అనేక జన్మలందు చేయబడిన అభ్యాసముచే యోగసిద్ధిని బొందినవాడై, ఆపిదప సర్వోత్తమమగు మోక్షమును బొందుచున్నాడు.

శ్రీ భగీరథుడు తీవ్రతరయత్నమాచరించి ఎట్టకేలకు గంగను భూలోకమునకు తీసికొని రాగలిగెను. శ్రీ ధ్రువుడు స్థిరనిశ్చయము కలిగిన

వాడై ఘోర తపంబాచరించి నారాయణుని సాక్షాత్కరించుకొనెను. శ్రీ బుద్ధదేవుడు నిర్వాణప్రాప్తి కలుగువరకు ఈ ఆసనమునుండి లేవను అని భీష్మప్రతిజ్ఞ కావించి ఎట్టకేలకు శత్రువగు మారుని జయించి నిర్వాణస్థితిని బడసెను. శ్రీ రామకృష్ణపరమహంసాది పూజ్య మహాత్ములందరు ఇలాగే దృఢతరదీక్ష వహించి పరమపదమలంకరించియున్నారు. నా మనస్సు నిలుచుట లేదు మహానుభావా! అని అర్జునుడు విన్నవించగా "అభ్యాస వైరాగ్యాదులద్వారా నీ మనస్సును నీవే స్వాధీన పరచుకొనవలయును" శ్రీ కృష్ణపరమాత్ములవారు ఆనతిచ్చిరి. దీనిని పరికించిన అనుష్ఠానముయొక్క అసాధారణశక్తి అవగతమగును.

"సర్వేషు కాలేషు" ఎల్లవేళల తన్ను స్మరించవలసినదిగా భగవానుడాదేశించెను. శ్రీ గాంధీమహాత్ములవారు దేహవియోగ సమయమున "హేరామ్" అని రామనామస్మరణ ఎట్లు చేయగలిగెను? జీవితమంతయు రామనామమును స్మరించుటవలన. కావున ముముక్షువులు ధ్యానకాలమున మాత్రమే యోగులుగా వుండి తదనంతరము భోగులుగానుండక నిరంతరము స్వస్వరూపములో నుండుటకు ప్రయత్నించవలెను. ఇందులకు గురుశాస్త్రములు దారి చూపగలవు నడవవలసినది తనే కదా! తమ ఆకలి, రోగములను తమప్రయత్నముచేతనే తొలగించుకొన్నట్లు, తమ అజ్ఞానమునుకూడ తమ ప్రయత్నముచేతనే తొలగించుకొనవలయును.

"శరీర మాద్యంఖలు ధర్మసాధనం" మోక్షసాధనయందు దేహముయొక్క స్వస్థత ప్రముఖస్థాన మాక్రమించుచున్నది. వార్ధక్యదశయందు పరమార్థసాధనలందు దేహేంద్రియాదుల అశక్తతవల్ల సక్రమముగ జరుగవు. ఇనుము వేడిగానున్నపుడే వంగతీయవలెను చల్లబడినచో వంచ వీలుకాదు. దీపమున్నప్పుడే ఇల్లు చక్కబెట్టుకొనవలెనన్నట్లు శరీరము ఆరోగ్యముగ నున్నపుడే అంతశ్శత్రువులను దునుమాడి ఆత్మ సామ్రాజ్యాధికారమును చేపట్టవలెను.

ప్రస్తుత లోకమున దేవుని పూజిస్తూ జీవుని తిరస్కరిస్తున్నారు. జీవుడు నా అంశమేనని గీతాచార్యుడు పలికియున్నాడు. "ఆత్మౌపమ్యేన" ఆత్మదృష్టితో సకల చరాచర భూతకోటిలోని ఆత్మయు నా ఆత్మయు ఒక్కటే. వాని సుఖదుఃఖములు నా సుఖదుఃఖములు ఒక్కటేనని భావించి సర్వ చరాచరములపై జీవకారుణ్యము, భూతదయ అలవరచుకొనవలెను. ముముక్షుజనులకు పరమత సహనము అత్యంతావశ్యకము తన మతమును అభివృద్ధి పరచుకొనుచు ఇతర మతములలోని మంచిని గ్రహించవలెనేకాని పరమత దూషణ, నిందాదులు పనికిరావు.

"ప్రమాదో బ్రహ్మ నిష్ఠాయాం
నకర్తవ్యః కదాచన
ప్రమాదో మృత్యురిత్యాహ భగవాన్
బ్రహ్మణ స్సుతః" వి॥ చూ॥

బ్రహ్మనిష్ఠయందు, తత్త్వవిచారణయందు, ఆధ్యాత్మిక సాధనలయందు మందత్వము, సోమరితనము పనికిరావు. సోమరితనమే మరణమని భగవంతుడగు సనత్కుమారుడు పల్కెను, అని శ్రీ శంకరాచార్యులవారు వ్రాసిరి మరియు

"శ్రద్ధకు సమమైనది మరియొకటి లేదని" ఎందరో మహాత్ములు వచించియున్నారు. కావున ముముక్షువులు శ్రద్ధాళువులై, అమూల్యమయిన కాలమును సద్వినియోగ పరచుకొనవలయును. మహాత్ముల జీవితచరిత్రలు పరిశీలించినవారు ఎంతటి శ్రద్ధతో శ్రమించి స్వస్వరూప సాక్షాత్కారము పొందగలిగినది అవగాహనమగును. ప్రతి ముముక్షువు మహాత్ములకోవలో పయనించి

గమ్యమును జేరుటకు తీవ్రతరయత్న మాచరింపవలెను. మహాదుర్లభమగు ఈ నరజన్మ లభించినందున మోక్షాసక్తులై సద్గురుదేవుల నాశ్రయించి వారి ఆదేశ ప్రకారము శ్రద్ధాభ్యాస వైరాగ్య తత్త్వ విచారణాదులద్వారా నిరంతర కృషిసలిపి ఈ జన్మధ్యేయమగు పరమపద మలంకరింతురుగాక!

లోకాస్సమస్తా స్సుఖినో భవంతు.

# మానవుడు

## శ్రీ వివేకానందస్వామి

ఈ మానవశరీరమే సకలవిశ్వమునందును సర్వోత్కృష్టమైన శరీరము. మానవుడే మహోన్నతమైన ప్రాణి. అన్నిజంతువులకంటెను అందరు దేవతలకంటెను మానవుడే శ్రేష్ఠుడు. మానవునికంటె ఘనుడింకొకడు లేడు. దేవతలైనను సరియే మరల దిగివచ్చి మానవశరీరముద్వారా మాత్రమే పరిపూర్ణత నందవలసియున్నది. మానవుడుమాత్రమే పరిపూర్ణత నందగలడు. అది దేవతలకుకూడ సాధ్యముకాదు. యూదుల మహమ్మదీయుల మతమున, దేవతలను తదితరము లన్నింటిని సృష్టించినపిదప భగవంతుడు మానవుని సృజించెను. మానవుని సృజించి దేవతలందరిని మానవునకు నమస్కరింపుడని యాదేశించెను. ఇబ్లిస్‌తప్ప, అందరును అట్లే చేసిరి. ఆ అపరాధమునకు భగవంతుడు ఇబ్లిస్‌ను శపించెను. దానివలన అతడు సాతాను అయ్యెను. ఈ కథ వెనుకనున్న మహాసత్యమేమి? ఈ మానవజన్మమే మనము పొందగలిగిన మహోత్కృష్టమైన జన్మము.

ఇది గమనార్హమైన విషయము. ఒక్క అపవాదమైనను లేక అన్ని మతములును మానవుడు తన సనాతన సహజస్థితినుండి అధఃపతనమేయని విశ్వసించుచున్నవి. పౌరాణిక గాథలలో వర్ణించినను స్పష్టమగు వేదాంతభాషలో వివరించినను లేక మనోహరములగు కవితలల్లినను వాని విషయ మిదియే.

నిజమగు మానవుడు అద్వితీయము అనంతము సర్వవ్యాప్తము అగు చైతన్యము. ఛాయామానవుడు, అతడెంత ఘనుడైనను, అతీతుడగు మానవుని మంద ప్రతిఫలనమే. నిజమగు మానవుడు, అనగా చైతన్యము, కార్యకారణముల కతీతమగుటచేతను దేశకాలములచే నిబద్ధము కాకపోవుటచేతను, స్వతంత్రముగ నుండవలెను. ఛాయామానవుడు, అనగా ప్రతిఫలనము, దేశకాలనిమిత్తములచేత బంధింపబడియుండుటచేత అది బద్ధము. లేదా మనకొందరు వేదాంతుల భాషయందు మానవుడు బద్ధుడైనట్లుకన్పించును. కాని నిజముగ బద్ధుడు కాడు.

ఏ పుస్తకములు శాస్త్రములు తత్త్వగ్రంథములుగాని మానవునివలె కన్పించు ఆ ఆత్మయొక్క వైభవమును ఊహింపనైన ఊహింపలేవు. ఉన్న మహావైభవోపేతుడైన భగవంతుడు ఆ ఆత్మయే. ఆ భగవంతుడే ఎన్నడైనను ఉండినది ఇప్పుడు ఉండునది ఇక మీదనుండబోవునదియును.

మానవుడు తన వెలుపలగల భగవంతుల కొరకై నిష్ఫలమైన అన్వేషణపిదప ఆ పరిభ్రమణమును పూర్తిచేసి తాను బయలుదేరిన స్థానమునకే వచ్చిచేరును – అదియే మానవుని ఆత్మ. ఏ భగవంతునికొరకై తాను కొండలు కోనలు వెదకుచుండెనో, దేవాలయములు చర్చీలు స్వర్గములలో గవేషించుచుండెనో, స్వర్గమున నాసీనుడై ప్రపంచము పాలించుచుండునని యూహిం

చుచుండెనో, ఆ భగవంతుడు తన ఆత్మయే అని మానవుడు కనుగొనును. సోఽహం(అతడేనేను) సోఽహం. భగవంతుడు నేనే, మరియొకరు కాదు. ఇక ఈ అల్పపు 'నేను' ఎన్నడును ఉండియుండ లేదు.

భగవంతు నారాధించుటకు నీవొక ప్రతీకను కనుగొనవచ్చును. కాని శ్రేష్ఠతరమైన ప్రతీక ఇప్పటికే యున్నది, అదియే సజీవుడైన మానవుడు. భగవంతు నారాధించుటకు నీవొక దేవాలయమును నిర్మింపవచ్చును అది మంచిదే కావచ్చును. కాని శ్రేష్ఠతరమైనది ఎంతో ఉత్తమమైనది అయిన దేవాలయము ఇప్పటికేయున్నది. అదియే మానవశరీరము.

సజీవుడైన భగవంతుడు నీయందేయున్నాడు. అయినను గుడులు గోపురములు కట్టుచు కపోల కల్పితమైన చెత్తనంతటిని నమ్ముచున్నావు. పూజింపదగిన ఏకైకదైవము మానవశరీరములోని మానవఆత్మ మాత్రమే. అన్ని జంతువులునూ దేవాలయములనుటకూడ సత్యమే. కాని మానవుడే సర్వోత్తమ దేవాలయము. ఆ దేవాలయములో నేను పూజింపజాలనిచో ఇక ఏ ఇతర దేవాలయమైననునిరుపయోగమే. ప్రతిమానవశరీరము అను దేవాలయమునందు భగవంతుడు ఆసీనుడైయున్నాడని నేను గుర్తించిన క్షణముననే, ప్రతి మానవుని ఎదుటను భక్తిప్రపత్తులతో నిలిచి అతనియందు భగవంతుని చూడగలిగిన క్షణముననే—ఆక్షణముననే నాకు బంధవిమోచన మగును, బంధకారణములన్నియు అదృశ్యములగును, నేను ముక్తుడ నగుదును.

మానవునియందు ఇక స్వార్థమే లేనపుడు, ఎట్టి ఆస్తియు 'నన్ను' 'నాది' అనుట కేదియు లేనపుడు, తనను తాను సంపూర్ణముగా పరిత్యజించినపుడు, 'తనను' నిర్మూలించుకొనినపుడు అట్టి మానవునియందు సాక్షాత్ భగవంతుడే నిలుచును. ఏలన అట్టి మానవునియందు స్వీయసంకల్పము పోయినది, అణగిపోయినది, మూలనాశనమైనది, అట్టినాడే ఆదర్శమానవుడు.

మానవుని వికాసమును కొలుచుట కొకటియే మార్గము. ఇంద్రియములకు క్రిందదిగవిడిచి ఉన్నతతర వాతావరణములో జీవింపగలుగుట, ఊపిరిబిగ్గులని ఉగ స్వచ్ఛమైన ఆలోచనలనెడు-ఆక్సిజనను ఎంత పీల్చుకొనగలడనుట, ఆ ఎత్తున ఎంతకాలము ఉండగల డనుటయునే.

మొదట మనము భగవంతుల మగుదుము గాక అటుమీద ఇతరులు భగవంతులగుటకు సాయము చేయుదముగాక. 'అగుము, చేయుము' ఇది మన కార్యముగాక. ఎవనినిగాని పాపి యనకుము. అతడు చేస్తున్నది అతనికి చెప్పుము. ఒకవేళ దెయ్యమనునదే ఉండినను, మన విధి భగవంతుని గుర్తుంచుకొనుటయేగాని దెయ్యమును కాదు.

నీవు ఒక శరీరమవని యనుకొనినపుడు, విశ్వమునుండి నీవు భిన్నుడవు. నీవు ఒక జీవుడవని తలచునపుడు ఆ శాశ్వతవహ్నిలో నొక నిప్పురవ్వవు. నీవు ఆత్మవని భావించునపుడు సర్వమును నీవే.

భేషజముచే ఏ ఘనకార్యమును సాధింపబడదు. ప్రేమద్వారామాత్రమే సత్యముకొరకు ఆరాటమువలననే అపారమైన శక్తివలననే అన్ని కార్యములును సాధింపబడుచున్నవి. తత్ కురు పౌరుషమ్ - కనుక నీ మగటిమి ప్రకటింపుము.

మనకు ధర్మముకాదు కావలసినది, ధర్మము నతిక్రమించు శక్తి. మనము ధర్మాతీతులము కావలెను. ధర్మములచే నీవు కట్టబడినచో నీవొక బంకమట్టిముద్దవగుదువు. నీవు ధర్మాతీతుడవు అవునా కాదా అనునది ప్రశ్నకాదు, మనము ధర్మమున కతీతులమనెడు ఊహయే — దానిపైననే మానవచరిత్ర యావత్తును ఆధార

పడియున్నది.

ప్రతిమానవుడును ఇప్పటికే అనంతుడు. ఈ గొళ్లెములు చిలుకలు వివిధపరిస్థితులు మాత్రమే అతనిని మూసిపెట్టుచున్నవి. కాని అవి తొలగింపగనే అతడు వెలుపలికి దూసికొనివచ్చి తన నావిష్కరించుకొనును.

యోగితప్ప ప్రతిమానవుడును బానిసయే. ఆహారమున కతడు బానిస. గాలికి భార్యకు పిల్లలకు ధనమునకు దేశమునకు పేరుప్రతిష్ఠలకు ప్రపంచములో నిక వేయున్నొక్కంటికి అతడు బానిస. ఈబంధములలో నేయొక్కదాని చేతను నియమితుడుకాని ఆమానవుడుమాత్రమే యథార్థమైన మానవుడు. యథార్థమైన యోగి.

ప్రస్తుతవికాసపు పరిధులలో ప్రతివానికిని తనను తాను బాగుచేసికొనుటకు అవకాశము కలదు. మనలను మనము విడగొట్టుకొనలేము. మనలోనున్న ప్రాణశక్తిని కుంఠితము చేయలేము కాని దానికి మరొక గమ్యము చూపుటకు మనకు స్వాతంత్ర్యము కలదు.

మానవులు అనుష్ఠానశీలురు శారీరకముగ బలవంతులు అగునట్లు శిక్షితులు కావలెను. అట్టి పురుషసింహములు ఒక పది ప్రపంచమును జయింపగలవు, లక్షలకొలది గొర్రెలు జయింపలేవు. రెండవవిషయము, ఎంత గొప్పదైనను వ్యక్తి ఆదర్శమును అనుకరించుట మానవులకు నేర్పరాదు.

మానవుడు చిన్నపెట్టెలో అణచిపెట్టబడిన అనంతమైన స్ప్రింగువంటివాడు. ఆ స్ప్రింగు విప్పుకొనుటకు ప్రయత్నించుచున్నది. ఈ విప్పుకొను ప్రయత్నమే మనముచూచు ఈ సాంఘిక ఘటనలన్నియును.

మీరు భగవంతుని పుత్రులు, శాశ్వతానందమునకు భాగస్వాములు, పవిత్రులు పూర్ణపురుషులు భూమిపైని దేవతలు మీరా - పాపులు! మానవుని పాపి అనుటయే పాపము. మానవస్వభావముపై నది చెరుపరాని కళంకము.

మనము ప్రతియొక్కరము ఒక జీవకణము నుండి ఉద్భవించినవారమే. మనకుగల సర్వశక్తులును అందే ఇమిడియుండినవి . . . ఆ శక్తులన్నియు అచ్చటనే యుండినవి, గర్భితముగనే కావచ్చును కాని ఉండినది అందే. అట్లే అనంతమైన శక్తి మానవుని ఆత్మయందున్నది, ఆ సంగతి అతనికి తెలిసినను తెలియకపోయినను సరియే. దాని ఆవిష్కరణమునగా దానియందు మనకు స్పృహ తెలియుటయే. నిదానముగ ఆ విరాట్ పురుషుడు మేలుకొనుచున్నాడు, అతనికి తన శక్తినిగూర్చి స్పృహవచ్చుచున్నది, ఉద్బోధితుడగుచున్నాడు. ఆతని చైతన్యము వికసించుకొలది ఆతని బంధములు ఇతోధికముగ వీడిపోవుచున్నవి. సంకెలలు తెగిపడుచున్నవి. ఇక త్వరలో అతడు తన అనంత శక్తి జ్ఞానములను సంపూర్ణముగ తెలిసికొని లేచి నిటారుగ నిలబడు రోజు రానున్నది. ఆ మహాద్భుత పర్యవసానమును శీఘ్రతరము చేయుటకు మనమందరమును సాయము చేయుదముగాక. (సంకలనము)



# సత్కథాతరంగిణి:

శారదకు ఐదవఏడు వచ్చింది. అది మరీ పసితనము. వారిది చాలా బీదకుటుంబము. అందువల్ల రామచంద్రముఖోపాధ్యాయ ఆమె పెండ్లికి ఒప్పుకున్నాడు. పెళ్లికొడుకు శ్రీరామకృష్ణుడు. ఆయనకు ఇరువదిమూడు ఏండ్లు. దక్షిణేశ్వర కాళికాలయములో పూజ చేస్తుండేవాడు. ఆయన పూజ మామూలు పూజ కాదు. విగ్రహాన్ని తల్లిలాగా చూచేవాడు. పూజచేస్తూ ఒక్కొక్కసారి ఆ పూలు తనమీద కూడా వేసుకునేవాడు. అందువల్ల అతనికి పిచ్చి ఎక్కిందని వార్తలు వ్యాపించినవి. అది విని తల్లి చంద్రాదేవి ఆయనను కమార్పుకూరుకు పిలిపించింది. పెళ్లి చేస్తే పిచ్చి కుదురుతుందనుకుంది. పెద్ద కుమారుని ద్వారా రామకృష్ణునకు తెలియకుండా సంబంధాలు చూచింది.

కాని ఇది కనిబెట్టిన రామకృష్ణుడు ఇలా చెప్పాడు. 'జయరాంబాటిలో రామచంద్ర ముఖోపాధ్యాయ యింటికి పొండి. అక్కడ నాకొరకు ఈతాకు కట్టిన పిల్ల ఉన్నది.' ఈతాకు కట్టట మంటే ఇదివరకే నిర్ణయమయి ఉన్నది అని అర్థము. రామకృష్ణుని అన్నగారు అక్కడకు పోయి అడుగగానే రామచంద్ర ముఖోపాధ్యాయ ఒప్పుకున్నాడు.

కోడలికి సొమ్ములు పెట్టాలి గదా! తన దగ్గిరా, ఏమీ లేదు. అందువల్ల చంద్రాదేవి కొన్ని అరువు సొమ్ములు తెచ్చిపెట్టింది. పెళ్లి జరిగిపోయింది. శారద సొమ్ములు చూచుకుని సంబరపడింది. పెళ్లి కాగానే అత్తవారింటికి తీసుకుపోయారు. అరువు సొమ్ములు తిరిగి ఇవ్వాలి కదా, కాని చంద్రాదేవికి అవి తీయటానికి మనసు రాలేదు. కాని రామకృష్ణుడు శారద నిద్రపోతున్నప్పుడు నెమ్మదిగా తీసివేశాడు. నిద్రలేచి శారద సొమ్ములు పోయినవని ఏడవ మొదలుపెట్టింది. అప్పుడు చంద్రాదేవి తన చిట్టి కోడలిని కౌగలించుకుని 'శారదా! నీవు పెద్దదానివైన తరువాత మా అబ్బాయి మంచి సొమ్ములు చేయించి పెడతాడులే' అని చెప్పి ఓదార్చింది.

తన కెప్పుడు పెండ్లయిందో శారదకు జ్ఞాపకమే లేదు. తన పెళ్లి అయిన పది రోజులకు ఈత పండ్లు పండినవని ఆమె తర్వాతి కాలంలో చెప్పింది

కని విని యెరుగని నరునితో
మానితముగ పెండ్లి జరిగె మన శారదకున్
కని యెరుగము విని యెరుగము
మన శారద సొమ్ములతడు మాయగ దీసెన్.

* * *

పూర్వకాలంలో ఒకసారి దేవతలూ రాక్షసులూ సంధి చేసుకుని అమృతంకోసం పాల సముద్రాన్ని చిలకడానికి సన్నద్ధులయ్యారట. సముద్రమంత కడవలో పెట్టడానికి కవ్వం అంత పెద్దది కావాలిగదా, వెదకి వెదకి మందరపర్వతాన్ని తీసుకువచ్చారు. అంత పెద్ద కడవకు అంత పెద్ద కవ్వం సరిపోయింది. కవ్వానికి తగిన త్రాడు కావద్దూ. సర్పాణా మస్మి వాసుకిః అని విష్ణువు అంశ యేమైన వాసుకి అనే మహా సర్పాన్ని పిలుచుకు వచ్చారు. రాక్షసులు ఆ సర్పం తలలూ దేవతలు తోకా పట్టుకుని చిలక నారంభించారు.

మామూలు పెరుగుకుండ అయితే కొయ్యకవ్వం తేలికగాబట్టి తేలుతూ నిలబడి ఉంటుంది. కాని ఈ కవ్వం పెద్ద కొండ అయ్యె. ఆ బరువుకు అది అగాధమైన పాలసముద్రంలోకి క్రమంగా జారి మునిగిపోయింది. ఇంత కష్టపడి చేసిన ప్రయత్నమూ వ్యర్థమయిపోయిందే అని కుయ్యో మొర్రో అని మొత్తుకుంటూ దేవతలు విష్ణుదేవునివద్దకు పోయారు. దయాసముద్రుడైన ఆయన దయదలిచి పెద్ద తాబేలుగా రూపు దాల్చాడట. అదే కూర్మావతారం.

అలా తాబేలై క్షీరసాగరంలో దూకి మందరగిరి క్రింద లేవదీశాడట. ఇలా క

వ్యం మళ్లీ లభించగా, అది మళ్లీ మునగకుండా విష్ణువు కూర్మరూపంలో మోస్తూ ఉండగా దేవ దానవులు క్షీరసాగరమథనం మళ్లీ ప్రారం భించారు.

'శ్రేయాంసి బహు విఘ్నాని' ఒక మంచి పని పూర్తిచేయాలంటే ఎన్నో అడ్డా లెదురౌతాయట. మహాబలవంతులైన దేవదానవులు అలా మథిస్తూ ఉండగా పాలసముద్రంలోంచి మొట్టమొదటగా హాలాహల విషం పుట్టిందట. ఆ మహావిషం ఆకాశానికి ఎగిసి దిగంతరాళాలకు వ్యాపించి పాతాళందాకా వేరుపారి ముల్లోకాలనూ కాల్చివేయ సాగిందట.

తమను రక్షించే వాడెవడని దేవతలు దానవులూ చెల్లాచెదరుగ పామును వదిలేసి పారిపోయారట. అలా పారిపోయిన దేవతలు ఈశ్వరుడి దగ్గరకు పరుగెత్తి, మహానుభావా నీవే మమ్మల్ని రక్షించాలి. ఈ హాలాహల విషాన్ని నీవే భక్షించాలి. లోకాల్ని కటాక్షించాలి అని స్తోత్రం చేశారు.

నీ కంటె నొండెఱుంగము
నీ కంటెం బరులు గావనేరరు జగముల్
నీ కంటె నొడయ డెవ్వడు
లోకంబుల కెల్ల నిఖిలలోక స్తుత్యా.

భక్తజన వశంవదుడైన ఆ శంకరుడు వారిపై దయదలచి భూన భోంతరాళములలో వ్యాపించిపోయిన ఆ హాలాహల విషాన్ని పిడికిటబట్టి ముద్దచేసి నోట్లో వేసేసుకున్నాడట!

కానీ మింగేస్తే ఎలా! పొట్టలో ఉన్న లోకాలకు ఉపద్రవమని ఆ విషాన్ని అలాగే గొంతులోనే నిలిపివేశాడట. అప్పటినుండీ ఆయనకు గరళకంఠుడని పేరు స్థిరపడిపోయింది.

అలాగ ఉపద్రవాలన్నీ గడిచి మథనం కొనసాగించగా క్షీరసాగరంలోంచి కామధేనువూ ఉచ్చైశ్శ్రవమూ మొదలైనవన్నీ వచ్చి తుదిని అమృతకలశం ధరించి ధన్వంతరి బయటకు వచ్చాడట.

రాక్షసులు ఆ ధన్వంతరి చేతిలోని అమృతకలశాన్ని ఎగరేసుకుని పరుగెత్తిపోతూ ఉంటే దేవతల కుయ్యాలించి మహావిష్ణువు మళ్లీ మోహినీ అవతారం ధరించి రాక్షసులను మోసగించి దేవతలకే ఆ అమృతమంతా పంచిపెట్టాడుగదా!

అలాగ సజ్జనులు తమకు ఎన్ని బాధలు కలిగినా సహించి విష్ణువులాగా ఈశ్వరుడిలాగా ఇతరులకు ఉపకారాన్నే చేస్తూ ఉంటారు.

## గమనిక

శ్రీరామకృష్ణమఠ సేవాసంఘ ఉపాధ్యక్షులు శ్రీమత్ భూతేశానందస్వామిజీ మహారాజులవారు మార్చినెలలో దక్షిణభారత దేశమునకు వేంచేయుదురని పాఠకమహాశయులకు తెలుపుట కానందించుచున్నాము. దిగువ నీయబడిన తేదీలలో ఆయా ప్రదేశములందలి శ్రీరామకృష్ణమఠములందు వారు విడియుదురు.

| | | | | |
|---|---|---|---|---|
| రాజమండ్రి | మార్చి | 12 తేదినుండి | 15 | తేదివరకు |
| మద్రాసు | మార్చి | 16 ,, | 23 | ,, |
| ఉటకమండ్ | మార్చి | 24 | 30 | ,, |
| మైసూరు | మార్చి | 30 | 2 | ఏప్రిలువరకు |
| బెంగుళూరు | ఏప్రిలు | 2 | 6 | తేదివరకు |
| సికిందరాబాదు | ఏప్రిలు | 7 | 10 | ,, |

# భక్తిరత్నావళి

మూలము : విష్ణుపురి

అనువాదము : విష్ణుచిత్తుడు

(తృతీయ విరచనము)

## 11

మృత్యుభయముతో కూడ సకలభయములను హరించుటయందు భక్తి సామర్థ్యమును సూతుడు ప్రకటించుచున్నాడు.

నోత్తమశ్లోకవార్తానాం జుషతాం తత్కథామృతమ్
స్యాత్సంభ్రమో న్తకాలేపి స్మరతాం తత్పదాంబుజమ్॥ (1-18-4)

భగవంతుని లీలావిశేషములను నిరంతరము స్మరించుచు ఆతని కథామృతమునే నిరంతరము ఆస్వాదించుచు ఆ చరణారవిందములనే నిరంతరము ధ్యానించు భక్తుడు మరణసమయమునకూడ భయమునుగాని తత్తరపాటునుగాని అనుభవింపడు కదా!

## 12

భక్తిమార్గముయొక్క ఉత్కృష్టతను శ్రీశుకుడు వివరించుచున్నాడు.

మర్త్యస్తయానుసవమేధితయా ముకున్ద శ్రీమత్కథాశ్రవణవర్ణన చిన్తయేతి।
తద్ధామ దుస్త్యజ కృతాన్తజవాపవర్గం గ్రామాద్వనం క్షితిభుజోపి యయుర్యదర్థా॥
(10-90-50)

భగవద్వైభవమును నిరంతరాయముగ వినుటచేతను కీర్తించుటచేతను గాఢతరమైన ధ్యానముద్వారా భక్తుడు జరామరణముల కతీతమైన పరంధామమును చేరుకొనుచున్నాడు. చక్రవర్తులు సైతము తమ సామ్రాజ్యములను పరిత్యజించి అరణ్యములలో ఏకాంతవాసము చేయుట ఆ పరమపదము నందుకొనుటకే.

## 13

భగవద్గుణకీర్తన మెట్లు పనిచేయునో శ్రీశుకుడు తెలుపుచున్నాడు.

యానీహ విశ్వ విలయోద్భవవృత్తిహేతు కర్మాణ్యనన్త విషయాణి హరిశ్చకార।
యస్త్వఙ్గ గాయతి శృణోత్యనుమోదతేవా భక్తిర్భవేద్భగవతి హ్యపవర్గమార్గే॥
(10-69-45)

విశ్వముయొక్క సృష్టిస్థితివినాశములలో పరమపురుషుడు అనంతములు అమేయములు అయిన లీలలతో ఆవిర్భవించినాడు. ఆ దివ్యమాహాత్మ్యముల నెవడు ˚రించుచు వినుచు ఆనందించునో అతనికి పరాభక్తి సిద్ధించును.

## 14

భక్తి మనస్సునందలి సకలభయములను ఎట్లు హరించునో సనకాది కుమారులు వచించుచున్నారు.

కామం భవః స్వవృజినైర్నిరయేషు నః స్యాచ్చేతోఽలివద్యదినుతే పదయోరమేత।
వాచస్తు నస్తులసివద్యది తేంఘ్రిశోభాః పూర్యేత తే గుణగణైర్యది కర్ణరంధ్రః॥
(3-15-49)

మా మనస్సులు తుమ్మెదలవలె నీ పాదపద్మములయందే సక్తములైనచో, మా పలుకులు తులసీదళములవలె నీ పాదమహిమనే ఆశ్రయించినచో, మా చెవులు నీ గుణకీర్తనముల చేతనే నిండినచో, ఇక మా పాపములు మమ్ము నీచజన్మములకేగాని నరకములకేగాని కొని పోయినను మేము గణింపము.

## 15

వివేచనాపరులెల్లరును భక్తిసాధన నవలంబింపవలెనని నందుడు పలుకుచున్నాడు.

మనసోవృత్తయోనః స్యుః కృష్ణపాదాంబుజాశ్రయాః ।
వాచోభిధాయినీర్నామ్నాం కాయస్తత్ప్రహ్వణాదిషు॥ (10-47-66)

మా మనస్సులు నిరంతరము శ్రీకృష్ణధ్యానముననే లగ్నములై యుండునుగాక. మా వాక్కులు అతని భవ్యనామములనే రించునుగాక. మా శరీరములు అతని ఎదుట సాష్టాంగ పడుగాక.

## 16

వివిధములగు వ్రతముల నాచరించుటకంటె భగవన్నామకీర్తనమే శ్రేష్ఠతరమైనదని యముడు వచించుచున్నాడు.

గృణతాం శృణ్వతాం వీర్యాణ్యుద్దామాని హరేర్ముహుః
యథా సుజాతయా భక్త్యా శుద్ధ్యేన్నాత్మా వ్రతాదిభిః॥ (6-3-32)

భగవద్గుణకీర్తనములచేతను వానిని వినుటచేతను సులభముగా జనించు భక్తిచే పరిశుద్ధమైనటు ఆత్మ ఎట్టి వ్రతాచరణములచేతనైనను పరిశుద్ధము కానేరదు.

## 17

భక్తియే జ్ఞానము నెట్లు కలిగించునో శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు.

యథా యథాత్మా పరిమృజ్యతేసౌ మత్పుణ్యగాథా శ్రవణాభిధానైః ।
తథా తథా పశ్యతి తత్త్వసూక్ష్మం చక్షుర్యథైవాంజన సంప్రయుక్తమ్॥ (11-14-26)

కాటుక పెట్టుటచే కన్నులు ఎట్లు సూక్ష్మవస్తువులను చూడగలుగు సామర్థ్యమును పొందునో అట్లే నా గుణకీర్తన జనితమైన భక్తియనెడు కాటుక ధరించిన మనోనేత్రము తత్త్వసూక్ష్మములను అవలీలగా దర్శించు సామర్థ్యమును పొందును.



# వార్తలు - విశేషాలు

## శ్రీ వివేకానంద జయంతి

శ్రీ రామకృష్ణమఠము మైలాపూరు (మద్రాసునందు) శ్రీ వివేకానందజయంతి 12-1-77 వ తేది వైభవముగా జరుపబడినది. మఠాంగణమున శ్రీ వివేకానందస్వామి చిత్రపటము మనోహరముగా నలంకరింపబడి భక్తులకు నయనానందమును మనఃప్రసాదమును కలిగించుచుండగా అనేకులు మఠపుపావన ప్రదేశమున సమాగతులైరి. ఉదయము 5 గంటలకు మంగళహారతితో ఉత్సవము ప్రారంభమైనది. ఉపనిషత్పాఠము గీతాపఠనము చండీ పారాయణము యథావిధిగా జరుగుచుండగా భజనలు కీర్తనలు మరియొకవైపున భక్త్యావేశముతో కొనసాగినవి. మధ్యాహ్నం 12 గంటలకు విశేషపూజ హోమము పరిసమాప్తి నొందినవి. ఉదయము 8-30 గంటలకు శ్రీమన్నిత్య బోధానందస్వామివారితో కూడ మఠస్వాములు మెరీనాయందుగల శ్రీ వివేకానందస్వామి విగ్రహమునకు మాలాలంకరణము గావించిరి. హారతి అనంతరము అచ్చట కూడ ప్రసాదవితరణము జరిగినది. మధ్యాహ్నము హోమము తరువాత మఠమున సమాగతులైన భక్తజనులకు ప్రసాదవితరణము జరిగినది.

ఆ సాయంకాలము శ్రీ వివేకానందస్వామి (చిత్రపటము) ఎదుట భక్తులెల్లరును ఆరాత్రికానంతరము సమావిష్టులైరి, శ్రీమన్నిత్యబోధానందస్వామి శ్రీ వివేకానందస్వామిని గూర్చి ప్రసంగించిరి.

శ్రీ వివేకానందస్వామియొక్క తేజపు మూలకారణములను గూర్చి భాషించుచు స్వామివారి అమెరికా కీర్తియంతయు ఆ తేజముయొక్క ఉపఫలితమేయనిరి. స్వామిజీ ఆధ్యాత్మిక తేజమునకు మూర్తీభావము, మానవప్రబోధకుడు, శ్రీరామకృష్ణునకు ప్రియతముడు. తేజమనునపుడు ఆయన క్షాత్ర తేజమును ఆధ్యాత్మిక తేజమునుకూడ గ్రహింపవచ్చును. ఈ క్షాత్రతేజము ఆయనకు జన్మసిద్ధము. ఆధ్యాత్మిక తేజము ఆయన గురుదేవుని ప్రసాదము. శ్రీరామకృష్ణుడు తన నిర్యాణమునకు మునుపు తన సర్వస్వమును శ్రీ వివేకానందస్వామికి ధారపోసిన విషయము సువిదితమే.

అట్టి ఆ తేజోమూర్తి జనులకు ఆధ్యాత్మికతను బోధింపలేదు. రెండు చేతులతో పంచిపెట్టెను. ఆకారణముననే ఇప్పటికిని ఆయన రచనలపుటలు అమరములై జనుల నాకర్షించుచు జీవత్కంఠముతో గర్జించుచున్నవి. ఆయన ఉద్యమమునకు తమజీవితముల నర్పింప జేయుచున్నవి.

శ్రీ వివేకానందస్వామి దైవాంశ సంభూతుడనుట శ్రీరామకృష్ణులే పలుమారు పేర్కొనియుండిరి. ఆయన సప్తర్షులలో నొకడనియు నరమహర్షి అవతారమనియు దివ్యదర్శనమునందాయన చూచియుండెను. అట్లే కాశీపూరు గృహమున నుండినపుడు శ్రీ శివానందస్వామి ఒకరాత్రి వివేకానందస్వామి పడకచుట్టును ఎనిమిదేండ్ల బాలురు శివుని రూపములతో నృత్యము చేయుచుండుటను చూచెను. స్వామీజీ ఈశ్వరకోటిలోని వాడనియు కారణజన్ముడనియు శ్రీ రామకృష్ణులనిరి. స్వామిజీకి శరీరముండినంత మాత్రమున ఆయన మనవలె శరీరమునకు బానిసకాడు. ఆ మహాయోగి అమరనాథ్ క్షేత్రమున మృత్యుంజయుడై శివునినుండి స్వచ్ఛందమరణమును వరముగా పొందినాడు.

ఆయనలోని మానవాంశను గమనించినచో ఆయన భావావేశము అపరిమితము. ఆయన చేసిన పొరపాటులన్నియు ఆ అపరిమితమైన ప్రేమాతిశయమునుండి జనించినవే. దాని కాయన ఎన్నడును చింతింపలేదు. అట్టి పొరపా

టును మనమును చేయవలెనో వలదో ఎవరికి వారే నిర్ణయించుకొనవలసిన విషయము.

అట్లే ఆయన విశాల హృదయమునకును జాతి మతాది హద్దులు లేవు. ఆచారపరాయణుడగు శ్రీ తురీయానందస్వామిని అమెరికాకు రమ్మని ఆయన అర్థించినపుడు మొదట ఆయన అంగీకరింపలేదు. 'భారతదేశమును వదలుట నా ఆధ్యాత్మిక జీవితమునకు చావుపెట్టు' అని నిరాకరించినాడు. అపుడు స్వామిజీ '(శ్రీ)రామకృష్ణులను కలిసినప్పటినుండి నా హృదయము, నీవు సదాచారమందువో అనాచారమందువో, విశాలమై పోయినది' అనిమాత్రమని అచటినుండి వెడలిపోయెను. ఆ తరువాత తురీయానందస్వామియే స్వామివెంట జనుటకు నిర్ణయించుకొనెను.

ఆయన బోధలనిననో, అవి వట్టిసిద్ధాంతములు ఆధ్యాత్మిక సాధనమార్గములు మాత్రమే కావు. ఆధ్యాత్మిక గమనమున మానసిక పరిపూరణమున భూమికల నతిక్రమించుటకు అవి దోహదకారులు. పాశ్చాత్యమున ఆయన బోధలయందాసక్తికి ఇది ముఖ్యకారణము. మన ఆధ్యాత్మిక సాధనలవంటివే సాధనలు పాశ్చాత్యులకును ఉన్నవి. స్వామిజీ బోధలు వానిని పూర్తి చేసి పరిప్లుతములగుటయే వారికి ముఖ్యాకర్షణ. ఆయన బోధలలో ఆయన స్వయముగా రచించినది రాజయోగ మొకటియే. మిగిలినవన్నియు ఉపన్యాసములు సంగ్రహములు.

ఆయనయే నిజమగు ఆచార్యుడు. తన జీవితమున ఆఖరిక్షణమువరకును జ్ఞానభక్తి రాజ కర్మయోగములను అనుష్ఠించుచునే యుండెను. శ్రీరామకృష్ణుని అనుగ్రహము వారిపట్ల అద్యంతమును ఉండినది. వారినుండి ప్రప్రథమముగ సమాధిని పొందినదిస్వామిజీయే. చివరగా ఆయన 'అస్తి'నంతయు స్వీకరించినదియు స్వామిజియే.

మన శాస్త్రగ్రంథములపై అనురాగమును జన్మభూమిపై ప్రేమయును జీవితమున కాధారములుగ చేసికొనుడని తన బిడ్డల కాయన సందేశము. మన సర్వ కార్యకలాపములకును మన శాస్త్రములే ప్రమాణములుగ నుండవలెను. ఈ శాస్త్రములే గురువు జీవితమున నిరూపింపబడవలెను. నిజమగు ఆధ్యాత్మికతకు ప్రమాణము శాస్త్రములే. ఈ శాస్త్రములే మన దేశమున కవిత్వమునకు అన్నివిధముల కళలకును జన్మనిచ్చినవి. ఇక ఆధ్యాత్మికజీవనమున భావుకత మిక్కిలి అవసరము. శాస్త్రములు అధ్యాత్మిక జీవనము ఇవి రెండు మన జన్మభూమిపట్ల ప్రేమయందు సంగమింపవలెను.

జన్మభూమియనగా ఈ భూగోళపు ఒక తుంట కాదు ఒకభాష మతము ఇత్యాదులుకల సంఘము కాదు. మన జన్మభూమియనగా అనాది కాలమునుండి అసంఖ్యాకులగు అవతారపురుషులు ఋషులు సంచరించిన పావన దేశము. జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరియసీ (శ్రీ) వివేకానంద స్వామికి ఆధ్యాత్మిక తేజమునకు కారణభూతములివియే. ఇవియే మనకును మన శక్తికిని కారణభూతములు కావలసియున్నది.

అవతారపురుషులు ఋషులును, సన్యాసులు భగవదర్పిత జీవములును కాక మూడవదళ మొకటియున్నది. భగవద్భక్తులగు గృహస్థులయందు ఆత్మార్పణ బుద్ధి ఉద్బోధితము కావలెను. ఇట్లు ఆత్మార్పణ మొనరించుకొనిననే వ్యక్తిగతపురోభివృద్ధి శీఘ్రతరమగును. దీనివలన వ్యక్తిగతమైన ఇహలోకపు టభ్యుదయము దెబ్బతిన నక్కరలేదు. ఒక ఉద్యమమునకు ఆత్మార్పణము చేసికొనగలిగినచో వ్యక్తిగతమైన అభ్యుదయముకూడ దానికి దోహదముగనే ఉపయోగింపవచ్చును.

ఈ దృష్టితోడనే సర్వమానవులును ఆధ్యాత్మికభావములో ఇహలోకజీవితమును అభ్యుదయమును పావనము చేసినొనుటకే దూరదృష్టి

తో స్వామి శ్రీరామకృష్ణోద్యమమును ప్రారంభించెను. ఇతర ఉద్యమములనుగమనించినచో ఆధ్యాత్మికత యేకాని దేశభక్తియేగాని సాంఘిక సంక్షేమమేగాని తదితరములేగాని ఒకటియే ప్రముఖమై కన్పించును. వీని నన్నింటిని ఏకము చేసిన విశిష్టత శ్రీ వివేకానందస్వామి దే.

మన దేశము అట్టి ఆచార్యునకై పరితపించుచుండగా విచ్చేసిన ఆ మహాపురుషునకు నీరాజనములు.

ఆదివారము 16-1-77 తేదీన బహిరంగ సమావేశము జరిగినది. శ్రీ మత్తపస్యానంద స్వామి అధ్యక్షత వహించది. శ్రీమత్ సిద్ధినాథానందస్వామి ఆంగ్లమున శ్రీ వివేకానందస్వామి జీవితమును బోధనలను క్రోడీకరించిరి. శ్రీ ఎన్. కృష్ణస్వామిరెడ్డి స్వామిజీయొక్క సంఘప్రేమను తమ దేశప్రజల యభ్యుదయమునకై వారి యారాటము ఆవేశపూరితులై యుద్ఘాటించిరి.

శ్రీమత్తపస్యానందస్వామి సమాపక వాక్యములను పలుకుచు శ్రీ వివేకానందస్వామి బోధనారీతిని చక్కగా వివరించిరి. ఆయన ఏ విషయమును గూర్చి ప్రసంగించునపుడు ఆ విషయమే సర్వప్రముఖమై తోచుననియు సమగ్రదృష్టితో వారి బోధ నర్థము చేసికొనవలెననియు ఆయన భూతభవిష్యద్వర్తమాన భారతదేశ చైతన్యమునకు మూర్తరూపమనియు మన ఆదర్శములు ఆశయములు అన్నియు భగవత్సాక్షాత్కార ప్రయత్నము నే మూలముగ చేసికొనవలెననియు యావత్ సంఘమునకు ముక్తిని సాధించుటయే, సామాజిక రంగముననే దానిని సాధించుటయే, శ్రీ వివేకానందస్వామి విశిష్ట బోధయనియు పేర్కొనిరి. సమావేశాంతమున భక్తులకు ప్రసాదవితరణము జరిగినది.

# గ్రంథపరిచయము

## జగద్గురు బోధలు

(ప్రథమ, ద్వితీయ సంపుటములు)

తమిళ రచయిత: శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ శంకరాచార్యస్వామి. అనువాదము: 'విశాఖ.' వెల: రూ. 6.00. ప్రాప్తిస్థానము: సాధన గ్రంథమండలి తెనాలి.

సనాతన భారతదేశంలో ఋషులూ రాజన్యులూ తదితర సభ్యజనులూ ఒకచోట సమావేశం అవడం తటస్థపడితే వేదశాస్త్ర చర్చలూ పురాణేతిహాస కథనాలూ జరిగేవట. అవి ఎంత మనోరంజకంగా ఉండేవో మనకు తెలియదు కాని స్వామివారి ఈ సభా ప్రసంగాలు చదివితే వాటి రుచిని కొంతవరకు ఊహించుకోవచ్చు. అద్వైత తత్త్వము మోక్షము భక్తి వేదాంతం మొదలైన గంభీర విషయాలేగాక అక్షమాల, భయం ఎందుకు, వినాయకుడు, నల్లరయ్య మొదలైన 'సామాన్య' విషయాలను కూడా ప్రస్తావించుతూ అన్నింటా వారు శాస్త్ర వైదుష్యాన్నీ జనరంజకత్వాన్నీ చక్కగా మేళవించారు. ఇది రెండవ ముద్రణను అందుకోవడం ఎంతో ఆశాజనకం, అన్నివిధాలా ఆహారపు కొరతను అనుభవిస్తున్న మనం ఇలాంటి గ్రంథాలను చదువగలిగితే మనస్సుకు ఆహ్లాదమూ బుద్ధికి చక్కటి ఆహారమూ లభించి మళ్లీ మన ప్రాచీన తేజోవైభవాన్ని అందుకోగలమనిపిస్తుంది. ఈ గ్రంథాలలో ఉటంకింపబడిన గీతాశ్లోకాలు కావ్యశ్లోకాలు స్తోత్రశ్లోకాలు మొదలైనవి అన్నీ మన సాహిత్యపు ప్రగాఢతను వెలికి తెస్తూ గర్వకారణము లవుతున్నాయి. ఈ గ్రంథాలను కాలక్షేపంకోసమే అయినా తెలుగు తెలిసిన ప్రతివాడూ చదవవచ్చు. అధ్యయనంకోసం చదవగలిగితే ఇంకా శ్రేష్ఠం.

—మధుస్మిత.

# అకారాది విషయానుక్రమణిక — ముప్పదిమూడవ సంపుటము

## వివేకానందసింహగర్జనము

శ్రీ చిరంతనానందస్వామి

భారతీయులను ధీరజనులను చేయుటకు శ్రీవివేకానందస్వామి యొసగిన యుద్బోధనలనుండి అమూల్యములు ఉత్తేజకరములు అగువచనములను పెక్కింటిని రచయిత సేకరించి యనువదించిరి. శరీరమును పులకింపజేసి మనస్సును లోగొను రచన.

పుటలు : 30 వెల : 20 పైసలు.

## సర్వం విష్ణుమయం జగత్

అనువాదకుడు :

శ్రీ చిరంతనానందస్వామి

శ్రీ వివేకానందస్వామి లండను నగరమున నొసగిన గాడ్ ఇన్ ఎవ్విరిథింగ్ అను ఉపన్యాసమున కిది యనువాదము. మతధర్మములపై స్వామి యుపన్యసించుచు మానవ జీవితోద్దేశమును జీవన విధానమును మనోహరముగ ఈశావాస్యోపనిషత్తుకు ధారాళ వ్యాఖ్యగ వివరించి యున్నారు.

పుటలు : 36 వెల : 35 పైసలు.

## యువకులకు వివేకానందుల పిలుపు

అనువాదకులు :

బి. ఎస్. ఆర్. ఆంజనేయులు

నవభారతయువత నుద్బోధించుచు శ్రీ వివేకానందస్వామి యొనర్చిన యుపన్యాసములనుండి మేటి రత్నములను సేకరించి ఆంగ్లమున వివేకానంద స్పీక్స్‌టు యంగ్ మెన్ అను పుస్తకము ప్రచురితమైనది దాని కిది యనువాదము. యువకులయందు ఆత్మవిశ్వాసమును దేశభక్తిని కార్యతత్పరతను ప్రోత్సహించు అమూల్య సంకలనము.

పుటలు : 56 వెల : 75 పైసలు.

ప్రథమ ముద్రణము.

## పారమార్థిక సంభాషణలు

అనువాదకులు :

కందుకూరు మల్లికార్జునంగారు

మాతృదేవి శ్రీ శారదాదేవి, శ్రీ బ్రహ్మానందస్వామి, శ్రీ ప్రేమానందస్వామి, శ్రీ తురీయానందస్వామి శ్రీ శివానందస్వామి శ్రీ శారదానందస్వామి అనెడి ఆర్గురు జ్ఞానసిద్ధుల అమూల్యములగు భాషణము లిందున్నవి. నిత్యనూతనములగు పారమార్థిక సమస్యలకు వారిచ్చు ఉపదేశములు ఆధ్యాత్మ సాధకుల కత్యంతము ఉపయోగకరములు.

పుటలు: 424 వెల : రూ. 6-50

ఇట్లు వ్రాయుడు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004



# శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004

## 1977-వ సంవత్సరము, మార్చి మాసమున జరుగనున్న

## ఉత్సవ కార్యక్రమము

**శ్రీరామనవమి :**

29-3-'77 మంగళవారము : సాయంకాలిక ఆరాత్రికానంతరము రామనామ భజన.

**శ్రీచైతన్యజయంతి :**

5-3-77 శనివారము : తిథిపూజ - డోలపూర్ణిమ.

6-3-77 ఆదివారము : 5 గంటలనుండి 6-30 గంటలవరకు బహిరంగ సమావేశము.

అధ్యక్షులు : శ్రీమత్ తపస్యానందస్వామివారు.

వక్తలు : శ్రీ గభీరానందస్వామివారు (ఆంగ్లము)

డా. కె. రంగస్వామి అయ్యంగార్ (తమిళము)

**ఆదివారములందు సత్సంగము :**

సా. 4-00—4-20 వరకు శ్రీవిష్ణుసహస్రనామ పారాయణము (20-3-77)

శ్రీలలితా సహస్రనామము (13, 27-3-77)

4-20—4-30 ధ్యానము.

4-30—5-30 తమిళమున ఉపన్యాసములు.

శ్రీదక్షిణామూర్తి స్తోత్రము : డా. టి. ఎమ్. పి. మహాదేవన్ (13-3-77)

శ్రీవిష్ణుసహస్రనామము : శ్రీ ఆర్. కల్యాణసుందరశాస్త్రిగళ్ (20-3-77)

శ్రీమద్రామాయణము : డా. ఎన్. వీర్రినాథన్ (27-3-77)

5-35—6-30 : ఆంగ్లమున ఉపన్యాసము.

శ్రీమద్భగవద్గీత : శ్రీమత్ తపస్యానందస్వామివారు (13, 27-3-77)

శ్రీమత్ భూతేశానందస్వామివారు (20-3-77)

6-30—8-00 : ఆరాత్రికము, భజన.

**ప్రత్యేకోపన్యాసములు :** శనివారములందు సాయంకాలము 5-45 గంటలకు.

5-3-77 : శ్రీమద్రామాయణ పఠనము : శ్రీ పి. రామకృష్ణన్, ఐ.సి.ఎస్. (రిటైర్డు)

12-3-77 : త్రివిక్రమావతారము : శ్రీ ఆర్. కోదండరామన్.

26-3-77 : శ్రీమద్రామాయణము : డా. ఎన్. వీర్రినాథన్.

**ఇతర వారములందు ఉపన్యాసములు :** సాయంకాలము 5-45 గంటలకు.

సోమవారములు : శ్రీరామకృష్ణ కథామృతము : శ్రీమత్ అమృతానందస్వామి (ఆంగ్లము)

మంగళవారములు : అధ్యాత్మరామాయణము : శ్రీమత్ గభీరానందస్వామి (ఆంగ్లము)

బుధవారములు : శ్రీమద్భాగవతము : శ్రీమత్ గోలోకానందస్వామి (ఆంగ్లము)

గురువారములు : అముదమొళి : బ్రహ్మచారి నిరంజనచైతన్య (తమిళము)

శుక్రవారములు : శ్రీ మహాభారతము : శ్రీ 'అణ్ణా' ఎన్. సుబ్రమణియన్ (తమిళము)

**తదితరములు :**

27-3-77 ఆదివారము : అంతర్యోగము.

9-3-77 బుధవారము : శ్రీమత్ యోగానందస్వామి జయంతి.

ఏకాదశులయందు సాయంకాలిక ఆరాత్రికానంతరము శ్రీరామనామ భజన (1, 15, 31-3-77).

శుక్రవారములందు సాయంకాలము 6-30 గంటలకు తిరువల్లిక్కేణియందలి దక్షిణ మాడవీథియందు 18-వ నంబరుగల శ్రీరామకృష్ణ మందిరమున శ్రీమత్ గోలోకానందస్వామివారి గీతోపన్యాసములు

ముఖ్యగమనిక : శ్రీరామకృష్ణమఠ సేవాసంఘ ఉపాధ్యక్షులు శ్రీమత్ స్వామి భూతేశానందజీ మహారాజులవారు మద్రాసు మఠమున మార్చినెల 16 వ తేదినుండి 23 వ తేది వరకు విడిసియుందురు. సాయంకాలిక ఆరాత్రికానంతరము భక్తులు ప్రతి దినమును వారి దర్శనము చేసికొనవచ్చును.

ఈ ఉత్సవము లన్నింటియందును భక్తులెల్లరును పాల్గొని భగవంతుని అనుగ్రహభాగ్యమును బడయగోరుచున్నాము.

అధ్యక్షులు,

శ్రీరామకృష్ణమఠము, మద్రాసు-600004.

# మా తెలుగు ప్రచురణలు

| శ్రీ రామకృష్ణులపై : | రూ. పై. |
|---|---|
| శ్రీ రామకృష్ణ కథామృతము | 8–00 |
| ,, (క్యాలికో) | 12–00 |
| శ్రీ రామకృష్ణ జీవిత చరిత్ర | 10–00 |
| ,, (క్యాలికో) | 14–00 |
| శ్రీ రామకృష్ణ బోధామృతము | 8–00 |
| ,, (క్యాలికో) | 15–00 |
| శ్రీరామకృష్ణోపనిషత్తు | 3–75 |
| శ్రీ రామకృష్ణ పరమహంస నీతికథారత్నములు | 2–50 |
| గురూపదేశములు | 2–00 |
| శ్రీ రామకృష్ణ పరమహంస జీవిత సంగ్రహము | 0–75 |
| నా గురుదేవుడు | 1–25 |
| శ్రీ రామకృష్ణ దివ్యవాణి | 1–50 |

**శ్రీ శారదాదేవిపై :**

| | |
|---|---|
| శ్రీ శారదాదేవి జీవిత చరిత్ర | 4–00 |
| శ్రీ శారదా ప్రసంగములు | 3–00 |
| శ్రీ శారదాదేవి | 2–50 |

**శ్రీ వివేకానందస్వామిపై :**

| | |
|---|---|
| శ్రీ వివేకానంద జీవిత చరిత్ర | 4–00 |
| బాలల వివేకానందుడు | 2–00 |
| శ్రీ వివేకానంద సంపూర్ణ గ్రంథావళి 10 సంపుటముల సెట్టు (సాదా) | 65–00 |
| ,, ,, క్యాలికో | 73–50 |
| విడి సంపుటములు ఒక్కొక్కటిసాదా | 5–00 |
| ,, ,, క్యాలికో | 6–50 |
| సందేశ తరంగిణి (మొదటి భాగము) | 4–00 |
| ,, (రెండవ భాగము) | 5–50 |
| జ్ఞానయోగము (ముద్రణలో) | |

| | రూ. పై. |
|---|---|
| భక్తియోగము | 4–00 |
| రాజయోగము | 6–25 |
| కర్మయోగము | 4–00 |
| వివేక సూర్యోదయము | 4–00 |
| యువకులకు వివేకానందుల పిలుపు | 0–75 |
| శ్రీ వివేకానంద సింహగర్జనము | 0–20 |
| సర్వం విష్ణుమయం జగత్ | 0–35 |
| భారత యువజనులారా! | 3–00 |
| ప్రబోధ రత్నాకరము | 2–50 |
| శ్రీ వివేకానంద లేఖావళి (మొదటి భాగము) | 2–25 |
| ,, (రెండవ భాగము ముద్రణలో) | |
| హిందూ మతము | 4–00 |
| అనుష్ఠాన వేదాంతము | 2–50 |
| ప్రాచ్యము, పాశ్చాత్యము | 1–25 |
| షికాగో నగరోపన్యాసములు | 1–00 |
| కులము, సంస్కృతి, సామ్యవాదము | 3–00 |
| భారతదేశము | 2–00 |
| భారతీయ మహిళ | 2–00 |
| నా సంస్కరణ యుద్ధ విధానము (ముద్రణలో) | |
| నవీన భారతదేశము | 0–40 |
| పవహారి బాబా (ముద్రణలో) | |
| నా జీవితము, జీవిత కార్యము | 1–25 |
| గురు, శిష్య సంవాదములు (ముద్రణలో) | |

**శ్రీమద్భగవద్గీత :**

| | |
|---|---|
| శ్రీమద్భగవద్గీత (టీకాతాత్పర్య విశేషార్థసహితము) | 9–00 |
| పారాయణగీత తాత్పర్యసహితము | 3–75 |
| ,, మూలము | 2–00 |

| దివ్యవాణి గ్రంథమాల : | రూ. పై. |
|---|---|
| శ్రీ రామకృష్ణ ఉవాచ | 0–80 |
| శ్రీ శారదాసూక్తి నవనీతము | 0–80 |
| శ్రీ వివేకానంద శంఖారావము | 0–80 |
| శ్రీ కృష్ణవాణి | 0–80 |
| బుద్ధ ఉవాచ | 0–80 |
| క్రైస్తు సూక్తిమాల | 0–80 |
| మహమ్మదు సూక్తి మంజరి | 0–80 |
| **ఇతర ప్రచురణలు :** | |
| ముక్తిమార్గము | 0–30 |
| ఆరాత్రికము మరియు శ్రీరామనామ సంకీర్తనము | 0–50 |

| శ్రీరామకృష్ణ సేవాసంస్థ : | రూ. పై. |
|---|---|
| తదాదర్శములు | 0–50 |
| తాపత్రయ చికిత్స | 0–60 |
| పారమార్థిక సంభాషణలు | 6–50 |
| ఆధ్యాత్మిక జీవనము | 0–40 |
| నారద భక్తి సూత్రములు | 4–00 |
| కఠోపనిషత్తు | 2–00 |
| శ్రీ దొడ్డ భాగవతము (మూడవ సంపుటము) | 7–50 |
| దేవీమాహాత్మ్యము | 4–00 |
| పరతత్త్వ ప్రసంగములు (ముద్రణలో) | |
| గిరీశచంద్ర | 1–00 |
| భక్తిమార్గము | 1–00 |
| బ్రహ్మానంద బోధనలు | 4–75 |

ఇదియేకాక, ఆంగ్ల, సంస్కృత, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములును, వేదాంత కేసరి (ఆంగ్లము), శ్రీరామకృష్ణ విజయము (తమిళము), శ్రీరామకృష్ణప్రభ (తెలుగు) అను మాస పత్రికలును, శ్రీరామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి మున్నగు వారి ఛాయా చిత్రములు, త్రివర్ణ చిత్రములు, తైల చిత్రములు మున్నగున వెన్నియో మావద్ద లభింపగలవు.

## శ్రీరామకృష్ణప్రభ (ఆధ్యాత్మిక మాసపత్రిక)

ఆధ్యాత్మిక విజ్ఞాన సుధను ఆంధ్రభాషలో ఆంధ్ర ప్రజానీకానికి ఆంధ్రదేశమంతటా అందజేయ వలయునను లక్ష్యముతో ప్రారంభింపబడియుండు ఆధ్యాత్మిక మాసపత్రిక.

చదువరులందు భక్తి-జ్ఞాన-వైరాగ్య-సామరస్య-లోక సేవాభినివేశములను వర్ధిల్లజేయును.

ధార్మిక, తాత్త్విక, సాంస్కృతిక విషయములు ఇందు ప్రచురింపబడుచున్నవి.

సాధారణంగా ప్రతి సంచికలోనూ—ఉపనిషత్సత్యములు, సాధన ప్రకారములు, మహాత్ముల చరిత్రములు, సంభాషణలు, ఉపదేశసూక్తులు, శ్రీ శారదా-శ్రీ రామకృష్ణ-శ్రీ వివేకానందస్వాముల జీవితములనుండి, ఉపదేశములనుండి, మన జీవితముల నాధ్యాత్మికపథమున నడుప ప్రోత్సహింపజేయు విషయములు; 'మఠ' 'సేవాసంఘ' వార్తలు, గ్రంథసమీక్షలు-మున్నగునవి-ఈ పత్రికలో ప్రచురింపబడును.

జనవరినెలనుండిగాని, జూలైనెలనుండిగాని కనీసము ఒకసంవత్సరమునకు చందాదారులుగా చేరవచ్చును.

సం॥ చందా రూ. 7–00     విడిసంచిక రూ. 0–70     జీవి... చందా రూ. 100

ప్రజాప్రబోధాత్మకమైన యీ యఖండ జ్ఞానయజ్ఞంలో సహకరింప గోరు

శ్రీరామకృష్ణప్రభకు చందాదారులు కండి!     చందాదారులను చేర్పండి!!

ఇట్లు వ్రాయుడు : శ్రీరామకృష్ణమఠము. మైలాపూరు, మద్రాసు - 600004.

సంపాదకులు : శ్రీ చిద్ఘనానందస్వామి

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-600021) న ముద్రింపబడి,
శ్రీ చిద్ఘనానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మద్రాసు-600004) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రా మ కృ ష్ణ ప్ర భ

సంపుటము ౩౪ ౧౯౭౭ - మార్చి : నల - ఫాల్గుణము సంచిక ౩

## విషయసూచిక

## బ్రహ్మానందబోధనలు

(ఆధ్యాత్మిక పరిప్రశ్నములు)

శ్రీ చిరంతనానందస్వామి

బ్రహ్మానందబోధనలు (శ్రీ బ్రహ్మానంద స్వామి జీవితోపదేశములు) అను గ్రంథము నుండి బ్రహ్మానందవాణి యను పేర నిందు ఉపదేశములు మాత్రము సంగ్రహింపబడినవి. పాఠకుల సౌకర్యార్థము స్వామి సంగ్రహ చరిత్రయు చేర్పబడినది. స్వామి యుపదేశములు ఆధ్యాత్మికతత్త్వములను సాధనయందలి రహస్యములను అరటి పండొలిచి ఇచ్చినట్లు విశదీకరించును.

పుటలు : 272 XXI వెల : రూ. 4-75

(ప్రథమ ముద్రణము)

## భక్తియోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఆధునికుల చిత్తము నాకర్షించురీతిని, అమోఘవచనములతో, విమర్శకదృష్టితో శాస్త్రప్రమాణములతో భక్తితత్త్వమును శ్రీ వివేకానందస్వాములవా రిందు విపులముగా ప్రదర్శించి యున్నారు. మూల గ్రంథములలోని ప్రమాణవచనములును వానికి టిప్పణములును సులభశైలియందు వ్రాయబడి యున్నవి.

(పదవ కూర్పు)

(121+4 పుటలు) వెల : రూ. 4-00

## కర్మయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు శ్రీ స్వాములవారు కర్మయోగ తత్త్వమును అరటిపండొలిచినట్లు విశదీకరించియున్నారు. కర్మమెట్లు మోక్ష సాధనమో స్పష్టీకరించియున్నారు.

(అష్టమ ముద్రణము)

(146+8) పుటలు వెల : రూ. 4-00

## గురూపదేశములు

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వామి

శ్రీ గురుదేవుని మానసపుత్రు డనబరగిన శ్రీ బ్రహ్మానందస్వామి గురుముఖము నుండి వచ్చిన యుపదేశములను యథాతథముగ గ్రహించి వానియందు ముఖ్యములగు వానిని సంగ్రహించి యాంగ్లమున రచించిరి. వాని యనువాదమే ఈ గ్రంథము. ఇందు గృహస్థులకు సాధకులకు వలయు సూక్తులెన్నియో వివరింపబడియున్నవి.

పుటలు : 168 వెల : రూ. 2-00

తొమ్మిదవ ముద్రణము

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004.

# మనవి

## రచయితలకు

1. జనరంజకమైన శైలిలో సంస్కృతి మతము తత్త్వ శాస్త్రములకు సంబంధించినవి ఉన్నత విలువలను గూర్చినవి అయిన రచనలు సంచికలో ప్రచురణార్థము పంపవచ్చు.

2. రచనలు సంచికలో మూడు లేక నాలుగు పేజీలకు మించకుండా ఉండాలి. ఇంకా పెద్దవైన రచనలు ప్రచురించడం సాధ్యం కాకపోవచ్చు.

3. తగినన్ని స్టాంపులు జతచేస్తే తప్ప, ప్రచురింపబడని రచనలు త్రిప్పి పంపబడవు.

4. సంతగించిన రచనలలోని అభిప్రాయాలకు సంపాదకులు బాధ్యత వహించరు.

5. ఆహూతములైన రచనల ప్రచురణలో కూడా తుది నిర్ణయం సంపాదకులది.

ఇతర వివరాలకు :

సంపాదకుడు
శ్రీరామకృష్ణప్రభ, P. B. 635
మైలాపూర్, మద్రాసు-4.

## చందాదారులకు

1. శ్రీరామకృష్ణప్రభ సంపుటం ప్రతి ఏటా జనవరి నుంచి ప్రారంభమౌతుంది. ఏమాసం నుండి అయినా చందాదారులు కావచ్చు.
2. చందాపైకం మనియార్డరు ద్వారాగాని క్రాస్డ్ పోస్టల్ ఆర్డర్, క్రాస్డ్ బాంకుడ్రాఫ్టుల ద్వారాగాని ('శ్రీరామకృష్ణ మఠము, మద్రాసు' అను పేరిట) పంపవచ్చును. మనియార్డరు కూపనులో అడ్రసు వివరాలు సరిగా వ్రాయాలి.
3. చందాదారులు ఉత్తర ప్రత్యుత్తరాలలో తమ చందాదారు సంఖ్యను ఉదాహరిస్తూ విలాసం స్పష్టంగా వ్రాయాలి.
4. మూడు నెలలకు మించిన అడ్రసు మార్పిడి ఆ ముందటి నెల మొదటి వారంలోగా తెలియజేయాలి.
5. సంచిక సాధారణంగా నెల ఆఖరి వారంలో అందుతుంది. అందకపోతే మరుసటి నెల మొదటి వారంలోగా తెలపాలి.
6. చందాదారులకు మా ప్రచురణలపై వెలలో 5% తగ్గింపు ఉంటుంది.

వివరాలకు :
మేనేజర్
శ్రీరామకృష్ణప్రభ, P. B. 635
మైలాపూర్, మద్రాసు-4.

## ప్రచురణకర్తలకు

శ్రీ రామకృష్ణప్రభలో మతతత్త్వశాస్త్ర సంస్కృతి విషయికములైన తెలుగు ప్రచురణలు సమీక్షింపబడుతాయి. సమీక్షకై రెండు ప్రతులు పంపవలసి ఉంటుంది.

—సంపాదకుడు.



'అఖిలవిభు శరణొందుము. హా తక్షణంబ యతనికృప నీదు ననుభూతి కందు వత్స'.

—శ్రీ శారదామణి




సంపుటము ౩౮ | ౧౯౭౭ - మార్చి : : నల - ఫాల్గుణము | సంచిక 3

ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ!

# శ్రీ రామకృష్ణ కర్ణామృతము

యాగేన శాస్త్రమననేన తపోబలేన
త్యాగేన యోగవిధినా గుణనిర్జయేన ।
ఆత్యన్తికీం న హి తథైవ విశుద్ధిమేతి
చిత్తం యథైవ భగవచ్చరణాబ్జ భక్త్యా ॥

యజ్ఞములు శాస్త్రాధ్యయనము తపము వైరాగ్యము యోగసాధనలు ఇంద్రియ నిగ్రహము అన్నియు చిత్తశుద్ధికి సాధనములే. కాని పరిపూర్ణము అవికార్యము అగు చిత్తశుద్ధిని భగవద్భక్తి మాత్రమే ప్రసాదింపగలదు.

ధర్మేణ తత్త్వమననేన సమాధినా వా
నాత్మాపి శుధ్యతి కథం పునరస్యలోకః ।
హే శారదాప్రియ పునస్త్వుభయం త ఏవ
యే త్వత్పాదాబ్జ రజసామలినీ భవన్తి ॥

ధర్మాచరణముచేగాని సమాధిచేతనేగాని మానవుడు, ఇతరులను పునీతులను చేయుమాటయేల, తానే పునీతుడు కాజాలడు. హే శారదారమణా, నీ పాదపద్మముల ధూళియంటినవారే తనను ఇతరులనుకూడ పరిశుద్ధులను చేయగలరు.



'గౌరి పుష్పాంజలులతో తన భార్యను పూజించెడివాడు. స్త్రీలందరును దివ్యజనని యంశములే.'

'శ్రీరాముసర్థము చేసికొనుటకు సీతవలె కావలసియుండునని గౌరి యనెడువాడు. భగవంతుడగు శివునర్థము చేసికొనుటకు భగవతి దివ్యజననివలె కావలసియుండును. శివుని పొందుటకు భగవతి ఆచరించినట్లే తపమాచరింపవలయును. పురుషుని సాక్షాత్కరించుకొనుటకు ప్రకృతి యొక్క దృక్పథము నలవరచుకొనవలెను— స్నేహితుని దృక్పథమునో, దాసియొక్క దృక్పథమో, లేక మాతృభావమో.'

'అహంకారము కలుగునేమోయని గౌరి తననుగూర్చి "నేను" అని చెప్పుకొనడు. దానికి బదులు అతడు "ఇది" అనును. నేనును అతని ననుసరించి నన్నుగూర్చి "నేను" అనుటకు బదులుగా ఇది యనెడువాడను. "నేను తింటిని" అనుటకు బదులుగా "ఇది తినినది" అనెడివాడను. మథురుడిది గమనించి యొకనాడు ఇట్లనెను. "బాబా, ఇది యేమి? నీవు అట్లేల మాటలాడవలెను? వారి నట్లే మాటలాడనిమ్ము. వారి యహంకారము వారికున్నది. నీవు దానినుండి ముక్తుడవు. నీవు వారివలె మాటలాడవలసిన యవసరము లేదు."'

'కేశవునితో నేనిట్లంటిని. "అహంకారమును వదలుకొనుట సాధ్యము కాదు కనుక దానిని దాసునిగనే, భగవంతుని దాసునిగనే, ఉండనిమ్ము."'

* * *

[శాక్త (తాంత్రిక) శాఖకు చెందిన ప్రవ్రాజిక సన్న్యాసిని భైరవిబ్రాహ్మణి ఇటీవల దక్షిణేశ్వరమునకు వచ్చియుండెను. శ్రీరామకృష్ణులను చూచుటతోడనే అనుద్భూతిమైన వారి ఆధ్యాత్మికశక్తికి ముగ్ధురాలై శాస్త్రోక్తములైన కొన్ని సాధనలను వారికి బోధింప పూనుకొనినది. దీనివలన వారి అత్యంతము 'విపరీత'మగు మనఃస్థితులు వ్యాధి కావనియు, అవి మహోన్నతఆధ్యాత్మిక ఉత్కంఠకు సాధనకు ఫలితములనియు వారికి ఆ సాధనలు నిరూపించునని ఆమె భావించినది.]

'పగటికాలమున దేవాలయ ఉద్యానవనమునకు బహుదూరముననున్న వివిధ ప్రదేశములకు బ్రాహ్మణి పోయెడిది. తంత్రములు విధించు అనేకములగు దుర్లభమైన వస్తువులను సేకరించి తెచ్చెడిది. రాత్రివేళ బిల్వవృక్షముక్రిందనో పంచవటిక్రిందనో వానినుంచి ఆమె నన్ను పిలిచెడిది. వాని నెట్లు ఉపయోగింపవలెనో నేర్పెడిది, వాని సాయముతో శాస్త్రవిధి ననుసరించి దివ్యజనని పూజచేయుటలో నాకు సాయము చేసెడిది. తుదిని జపధ్యానములలో మగ్నుడవు కమ్మని చెప్పెడిది. నేను అట్లే చేసెడివాడను. కాని నేను జపము చేయవలసిన అక్కర దాదాపు లేకనే పోయెడిది. జపమాలను ఒకసారి త్రిప్పితినో లేదో సంపూర్ణముగ సమాధియందు లీనుడనై ఆ సాధనలకు తగిన ఫలమును సాక్షాత్కరించుకొనెడివాడను. ఆ విధముగ, అద్భుతములైన ఆనా దివ్యదర్శనములకు అంతు లేకుండెను. అరువదినాలుగు ముఖ్య తంత్రములలో చెప్పబడిన సాధనలన్నింటిని ఒకదాని తరువాత నొకటిగ బ్రాహ్మణి నాచే చేయించినది. అన్నియు దుష్కరములే వానిని సాధించుటలో అనేకులు సాధకులు భ్రష్టులగుదురు. కాని దివ్యమాత యనుగ్రహమున నేను వానినన్నింటిని విజయవంతముగ నెరవేర్చితిని.

'ఒక సందర్భమున బ్రాహ్మణి నిండు యౌవనముననున్న సౌందర్యవతి నొకతెను – ఎక్కడినుండి కొనివచ్చినదో – రాత్రి వేళ కొనివచ్చినది. "తండ్రీ, దేవిగ ఆమె నారాధింపుము" అని

నాతో ననినది. పూజ పూర్తికాగానే "ఆమె ఒడిలో కూర్చుండి జపముచేయుము, తండ్రీ" అని యనినది. నాకు భయము పట్టుకొనినది. దీనముగ నేడ్చుచు దివ్యజననితో నిట్లంటిని. "అమ్మా జగజ్జననీ, నీయందే సంపూర్ణముగ శరణాగతి నొందినవానికి నీవిచ్చు ఈ ఆదేశమేమి? ఇట్టి దుస్సాహసము చేయుటకు నీ దుర్బలశిశువునకు శక్తి కలదా?" కాని నే నిట్లనగానే నాయందేదో అజ్ఞాతశక్తి ఆవేశించినట్లు తోచినది. అసాధారణమైన శక్తి నా హృదయము నావరించినది. నేనేమి చేయుచున్నానో నాకు తెలియక నే మంత్రములు జపించుచు మంత్రముగ్ధునివలె ఆమె ఒడిలో కూర్చుండ నే గాఢసమాధిలో మునిగిపోయితిని. నాకు బాహ్యస్మృతి కలుగగా బ్రాహ్మణి నన్ను సేవించుచు నన్ను సాధా[illegible] కొనివచ్చుటకు పరిశ్రమించుచుండుటను చూచితిని. "తండ్రీ, ఈ సాధన పూర్తియైనది. ఈ పరిస్థితులలో ఇతరులు మిక్కిలి కష్టముమీద తమను నిగ్రహించుకొని అత్యల్పకాలము నామకార్థమైన జపముతో సాధనను ముగింతురు. కాని నీవు స్పృహను పూర్తిగా కోలుపోయి గాఢ సమాధియందుంటివి." అని పలికెను ఇది విని నాకు ఊరటకలిగి ఈ పరీక్షయందు చెక్కు-చెమర్పక తరింపజేసినందులకు కృతజ్ఞత నిండిన హృదయముతో దివ్యజననికి పదేపదే నమస్కరింపదొడగితిని.

'మరియొక సందర్భమున ఒక మృతశరీరపు కపాలమున బ్రాహ్మణి చేపలనువండి తర్పణము చేయుట చూచితిని. నాచేత కూడ నట్లు చేయించి ఆమె నన్ను దానిని తినుమనినది. నేనామె చెప్పినట్లే చేసితిని. నాకెట్టి జుగుప్సయు కలుగలేదు.'

'కాని బ్రాహ్మణి కుళ్లిన మాంసపుముక్కను తెచ్చి తర్పణము చేసి దానిని నాలుకతో తాకుమనినపుడు నేను జుగుప్సతో వణకిపోయితిని. "ఇది చేయసాధ్యమా?" అని యంటిని. అట్లనగా ఆమె 'ఏమున్నది నాయనా ఇందులో? చూడు, నేను చేయుచున్నాను" అనుచు అందులో కొంత తన నోట పెట్టుకొని "జుగుప్సనుంచుకొనరాదు" అనుచు మరల కొంత నా ముందుంచినది. ఆమె అట్లు చేయుట చూడగానే దివ్యజనని భయంకరమగు చండికారూపము నా మనస్సున జాగృతమైనది. "అమ్మా అమ్మా" అనుచు నేను భావసమాధి నొందితిని. అప్పుడు బ్రాహ్మణి దానిని నా నోట నుంచగా ఏ జుగుప్సయు కలుగలేదు.'



ప్రభాప్రసారము

(సంపాదకీయము)



# దీనమానవసేవ

శ్రీరామకృష్ణ భగవానుడు కామద్వేషాది రాక్షసపీడచే చిందరవందరయై సంక్షోభించుచున్న యీ మర్త్యలోకమునకందించిన దివ్యసందేశమంతయును 'ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయచ' అను సూత్రములో నిమిడియున్నది. వ్యష్టిగను సమష్టిగనుకూడ మానవులకు మహోపకారముచేయు పరమౌషధ మిది. నవయుగాచార్యపురుషుడు శ్రీమద్వివేకానందస్వామి త యమూల్య జీవితమును ధారవోసినది ఈ మహోన్నతి సందేశవ్యాప్తికొరకే. ఈ దేశమందేమి ఖండఖండాంతరములందేమి ఆ పరమశివమూర్తి స్థాపించిన మఠములకును పునాది ఇదియే.

ఈ ఆదర్శములందు మొట్టమొదట సాధింపవలసినది భగవత్సాక్షాత్కారము. మానవుడు పడయవలసిన చతుర్విధ పురుషార్థములలో మహోత్కృష్టమైన దిది. దీనినే మోక్షమందురు. ఇది త్యాగముచేతనే సాధ్యమగునది. "న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వమానశుః" అని శ్రుతివాక్యము. నిత్యనైమిత్తికాది కర్మానుష్ఠానమువలన చిత్తశుద్ధి కలుగునే కాని మోక్షము లభింపజాలదు. సంతానము వంశవృద్ధికి తోడ్పడునే కాని పరమార్థమును చేకూర్పజాలదు. ధనము స్వకుటుంబపోషణమునకును సుఖజీవనమునకును దానధర్మములకును వినియోగపడునే కాని ముక్తిని ప్రసాదింపజాలదు. త్యాగశీలములవలన మాత్రమే జననమరణ బంధములను తొలగించుకొని మానవుడు మోక్షమును పడయగలడు. త్యాగమనగా పునర్జన్మ హేతుభూతమును జీవునకు బంధకారణమును అగు అహంకారమును విడనాడుట. ఈ అహంకారమును ముఖ్యముగ పోషించునవి కామకాంచనములు. సంసారసాగరతరణోపాయమును భారతీయ నాగరకతకు ప్రాణతుల్యమును ఐన యీ త్యాగసంపత్తిని గురించి యొకసారి సుప్రసిద్ధ జాతీయనాయకుడగు క్రిష్టోదాస్ పాల్ బాబు నిరసనగా మాటలాడినపుడు శ్రీరామకృష్ణు డతని నిట్లు మందలించెను. "నీవు మిగుల మందబుద్ధివలె గనబడుచున్నావు. సుగుణములలోనెల్ల అత్యుత్తమమని మన శాస్త్రము లేకగ్రీవముగ బొగడిన దానిని నీవిట్లు నిరసింప సాహసించెదవుగా! ఇంగ్లీషు మాటలు నాలుగు చదివి ప్రపంచములో సర్వమును నీకు తెలియుననుకొనుచున్నావు. నీవు సర్వజ్ఞుడవని తలచుచున్నట్లున్నది. సరే! వర్షము లారంభమైన తర్వాత గంగానదిలో క్రొత్తగా బుట్టు చిన్న చిన్న యెండ్రకాయలను జూచితివా? ఈ మహావిశ్వములో నీవా అల్పజీవులకంటెను తక్కువవాడవు. నీ లెక్క ఏమి? నీ జమయేమి? ప్రపంచమునకు సాయము చేసెదనని నీ వెట్లు చెప్ప సాహసింతువు? ఇది భగవంతుని పని. దీనిని చేయుటకు నీకు శక్తి లేదు. ఇతరులకొరకు నీ వెట్లు పని చేసెదవో నాకు చెప్పగలవా? వారికి సాయము చేసెద నన్నప్పుడు నీ యూహ ఏమియో నాకు తెలియును. కొంతమంది మనుష్యులకు భోజనము పెట్టుట జబ్బుపడినప్పుడు వారికి చికిత్స చేయుట ప్రజోపయోగమునకు వీధులు నిర్మించుట బావులను త్రవ్వించుట ఇంతేకాదా? ఇవి నిజముగా సత్కార్యములే కాని ఈ మహావిశ్వముతో బోల్చి చూచినయెడల ఇవి ఎంత స్వల్పములు? ఈ మార్గమున మానవు డెంతవరకు ముందునకు బోవగలడు? క్షామదేవత నోటి

రగ నేడ్చెను. జనులు గుమిగూడి చూచుసరికి ఆ కళాసి యొడలిపైనుండినట్లే శ్రీ గురుదేవుని బహుకోమల శరీరమునగూడ వీపుపైని ఆ హింస కారుని చేతివ్రేళ్ల ఆనవాళ్లతోగూడ దెబ్బల తట్లు తేరియుండెను. ఎంత గాఢమైన అద్వైతానుభూతి! భక్తులు కాకపోవచ్చును. ప్రియశిష్యులు కాకపోవచ్చును. ఆపన్నులగు సామాన్యుల నెడగూడ ఎంతదయ!

మథురబాబు విషయమునగూడ శ్రీ భగవానుడిట్టి యవ్యాజకృప నేకనబరచెను. అతనిభార్య దారుణగ్రహణి బాధతో కృశించి ప్రాణాపాయ స్థితిలో నుండెను. పరమహంస పంచవటిలో ధ్యాననిమగ్నుడై యుండినపుడు మథురుడువచ్చి యొక బాలునివలె విలపించెను. శ్రీ గురుదేవుడు ఆమె వ్యాధి కుదురునని అభయమిచ్చి దానిని స్వశరీరమున కావాదించుకొని ఆరు నెలలు బాధపడెను.

బౌద్ధక్రైస్తవ మతములందుకూడ దీనులపట్ల సానుభూతియు వారి కష్టనివారణకై దానధర్మాచరణయు విధింపబడియున్నవి. కాని మనకు ఇవి సాధకుని ఆధ్యాత్మికాభ్యుదయమునకు శిక్షణగా మాత్రమే విధింపబడియున్నవి. అద్వైత వేదాంతమువలె క్రైస్తవమతము మానవజీవాత్మ భగవంతుడని యంగీకరింపదు. శ్రీరామకృష్ణ పరమహంస ప్రతిఫలాపేక్షలేని దరిద్రనారాయణ సేవను భగవత్సాక్షాత్కారమును ప్రసాదించు భగవదారాధనగా నిరూపించిరి. జీవుడు శివుడని యుపదేశించిరి సుప్రసిద్ధమైన "వందేమాతరమ్" జాతీయగీతమును రచించిన బంకించంద్రచాటర్జితో ప్రసంగించుచు గురుదేవుడిట్లు నుడివెను. "సక్తత (ఫలాపేక్ష) లేని భావముతో నేదైన దానముచేయు గృహస్థు డితరులకు మేలు చేయుటకుకాక తన మేలునకే ఆ దానమును చేయుచున్నాడు. సకల జీవులయందుండు భగవంతుని తన్మూలమున సేవించుచున్నాడు. భగవంతునకు చేయబడుసేవ ఆత్మాభివృద్ధికి తోడ్పడును. మనుష్యులయందే గాక పశుపక్ష్యాదులయందును వ్యక్తమగు భగవంతుని ప్రఖ్యాతికొరకు గాక స్వర్గప్రాప్తికై గాక సేవించి తాను సేవచేసినవారి నుండి ప్రతిఫల మాసింపనిఎడల అట్టి కర్మ నిజముగా నిష్కామకర్మ యగును. ఇట్టి కర్మ నెవడు చేయునో వానికే అది లాభకరము. దీనినే కర్మయోగ మందురు..."

ఈ దృష్టితో చూచినపుడు దీని మానవసేవయే ముక్తిప్రదమగు దేవదేవుని సేవ!

# మాతృదేవి చరణసన్నిధి

ఆంగ్ల గ్రంథము:
ఎట్ ది హోలీమదర్స్ ఫీట్

అనువాదము:
పి. గణపతిశాస్త్రి

ఉద్బోధన కార్యాలయము.

ప్రార్థనమందిరము: 29-10-1910

మాతృదేవితో ప్రసంగిస్తూ మేము ఆమె మంచానికి దక్షిణంగా కూర్చున్నాము.

"అమ్మా! శ్రీరామకృష్ణులు నిజంగా పటంలో ఉన్నారా?" అడిగాను నేను.

అమ్మ: ఎందుకుండరు? ఒకవస్తువు, దాని ప్రతిబింబము ఒకటే. ఆచిత్రం ఠాకూరు ప్రతిబింబమే.

"అయితే ఆయన తమ పటాలన్నింటిలోనూ ఉన్నారా?" అడిగాను.

"మాటిమాటికి మనస్ఫూర్తిగా ప్రార్థిస్తే అక్కడ ఆయన ఉనికి స్ఫురిస్తుంది. ఆ ప్రదేశమే పరమపవిత్రమవుతుంది." అమ్మ ప్రతిసమాధానం.

"అయితే పునీతస్మృతి పరంపరవల్లనే ఆ ప్రదేశం పవిత్రంగా పరిణమిస్తున్నదా?"

"కాదు. అందువల్ల కాదు - ఆ ప్రదేశంమీద ఠాకూరుదృష్టి ప్రసరిస్తున్నది."

"నివేదించిన పదార్థాలన్నీ ఆయన స్వయంగా ఆరగిస్తున్నారా అమ్మా?" మళ్లీ అడిగాను. "అవును. ఆరగిస్తున్నారు." "ఎలాగ ఆరగిస్తున్నారు? మనకలాంటి సూచనలేవీ కనిపించడం లేదే?" దానిమీద మాతృదేవి అన్నది. "ఠాకూరు నేత్రాలలోనించి ఒక కిరణప్రవాహం బయలుదేరి నివేదించిన ప్రతిపదార్థము ఆరగిస్తున్నది. అయితే ఆయన అమృతస్పర్శవల్ల తరిగిపోయిన పదార్థాలన్నీ తిరిగి పూర్తిఅవుతున్నాయి. అందుచేతనే పదార్థాలేవీ తరిగిపోయినట్టు కనబడవు. భక్తులాహ్వానించినంతలోనే ఆ భగవానుడు తన సమున్నతమయిన స్థితినుండి కిందికి దిగివస్తున్నాడు. లాహాలభవంతి ఉన్న తావునుండి ఐశ్వర్యదేవత ఆ లక్ష్మీదేవి నడిచివస్తున్నట్టు మా అత్తగారు స్వయంగా చూశారు. ఆ పరమేశ్వరునికి అన్నాది పదార్థాలారగించవలసిన అక్కర ఏమిఉన్నది? భక్తులకంతో సంతృప్తికలిగించాలని స్వయంగావచ్చి నివేదిత పదార్థాలన్నీ ఆరగిస్తున్నాడు. అంతే. స్వామి ప్రసాదం స్వీకరించి భుజించినందువల్ల మనస్సు పునీతమవుతున్నది. కాని సామాన్యమయిన ఆహారం భుజించినందువల్ల అది అపవిత్రమవుతున్నది."

"ఠాకూరు నివేదితపదార్థాలన్నీ నిజంగా ఆరగిస్తున్నారా అమ్మా?" మళ్లీ అడిగాను.

"ఠాకూరు ఆరగిస్తున్నారో లేదో నేను గమనించడం లేదనుకున్నావా? ఆయన స్వయంగా వచ్చి కూర్చుని ఆరగిస్తున్నారు."

"నీవు కళ్లారా గమనిస్తున్నావా అమ్మా?" తిరిగి అడిగాను. మాతృదేవి తిరిగి గట్టిగా భరవసా ఇచ్చింది.

"అవును! ఆయన కొన్ని పదార్థాలారగిస్తారు కాని మరికొన్నిటివైపు చూస్తారు' అంతే! నిజం చెప్పవలసివస్తే వడ్డించిన ఆహారపదార్థాలన్నీ అన్ని సమయాలలోను అందరికీ రుచిస్తాయా? ఠాకూరు విషయంలోనూ అంతే! అదిఅంతా ఆయా వ్యక్తుల ఆత్మీయమయిన ప్రగాఢ భక్తిమీద ఆధారపడుతుంది. అసలు ప్రధానమయినది తీవ్రమయిన భక్తి.

అది విని నేను ప్రశ్నించాను. "ఆ భక్తి ఎలాగ లభిస్తుందమ్మా? పైవారి పెంపకంలో పెరిగిన పసివాడికి తన కన్నతల్లి సంగతే తెలియదే?"

అమ్మ: అవును నాయనా, నీవన్నది నిజమే. దీనికి ఆ భగవానుని అనుగ్రహం చాలా అవసరం. ఆ అనుగ్రహానికి తగిన అర్హతకూడా చాలా అవశ్యకం.

"అనుగ్రహానికి తగిన అర్హత కావాలన్న ప్రశ్నే లేదే! ఆ భగవానుని అనుగ్రహమన్నది తప్పక సర్వులమీద సమానంగానే ప్రసరించాలి కదా?" గట్టిగా ఎదురుప్రశ్న వేశాను. దానిమీద మాతృదేవి వివరించింది. "నదిఒడ్డున కూర్చుని మనసారా ప్రార్థిస్తే ఆ భగవానుడు తగిన తరుణంలో నావమీద అవ్వలి తీరానికి చేరుస్తాడు."

నేను: ప్రతిదానికి తగిన సమయం కావలసి వచ్చినప్పుడు ఇక ఆభగవానుని అనుగ్రహప్రసక్తి ఏమి ఉన్నది?

అమ్మ: అయినా చేపలు పట్టడానికి వెళ్లినప్పుడు నీటిలో గాలంవేసి చేప చిక్కేదాకా వేచి ఉండాలికదా?

నేను: ఆ భగవానుని మన ఆత్మీయుడయినప్పుడు ఆయన అనుగ్రహంకోసం నిరీక్షించ

వలసిన అక్కర ఏమి ఉన్నది?

అమ్మ: అవును నీవన్నది నిజమే. ఒక్కొక్కప్పుడు భగవానుని అనుగ్రహం తగిన తరుణం అక్కర లేకుండానే లభిస్తూంటుంది. ఈ రోజుల్లో అకాలంలోకూడా మామిడిపళ్లు పనసపళ్లు పండిస్తున్నారుగదా! సెప్టెంబరు నెలలోకూడా మామిడిపళ్లు దొరుకుతున్నాయి.

నేను: ఆ భగవానుడు [illegible] అనుగ్రహించినప్పటికీ కలిగిన [illegible] మన ఆధ్యాత్మికాదర్శం అవధి అంతమాత్రమేనా? లేక అన్నింటికన్న ఆయన్ని పరమాత్మీయతామూర్తిగా చేసుకోవచ్చునా? ఆ భగవానుడు అన్ని విధాలా నా ఆత్మీయుడేనా?

అమ్మ: అవును. ఆయన మనకన్నివిధాలా ఆత్మీయుడే. సర్వదా మన కత్యంతాత్మీయ బంధువే! అందరికీ ఆత్మీయుడే. అయితే తమ తమ భావనా పరిమితులనుబట్టే సర్వులూ ఆ భగవానుని భావించుకుని సందర్శించుకోగలరు!

నేను: అయితే భావనఅంటే కలవంటిది. "దేనినిగురించి అయినా ఆలోచిస్తూంటే అదే భావనగా పరిణమిస్తుంది. అంతేగదా?" దాని మీద మాతృదేవత అన్నది. "నీవు దానికి ఆ విధంగా సమన్వయం చేసుకోవచ్చును. ఈ ప్రపంచంఅంతా ఒక కలవంటిదే. ఈ జాగ్రద వస్థకూడా ఒక కలే!"

నేను: కాదు! జాగ్రదవస్థ కలకాదు! ఇది కలే అయితే క్షణకాలంలో అంతా అదృశ్యమయిపోవాలి మరి!

అమ్మ: నీవు ఏమనుకున్నా అంతా కలే! నీవు నిన్నరాత్రి కలలో చూసింది మరి కనబడదు. తానొక రాజయినట్టు ఎనమండుగురు కొడుకుల తండ్రి అయినట్టు ఒక రైతు కలగన్నాడు. ఆ కల అంతా కరిగిపోయింది. ఆపైన అతని వాస్తవిక జీవితంలో కుమారుడు ఒకడు మరణించాడు. 'నేను ఆ కలలో కొడుకులకోసం దుఃఖించాలా లేక ఈ కుమారుడికోసం విచారించాలా' అని ఆలోచించాడు ఆ రైతు.

ఉద్బోధన కార్యాలయం. 20 నవంబరు 1910.

గుప్తమహారాజ్ (స్వామి సదానంద) జబ్బుగా ఉన్నారని విని మాతృదేవి నిన్న ఆయన్ని [illegible] తాబూ ఇప్పుడూ ఎంతో జాగ్రత్తగా ఆయనకు పరిచర్య చేస్తున్నారు. అమ్మ వారిసంగతి ప్రస్తావించి 'నిజమైన సాధువులంటే వారే. వారి జీవితాలు ధన్యమయినవి. అంతకన్న వేరేసాధువు లెవరున్నారు?' అన్నది. అదేసందర్భంలో ఆమె ఇంకా ఇలాగన్నది. "జోగీన్ చటర్జీ (స్వామి నిత్యానంద) శిష్యులుకూడా ఆయనకెంతో జాగ్రత్తగా పరిచర్య చేశారు. వారంతా తూర్పు వంగదేశం నించి వచ్చారు. కాశీపూర్‌లోకూడా శిష్యులందరూ ఠాకూరుకు అత్యంత జాగరూకతతో పరిచర్య చేశారు. శిష్యులకులాసా ఉండడంకోసం అనేకవిధాలుగా ప్రసంగించేవా రాయన. మనుష్యులతో చాలా చాకచక్యంగా వ్యవహరించేవా రాయన. నిజానికి ఆయనకంతగా పరిచర్య చెయ్యవలసిన అవసరమే ఉండేదికాదు. దాసి శిష్యులు రాత్రి తెల్లవార్లూ మేలుకొని కూర్చోవలసివచ్చేది. ఆయన ఆహారం అంతగా తీసుకునేవారుకాదు. వడబోసిన కొంత గంజిమాత్రమే తీసుకునేవారు.

ఒకసారి ఠాకూరు అకాలంలో ఉసిరికాయ కావాలన్నారు. మూడురోజులపాటు అదేపనిగా వెతికి దుర్గాచరణ్ నాగ్ అతికష్టంమీద రెండు మూడు కాయలు సంపాదించగలిగాడు. గత మూడు రోజులనుంచీ ఆయన ఆహారమే తీసుకోలేదు. ఠాకూరు ఉసిరికాయ తీసుకుని కంటనీరు పెట్టుకున్నారు. దుర్గాచరణ్‌కేసి చూసి 'నీవు

ఢాకాకిగాని ఇంకెక్కడికయినాగాని వెళ్లావేమో అనుకున్నాను’ అన్నారు.

ఆపైన ఠాకూరునాతో వేడివేడి వంటకం తయారుచెయ్యవలసిందని చెప్పారు. అది తయారయిన తరువాత ఆరగించడానికి స్వయంగా తామే కూర్చున్నారు. ఆవిధంగా దుర్గాచరణ్‌కి స్వయంగా ప్రసాదం అనుగ్రహించాలని ఆయన సంకల్పం. కాశీపూర్‌లో ఠాకూరు అంత్యకాలంలో నివసించిన భవనానికి చాలా వ్యయమవుతూండేది. దానిలో మూడురకాల వంటకాలు తయారవుతూండేవి. మొదటిది ఠాకూరు పథ్యపానాలకోసం. రెండవది నరేన్ మొదలయిన వారికోసం. మూడవది మిగిలినవారికి. అందుకని నలుగురిదగ్గర చందాలు వసూలు చేస్తూండేవారు. కనకనే ఒకవ్యక్తి చందా ఇవ్వవలసివస్తుందని అక్కడినించి వెళ్లిపోవడం జరిగింది.

ఓం తత్ సత్

# శాంతిమంత్రము

ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావ శిష్యతే॥

ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓం పూర్ణమ్ అపరిచ్ఛిన్నము అదః అది. పూర్ణమ్ అపరిచ్ఛిన్నము ఇదమ్ ఇది. పూర్ణాత్ అపరిచ్ఛిన్నమైనదానినుండి పూర్ణమ్ జగత్తు అంతా ఉదచ్యతే ఉదయించినది. పూర్ణస్య అపరిచ్ఛిన్నముయొక్క పూర్ణమ్ జగత్తునంతను ఆదాయ తీసివేయగా పూర్ణమ్ ఏవ అపరిచ్ఛిన్నమే అవశిష్యతే మిగులును.

అదృశ్యము అపరిచ్ఛిన్నము. దృశ్యముకూడా అపరిచ్ఛిన్నమే. అపరిచ్ఛిన్నమైనదాని నుండి అపరిచ్ఛిన్న వ్యాప్తిగల జగత్తు ఉదయించినది. అపరిచ్ఛిన్నమైన జగత్తు బయటికివచ్చినా అపరిచ్ఛిన్నము మార్పులేకుండా అలాగే ఉన్నది.

ఓం శాంతిః శాంతిః శాంతిః

# ఈశావాస్యోపనిషత్

ఓం ఈశావాస్యమిదగ్ం సర్వం యత్కించ జగత్యాం జగత్।
తేన త్యక్తేన భుంజీథా మాగృధః కస్యస్విత్ ధనమ్॥ 1

జగత్యామ్ ఈ జగత్తులో యత్కించ (ఉన్న) ప్రతిదీ జగత్ మార్పుగలది. ఇదం సర్వం ఇదంతా ఈశా ఈశ్వరునిచే వాస్యమ్ ఆవరించబడవలెను. తేన త్యక్తేన దాని (జగత్తుయొక్క) త్యాగమువలన భుంజీథాః స్థితిని పొందవలెను. కస్యస్విత్ ఎవరియొక్క ధనమ్ ధనమును మాగృధః ఆశించవలదు.

అశాశ్వతమైన ఈ జగత్తులో మార్పుగల ప్రతిదీ[1] ఈశ్వరునిచే ఆవరించబడవలెను. ఇట్లు జగత్తును త్యాగము[2] చేయుటద్వారా స్థితిని[3] పొందుము. ఎవరియొక్క[4] ఐశ్వర్యమును ఆశించవలదు.[5]

ఈ మంత్రము ఆత్మవిచారణయే ఏకైక విధిగా గల సన్న్యాసియొక్క ధర్మమునకు సంబంధించినది.

1. మార్పుగల ప్రతిదీ: గంధపుచెక్కకు నీటితో కలిగిన సంపర్కమువలన వచ్చిన దుర్వాసన రాతిపై రుద్దినపుడుపోయి గంధపుచెక్కకు స్వతస్సిద్ధమైన సుగంధము ఏవిధంగా ఆవరించునో ఆవిధముగనే విచారణవలన జగత్తుయొక్క మార్పు అపరిచ్ఛిన్నతపోయి జగత్తుయొక్క జ్ఞాతయొక్క స్వతస్సిద్ధమైన ఈశ్వరత్వము వ్యక్తమగును.

'మార్పుగల' అనడం మార్పులేని శాశ్వతమైన జగత్తుకు అధిష్ఠానమైన ఈశ్వరుని స్ఫురింపజేయును. 'ఆవరించును' అనడం ఈశ్వరుని అంతర్యామిగా అతీతునిగా స్ఫురింపజేయును.

2. త్యాగము: ప్రాపంచిక జీవితమును దానికి సంబంధించిన కోర్కెలను విడచుట విచారణకు మూలము.

3. స్థితిని పొందుము: త్యాగము ఆత్మను తెలిసికొనుటకు స్వస్వరూపానందమును పొందుటకు తోడ్పడును. ప్రాపంచిక దృష్టికలవారు తమ కోర్కెలను అనుభవించుటద్వారా స్థితిని సాధించుమంటారు. ఇందుకు భిన్నముగ సన్న్యాసి త్యాగమువలన స్వస్థితిని పొందును.

4. ఆశించవలదు: ప్రాపంచిక సుఖములకు సాధనము ధనము. ఆత్మానందమునకు సాధనము త్యాగము.

5. ఎవరియొక్క: తనది, పరులవి. అని అర్థము.

# హితోపదేశము

## శ్రీ నిత్యానందస్వామి

పరిశుద్ధాత్ములైన సోదర సోదరీమణులారా! అనేక ధర్మములను వినుటకంటె విన్న కొంచెమైనను ఆచరించుటకై పూనుకొనుట శ్రేయస్కరము. కాబట్టి ఈ తెలుపబోవు ధర్మములను మీరు మీ జీవితకాలమున సదా జ్ఞప్తియందుంచుకొని కార్యరూప మొసగుటకై తీవ్ర ప్రయత్నము చేసినచో అచిరకాలములోనే మీకు దుఃఖరాహిత్యము శాశ్వతానంద పదవి చేకూరగలవు.

బహుజన్మార్జిత సుకృతముచే మనకీ మానవ జన్మ లభించినది. భగవత్సాయుజ్యము నొందుటకై ఇతర జన్మలందులేని గొప్ప సదవకాశము ఈ మనుష్య జన్మమందుగలదు. దేవతలుకూ మోక్షము నొందవలెనన్న మానవులై జన్మించి జ్ఞాన సంపాదనము గావింపవలసినదే. కాబట్టి ఇట్టి దుర్లభతమమైన ఈ మానవ జీవితమును భగవదన్వేషణమునకై ఆత్మసాక్షాత్కారమునకై వినియోగించినచో మన కర్తవ్యమును నెరవేర్చినవార మగుదుము. అట్లుగాక, ఇతరములైన ప్రాపంచిక వస్తుజాలముల సంపాదనమనే యావత్కాలము గడపి భగవచ్చింతన లేశమైనను కావింపకున్నచో ఈ యుత్తమ జన్మను వ్యర్థపరచినవారమై తుదకు దుఃఖములపాలు గావలసివచ్చును.

"నరాణాం క్షీణపాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే" అన్నట్లు జీవునియందున్న సంచిత పాపపంకిలము ఎంతెంత క్షీణించుచుండునో అంతంత అధికముగ ఆతనికి భగవంతునియందలి భక్తి వృద్ధినొందుచుండును. కావున బహుజన్మార్జితమగు అట్టి పాపము క్షయించుటకై మనుజుడు మొట్టమొదట పుణ్యకర్మలను విరివిగ నాచరింపవలెను. "జపతో నాస్తి పాతకమ్" అని పెద్దలు చెప్పిరి కావున జపధ్యానాదులుకూడ పాపపరిహారమునకు తప్పక తోడ్పడగలవు. ఈ రీతిగ దానధర్మాది సత్కర్మలద్వారా భగవత్పూజ నామసంకీర్తన జపధ్యానాదులద్వారా జీవుడు తన సంచిత పాపరాశినంతయు క్రమక్రమముగ నశింపజేసికొనుచురాగా భక్తి అతనియందు అధికముగ పాదుర్భవించినదై భగవంతుని పొందవలెనను తీవ్ర ఆవేదన జనించును. దానినే ముముక్షుత్వమందురు. అప్పుడు అతడు తాను చేయు సమస్త కర్మలను భగవదర్పితముగనే చేయును. స్వార్థము కొరకుగాని ఫలాపేక్షచేగాని చేయడు. అట్టి ఫలాపేక్షారహితమగు (నిష్కామ) కర్మచే చిత్తము అత్యంతము శుద్ధమగును. చిత్తమెపుడు శుద్ధమగునో అపుడు నిర్మలమగు అద్దమునందు సూర్యబింబము స్వచ్ఛముగ ప్రకాశించునట్లు ఆత్మజ్ఞానము పరిశుద్ధచిత్తమున ప్రకాశించును. అపుడు తాను కేవలము సచ్చిదానంద స్వరూపమగు పరమాత్మయే యనియు బంధముగాని దుఃఖముగాని తనకేకాలమునందును లేవనియు అజ్ఞానవశమున తాను బద్ధుడనని యింతకాలము తలంచుచు దుఃఖముల ననుభవించుచుంటిననియు ఈ జగన్నాటకమంతయు చిత్తముచే కల్పింపబడిన ఒకానొక మిథ్యాజాలమనియు విస్పష్టముగ తెలిసికొనును. అప్పుడు జీవునకు కలుగు ఆనందమునకు మేరలేదు. ఇక జన్మ సఫలమైనదని తలంచును. నిరతిశయానందము ననుభవించును. అదియే జీవన్ముక్త స్థితి. అదియే మన యందరియొక్క పరమలక్ష్యము. ఈ జీవితమందే మనమందరము అట్టి మహోన్నత స్థితిని సంపాదించుకొనవలెను. లేకున్న, ఈ సదవకాశములు మరల దొరుకవు. భగవదనుగ్రహమువలన ఆరోగ్యము తెలివి సంపద సద్గురుబోధ మున్నగునవి అన్నియు కలిగియున్న ఈ తరుణమున మనము మన ఆత్మోన్నతికై యత్నింపనిచో అటుపిమ్మట అవి మనలను వీడినప్పుడు పశ్చాత్తాప పడవలసివచ్చును. దీపమున్నప్పుడే ఇల్లు చక్కబెట్టుకొనవలెను. ఆయువు దినదినము క్షీణించుచున్నది. మృత్యువను పిశాచము జీవుని కబళించుటకై కాచుకొనియున్నది. కాబట్టి సంసారసాగరమునుండి దరిజేరుటకై భగవంతుడను నావను ఇప్పుడే వెతికికొనవలెను. ఈ విషయమును గ్రహింపజాలక అజ్ఞానులు మాయావశమున భగవంతుని విస్మరించి పారలౌకిక ధర్మమునుగూర్చి ఒకింతేని యత్నింపక దేహము శాశ్వతమనియు, ఈ జగత్తు సత్యమనియు నమ్మి అనేక వ్యవహారములందు తగుల్కొని ప్రాపంచిక విషయభోగలాలసులై ఆ క్షణికానందములతోనే సంతృప్తిపడుచు తుదకు జీవితమును వ్యర్థముగ ధారవోయుచున్నారు. వాస్తవముగ దృశ్య విషయములందు ఆనందము లేదు. మరియు వానిని అనుభవించినకొలది తృష్ణ పెరుగునేకాని తరుగదు. ఒకవేళ ఏ లేశమైనను ఆనందము అందున్నప్పటికిని అది కొండంత దుఃఖముతోగూడియే యుండును. "సౌఖ్యంతు బిందుమాత్రేణ దుఃఖం పర్వతమేవ చ" అన్నట్లు అట్టి దుఃఖపూరితమైన అల్పసుఖములకొరకు పరువిడి తుదకు క్లేశమునే తెచ్చుకొనుచు పరమార్థమును మరచి ఈ యమూల్య జీవితమునంతయు వ్యర్థము చేయుట పాడియా? ఎందరో చక్రవర్తులు రాజులు పూర్వమీ దృశ్య విషయములన్నిటిని అనుభ

వించి అనుభవించి విసిగివేసారి తుదకు అందు వాస్తవిక సౌఖ్యము లేదని తెలిసికొని అట్టి రాజ భోగములనన్నిటిని తృణమువలె పరిత్యజించి పిమ్మట ఏ అనుభవజ్ఞుడగు మహాపురుషుని ఆశ్రయించి ఆత్మజ్ఞానము నొంది తరించిరి. ఈ రీతిగ బాగుగ చింతన చేసి ముముక్షువులైనవారు అసారములైన దృశ్య విషయములను పరిత్యజించుట యను వైరాగ్యమును బాగుగ నలవరచుకొన వలెను. కావుననే వైరాగ్యమను ప్రమిదయందు భక్తియను తైలమునుపోసి జ్ఞానదీపమును వెలిగింపవలెనని పెద్దలు చెప్పుదురు. ఈ ప్రకారముగ పైన దెల్పిన నిష్కామకర్మ భక్తి వైరాగ్యము జ్ఞానము మున్నగువానినన్నిటిని బాగుగ నభ్యసించుచు అట్టి అపూర్వ ఆయుధముల సాయముచే అవిద్యయను శత్రువును సంపూర్ణముగ నోడింపవలయును. అపుడే ఆత్మ సామ్రాజ్యాధిపత్యము మనకు లభించి జన్మ కడ తేరును.

ప్రతి జీవునియందును అనేక జన్మలనుండి బాగుగ ఘనీభవించియున్నట్టి వాసనలు సంకల్పములు ఎన్నియో గలవు. మేఘము సూర్యుని కప్పివేయునట్లు ఈ సంకల్పములన్నియు ఆత్మను మరుగుపరచుచున్నవి, కాబట్టి ఆత్మ నిర్మలముగ ప్రకాశింపవలెనన్న మనస్సునందున్న సంకల్పముల నొక్కొక్కదానిని పారద్రోలవలెను. మొదట దుస్సంకల్పములను సత్సంకల్పములచే నణగద్రొక్కి ఆపిదప కేవలము సంకల్ప రహితమగు పదవి నొందవలెను. అట్లే ఒక్కొక్క ఇంద్రియమునుగూర్చి బాగుగ విచారణ చేసి దానిని విషయముల వైపునకు పరుగిడనీయక అరికట్టవలెను. ఆత్మ (స్వస్వరూప) చింతనకూడ ప్రక్కప్రక్కన చేయుచురావలెను. అనగా జీవునియొక్క యథార్థ స్వరూపమగు పరమాత్మయొక్క లక్షణములను నిరంతరము మననము చేయుచుండవలెను. ఈ ప్రకారము బహుకాలము చేయుచురాగా తుదకు దృశ్యము నుండి మనస్సు మరలి అంతర్ముఖమై ప్రత్యగాత్మయందు విలీనమై జీవ బ్రహ్మైక్యము సిద్ధించును. అదియే జీవుని పరమావధి. అదియే మన జీవిత లక్ష్యము. కర్మచేగాని యోగముచేగాని ధ్యానముచేగాని అందొకటిచేగాని అన్నింటిచేగాని మనుజుడు ఎట్లైనను ఆ పరమ లక్ష్యమును ఈ జన్మయందు పొందియే తీరవలెను. లేనిచో ఇంకను అనేక జన్మలందు సంసార చక్రమున తిరుగులాడి మితిలేని దుఃఖముల ననుభవింపవలసి యుండును.

అయిన గృహస్థాశ్రమమున నున్నవారు అట్టి పరమోన్నత లక్ష్యమును పొందుటకు వీలుండునా యనినచో నిస్సంశయముగ పొందవచ్చును. ఆత్మ సాక్షాత్కారము (లేక జీవన్ముక్తి) ఒక ఆశ్రమముపైగాని జాతిమతములపైగాని దేశముపైగాని స్త్రీ పురుష భేదముపైగాని ఆధారపడియుండదు. ఏ యాశ్రమమునకు జెందినను ఏ ప్రదేశమున నున్నను చేయవలసిన సాధనను సక్రమముగ జేసినచో ఎవరైనను భగవత్సాయుజ్యము నొందగలరు.

"నివృత్తరాగస్య గృహం తపోవనమ్" అనునట్లు రాగ ద్వేష రహితుడగు గృహస్థుని ఇల్లు తపోవనమనియే చెప్పబడును. అట్లే రాగ ద్వేష సహితుడగు తాపసియొక్క ఏకాంత కుటీరము సహితము దారుణ ప్రపంచరంగమే యగును,

కాని గృహస్థాశ్రమమున నున్నవారికి కొన్ని బాధ్యతలు అధికముగా నుండుననుట నిక్కము. తక్కిన అన్ని ఆశ్రమములవారిని పోషింపవలసినవారు గృహస్థులే కనుక కొంత వ్యవహార కాండ వారికి మిగిలియేయుండును. అయినప్పటికిని వారు చేయు ఆ వ్యవహారము ఇతరులకు ఉపకరించునదిగను ధర్మపూర్వకముగను భగవదర్పితముగను ఉన్నచో అయ్యది వారి చిత్తశు

ద్ధికి తప్పక అనుకూలించును. ఈ సందర్భమున గృహస్థులు నిర్వహింపవలసిన కొన్ని ధర్మముల సూక్ష్మముగ తెలుపుట మంచిదని తలచు చున్నాను.

ప్రతిదినము ప్రాతఃకాలము బ్రహ్మముహూర్తమున (4 గంటలకు) నిద్రలేచుటను అభ్యసింపవలెను. లేవగనే పడకపైనుండియే కొంతసేపు భగవంతునిగూర్చి చింతనచేసి (కొన్ని ప్రార్థనా శ్లోకములను భక్తిపూర్వకముగ పఠించి) తానిక దినమంతయు అనేక కార్యములందు ప్రవేశింప నున్నాననియు ఆయాకార్యము లన్నిటియందును మనఃస్థైర్యమును ధర్మబుద్ధిని ప్రసాదింపవలెననియు సర్వేశ్వరుని వినయపూర్వకముగ ప్రార్థింపవలెను. మరియు తాను ఆ దినము చేయబోవు వ్యవహారము లన్నిటిని ఒక్క పర్యాయము జ్ఞాపకమునకు దెచ్చుకొని బహు జాగరూకతతో భగవత్ స్మృతితో అందు ప్రవేశించుచున్నట్లు భావనచేసికొనవలెను. ఈ రీతిగ కొన్ని పవిత్ర నిశ్చయములను గావించుకొని పడకపై నుండిలేచి స్నానాది నిత్యకృత్యములను నెరవేర్చుకొని తన ధ్యాన గృహమునందు ప్రవేశింపవలెను.

ప్రతి గృహస్థునియింటను ప్రత్యేకముగ ఒక ధ్యాన (కుటీరము) స్థలము లేక గది ఉండుట మంచిది. అందు అతనియొక్క ఇష్టదైవము యొక్కయు గురుదేవునియొక్కయు ప్రణవము యొక్కయు మహర్షులయొక్కయు భక్తశిఖామణులయొక్కయు పటములుంచి ధూపదీపాది సంయుక్తముగను పరమపవిత్రముగను శుద్ధముగను దానినుంచవలెను. ఏలయనిన పూజాగృహమును ప్రవేశింపగనే సాధకునకు ఒకవిధమగు దైవికఉత్తేజము కలిగి మనస్సు ఊర్ధ్వముఖము కావలెను. పవిత్రాణువులచే ఆ స్థలమును వ్యాపింపజేసినచో పవిత్రభావన లచట కలిగియున్నచో (దుష్టజనులను నాస్తికులను రానీయక చూచుచో) పరిశుద్ధమగు వాతావరణము అచ్చట తప్పక ఏర్పడగలదు. స్నానానంతరము ఆధ్యానగృహమున ప్రవేశించి పరమభక్తితో గీతాపారాయణము పూజ జపము మున్నగునవి ఆచరింపవలయును. ఒక జపమాల ఉండుటయు మంచిది, ఆధ్యానసమయమున మనస్సును ప్రాపంచిక విషయములవైపునకు పోనీయక భగవంతునివైపునకే త్రిప్ప ప్రయత్నింపవలయును. కనీసము ఒక అరగంటయైనను ఆ పూజామందిరమున గృహస్థుడు ధ్యానాదులయందు గడుపవలెను. అట్లు ప్రార్థనాదులను నెరవేర్చిన పిదపనే ఆహారమును గైకొనునట్టి దృఢనియమమును కాతడు సదా కట్టుబడి యుండవలెను. ఏలన పరమార్థానుభవము మాటలతో వచ్చునదికాదు. నియమనిష్ఠ లుండవలెను. అట్లుకానిచో మనస్సున కాతడు బానిసయై అది చెప్పినట్లు చేయవలసివచ్చును.

ఈ రీతిగ గృహస్థుడు తన ధ్యాన కార్యక్రమమును పూర్తిచేసికొని ఆ పిమ్మట తన అవసర దైనికవ్యవహార కార్యములందు ప్రవేశించి ధర్మపూర్వకముగ వానిని నెరవేర్చి మరల రాత్రి భోజనాత్పూర్వము ఉదయమువలెనే కొంతసేపు భగవంతుని ధ్యానింపవలెను. పిదప రాత్రి పరుండబోవునపుడు తాను ఆదినమందు చేసిన పొరపాట్లు ఏవైన నుండినచో సవరించుకొని మరుసటిదినము అవి చేయకుండులాగున కృతనిశ్చయుడు కావలయును.

గృహస్థుడగువాడు తన తశక్తికొలది అతిథి అభ్యాగతులను ఆదరించుచు దీననారాయణులకు సహాయముచేయుచు ఉత్తములగు బ్రహ్మనిష్ఠులనుపోషించుచుండవలెను. దానములలోను ప్రప్రథమమున బ్రహ్మవిద్యా పోషణకొరకు అ

నగా ఉత్తమబ్రహ్మనిష్ఠులగు సాధువులకొరకు పరమార్థవిషయములకొరకు ఒనర్చునది సర్వశ్రేష్ఠము. ఆపిదప లౌకికవిద్యాపోషణకై యొనర్చుదానము ఉత్తమము. అటుపిదప అన్నదానము. ఆతరువాత చెరువులు బావులు సత్రములు మున్నగునవి నిర్మించుట. ఏ దానమైనను పాత్రతనెరిగియే అనగా దానమును గ్రహించువాని యోగ్యత ననుసరించియే చేయవలెను.

ఇట్లు పైన చెప్పినరీతిని దినదినమును తాను ముఖ్యముగ నాచరింపవలసిన వ్యవహార కార్యములను పూర్తిచేసికొని తక్కిన సమయమును వ్యర్థముగ బోనీయక ఏదైన సద్గ్రంథమును పఠించుచుండవలెను. లేదా అనుభవజ్ఞులగు మహాత్ములయొద్ద సద్బోధ వినుచుండవలెను. సాధ్యమైనంతవరకు ఎల్లకాలములందును మనస్సు భగవదున్ముఖముగనే యుండునట్లు చూడవలెను. అపుడే పూర్ణపవిత్రత ఏర్పడగలదు. పుణ్యకార్యములచే నిష్కామకర్మచే చిత్తమును శుద్ధమొనర్చుకొని దుస్సంకల్పములను బారద్రోలి ఇంద్రియనిగ్రహము గావించుకొని భక్తిజ్ఞాన వైరాగ్యములద్వారా స్వస్వరూపము నెరుగుటయే మోక్షమునకు దారి. అది తప్ప మోక్షమునకు వేరొకదారి ఎద్దియును లేదు. ఎవరు ఎన్ని బోధలు చెప్పినను తుదకు పర్యవసానమిదియే. కాబట్టి ఈపరమలక్ష్యమునే చిత్తమందుంచుకొని దానికి సాధనభూతముగ పైన వచించిన పూజాజపధ్యానాదులను నియమముతప్పక ఆచరించుచుండినచో శీఘ్రముగనే భగవంతునియొక్కయు సద్గురునియొక్కయు అనుగ్రహముగలిగి మనశ్శాంతి ఏర్పడి ఈ జన్మయందే దుఃఖరహితులై పరమానంద మనుభవింపగలరు.

ఆ ప్రయత్నమున సర్వేశ్వరుడు మనకు తగిన శక్తి సామర్థ్యములను ఆయురారోగ్యములను యుక్తాయుక్త వివేకమును అనుగ్రహించుగాక.

# జపదీక్ష

## దే. నారాయణశాస్త్రి

“నామస్మరణా దన్యోపాయం నహి పశ్యామో భవతరణే” “భవసాగరమును దాటుటకు భగవన్నామముకంటె సులభోపాయము లే” దని చెప్పినారు మన పెద్దలు. ఆధ్యాత్మిక సాధనలన్నిటిలో ఇదియే సులభతమ సాధన. జపధ్యానములు ఏకకాలమున జరుపబడవలసినవే యైనను కొంత అభ్యాసబలము లేనిచో అది అసాధ్యము కాబట్టి “మంత్రోద్దిష్ట దేవతామూర్తిపై లేక మంత్రార్థముపై మనసు నిలువక యథేచ్ఛముగా చరించుచున్నను మనస్సున కొంతభాగమైనను జపకార్యమున సక్తముగాకుండిన జపించుట సాధ్యముకాదు గనుక కేవల జపము నిష్ఫలము కానేరదు” అని తత్త్వవిదులు చెప్పియున్నారు. కాని ఇట్టి జపము చేయుటకు కూడ అనేకులకు ఇచ్ఛ కలుగుటలేదు. సాధారణముగ అందరకును ఆత్మీయ స్తుతులను పరదూషణములను పనికిమాలిన ప్రసంగములను చేయబూనిన ఎక్కడలేని యుత్సాహమును ఉత్తుంగ తరంగములుగా ఉబికి వచ్చుచుండును. కాని పట్టుమని పది నిమిషములు పరమేశ్వరనామ ముచ్చరించుచు కూర్చుండిన ఎక్కడలేని విసుగు ఆవేశించి భక్తులచే అమృతముతో బోల్చబడిన భగవన్నామము, వారికి హాలాహలతుల్యమై జపము చాలించి లేవ దలపుగలుగును.

అనంత వైకుంఠ ముకుంద కృష్ణ
గోవింద దామోదర మాధవేతి
వక్తుం సమర్థోఽపి న వ_ కశ్చిత్
అహోజనానాం విషయాభిముఖ్యం!

"అయ్యో, ఈ మానవులు భగవన్నామముల నుచ్చరింప సమర్థులైయున్నను ఒక్కరును పలుకరే?" అని కులశేఖర భూపాలుడు ఘోషించి యున్నాడు. ఏల పలుకరు?

పుణ్యస్య ఫలమిచ్ఛంతి
పుణ్యం నేచ్ఛంతి మానవాః
న పాప ఫలమిచ్ఛంతి
పాపం కుర్వంతి యత్నతః

'మనుష్యులు పుణ్య ఫలమగు సుఖమును కోరుదురు కాని పుణ్య కార్యములను మాత్రము చేయరు. పాప ఫలమగు దుఃఖము నాశింపరు కాని ప్రయత్నపూర్వకముగ పాపకర్మములనే ఆచరించుచున్నారు.' అని యొకకవి నుడివినట్లు వేపచెట్టును పెంచి అందు కాయు మామిడి పండ్లను తినుటకై ఎదురుచూచెడి వెఱ్ఱివిధానమునే యనుసరించుచున్నారుగదా జనులనేకులు!

ఇక, స్నానము చేసి శుచిగా నున్నప్పుడు మాత్రమే లేక ముఖపాదప్రక్షాళనము చేసికొనిన పిమ్మట మాత్రమే మంత్ర జపము చేయు ఆచారమున్నది. కాని శ్రీకృష్ణచైతన్యాది భగవదంశ సంభవులు దేశకాలాధికారాది నియమ రహితముగా హరినామస్మరణ చేయవచ్చునను అభిప్రాయ మొసగియున్నారు.

శుచిర్వా ప్యశుచిర్వాపి
యోజపేత్ ప్రణవం సదా
న స లిప్యతి పాపేన
పద్మపత్ర మివాంభసా

అని యోగచూడామణ్యుపనిషత్తు సర్వకాల సర్వావస్థలయందును ఓంకారజప మొనర్చుటకు అనుజ్ఞ నిచ్చి యున్నది. "అపవిత్రుడుగాని పవిత్రుడుగాని భగవ తుని స్మరించి నంతనే వాడు బాహ్యాభ్యంతర శౌచములు రెండునుకలవాడగుచున్నాడు" అని సంధ్యావందనమున ప్రారంభముననే చెప్పబడుచున్నది. అయినను,

స్వగ్రామే పూర్ణమాచారం
అన్యగ్రామే తదర్థకం
పట్టణే పాద మాచారం
పథి శూద్ర వ దాచరేత్

అనునట్లు శుచిగా ఉండుటకు వీలులేని పరిస్థితులలో మాత్రమే, అశుచిగా నున్నను నారాయణనామజపము సలుపుట కిది అంగీకారమని భావించి సదా శుచిగా నుండుటకు ప్రయత్నింపవలెను. కొందరు మహాత్ములు "సోఽహం" అను మంత్రాక్షరములను ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములతో జేర్చి యెల్లప్పుడును జపించుచుందురు. అద్వైతభావబోధకమగు ఈ మంత్రమును జపించుట సామాన్య మానవులకు హానికరము కావచ్చును.* కావున తమకు ప్రియమగు ఏనామమునైనను ఏ మంత్రమునైనను జపించుటకు ఈపద్ధతినే అవలంబింపవచ్చును. జపనైరంతర్యము నలవరచుకొనుటకు ఇది చక్కని యుపాయము. సాధారణముగా అన్ని మంత్రములకును ఆద్యక్షరము ఓంకారమై యుండును. "ఓమిత్యేతన్న రేచయేత్" అని యమృతనాదోపనిషత్తులో చెప్పబడినది. కనుక పరమ పవిత్ర మగు ప్రణవమును నిశ్శ్వాసముతో చేర్చి జపింప కూడదు. "ఓం" అను ఒక్క అక్షరమునుగాని మంత్రాక్షరము లెక్కవగా నున్నచో అందలి మరికొన్ని

*"అనుభూతిరభావేఽపి, బ్రహ్మాస్మీతి విచింత్యతాం" అని వేదాంత పంచదశిలో చెప్పబడియున్నను శ్రీ రామకృష్ణాది మహనీయులు ఇట్లు భావించుట దేహాభిమానము కలవారికి వినాశ హేతువగునని చెప్పియున్నారు.

యక్షరములనుగాని పీల్చుకొను గాలితో చేర్చి తక్కిన యక్షరములను విడుచు గాలితో కలిపి గురూపదిష్ట మంత్రమును జపింప నగును. ఈ అక్షర విభాగము అర్థము చెడకుండునట్లు చేయవలెను. ఐదారుకంటె ఎక్కువ అక్షరము లుండని మంత్రము నెన్నుకొనిన ఇట్లు జపించుట కనుకూలముగా నుండును. ఇట్టి నిరంతర జపాభ్యాసము వలన మితభాషిత్వాదిసుగుణములనుఅలవడుట కవకాశ మున్నది. మాటలాడుట నెంత తగ్గించిన అంత ఎక్కువ మంత్రజపమునకు వీలుకలుగును. "మాట లుడుగకున్న మంత్రంబు దొరకదు" అని వేమనయోగి పలికియున్నాడు. శ్రీ రమణమహర్షులవారు దినమున కొన్ని మాటలు పలుకుదురో అవి వేళ్లపై లెక్కింప దగియుండెనని వారి శిష్యులగు సత్యానంద తీర్థావధూతలవారు వక్కాణించి యున్నారు. మహా పురుషులందరును అనవసరప్రసంగములనే కాక అవసర ప్రసంగములను సైతము చేయక జపధ్యానముల నలుపుటకై తఱచుగా మౌనవ్రతము నవలంబించుట మనకు తెలిసిన దే గదా! సాధ్యమైనంత వఱకు సంభాషణతప్పించుకొనుటకు ప్రయత్నింపవలెను. మాటలాడుట తప్పనిసరి యైనపుడు మధ్య మధ్య క్షణకాలము మాటలాపి భగవన్నామమునుగాని గురూపదిష్టమంత్రమునుగాని మూడు మాఱులైనను మానసికముగ జపించి తరువాత సంభాషించుట నలవాటు చేసికొనవలెను. ఒకే నామమును జపించుటకు విసుగుకొను వారును నిరంతరము హరినామస్మరణ చేయు ఓరిమి లేని వారును ఉదయ సాయంకాలములందైనను తమ కిష్టమగు ఏదైన సహస్రనామస్తోత్రమునో నామావళినో చదువవచ్చును. ఇట్లు చేయుట వలన ప్రతి దినమును రెండువేల భగవన్నామ స్మరణములనైనను ఉచ్చరించినట్లగును. మహాత్ములు క్షణార్థమునైనను ఈశ్వరస్మరణరహితముగా బోనీయకుండుట చేఇష్టదైవనామజపమునుకోట్లకొలదిగా చేయగలిగి విగతపాపులై వారి నామస్మరణయే ఇతరుల ధన్యులజేయ గలిగినంతటి పవిత్రమూర్తులై యున్నారు. శ్రీవివేకానందస్వామి మొదలగుశ్రీరామకృష్ణభగవానునిశిష్యులు "బ్రాహ్మీ ముహూర్తమున లేచి కాలకృత్యములు తీర్చికొని పూజామందిరమునజపమారంభించినచో ఒక్కొక్కప్పుడు సాయంకాల మగుచుండెడి" దట. (శ్రీ. వి. జీ. చ.) శ్రీమద్విద్యారణ్య యతీంద్రుడు గాయత్రీమంత్రమును అక్షరలక్షలు జపించుచుండెనని జనశ్రుతి కలదు. గాయక బ్రహ్మయగు శ్రీత్యాగరాజు రామతారకమంత్రమును ఇరువది నాలుగుకోట్లు జపించి తజ్జప ఫలమును శ్రీరామార్పణము చేసిననాటిరాత్రి శ్రీరామచంద్రుడు సాక్షాత్కరించినట్లు వదంతి యున్నది. పూర్వము గౌతముడను బ్రాహ్మణుడు అత్యంత శ్రద్ధతో ఫలాపేక్షారహితుడై తదేక దీక్షతో వేయి సంవత్సరములు దేవమంత్రము జపింపగా సావిత్రి ప్రత్యక్షమై "నీయభీష్టమును దెలుపుము, నెఱవేర్చెద" ననగా అతడు "తల్లీ! నీ నామ జపము చేయుటకు శ్రద్ధను ఓపికను ప్రసాదింపుము. నాకింకేవాంఛలును లేవు" అని కోరె, ఆవరము నొసగి ఆమె చనినపిదప మరల నూరు దివ్యవర్షములకాలము నామజపమున గడపెనట. (భార. శాం. ఆ.) కేవలము దేవీనామమును జపించుటకే జన్మించియుండెనేమో ఆ మహానుభావుడు. వీరందరిని మించిన జపదీక్ష గలిగి సిద్ధావస్థ నందిన మహానీయుడు హనుమన్మహావీరుడు. ఆతని జపదీక్షను ప్రకటించు నొక సంఘటనను గూర్చి పౌరాణికు లిట్లు చెప్పుదురు. శ్రీరామ పట్టాభిషేకానంతరము సీతాదేవి తన కత్యంత ప్రీతిపాత్రుడగు ఆంజనేయుని బిలిచి యొక ముక్తాహారమును బహుమతిగా నిచ్చెను. ఆతడును సవినయముగా దానిని బరిగ్రహించి తదేక దృష్టితో

దానిని గొంతసేపు చూచి ముక్కునొద్ద నుంచుకొని వాసనచూచెను. తర్వాత ఆ ముత్యాలసరమునందలి కొన్ని ముత్తెముల గైకొని వానిని గొరికి చప్పరించి యుమ్మివైచెను. మిగిలిన ముత్యాముల జెవికడ నిడికొని విని వానియం దేమియు ధ్వని వినబడకపోగా వానిని విసరివేసెను. దీని నంతయు జూచుచుండిన యొక వానరుడు అతని నిట్లాక్షేపించెను. "ఓయీ! నీవు మిక్కిలి బుద్ధిశాలి వనుకొని యుంటిని. ఎంత యవివేకముగా ప్రవర్తించుచున్నావు! అమ్మవారు ఎంతయో ప్రేమతో నీకు ముత్తెపు దండను బహుమానమీయగా దాని నిట్లు చేయుట ఆమె నవమానించుట యని ఎరుగవైతివి. ఇప్పుడైనను కోతి చేష్టలుమాని కొంతసేపు గంభీరముగ కూర్చుండవలదా?" అప్పుడు మారుతి అతనితో నిట్లనెను. "ఓరీ! పరమ మూఢుడవైన నీకు నా చర్యల యంతర్భావము బోధపడునా? ఆ హారమున సారమేమి కలదు? సువాసన సున్న. సుశబ్దము శూన్యము. రుచియూ లేదు. అందమైనను యేమున్న దందు? నిస్సారమైన యీ కొరమాలిన వస్తువును ఏ ప్రయోజనము నుద్దేశించి నాయొద్ద నుంచుకొనవలెను? చూడుము దీని ప్రభావము" అని పలికి తన శరీరమునందలి యొక వెంట్రుకను బెకిలి అతని చెవిసమీపమున నుంచెను. ఆ రోమమున "రామ రామ రామ రామ" యను నినదము వినవచ్చుచుండుట గాంచి భయాశ్చర్యములు పెనగొన హనుమంతుని క్షమాపణ వేడుకొనె నతడు.

'ఒక భావమును చేపట్టుము. దానిని గూర్చి మననము చేయుము, కలగనుము. తన్మయమగుడవై జీవింపుము. నీ మెదడును కండరములును నరములును శరీర మందలి ప్రతి భాగమును ఆ భావముతో తన్మయత్వము నొందవలెను" అను శ్రీ వివేకానంద ప్రవచనమును దలపించుచున్నది గదా యీ ఘట్టము!

# "అపర జగన్మాత"

## వేదాంతం సుబ్రహ్మణ్యం

పరమ వేదాంతిగా పరిణతి చెందిన పురుషవరేణ్యుడు వేమన నుడివిన "పురుషులందు పుణ్యపురుషులు వేరయా" అన్న సూక్తి నూటికి నూరుపాళ్లు సత్యమని తెలుసుకోటానికి మన పవిత్ర భారతదేశపు భగవత్స్వరూపుల వృత్తాంతములు పరిశీలిస్తే సరిపోతుంది. సాధారణంగా మానవులందరు మర్కట సమానమగు మనస్సుకు లోబడి, తుచ్ఛ ప్రాపంచిక భోగములకు అలవాటుపడి, లౌకిక వ్యాపారాల్లో సంతతం మునిగి తేలుతూంటారు. దానివల్ల పారమార్థిక చింత సంపూర్ణంగా కుంటుపడుతుంది. దీని పర్యవసానం మానవుడు ఎక్కడనుంచి వచ్చాడు, గమ్యస్థానమేది, మానవుని ప్రథమధర్మం ఏమిటి, మానవునికి దేమునికి సంబంధమేమిటి, మొదలగు ప్రశ్నలగూర్చిన ఆలోచనే శూన్యమవుతుంది. ఇలాటి విషమ పరిస్థితులను అరికట్టి, మానవులను విషయవాంఛలనుండి మరలించి, దైవతత్పరులనుచేసి తరింపచేయటానికి భగవత్స్వరూపులు ఈపృథివిమీద ఉద్భవిస్తూంటారు. వీరి జీవితములు అత్యంత చరితార్థములు అని వేరే చెప్పనక్కరలేదు. వీరికి ఎంతమాత్రం తక్కువకాకుండా పుణ్యస్త్రీలుకూడ మన దేశమందు

వెలిసి, అసంఖ్యాకులను ముక్తిపథగాములుగా చేయటం మనం చూస్తూనేవున్నాము. దీనిలో ఓ విశేషం ఉన్నది. ఏమంటే, మానవుడు అందరికంటె హెచ్చు ప్రాముఖ్యాన్ని తల్లికి యివ్వాలని శాస్త్రప్రమాణం. అందువల్లనే, "మాతృదేవోభవ" అని ప్రప్రథమంగా పేర్కొని, తదుపరి పితృస్థానాన్ని, ఆచార్యస్థానాన్ని ఏర్పరిచారు. తదనుగుణంగా, ఈ మాతృమూర్తులు జనసామాన్యాన్ని తమ సంతానంగా భావిస్తూ, వారి పొరపాట్లను, తప్పులను సరిదిద్ది, పునీతులుగా పరివర్తనం చేయటంలో ఓ విశిష్టత కన్పట్టుతుంది. అసలు, స్త్రీమూర్తి శక్తిస్వరూపిణి అన్న సూత్రం నిర్వివాదాంశమేకదా! ఆమె ఉత్కృష్టత మన ఆచారవ్యవహారాల్లోనూ, భగవదంశల నిర్ణయాల్లోనూ విశదమవుతుంది. దైవదంపతులగూర్చి చెప్పేటప్పుడు, సీతారాములు, రాధాకృష్ణులు, లక్ష్మీనారాయణులు, పార్వతీపరమేశ్వరులు అని మాత్రమే వ్యవహరిస్తూంటాము. దీనినిమించి, త్రిమూర్త్యాత్మకంలో, సరస్వతీదేవి బ్రహ్మ జిహ్వాగ్రములో, లక్ష్మీదేవి విష్ణుహృదయంలో, పార్వతీదేవి శంకరుని అర్ధశరీరంలో నిలయమేర్పరుచుకున్నారు, అంటే ఎల్లెడల ఉన్నతస్థానం శక్తిస్వరూపిణిది అన్నమాట. అదేకాక, ఆశక్తివల్లనే ప్రతి దేముని మహిమ సఫలత, సంపూర్ణత, సంతరించుకుంటుంది. ఇంకా లోతుగా తరిచిచూస్తే, ఆదిపరాశక్తియే త్రిమూర్తులకంటె అగ్రస్థానం వహించి, సకల చరాచరములకు చైతన్యం ప్రసాదించి, జీవితాంతం కాపాడుతూంటూంది. కావుననే, శక్తిహీనుడు ఏకార్యము చేయజాలడు. ప్రతి జీవికి మాతృస్థానం వహిస్తున్న శక్తిస్వరూపిణి జగన్మాత. ప్రతి మానవస్త్రీలోనూ భగవదంశ ఉంటుటవల్ల, ఆమెకు మాతృస్థానం యివ్వటంలో సహజత్వమే కనుపిస్తుంది. కాని, పుణ్యపురుషులవలె పుణ్యస్త్రీలు సకల జనానీకాన్ని స్వంత సంతానంలా చూచుకొనటంతో వారు అపర జగన్మాతలే అనాలి.

వీరందరిలో శ్రీ శారదాదేవికి ఓ ప్రత్యేకత ఉన్నది. వంగదేశమందలి జయరాంబాటి అనే గ్రామంలో ఆమె జన్మించింది. తలిదండ్రులు సామాన్య గృహస్థులు. శైశవమందే, పిల్లలకు సాధారణంగా అక్షరాభ్యాసం తలపెట్టే వయసులో ఆమెకు వివాహమే జరిపించారు. క్రిందటి శతాబ్దంలో ఆచరణలోఉన్న అలవాట్ల ననుసరించి, వివాహానంతరం ఆమె ఎలాటి విద్యగూడ నేర్చుకునే అవకాశం లేకపోయింది. ఆమెభర్త ఆదినములలో రాణి రాసమణి అధీనములోనున్న దక్షిణేశ్వరపు కాళికాలయంలో అర్చన చేయుచున్న శ్రీరామకృష్ణుడు, అప్పటికే పాతికేళ్ల వయసులో ఉండి, చదువేమీ నేర్చుకోక, తన అన్నకు సహాయకారిగా దేవీపూజల్లో, దేవీసేవలో నిరంతరం నిమగ్నుడై, పరమ భక్తుడని కొందరిచేత శ్లాఘింపబడుతూ, మతిభ్రమించినవాడని కొందరి నిందలకు గురిఅవుతూ, కాలం వెళ్లబుచ్చుతున్న అవతారపురుషుడు. 'పెళ్లయితేగాని పిచ్చి కుదర'దన్న మూఢసామెత ప్రకారం వారి వివాహం జరిగింది.

శ్రీకృష్ణభగవానుడు తన మహాత్మ్యమును చిన్నతనంనుండీ వేర్వేరు రీతులుగా ప్రదర్శించిన మాదిరి, శ్రీరామకృష్ణ శారదాదేవుల జీవితాలలో వారి భగవదంశలను బహిర్గతమొనర్చు అద్భుతసంఘటనలుపుట్టుకతోనేప్రారంభమైనవి. శ్రీ శారదాదేవి బాల్యావస్థలో జరిగిన ఒక్కసన్నివేశంవల్ల వారి మహిమ బోధపడుతుంది. ఆమెను వెంటబెట్టుకొని భర్తవద్ద దిగబెట్టటానికి ఆమె బంధువులు బైలుదేరారు. దారిలో చీకటిబడ్డది. ఘోరారణ్యం. దారి సరిగా కనబడటం లేదు. అటువంటి సమయంలో శ్రీ శారదాదేవి

తక్కిన వారినుండి చాలా వెనుకబడింది. ఇంతలో ఆ ప్రాంతాల దారిదోపిడీలు, హత్యాకాండలు సాగిస్తూ పేరుబడ్డ ఒక గజదొంగ తన భార్యతోసహా హఠాత్తుగా శ్రీ శారదాదేవిఎదుట ప్రత్యక్షమైనారు. వారి భీకర స్వరూపములను చూస్తేనే ఎటువంటి ధైర్యస్థులుగూడా వివశులైపోతారు. కాని, ఆమె ఏమాత్రము చలింపక, "నాయనా, అమ్మా, భగవానుని దయవలన మీరు నాకు కనపడ్డారు. లేకపోతే నేను ఏదుష్టులబారిపడేదానినో," అంటూ ప్రారంభించి తన అవస్థయావత్తూ వివరించింది. దానితో ఆతడు పరివర్తన చెంది, ఆమె కేమియు భయంలేదని హామీయిచ్చి, వారియింట ఆ రాత్రియంతయు భద్రంగాఉంచి, మరునాడు ఆమెను స్వంతకూతురిలా ఆమెబంధువులకు ఆమె వొంటినున్న సకలాభరణములతోసహా జాగ్రత్తగా అప్పచెప్పాడు. ఈ ఒక్క సంఘటనతో, ఆమెను చూస్తేనే ఎటువంటి పవిత్రభావములు ఎలాటి నికృష్టులకు సైతం ఉత్పన్నమవుతాయో అర్థమవుతుంది.

తర్వాత, ఆమెభర్తతో నివసించటం ప్రారంభించింది. కాని, అప్పటికే పూర్తిగా జ్ఞానోదయమై, జగన్మాతయగు కాళీదేవిలో సంతతం మాతాపుత్రుల సంబంధ మేర్పర్చుకొని, ఆమెతో ప్రత్యక్షంగా ఇష్టాగోష్ఠి జరుపుతూ, సమాధిస్థితిలో లేని సమయాల్లో ప్రతిస్త్రీ మూర్తిని మాతృదేవతగా వీక్షిస్తున్న శ్రీరామకృష్ణులకు శ్రీ శారదాదేవిగూడ ఆదిపరాశక్తిగానే రూపొందింది. బంధువుల బలవంతంవల్ల జరిగిన పరిణయ పరిణామంతో యావత్ప్రపంచం ఒక మాతృమూర్తిని పొందగలిగింది. అంతకుముందే సిద్ధిపొంది "అహంబ్రహ్మాస్మి" అను అద్వైత తత్వమును అనుభవైకవేద్యము చేసికొన్న శ్రీరామ[illegible]ల సాంగత్యంతో శ్రీ శారదాదేవిగూడా భగవదవతారముగా మారిపోయింది.

ఇలాటి మహనీయుల సంభాషణలు ఆధ్యాత్మిక సాధనారహస్యములను గ్రహింప దోడ్పడుచుండును.

శ్రీశారదాదేవి శ్రీరామకృష్ణపరమహంసతో తన సంబంధబాంధవ్యంగురించి యిలా చెప్పారు:

"శ్రీరామకృష్ణులే పనిచేసినను భగవంతుని ఆరాధన నిమిత్తమే చేసిరి. ఆయన నొకసారి నన్ను ఆరాధ్యదేవతగా ప్రతిష్ఠించి, షోడశీపూజ చేసిరి. ఆ గాజులను బట్టలను, యితర ఆరాధన వస్తువులను నేనేమి చేయవలెనని ఆయన నడిగితిని. కొంచెము ఆలోచించి వానినన్నిటిని నేను నా తల్లికిచ్చివేయవలెనని శ్రీవారు చెప్పిరి. అప్పుడు మా తల్లి బ్రతికియుండెను. 'ఈ వస్తువులను మీ అమ్మగారి కిచ్చునపుడు, నీ వామెనొక సామాన్య మానవస్త్రీగా భావింపక, శ్రీ విశ్వేశ్వరీ ప్రత్యక్షస్వరూపమే యామెయని తలంపవలయును.' అని శ్రీరామకృష్ణులు నాతో చెప్పిరి. శ్రీవారి యుపదేశములరీతి యట్లుండెడిది."

సన్న్యాసాశ్రమ కష్టభూయిష్ఠపుస్థితిని శ్రీరామకృష్ణు లేవిధముగా బోధచేసినారో శ్రీ శారదాదేవి చెప్పుచుండెడి దానినిబట్టి గ్రహింపవీలవుతుంది :

"చలువచేసిన వస్త్రమువంటివాడు సన్న్యాసి; గృహస్థుడన్ననో నల్లని వస్త్రమువంటివాడు. నల్లని బట్టయందలి మచ్చలంతగా కనపడవు; తెల్లని బట్టపైని సిరాబొట్టుగూడ ఎంతో ప్రాముఖ్యముగా కనపడును. ఈ జీవిత మెల్లప్పుడు ప్రమాదభూయిష్ఠము. ప్రపంచమంతయు కామకాంచన వశమైయున్నది, సన్న్యాసి నిరంతరము త్యాగశాంతముల నభ్యసింపవలయును. కనుక శ్రీరామకృష్ణులు 'సన్న్యాసి అనుక్షణము జాగరూకుడై, వివేకియై ప్రవర్తింపవలయును' అని యుపదేశించుచుండువారు."

మనోనిగ్రహముతో సాధనచేసిన చో భగవత్సాక్షాత్కారము తప్పక లభ్యమవుతుందన్న విధానమును శ్రీ శారదాదేవి యిట్లు వివరించిరి:

"హా! శ్రీరామకృష్ణులెంత దయతో నన్ను చూచుచుండిరి! ఒక్క పరుషమైన మాటను గూడ వారెన్నడును పలుకలేదు. ఏ నాడును నా మనస్సును నొప్పింపలేదు. 'మన మెల్లప్పుడును పని చేయుచుండవలయును. పనిలేకుండ మన మెన్నడు నుండరాదు. సోమరులమై యుండు మేని బహువిధములైన చెడుతలంపులన్నియు మనస్సులో బయలుదేరును.' అని శ్రీవారు నాతో చెప్పుచుండెడివారు....అడవి యేనుగువంటిది ఈ మనస్సు. అది వాయువేగముతో పరుగెత్తుచుండును. కనుక మనమెల్లప్పుడు వివేచన చేయుచుండవలయును. ఈశ్వర ప్రసన్నమునకు మనము కష్టపడి సాధన చేయవలెను. దక్షిణేశ్వరములో ఎవరో పిల్లనగ్రోవితో పాడుచుండెడివారు. ఆ పాట వినటంతోడనే భగవత్సాక్షాత్కారముకొరకు నా మనస్సు మిక్కిలి తహతహ పడుచుండును. ఆ నాదముసరిగా భగవంతుని ముఖమునుండి వెలువడి వచ్చుచుండెనని భావించి, నేను యోగసమాధిస్థితిలోనికి పోవుచుందును. బేలూరు మఠములోగూడ ఈ ఆనందమే అనుభవించితిని. అప్పుడా స్థలము బహు ప్రశాంతముగానుండెడిది. తఱచుగా నేనుధ్యాన నిమగ్ననై యుండెడిదానను."

మరొక చోట, "చింతయననేమో నేనెన్నడు నెఱుగను. కోరినపుడెల్ల భగవత్ప్రసన్నము నాకు కరతలామలక మగుచుండును...," అని స్పష్టపరిచిరి.

భగవంతుడనువాడొకడున్న యెడల లోకములో నింత దుఃఖమును కష్టమును ఎందుకున్న వనుచు తను మూర్ఖత్వమును బైట పెట్టుకొను కొందరు సామాన్యమానవులను ఈ క్రింది ఉపాఖ్యానముతో శ్రీశారదాదేవి సమాధానపరచిరి:

"సృష్టిలో సుఖదుఃఖములు రెండును కలవు. దుఃఖమే లేనియెడల, సుఖము నెవ్వరు మెచ్చుకొనగలరు? అంతేకాక, అందరును సుఖముగా నుండుట కెట్లు సాధ్యమగును? 'మీ ప్రజలందరి కష్టమును, అసౌఖ్యమును మీరేల పోగొట్టరు? దయయుంచి మీ రాజ్యములోని పౌరుల కందరికిని సౌఖ్య మొనగూర్పుడు. మీరు తలచినచో, మీకిది యొక కష్టము కాదు.' అని సీతాదేవి రాములవారితో చెప్పెను. 'ఒకేసారి జనులెల్లరు సుఖముగా నుండుట యెన్నటికైన సాధ్యమగునా?' అని రాములవారు బదులు చెప్పిరి. 'ఎందుకు కాదు రాజధనాగారములో నుండి ధనమును వెచ్చించి, జనుల కెవరికేమి కావలయునో సమకూర్పుడు' అని సీతాదేవి విన్నవించెను. 'మంచిది. నీవు కోరినట్లే జరుగును,' అని రాములవారు సెలవిచ్చి, లక్ష్మణుని పిలిపించి, 'నీవు వెళ్లి, సామ్రాజ్యమునందలి ప్రజలకు ఏది కావలసి వచ్చినను రాజధనాగారమునుండి వారుతీసికొని వెళ్లవచ్చునని ప్రకటింపుము,' అని సోదరు నాజ్ఞాపించిరి. ఇది విని రాములవారి రాజ్యములోని ప్రజలందరు రాజాంతఃపురము దగ్గరకు వచ్చి, తమతమ కోరికలను వెల్లడించిరి. రాష్ట్రకోశములోని ధనము అడ్డులేక యేకధారగా ప్రవహింపజొచ్చెను. ఈ విధముగా రాష్ట్రములోని ప్రజలందరు ఆనంద సాగరమున నోలలాడుచుండ, రాముల వారి మాయచే, సీతారాములు నివసించుచుండిన భవనమున వర్షాకాలములో రంధ్రములు పడి, లోనికి వాన కురియుచుండెను. ఆ యింటి కప్పును సరిచేయుటకు పనివారల తోడ్కొని వచ్చుటకు చారులను బంపిరి. కాని, పనివార లెక్కడ దొరుకుదురు? రాజ్యములో పనివాడెక్కడను లేడు. మేస్త్రులు, వడ్రంగులు మొదలగు వారందరు, అనగా వివిధవృత్తులవారెవరును కలికమునకైన

కానరాకపోవుటచే, దేశములోని యిండ్లన్నియు పాడయ్యెను. వానిని చక్కజేయుటకు పనివారెవరును దొరకక ప్రజలు శ్రీరామచంద్రునికడకు బోయి, తమ కష్టములను మనవి చేసికొనిరి. గత్యంతర మేదియు లేక సీతాదేవి 'ఇంటికప్పు చిల్లులుపడి లోనికి వాన కురియుచుండుటవలన, యిక నిచ్చట నివసింప సాధ్యము కాకున్నది. దయయుంచి పూర్వపు రీతినే రాజ్య వ్యవహారములు జరుగునట్లొనర్పవలెను. అట్లైనచో [illegible] లందరికిని పనివారు దొరుకుదురు ఒకేసారి మానవు లెల్లరు సుఖముగా నుండుట అసాధ్య[illegible] పుడు బోధపడుచున్నది,' అని రాములవారితో మనవిచేసెను. 'అట్లే కానిమ్ము' అని రాములవా రానతిచ్చిరి. వెంటనే వ్యవహారములన్నియు నింతకుపూర్వ ముండినట్లే మరల జరుగ నారంభించినవి. పనివారు మరల సమృద్ధిగా దొరుకుచుండిరి. 'ప్రభూ! ఈ సృష్టియెల్ల మీయద్భుత లీలయే కదా!' అని సీతాదేవి రాములవారి నుగ్గడించెను......ఎల్లకాలము ఎవరునుకష్టపడరు. ఈ భూలోకములో యావజ్జీవము కష్టమే యనుభవించువారు ఎవ్వరు ఉండరు. ప్రతి కర్మకు ఫలము ఉండును. ఈ విధముగా అవకాశము లెల్లరకును లభించుచుండును.''

మానవులలో సాధారణముగా భగవత్సంకల్పానికి, స్వకర్మలకు సరియైనసంబంధం కనుగొనలేక సతమతమవుతూంటారు. దానివల్ల, వితండ వాదనలకు అవకాశం ఏర్పడుతుంది. అటువంటి వారి వ్యర్థప్రలాపాలను చిన్న ఉదాహరణలు చెప్పి మాన్పించేవారు. మనుష్య ప్రయత్నానికి లేని విలువల నిచ్చి మిడిసిపడే వారికి కూడ ఈ క్రింది సమాధానం సరిపోతుంది.

''భగవంతుని సంకల్పము లేనిదే యేమియు జరుగదు; గడ్డిపరకకూడ చలింపదు. మంచికాలము వచ్చినపుడు భగవంతుని ధ్యానించవలెనను కోరిక మానవునికి కలుగును; చెడ్డకాలము వచ్చినపుడు దుష్కర్మలను చేయుటకు తగిన సమూపాయము లన్నియు నాతనికి లభించును. భగవత్సంకల్పముబట్టి యేది యెప్పుడు జరుగవలయునో అది అప్పుడు జరుగుచుండును. మనుజులకర్మలలో దైవసంకల్పము ప్రతిబింబించు చుండలేదా? (వివేకానందస్వామి) తనంత తానే అంత ఘనకార్యములను చేయగలిగి యుండెనా? భగవంతుడు దానినియొనర్చుటకు పనిచేసెను కావుననే, ఆతడట్టి దిగ్విజయమును గాంచగలిగెను. ఈ చర్యలన్నిటిని శ్రీగురుదేవుడు ముందుగనే నిర్ణయించెను. పరిపూర్ణముగా తన కార్యము సమర్పణ చేయుటకు గురుదేవుడే ధైర్యమును సమకూర్చెను. మన సముపాయము లన్నియు మనమన కర్మలచే నిర్ణీతము లగుచున్నందున, మనము సర్వసహన భావము కలిగి యుండవలయును. ఇది యటుండ, కర్మలను కర్మలే హరించును.''

ఈ చివరి విషయములోగూడ మానవులలో ఒక నమ్మక మున్నది. మనము చేసిన దుష్కృత్యములకు కష్టాలు వచ్చితీరుతయ్యేటే, మన సుకృతాలకు సౌఖ్యం వేరే ఉంటుందనీ అపోహ పడుతూంటారు. అలాటి వారి కందరకూ శ్రీశారదాదేవి ఈ క్రింది విధంగా సమాధానపర్చారు:

''నీవు సత్కర్మ చేయుదువేని, అది నీ పురాకృత దుష్కర్మను పోనాడును. ధ్యాన, జప, పారమార్థిక చింతనాదుల బలిమిచే పూర్వపాపములు నశించును.''

పరాశక్తిమాత్రమే పరమ సత్యమని ఉద్ఘాటిస్తూ, శ్రీశారదాదేవి యిటుల వ్యక్తపరచిరి:

''కాలక్రమమున భగవంతుడున్నట్లు కూడ మనకు అనిపించదు. జ్ఞానవికాసము కలిగినవారికి దేవత లందరు మాయ యని తోచును. సర్వమును కాలములో ఉత్పన్నమై, కాలములోనే

అంతమొందును. నిజముగా భగవంతుడు ముక్కు విషయములు జ్ఞానోదయమైనతోడనే మాయమగును. అప్పుడే విశ్వమంతట నిండియున్నట్లు సాధకుడప్పుడు గ్రహించును. యథార్థమిదియే.''

మరో సందర్భములో చెప్పిన మాటలు :

''విశ్వజనని యగు కాళియే జీవు లందఱకిని కల్పించినది. మంచిచెడ్డలు రెండునూ కూడ ఆమెనుండి పుట్టినవే. సర్వము ఆమె గర్భమునుండి జనించుచున్నది. పలురకముల పరిపూర్ణ జీవులు కలరు. పుట్టుకతోనే పరిపూర్ణులైనవారు కొందరు పారమార్థిక సాధనలను చేసి పరిపూర్ణులైన వారు కొందరు. గురుకటాక్షమున పరిపూర్ణులైనవారు కొందరు. ఆకస్మికముగా పరిపూర్ణులైన వారు కొందరు.''

అకస్మికముగా పరిపూర్ణులగుట యనగా మరియొకరి ధనమునకు వారసులగుట మూలముగా అకస్మాత్తుగా భాగ్యవంతు లగుట వంటిది అని నిర్వచించారు.

''జీవిత లక్ష్యమేమి?'' అని అడిగిన ప్రశ్నకు శ్రీమాతృమూర్తి యిచ్చిన సమాధానం :

''భగవత్సాక్షాత్కారము బడసి, తదేక ధ్యాన నిమగ్నులై యుండుటయే మానవుల జీవితలక్ష్యము. మీరు సన్న్యాసులు, భగవంతుని సొంతమని చెప్పదగినవారు. ఇహమందును పరమందును కూడ మీ ఆధ్యాత్మిక శ్రేయస్సును పరమేశ్వరుడు కాపాడుచుండును. మీరిక దేనిని గూర్చి ఆందోళన పడవలయును? నిరంతరము భగవంతుని ధ్యానము చేయుట సాధ్యమగునా? కొంతకాలము పనిచేయుడు. తక్కిన వేళల భగవంతుని ధ్యానింపుడు.''

శ్రీశారదాదేవి సహజమైన ఉపమానములతో వారు చెప్పదల్చుకున్నది బోధపర్చేవారు. అన్నిటికంటె మనం నేర్చుకోదగినది వారు ప్రతి పనీ స్వయంగా చేసి చూపేవారు. నిజమాలోచిస్తే వారికి ఏలాటి సంసార చిక్కులు లేవు, కాని ఎల్లవేళలా ఎవరో ఒకరిని వారు కనిపెట్టి చూస్తూ, వారి సంరక్షణభారమంతా వహించేవారు. ఏయే శిష్యులకు ఎలాటి సలహాలు వారి వారి పరిస్థితుల ననుసరించి యివ్వాలో, ఆ విచక్షణ ఎల్లప్పుడు చూపేవారు. ఒకనాడొక శిష్యురాలు సంసార బాధ్యతలన్నీ విడిచిపెట్టి సాధన చేస్తూ కాలం గడిపెదనని చెప్పినప్పుడు, తాను గృహకృత్యములను చేయవలె ననియూ, ఆరాధన చేయలేనిదనియూ స్పష్టపర్చి, శ్రీ గురుదేవుని ప్రార్థింపుమనీ, వారే తనకు సర్వము సిద్ధింపచేయుదురనీ చెప్పి పంపివైచెను.

ఏ కార్యమైనా, చిట్టచివరకు భగవత్సాక్షాత్కారము, మోక్షసిద్ధి గూడ స్వయంకృషి వల్లనే సఫలమగునని ఉపనిషత్తులు ఘోషిస్తుంటే, శ్రీకృష్ణభగవానుడు నిస్సందేహంగా భగవద్గీతలో స్పష్టపరుస్తుంటే, జనసామాన్యమటుంచి, సన్న్యాసులుగూడ ఒక్కొక్కప్పుడు ఈ సూత్రాన్ని గుర్తించకపోవటం మిక్కిలి ఆశ్చర్యంగా కనపడుతుంది. ఒకనాడొక సన్న్యాసి యగు శిష్యుడు శ్రీ శారదాదేవితో, వారినే తాను గురువుగా నమ్మి, వారి ఆశీస్సులను బడసి ఉండుటచేత, పారమార్థిక సాధన చేయ వలసిన ఆవశ్యకత ఎందుకుండవలెనన్న ప్రశ్నకు ఈ విధముగా సమాధాన మిచ్చిరి :

అది నిజమే. కాని యీ విషయ మెటువంటిదనగా. గదిలో వివిధములైన ఆహారపదార్థము లుండవచ్చు, కాని భోజనము చేయవలె ననిన, ఎవరైనను వానిని వండవలయును. ముందుగా వంటను ముగించువారు ముందుగనే భోజనము చేయుదురు. ఈ రీతిగా కొందరు ఉదయముననే భుజింతురు; మరికొందరు సాయంకాలమునకు గాని భుజింపలేరు. మిక్కిలి సోమరులైనవారు భోజనమే చేయక యుపవాస ముందురు.''

ఈ సామ్యము శిష్యునికి అర్థము కాకపోవుట వలన, దానిని మరల ఈ విధముగా విడమర్చి చెప్పిరి :

''సాధకు డెంతగా పరమార్థిక సాధనలను చేసిననంత త్వరితముగా భగవత్సాక్షాత్కారమును బడయును. అతి డెట్టి యాధ్యాత్మిక సాధన చేయకపోయినను, చిట్టచివరకు ముక్తినొందును. ——ఇదినిజము. కాని ధ్యానప్రార్థనలను చేయక కాలమును వృధ చేయు వారికి, పరమార్థానుభూతి కలుగుటకు ఆలస్యమగును. పారమార్థిక సాధనలను చేయుటకే నీవు సంసారమును పరిత్యజించితివి. కాని, నీవీ సాధనలను ఎల్లప్పుడు చేయజాలవు కనుక, సత్కర్మలొనర్చుట యావశ్యకము. ఆ కర్మను శ్రీగురుదేవుడే నీకు నిర్ణయించెనని నీవు భావింపవలయును. కఠిననియమబద్ధమైన జీవితము నీకు మంచిది కాదు. కడుపు నొప్పిచే బాధ పడుచుందువు. నీ యాహారము విషయమై జాగ్రత్తగా నుండుము. ఇది ప్రాణాంతకమగు వ్యాధి కాదు గాని, బాధాకరముగా నుండును.''

ఎన్నోసార్లు తప స్సెంత పవిత్రమో, కర్మ కూడ అంత పవిత్రమని బోధించేవారు.

చంచలమైన మనస్సు, ధ్యానసమయాల్లో ఎంత ప్రయత్నించినా, భగవంతునిమీద కేంద్రీకరించిఉండక లౌకికవిషయాల్లోకి పోతూవున్నప్పుడు సాధకుడేమి చేయవలెనన్న అర్జునుని ప్రశ్నకు శ్రీకృష్ణభగవానుడు పట్టువిడువకుండా, అభ్యాసం మానకుండా సాధన చేస్తూవుంటే, ఆ చంచలమైన మనస్సుకూడ సన్మార్గంలోకి వస్తుందని బోధచేశారు. అంటే, అప్పుడప్పుడు మనస్సు ప్రాపంచిక సౌఖ్యాలమీదికి పోతూ ఉన్నప్పటికీ, దానివైపు నిర్లక్ష్యం చూపితే, ఆ అలవాటుకు అదే స్వస్తి చెప్తుందన్నారు. ఆ ప్రశ్నకు సమాధానమిస్తూ, శ్రీ శారదాదేవి.

''గాలి, మేఘముల నెట్లు చెదరగొట్టునట్లు, భగవన్నామము సంసారవిషయ లౌల్యమను మబ్బును పటాపంచలు చేయును.'' అని చెప్పి, భక్తిలేకుండ భగవానుని నామస్మరణ చేసినంతమాత్రమున నేమైన లాభము కలదా అని ఒక భక్తుడు శ్రీమాతృదేవి నడుగగా, ఆమె చెప్పిన సమాధానం:

''నీవు నీటిలో నుండినను, నిన్ని కెరటలు నీటిలో త్రోసినను, ఒకేవిధముగ నీబట్టలు తడిసిపోవును, అంతేకాదా? నీమనస్సు కుంకను బలహీనముగ నుండుటచే, ప్రతిదినము ధ్యానము చేయుచుండుము. నిరంతర ధ్యానమువలన మనస్సునకేకాగ్రత కలుగును. ఎల్లప్పుడును నిత్యానిత్య వస్తు వివేచన చేయుచుండుము. ఎప్పుడైన నేవిషయముపైనను నీమనస్సు పోవుచున్నట్లు తోచెనేని, అదివిషయాసక్తతనుగూర్చి తలపోసి, నీమనస్సును దానినుండి భగవంతునివైపు మరలింప ప్రయత్నింపుము. ఒకమనుష్యుడు గాలము వేసి చేపలు పట్టుచుండెను. ఆ మార్గముననే యొక పెండ్లియూరేగింపు బాజా మేళములతో పోవుచుండినను కూడ, వానిదృష్టియంతయు గాలముముల్లుపైననే నిలిచియుండెను. ఊరేగింపును క్రీగంటితోనైనను అతడు చూడడయ్యెను.''

దీనినే మరొకసారి విపులీకరిస్తూ,

''నామస్మరణ చేయునపుడు మనస్సు దానంతటదియే, గాలితగులనిచోట నొకచోటనుంచిన క్రొవ్వువత్తి దీపమువలె, భగవంతునిపై స్థిరముగ నిలుచును.'' అని వక్కాణించారు.

వీటన్నిటినిమించి చెప్పిన విషయమొకటి సర్వమానవులు గమనించతగ్గది :

''జపము, ధ్యానము, పూజ, మొదలగునవి ఎన్ని చేసినను, భగవత్సాక్షాత్కారము కేవలము వాని దయవలననే సాధ్యమగును''

అయితే, సాధకుడు ధ్యానమును జపమును

చేయుచుండవలెను. అందువలన చిత్తశుద్ధి కలుగును. ఆరాధనాది పారమార్థిక సాధనలను ముముక్షువులు చేయుచుండవలెను. పువ్వును చేతబట్టుకొని ఆఘ్రాణించువారికి దాని పరిమళమెట్లు తెలియనో, సాన్నిహిత్యపుచెక్క నరగదీయువారికి మంచి గంధపువాసన యెట్లనుభవైక వేద్యమగునో అట్లే నిరంతరము భగవంతుని దలంచుచుండువారికి ఆధ్యాత్మిక వికాసము కలుగును.

ఇన్నివిధముల లోకోద్ధరణ చేస్తూ తన జీవితమంతా యితరులకు ధారపోసిన శ్రీ శారదాదేవి అపరజగన్మాత.

# శ్రీ సదాశివ బ్రహ్మము

పరశురామ్

ఆ రాత్రి మథురలో సుందరేశ్వరుని ఋషభ వాహనోత్సవము జరుగుచుండెను. ఎన్నియో యూళ్లనుండి జనులుత్సవము చూచుటకు వచ్చుచుండిరి. నేరూరను గ్రామము మథురకు వంద మైళ్ళకంటె ఎక్కువదూరమున నుండెను. అక్కడివారు మాపటివేళ బయలుదేరి ఉత్సవమును చూచుట, కుంటివాడు కొండ తేనెకు ఆశపడుటవంటిది. కాని హఠాత్తుగ ఆ యూరిలోని కొందఱు పిల్లలు తమతో నెప్పుడును ఆడుకొనుచుండిన పిచ్చివానినిజూచి, 'ఏమండీ! ఈదినమున మథురలో ఋషభవాహనమట; మమ్ములను అచ్చటికి తీసికొనిపోయెదరా?' అని యడిగిరి. ఆ కార్యమసాధ్యమైనను చనవువలన పిచ్చివానికి వారి కోరికను తెలిపిరి. తమ్ము అతడు నిజముగా తీసికొనిపోవునని వారు కలనైన తలపలేదు. అందులకు ఆ ఉన్మత్తుడు 'సరే, మీరందరు నాపై నెక్కుడు. నేను తీసికొనిపోయెద' ననగా పిల్లలందఱు సంతోషముతో భుజములపై, వీపుపై, ఇట్లు ఎక్కగలిగిన ప్రదేశముసంతెల్ల ఎక్కి కూర్చుండిరి. తరువాత ఆ పిచ్చివాడు వారలనందరిని కన్నులు మూసికొనుడని రెండుక్షణముల పిదప తెరువుడని యనెను. పిల్లలు కండ్లు తెరచిరి. వారి కెదురుగా ఒకే కోలాహలము. ఎక్కడజూచిన జనసమూహము లే. మిఠాయి దుకాణములు, బొమ్మలంగడులు మొదలగునవి పెద్ద రాజవీధుల కిరువైపుల నిండియుండెను. అప్పుడు ఆ పిచ్చివాడు 'మన మిక్కడనే యుందము. కొంతసేపటిలో ఋషభవాహనము వచ్చు'నని చెప్పి వారలకు మిఠాయీలు బొమ్మలు కొనియిచ్చెను. ఆ రాత్రి ఉత్సవమును తమాషాలను చూపించి మరల వారిని తీసికొని వెడలిన రీతినే తిరుగ నేరూరునకు తీసికొనివచ్చెను.

పిల్లలను గానక తలిదండ్రులు తబ్బిబ్బులౌచుండ, వారు వచ్చి తాము గాంచిన యుత్సవమును వర్ణించి తాము వెడలిన విధమునుగూడ తెలిపిరి. ఈ వింత సమాచారమును వినిన జనులందరు మిక్కిలి ఆశ్చర్యపడిరి. తా మిన్నిదినములు చూచుచుండిన వట్టి 'పిచ్చిసదాశివు'నకు ఇంతటి శక్తి యున్నదా యనుకొనిరి. అతనికి ఉన్మత్తత లేనిచో నతడేల వీధుల వెంట తిరుగును? జాత్యాచారముల నేల ఆచరింపడు? బ్రాహ్మణ కుటుంబమున జన్మించినను పుల్లెలనుండు ఆహారమును భుజించుట సరియైన తెలివిగలవారు చేయు పనియా? ఎవరితోడను ఏమియు పలుకక ఘంటలకొలది కాలము వ్యర్థపుచ్చుట మతిభ్రమ కాక మరియేమి? ఇంతగా చదివి అసాధారణ

పాండిత్యము నార్జించినప్పటికిని ఏపనియు జేయక ఇంటిలో భార్యను కుటుంబమును పోషింపక నడుచుకొనుట చూడగా పౌరులు సదాశివునకు పిచ్చియో లేక పిశాచము పట్టుటయో యేదో జరిగెననుకొనిరి. అతనివలన ఎవరికిగూడ ఎట్టి అరిష్టమును కలుగ లేదు. అంతవరకు వారికి తృప్తియే. వారు ఎంత ఎగతాళిచేసినను ఆ మహా జ్ఞాని చలింపలేదు.

సదాశివుడు తిరువిశనెల్లూరునందు జన్మించెను. ఆ కాలమున రామభద్రదీక్షితులు, మహాభాష్య గోపాలకృష్ణశాస్త్రి యీ గ్రామమున నుండెడివారు. సదాశివుడు తన సహపాఠులయందు మిన్నయై ప్రతిభాశాలియై తార్కికజ్ఞానమున నుత్సాహము కలిగియుండెను ఒకానొకదినమున ఆతనికి భోజనమున కాలస్యమగుటచే వైరాగ్యము కలిగి తన గృహమును త్యజించెను. ఈ కాలముననే యాతడు తన గురువగు పరమశివేంద్ర సరస్వతిని కలిసికొనుట తటస్థించెను. ఆయనయొద్ద యోగదీక్షను పొంది సత్వరముగనే దానియందు సిద్ధిని పొందెను. కొన్ని కీర్తనలనుకూడ ఆ విరాగి ఆ కాలముననే రచించెనని చెప్పుదురు.

ఒకనాడు అతని గృహమునకు అతని గురువును కొందరు భక్తులును విచ్చేసిరి. సదాశివునకు వాదించుటయందుత్సాహము మెండగుటచే నతడు వారితో వాదమునకు దిగెను. వారందరు సదాశివుని వాదనలకు విసుగుజెంది గురువునకు విన్నవించిరి. గురువు ఆతని సమీపించి "సదాశివా! నీవు వాగ్వాదము నెపుడు చాలించెదవు?" అని యడిగిరి. అందులకు సదాశివుడు తన తప్పిదమును గ్రహించి తనగురువును క్షమింపవేడుకొని యా నాటినుండియు మౌనవ్రత మారంభించెను. ఆ దినమునుండియే పరివ్రాజకుడై యొక ప్రదేశమునను నిలుకడ లేక తిరుగుచుండెడివాడు. తన కేమైన వలసినచో సంజ్ఞలతోగాని వ్రాతమూలమునగాని తెలియబరచెడివాడు.

ఈ కాలమునందాతడు పెక్కుదినములు కావేరీ అమరావతీ నదీతీరములందు గడపెడివాడు. అహోరాత్రము లనేకదినములు నదీతీరమునందలి ఇసుకతిన్నెలపై గడపెడివాడు. బహిర్గతముగ దృష్టి నెచ్చటనో నిగుడించుచు మనస్సును ఆత్మయందు లగ్నము చేసెడివాడు. ఈ వైఖరినిగూర్చి యాతని గురువు విని ఆహా, ఇట్టి ఉన్మత్తావస్థ నాకు కలుగకుండెనే అనిరి! ఒక్కొక్క పరి సదాశివుడు నదీతీరమందలి యరణ్యములకు బోయి కొన్నిదినములవరకు రాకుండెడివాడట. మరియొకపరి కావేరీతీరమందలి "కొడుముడి"యను గ్రామమునొద్ద ఇసుకమీద పరుండియుండగా హఠాత్తుగా నది పొంగి బాహ్యజ్ఞాన మేమియు లేకుండ నుండిన యా యోగీంద్రుని తన గర్భమునకు తీసికొనిపోయి ఇసుకతో కప్పివైచెను. తీరమున నుండిన రైతులు కొందరు దీనిని గాంచియు ఏమియు చేయజాలక యా మహాత్మునకట్టిదిశ సంభవించినందులకు మిక్కిలి దుఃఖించిరి. నాలుగు మాసములకు పిమ్మట నదీజలము ఇంకిపోగా వాడుకప్రకారము గట్టులను బాగుచేయుటకె దినుండి మన్ను దీయుచుండిరి. అప్పుడు ఒకని చేతియందలి పారకు ఏదియో అడుతగిలెను. దానిని దీసిచూడగా దానియందు రక్తపుబొట్లు కాన్పించెను. వెంటనే అందరుకలిసి యచ్చటి మట్టిని మెల్లగా తీసివేయగా సదాశివుని శరీరము కాన్పించెను. ఇంతలో ఆయన స్పృహజెంది నిద్రనుండి లేచినవానివలె మేల్కొని తనకేమియు జరుగనట్లే అచటినుండి వెడలిపోయెను.

మరియొకపరి "కరూరు" నొద్దనున్న గ్రామములో నొక పెద్దరైతు తన పొలములోని ధాన్యమునొక కుప్పగాజేసి ఎవరైనను దొంగిలించిన పట్టుకొనుటకు కొందరు కావలివాండ్ర నేర్పరి

చెను. ఒకనాటిరాత్రి సదాశివుడు తిరుగుచుపోయి ఆకుప్పపై బడెను. వెంటనే కావలివారు దొంగలువచ్చిరని కఱ్ఱలతో సదాశివుని కొట్టుటకు పోయిరి. కాని ఏమి చిత్రమో వారికఱ్ఱలచే చేతులయందు నిలిచిపోయెను. తెల్లవారుఝామున రైతు ధాన్యపుకుప్పను సమీపించి కావలివారికి కల్గిన దురవస్థనుగూర్చి చర్చించుచుండగా, యోగీంద్రుడు లేచి అచటినుండి వెడలిపోయెను. కొంతసేపయిన తర్వాత కావలివాండ్రకు చేతు లెప్పటియట్లు స్వాధీనము లయ్యెను.

ఇట్టి యసాధారణ కృత్యము లనేకముల గురించి యిప్పటికిని నేరూరు గ్రామస్థులవలన వినవచ్చును.

శ్రీ కృష్ణాష్టమి, మహాశివరాత్రి మొదలగు పుణ్యదినములందు పలు పుణ్యక్షేత్రములందు ఒకేసమయమున గనబడెడివాడట. ఒక గ్రామమున నాతనిచర్యలు గొందరు చూచుచుండగా నచటికి కాశినుండియు రామేశ్వరమునుండియు యాత్రికులు మరికొందరు చనుదెంచిరి. కాశి నుండి వచ్చినవారు కాశిలో ఆలయమునందును రామేశ్వరమునుండి వచ్చినవారు రామేశ్వరాలయమునందును అదేసమయమున ఆ మహామహుని దివ్యచర్యలు చూచితిమని తెల్పిరి.

విద్యావిహీనుడగు నొక బ్రహ్మచారి ఆయన కృప తనపై బ్రసరింపవలెనని యాతనివెంట దిరుగుచుండెడివాడు. సదాశివుడును ఆతనిపై జాలి నొంది యాతనిని నిరాకరింపకుండెను.

ఇట్లుండ నొకనాడా బ్రహ్మచారి శ్రీరంగమునందలి రంగనాథుని దర్శనము గావింపగోరెను. సదాశివు డాతని నేత్రములను మూసుకొన నాజ్ఞాపించెను. ఆ బ్రహ్మచారి కన్నులు దెరచునప్పటికి శ్రీరంగనాథునికి హారతినిచ్చుట కనుగొనెను. వెనుదిరిగి చూచునప్పటికి సదాశివుడు కాన్పింపలేదు. ఎచట వెదకినను కనుగొనలేకపోయెను. ఆ బ్రహ్మచారి ఎట్లో తనయూరు జేరుకొనగా అచట సదాశివుడు సమాధినిమగ్నుడై యుండుట కనుగొనెను. ఆ బ్రహ్మచారి కొన్ని మాసముల తరువాత యాతనియొద్ద మంత్రదీక్షను బొంది ఆ మంత్రశక్తిబలమున మహాపండితుడాయెను. అతని పురాణవ్యాఖ్యానములు గొప్ప ప్రభువుల నాకర్షింప వారాతని [illegible] సన్మానముల నొసగిరి.

కొన్ని సమయములందు శ్రీసదాశివుడు దేవాలయములో ఈశ్వరుని అర్చించుచు స్తోత్రములను పఠించుచుండగా ఒక్కొక్క స్తోత్రమునకు ఒక్కొక్క పుష్పము తనంతటతానే విగ్రహముపై పడుచుండెడిదట. ఇట్టి అలౌకిక యోగసిద్ధులెన్నో యాతనియొద్ద గన్పించెనని చెప్పబడుచున్నది. వీని సత్యము మనము గ్రహించుట కష్టమయినను ఇట్టి వదంతులుమాత్రము తగ్గవు.

ఒకప్పుడు సదాశివుడు పుదుక్కోట దగ్గరనున్న యొకవనమున సంచరించుచుండెను. అప్పుడు పుదుక్కోట సంస్థానమునకు "విజయ రఘునాథ తొండమాను" ప్రభువుగానుండెను. అతడు దైవభక్తికలవాడు. తనకు తీరుబడిగల సమయమున వనమునందలి కొలనునొద్ద ఏకాంతముగ ధ్యానమొనర్చెడివాడు. అతడు సదాశివుని గాంచి నప్పటినుండియు నాతనిపై శ్రద్ధాభక్తులు గలవాడై ఎనిమిది సంవత్సరములవరకు సేవ చేయుచుండెను. ఎప్పుడును ఆయనవెంట సంచరించుచుండెడివాడు. ఆతనిపై దయ జూపనెంచి శ్రీ సదాశివుడు ఇసుకతిన్నెపై నొక మంత్రమును వ్రాసిచూపెను. ఆ యుపదేశమును బట్టియే ఇప్పుడు పుదుక్కోటలో దక్షిణామూర్తి ఆలయము కట్టబడెనని తెల్పుదురు. శ్రీవారుపదేశమునిచ్చిన ఆ యిసుక రాజప్రసాదమున పూజింపబడుచుండెను. పవిత్రమైన యా యిసుక రాజప్రాసాదమునకు కొనిపోబడుటచే పుదుక్కోట సంస్థానముపై లక్ష్మీకటాక్షము కలిగెనని వచించుతురు,

ఒక ప్రదేశమున నిలుకడగానుండక యావద్భారతదేశమేగాక టర్కీ మొదలగు విదేశములు సయితము శ్రీవారు తిరిగి వచ్చిరట. ఆయన పోయిన ప్రదేశములం దెల్లెడలను వారియనయందలి యసాధారణ ప్రతిభకు ముగ్ధులగుచుండిరి. ప్రపంచమునందు సంచరించుచుండినను వారు ప్రాపంచిక విషయములచే కట్టువడలేదు. అన్న వస్త్రము లున్నవనియు లేవనియు కొంచెమయినను తలంచెడివారుకారు. ఎల్లప్పుడును ఆత్మచింతనయందు మైమరచి జీవన్ముక్తులై విహరించిన ఈ మహాత్ములెన్ని సంవత్సరములు జీవించిరో మనము చెప్పజాలము. ఈ ప్రపంచమును విడిచి వెళ్ళవలయునని తలచిన దినమున కొందరు బ్రాహ్మణోత్తములను పిలిచి ఈ నాటి సాయంకాలము ఒక బ్రాహ్మణుడు కాశీనుండి ఒక బాణేశ్వర శివలింగమును కొనివచ్చుచున్నాడు. నా సమాధిపై దానిని ప్రతిష్ఠింపవలయును అని తెల్పిరి. తర్వాత జ్యేష్ఠ శుద్ధ దశమినాడు ఒక గోయిని త్రవ్వించి దానిలోదిగి మహాసమాధి నొందెను. ఆయన కోరిక ప్రకారము సమాధిపై బాణేశ్వరుని శివలింగము ప్రతిష్ఠింపబడినది. ఆ దేవాలయమునకు పుదుక్కోట ప్రభువెన్నో మాన్యముల నొసగెను. ఆ దేవాలయమునందు పూజార్చనలకు ఏర్పాటుచేసిరి.

వీరియొక్క అద్భుత మేధాశక్తి శాస్త్రజ్ఞానము ఆత్మానుభావము వీరు రచించిన గ్రంథముల వలన మనకు విశదమగుచున్నవి. వీరికి సంస్కృతి భాషయందు అపార పాండిత్యము ప్రావీణ్యత కలుగుటవలన వీరు మిక్కిలి మృదుమధురమగు శైలియందు సరళములగు పదములతో తమయొక్క ఉన్నత ఆత్మానుభూతిని తెలిపియున్నారు. వారికి అద్వైతానుభవము అధికముగా నున్నట్లు ''బ్రహ్మైవాహంఖలు, సద్గురుకృపయా బ్రహ్మైవాహంఖలు'', ''పూర్ణ బోధోఽహం–సదానంద పూర్ణ బోధోహం, శివోహం'' మొదలగు కీర్తనలవలన తెలియుచున్నది. తమకుగలిగిన యిట్టి యనుభవములన్నియు తమ గురు కృపవలన గలిగినవని ''బ్రహ్మైవాహంఖలు'' అను కీర్తనయందు సద్గురు కృపచేతనే బ్రహ్మము వేరు, గురువు వేరు, నేను వేరు అను అనుసజ్ఞానమును నాటి నేనే బ్రహ్మమై యుండుటను కనుగొంటిని అని తెలుపుచున్నారు. అపారమగు వారి గురుభక్తిని ''పరమశివేంద్రుడు చంద్రుడు, నేను గట్టులేని ఆనందసాగరమను. సాగరము చంద్రునిజూచి పొంగి యెట్లు ఉద్ఘోషించునో అట్లు గురుమూర్తుల సాన్నిధ్యమున ఆనందమునంది సంతోషించుచున్నాను.'' అని ఆనందపూర్ణ బోధోహం మొదలగు కీర్తనల యందు గనుబఱచుచున్నారు. అదియునుగాక 'మానససంచరరే బ్రహ్మణి మానససంచరరే' 'శ్రీపతి వనమాలి గోష్ఠి శ్రీపతి వనమాలి' 'భజరే గోపాల' అని మనము సర్వసాధారణముగా భజనలయందు పాడుకొనుచు వినుచు ఆనందించుచున్న కీర్తనలన్నియు శ్రీవారు రచించినవే. ఇట్టి కీర్తనలనేగాక శ్రీవారు 'యోగసూత్రవృత్తి' మొదలగు వ్యాఖ్యాన గ్రంథములను శ్రీ అప్పయ దీక్షితులవారి 'సిద్ధాంతలేశ సంగ్రహము' నను కరించి 'సిద్ధాంతకల్పవల్లి' యను గ్రంథమును మఱికొన్ని ప్రకరణ గ్రంథములను రచించిరి. మఱియును 'శివమానసికపూజా' యను తమ స్తోత్ర గ్రంథమున ఈశ్వరధ్యానము మానసికపూజ ఈ రెంటి సమ్మేళనమును గనుబఱచియున్నారు. తమ 'ఆత్మవిద్యావిలాసము'న వీరి ఆత్మానుభవ మెట్టిదో విశదీకరించియున్నారు. వీరు రచించిన కీర్తనలందును ఇతర గ్రంథములందును విశదీకరింపబడిన 'బ్రహ్మజ్ఞ లక్షణములు' వీరియందే కనబడుటవలన వీరు సదాశివబ్రహ్మమని ప్రసిద్ధిగాంచిరి. వీరి జీవితము అద్వైతసిద్ధాంతమును ఋజువుపరచు గొప్పనిదర్శనమై యలరారుచున్నది. వీరి రచనల జదివియు గేయములకీర్తించియు మనమెల్లరము సంసారబంధ విముక్తులము కాగలము.

ఓం నమోభగవతే శ్రీ రామకృష్ణాయ!

# నమస్కృతి

వెలుదండ సత్యనారాయణ

రామకృష్ణ గురువర్యా
రమ్యగుణ కిరణ సూర్యా!

నిన్ను పుత్రునిగ బడయుటకై
ఎన్ని నోములను నోచేనో
నా జన్మభూమి...
ఎన్ని పున్నెములు చేసేరో...నీ
సాన్నిధ్యమ్ము లభించుటకై
నా సోదరులే....

నిన్ను గన్నందుకే నా జన్మభూమి
నిక్కమ్ముగా నద్దియే పుణ్యభూమి
నీదు సాన్నిధ్యభాగ్యము లభించిన జనా
నీకమే ధన్యము
నిజముగావారి చరితములే మాన్యము.

మతవిభేదాలతో
సతమతమ్మౌతూ మ
మతలనే మరిచిన – స
మతలనే విరిచిన – జ
నతను తీరిచిదిద్ది
నవత నిల్పిన మహాశిల్పీ!

సర్వమత సమ్మేళనమ్మున
సమ్మతమ్మగునట్టి చక్కని
సరిక్రొత్త విధము – అను
సరణీయపథము – కను
పింపజేసిన మార్గదర్శీ!

అజ్ఞాన తిమిరాంధ
కార ప్రభాకరా! భవహారా!
మంగళకరా!
నిఖిలలోకేశ్వరా!
నిత్య సత్యమైన జ్ఞానజ్యోతీ!
నీకేమీగలము? బహూకృతీ.
అందుకో మా నమస్కృతీ.

# నేనెరిగిన ద్వైతము

అచలానంద

ఇంతసేపూ మీతో నేనుకూడ డా. బాల సుబ్రహ్మణ్యంగారి ఉపన్యాసాన్ని ఆస్థతో విన్నాను. వారు స్థూలంగా అద్వైతసిద్ధాంతాన్ని నిరూపించి దానికిన్నీ విశిష్టాద్వైతానికిన్నీ ఉన్న సామ్యములనూ వైషమ్యములనూ విశదంగా పరిపూర్ణ పాండిత్యంతో చెప్పినారు.

ఇప్పుడు నేను చెప్పదలచుకొన్నది నాకు అర్థమైన ద్వైతసిద్ధాంతము. ఈ విషయములో నా నిలువ సాంప్రదాయికము కాదు. అద్వైతాన్ని సాధించుటకు నిరాకరించవలసిన పూర్వపక్షంగానో అద్వైతాన్నే పూర్వపక్షంగా ఖండించి స్థాపించవలసిన సిద్ధాంతంగానో ద్వైతాన్ని చూచుట వాడుక. నేను ద్వైతాన్ని ఈ దృష్టితో చూడడంలేదు. నేను ఉన్న నిలువకు ఎలా వచ్చానో చెప్పితే ఇది ఎలాంటిది అని సులభంగా తెలియవచ్చు.

ఈ నిలువ చేరుటకు మొదటికారణం శ్రీ రామకృష్ణ పరమహంసలవారి మాట ''అన్ని మతములూ సత్యమునకు పథములే'' అనునది, వారికి అనుభవసిద్ధమైనది. మరియొక కారణం

1949 నుంచీ 1956 వరకూ దైవానుగ్రహంవలన నాకు లభించిన ఒక సాధువు సహవాసం సాహచర్యం. ఆయన ద్వైతులలోనే పుట్టి పెరిగి సంస్కృతముగాని వేదాంతముగాని చదవని నేతిన గురువునేర్పిన దారిని సాధనచేసి సాక్షాత్కారము చేసుకున్నవారు. వారి ఆచారములో ఏలాంటి భేదబుద్ధీ కనపడలేదు. వారిని ఒకసారి నేను ఇలా అడిగాను "ఏదో ఒకరీతిగా ఉండవలసిన సత్యాన్ని ముగ్గురు ఆచార్యులూ మూడు వేరువేరు విధములుగా చెప్పినారు. వీరి సిద్ధాంతాలలో ఏదిసరి అని కనిపెట్టుటకు వారికి సమానమైన లేక వారిని మీరిన పాండిత్యమూ సాధనా అనుభవమూ కలవారు ప్రయత్నించవచ్చునుగాని మనకు సాధ్యంకాదు. అయినా ఇట్లు చెప్పుటకు కారణమేమి అన్న ప్రశ్నకు ఉత్తరాన్ని అపేక్షిస్తాము కదా?" అని. దీనికి వారు ఒకమాటతో ఉత్తరము చెప్పినారు. "అనుభవంలో అంతా ఒకటే, దాన్ని చెప్పేమాటలలో భేదం ఉంటుంది." ఇదీ అనుభవంమాటే. ఈ అనుభవాన్ని అనుసరించి సిద్ధాంతాన్ని అర్థంచేసుకోవాలి, అన్నది నా నిలువ.

ఈ దృష్టితోచూచి ద్వైతసిద్ధాంతం పరమపురుషార్థసాధనకు దారి అగు రీతిన దీనిని అర్థం చేసుకోవడానికి ఈ ప్రయత్నం.

విశిష్టాద్వైతానికీ ద్వైతానికీ ఎక్కువ భేదం లేదు.

బ్రహ్మసత్యం అన్నది మూడు సిద్ధాంతాలకూ సమానము.

జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ అన్న మాటను విశిష్టాద్వైతమూ ద్వైతమూ ఒప్పుకోవు ఈ మూడు కలిసిన ఒకటేతత్త్వము సత్యము. "విశిష్టస్య అద్వైతం." జీవజగత్తులకున్నూ ఈశ్వరునికీనీ ఉన్న సంబంధాన్ని విశేషణ విశేష్యమనిన్నీ అంగాంగి అనీ ప్రకారప్రకారీ అనీ శరీరశరీరీ అనీ తెలియవచ్చు. ఇది విశిష్టాద్వైతసిద్ధాంతం. ద్వైతసిద్ధాంతంలో ఈమూడుతత్త్వాలూ అత్యంత భిన్నములు అయిననూ జీవులకూ జగత్తుకూ స్వాతంత్ర్యం లేదు. ఇవి అస్వాతంత్రతత్త్వాలు. ఈశ్వరుడుమాత్రమే స్వతంత్రతత్త్వం.

ఈ తత్త్వములలో భేదసాధకం విశేషం. ఇదియూ నిత్యమైనది. నిత్యమైన విశేషాన్ని ఒప్పుకొన్నప్పుడు తారతమ్యాన్ని ఒప్పుకోవలసి వస్తుంది. ముక్తి అంటే తన యోగ్యతకు తగినంత ఆనందాన్ని పొందడం. ఈ స్థితిలోనూ తారతమ్యం ఉందని ద్వైతసిద్ధాంతం. నిండిన కుండలోని నీళ్లు నిండిన చెరువులో నీళ్లకంటె పరిమాణంలో తక్కువే అయినా నిండుగా ఉండడం రెండింటికీ సమానమే. చెరువులో నీళ్లన్నీ కుండలోకి వచ్చినా వాటిని భరించే యోగ్యత కుండకు లేదు. తన యోగ్యతకు తగిన ఆనందంతో తాను నిండి ఉంటుంది. నిండిన తరువాత ఇక ఎక్కువ అవసరం ఉండదు. అంటే ముక్తికి కావలసిన ఆనందం పరిమాణంలో తారతమ్య ఉండవచ్చు కాని ఆనందగుణములో తారతమ్యం లేదు అనుకోవచ్చు.

మన ప్రస్తుతస్థితిలో ఈశ్వరుని అస్తిత్వంగాని మన అస్వాతంత్రతగాని మనకు అనుభవ విషయాలు కావు. ఈ అనుభవం తెచ్చుకోవడం సాధనలో ముఖ్యమైన విషయం. దీంట్లో మతభేదం లేదు. ఈ సాధనకు సహాయంగా ఉన్నది గనుక ద్వైతము గ్రాహ్యమే.

ద్వైతములో చెప్పిన నిత్యనారకులమాట అంగీకరించడం నాకు మొదట్లో కష్టమైంది. ఈ మాటను ఇప్పుడు నేను అర్థవాదంగా అర్థంచేసుకున్నాను. ముక్తికి కావలసిన యోగ్యత ఉండకపోతే అనంతతమస్సులోపడి అనంతంగా బాధపడవలసి వస్తుంది అని బెదిరించి ఆ భయంతో

నైనా ఈశ్వరాభిముఖులు కానీ ముక్తికి ప్రయత్నించనీ అని మనలను తప్పుదారినుండి తప్పించడానికి చెప్పినమాట అనుకున్నాను.

ఈ రీతిగా అర్థంచేసుకున్నప్పుడు అంటే సాధనకు దారిచూపే సిద్ధాంతము అని తెలుసుకున్నప్పుడు శ్రీరామకృష్ణపరమహంసలు చెప్పిన మాట ద్వైతానికి అన్వయిస్తుంది. కేవలం బౌద్ధికంగా చూచునప్పుడు సిద్ధాంతాలలో కనిపించే భేదాలపైన అప్పుడు గమనిక పోదు. ఇది నేను ద్వైతసిద్ధాంతాన్ని అర్థంచేసుకున్న రీతి.

## భక్తిరత్నావళి

మూలము: విష్ణుపురి — అనువాదము: విష్ణుచిత్తుడు

తృతీయ విరచనము

### 18

హృదయమున భగవత్సాక్షాత్కార మెట్లు కలుగునో వివరించు చున్నాడు.

శృణ్వతః శ్రద్ధయా నిత్యం గృణతశ్చ విచేష్టితమ్
కాలేన నాతి దీర్ఘేణ భగవాన్ విశతే హృది॥ (2-8-4)

శ్రద్ధతో అనుదినమును భగవంతుని మహిమలను లీలలను గానముచేయు వారి హృదయమున అచిరకాలములోనే ఆ భగవంతుడు విచ్చేయును.

### 19

భగవంతుడు అట్లు వేంచేయగా నేమగునో సూతుడు వర్ణించుచున్నాడు.

సంకీర్త్యమానో భగవాననంతః శ్రుతానుభావో వ్యసనంవా పుంసామ్ ।
ప్రవిశ్య చిత్తం విధునోత్యశేషం యథా తమోర్కోఽభ్రమివాతివాతః॥ (12-12-48)

అట్లు కీర్తింపబడుచుండగా అనంతుడు విశ్రుతప్రభావుడు అయిన భగవంతుడు భక్తుని హృదయమున జొచ్చి, సూర్యుడు అంధకారమును వలెను మహావాయువు మబ్బులను వలెను, అచటి దుఃఖ సంఘాతములను నిశ్శేషముగ హరించును.

### 20

భక్తి అభ్యాసముయొక్క పరమప్రాముఖ్యమును శుకుడు ప్రశంసించుచున్నాడు.

తస్మాద్భారత సర్వాత్మా భగవాన్ హరిరీశ్వరః ।
శ్రోతవ్యః కీర్తితవ్యశ్చ స్మర్తవ్యశ్చే చ్ఛతాభయమ్॥ (2-1-5)

కనుక భయరాహిత్యమును కోరువారెల్లరును సర్వాత్ముడు సర్వేశ్వరుడు అగు శ్రీహరినే కీర్తింపవలెను, స్మరించవలెను, వినవలెను.

## 21

ఉత్తమోత్తమమైన ఆనందము నిచ్చును గనుక భక్తియే గమ్యమని ధ్రువుని పలుకు.

యా నిర్వృతి స్తనుభృతాం తవ పాదపద్మధ్యానాద్భవజ్జన కథాశ్రవణేన వా స్యాత్ ।
సా బ్రహ్మణి స్వమహిమన్యపి నాథమాభూత్ కిం త్వంత కాసిలులితాత్పతతాం
విమానాత్ ॥ (4-9-10)

నిన్ను ధ్యానించుచు నీ భక్తులు నీ స్తుతులను కీర్తించుచుండగా వినుటవలన కలుగు పరమానందము అవ్యక్తము అనంతము సర్వాత్మికము అగు బ్రహ్మము యొక్క అనుభూతి ఆనందమును కూడ మించును. ఇక కాలమనెడి ఖడ్గమునకు బలియగు స్వర్గలోకముల ఆనందముల సంగతి చెప్పనేల!

## 22

లౌకికుల విమర్శ లెన్నియున్నను వానిని గణింపని భక్తుని ఆదర్శమును నవయోగులలో నొకడగు కవి వర్ణించుచున్నాడు.

శృణ్వన్సుభద్రాణి రథాంగపాణేర్జన్మాని కర్మాణి చ యానిలోకే ।
గీతాని నామాని తదర్థకాని గాయన్ విలజ్జోవిచరే దసంగః ॥ (11-2-39)

ప్రపంచమున పారమార్థిక సంప్రదాయములందు పరమపావనములైన భగవంతుని అవతార గాథలు ఇహలోకమున ఆతని లీలలు అనేకము లున్నవి. భక్తులకు భక్తియుతధ్యాన విషయమును కల్పించుటయే వాని యుద్దేశము. కనుక ఎంతమాత్రమును లజ్జింపక వీనిని వినుచు కీర్తించుచు ప్రపంచమునందును అందలి వ్యాపకము లందును నిస్సంగుడై ప్రవర్తింపవలెను.

# వార్తలు-విశేషాలు

అర్జెంటీనా (దక్షిణఅమెరికా)లోని శ్రీరామకృష్ణ వేదాంత కేంద్రమునకు అధ్యక్షు లగు శ్రీ పరాత్పరానందస్వామివారు జనవరి 22–వ తేది మద్రాసుమఠమునకు వచ్చిరి. వారమురోజులు ఇచటనుండి జనవరి 30–వ తేది త్రివేంద్రమునకు పోయిరి.

జనవరి 23–వ తేది శ్రీరామకృష్ణ మఠాధ్వర్యమున శ్రీ వివేకానంద సెంటెనరీ హాలునందు 'నాకు కన్పించు వివేకానందుడు' అను విషయముపై గోష్ఠి జరిగినది. శ్రీమత్పరాత్పరానంద స్వామివారు అధ్యక్షత వహించిరి. డా॥ కోళందవేలుగారు తమిళమునను, బదరీనాథ్ గారు, డా॥ సి. వి. సుబ్రహ్మణ్యం గారును ఆంగ్లమునను, జయకాంతన్ గారు తమిళమునను ప్రసంగించిరి. వి. గణేశన్ గారు వందనసమర్పణ గావించిరి.

డా॥ కోళందవేలు గారు శ్రీ వివేకానందుని తాము యువకులకు ఆదర్శమూర్తిగా దర్శించుచున్నామనిరి. గొప్పశాస్త్రవేత్తగను అంతర్జాతీయవాదిగను విప్లవకారునిగను చూచుచున్నామనిరి. యువకులకు ఆదర్శముగా స్వామి వారి ధైర్యమును కార్యశూరతను ధారణాపటిమను బహుముఖమైన విద్యాభ్యాసంగమును కళాభి

రుచిని శరీరనిర్మాణకళలను ప్రస్తుతించిరి. జీవిత సమస్యలకు స్వామివారి శాస్త్రీయదృక్పథమును వివరించుచు ఎవరో చెప్పిరని సంప్రదాయమని ఎచ్చటనో చదివితిమని దేనినిగాని నమ్మరాదనియు స్వయముగా అనుభవమునకు చేసికొనినదే విశ్వసింపవలెననియు స్వామి యనిన పలుకులను వివరించిరి. అన్ని మతముల హద్దులను అతిక్రమించి సకల దేశముల మానవులను ఆశ్లేషించిన స్వామిజీ అంతర్జాతీయతను కొనియాడిరి. ఆత్మవిశ్వాసము లేనివాడే నాస్తికుడు అను మ స్వామివారు మతమున కొనివచ్చిన నూతనదృక్పథము వారిని ఎట్లు విప్లవకారునిగ చూపునదియు ప్రదర్శించిరి. ఉపసంహారమున స్వామిజీ మనకెట్లు సార్వకాలికముగ ఉత్తేజము నొసగగలరోయని కీర్తించిరి.

బదరీనాథ్ గారు మతమే మన దేశపు అధఃపతనమునకు కారణ మనియు స్వామిజీది ఛిన్నమనస్తత్వమనియు ఆయన నిరాశనిస్పృహలతో మరణించెననియు ఆయనకు అధికార దాహము వైయక్తికక్షేమ కార్యనిర్వహణయందు ద్వేషము అన్నియు ఉండినవియు ఆయన శిష్యులు ఆయన నర్థము చేసికొనలేదనియు ఆయనస్థాపించిన సంస్థ ఆయన ఆదర్శములను మరచిపోయి సాంఘిక సంక్షేమ సంస్థగా మిగిలినదనియు ఈ ధోరణిలో ప్రసంగించిరి.

డా॥ సి. వి. సుబ్రహ్మణ్యంగారు స్వామిజీ యొక్క మానవునిలోని దివ్యత్వము సత్యనిష్ఠ బుద్ధితీక్ష్ణతను మించిన మృదుహృదయములను గురించి ఉపన్యసించిరి. దివ్యత్వమును గూర్చి; సకల విశ్వమును ప్రేమించు హృదయవైశాల్యమును, ఘనకార్యములు చేయుటకు మానవుని యందుగల అనంతశక్తిని, ఫలము నపేక్షింపక కర్మచేయుటకు సర్వోత్తము డగుటకుగల సామర్థ్యమును, విద్యయనగా మానవునిలోని దివ్యత్వ వికాసమనుటను ప్రాచ్యుల పరిణామవాదమును దివ్యత్వ ఆకర్షణమును విపులముగా వివరించిరి.

జయకాంతన్ గారు స్వామిజీయొక్క దీనజన వాత్సల్యమును ధైర్య వీర్యములను ఉత్తేజకముగా గర్జించిరి.

జనవరి 29-వ తేది అమెరికాలోని చికాగో శ్రీరామకృష్ణ వేదాంత కేంద్రము అధ్యక్షులు శ్రీ భాష్యానందస్వామివారు వచ్చిరి. ఆ సాయంకాలము సాక్షాత్కారమునకు సోపాన మార్గమును వివరించిరి. ఫిబ్రవరి 2-వ తేది హైదరాబాదునకు పయనమైరి.

ఫిబ్రవరి 6-వ తేది గ్రెట్జ్ (ఫ్రాన్సు) లోని శ్రీరామకృష్ణ వేదాంత కేంద్రాధ్యక్షులగు శ్రీ ఋతజానంద స్వామివారు వచ్చిరి. 8-వ తేది సాయంకాలము వారు మన ఆధ్యాత్మిక వారసత్వమునుగూర్చిమనోహరముగనుపన్యసించిరి.

ఫిబ్రవరి 13-వ తేది శ్రీవివేకానంద హాలున మఠ ఆధ్వర్యమున వేదాంత త్రివేణి యను ద్వైతాద్వైతవిశిష్టాద్వైతముల గోష్ఠి జరిగినది. డా॥ బాలసుబ్రహ్మణ్యంగారు అద్వైత విశిష్టాద్వైతములను తులనాత్మకముగ పరిశీలించుచు సామ్యములనుచూపి విశిష్టాద్వైత వైశిష్ట్యమును ప్రతిపాదించిరి: శ్రీ అచలానంద స్వామి వారు సాధకమార్గముగ ద్వైతసిద్ధాంతము ఎట్లు ఉపకరించునో హృద్యముగ వివరించిరి. శ్రీ ఋతజానందస్వామి అధ్యక్షత వహించిరి. సమాప్తి వాక్యములను పలుకుచు తుదిని వారు ఇట్టి సమావేశముసమన్వయదృష్టిని పెంపొందించుట చేత ఆవశ్యకము లనియు వట్టి సిద్ధాంతములు కాక అనుభూతియే మనకు ముఖ్య మనియు పాశ్చాత్యుల తత్త్వశాస్త్రముపై మన ఉపనిషత్తుల ఘనత ఇదియే యనియు అనుభూతిలేని వాదము నిరర్థక మనియు అనిరి.

## వివేకానందసింహగర్జనము

శ్రీ చిరంతనానందస్వామి

భారతీయులను ధీరజనులను చేయుటకు శ్రీవివేకానందస్వామి యొసగిన యుద్బోధనలనుండి అమూల్యములు ఉత్తేజకరములు అగువచనములను [illegible] రచయిత సేకరించి యనువదించిరి. శరీరమును పులకింపజేసి మనస్సును [illegible] రచన.

పుటలు : 30  వెల : 20 పైసలు.

## సర్వం విష్ణుమయం జగత్

అనువాదకుడు :

శ్రీ చిరంతనానందస్వామి

శ్రీ వివేకానందస్వామి లండను నగరమున నొసగిన గాడ్ ఇన్ ఎవ్విరిథింగ్ అను ఉపన్యాసమున కిది యనువాదము. మతధర్మములపై స్వామి యుపన్యసించుచు మానవ జీవితోద్దేశమును జీవన విధానమును మనోహరముగ ఈశావాస్యోపనిషత్తుకు ధారాళ వ్యాఖ్యగ వివరించియున్నారు.

పుటలు : 36  వెల : 35 పైసలు.

## యువకులకు వివేకానందుల పిలుపు

అనువాదకులు :

బి. ఎస్. ఆర్. ఆంజనేయులు

నవభారతయువతి నుద్బోధించుచు శ్రీ వివేకానందస్వామి యొసర్చిన యుపన్యాసములనుండి మేటి రత్నములను సేకరించి ఆంగ్లమున వివేకానంద స్పీక్స్ టు యంగ్ మెన్ అను పుస్తకము ప్రచురితమైనది దాని కిది యనువాదము. యువకులయందు ఆత్మవిశ్వాసమును దేశభక్తిని కార్యతత్పరతను ప్రోత్సహించు అమూల్య సంకలనము.

పుటలు : 56  వెల : 75 పైసలు.

ప్రథమ ముద్రణము.

## పారమార్థిక సంభాషణలు

అనువాదకులు :

కందుకూరు మల్లికార్జునంగారు

మాతృదేవి శ్రీ శారదాదేవి, శ్రీ బ్రహ్మానందస్వామి, శ్రీ ప్రేమానందస్వామి, శ్రీ తురీయానందస్వామి శ్రీ శివానందస్వామి శ్రీ శారదానందస్వామి అనెడి ఆర్గురు జ్ఞానసిద్ధుల అమూల్యములగు భాషణము లిందున్నవి. నిత్యనూతనములగు పారమార్థిక సమస్యలకు వారిచ్చు ఉపదేశములు ఆధ్యాత్మ సాధకుల కత్యంతము ఉపయోగకరములు.

పుటలు: 424  వెల : రూ. 6-50



# శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004

## 1977-వ సంవత్సరము, ఏప్రిల్ మాసమున జరుగనున్న

## ఉత్సవ కార్యక్రమము

**శంకరరామానుజజయంతి :** 23-4-77 శనివారము : తిథిపూజ
24-4-77 ఆదివారము : శంకరజయంతి
బహిరంగసమావేశము
అధ్యక్షులు : శ్రీమత్తపస్యానందస్వామి
వక్తలు : డా. టి. ఎన్. గణపతి
శ్రీ అణ్ణా. ఎన్. సుబ్రహ్మణ్యం.

**శ్రీరామనవమి :** 29-3-'77 మంగళవారము : సాయంకాలిక ఆరాత్రికానంతరము రామనామ భజన.
5 గంటలనుండి 6-30 గంటలవరకు బహిరంగ సమావేశము.
అధ్యక్షులు : శ్రీమత్తపస్యానందస్వామివారు.
వక్తలు : శ్రీరామకృష్ణన్.
శ్రీ రాజగోపాలశర్మ.

**ఆదివారములందు సత్సంగము :**

సా. 4-00—4-20 వరకు శ్రీవిష్ణుసహస్రనామ పారాయణము (17-4-77)
శ్రీలలితా సహస్రనామము (10-4-77)
4-20—4-30 ,, ధ్యానము.
4-30—5-30 ,, తమిళమున ఉపన్యాసములు.
శ్రీదక్షిణామూర్తి స్తోత్రము : డా. టి. ఎమ్. పి. మహాదేవన్ (10-4-77)
శ్రీమద్రామాయణము : డా. ఎన్. వీరినాథన్ (17-4-77)
5-35—6-30 : ఆంగ్లమున ఉపన్యాసము.
శ్రీమద్భగవద్గీత : శ్రీమత్తపస్యానందస్వామివారు (10, 17-4-77)
6-30—8-00 : ఆరాత్రికము, భజన.

**ప్రత్యేకోపన్యాసములు :** శనివారములందు సాయంకాలము 6-45 గంటలకు.

2-4-77 : శ్రీమద్రామాయణ పఠనము : శ్రీ పి. రామకృష్ణన్, ఐ.సి.ఎస్. (రిటైర్డు)
9-4-77 : గజేంద్రమోక్షము : శ్రీ ఆర్. కొదండరామన్.
16-4-77 : శ్రీమద్రామాయణము : డా. ఎన్. వీరినాథన్.

**ఇతర వారములందు ఉపన్యాసములు :** సాయంకాలము 6-45 గంటలకు.

సోమవారములు : శ్రీరామకృష్ణ కథామృతము : శ్రీమత్ అమృతానందస్వామి (ఆంగ్లము)
మంగళవారములు : అధ్యాత్మరామాయణము : శ్రీమత్ గభీరానందస్వామి (ఆంగ్లము)
బుధవారములు : శ్రీమద్భాగవతము : శ్రీమత్ గోలోకానందస్వామి (ఆంగ్లము)
గురువారములు : అముదమొళ్రి : బ్రహ్మచారి విరంజనచైతన్య (తమిళము)
శుక్రవారములు : శ్రీ మహాభారతము : శ్రీ 'అణ్ణా' ఎన్. సుబ్రమణియన్ (తమిళము)

**తదితరములు :** 24-4-77 ఆదివారము : అంతర్యోగము.

ఏకాదశులయందు సాయంకాలిక ఆరాత్రికానంతరము శ్రీరామనామ భజన (14, 30-4-77).

శుక్రవారములందు సాయంకాలము 6-30 గంటలకు తిరువళ్లిక్కేణియందలి దక్షిణ మాడవీథియందు 18-వ నంబరుగల శ్రీరామకృష్ణ మందిరమున శ్రీమత్ గోలోకానందస్వామివారి గీతోపన్యాసములు.

ఈ ఉత్సవము లన్నింటియందును భక్తులెల్లరును పాల్గొని భగవంతుని అనుగ్రహభాగ్యమును బడయగోరుచున్నాము.

అధ్యక్షులు,
శ్రీరామకృష్ణమఠము, మద్రాసు-600004.

# మా తెలుగు ప్రచురణలు

| శ్రీ రామకృష్ణులపై : | రూ. పై. |
|---|---|
| శ్రీ రామకృష్ణ కథామృతము | 8–00 |
| ,, (క్యాలికో) | 12–00 |
| శ్రీ రామకృష్ణ జీవిత చరిత్ర | 10–00 |
| ,, (క్యాలికో) | 14–00 |
| శ్రీ రామకృష్ణ బోధామృతము | 8–00 |
| ,, (క్యాలికో) | 15–00 |
| శ్రీరామకృష్ణోపనిషత్తు | 3–75 |
| శ్రీ రామకృష్ణ పరమహంస నీతికథారత్నములు | 2–50 |
| గురూపదేశములు | 2–00 |
| శ్రీ రామకృష్ణ పరమహంస జీవిత సంగ్రహము | 0–75 |
| నా గురుదేవుడు | 1–25 |
| శ్రీ రామకృష్ణ దివ్యవాణి | 1–50 |

| శ్రీ శారదాదేవిపై : | |
|---|---|
| శ్రీ శారదాదేవి జీవిత చరిత్ర | 4–00 |
| శ్రీ శారదా ప్రసంగములు | 3–00 |
| శ్రీ శారదాదేవి | 2–50 |

| శ్రీ వివేకానందస్వామిపై : | |
|---|---|
| శ్రీ వివేకానంద జీవిత చరిత్ర | 4–00 |
| బాలల వివేకానందుడు | 2–00 |
| శ్రీ వివేకానంద సంపూర్ణ గ్రంథావళి 10 సంపుటముల సెట్టు (సాదా) | 65–00 |
| ,, క్యాలికో | 73–50 |
| విడి సంపుటములు ఒక్కొక్కటిసాదా | 5–00 |
| ,, క్యాలికో | 6–50 |
| సందేశ తరంగిణి (మొదటి భాగము) | 4–00 |
| ,, (రెండవ భాగము) | 5–50 |
| జ్ఞానయోగము (ముద్రణలో) | |
| భక్తియోగము | 4–00 |
| రాజయోగము | 6–25 |
| కర్మయోగము | 4–00 |
| వివేక సూర్యోదయము | 4–00 |
| యువకులకు వివేకానందుల పిలుపు | 0–75 |
| శ్రీ వివేకానంద సింహగర్జనము | 0–20 |
| సర్వం విష్ణుమయం జగత్ | 0–35 |
| భారత యువజనులారా! | 3–00 |
| ప్రబోధ రత్నాకరము | 2–50 |
| శ్రీ వివేకానంద లేఖావళి (మొదటి భాగము) | 2–25 |
| ,, (రెండవ భాగము ముద్రణలో) | |
| హిందూ మతము | 4–00 |
| అనుష్ఠాన వేదాంతము | 2–50 |
| ప్రాచ్యము, పాశ్చాత్యము | 1–25 |
| షికాగో నగరోపన్యాసములు | 1–00 |
| కులము, సంస్కృతి, సామ్యవాదము | 3–00 |
| భారతదేశము | 2–00 |
| భారతీయ మహిళ | 2–00 |
| నా సంస్కరణ యుద్ధ విధానము (ముద్రణలో) | |
| నవీన భారతదేశము | 0–40 |
| పవహారి బాబా (ముద్రణలో) | |
| నా జీవితము, జీవిత కార్యము | 1–25 |
| గురు, శిష్య సంవాదములు (ముద్రణలో) | |

| శ్రీమద్భగవద్గీత : | |
|---|---|
| శ్రీమద్భగవద్గీత (టీకాతాత్పర్య విశేషార్థసహితము) | 9–00 |
| పారాయణగీత తాత్పర్యసహితము | 3–75 |
| మూలము | 2–00 |

సంపాదకులు : శ్రీ చిద్ఘనానందస్వామి.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-600021) న ముద్రింపబడి,

శ్రీ చిద్ఘనానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మద్రాసు-600004) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము 34 — 1977 - మే : పింగళ - వైశాఖము. — సంచిక 5

## విషయ సూచిక

## బ్రహ్మానంద బోధనలు

(ఆధ్యాత్మిక పరిప్రశ్నములు)

శ్రీ చిరంతనానందస్వామి

బ్రహ్మానందబోధనలు (శ్రీ బ్రహ్మానంద స్వామి జీవితోపదేశములు) అను గ్రంథము నుండి బ్రహ్మానందవాణి యను పేర ఇందు ఉపదేశములు మాత్రము సంగ్రహింప బడినవి. పాఠకుల సౌకర్యార్థము స్వామి సంగ్రహ చరిత్రయు చేర్పబడినది. స్వామి యుపదేశములు ఆధ్యాత్మికతత్త్వములను సాధనయందలి రహస్యములను అరటి పండొలిచి ఇచ్చినట్లు విశదీకరించును.

పుటలు: 272 + XXI వెల: రూ. 4-75

(ప్రథమ ముద్రణము)

## భక్తియోగము

అనువాదకులు:

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఆధునికుల చిత్తము నాకర్షించురీతిని, అమోఘవచనములతో, విమర్శకదృష్టితో శాస్త్రప్రమాణములతో భక్తితత్త్వమును శ్రీ వివేకానందస్వాములవా రిందు విపులముగా ప్రదర్శించి యున్నారు. మూల గ్రంథములలోని ప్రమాణవచనములును వానికి టిప్పణములును సులభశైలియందు వ్రాయబడి యున్నవి.

(ఏడవ కూర్పు)

(121+4 పుటలు) వెల: రూ. 4-00

## కర్మయోగము

అనువాదకులు:

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు శ్రీ స్వాములవారు కర్మయోగ తత్త్వమును అరటిపం డొలిచినట్లు విశదీకరించియున్నారు. కర్మమెటుల మోక్ష సాధనమో స్పష్టీకరించియున్నారు.

(అష్టమ ముద్రణము)

(146+8) పుటలు వెల: రూ. 4-00

## గురూపదేశములు

అనువాదకులు:

శ్రీ చిరంతనానందస్వామి

శ్రీ గురుదేవుని మానసపుత్రు డనబరగిన శ్రీ బ్రహ్మానందస్వామి గురుముఖము నుండి వచ్చిన యుపదేశములను యథాతథముగ గ్రహించి వానియందు ముఖ్యములగు వానిని సంగ్రహించి యాంగ్లమున రచించిరి. వాని యనువాదమే ఈ గ్రంథము. ఇందు గృహస్థులకు సాధకులకు వలయు సూక్తు లెన్నియో వివరింపబడియున్నవి.

పుటలు: 168 వెల: రూ. 2-00

తొమ్మిదవ ముద్రణము

---

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004.

---

# మనవి

1. శ్రీరామకృష్ణప్రభ సంపుటం ప్రతి ఏటా జనవరినుంచి ప్రారంభమౌతుంది. ఏమాసం నుండి అయినా చందాదారులు కావచ్చు.

2. చందాపైకం మనియార్డరు ద్వారాగాని క్రాస్డ్ పోస్టల్ ఆర్డర్, క్రాస్డ్ బాంకుడ్రాఫ్టుల ద్వారాగాని ('శ్రీరామకృష్ణ మఠము, మద్రాసు' అను పేరిట) పంపవచ్చును. మనియార్డరు కూపనులో అడ్రసు వివరాలు సరిగా వ్రాయాలి.

3. చందాదారులు ఉత్తర ప్రత్యుత్తరాలలో తమ చందాదారు సంఖ్యను ఉదాహరిస్తూ విలాసం స్పష్టంగా వ్రాయాలి.

4. మూడు నెలలకు మించిన అడ్రసు మార్పిడి ఆ ముందటి నెల మొదటి వారంలోగా తెలియజేయాలి.

5. సంచిక సాధారణంగా నెల ఆఖరి వారంలో అందుతుంది. అందకపోతే మరుసటి నెల మొదటి వారంలోగా తెలపాలి.

6. చందాదారులకు మా ప్రచురణలపై వెలలో 5% తగ్గింపు ఉంటుంది.

**వివరాలకు:**

మేనేజర్: శ్రీరామకృష్ణప్రభ, P. B. 635
మైలాపూర్, మద్రాసు-4.



ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్యవరాన్నిబోధత.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము 34 } 1977 – మే : : పింగళ – వైశాఖము { సంచిక 5


## ప్రార్థన

పాపం ధునోతి కఠినం కదనం
శుద్ధిం దదాతి విపులం శమమాదధాతి
భక్తిం ప్రయచ్ఛతి పరాం ముదమాతనోతి
కింకిం ఫలం న కురుతే తవ పాదసేవా॥

దేవా! నీ పాదసేవ పాపములను తుడిచివేయును. కష్టములను తొలగించును. చిత్తశుద్ధిని కలిగించును. ఎక్కువ శాంతిని ఇచ్చును. భక్తిని పెంపొందించును. పరమానందమును కలిగించును. దేవుడా! నీ పాదసేవ వలన ఏ శుభము కలుగదు! (శ్రీ రామకృష్ణ కర్ణామృతము)

భూపలలామరామ రఘుపుంగవరామ త్రిలోకరాజ్య సం
స్థాపనరామ మోక్షఫలదాయకరామ మదీయపాపముల్
పాపఁగదయ్య రామ నినుఁ బ్రస్తుతి సేసెదనయ్య రామ సీ
తాపతి రామ భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ. (దాశరథి శతకము)

కృష్ణాయ వాసుదేవాయ దేవకీనందనాయ చ
నందగోపకుమారాయ గోవిందాయ నమోనమః. (భాగవతం)



# వివేకానందవాణి

సంస్కృతవాఙ్మయమున గల చివరికవి జయదేవుడే. కాని పెక్కుతడవ లతడు భావగాంభీర్యము నందు కన్న యమకానుప్రాసములందు ఆసక్తుడయ్యెను. అయినను 'పతతి పత్రే...'* అను గీతమున ప్రేమలాలసయొక్క పరాకాష్ఠ నెట్లు వర్ణించియున్నాడో చూడుము. అట్టి తీవ్ర ప్రేమావేశము ఆత్మసాక్షాత్కారసిద్ధికి అనవసరము. హృదయము సంక్షుభితమై కుమిలి కృశించిపోవలెను.

ఇక క్రీడారూపమగు బృందావనజీవితము నుండి శ్రీకృష్ణుని కురుక్షేత్రలీలలకు వత్తము. ఎంత ఆత్మసమ్మోహనము లవి! ఆ బీభత్స రణరంగమందలి ఘోరారవ కోలాహలము నట్టనడుమ అత డెంత నిశ్చలముగా, ఎంత ఆత్మనిగ్రహముతో, ఎంత ప్రశాంతతతో నుండెనో చూడుము. అంతేకాదు, ఆ యుద్ధభూమియందే నిలిచి అర్జునునకు గీతాబోధన మొనరించి, క్షాత్రధర్మము ననుసరించి యుద్ధమొనర్పుమని యతనిని ప్రోత్సహించుచున్నాడు! ఈ ఘోరయుద్ధకారకులలో నొకడయ్యును అతడు యుద్ధకర్మమున ప్రసక్తుడు కాలేదు—ఆయుధము లేపూనలేదు.

శ్రీకృష్ణుని బహుముఖజీవితమున దేనినైనను కైకొని పరీక్షించి చూడుము. అది నిర్దుష్టమును మహోత్కృష్టమునుగా నుండును. జ్ఞానమునకు, కర్మమునకు, భక్తికి, యోగమునకు: అన్నిటికిని అతడు మూర్తీభావమా యేమి అనిపించును!



శ్రీకృష్ణునియందు గల ఈ విశేషలక్షణమును ఈ కాలమున ముఖ్యముగా గ్రహింపవలయును. మురళీగానలోలుడగు బృందావనకృష్ణుని మాత్రమే బుద్ధియందుంచుకొనుట ఈ కాలమున చాలనే చాలదు. గీతాసింహనాదము చేయు శ్రీకృష్ణుని, సధనుర్బాణతూణీరుడగు శ్రీరామచంద్రుని, మహావీరుని (హనుమంతుని) కాళీమాతను అర్చింపవలసిన దినము లివి. అట్లు చేసినగాని మానవులు మహోత్సాహముతో, పరిపూర్ణదీక్షతో, కర్మాచరణమునకు పూని బలిష్ఠులు కాజాలరు.

త్రికరణశుద్ధిగా పరిశ్రమించితివేని, నీకు ఈ జన్మమందే ఆత్మసాక్షాత్కారసిద్ధి ప్రాప్తించునని నేను నిస్సంశయముగా చెప్పగలను. కాని పురుషకారముమాత్రము అవసరము. అది యెట్టిదో ఎఱుగుదువా? ''నేను ఆత్మజ్ఞానమును సాధించితీరుదును. ఎట్టి అంతరాయ

* పతతి పతత్రే విచలతి పత్రే శఙ్కిత భవదుపయానం
రచయతి శయనం సచకిత నయనం పశ్యతి తవ పన్థానమ్.

(పక్షి యెగిరినను, ఆకు కదలినను, నీవు వచ్చుచున్నట్లు భావించి, నీ పడకను అమర్చి, నీవు వచ్చుమార్గమువైపు సంభ్రమసూచకదృష్టులతో ఆమె చూచుచుండును.)

ములు కలిగినను, నేను వానినన్నిటిని జయించి తీఱుదును''—అనునట్టి దృఢనిశ్చయమే పురుషకారము.

''నా తలిదండ్రులు, మిత్రులు, పోషకులు, ఆలుబిడ్డలు బ్రదికినను చచ్చినను, ఈ శరీరము ఉండినను పోయినను, ఆత్మదర్శనమును సాధించినగాని నేను వెనుకకు మరలను''—లక్ష్యాభిముఖ పురోగమనమునకై ఇతర స్థితిగతుల యెడ పూర్ణమగు ఉపేక్షతో కూడిన ఇట్టి దృఢసంకల్పము—ఇదియే పురుషకారము.

ఆహారనిద్రాదులకై పశుపక్ష్యాదులు సైతము పరిశ్రమించును. మానవునకు ఈ శరీరప్రాప్తి ఆత్మజ్ఞానసాధనార్థమే. లోకమునగల జనసామాన్యమువలెనే నీవును ప్రవర్తించి, తదనుగుణముగనే పోయిన, నీ పురుషకారమేమైనట్లు? సామాన్యజనులు మృత్యుముఖము లోనికే పోవుచున్నారు. నీవు జన్మించినది మృత్యువును జయించుటకు గదా!

వీరుడవై ముందుకు నడువుము. ఎట్టి విఘ్నము లెదురొక్కన్నను వెనుకకు తగ్గకుము. సుఖదుఃఖమయమగు ఈ శరీరము ఎన్నాళ్లు నిలుచును! నీకు మనుష్యశరీరము ప్రాప్తించినది గనుక, నీలోని ఆత్మను మేలుకొలుపు. ''నేను భయాతీతస్థితిని సాధించితిని'' అని పల్కుము! ''నేను ఆత్మను, నా అహంభావము శాశ్వతముగా నా ఆత్మలో లయించిపోయినది'' అని పల్కుము! ఈ భావమునందు పరిపూర్ణుడవగుము; ఆపిదప ఈ శరీరము నిలిచియున్నంతకాలము, ఇతరులకు ''తత్త్వమసి'' అనే ఈ అభయసందేశమును ఇచ్చుచుండుము.

* * *

అయ్యో! దేశములోని బీదలతలంపు ఎవ్వరికిని లేదు. వారు దేశమునకు వెన్నెముకవంటివారు. వారు కష్టించి చెమట యోడిచి, ఆహారపదార్థములు ఉత్పత్తి చేయుచున్నారు. ఈ నిరుపేదలు, ఈ నిర్భాగ్యులు, ఈ కూలివాండ్రు, పాకీవాండ్రు—ఒక్కనాడు సమ్మెకట్టిరేని, ప్రజలు దిక్కుతోపక, విస్మయమందుదురు. కాని వారియెడ ఎవ్వరికిని సానుభూతి లేదు. వారిని ఓదార్చువారెవ్వరును లేరు.

దీనులారా. దరిద్రులారా, అనాథులారా, పతితులారా, రండు అని ఆహ్వానించి, వారినెల్లరను శ్రీ రామకృష్ణనామమున చేఱదీయవలయునను సంకల్పము నాకు అప్పుడప్పుడు దృఢముగా కలుగుచుండును. ముందు వారు లేచిననేగాని తర్వాత దేశమాత మేల్కొనదు. వారి అన్నవస్త్రములకు మనము ఏమియు ఏర్పాటు చేయజాలకపోయితిమి – ఇక మనము ఏమి చేసినట్లు!

పాపము! వారికి లౌకికజ్ఞానము లేదు. కావున రేయింబవళ్ళు కష్టించి పనిచేసియు, అన్నవస్త్రములు సంపాదించుకొను సదుపాయములు ఏమియు వారు చేసికొనజాలకున్నారు. మనము వారి కన్నులు తెఱతుముగాక, సర్వత్ర –వారియందును, నాయందును–ఒక్క బ్రహ్మమే కలదని, ఒక్కశక్తియే నిలిచియున్నదని, నాకు విస్పష్టముగా – ఈ సూర్యరశ్మివలె– కానిపించుచున్నది. వికాసతారతమ్యమే భిన్నతకు అంతటికిని కారణము.

–(శ్రీ వివేకానంద సంపూర్ణగ్రంథావళి సంపు. 5 నుండి)



# కర్మ ప్రభావం

## చిర్రావూరు వెంకట్రావు

(అనుశాసనిక పర్వములో భీష్ముడు ధర్మరాజుకు చెప్పిన
'గౌతమీ లుబ్ధక సర్ప మృత్యుకాల సంవాద'మను ఇతిహాసము)

భీష్ముడు ధర్మరాజుకు అనేకధర్మాలు ఉపదేశించాడు. ఎన్నో ఇతిహాసాలు చెప్పాడు. కాని ధర్మరాజుకు మనశ్శాంతి కలిగింది కాదు.

''తాతా! నాకు మనశ్శాంతి లభించాలని ఎన్నో ధర్మసూక్ష్మాలను వినిపించావు. అన్నింటినీ శ్రద్ధతో విన్నాను. అయినా నా మనస్సుకు ఊరట కలగలేదు. బాణాలతో కొట్టిన గాయాలతో మీ శరీరం నిండివుంది. ఇలాంటి అవస్థలో మీరున్నారు. నామూలంగా యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో పితామహుడవైన నిన్ను శత్రువు వలె భావించి ఇట్టి దురవస్థ కలిగించాను. ఇంత కంటె అపకీర్తి ఇంకేముంటుంది? మీరే కాదు, రాజులెందరో సపరివారంగా యుద్ధంలో గతించారు. దీనికంటె దుఃఖం ఇంకేముంటుంది? నేను దుర్యోధనుడు కాలబలంవల్ల క్రోధానికి వశులమయ్యాము. ఇలాటి నీచకార్యానికి పాల్పడ్డాము. ఎటువంటి దుర్గతికి పోతామో తెలియటంలేదు. మహావీరా! కులనాశకుడైన దుర్యోధనుడు బంధుసహితంగా మరణించాడు. మీ దీనావస్థను చూడకుండా దాటిపొయ్యాడు. అందువల్ల చావటమే వానికి మేలు కలిగించిందని తలుస్తాను. మిమ్ములను చూస్తున్న నాకు చిత్తశాంతి కలగటంలేదు. నేను నా సోదరులు యుద్ధంలో మొదటనే మరణించివుంటె ఎంతో మేలుగా వుండేది. బాణాలవల్ల కలిగినగాయాలతో బాధపడుతున్నారు. మీ దీనావస్థ చూడకుండా వుండేవాళ్లంగదా! విధాత నన్ను పాపిగా సృష్టించాడు. నామీద మీకు సంపూర్ణంగా దయవుంటే నా పాపాలకు విముక్తి కలిగే విధానం ఉపదేశం చెయ్యండి'' అని ధర్మరాజు భీష్ముని ప్రార్థించాడు.

అప్పుడు భీష్ముడు ''ధర్మరాజా! దేనికీ నీవు స్వతంత్రుడవుకావు. కర్మస్వభావం చాల సూక్ష్మంగా వుంటుంది. దాన్ని తెలుసుకోవటం చాలా కష్టం. ఇంద్రియాలకు గోచరంగాదు. నీ వెట్లు తెలుసుకోగలవు? దానినిగురించి ఒక యితిహాసం చెబుతా విను'' అని చెప్పటం ప్రారంభించాడు.

''కుంతీనందనా! పూర్వకాలంలో గౌతమి అనే ఒక స్త్రీ వుండేది. శాంతిని సాధించటంలో తత్పరురాలై వుండేది. ఆమెకొక కుమారుడుండేవాడు. ఒకరోజున పాము కరచినందున వాడు మరణించాడు. కొడుకు చావునుచూచి ఆమె నిశ్చేష్టురాలైంది. ఆమె శాంతభావంకూడ కొద్దిగా చలించింది. అర్జునకుడనే బోయవాడు ఆ పామును తాళ్ళతో బంధించి ఆమెవద్దకు తెచ్చి, 'పూజ్యురాలా! ఇది దుష్టసర్పం. నీ కొడుకు ప్రాణాలు తీసింది. దీనిని యెక్కువ కాలం బ్రతకనీయకూడదు. దీనిని అగ్నిలో వేసి కాల్చవలెనో, ముక్కలు ముక్కలుగా నరకవలెనో, లేక యేవిధంగా చంపవలెనో, చెపితే ఆ ప్రకారం చేస్తా'నన్నాడు.

ఆమాటలకు గౌతమి 'అర్జునకా! విధివశంవల్ల వచ్చినకీడును తెలివిలేనివారు పెద్దగా భావిస్తారు. ఆందోళనపడతారు. నీవీ పామును చంపవద్దు. తెలివిగలవారెవ్వరు పాపం చేయరు. పాపభారమును మోయువారు సంసారసాగరంలో మునిగిపోతారు. ధర్మాన్ని పాలించే

వారు సముద్రంలో ప్రయాణంచేసే ఓడరిదిమా సంసారసాగరాన్ని దాటుతారు. దీనిని చంపి నందువల్ల నాకుమారుడు జీవింపడు. ఇది బ్రతికి యున్నందువల్ల నీకేమీ హాని లేదు. నిండు ప్రాణాలు తీయించి నరకానికి వెళ్లటం నాకిష్టం లేదు. కాబట్టి పామును విడిచిపెట్టు' అని శాంతంగా చెప్పింది.

ఆ మాటవిని వ్యాధుడు 'దేవీ! మీబోటి వారు యీవిధంగానే అంటారని నాకు తెలుసు. ఎందుకంటే జీవహింసకు వారొప్పు కోరు. మీరు చెప్పింది మానవులవిషయంలో చెల్లుతుందేమో, కాని, ఇది విషజంతువు. దీనిని తప్పక చంపవలసిందే. శాంతి కోరేవారు విధివిధానంవల్ల చెడు జరిగిందని భావించి దుఃఖాన్ని మర్చిపోతారు. కొంతమంది శత్రువునకు ప్రతీకారంచేసి సంతోషిస్తారు. మరికొందరు తమకు గలిగినకష్టాలను తలుచుకుంటూ దుఃఖిస్తుంటారు. కాబట్టి దీని ప్రాణాలుతీసి మీకు తాత్కాలిక దుఃఖశాంతిని కలిగిస్తా'నన్నాడు

బోయవానిమాటలకు గౌతమి ఈవిధంగా బదులు చెప్పింది. 'వ్యాధుడా! సజ్జనులు ఎప్పుడూ ధర్మం తప్పరు. నాకొడుకెప్పుడైనా చావవలసినవాడే. నేనెప్పుడూ యెవరికీ హాని చెయ్యలేదు. నీవుకూడ దయగలవాడవై దీని అపరాధాలను క్షమిస్తే మంచివాడవవుతావు.'

ఆమె చెప్పినసమాధానం అర్జునకుడు విన్నాడు. 'పూజ్యురాలా! ఈ దుష్టసర్పం బ్రతికి వున్నందున మీకేమీ లాభంవుండదు. దీనిని చంపితే చాలామందికి లాభం కలుగుతుంది. ఒక్క పామునుచంపి అనేకమంది ప్రాణాలను రక్షిస్తాను. అది చాలా మంచిపని. ఒకరిని కాపాడి అనేకమందికి హానిచెయ్యటం మంచిది కాదు.ధర్మం తెలిసి నవారు తప్పు చేసినవారిని మన్నించరు. పామును చంపక మాననను' అన్నాడు.

ఆ మాటలు గౌతమికి నచ్చలేదు. 'సౌమ్యా! శత్రువును బంధించి చంపినందువల్లను, పారిపోకుండ చేతిలో వుంచుకొన్నందువల్లను లాభం కలుగదు, ఏ కోరికా తీరదు. కాబట్టి దీని అపరాధం క్షమించలేవా? దీనిని రక్షించేప్రయత్నం చెయకూడదా?' అని అడిగింది.

అందుకు వాడు 'దేవీ! వృత్రాసురుని చంపి దేవేంద్రుడు తన పదవిని నిల్పుకొన్నాడు. దక్షయజ్ఞం భంగంచేసి పరమేశ్వరుడు తన యజ్ఞభాగం తీసుకన్నాడు. దేవతలు నడచినమార్గంలో నడవటం శ్రేష్టం. ఈ పామును చంపటానికి సంశయించవద్దు' అని బదులు చెప్పాడు.

ఈవిధంగా గౌతమిని బోయవాడు యెంత ప్రోత్సహించినా పామును చంపుటకు ఆమె సమ్మతించలేదు. వారిద్దరు సంభాషణ చేస్తున్న సమయంలో పాము మెల్లమెల్లగా బంధాలను వదులుచేసుకుంది. గట్టిగా తనను సమర్థించుకుంటూ హీనస్వరంతో ఈవిధంగా చెప్పింది.

'ఓ కిరాతుడా! నేను పరుల ఆధీనంలో వున్నాను. ఈ బాలుని చంపుటకు మృత్యుదేవత నన్ను ప్రేరేపించింది. ఇతనిమీద కోపంగాని, చంపాలనే కోరికగాని నాకు లేదు. ఈ విషయంలో దోషమంతా మృత్యువుది. కాని నాదికాదు.'

అందులకా లుబ్ధకుడు 'నాగమా! పరుల ప్రేరణవల్ల పాపం చేశావు. ఆ కారణంచేత నీవు అపరాధివే. కుమ్మరివానికి కుండలు చేయుటకు సారె, కర్ర, కారణములు. ఆవిధంగానే పిల్లవానిచావుకు నీవు కారణమైనావు. కనుక నీవు దోషివే. నిన్ను చంపక తప్పద'న్నాడు.

వానిమాటలు విన్నసర్పము 'వ్యాధా! నీ వన్నట్లు కుండలు చేయుటకు కర్ర, సారె, కారణ మైనను అవి కుమ్మరివానికి స్వాధీనములో వున్నవిగదా! అవిధంగానే నేను మృత్యువునకు స్వాధీనురాలను. నన్ను దోషిగా ఆరోపించటం సరికాదు. దండము చక్రము కుమ్మరివాని కార్య మునకు కారణమని తలుస్తున్నావు. ఆ కార్యం వల్ల కలిగే ప్రయోజనం కుమ్మరివానికేగాని ఉపకరణములకు కాదు. నాలో యేదోషము లేదు. నేను చంపలేదు. అపరాధిని కాను. ఎందుకు నన్ను దోషిగా తలుస్తున్నావో తెలి యటం లేదు' అని బదులు పలికింది.

'ఓ దుష్టసర్పమా! నిన్ను సమర్థించుకుంటూ అధికంగా మాట్లాడవద్దు. పిల్లవాడు మరణిం చాడు. ఈ దోషమునకు నీవు కర్తవు కాక పోయినా కరణమైనావు. అందుకని చంపటమే మంచిదని తలుస్తాను. మృత్యువు నీవు ఇద్దరూ దోషులే అవుతారు' అన్నాడు బోయవాడు.

అప్పుడు పాము 'బోయుడా! ప్రేరేపించు వాడు లేనిదే క్రియ జరుగదు. ఈ పిల్లవానిని చంపినపాపము పూర్తిగా మృత్యువు అవు తుంది. నన్ను దోషిగా చెప్పటం పొరపాటు

ఆమాటలువిన్న బోయవాడు 'ఓ నీచ సర్పమా! క్రూరమైనపనులు చేస్తుంటావు. జీవ హింస చేశావు. నిర్దోషివని చెప్పుకుంటా వెందు కు? నిన్ను ప్రాణాలతో వదిలేది లేద'న్నాడు.

'బోయవాడా! యజ్ఞంలో ఋత్విజులు ఆహుతులు చేస్తారు. ఆ ఫలితం యజమానికే చేరుతుంది. ఆలాగా నేను చేసినపనికి ఫలితం మృత్యువుకే చెందుతుంది. కాని నాకు గాదు' అని సర్పము చెప్పుచుండగా మృత్యువు అక్క డకు వచ్చిచేరింది. అది పామునుచూచి 'ఓ సర్పమా! ఈ బాలునిచావునకు మన మిద్దరము కారకులము కాము. నన్ను కాలుడు ప్రేరే పించాడు. గనుక అతడే అపరాధి అవుతాడు. గాలిచేత కదలిపొయ్యే మేఘాలవలె నేను కాలుని ఆజ్ఞప్రకారం నడుస్తుంటాను. త్రిగు ణాలు, పంచభూతాలు, సర్వజగత్తులోని స్థావర జంగమాలు కాలుని స్వాధీనములో వున్నాయి. సమస్తమును పుట్టించుటకు, గిట్టించుటకు కాలుడే కర్త. ఈసంగతి నీకు తెలుసు. నాపై నేరం మోపుతావెందుకు? నేను దోషినైతే నీవూ దోషివే అవుతావు' అన్నది.

ఆమాటలు విన్నపాము 'మృత్యువా! నిన్ను దోషిగా చెప్పటం నా పనికాదు. నీవు ప్రేరే పించావని చెప్పాను. నావల్ల తప్పులేదని నిరూ పించుకున్నాను, అంతే' అని సమాధానం చెప్పి బోయవానినిచూచి 'మృత్యువు చెప్పినమాటలు విన్నావుకదా! ఇంకా నన్ను బంధించివుంచటం దేనికి?' అని ప్రశ్నించింది.

'పన్నగమా! ఈ విషయంలో మీరిద్దరూ దోషులే. చెడ్డచేసేవారంతా దురాత్ములవు తారు. పాపకర్ములు చేసేనిన్ను చంపక మానను' అన్నాడు. వ్యాధుడు.

మృత్యువు వానినిచూచి 'లుబ్ధకుడా! ఈ జగత్తులో ఏమిజరిగినా కాలునివల్లనే జరుగు తుంది. నేను ఈ పాము కాలుని ఆధీనంలో వున్నాం. వాని ఆనతిప్రకారం నడుస్తాం. కాబట్టి మమ్ములను నిందించవద్ద'ని చెప్పింది.

ఈవిధంగా మృత్యువు బోయవానితో మాట్లాడుతుండగా అక్కడకు కాలుడు ప్రవే శించాడు. బోయవానితో 'అర్జునకా! ఈ బాలునిచావుకు నేను, మృత్యువు, సర్పము కారణం గాదు. వాడు చేసినకర్మయే వాని

చావుకు మూలమైవుంది. అందరు వారివారి కర్మకు లోబడినవారే. ఈ ప్రపంచంలో సుఖ దుఃఖాలకు మూలమైనది కర్మయే. ప్రతివారిని వారికర్మ అనుసరించి వుంటుంది. వీని చావుకు మేముగాని మరొకరుగాని కారకులు గాము. వాడుచేసుకున్నకర్మయే కారణం' అని కాలుడు చెప్పాడు.

గౌతమి కాలునిమాటలు శ్రద్ధగా వింది. బోయవానినిచూచి, 'వ్యాధుడా! నా బిడ్డ మరణానికి ఈ సర్పము, మృత్యువు, కాలుడు కారకులు గారు. వాడు చేసుకున్న కర్మచేతనే నశించాడు. నేనుకూడ కన్నబిడ్డను దూరం చేసుకునే కర్మను చేసివుంటాను కాబట్టి సర్పమును వదలుము' అని చెప్పింది. అర్జునకుడు పామును విడిచిపెట్టాడు. మృత్యువు, కాలుడు, సర్పము వెళ్లిపోయ్యారు. బోయవానిక్రోధము గౌతమి శోకము శాంతించాయి.

అని చెప్పి భీష్ముడు "ధర్మరాజా! లోకంలోని మానవులంతా వారివారి కర్మలప్రకారం నడుస్తుంటారు. ఈ యుద్ధంలో రాజులు గతించటానికి దుర్యోధనుడుగాని నీవుగాని కర్తలు గారు. కాలమనే వల్ల జరిగినదానికి నీవు చింతించటం మంచిదికాదు" అన్నాడు. ఈకథ విన్న యుధిష్ఠురుడు మనశ్శాంతి పొందాడు. తరువాత అనేకప్రశ్నలువేసి భీష్మునివల్ల చాలా ధర్మసూక్ష్మాలు తెలుసుకున్నాడు.

అవనిలోగల యాత్రలన్ని చేయగవచ్చు ముఖ్యుడై నదులందు మునుగవచ్చు
ముక్కు పట్టుక సంధ్య మొనసి వార్వగవచ్చు తిన్నగా జపమాల త్రిప్పవచ్చు
వేదాల కర్థంబు విజెచి చెప్పగవచ్చు శ్రేష్ఠక్రతువులెల్ల చేయవచ్చు
ధనము లక్షలు కోట్లు దానమియ్యగవచ్చు, నైష్ఠికాచారముల్ నడుపవచ్చు,
చిత్తమన్యస్థలంబున చేరకుండ నీ పదాంభోజములయందు నిలుపరాదు
భూషణ వికాస శ్రీధర్మ పురనివాస దుష్టసంహార నరసింహ దురితదూర.

(నరసింహ శతకము)

* తప్పుచేసి దిద్దుకొనకపోవడమే నిజమైన తప్పుగా లెక్కింపవచ్చును.
* సౌందర్యాన్ని ఆశించేటంతగా మంచి నడవడికను ఆశించేవాడు నాకింతవరకు కనపడలేదు.
* లోకం నన్ను అర్థం చేసికోలేదని నేను బాధపడను. లోకాన్ని నేను అర్థం చేసికోలేనందుకే చింతిస్తాను.
* చింతనలేని అధ్యయనంవలన లాభం లేదు. అధ్యయనంలేని చింతనవలనా లాభం లేదు.
* పూర్వకాలంలో ఆత్మవికాసంకొఱకు విద్యాభ్యాసం చేసేవారు. ఈనాడు ఇతరులు మెచ్చుకోడానికొఱకే విద్యాభ్యాసం చేస్తున్నారు.

(కన్‌ఫ్యూషియస్)

# ఈశావాస్యోపనిషత్

'సమతానంద'

ప్రవృత్తి నివృత్తిమార్గముల ప్రతినిధులైన మనుష్యభేదం ఇదివరలో వివరించబడినది. ఏ ఆత్మను తెలుసుకొనుటవలన ఆత్మహత్యాసదృశమైన ఆధ్యాత్మిక విపత్తునుండి రక్షణ పొందగలమో అట్టి ఆత్మస్వరూపమెట్టిది? ఈ విషయంగూర్చిన వివరణ ఎనిమిదవమంత్రంవరకు వర్ణింపబడింది.

అనేజదేకం మనసో జవీయో నైనద్దేవా ఆప్నువన్ పూర్వమర్షత్ ।
తద్ధావతో అన్యానత్యేతి తిష్ఠత్ తస్మిన్నపో మాతరిశ్వా దధాతి ॥4॥

తత్ ఆ ఆత్మ ఏకమ్ ఒకటి అనేజత్ చలనములేనిది. మనసః మనస్సుకంటె జవీయః వేగమైనది దేవాః ఇంద్రియములు ఏనత్ న ఆప్నువన్ దీనిని అందుకొనలేవు పూర్వం అర్షత్ మనస్సుకంటె ముందుగా చేరినది. తత్ అది తిష్ఠత్ స్థిరముగ ఉండి ధావతః పరుగెత్తుచున్న అన్యాన్ ఇతరములను అత్యేతి దాటిపోవుచున్నది. తస్మిన్ (సతి) దాని ఉనికివలననే మాతరిశ్వా విశ్వవ్యాప్తమైన ప్రాణశక్తి అపః చేతన చర్యలనన్నిటిని దధాతి జరిపిస్తుంది.

ఆత్మ ఏకము, అచలము.[1] మనస్సుకంటె వేగము కలది. మనస్సుకంటె ముందు ఉండుటవలన[2] ఇంద్రియాలకు అది అందరానిది. ఎప్పుడూ స్థిరమై[3] పరుగెత్తేటిని దాటుతుంది. కేవలం దాని ఉనికివలననే[4] విశ్వవ్యాప్తమైన ప్రాణశక్తి చేతనముల చర్యలన్నిటిని

1. అచలము :—పరిణామశీలమైనప్రకృతికి ఆధారమై అచలముగా ఉండునదే ఆత్మ. దేనిమీద మనస్సు వ్రాలుతుందో అక్కడ అప్పటికే ఆత్మ ప్రకాశం ఉంటుంది. దీనికి కారణం ఆత్మ సర్వవ్యాప్తిగలది కావటమే. అందువలన ఎక్కువ వేగంగలిగిన మనస్సుకంటె వేగముకలది ఆత్మ.

2. మనస్సుకంటె ముందు ఉండుటవలన :—మనస్సు ఇంద్రియములకంటె సూక్ష్మమైనది. వేగము కలది. ఆత్మ మనస్సుకే అందకపోతే ఇంద్రియములశక్తికి అసలే అందనిది. ఆత్మ ఎన్నడూ ఇంద్రియగోచరము కానిదే.

3. స్థిరమై :—ఆత్మ సర్వవ్యాప్తమైనది కావడంవలన ఏదీ దానిని దాటిపోలేదు.

4. కేవలం దాని ఉనికివలననే :—ఆత్మస్వరూపం చైతన్యం కావడంవలన చేతనముల చర్యలన్నిటిని నిలబెట్టేశక్తి ఆత్మయే. ఆత్మ కేవలం తన ఉనికివలననే విశ్వవ్యాప్తశక్తిని మేల్కొలుపుతుందని ఇచ్చట చెప్పబడింది.

తదేజతి తన్నైజతి తద్దూరే తద్వన్తికే ।
తదన్తరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః ॥5॥

తత్ అది ఏజతి చలించును. తత్ న ఏజతి అది చలించదు. తత్ అది దూరే దూరముగా ఉన్నది తత్ అది ఉ అన్తికే దగ్గరిగాను ఉన్నది. తత్ అది అస్య సర్వస్య దీని అంతటి యొక్క అన్తః లోపల ఉన్నది తత్ అది ఉ సర్వస్య అస్య మరల దీనికంతటికీ బాహ్యతః బయటకూడా ఉన్నది.

అది[1] చలించును, చలించదు. అది[2] దూరముగా ఉన్నది, దగ్గరగా ఉన్నది. అది దీనికంతటికీ లోపల ఉన్నది, దీనికంతటికీ బయటకూడా ఉన్నది.

1. అది చలించును :—నిర్గుణస్థితిలో అది అచలము సగుణస్థితిలో చలిస్తూ సదా మారుతూఉన్నట్లు గోచరిస్తుంది.

2. అది దూరముగా ఉన్నది :—అది సర్వవ్యాపి. అజ్ఞానులకు అది దూరము అనగా అందనిది. కాని జ్ఞానికి అది దగ్గరిది. జ్ఞానిదృష్టిలో తన ఆత్మయే పరమాత్మ కనుక.

యస్తు సర్వాణి భూతాన్యాత్మన్యేవాను పశ్యతి।
సర్వభూతేషు చాత్మానం తతో న విజుగుప్సతే ॥6॥

యః ఏ జ్ఞాని సర్వాణితు భూతాని అన్నిటిని ఆత్మని ఏవ ఆత్మలోనే అనుపశ్యతి చూచునో సర్వభూతేషుచ అన్ని భూతములలో ఆత్మానం ఆత్మను (చూచునో) తతః అందువలన న వి జుగుప్సతే అసహ్యించుకొనడు.

యే జ్ఞాని సర్వభూతములను తన ఆత్మగాను (ఆత్మకంటె భిన్నము కానివిగాను) తన ఆత్మను సర్వభూతముల ఆత్మగాను గ్రహించునో[1] ఆ జ్ఞాని ఆ అనుభూతివలన దేనినీ ద్వేషింపడు (అసహ్యించుకొనడు.)[2]

1. గ్రహించునో :—తన శరీర ఇంద్రియ మనోసంఘాతముయొక్క మార్పులను గమనించు సాక్షి చైతన్యము – తనది అనుకునేచైతన్యము – గొప్ప, తక్కువ భేదములేకుండా అన్నిటినీ గమనించు సాక్షిచైతన్యముకంటె భిన్నమైనదికాదని గుర్తిస్తాడు. ఆత్మచైతన్యముయొక్క అపరిచ్ఛిన్నతను ఈరీతిగా గుర్తించుట జరుగుతుంది.

2. అసహ్యించుకొనడు :—అసహ్యమునకు, ద్వేషమునకు మూలము స్వార్థము. స్వార్థమునకు మూలము భేదదృష్టి. అన్నిటిలోని ఆత్మయొక్క ఏకత్వాన్ని గ్రహించినపుడు ద్వేషానికి, అసహ్యానికి స్థానమే ఉండదు.

యస్మిన్ సర్వాణి భూతాన్యాత్మైవాభూద్ విజానతః।
తత్రకో మోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః ॥7॥

యస్మిన్ ఎప్పుడు విజానతః తెలిసినవానికి (జ్ఞానికి) ఆత్మాఏవ ఆత్మగానే సర్వాణి భూతాని సర్వభూతములు అభూత్ అయ్యెనో తత్ర అక్కడ ఏకత్వం ఐక్యతను అనుపశ్యతః చూచువానికి కః మోహః మోహమేది కః శోకః శోకమేది.

ఉనికియొక్క ఏకత్వాన్ని గుర్తించి అన్నిటినీ తన ఆత్మగా చూచు జ్ఞానికి మోహమెచట గలదు! శోకమెచట గలదు!

# శ్రీ రామకృష్ణ కథామృతము

## (రెండవ భాగము)

అనువాదము: పరివ్రాజిక శ్యామాప్రాణ

## (శ్రీ రామకృష్ణులు దక్షిణేశ్వరమున నరేంద్రాది అంతరంగ భక్తులతో)

నేడు క్రీ. శ. 1882 అక్టోబరు 16 వ తేదీ సోమవారము. అటుపై గురువారము సప్తమి నుండి దుర్గాపూజ ప్రారంభమగును. రామకృష్ణులకడనే రాఖాల్, రాంలాల్, హాజరా ఉన్నారు. ఒకరిద్దరు బ్రహ్మభక్తులను వెంటబెట్టుకొని నరేంద్రుడు దక్షిణేశ్వరమునకు వచ్చెను. శ్రీ రామకృష్ణులు మహానందమున నోలలాడుచుండిరి. నరేంద్రుడు దక్షిణేశ్వరమునకువచ్చి స్నానముచేసి శ్రీ రామకృష్ణులకడనే ప్రసాదమును ఆరగించెను. మాస్టరుకూడ వచ్చెను. భోజనము ముగిసినపిదప నరేంద్రాదిభక్తులు విశ్రమించుటకై వారిగదిలోనే నేలపై చాపలు పరపించిరి. భక్తులు కూర్చొనగనే శ్రీ రామకృష్ణులు నేలపై వచ్చి కూర్చొని భక్తులతో ముఖ్యముగా నరేంద్రునివైపు తిరిగి లోగడ తనకు గల్గిన అధ్యాత్మికస్థితులనుగూర్చి ముచ్చటించసాగిరి.

శ్రీ రామకృష్ణులు – నాకు అట్టిస్థితి వచ్చిన పిదప భగవత్ప్రసంగము వినవలెనని ఆరాటము కల్గెడిది. భాగవతము, అధ్యాత్మరామాయణము, భారతము మున్నగు పురాణకాలక్షేపములు ఎచ్చట జరుగునో వెదకెడివాడను. అరియాదాహ (దక్షిణేశ్వముదగ్గరనే ఒక పల్లె) లో కృష్ణకిశోరుడు పఠించు అధ్యాత్మరామాయణము వినుటకై పోయెడువాడను.

కృష్ణకిశోరుడు చాల ఆచారపరుడగు బ్రాహ్మణుడు. అయినను అతనికి భగవన్నామముపై కడు విశ్వాసము. కృష్ణకిశోరుడు బృందావన్‌లో తిరుగుచుండగ ఒకదినము వానికి



దాహము వేసెను. దూరములో ఒక బావిని చూచెను. అచట నిల్చియున్న వ్యక్తితో "కొంచెము నీళ్లు ఇచ్చెదవా?" అని అడుగ "అయ్యా! నేను నీచ జాతికి చెందినవాడను. మీరు బ్రాహ్మణులు. మీకు నేను నీళ్లు ఎట్లు చేది యివ్వగలను" అని అతననెను. "శివ, శివ" అని స్మరించినచో నీవు పవిత్రుడవయ్యెదవు అని కృష్ణకిశోరుడు చెప్పెను. అంత్యజుడు శివనామస్మరణ కావించి ఇచ్చిన నీళ్ళను కృష్ణకిశోరుడు పుచ్చుకొనెను. భగవన్నామముపై ఎట్టి విశ్వాసమో చూడుము!

"అరియాదాహ" గంగ ఘట్టముకడ ఒక సాధువు వచ్చియుండెను. నేను, కృష్ణకిశోరుడు అరియాదాహకు పోవ సమకట్టితిమి. కాళికాలయములో హలధారికి ఈవిషయము చెప్పి నీవు కూడ మాతో వచ్చెదవా? అని అడుగ వెంటనే అతడు "మట్టిపంజరమును చూచుటలో ఏమి ప్రయోజనము కలదు అనెను. హలధారి గీత,

వేదాంతములను అధ్యయనము చేయుచుండును కదా! అందుకని సాధువును ''మట్టిపంజర''మని పల్కెను. ఈ మాటను కృష్ణకిశోరునకు చెప్పితిని అతడు కోపించి ఇట్లు పల్కెను. 'హాలధారి ట్టిమాట పల్కెనా? ఎవడైతే ఈశ్వరుని స్మరణ, రామస్మరణ చేయునో అట్టివాని శరీరము మట్టిపంజరమా? భక్తుని దేహము చిన్మయమని అతడెరుగడా'? కృష్ణకిశోరుడు కాళికాలయములో పువ్వులు కోయుటకు వచ్చెడువాడు. హాలధారి ఎదురుపడినచో ముఖము త్రిప్పుకొని పోయెడువాడు. వానితో మాట్లాడుటయే మానుకొనెను.

ఒకదినము అతడు ''జందెము తీసివేసితి రేల?'' అని నన్ను ప్రశ్నించెను. నేనేమి చేయుదు? అపుడు నా స్థితి వేరుగ మారిపోయెను. పెద్దగాలివానకు కొట్టుకొనిపోయినట్లుగా పాతచిహ్నములన్నియు ఎగిరిపోయినవి - కట్టుగుడ్డయే నిలుచుటలేదాయె. ఇంక జందెము మాట ఏమని చెప్పను? అందుచే వానితో ''నాకు పట్టినవెఱ్ఱి నీకు పట్టినచో అర్థమగును'' అని పల్కితిని.

అట్లే జరిగినది. వానికి భగవదున్మాదము కల్గెను. గదిలో ఊరక కూర్చొని ''ఓం, ఓం'' అని పలుకుచుండెను. ఇంటివారు వానికి పిచ్చి పట్టినదని నటోగర్ నుండి ఆయుర్వేదవైద్యుడగు రాముని పిలుచుకొనివచ్చిరి. కృష్ణకిశోరుడు వైద్యునితో ''బాబూ! నా జబ్బును మాన్పిన మాన్పుము. కాని నా ఓంకారమును మాత్రము మాన్పకుము సుమా!'' అనెను. (అందరూ నవ్వుదురు.)

ఒకరోజు నేను వారియింటికిపోగా అతడు కూర్చొని ఏదో చింతించుచుండెను. ''ఏమి జరిగినదని'' ప్రశ్నింప ఇంటిపన్ను వసూలు చేయుటకుగాను టాక్సు కలెక్టరు వచ్చినాడు. పన్ను కట్టనిచో ఇంటిలోనున్న పాత్రసామాగ్రిని తీసుకొనిపోయెదనని బెదరించుచున్నాడు'' అనెను.

నేనంత వానితో నిట్లంటిని. ''నీవెందుల కంత చింతించుచున్నావు? పాత్రలు తీసుకొనిపోనీ, లేక నిన్ను బంధించి తీసుకొనిపోనీ, అందుచే నీకేమి లోటు? నీవు...ఖ (ఖ అనగా ఆకాశము) కదూ!'' (ఆకాశవత్) (నరేంద్రాదులు నవ్వుదురు) కృష్ణకిశోరుడు అధ్యాత్మ రామాయణము చదివెడివాడు కదూ! నేను ఆకాశముబోలె సర్వవ్యాపిని అని పల్కెడివాడు. నేను అందుచే వానిని ''ఖ'' అని తమాషాగా పిల్చెడివాడను. [నీవు ''ఖ'' కదా నిన్ను టాక్సు లాగజాలదు.] సర్వవ్యాపివికదా నిన్ను టాక్స (ఇంటిపన్ను) ఎటుల లాగగలదు?

అట్టి భగవదున్మాదస్థితిలో గొప్పవాళ్లు కాని ఎవరైనాసరే యదార్థమైనమాట చెప్పివేసెడివాడిని. గొప్పహోదాగలవారైనను ఎట్టి సంకోచములేకుండ యదార్థము ఎదురుగనె పల్కెడివాడను.

యదుమల్లిక్ తోటకు యతీంద్రుడు వచ్చెను; నేను వానితో ''కర్తవ్యమేమి? ఈశ్వరచింత చేయుటయే కర్తవ్యముకదా!'' అని పల్కితిని. యతీంద్రుడు ''మేము సంసారులము మాకు ముక్తికల్గునా? ధర్మరాజునకుకూడ నరకదర్శనమాయెను'' అనెను. అంత నాకు చాల కోపము వచ్చి ''నీ వెట్టివాడవోయీ? యుధిష్ఠిరుని నరకదర్శన మొక్కటే జ్ఞప్తియుంచుకొని యున్నావా? వాని సత్యనిష్ఠ ఓర్పు శాంతము వివేకము వైరాగ్యము ఈశ్వరభక్తి ఇదేమియు జ్ఞప్తికి వచ్చుటలేదా? ఇంకా ఏదో చెప్పబోగా హృదయుడు నా నోరు గట్టిగా మూసెను.

యతీంద్రుడు వెంటనే "నాకు పని యున్నదని" వెడలిపోయెను.

చాలారోజులు గడిచినపిదప యతీంద్రుని అన్నయగు రాజా సౌరేంద్ర ఠాకూరుగారి ఇంటికిపోయి వానితో ఇట్లంటిని–నిన్ను రాజు-గీజు (రాజా-టాజా) అని పిలువజాలను. అట్లు పిలిచినచో అర్థమే లేదు. వానితో కొంతసేపు మాట్లాడితిని. ఇంతలోనే పెక్కుమంది పాశ్చాత్యులు వచ్చుచు పోవుచుండిరి. అతడు సర్వదా పలురకములగు పనులలో మునిగియుండును. రజోగుణస్వభావుడు.

అట్టి ఉన్మాదపుస్థితిలో ఒకదినమున వరాహనగరపు ఘట్టమున జయముఖర్జీ కూర్చొని జపము చేసుకొనుచుండెను. కాని వానిమనస్సు వేరు ఆలోచన చేయుచుండెను. నేను వానికడకుపోయి వెంటనే వాని రెండుచెంపలు వాయించితిని. ఇంకొకదినము రాణి రాసమణి కాళికాలయమునకు వచ్చెను. ఆమె దక్షిణేశ్వరమునకు వచ్చినపుడెల్ల పాటలు పాడుమని నన్ను కోరును. నేనా దినము పాట పాడుచుండగా ఆమె పరధ్యానముగా పూజాపుష్పములను తట్టలో అమర్చుచుండెను. వెంటనే ఆమె చెంపలు రెండు వాయించితిని. అంత ఆమె ఆశ్చర్యచకితురాలై చేతులు జోడించుకొని కూర్చొనెను.

హలధారితో యిట్లు చెప్పుకొంటిని. "అన్నా! చూడుము నా యీ స్వభావమును ఎట్లు మార్చుకొనుట?" వేరొండు ఉపాయముకానక తల్లిని ప్రార్థింప మొదలుపెట్టితిని. అటుపై క్రమేణ ఆ స్వభావము మారిపోయెను.

అట్టి స్థితిలో భగవత్ ప్రసంగములు తప్ప వేరేమియు నచ్చకుండెను. విషయప్రసంగముల విన్నచో విలపించెడివాడను, మధురబాబు నన్ను వెంటనిడుకొని తీర్థయాత్రకై బయలుదేరెను. కాశీలో రాజా బాబుగారి యింటిలో కొన్నిదినములు నివసించితిమి. మధురబాబుతో పాటు నేను ముందరింటిలో కూర్చొనియుంటిని. రాజుగారుకూడ కూర్చొని విషయప్రసంగముల చేయుచుండిరి. డబ్బువిషయముకూర్చి ఇంత డబ్బు నష్టము, ఇంతఖర్చు అని ముచ్చటించుచుండిరి. నేనా ఏడ్వ మొదలిడితిని. "అమ్మా! నన్నెచ్చటికి తీసుకొనివచ్చితివి?" రాసమణి ఆలయములో ఎంతో బాగుంటిని. తీర్థయాత్రకై వచ్చికూడ కామినీ కాంచనముల ప్రసంగములు. అక్కడ (దక్షిణేశ్వరములో) ఇట్టి విషయప్రసంగములు విన నక్కర లేదు కదా!

శ్రీ రామకృష్ణులు భక్తులను, నరేంద్రుని విశ్రమింపుమని చెప్పి తానుకూడ చిన్న మంచముపై విశ్రమించెను.

సాయంకాలమాయెను. నరేంద్రుడు పాడుచుండెను. రాఖాల్, లాటూ మాస్టరు, నరేంద్రుని బ్రహ్మసమాజస్నేహితుడు, ప్రియ, హాజరా, మున్నగువా రుండిరి.

నరేంద్రుడు కీర్తన పాడుచుండెను. మృదంగము మ్రోగుచుండెను.

చింతయ మమ మానసహరి చిద్ఘన నిరంజన!

[భావము: నా హృదయమందిరములో సచ్చిదానందరూపుడగు ఆ పరమాత్మ ఏ శుభదినమున ప్రకాశించునో? నేనా అనంతరూపసాగరమున మునకలువేయగల్గునట్టి భాగ్యము నాకు ఎన్నడు కల్గునో కదా! ప్రభూ అద్వితీయము శాంతము శివం అగు రాజరాజుగారి చరణమున ఏ దినమున శరణు పొందగలను?

నిన్నుపొంది సర్వమును మరచి నేను అహర్నిశలు ప్రేమానందమున ఓలలాడు శుభదినము ఎన్నడు వచ్చునో?]

మరల నరేంద్రుడు పాడదొడంగెను.

[భావము: మధురిమైన బ్రహ్మనామము ఆనందవదనముతో స్మరింపుము. హృదయము శుష్కమైనచో రసవంతముచేయుము. బ్రహ్మానందమున ఉన్మత్తులమై సఫలమనోరథుల మగుదుము గాక.]

మృదంగ తాళ వాద్యములతో భక్తులెల్లరు శ్రీ ఠాకూరు చుట్టూ తిరుగుచు నృత్యము చేయుచు సంకీర్తన చేయుచుండిరి. రామకృష్ణులును భక్తులతోపాటు ఆనందమున నృత్యము చేయుచు భజన చేయుచుండిరి. భజన ముగిసిన పిదప ఠాకూరు నరేంద్రుని మాటిమాటికి కౌగలించుకొని నేడు నాకు ఎంత ఆనందమును కలుగ చేసితివి బాబూ! అని పల్కుచుండిరి.

రాత్రి సుమారు 8 గంటలవేళ. అప్పటికిని శ్రీ రామకృష్ణుని హృదయమున ప్రేమ ప్రవాహము వెల్లివిరియుచుండెను. తనగదికి ఉత్తరమునగల వరండాలో ఒంటరిగా పచారు చేయుచుండిరి. మధ్యమధ్య కాళిమాతతో మాట్లాడుచుండిరి. తటాలున ఉన్మత్తునిరీతి ఇట్లు పల్కిరి.

''నీవు నన్నేమి చేయగలవు?''

జగజ్జనని ఎవనికి తోడుగనుండునో 'మాయ' వానిని ఏమిచేయగలదు? అని శ్రీ రామకృష్ణులు పల్కుచున్నారా ఏమి? నరేంద్రుడు, మాస్టరు, ప్రియ, వీరుముగ్గురు ఆ రాత్రి రామకృష్ణునికడనే యుండిరి. ఠాకూరు ఆనందమునకు మేర లేదు. శ్రీ శ్రీ మాతృదేవి నహబత్తులోనే నివసించుచుండిరి. ఆమె రొట్టెలు పప్పు మున్నగునవిచేసి భక్తులకై రాత్రిభోజనము పంపెను. ఇట్లు భక్తులు అప్పుడప్పుడు రామకృష్ణునికడ నివసించుచుండెడివారు. భక్తుల ఖర్చులకొఱకు సురేంద్రుడు ప్రతినెల కొంతడబ్బు యిచ్చెడివాడు. దక్షిణపువైపు వరండాలో భోజనము చేయుటకై ఏర్పాట్లు చేయుచుండిరి.

గది తూర్పువసారాదగ్గర కూర్చొని నరేంద్రాదులు మాట్లాడుచుండిరి.

నరేంద్రుడు: ఈరోజులలోని పిల్లవాండ్రు ఎటువంటివారు?

మాస్టరు: చెడ్డవారుకారు. కాని వారికి సదుపదేశములు ఇచ్చువారు లేరు.

నరేంద్రుడు: కాని నేను ప్రత్యక్షముగ చూచుచున్నాను. వారు అధఃపతితులగుచున్నారు. బడికి ఎగనామములు పెట్టుట, ధూమపానము చేయుట, అశ్లీలములగు కబుర్లు చెప్పుకొనుట, మున్నగునవి సహజమైపోయినవి. అంతియేకాక పోకూడని చెడుస్థలములకుకూడ పోవుట కలదు.

మాస్టరు: మేము చదువుకొనేరోజులలో ఇట్టివిషయములు కని విని ఎరుగము.

నరేంద్రుడు: మీరు బహుశః తోడిబాలురతో ఎక్కువగ కలసిమెలసి యుండువారు కాదు కాబోలు. ఇంతేల? దుశ్శీలురను పేరుపెట్టి పిలుచుటకూడ విన్నాను. బహుశా వారితో పరిచయముకాబోలు.

మాస్టరు: అలాగా?

నరేంద్రుడు: చాలమంది శీలము చెడిపోయినది. నాకు బాగుగ తెలియును. స్కూలు అధికారులు, పిల్లవాండ్ర తల్లిదండ్రులు ఈవిషయములో కొంత పరిశీలించిన చాల బాగుండును.

ఇట్లు సల్లాపములు జరుగుచుండగా రామకృష్ణులు గదిలోనుండి వారికడకువచ్చి నిల్చి నవ్వుచు 'మీరేమి మాట్లాడుచున్నారోయీ!' అనెను.

నరేంద్రుడు: వీరితో బడివిషయములు

మాట్లాడుచుంటిని. బడిపిల్లలశీలము నష్టమగుచున్నది. ఆ మాటలు కొంతవిని రామకృష్ణులు గంభీరభావముతో ఇట్లు పల్కిరి. ఇటువంటి కబుర్లు చెప్పుకొనుట మంచిది కాదు నీవు వీళ్ల కన్న పెద్దవాడివి. జ్ఞానము వచ్చినవాడివి. ఇటువంటిమాటలు లేవనెత్తుట అనుచితము. (అప్పుడు నరేంద్రునివయస్సు 19 లేక 20 సంవత్సరములు, మాస్టరు వయస్సు 27 లేక 28 సంవత్సరములు)

మాస్టరు చాల చిన్నబుచ్చుకొనెను. నరేంద్రాదిభక్తులు మౌనము వహించిరి

నరేంద్రాది భక్తులు భోజనము ముగిసిన వెంటనే రామకృష్ణుల గదిలోనికిపోయి నేలపై కూర్చొని మాట్లాడుచుండిరి. రామకృష్ణులు నరేంద్రునితో 'చిదాకాశేహాలో పూర్ణచంద్రోదయహే' ఈ పాట పాడుము అనగా నరేంద్రుడు పాడ నారంభించెను. వెంటనే ఇతర భక్తులు తాళములు మృదంగములు వాయింప మొదలుపెట్టిరి.

పాట :

చిదాకాశే హాలో పూర్ణప్రేమ చంద్రోదయహే
ఉథలిలో ప్రేమసింధుకి ఆనందమయహే
జయదయామయ జయదయామయ జయదయామయ.

(చిదాకాశమున పూర్ణప్రేమ అనెడి చంద్రోదయమైనది. ప్రేమసింధువులో ఆనందలహరి లేచినది) ఈ పాట పాడుచు శ్రీ రామకృష్ణులు నృత్యముచేయ దొడంగిరి. భక్తులుకూడ వారి చుట్టు తిరుగుచు నృత్యము చేయుచుండిరి.

సంకీర్తన ముగిసినపిదప రామకృష్ణులు ఉత్తరమువైపు వరండాలో పచారు చేయుచుండిరి. హాజరా ఆ వరండాలో కూర్చొనియుండెను. ఆయన వానికడకుపోయి కూర్చొనిరి. మాస్టరు గూడ అచ్చట కూర్చొని హాజరాతో మాట్లాడుచుండెను. ఆయన ఒక భక్తునితో నీవు నిద్రలో కల లేమైనా కంటివా? అని ప్రశ్నించెను.

భక్తుడు : ఆశ్చర్యమగు ఒక స్వప్నము కాంచితిని. ఈజగత్తు సమస్తము జలముతో నిండియుండెను. అనంత జలరాశి. అందులో కొన్ని నౌకలు తేలుచుండెను. కాని నీటిప్రవాహములో అవి మునిగిపోయెను. కొందఱు మనుష్యులతోపాటు నేను ఒక స్టీమరులో ఎక్కితిని. అట్టితరి అనంతసముద్రముమీదుగ ఒక బ్రాహ్మణుడు తేలుచు నడచిపోవుచుండెను. మీరిట్లు ఏవిధముగా నడచిపోవుచున్నారని వానిని అడిగితిని. ఆ బ్రాహ్మణుడు చిఱునవ్వుతో "ఇక్కడేమియు కష్టము లేదు. నీళ్లక్రిందుగ ఒక వంతెన కల" దనెను. మీ రెచ్చటికి పోవుచున్నారని ప్రశ్నించితిని. "భవానీపూరు వెళ్లుచున్నా" నని అతడు పల్కెను. మీరు కొంచెమాగుడి నేను కూడ మీతో వచ్చెదను. అని అంటిని.

శ్రీ రామకృష్ణులు : ఈ మాటలు వినిన నాకు గగుర్పొడుచుచున్నది సుమా!

భక్తుడు : నేను తొందరగా పోవుచున్నాను, నీవు దిగుటకు ఇంకా ఆలస్యమగును. ఈ దారి గుర్తుంచుకొనుము. అటుపై నీవు ఈదారి మీదనే రమ్ము. అని ఆ బ్రాహ్మణుడు పల్కెను.

శ్రీ రామకృష్ణులు : నా యొడలు పులకరించుచున్నది. నీవు త్వరగా మంత్రోపదేశము స్వీకరింపుము.

రాత్రి పదకొండుగంట లయినపిదప నరేంద్రాదిభక్తులు ఠాకూరుగదిలోనే నేలపై పడకలు వేసుకొని నిద్రించిరి.

—(సశేషం.)

# యమనియమాలు

## నిర్వికల్పానందస్వామి

యమనియమాలు అనే నైతిక గుణసంపత్తితో ఆధ్యాత్మిక జీవితానికి అనుచ్ఛేద్యమైన సంబంధం ఉన్నది. అద్వైత వేదాంతశాస్త్రము ఈ గుణసంపత్తిని 'సమాధి'కి బహిరంగాంగములుగా ఉపవర్ణించినప్పటికీ, వీటికి సాధక జీవితంలో ఉన్న విలువ తక్కువ కాదు. ఎందుకంటే, ఈ బహిరంగాంగాల్ని అతిక్రమిస్తేనే అంతరంగాంగాలు కరతలామలకప్రాయాలవుతాయి. లేకపోతే కావు. కనుక, ఈ యమనియమాల్ని గురించి కొద్దిగా ఆలోచిద్దాం.

[illegible]? యోగి ప్రవరుడైన పతంజలి యీ విషయాలనే తన యోగసూత్రగ్రంథంలో సాధనపాదంలో విశేషంగా ఉపవర్ణించాడు. కారణమేమంటే: వీనినభ్యసిస్తేనే చిత్తనైర్మల్యం చేకూరుతుంది. అట్లా నిర్మలీకృతమైన హృదయమే ఆధ్యాత్మికానుభూతికి రంగం.

సత్య, అహింసా, బ్రహ్మచర్య, అస్తేయ, అపరిగ్రహాలనేవన్నీ కలిపి యమము.

సత్యమంటే చూచినదాన్ని చూచినట్లు, వినినదానిని విన్నట్లు చెప్పటం, భావించటం, చెయ్యటం. ఇందులో మళ్ళీ ఏవిధమైన మడత పేచీలు ఉండకూడదు. అయితే కొందరు 'ఇల్లాంటివ్రతం అవలంబిస్తే, ఈ కలికాలంలో నెగ్గటం చాలా కష్టం; చాలా అసందర్భమైన పరిస్థితులు ఏర్పడతాయి. లోకానుభవం ఉన్నవాళ్ళెవ్వరూ ఇల్లాంటి భీష్మాచార్య ప్రతిజ్ఞ చెయ్యరు' అననచ్చు. కాని వితర్కించిచూస్తే ఇల్లాంటి శంకలకు తావుండదు. సత్యస్వరూపియైన భగవంతుడు సత్యవ్రతుల కెల్లప్పుడు సహాయ్యపడతాడే కాని, నిరోధం కలిగించడు. ఇక హరిశ్చంద్రాదులకథలు మనం ఎంత దృఢంగా వ్రతనిష్ఠులమై ఉండాల్సిందీ సూచించటానికి ఏర్పడినవే కాని, సత్యవ్రతం ఇంత భీషణమైనదని బెంబేలు పరచడానికి కాదు. అయితే, ఈ వ్రతాన్ని మనోవాక్కాయలతో త్రికరణశుద్ధిగా అవలంబించటం ముఖ్యం.

ఈ సత్యవ్రతాన్ని శ్రీ రామకృష్ణ పరమహంస కలికాలంలో అనుష్ఠింపదగ్గ ఏకమాత్ర తపస్సుగా చెప్పాడు. ఎందుకంటే, కలిలో ప్రాణం అన్నగతం. పంచాగ్నిదీక్ష మొదలైన కఠోరతపస్సులకు ఇప్పుడు వ్యవధీ లేదు, పటుత్వమూ లేదు. ఇల్లా పదిరెండేళ్లు ఎవ్వరైనా కనుక సత్యవ్రతాన్ని అవలంబిస్తే, వాళ్లు చెప్పిందల్లా అయితీరుతుంది అను ఘం శ్రుతి.

వెనక ఒకఊళ్ళో దేవీభక్తు డొకాయన వుండేవాడట. ఆయన అమావాస్యనాడు పొరపాటున పౌర్ణమి అన్నాట్ట. మరి ఇక ఆయన మాట వెల్తి అవటానికి వీల్లేదు. కనుక జగదంబ ఆయన ప్రమాదవాక్యాన్ని సత్యం చెయ్యటానికని తన పాదమంజీరాన్ని ఆకాశంలోకి ఎగరవెయ్యటంతోడ్నే, అది పౌర్ణమీ చంద్రద్యుతి భ్రాంతిని కల్పిస్తూ, ఆ రాత్రినంతా ఆలోకితం చేసిందట. ఈ కథ హరిశ్చంద్రాదుల ఉపాఖ్యానాలవల్ల కలిగే భీతిని తొలగిస్తూ, ఉత్సాహాన్ని కలిగిస్తోంది అంటానికి యేమీ సందేహం లేదు.

అహింస అంటే ఎవ్వరికీ ఏవిధమైన హానీ చెయ్యకుండటం. చాలామంది దీన్ని ఆహారపరంగా అన్వయించి, మాంసభక్షణాదుల్ని త్యజించి శాకాహారాన్ని గ్రహిస్తున్నారు. ఇది మంచిదే. అయితేమటుకు, ఇతరులకు డబ్బు వడ్డీకిచ్చి ఆస్తి అంతా కాజేయటం మొదలైనవన్నీకూడా హింసావాచ్యాలేలనిన్నీ, ఆహార

విషయాహింసకంటే ఇవి ముఖ్యాగణనీయా లనిన్నీ గుర్తుంచుకోవాలి.

ఒక పెద్దమనిషి తాను చాలా అహింసా పరుడని తలుస్తూ చెప్పుకుంటూ ఉండేవాడట. వాళ్ళింట్లో ఒకరోజునరాత్రి దొంగ కన్నంవేసి, ట్టుపడ్డాడు. ఆ పెద్దమనిషి కొడుకులు దొంగని కొట్టబోతుంటే ఆయన నిల్పి, 'మన కులం అహింసాకులం, కులప్రతిష్ఠ పాడుచెయ్యకండి, నయం ఇంకా వాణ్ణి కొట్టారుకాదు మీ పుణ్యా మా అంటూ, వాణ్ణి ఒక బస్తాలో కెక్కించి చెరువులో పారేసిరండి' అన్నాట్ట. ఇల్లా ఉండ కూడదు అహింసాతత్త్వం.

అహింసావ్రతంలో సిద్ధిని పొందినవాడి ఎదుట, వైరభావంగల ప్రాణికోటికూడా స్నేహ భావంతో వర్తిస్తుంది అని ఫలశ్రుతి. పెద్ద పులులూ లేళ్ళూ ఒకే రేవున నీళ్లు త్రాగుతూ నిర్వైరంగా ఉన్నట్లు, పురాణాల్లో మనకు ఋష్యాశ్రమవర్ణనలు చెప్తాయి.

మైథునకర్మ వివర్జితమైనది బ్రహ్మచర్య వ్రతం. కేవలం ఈ నియమం బాహ్యంగానే కాకుండా అన్యుల (పురుషులైతే స్త్రీసంబంధ మైన, స్త్రీలైతే పురుషసంబంధమైన) వాక్యా లాపం, దర్శనమూ, స్పర్శనమూ మొదలైన క్షుద్ర జాతీయములైన ఆనందాలయందుండే అభినివేశాన్నికూడా పరిత్యజించాలి.

ఏతత్ఫలింగా మహాశక్తిలభిస్తుంది. ఇల్లాంటి శక్తి ఉన్నవాళ్లు, చాలా స్వల్పకాలంలోనే యుగాల తరబడి పట్టేపనులని నిర్వహింప గలుగుతారు. తా నాంగ్ల విజ్ఞానసర్వస్వాన్ని అంతట్నీ జ్ఞాపకం ఉంచుకోగలిగింది ఈ బ్రహ్మచ ర్యప్రభావంవల్లనే అని వివేకానందస్వామివారు చెప్పారు. అసలు అద్దంవెనక మసి లేకపోతే ప్రతిబింబం ఎట్లా చూపట్టదో, అదేమాదిరిగా వీర్యశక్తిలేని హృదయంతో భగవద్రూపం ప్రతిబింబితం కాదని శ్రీరామకృష్ణ పరమ హంస చెప్పారు.

అస్తేయమంటే ఇతరులసొత్తును దొంగిలించ కుండా ఉండటం. అంటే దానిమీద ఎల్లాంటి లోభం ఉండకూడదు. ఇందులో ప్రతిష్ఠితులైన వాళ్లకు సర్వరత్నాలు వాటి అంతట అవే వస్తా యట.

ఇక అపరిగ్రహం అంటే జీవితయాత్రా ర్వహణానికి అనవసరమైన వస్తువుల్ని గ్రహిం చకుండా ఉండటం. జీవితయాత్రా నిర్వహ ణానికి గ్రహించడంలో ఏవిధమైన మమత్వమూ లేకుండా ఉండటం.

ఈ ఒకవ్రతాన్ని సుష్ఠుగా అవలంబించ గలిగితే మజీ జన్మలేదని ఫలశ్రుతి. యమాల్ని గురించి సంగ్రహంగా ప్రసంగించాం. ఇక నియమాల్ని గురించి ఆలోచిద్దాం.

శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యా యము, ఈశ్వరప్రణిధానము అనేవి నియ మాలు.

శౌచశబ్దార్థం స్పష్టం శరీరాన్నీ మనస్సు నూ శుభ్రంగా, శుచిగా ఉంచుకోటమే శౌచం. శరీరశౌచాన్నే బాహ్యశౌచం అంటారు. మృజ్జలాదులవల్ల శరీరాన్ని శుభ్రంగా ఉంచు కోటానికి మనం ప్రయత్నిస్తున్నాము. (మృత్తిక కాకపోతే సబ్బు వగైరాలే అనుకోండాం లెండి.) దీనివల్ల కలిగే ఫలితం రెండువిధాలుగా ఉంటుంది. ఒకటి; 'ఈ శరీరాన్ని ఎంత శుభ్రం గా ఉంచటానికి ప్రయత్నించినా లాభంలేదు, నవరంధ్రాల్లో ఏదో ఒకరంధ్రంనుండి ఎప్పుడూ ఏదో ఒక మలం వెలువడుతునే ఉంటుంది. ఈ ఎడ్డెమ్మృగాన్ని శుచిగా ఉంచటానికి ఎంత ప్రయ త్నించినా లాభంలేదు' అనే విరక్తి కలగటం ఒకటి. రెండోది: ఇల్లాంటి విరక్తి కలగంగానే స్వశరీరాభిమానం తొలగటానికి మార్గం ఏర్పడ

టమే కాకుండా, ఇతర శరీరాలమీద ఉండే ఆసక్తికూడా నశిస్తుంది. అయితే చూడండి, ముక్తిమార్గం ఎంతగా నిష్కంటకం అవుతుందో!

ఇక ఈ బాహ్యశౌచాన్నే వేలంవెఱ్ఱిగా పట్టుకొని వ్రేళ్లాడేవాళ్ళు మన దేశంలో చాలా మంది ఉన్నారు. రోజూ పదిమార్లు ఎవరో ముట్టుకున్నారనో, లేక ఏదో తాకిందో అనో స్నానంచేసే ఆచారపరాయణుల ఛాందసం శ్రమేగాని అట్టే ఉపయోగపడదు. కొందరు చెరువులో మునిగి తల సరిగ్గా తడిసిందో లేదో అని తహతహలాడేవారూ ఉన్నారు. ఈతరహా ప్రవర్తనగూడా లాభకారి కాదు. ఇల్లాంటి వాళ్ళమనస్సులో ఏదో ఒకపాపం దాగి ఉంది అని అధునిక మానసిక శాస్త్రవేత్తలు చెప్తున్నారు. కనుక, ఇల్లాంటి అతిని విడనాడాలి.

బాహ్యశౌచాన్ని తగుమాత్రంగా అవలంబిస్తే, అంతఃశౌచానికి దారి చూపిస్తుంది. అంతఃశౌచమంటే, మనోనైర్మల్యం. ఈ మనోనైర్మల్యం అంటే చిత్తశుద్ధి, ఆత్మదర్శనానికి బహిర్ద్వారం.

సంతోషం అంటే ఎప్పుడూ ఉల్లాసంగా ఉండటం. మనస్సును బిగపట్టుకొని అదోమాదిరి బింకంగా ఉండటం ధర్మసాధనకు ఓ అంగం అని తలిచేవాళ్ళు లేకపోలేదు. కాని, ఇది సరి కాదు. అదీగాక, ఎప్పుడూ చిటచిటలాడే స్వభావం గలవారికి అసలు ధ్యానమే కుదరదు. ఇల్లాంటివాళ్ళు సంఘానికి ఎంతదూరంగాఉంటే అంత శ్రేయమని వివేకానందస్వామి అన్నాడు.

సంతోషం అంటే ఇంతో అంతో కలిగిన దాంతో తృప్తిపడి ఉండటం అనికూడా అర్థం చెప్పుకోవచ్చు. ఈవిధమైన తృప్తిలేకపోతే, మనిషి ఎప్పుడూ తన అదృష్టాన్ని నిందించుకుంటూ ఉండటం, ఎదుటివారి పచ్చని చూసి ఓర్వలేకపోవటం తటస్థిస్తాయి. ఇల్లాంటి మనస్సుతో ఇంక ధ్యానమెట్లు కుదురుతుంది?

వెనకాలికి రామనాథుడనే తర్కశాస్త్ర పండితుడొకాయన నవద్వీపంలో ఉండేవాడు అనిన్నీ, ఒకసారి రాజుగారు ఆయన అభావాన్ని – దారిద్ర్యాన్ని – పోగొట్టటానికి తానేమైన చేయాల్సింది ఉంటే చేస్తానని చెప్పటమున్నూ, తర్కశాస్త్రమగ్నం అయిన ఆయన మనస్సుకు, దారిద్ర్యంలోగూడ సంతుష్టిని అనుభవించే ఆయన మనస్సుకు, ఆవిషయం అర్థంగాక న్యాయసాస్త్రార్థంలో ఆ శబ్దాన్ని గ్రహించి నాకభావం ఏమీ లేదనటమున్నూ కథగా చెప్పుకుంటూరు. చివరకు రాజుగారు ఎంతో ప్రయత్నించి సంసారస్థితిని జ్ఞప్తికి తేగా, 'అయ్యా! ఏదో పొలంమీదవచ్చే ధాన్యంతో అన్నమూ, ఇంటి పెరట్లోఉన్న చింతచెట్టు ఆకులతో పులుసూ లభిస్తున్నాయి. ఇంతకంటే ఇంకేమి కావాలి' అన్నాట్ట!

ఇది భౌతికవిషయాల్ని గురించినంత మటుకూ. ఇక ఆధ్యాత్మికవిషయంలోకూడా భగవంతుడు తన్ను తప్పకుండా ఎప్పుడో ఒకప్పుడు అనుగ్రహిస్తాడనిన్నీ, తాను క్రమక్రమంగా గమ్యాభిముఖంగానే నడుస్తున్నాననిన్నీ ఒక విధమైన సంతోషభావం ఉండాలి.

ఇల్లా అని మళ్ళీ 'అంతా జయించాం' అనే భావంకూడా రాకుండా కాపాడుకోవాలి.

ఈసంతోషంవలన అనుత్తమమైన సుఖం లభిస్తుంది.

తపస్సు అంటే శరీరానికీ ఇంద్రియాలకూ శుద్ధిని చేకూర్చుకోటం; చాంద్రాయణం, పంచతపము మున్నగువ్రతాల్ని అవలంబించటం. అయితే ప్రస్తుతపరిస్థితులలో మన శరీరాలు

ఏవిధమైన కఠిన తపస్సుకూ నిలిచేవిగా లేవు. కలిలో ప్రాణం అన్నగతం. కనుక స్వల్ప శ్రమతో అనుష్ఠింపదగ్గ ఏకాదశీవ్రతమూ, శనివారము మొదలైనదినాల్లో ఏకభుక్తంగా ఉండటం లేక వీలైన ఏవో కొన్ని ఆహార విహారనియమాల్ని ఏర్పరుచుకోవచ్చు.

ఇల్లాంటివ్రతాలు లేకపోతే సాధకుడి మనస్సు క్రమంగా భోగపరవశమవుతుంది. కనుక, ఏదో ఒకవిధమైన తపస్సును ఆచరణలో ఉంచుకోవాలి. ఈ తపస్సువలన దూరశ్రవణము దూరదృష్టి మొదలైనసిద్ధులు అల్పంలోనే కనిపిస్తాయి.

స్వాధ్యాయము అంటే ఇష్టమంత్రజపము అని ఒక అర్థము. ఇష్టమంత్ర జపంవలన ఇష్టదేవతాదర్శనం అవుతుంది. ఇల్లాంటిదర్శనం సాధకుడికి ఉత్సాహప్రదమై సాధనలోని తీవ్రతను అభివృద్ధిపరుస్తుంది.

ఇంక స్వశాఖావేదభాగాన్నీ, గీత, రామాయణం, భారతం, భాగవతంలాంటి ఉత్తమ గ్రంథాల్ని నియతంగా పఠించటంగూడ స్వాధ్యాయాంతర్గతమే.

ఈశ్వరప్రణిధానమంటే సర్వం ఈశ్వరార్పణ చేయటం. ఇల్లా సర్వం భగవంతునికి అర్పణం చెయ్యటంవల్ల స్థిరమైన సమాధి కలుగుతుంది. ఇది లభిస్తే సాధకుడికి ఇంకేమి కావాలి?

ఇల్లా సత్యంతో ఆరంభమైన యమ నియమ సాధన స్థిరమైన సమాధితో సాకల్యమవుతుంది. కనుక, ఆధ్యాత్మిక సాధకులందరూ వీటి ప్రాముఖ్యాన్ని గమనించి జీవితంలో సక్రమంగా అనుష్ఠించవలసి ఉంటుంది.

లోకమున కంతటికి శుభమగుగాక, దుర్జనుడు సజ్జనుడగుగాక, జనులు పరస్పరము మంగళమునే భావింతురుగాక, బుద్ధినిష్కామత్వమును బొంది భగవంతు నాశ్రయంచునుగాక.

(శ్రీమద్భాగవతము.)

కామము, కాంచనము అనే ఈ రెండిటికిన్నీ వశుడుకాని మానవుడు లేడు. ఈ రెండింటిని గెల్వాలంటే రామనామ సంకీర్తనం అనే మహాస్త్రాన్ని ప్రయోగించాలి.

(తులసీదాసు.)

అజరామరవత్ప్రాజ్ఞః విద్యామర్థంచ చింతయేత్
గృహీత ఇవకేశేషు మృత్యునా ధర్మమాచరేత్

విద్యనీ ధనాన్నీ ఆర్జించేటప్పుడు కలకాలం ఉంటాననుకో; ఇప్పుడే మృత్యువు రాబోతుంది అనేటంత తీవ్రతతో ధర్మాన్ని ఆచరించు.

---

తామరపుష్పములోని మకరందమును త్రాగుటకు అలవాటుపడిన తుమ్మెద ఉమ్మెత్త పూవును వాసనచూడదు. ఆ విధంగానే భగవంతుని చరణ కమలధ్యానమనే మకరందమును రుచిచూచిన మనస్సు నిస్సారమైన లోకవిషయములను కోరదు. (ప్రహ్లాదుడు.)

# పూశలార్ నాయనార్

## సి. వి. రావు

### (మానస పూజామహిమను వ్యక్తంచేసే శివభక్తుని చరితం)

దక్షిణ భారతదేశంలో సకలధర్మములకు ప్రసిద్ధివహించిన ప్రదేశములలో తొండనాడు ఒకటి. అందు ''తిరునిణ్ణ్రవూరు'' అను గ్రామము కలదు. ఆ గ్రామము ప్రస్తుతము తిణ్ణనూరను పేరుతో పిలువబడుచున్నది. నాలుగు వేదములకు, సకలధర్మములకు నిలయమైన ఆ గ్రామములో ఒక సత్కులమందు ''పూశలార్'' అను శివభక్తుడు అవతరించెను. అతడు బాల్యమునుండియు శివధ్యానపరుడై శివభక్తులను తనవసతికి తగినట్లు ఆదరించుచుండెను. శివభక్తులను సంతోషపెట్టుటయే మానవజన్మకు పరమలక్ష్యమను నమ్మకముతో జీవించుచుండెను.

పూశలార్ తన గ్రామములో ఆలయము కట్టించి అందు శివప్రతిష్ఠచేయుటకు సంకల్పించెను. ఆలయనిర్మాణమునకు కావలసినసామాగ్రి కొనుటకు అతనివద్ద సొమ్ములేదు. అందువల్ల పలువురను సహాయముచేయుడని వేడుకొనెను. ఆ ప్రయత్నము కొనసాగలేదు. అతనికి సహాయముగా ధనమునుగాని వస్తువులుగాని ఇచ్చుటకు దాతలెవ్వరు ముందుకు రాలేదు. తనకోరిక నెరవేరనందుకు చాల విచారించెను. మనసార కార్యసాఫల్యమునకై మహాదేవునితో మొఱపెట్టుకొనెను. శివానుగ్రహమో, కార్యదీక్షయో, ఇంకేదైనా అదృశ్యశక్తియో తెలియదుగాని అతని అంతరాత్మలో ఉత్సాహమును రేకెత్తించెను. శివారాధనకు, కైంకర్యమునకు ధనముతో నిమిత్తములేదని గ్రహించెను. సంసారపంకమగ్నులైన పామరులను దీనునివలె యాచించుట నిష్ఫలమని భావించెను. తన హృదయములోనే సర్వాలంకారశోభితమగు దేవాలయమునిర్మించి దానిలో పార్వతీ పరమేశ్వరులను ప్రతిష్ఠించుటకు తీర్మానించుకొనెను.

ఇసుక, సున్నము, రాళ్లు, కలప మొదలైన సామానులను కొన్నట్లును, వానిని బండ్లపై చేర్పించినట్లును మనసులోనే భావించుకొనెను. పునాదివేయుటకు మంచిలగ్నమును విచారించి గోడలు కట్టుటకు తాపీపనివారిని, తలుపులు, చలవచప్పరములు, రథములు తయారుచేయుటకు వడ్రంగులను, రాతివిగ్రహములు చెక్కుటకు శిల్పులను, వాహనములు ఉత్సవవిగ్రహములు చేయుటకు కంచరపనివారిని, పార్వతీ పరమేశ్వరులకు ఆభరణములుచేయుటకు కంసాలులను, పిలిపించినట్లును భావించుకొనెను. ఎవరిపని వారికి అప్పగించినట్లున్నూ భావించుకొనెను. ప్రతిపనియు మెల్లమెల్లగ పూర్తియగుచున్నట్లు రాత్రింబవళ్లు తలపోయుచుండెను. రోజులు గడిచినకొద్ది క్రమక్రమముగా పనులన్నియు పూర్తి అగుచున్నట్లు ఊహించుకొనుచుండెను. దేవాలయము, విమానము, గాలిగోపురము, కల్యాణమంటపము బలిపీఠము, ధ్వజస్తంభము, ప్రాకారము, నుయ్యి, కోనేరు మొదలైన ఆలయసంబంధమైన నిర్మాణములు పూర్తి అయినట్లు, నందీశ్వర చండీశ్వర వినాయక పార్వతీ పరమేశ్వరులకు శిలా విగ్రహములు పూర్తి అయినట్లున్నూ భావించుకొనెను. ఇత్తడి వెండితో తయారుచేయవలసిన ఉత్సవవిగ్రహాలు, మకరతోరణాలు, గంటలు, జాగంటలు, శఠారి మొదలైన అర్చనాసంబం

ధమైన వస్తువులను మనసులోనే సేకరించెను. దేవాలయసంబంధమైన పనులన్నియు ఈవిధముగా పూర్తిగా ముగిసినవి. దేవతాప్రతిష్ఠకు, కుంభాభిషేకమునకు మంచి లగ్నము నిర్ణయించి, ఆ లగ్నమున ప్రతిష్ఠ, కుంభాభిషేకము చేయుటకు తీర్మానించుకొనెను.

ఆ రోజుల్లోనే కాంచీపుర పాలకుడైన రాజసింహపల్లవరాజుకూడ కొన్ని లక్షల వ్యయముతో బ్రహ్మాండమైన శివాలయము కట్టించెను. శిల్పులు తమ చిత్రకళానైపుణ్యమంతయు ఆ దేవాలయమందు నెలకొల్పిరి. దేవాలయనిర్మాణము పూర్తియగుటచే కుంభాభిషేకము చేయుటకు ముహూర్తము నిర్ణయించుటకై రాజు జ్యోతిష్కులను పిలిపించెను. వారు లగ్నము నిర్ణయించిరి. ఆ విషయము ప్రజలలో దండోరామూలముగా ప్రచారము గావింపబడెను.

పూశలార్ నిర్ణయించుకున్న ముహూర్తమే రాజసింహుడు నిర్ణయించిన ముహూర్తము. పూశలార్ గుడి కట్టించుటయు, ప్రతిష్ఠ జరుపుటకు ఏర్పాటుచేయుటయు, అతనికితప్ప ఇతరులకు తెలియదుగదా! రాజునకుమాత్ర మెట్లు తెలియును?

పూశలార్ నాయనార్ యొక్క దైవభక్తి, మహిమ, గొప్పతనము, లోకమునకు వెల్లడి చేయవలెనని ఈశ్వరుడు సంకల్పించుకున్నాడు.

ముహూర్తమునకు ముందురాత్రి శివుడు రాజుకలలో కనుపించి 'రాజా! తిరునిణ్డ్రఊరిలో నా భక్తుడైన పూశలార్ నాయనార్ నాకు ఆలయం కట్టించాడు. రేపు ప్రతిష్ఠచేయుటకు ఏర్పాటు చేసినాడు. నేను సపరివారముగా అక్కడకు పోయితీరవలెను. నీ ముహూర్తము ఆ మరునాటికి మార్చుకొనుము' అని చెప్పి అదృశ్యమైనాడు.

రాజసింహుడు మేల్కొని, ఈశ్వరా దేశాన్ని మననం చేసుకున్నాడు. అతనికి ఎంతో ఆశ్చర్యం కలిగింది. నేనెంతో ధనం వెచ్చించి సర్వాంగ సుందరముగా కోవెల కట్టించాను. దీనితో సమానంగా కట్టించు సమర్థులెవరు? పూశలార్ అంత గొప్పవాడా? అతని దేవాలయములోనే ముందుగా ప్రవేశిస్తానని స్వామి స్వయంగా చెప్పినాడే, ఆతడెంతో గొప్పవాడై యుంటాడు. అందుకు సందేహంలేదు. నేను స్వయంగావెళ్లి ఆ మహానుభావుణ్ని దర్శనం చేసుకుంటాను. అందువల్ల స్వామికిగూడ తృప్తి గలుగుతుంది' అని మనసులో అనుకున్నాడు. ఆ సంగతిమంత్రులకు సేనానాయకులకుచెప్పి ప్రయాణసన్నాహాలు చెయ్యమని ఆజ్ఞాపించాడు.

రాజాజ్ఞ విన్నవారందరు ఆశ్చర్యపోయినారు. స్వయంగా నిర్మించిన దేవాలయానికి కుంభాభిషేకం చెయ్యకుండ ఎక్కడికో బయలుదేరినకారణం ఊహించలేకపోయినారు. రాజును ప్రశ్నించే ధైర్యంచాలక ఆయనవెనుకనే ప్రయాణం సాగించారు.

రాజు తిన్నగా తిరునిణ్డ్రఊరుకు వచ్చాడు. రాజును రాజపరివారాన్నిచూచి గ్రామస్తులందరు భయభక్తులతో ఆహ్వానించారు. రాజసింహ పల్లవుడు గ్రామస్థులనుచూచి 'పూశలార్ కట్టించిన శివాలయం ఏదిక్కున వున్నద'ని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు అక్కడున్నవారంతా విభ్రాంతులైనారు. 'మహారాజా! పూశలారేమిటి? కోవెల కట్టించటమేమిటి? మా గ్రామంలో అలాటి దేవాలయమే లేద'ని జవాబిచ్చారు.

వల్లవరాజు గ్రామస్థులనందరినీ పిలవమన్నాడు. వారంతావచ్చి రాజును దర్శించారు. రాజసింహుడు 'మాశిలా పూశలార్' అనే ఆయన ఎవరని అడిగాడు. అందుకు వారు 'అత నొక బీదవాడు, శివభక్తుడు, యోగ్యుడు ఆ వీధిలో నున్నాడ'ని బదులు చెప్పారు.

అంతట రాజు అతనిని పిలవమని ఆజ్ఞాపించకుండ తానే పూశలార్‌ను దర్శించుటకు బయలు దేరటం అక్కడున్నవారందరికి వింతగా తోచింది.

రాజసింహాపల్లవుడు పూశలార్‌ను దర్శించి వినయవిధేయలతో సాష్టాంగపడి 'మహానుభావా! మీరు కట్టించిన శివాలయం ఎక్కడుంది? ఆ కోవెలకు ఈరోజునే కుంభాభిషేకం జరుగుననియు, తాను సపరివారంగా వెళ్ళుచున్నాననియు, ఈశ్వరుడు నా కలలో కనుపించి చెప్పాడు. నేను కట్టించిన దేవాలయమునకు ప్రతిష్ఠముహూర్తం మార్చుకొనమని ఆజ్ఞాపించాడు. అందువల్ల మీ దేవాలయం చూచుకోరికతో వచ్చాన'ని చెప్పాడు.

పూశలార్ రాజునుచూచి 'మహారాజా! నీ జన్మ ధన్యమైంది. కలలో పరమేశ్వరసాక్షాత్కారం లభించింద'ని రాజుకు వందనంజేసి, 'స్వామి నన్ననుగ్రహించాడా? నా దేవాలయంలో ప్రవేశిస్తానని చెప్పాడా'? అని ఆనందంతో పొంగిపోయి మళ్ళీ ఇట్లా అన్నాడు.

'రాజా! నేను బీదవాడను. నాలో ఎందుకో శివాలయం కట్టించాలనేకోరిక కలిగింది. వాస్తవముగా కోవెల కట్టించుశక్తి నాకు లేదు. నా హృదయంలోనే భావనా రూపంతో కోవెల నిర్మాణం పూర్తిచేశాను. స్వామికూడ నా దేవాలయంలో ప్రవేశిస్తానని చెప్పినందున నా కోర్కె నెరవేరింది. నా దేవాలయం చర్మచక్షువులకు కనుపించదు. దివ్యదృష్టితో చూచువారికి కనిపిస్తుంది.

ఇది విని పల్లవరాజు అమితాశ్చర్యంచెంది అతని భక్తివిశ్వాసములను కొనియాడి సాష్టాంగ ప్రణామంచేసి సపరివారంగా కాంచీపురికి వెళ్ళాడు.

ఆనాటినుండి పూశలార్ నాయనార్ మహిమ లోకానికి వెల్లడైంది. ప్రజలు భక్తిప్రపత్తులతో పూజింపసాగారు.

తర్వాత పూశలార్ అంతరంగ దేవాలయంలోని స్వామికి మానసపూజలుచేస్తు కొన్నాళ్లు గడిపి చివరకు శివసాయుజ్యం పొందాడు.

జ్యోతీంషి విష్ణుర్భువనాని విష్ణుర్వనాని విష్ణుర్గిరయో దిశశ్చ
నద్యః సముద్రాశ్చ స ఏవ సర్వం యదస్తి యన్నాస్తి చ విప్రవర్య.

సూర్యచంద్రులు, నక్షత్ర తారాగణములు, సకల భువనములు, వనములు, నదీనద పర్వతములు, దిక్కులు, సముద్రములు—ఇవన్నీ విష్ణువు దాల్చిన నానా రూపములే. ఒక్క మాటలో చెప్పాలంటే: ఇంద్రియగోచరము సకలమూ, ఇంద్రియ అగోచరము సకలమూ— అంతా విష్ణుమయమే. పురాణం.)

# మాతృదేవిచరణసన్నిధి

ఆంగ్ల గ్రంథము:
ఎట్ ది హోలీమదర్స్ ఫీట్

అనువాదము:
పి. గణపతిశాస్త్రి

ఆ పైన నేనడిగాను.

నేను: అయితే, అమ్మా! కొందరా దైవ సాక్షాత్కారంకోసం పరితపిస్తారు! కాని వారి కెన్నటికి భగవానుని సందర్శనభాగ్యం లభించనేలభించద! మరికొందరు ఆ దైవసందర్శనం సంగతే తలపెట్టరు. అయినా వారి సమక్షంలో స్వయంగా సాక్షాత్కరిస్తాడాభగవానుడు! ఎందుకిలాగ జరుగుతుంది?'

అమ్మ: భగవానుడు పసి పాపవంటివాడు, తెలిసిందా? సందర్శనం కావాలి కావాలనుకున్నవారి సమక్షంలో సాక్షాత్కరించడు. అక్కర లేదనుకున్నవారికి కట్టెదుట గోచరిస్తాడు. అటువంటివారు బహుశః పూర్వజన్మల నుంచి ఎంతో పరిణతి పొందినవారన్నమాట! కనకనే వారికి ఆయనకృప అలాగ అకస్మాత్తుగా లభిస్తుంది.

నేను: అయితే భగవానుని అనుగ్రహంలో కూడా తారతమ్యాలున్నాయన్నమాట!

అమ్మ: తప్పకుండా ఉన్నాయి. అంతా కర్మానుసారంగా జరిగిపోతూంటుంది. కర్మబంధనాలన్ని తొలగిపోగానే దైవసాక్షాత్కారం లభిస్తుంది. అంతేకాదు! అదే ఈ భూమిమీద కట్టకడపటి జన్మకూడా అవుతుంది. ఆ పైన నేను మాతృదేవితో వాదంలోకి దిగాను.

నేను: అమ్మా, లోలోపల విజ్ఞానజ్యోతి ఆవిర్భవించాలంటే, సదా ఆధ్యాత్మికసాధన అత్యవసరమని అంగీకరిస్తాను. అలాగే పూర్వజన్మకర్మకూడా పూర్తిగా క్షీణించాలి. అన్నిం



టికన్న ముఖ్యమయినది తగిన తరుణంకూడా రావాలి. అప్పుడే ఆ విజ్ఞానజ్యోతి సాక్షాత్కారం కలుగుతుంది. నిజమే! అయితే ఆ భగవానుడు మనకెంతో ఆత్మీయుడుకదా! అటువంటప్పుడు అపారకృపతో మన సమక్షంలో ఎందుచేత సాక్షాత్కరించడు?

అమ్మ: అవును నాయనా! నీవన్నది యథార్థమే! కాదనడంలేదు. అయితే అందరికి నీకున్నంతటి సునిశితపరిశీలనశక్తి ఉండదు. చాలామందికి మతమంటే ఏదో కర్మకాండ పద్ధతి అన్నమాట! అంతే! నిజంగా ఆ భగవానునికోసం ఆరాటపడేవాళ్ళు ఎంతమంది ఉన్నారు? ఎంతమందికి ఆ భగవంతుడు కావాలి?

నేను: ఒకసారి నీతో అన్నాను జ్ఞాపకం ఉందా అమ్మా! ప్రేమ, ఆత్మీయత అనుభవించినప్పుడుగాని, కన్నతల్లి మనస్సుకూడా తిన్నగా తెలియనే తెలియదు!

అమ్మ: అవును నాయనా! నిజానికి భగవానుని సాక్షాత్కరించుకోకపోతే ఆయనమీద ప్రేమ ఎలాగ పెంపొందుతుంది? మనం ఈనాడు ఇక్కడ కలుసుకున్నాము. నేనిక నీతల్లిని! నీవు నా బిడ్డవు!'

1, ఫిబ్రవరి 1912,

నేను మాతృదేవి సందర్శనానికి వెళ్ళేసరికి రాత్రి అప్పుడే తొమ్మిదిన్నర కావచ్చింది. ఆ వేళంతా నాకు మాతృసందర్శనభాగ్యం లభించలేదు! అందుచేత అమ్మ "రాత్రివేళ అంతా ఎక్కడ ఉన్నావు?" అని అడిగారు.

నేను: కింద లెక్కలన్ని సరిచూసేపనిలో మునిగి ఉన్నానమ్మా!

అమ్మ: అవును! ఇదేమాట ప్రకాశ్ నాతో అన్నాడు. సర్వసంగపరిత్యాగం చేసినవారికి అటువంటి పనివల్ల ఆనందం కలుగుతుందా? ఒకప్పుడు ఠాకూరు కిచ్చే భృతివ్యవహారంలో ఏదో పెద్దపొరపాటు జరిగింది. అందువల్ల ఆయన కివ్వవలసినదానికన్న కొంచెం తక్కువగా ఇచ్చారు. నేనా సంగతి దేవాలయం కోశాధికారికి తెలియజెప్పడం మంచిదని అన్నాను. దానిమీద ఆయన 'ఛీ, ఛీ' నన్నిదంతా లెక్కలుకడుతూ కూర్చోమన్నావా?' అన్నారు.

'ఈమాట ఠాకూరు స్వయంగా నాతో అన్నారు. ఎంత గొప్పమాట ఇది! భగవానుని నామం స్మరించేవాని కెన్నడూ ఏవిషయంలోను లోటు రాదట! అనవసరంగా ఎందుకిలాగ మథనపడతావు? నేనీమాట స్వయంగా ఆయన నోట విన్నాను. ఠాకూరు సర్వసంగపరిత్యాగం నిజంగా వజ్రాల కిరీటమే!

ఉద్బోధన కార్యాలయము, ఫిబ్రవరి 8, 1912.

ప్రార్థన మందిరానికిపక్కనే ఉన్నగదికి ఉత్తరభాగంలో నేలమీద చాపగాని, కంబళీగాని పరుస్తారు. అమ్మ సామాన్యంగా అక్కడ పొద్దున్న తూర్పుముఖంగా కూర్చుని, మానసికంగా తన మంత్రజపం చేస్తూఉంటుంది.

ఆమెతో ప్రసంగించడానికి వచ్చినప్పుడు, మేము సామాన్యంగా మాతృదేవిదగ్గిరే కూర్చుంటాము. ఈవేళ ఆమె అక్కడే కూర్చున్నారు నేను 'అమ్మా, నీవు దక్షిణేశ్వరంలో ఎంతకాలం ఉన్నావమ్మా?' అని అడిగాను.

అమ్మ: 'చాలాకాలమే ఉన్నాను' నేను పదహారోఏట (వాస్తవంగా 19 వ ఏట) అక్కడికి వెళ్లాను. ఆతరవాత సామాన్యంగా అక్కడే ఉండిపోయాను. అప్పుడప్పుడు పుట్టినింటికి తిరిగి వెడుతూండేదాన్ని. రామలాల్ వివాహానికి ఒకసారి వెళ్లాను. ప్రతి రెండు మూడేళ్ళకు ఒకసారి మా ఊరు వెడుతూండేదాన్ని.' అని అన్నారు అమ్మ.

నేను: అయితే అమ్మా, దక్షిణేశ్వరంలో ఉన్నంతకాలము ఒంటరిగానే ఉండడం జరిగిందన్నమాట!

అమ్మ: ఒక్కొక్కప్పుడు ఒంటరిగానే ఉండేదాన్ని. ఒక్కొక్కప్పుడు మా అత్తగారు తోడుగా ఉండేవారు. అప్పుడప్పుడు గోలాప్ మా గౌర్దాసి మొదలయినవారు అక్కడకి వస్తూండేవారు. ఆ చిన్నగదిలోనే మా వంట, భోజనాలు అన్ని జరుగుతూండేవి. మా నివాసం కూడా అక్కడే! ఠాకూరు అప్పుడప్పుడు అజీర్ణరోగంతో బాధపడుతూండేవారు. ఆయనకోసం వంటకూడా ఆ చిన్నగదిలోనే జరుగుతూండేది. కాళికాదేవికి నైవేద్యంపెట్టిన విందుభోజనం ఠాకూరు శరీరానికి సరిపడేదికాదు

ఆపైన ఠాకూరు శిష్యులకోసంకూడా మేము వంటకాలు చేస్తూండేవాళ్ళము. లాటూకూడా అక్కడే ఉండేవాడు. రామచంద్రదత్తతో తగాదాపడి అతడు మాదగ్గిరికి వచ్చివేశాడు. 'లాటూ చాలా మంచివాడు. రొట్టెలకోసం పిండి కలుపుతూ నీకు సాయంగా ఉంటాడు' అని ఠాకూరు నాతో అన్నారు. రాత్రింబగళ్లు అస్తమానము వంటపనే!

ఉదాహరణకు, రామదత్త దక్షిణేశ్వరానికి వస్తూ బండి మీదినించి దిగుతూనే 'నాకీవేళ చపాతీలు, పప్పు కావాలని కేక పెట్టేవాడు. అతనిమాటవింటూనే నేను వంట మొదలు పెట్టేదాన్ని. మాకు ప్రతిరోజు, ఏడెనిమిది పౌనుల గోధుమపిండి కావలసివచ్చేది. రాఖాలు మాదగ్గిరే ఉండేవాడు. సామాన్యంగా మేము అతనికోసం పులగం తయారుచేసేవాళ్ళము. శిష్యులకోసమని ప్రతినెల పదిరూపాయలు విరాళంగా ఇస్తూండేవాడు సురేంద్రమిత్తర్. పెద్ద గోపాల్ బజారుపని చూస్తూండేవాడు. రాత్రింబగళ్ళు నృత్యము, సంగీతము, భజనలు, ధ్యానము, సమాధిప్రవేశాలు జరుగుతూండేవి. మా కెదురుగా వెదురుతడికలతో కట్టిన దడి ఉండేది. మేము దానికి గంతలుచేసి వాటి ముందునిలిచి అవ్వన్నీ చూస్తూండేవాళ్ళము. అలాగే అదేపనిగా నిలబడడంవల్లనే నాకు కీళ్ళనొప్పులరోగం ప్రారంభమయింది.

కొంతకాలంపాటు జానూ తల్లి అనే పని మనిషి నాదగ్గిర పని చేస్తూండేది. ఇంకా ఒక ముసలమ్మకూడా అప్పుడప్పుడు నాదగ్గిరికి వస్తూండేది. వయస్సులో ఉన్నప్పుడు ఇంతకు మునుపు ఆమె చెడుతిరుగుళ్ళు తిరిగింది. కాని ముసలితనంలో భగవానునికి నమస్కరించి ప్రార్థిస్తూండేది.

నేను అప్పుడు చాలా ఒంటరిగా ఉండే దాన్ని. అందుచేత వచ్చినప్పుడల్లా ఆమెతో మాట్లాడుతూండేదాన్ని. ఠాకూరు మేమిద్దరము మాట్లాడుకుంటూండడం గమనించారు ఒక మారు. ఆ తరవాత 'ఇక్కడికి ఆవిణ్ణి ఎందుకు రానిస్తున్నావు?' అని అడిగారు. దానిమీద నేను ఆమె ఈ మధ్యన దైవాన్నిగురించిన మంచిమాటలే మాటాడుతున్నది. మనుషుల మనస్సులు మారుతూంటాయి. ఆవిణ్ణి ఇక్కడికి రానిస్తే తప్పేమిటి?' అన్నాను నేను. అయితే ఠాకూరు దానిమీద 'వద్దు, వద్దు! రానియ్య వద్దు! ఇంతకుమునుపామె ఉంపుడుకత్తె! ఎంత మారినా ఆమెతో మాట్లాడడం మంచిదికాదు!' అంటూ నన్ను నివారించారు. నాలో చెడు తలపోతలు బయలుదేరవచ్చు నన్న ఆలోచనతో ఠాకూరు నన్ను అటువంటివారితో మాట్లాడనిచ్చేవారు కారు. అపాయాలేవి రాకుండా అలాగ కంటికి రెప్పలా కాపాడేవా రాయన.

ఒకసారి కామార్పుకూరులో రామ్‌జీరాయ్ ఠాకూరును చూడడానికి వచ్చారు. అతగాడు మంచిమనిషి కాడు. రామ్‌జీరాయ్ వెళ్ళిపోగానే ఠాకూరు 'ఆ ప్రదేశంనించి గంపెడుమన్ను తవ్వి పారెయ్యండి!' అని గట్టిగా కేక పెట్టారు. అయితే ఆయనమాట ఎవ్వరు పట్టించుకోలేదు. ఆపైన ఠాకూరు స్వయంగా పార చేతపట్టి కొంతమన్ను అక్కడినించి తవ్వి పారవేసి 'అటువంటివాళ్ళు కూర్చుంటే భూమికూడా అపవిత్రమయిపోతుంది!' అన్నారు.

తూర్పు వంగదేశానికి చెందిన దుర్గాచరణ్ కూడా అప్పుడప్పుడు అక్కడికి వస్తూండేవాడు. ఎంతటి గొప్పభక్తి అతనిది! ఠాకూరు అస్వస్థులుగా ఉన్నప్పుడు మూడురోజులపాటు అదే పనిగా గాలించి ఒక ఉసిరికకాయ సంపాదించి అర్పించి ఆయనకోరిక నెరవేర్చాడు. ఆ మూడు రోజులు మరి నిద్రాహారాలమాటయినా తల

పెట్టలేదు దుర్గాచరణ్. ఒకసారి నేనతనికి సాలపత్రంతో ప్రసాదం చేతికందించాను ఆ ప్రసాదంతోబాటు ఆ సాలపత్రంకూడా ఆరగించి వేశాడాతడు. అతడు సన్నగా నల్లగా ఉండేవాడు. అతనికళ్ళు పెద్దవి. తళతళ లాడుతూండేవి. ఆకళ్ళలో ఎంతటి ప్రేమ! ఎంతటి భక్తి! అవి భక్తితో ప్రేమతో నిండిన బాష్పాలతో తరళిస్తూండేవి.

ఆరోజుల్లో భగవానుని గాఢ ప్రగాఢభక్తితో పరవశిస్తున్న వారెందరో ఉండేవారు. ఈరోజుల్లో వస్తున్న భక్తులు ముఖ్యందుగా ఆ భగవంతుణ్ణి చూపించవలసిందని అదేపనిగా అడుగుతూంటారు. ఆధ్యాత్మిక సాధన, ప్రార్థన మొదలయినవానిమాటే తలపెట్టరు. అసలైన గతంలో చేశేతులా చేసిన పాపాలెన్ని అయినా ఉండవచ్చు టాయి. అవ్వి అన్ని క్రమక్రమంగా పోగొట్టుకోవాలి. అప్పుడే ఆ భగవానుని సాక్షాత్కారం సాధ్యపడుతుంది. ఆకాశంలో చందమామ కనబడకుండా మబ్బులు దట్టంగా కమ్ముకుని ఉంటాయి. కాని గట్టిగా గాలివీచినప్పుడు అవి అన్ని ఒక్కమారుగా దూరదూరంగా తొలిగిపోతాయి. అప్పుడే చందమామ సందర్శనం సాధ్యపడుతుంది. ఆ మబ్బులన్ని హఠాత్తుగా ఒక్కసారిగా తొలగిపోతాయా? మనిషి చేసిన పాపాలుకూడా ఆ మబ్బులవంటివే. పాపకర్మల ఫలతాలన్నికూడా క్రమక్రమంగానే తొలగిపోవాలి. భగవానుని సాక్షాత్కారం లభించగానే ఆయన అనుగ్రహంవల్ల అంతర్యంలో విజ్ఞానజ్యోతి వెలుగుతుంది. ఆ సంగతి దానంతట అదే అనుభవంలోకి వస్తుంది.

ఉద్బోధన కార్యాలయము: మీవ గడ.

ఫిబ్రవరి 21, 1912. రాధూ జ్వరంతోను నొప్పులతోను బాధపడుతూంది. అమ్మ ఆమె పరిస్థితి గమనించి ఆందోళపడుతూ అదేపనిగా అంటూంది.

'నేనిక్కడ ఉన్నప్పుడుకూడా రాధూ పరిస్థితి చక్కబడడం లేదు. ఈతరవాత రాధూ మంచిచెడ్డలు ఎవరు గమనిస్తారు? అసలు అప్పుడు రాధూ బ్రతికి బట్టకడుతుందా?

దానిమీద నేను 'పగలంతా శిష్యులిక్కడ గుమిగూడుతున్నారు. మీకా ఒక్కనిమిషం కూడా విశ్రాంతి లభించడం లేదమ్మా!'

ఆమాటమీద అమ్మ అందుకున్నారు:

రాత్రింబగళ్ళు నేను ఠాకూరును తలుచుకుని 'ప్రభూ! కాస్త నా భారం తగ్గించండి. రవంత విశ్రాంతి చిక్కేటట్టు అనుగ్రహించండి' అని ప్రార్థిస్తున్నాను. కాని ఫలితమేమి కనిపించడంలేదు. ఆ జీవితాంతము ఇది ఇలాగే సాగిపోతూంది. అంతే... మీ గురువులదగ్గిరికి వెళ్లి మంత్రదీక్ష స్వీకరించండి! వారు మీకోసం నిరీక్షిస్తూంటారు. నేను మీవల్ల ఏమీ ఆశించడంలేదు! వెళ్లండి! మీ గురువులదగ్గిరికి వెళ్ళండి!' అని నేను ఎల్లప్పుడు చెబుతూనే ఉంటాను. అయినా నన్నెవ్వరు విడిచిపెట్టరు. పైగా కళ్ళమ్మట నీళ్ళు పెట్టుకుని దుఃఖిస్తారు. అప్పుడు వారికేసిచూస్తే నాకెంతో జాలి కలుగుతుంది. నా ఆయుర్దాయం పరిమితమైంది. కాని నేను బ్రతికిఉన్నంతకాలము ఇది ఇలాగే సాగుతూంటుంది.

నేను: 'వద్దు వద్దమ్మా! అటువంటిమాటలనవద్దమ్మా! ఇప్పుడు మీ ఆరోగ్యం చాలా బాగుంది. ప్రత్యేకించి ఒంట్లో జబ్బేమి లేదు! అటువంటప్పుడు మమ్మల్ని అందర్ని విడిచిపెట్టి వెళ్లిపోవాలని ఎందుకనుకోవాలి? అటువంటి మాట లనవద్దమ్మా!'

(సశేషం)

# స్వామి తురీయానంద ప్రసంగములు

యఇచ్ఛతి హరింస్మర్తుం వ్యాపారాన్తగ తైరపి
సముద్రే శాంతః ల్లోలే స్నాతుమిచ్ఛతి దుర్మతిః

(చేయవలసిన పనులన్నియు తీరినపిమ్మట భగవంతుని స్మరింపగోరువాడు సముద్రములోని అలలన్నియు శాంతించినపిమ్మట స్నానము చేయగోరు మూఢుని వంటివాడు.)

సముద్రస్నానము చేయగోరువాడు అలలు శాంతించువరకు వేచియుండెనేని, సర్వదా అట్లు వేచియే యుండవలెను! ఎంత మూఢత! అట్టి తరుణము ఎన్నటికైనను వచ్చునా! అట్లు చేయుటకు బదులు అలల నెదుర్కొని పోరాడి స్నానము చేసిరావలెను. సముద్రము ఎప్పుడును ఒకేవిధముగా నుండును. కావున ఈ ప్రపంచమునందు ఈ కల్లోల మధ్యముననే నీవు భగవంతుని ధ్యానించుటకు అవకాశము కల్పించుకొనవలెను. అనుకూల తరుణమునకై వేచి యుండుట కాదు. ఈ క్షణముననే ఆ పనిని చేయవలెను. తప్పినచో ఎప్పటికిని లేదు! పూర్ణ ప్రయత్న పూర్వకముగా నీవు కమ్ము. ప్రతికూల విషయములన్నియు అనుకూలముగా పరిణమించును.

* * *

'యోగస్య ప్రథమంద్వారం వాఙ్నిరోధోఽపరిగ్రహః
నిరాశాచ నిరీహాచ నిత్యమేకాంత శీలతా'

(మౌనము, ఇతరులసొమ్ము పుచ్చుకొనమి, వాంఛలను వీడుట, యత్నము లుడుగుట, ఏకాంతవాసమందే ప్రీతి: ఇవి యోగాభ్యాస మొనర్పబూనువానికి ప్రథమద్వారములు.)

ఈ వివేకచూడామణి శ్లోకము నన్ను ప్రబల శక్తితో ఆకర్షించినది. అంతకుముందు నేను ఎక్కువగా మాట్లాడువాడను. ఈ శ్లోకము చదివినప్పుడు 'ఏమీ! యోగములోని ప్రథమ



ద్వారముననే నేను ప్రవేశింపలేదే'! అని తలచి నా వాక్కును అదుపులో నుంచుకొనవలెనను దీక్ష వహించితిని. ఇతరులతో మాట్లాడుట మాని, ఒంటరిగానుండుచు, నాకు మంచిదని తోచినట్లు ప్రవర్తింప నారంభించితిని. నవరాత్రములు తొమ్మిదినాళ్ళు ఒక్క పలుకైన ఉచ్చరింపలేదు.

నా జీవితవైఖరి నేర్పఱచినది శంకరుడు. శ్రీ గురుదేవుని దర్శనపూర్వము శంకరుని ప్రతి శ్లోకము నన్నొక మెట్టు ఎక్కించి కాంతి పూరము నొసగెడిది. ఆ దినములందు నాకా శ్లోకములలో క్రొత్త క్రొత్త యర్థములు స్ఫురించుచుండెను.

'పరిగ్రహము' (ఇతరులసొమ్ము పుచ్చుకొనుట) అనగానేమి? ఏ సొమ్మును పుచ్చుకొనకపోయినను 'పరిగ్రహము' ఉండవచ్చును. భవిష్యత్కాలమునకై ఏర్పాట్లు చేసికొనుటయు పరిగ్రహమే. జననమరణములన్నియు పరిగ్రహమువలననే కలుగును. భావికాలజీవిత

మున కిప్పుడే మన మేర్పాట్లు చేసికొను చుందుము. మన మనస్సు ఎచ్చట నుండునో అచ్చటనే మనముకూడా ఉండునది. పరిగ్రహ రహితులమైయున్నచో మన మనస్సెట నుండును? ఆశ్రయం లేదుకదా! అ పరిగ్రహసాధన మొక్కటియే మనలను మహోన్నతస్థితికి కొంపోగలదు.

పృథివ్యాం యానిభూతాని జిహ్వోపస్థ
నిమిత్తకం
జిహ్వోపస్థ పరిత్యాగే పృథివ్యాం కిం
ప్రయోజనమ్

(భూమిపైనుండు సర్వజీవులును జిహ్వా యొక్కయు కామముయొక్కయు కోరికలను తీర్చుకొనజూచును. ఈ కోరికలు విసర్జించిన వానికి ఈ ప్రపంచములో దేనితో నేమిపని.)

జిహ్వోపస్థలు జయింపబడినచో కష్టమంతయు తీరినట్లే. శ్రీ చైతన్యులవారు కేశవ భారతియొద్దకు సన్న్యాసాశ్రమార్థియై పోయి నప్పుడు, 'నీవు మంచి యౌవనములో నున్నావు. మిక్కిలి చక్కని వాడవుకూడ. నీ కెట్లు సన్న్యాసాశ్రమ దీక్షనీయ సాహసింతును'? అని అనెను.

చైతన్యులవారు ఆయన కిట్లు బదులుచెప్పిరి: 'మీరు సన్న్యాసార్థమై వచ్చినవారిని అందుల కర్హులా కారా అని పరీక్షింతురుగదా. నన్నట్లు పరీక్షించి నేనందుకు అర్హుడనని తోచిననే సన్న్యాసదీక్ష ప్రసాదింపుడు.'

కేశవభారతి 'నీ నాలుక చాపుము' అని శ్రీ చైతన్యుని అడిగెను. అతడట్లే చాపగా గురువు కొంచెము చక్కెరను ఆ నాలుకపై ఉంచెను. ఆ చక్కెర మొదటివలెనే ఏమాత్రము తడికాక పొడిగానే ఉండి, ఊదుట తోడనే అంతయు ఎగిరిపోయెను. అ పిదప కామమును పరీక్షించుటకే అవసరము లేకపోయెను.

తావజ్జితేంద్రియోనస్యాద్విజితాన్యేంద్రియః
పుమాన్
న జయేద్రసనం యావజ్జితం సర్వం జితేరసే

(జిహ్వను తప్ప తక్కిన ఇంద్రియము లన్నిటిని జయించినవానిని జితేంద్రియుడనరాదు. జిహ్వ జయింపబడినప్పుడు సర్వమును జయింపబడినట్లే)

జిహ్వాచాపల్యమే నిగ్రహింపబడినప్పుడు కామముకూడ జయింపబడినట్లే. ఇంద్రియములు అన్నియు జయింపబడినప్పుడుగాని ఆధ్యాత్మిక పురోగమనము సాధ్యముకాదు. భగవద్గీత యందంతటను ఈ విషయము పెక్కు తడవలు చెప్పబడియున్నది.

'తస్మాత్త్వ మింద్రియాణ్యాదౌ నియమ్య
భరతర్షభ
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞాన విజ్ఞాన
నాశనమ్'

(కావున అర్జునా! ఇంద్రియములను మొదట నియమింపుము. అందుచే కామమను దుష్ట భావమును నశింపజేయుదువు. ఇదియే జ్ఞానము నకును సిద్ధికిని వైరి)

ఒక్క ఇంద్రియము నిగ్రహింపబడకుండినను, తపస్సంతయు, సాధనలన్నియు, నిష్ప్రయోజనములగును. కుండలో ఒక్క చిల్లి యున్నచో నీరంతయు దానిలోనుండి కారి పోవునుగదా.

ఇంద్రియాణాం హి సర్వేషాం యద్యేకం
క్షరతీంద్రియం
తదస్య క్షరతి ప్రజ్ఞాం దృతేః పాత్రా
దివోదకమ్

(ఇంద్రియములలో నొక్కదానిని పాఱిపో నిచ్చినను, సాధకునియొక్క జ్ఞానముకు అది యొక్కటియే నశింప జేయును. పగులు చూపిన తోలుతిత్తియందు నీరు నిలుచునా?)

ఇంద్రియనిగ్రహము బలాత్కారముగా చేకూర్చుకొనుట సాధ్యముకాదు. భగవత్సాక్షాత్కారమును గాంచు మూలముననే దానిని పూర్ణముగా సాధించుకొనవచ్చును. కాని ఇందుకు ఎంతో ప్రయత్నము వలయును. ఆ పిదప అది స్వాభావికమగును.

ఐనను, ఈ విషయమున అంతిర్భయముగా నుండరాదు. బుద్ధిమంతుడగు వేటకాడు తాను పట్టుకొన్న జింకను బంధించి పదిలపఱచి యుంచునట్లు మానవుడు ఇంద్రియనిగ్రహము సాధించినపిమ్మట ఆ ఇంద్రియములను, మనస్సును, అదుపులో నుంచుటకు ఏమాత్రమును ఏమఱక ఎల్లప్పుడు కనిపెట్టి యుండవలెను.

## గ్రంథస్వీకారము

"కఠోపనిషత్" రహస్యము, వ్యాఖ్యాత: పూజ్యశ్రీ కృష్ణానందసరస్వతీ స్వాములవారు, మూల్యము 3-0-0, ప్రకాశకులు: దివ్యజీవన సంఘము, శివానందనగర్, టెహ్రీగఢ్‌వాల్ జిల్లా, హిమాచలములు (ఉ. ప్ర.)

శ్రీ సుందరకాండము (వచనము) గ్రంథకర్త: దైవజ్ఞరత్న, విద్యావిశారద దివాకరుని వేంకటసుబ్బారావు, వెల 12-0-0. ప్రచురణ: శ్రీ వేంకటేశ్వర జ్యోతిష గ్రంథమాల, 7-చక్రపాణి వీథి, వెస్టుమాంబళం, మద్రాసు-33.

కల్యాణవాణి, సంకలకర్త: పురాణపండ రాధాకృష్ణమూర్తి, వెల 3-0-0.

భాగవతమాహాత్మ్యము (పద్మపురాణము నుండి) ఆంధ్రవ్యాఖ్యాత: బ్రహ్మశ్రీ పురాణపండ రామమూర్తి, వెల 1-0-0.

గాయత్రీ రామాయణము, వ్యాఖ్యాత: పురాణపండ రాధాకృష్ణమూర్తి, వెల 1-0-0,

పై మూడు పుస్తకముల ప్రతులకు: పురాణపండ రాధాకృష్ణమూర్తి, ఆధ్యాత్మ ప్రచారక సంఘము, రాజమండ్రి-4.

బ్రహ్మవిద్య (తెలుగు కఠోపనిషత్తు) మఱియు స్మృతిమాధురి (భక్తికవితలు) రచయిత: శ్రీ కె. టి. యల్. నరసింహాచార్యులు, వెల 2-0-0, ప్రకాశకులు శ్రీ గోదా గ్రంథమాల, ముసునూరు, కృష్ణాజిల్లా.

శ్రీ సాయీ అనుసరణము, రచయిత: కీ. శే. బాపట్ల హనుమంతరావు, వెల 12-0-0, ప్రతులకు: బాపట్ల వేంకట పార్థసారథి, శ్రీ సాయీ నిలయమ్, చెరువు (పి. బి.) గుంటూరు జిల్లా (ఏ. పి.)

శ్రీ నృసింహోపాసనమ్, కవి: శ్రీ కేశవతీర్థస్వామి, మూల్యం 1-0-0, ప్రాప్తిస్థలం: శ్రీ రామతీర్థ సేవాశ్రమం, పిడుగురాల (పోస్టు) గుంటూరుజిల్లా, (ఆంధ్రప్రదేశ్.)

నిష్కామరామ శతకము (సీసపద్యములు) నిర్విషయానందకవి వెల 1-0-0, ప్రతులకు: శ్రీ సద్గురు సేవాశ్రమము, వంగలపూడిపోస్టు, రాజమండ్రితాలుకా, తూర్పుగోదావరిజిల్లా.

శ్రీరామకృష్ణ సహస్రనామ స్తోత్రమ్ (సహస్రనామార్చనా సహితమ్) (హిందీ) రచయితలు: అధ్యాపక్ భండార్‌కర్, ఎమ్. ఏ; అధ్యాపక్ శ్రీ పాంచు గోపాల వంద్యోపాధ్యాయ ఎమ్. ఏ; వెల, సాధారణప్రతి 8-50, మేలుప్రతి 10-00. ప్రకాశకులు: రామకృష్ణ శివానందఆశ్రమ, వారాసత్ పోస్టు 24 పరగణాలుజిల్లా.

# చిత్తశుద్ధి

అందమైన యొక స్త్రీని మనము చూచినపుడు జగన్మాతయగు దేవిని ధ్యానింపవలెను. మన యెదుటనున్న స్త్రీ జగన్మాతరూపములలో నొకతెయని జ్ఞప్తికి తెచ్చుకొని, "ప్రియమైన తల్లీ! నీవు మహాదేవి అవతారమూర్తివి. జగన్మాత యందముగా లేకుండ నితరముగా నుండ నగునా!" అనుచు ఆ తల్లి పాదములకు (మనసా) ప్రణమిల్లవలెను. మన మనస్సును పసిబిడ్డ మనస్సువలె మార్చుకొనవలెను. పసిబిడ్డ తన తల్లిని చూచినపుడు దానిమనసులో వేఱు తలంపు జనించునా? ఈ మార్గమునే శ్రీ రామకృష్ణుడు మొదటినుండియు ననుసరించెను. వివేకులు, విద్యావంతులు సైతము కామమునకు లోబడుదురు. ఈ యాపదనుండి తప్పించుకొనుటకు రామకృష్ణుడు మనకు చూపిన మంచి మార్గమిది.

స్త్రీ రూపమును మనము ద్వేషింపరాదు. స్త్రీలను మనము నిరసింపరాదు. ఆడువారు మోసము చేయువారని ఎన్నటికిని పలుకరాదు. తల్లిని ద్వేషింపవచ్చునా? ఆమెనుగూర్చి నిందావాక్యము లాడవచ్చునా? మన తల్లి మూర్తీభవించిన దేవియే. దేవి నీ తల్లి. ఆమె ప్రతిమనుజునకు తల్లి. ఆమె శక్తిస్వరూపిణి. ఆమె జగన్మాత. ఆమె సర్వవ్యాపిని అయిన పరబ్రహ్మమూర్తి. ఆమె సౌందర్యము, చిరునవ్వు మాతృమార్దవమును సూచించును. దేవికి ప్రణామము చేయుము. నీ కామము వీడును. రామకృష్ణభగవాను డుపదేశించిన ఈ మార్గము నాచరింపుము. నీ మనస్సు క్రమాధిక నిర్మలత్వమును బొందుచున్నదని నీకు తత్క్షణమే గోచరమగును.

చట్టి, గరిటె వంటచేసి వడ్డించుకొనుటకు పనికివచ్చునేగాని అవియే భోజనముగ నుపకరింపవుగదా! నీకవసరములగు వస్తువులజాబితా చదివినమాత్రమున అవి చేకూరవు. స్వయంకృషి లేని దే యుపదేశమువలన నెట్టి లాభము లేదు. భక్తిసాధనలవిశకు నీ మనస్సును మరలింపుము.

ఒక యందమైన నారీమణిని చూచినపుడు నీ మనస్సు చలించినచో అశోకవనములో నొక వృక్షముక్రింద తపస్సు చేసిన సీతాదేవిని తలచుకొనుము. నీవు రాక్షసకోటిలో చేరుదువా, లేక హనుమంతుని పాదములపైబడి నీలో దాగియుండు మనోదౌర్బల్యము నొప్పుకొని మాతయొక్క కృప నర్థింతువా? దేవి స్త్రీరూపమున నీముందర నిలబడి నీ నిర్మలభక్తిని కోరును. మూఢునివలె కామవికారమునకు లోబడకుము. అసత్యమునుజూచి సత్యమని భ్రమించి నాశమును తెచ్చుకొనకుము.

కీడు మేళ్లు రెండును మన మనస్సునందే పుట్టును. మనస్సునుండి జనించు తలంపులే బయట క్రియారూపమును దాల్చును. బాహ్యకర్మ యొక్కటే సర్వమనియు, నీ మనస్సునందేమి కలదో యది యితరులకు దెలియదనియు, నమ్మి నీ మనసు నొక బురదగుంటగా మారుచుండనీయకుము. ఊరబావిలో కల్మషము చేరినయెడల గ్రామములోని వారియందఱి యారోగ్యము నిశ్చయముగా చెడునట్లు నీ మనస్సు బురదగుంటగా మారినయెడల నీ జీవితములోని విశిష్టకర్మలన్నియు ఘోరపాపసమన్వితములగును.

ఒకానొకప్పు డిద్దఱు మిత్రులు కలాసాగా నొక వీధిలో తిరుగుచుండిరి. ఒక గృహములో పురాణ కాలక్షేపము జరుగుచుండ భక్తకోటి వినుచుండుటను చూచిరి. "రమ్మ, మనము

కూడపోయి ఆ కథ వినుదము'' అని తిరువేంగడ మనెను. ''హరికథ వినుట నాకిష్టములేదు. దానివలన నేమి ప్రయోజనము? కల్పిత కథలతో వారు తమకాలము వ్యర్థపఱచుకొనుచున్నారు. వేశ్యావాటిక యొకటిగలదు. మనమచటికిబోయి అక్కడ ఈ రాత్రి సుఖముగా గడపవచ్చును. మనకష్టము లెప్పుడును ఉండును. మనము ఒకరోజైన ఆహ్లాదముగ గడపరాదా?'' అని సాంబుడు బదులు చెప్పెను.

తిరువేంగడము సాంబునితో నేకీభవింపలేదు. ''నాకు దానితో నవసరములేదు. నీ కిష్టమున్న నీవు పొమ్ము. నే నిచట కూర్చుండి కథ వినియెద'' ననెను. అంతటితో వారొకరి నుండి మఱియొకరు వీడిపోయిరి. సాంబుడు వేశ్యల వీథికి వెళ్లెను. మతోపదేశములను విను వారిగోష్ఠిలో తిరువేంగడము కూర్చొనెను. భోగముదానియింటికిపోయిన సాంబునకు ఎందులకో సంతృప్తి లేకపోయెను. ''నేనిక్కడకు వచ్చి యేల చిక్కుకొంటిని? నేనుకూడ పురాణము వినుటకు వెళ్లియుండినయెడల బాగుండెడిదేమో'' అని విచారపడెను. అచట నలుగురు చీట్లపేకలాడుచు సంతోషముగా కబుర్లు చెప్పుకొనుచుండిరి. వారితో కలిసెను. కాని యతని మనస్సు అచటలేదు. హరికథ జరుగుచున్న స్థలమును తలపోయుచుండెను. ఇచట తిరువేంగడము పురాణము వినువారితోనున్నను అతని మనస్సుమాత్రము కథలో చొరలేదు. ఆ భాగవతుడు చక్కగా పాడలేడనియు, నతని గొంతు బొంగురు పోయినదనియు మాత్రము గమనించుచుండెను. కథ యతని నాకర్షింపలేదు. ''సాంబుడిపు డేమి చేయుచుండునో, అతడిపు డెంత సంతోషముగా నుండునో, నేను కూడ నతనితో వెళ్లియుండిన బాగుండెడిది.'' ఇట్లు తిరువేంగడము మనస్సంతయు సాంబుని మీదను, వేశ్యాగృహమున జరుగు 'జలసా' మీదను ఉండెను.

సాంబుడు వేశ్యాగృహముననున్నను అతని మనస్సు పురాణముజరుగు స్థలము మీదనే యుండెను. ''తిరువేంగడ మిప్పుడు ఎంత యానందముగ నుండునో! అతడు పుణ్యము సంపాదించుకొనుచుండగా నేనీ మూఢులమధ్య నున్నాను'' అని చింతించుచు రాత్రిని గడపెను.

నిజమునకు తిరువేంగడము భక్తులమధ్య నున్నను అతని మనస్సుమాత్రము నిర్మలినముగ లేకపోయెను. వేశ్యాగృహమునకుపోయిన పాప మతనిని చుట్టుకొనెను. వేశ్యాగృహమున నున్నను సాంబుని మనస్సు సత్సంగగోష్ఠిలో లగ్నమైనందున అతడు కొంతవఱకు పుణ్యము సంపాదించెను. భ్రష్టగృహమునకు బోయినను మనశ్శుద్ధివలన అతడు కీడును తప్పించుకొనగలిగెను.

(శ్రీరామకృష్ణ ఉపనిషత్తునుండి)

రైల్లో ప్రయాణం చేసేవాడు తన తలమీద బరువు దించుకోకపోతే ఆ తప్పెవరిది? ఆ బరువు దించుకుంటే అతడికి సుఖం. అతనితోబాటే అదీ గమ్యస్థానంచేరి తీరుతుంది. అలాగే ఈ ప్రపంచంలో ప్రయాణంచేసే మనం మన కర్తృత్వభారాన్ని నెత్తిన పెట్టకొని మోయరాదు. భగవంతునిమీదనే ఆ భారాన్ని వదలిపెట్టి కూర్చోవడం మంచిది. (రమణమహర్షి.)

# శ్రీ శ్యామనామ సంకీర్తనమః

1. సత్యసనాతన సుందర శ్యామ్
2. నిత్యానంద ఘనేశ్వర ,,
3 లక్ష్మీసేవిత పదయుగ ,,
4. సురమునివరగణ యాచిత ,,
5. భూభారోద్ధరణార్థిత ,,
6. లోకబంధు గురువాచక ,,
7. ధర్మస్థాపన శీలన ,,
8. స్వీకృతనరతను సురవర ,,
9. మాయాధీశ్వర చిన్మయ ,,
10. యాదవకుల సంభూషణ ,,
11. నందయశోదా పాలిత ,,
12. శ్రీవత్సాంకిత బాలక ,,
13. మారిత మాయాపూతన ,,
14. శకటాసుర ఖలఖండన ,,
15. దామోదర గుణమందిర ,,
16. యమలార్జున తరుభంజన ,,
17. గోపీజనగణ మోహన ,,
18. అగణితగుణగణభూషిత ,,
19. అఘబకరాక్షస ఘాతక ,,
20. కాళియసర్పవిమర్దన ,,
21. జయబృందావన చరవర ,,
22. గోచారణరత గోధర ,,
23. బర్హసుశోభిత చూడక ,
24. గళలంబిత వనమాలక ,,
25. అగ్రజ బలభద్రాన్విత ,,
26. గోపవధూ హృదయస్థిత ,,
27. సర్వాత్మక సర్వేశ్వర ,,
28. ధేనుక ఖరవధ కారక ,,
29. సురేంద్ర పూజనవారక ,,
30. పర్వతపూజన కారక ,,
31. సురజన ప్రార్థిత సగ్వ ,,
32. నిరుపమ క్రీడనతోషణ ,,
33. పదారాధక విధిహర ,,
34. గోపీభావిత ప్రియకర శ్యామ్
35. నందితనంద సునందన శ్యామ్
36. వైకుంఠేశ నరాకృతి ,,
37. కాళిందీ తటచారణ ,,
38. మోహన మురళీవాదన ,,
39. రాసమహోత్సవ ఖేలన ,,
40. ఆనందామృత వర్షణ ,,
41. బహువిధ శరీరధారణ ,,
42. నానాలీలా కౌతుక ,,
43. ధ్వజవజ్రాంకిత మృదుపద ,,
44. సమస్తలోకాహ్లాదక ,,
45. వృషభారిష్టనిపీడక ,,
46. విధిగతదర్పవినాశక ,,
47. రుచిరస్వరూప జనార్దన ,,
48. నీలకళేబర చిద్ఘన ,,
49. సాధకమతి సంశోధన ,,
50. లీలానటన మనోహర ,,
51. గోపీజనగణ పూజిత ,,
52. రాధావేణీ శోధక ,,
53. అక్రూరార్థిత శ్లేషన ,,
54. కృతరథయానారోహణ ,,
55. వ్రజనారీజల వారిత ,,
56. సఖిగణదాహవవిరహక ,,
57. మధురాపురజనమోహక ,,
58. సనకాదిముని చింతిత ,,
59. మత్తరజకగళమోటక ,,
60. శుభపీతాంబరధారక ,,
61. మాలాకార సుపూజిత ,,
62. బ్రహ్మాపూర్ణ పరాత్పర ,,
63. కుబ్జాలేపన నందిత ,,
64. వక్రాకృతి ఋజుకారక ,,
65. ఘాతిత గజమదలేపన ,,
66. కేశిక కంసనిఘాతన ,,
67. పద్మగదాధర కీర్తిత ,,
63. ఉగ్రసేనవర రాజ్యద శ్యామ్

69. రామకృష్ణహరి గిరిధర శ్యామ్
70. మాధవ కేశవ నరహరి
71. మృతగురుసూను సుజీవక ,,
72. భీమకబాలా కామిత ,,
73. ద్వారవతీ సంస్థాపక ,,
74. రుక్మిణ్యార్థ్య సుహారక ,,
75. నరకాసుర వధకారక ,,
76. అదితిసమర్పిత కుండల ,,
77. స్వధర్మ తత్పర మోక్షద ,,
78. శిశుపాల సుఘాతక ,,
79. బాణాసుర భుజఛేదన ,,
80. దానవవర మధుసూదన ,,
81. చక్రప్రతాప సుదర్శక ,,
82 పౌండ్రక దర్పవిమర్దక ,,
83. దగ్ధకామ జలదాయక ,,
84. ఇంద్రదిధీశ సుసేవిత ,,
85. సఖభక్తార్జున సారథి ,,
86. పాండవకుల సమ్మానిత ,,
87. గీతామృత సందోహక ,,
88. భీష్మప్రతిజ్ఞా పాలక ,,
89. విశ్వరూపసందర్శక ,,
90. ఆత్యంతిక సుఖసాధక ,,
91. భక్తకృపార్ణవ భర్గవ ,,
92. శరణాగత జనతారక ,,
93. భక్తకామ సంపూరక ,,
94. మంగళకరగతిదాయక ,,
95. విశ్వాశ్రయ జనపాలక ,,
96. ఐశ్వర్యాదిక షడ్గుణ ,,
97. సర్వచరాచర ధారణ ,,
98. పూర్ణచరాచర ఖేలన ,,
99. ద్వారవతీపుర ప్లావన ,,
100. కురుయదుకుల సంహారక ,,
101, బదరీ సంప్రహితోద్ధవ శ్యామ్
102. ప్రభాసగమనా మోహిత శ్యా
103. యోగస్థిత యదునందన ,,
104. సురగణవందిత మోహన ,,
105. దేవక్యాత్మజ దైవత ,,
106. మోహన నటనానందన ,,
107. నరతను త్యాగసుసూచిత ,,
108. జరలుబ్ధక శరవేధిత ,,
109. భక్తజనార్దన సుందర ,,
110. విశ్వసుమంగళ కారణ ,,
111. సత్యసనాతన సుందర
112. నిత్యానంద ఘనేశ్వర శ్యా

భజనము

త్రిగుణాతీత గుణేశ్వర శ్యామ్
రాధామాధవ రాధా ,,
సృష్టిస్థితిలయ కారణ ,,
రాధామాధవ రాధా ,,
గోవిందాచ్యుత యాదవ ,,
రాధామాధవ రాధా ,,
నారాయణ హరి కేశవ ,,
రాధామాధవ రాధా ,,
ముకుంద మురహర వామన ,,
రాధామాధన రాధా ,,
జయజయ గోపీవల్లభ ,,
రాధామాధవ రాధా ,,
అనుపమ సుందర మోహన ,,
రాధామాధవ రాధా ,,
అఖిల రసామృతసాగర ,,
రాధామాధవ రాధా ,,
సత్యసనాతన సుందర ,,
నిత్యానంద ఘనేశ్వర ,,
రాధామాధవ రాధా ,,
రాధామాధవ రాధా శ్యామ్



# శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004

## 1977 జూన్ నెల కార్యక్రమము

**ఆదివారములందు సత్సంగ సమావేశములు:**

సా. 4-00—4-20 వరకు శ్రీవిష్ణుసహస్రనామ పారాయణము (5-6-77, 19-6-77)
శ్రీలలితా సహస్రనామ పారాయణము (12-6-77, 26-6-77)

4-20—4-30 ,, ధ్యానము.

4-30—5-30 ,, ఉపన్యాసము (తమిళము)
శ్రీ దక్షిణామూర్తి స్తోత్రము: డా. టి. ఎమ్. పి. మహాదేవన్ (12-6-77)
శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రము: శ్రీ వి. ఆర్. కళ్యాణసుందరశాస్త్రి - (19-6-77)
శ్రీమద్భాగవతము: శ్రీ అణ్ణా (5-6-77)
శ్రీమద్రామాయణము: శ్రీ విశ్వనాథన్ (26-6-77)

5-35—6-30 ఉపన్యాసము (ఆంగ్లము)
శ్రీమద్భగవద్గీత: శ్రీమత్ తపస్యానందస్వామి

6-30—8-00 ఆరాత్రికము, భజన.

**ప్రత్యేకోపన్యాసములు:** శనివారములందు సాయంకాలము 6-45 గంటలకు.
శ్రీమద్రామాయణ వచనము: శ్రీ పి. రామకృష్ణన్, ఐ.సి.ఎస్. (రిటైర్డు) (4-6-77)
గజేంద్రమోక్షము: శ్రీ ఆర్. కోదండరామన్, (11-6-77)

**ఇతర వారములందు ఉపన్యాసములు:** సాయంకాలము 6-45 గంటలకు.

సోమవారములు: శ్రీరామకృష్ణ కథామృతము: శ్రీమత్ అమృతానందస్వామి (ఆంగ్లము)
మంగళవారములు: అధ్యాత్మరామాయణము: శ్రీమత్ గభీరానందస్వామి (ఆంగ్లము)
బుధవారములు: శ్రీమద్భాగవతము: శ్రీమత్ గోలోకానందస్వామి (ఆంగ్లము)
గురువారములు: శ్రీ విరంజనచైతన్య రామకృష్ణదేవుని ఉపదేశములు (తమిళము)
శుక్రవారములు: శ్రీ మహాభారతము: శ్రీ 'అణ్ణా' ఎస్. సుబ్రమణియన్ (తమిళము)

**తదితరములు:** 19-6-77 అంతర్యోగము. ఏకాదశి దినములందు (12-6-77, 27-6-77) సాయంకాలము రామనామభజన (ఆంత్రికానంతరము)

శుక్రవారములందు సాయంకాలము 6-30 గంటలకు తిరువల్లిక్కేణి 18. దక్షిణ మాడవీథిలో శ్రీరామకృష్ణ మందిరమున
శ్రీ గోలోకానందస్వామివారి గీతోపన్యాసములు, (ఆంగ్లము)

ఈ కార్యక్రమములకు అందరిని సాదరముగా ఆహ్వానించుచున్నాము.

అధ్యక్షులు,
శ్రీరామకృష్ణమఠము, మద్రాసు-600004.

# మా తెలుగు ప్రచురణలు

| శ్రీ రామకృష్ణులపై : | రూ. పై. |
|---|---|
| శ్రీ రామకృష్ణ కథామృతము | 8–00 |
| ,, (క్యాలికో) | 12–00 |
| శ్రీ రామకృష్ణ జీవిత చరిత్ర | 10–00 |
| ,, (క్యాలికో) | 14–00 |
| శ్రీ రామకృష్ణ బోధామృతము | 8–00 |
| ,, (క్యాలికో) | 15–00 |
| శ్రీరామకృష్ణోపనిషత్తు | 3–75 |
| శ్రీ రామకృష్ణ పరమహంస నీతికథారత్నములు | 2–50 |
| గురూపదేశములు | 2–00 |
| శ్రీ రామకృష్ణ పరమహంస జీవిత సంగ్రహము | 0–75 |
| నా గురుదేవుడు | 1–25 |
| శ్రీ రామకృష్ణ దివ్యవాణి | 1–50 |
| **శ్రీ శారదాదేవిపై :** | |
| శ్రీ శారదా దేవి జీవిత చరిత్ర | 4–00 |
| శ్రీ శారదా ప్రసంగములు | 3–00 |
| శ్రీ శారదా దేవి | 2–50 |
| **శ్రీ వివేకానందస్వామిపై :** | |
| శ్రీ వివేకానంద జీవిత చరిత్ర | 4–00 |
| బాలల వివేకానందుడు | 2–00 |
| శ్రీ వివేకానంద సంపూర్ణ గ్రంథావళి 10 సంపుటముల సెట్టు (సాదా) | 65–00 |
| ,, క్యాలికో | 73–50 |
| విడి సంపుటములు ఒక్కొక్కటిసాదా | 5–00 |
| క్యాలికో | 6–50 |
| సందేశ తరంగిణి (మొదటి భాగము) | 4–00 |
| ,, (రెండవ భాగము) | 5–50 |
| జ్ఞానయోగము (ముద్రణలో) | |

| | రూ. పై. |
|---|---|
| భక్తియోగము | 4–00 |
| రాజయోగము | 6–25 |
| కర్మయోగము | 4–00 |
| వివేక సూర్యోదయము | 4–00 |
| యువకులకు వివేకానందుల పిలుపు | 0–75 |
| శ్రీ వివేకానంద సింహగర్జనము | 0–20 |
| సర్వం విష్ణుమయం జగత్ | 0–35 |
| భారత యువజనులారా! | 3–00 |
| ప్రబోధ రత్నాకరము | 2–50 |
| శ్రీ వివేకానంద లేఖావళి (మొదటి భాగము) | 2–25 |
| ,, (రెండవ భాగము ముద్రణలో) | |
| హిందూ మతము | 4–00 |
| అనుష్ఠాన వేదాంతము | 2–50 |
| ప్రాచ్యము, పాశ్చాత్యము | 1–25 |
| షికాగో నగరోపన్యాసములు | 1–00 |
| కులము, సంస్కృతి, సామ్యవాదము | 3–00 |
| భారత దేశము | 2–00 |
| భారతీయ మహిళ | 2–00 |
| నా సంస్కరణ యుద్ధ విధానము (ముద్రణలో) | |
| నవీన భారత దేశము | 0–40 |
| పవహారి బాబా (ముద్రణలో) | |
| నా జీవితము, జీవిత కార్యము | 1–25 |
| గురు, శిష్య సంవాదములు (ముద్రణలో) | |
| **శ్రీమద్భగవద్గీత :** | |
| శ్రీమద్భగవద్గీత (టీకాతాత్పర్య విశేషార్థసహితము) | 9–00 |
| పారాయణగీత తాత్పర్యసహితము | 3–75 |
| మూలము | 2–00 |

| | రూ. పై. |
|---|---|
| **దివ్యవాణి గ్రంథమాల:** | |
| శ్రీ రామకృష్ణ ఉవాచ | 0–80 |
| శ్రీ శారదాసూక్తి నవనీతము | 0–80 |
| శ్రీ వివేకానంద శంఖారావము | 0–80 |
| శ్రీ కృష్ణవాణి | 0–80 |
| బుద్ధ ఉవాచ | 0–80 |
| క్రైస్తు సూక్తిమాల | 0–80 |
| మహమ్మదు సూక్తి మంజరి | 0–80 |
| **ఇతర ప్రచురణలు:** | |
| ముక్తిమార్గము | 0–30 |
| ఆరాత్రికము మరియు శ్రీరామనామ సంకీర్తనము | 0–50 |

| | రూ. పై. |
|---|---|
| **శ్రీరామకృష్ణ సేవాసంస్థ:** | |
| తదాదర్శములు | 0–50 |
| తాపత్రయ చికిత్స | 0–60 |
| పారమార్థిక సంభాషణలు | 6–50 |
| ఆధ్యాత్మిక జీవనము | 0–40 |
| నారద భక్తి సూత్రములు | 4–00 |
| కఠోపనిషత్తు | 2–00 |
| శ్రీ దొడ్డ భాగవతము (మూడవ సంపుటము) | 7–50 |
| దేవీమాహాత్మ్యము | 4–00 |
| పరతత్త్వ ప్రసంగములు (ముద్రణలో) | |
| గిరీశచంద్ర | 1–00 |
| భక్తిమార్గము | 1–00 |
| బ్రహ్మానంద బోధనలు | 4–75 |

ఇదియేకాక, ఆంగ్ల, సంస్కృత, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములును, వేదాంత కేసరి (ఆంగ్లము), శ్రీరామకృష్ణ విజయము (తమిళము), శ్రీరామకృష్ణప్రభ (తెలుగు) అను మాస పత్రికలును, శ్రీరామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి మున్నగు వారి ఛాయా చిత్రములు, త్రివర్ణ చిత్రములు, తైల చిత్రములు మున్నగున వెన్నియో మావద్ద లభింపగలవు.

## శ్రీరామకృష్ణ పరమహంస నీతికథారత్నములు

అనువాదకులు:

శ్రీ చిరంతనానందస్వామి

మనోహరములు చమత్కారములు తత్త్వార్థబోధకములు అగు శ్రీరామకృష్ణుల కథలలో విశిష్టమగువాని నెన్నుకొని విషయానుగుణముగ విభజించి యనువదించిరి. హృద్యమగు శైలి.

పుటలు: 84+VI వెల: రూ. 2–50

నాలుగవ ముద్రణము

## తాపత్రయ చికిత్స

శ్రీ రామకృష్ణానందస్వామి

జిజ్ఞాసువులకు భక్తులకు ఆర్తులకు శ్రీ స్వామివారు అమృతవర్షము వంటి యుత్తరములు వ్రాసి యుండిరి. వాని యందలి విశేషాంశముల సంపుటీకరణమే తాపత్రయ చికిత్స. ప్రపంచము నందలి తాపత్రయ సంతప్తులకు ఈ చిన్ని పాత్రము శాంతి ప్రదమగుట నిస్సంశయము.

పుటలు: 64+VIII వెల: రూ. 0–60

మూడవ ముద్రణము

# let your money grow more than 7 times




**A Cash Certificate of Rs. 1000.00 will yield Rs. 7328.07 in 20 years.**

Plan ahead for future needs and invest in UBI Cash Certificates. Watch how your money grows !

You can buy UBI Cash Certificates in denominations of Rs. 100.00 or its multiples for a fixed period—7, 10, 15 or 20 years. On maturity, you will get back a lump sum amount which may be more than seven times of your initial deposit.

Choose the amount and term you think suit you best. Buy a UBI Cash Certificate today.

A few examples

| Issue Price (Rs.) | Encashment value after | | | |
|---|---|---|---|---|
| | 7 years | 10 years | 15 years | 20 years |
| 100 | 200.79 | 270.70 | 445 39 | 732.81 |
| 500 | 1003.96 | 1353 52 | 2226 95 | 3664 04 |
| 700 | 1405 54 | 1894 93 | 3117.74 | 5129.65 |
| 1000 | 2007 92 | 2707 04 | 4453 92 | 7328 07 |
| 5000 | 10039 60 | 13535.21 | 22269 60 | 36640.37 |
| 10000 | 20079 20 | 27070 41 | 44539 19 | 73280 73 |

***For details, come to your nearest UBI branch***



**United Bank of India**

సంపాదకులు: శ్రీ చిద్ఘనానందస్వామి.
శ్రీ ఎమ్. బాలసుందరం గారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-600021) న ముద్రింపబడి,
శ్రీ చిద్ఘనానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మద్రాసు-600004) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము 34 | 1977 - జూన్ : పింగళ - జ్యేష్ఠము | సంచిక 6

## విషయ సూచిక

## బ్రహ్మానందబోధనలు

(ఆధ్యాత్మిక పరిప్రశ్నములు)

శ్రీ చిరంతనానందస్వామి

బ్రహ్మానందబోధనలు (శ్రీ బ్రహ్మానంద స్వామి జీవితోపదేశములు) అను గ్రంథము నుండి బ్రహ్మానందవాణి యను పేర ఇందు ఉపదేశములు మాత్రము సంగ్రహింప బడినవి. పాఠకుల సౌకర్యార్థము స్వామి సంగ్రహ చరిత్రయు చేర్పబడినది. స్వామి యుపదేశములు ఆధ్యాత్మికతత్త్వములను సాధనయందలి రహస్యములను అరటి పండొలిచి ఇచ్చినట్లు విశదీకరించును.

పుటలు: 272 + XXI వెల: రూ. 4-75

(ప్రథమ ముద్రణము)

## భక్తియోగము

అనువాదకులు:

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఆధునికుల చిత్తము నాకర్షించురీతిని, అమోఘవచనములతో, విమర్శకదృష్టితో శాస్త్రప్రమాణములతో భక్తితత్త్వమును శ్రీ వివేకానందస్వాములవా రిందు విపులముగా ప్రదర్శించి యున్నారు. మూల గ్రంథములలోని ప్రమాణవచనములును వానికి టిప్పణములును సులభశైలియందు వ్రాయబడి యున్నవి.

(ఏడవ కూర్పు)

(121+4 పుటలు) వెల: రూ. 4-00

## కర్మయోగము

అనువాదకులు:

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు శ్రీ స్వాములవారు కర్మయోగ తత్త్వమును అరటిపం డొలిచినట్లు విశదీకరించియున్నారు. కర్మమెటుల మోక్ష సాధనమో స్పష్టీకరించియున్నారు.

(అష్టమ ముద్రణము)

(146+8) పుటలు వెల: రూ. 4-00

## గురూపదేశములు

అనువాదకులు:

శ్రీ చిరంతనానందస్వామి

శ్రీ గురుదేవుని మానసపుత్రు డనబర గిన శ్రీ బ్రహ్మానందస్వామి గురుముఖము నుండి వచ్చిన యుపదేశములను యథాతథముగ గ్రహించి వానియందు ముఖ్యములగు వానిని సంగ్రహించి యాంగ్లమున రచించిరి. వాని యనువాదమే ఈ గ్రంథము. ఇందు గృహస్థులకు సాధకులకు వలయు సూక్తు లెన్నియో వివరింపబడియున్నవి.

పుటలు: 168 వెల: రూ. 2-00

తొమ్మిదవ ముద్రణము

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004.

# PRABUDDHA BHARATA or AWAKENED INDIA

**A Monthly Organ of the Ramakrishna Order**

Started by: SWAMI VIVEKANANDA in 1896

Conducted by the monks of the Ramakrishna Order at Advaita Ashrama, Mayavathi, Pithoragarh, Himalayas, it is dedicated to the propagation of Universal Religion, Comparative Philosophy, Education, Art and other topics of international interest.

*The year begins from January. Subscribers are enlisted all through the year but with effect from* **January** *or* **July.**

**Annual Subscription: Rs. 10**

**Life Subscription (30 years)—India: Rs. 180**

*A Concession of 5% on Advaita Ashrama publications will be allowed to subscribers of Prabuddha Bharata. This will not be in addition to any other concession.*

*Manager :*

**PRABUDDHA BHARATA**

5 Dehi Entally Road, Calcutta 700-014.

---

## మనవి

1. శ్రీరామకృష్ణప్రభ సంపుటం ప్రతి ఏటా జనవరినుంచి ప్రారంభమౌతుంది. ఏమాసం నుండి అయినా చందాదారులు కావచ్చు.

2. చందాపైకం మనియార్డరు ద్వారాగాని క్రాస్డ్ పోస్టల్ ఆర్డర్, క్రాస్డ్ బ్యాంకుడ్రాఫ్టుల ద్వారాగాని ('శ్రీరామకృష్ణ మఠము, మద్రాసు' అను పేరిట) పంపవచ్చును. మనియార్డరు కూపనులో అడ్రసు వివరాలు సరిగా వ్రాయాలి.

3. చందాదారులు ఉత్తర ప్రత్యుత్తరాలలో తమ చందాదారు సంఖ్యను ఉదాహరిస్తూ విలాసం స్పష్టంగా వ్రాయాలి.

4 మూడు నెలలకు మించిన అడ్రసు మార్పిడి ఆ ముందటి నెల మొదటి వారంలోగా తెలియజేయాలి.

5. సంచిక సాధారణంగా నెల ఆఖరి వారంలో అందుతుంది. అందకపోతే మరుసటి నెల మొదటి వారంలోగా తెలపాలి.

6. చందాదారులకు మా ప్రచురణలపై వెలలో 5% తగ్గింపు ఉంటుంది.

**వివరాలకు :**

మేనేజర్ : శ్రీరామకృష్ణప్రభ, P. B. 635

మైలాపూర్, మద్రాసు-4.



ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్యవరాన్నిబోధత.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము 34 | 1977 – జూన్ : : పింగళ – జ్యేష్ఠము సంచిక 6

## ప్రార్థన

మధువాతా ఋతాయతే మధు క్షరన్తి సిన్ధవః
మాధ్వీర్నః సన్త్వోషధీః ॥
మధునక్తముతోషసి మధుమత్పార్థివం రజః
మధు ద్యౌరస్తు నః పితా ॥
మధుమాన్నో వనస్పతి ర్మధుమాఁ అస్తు సూర్యః
మాధ్వీర్గావో భవన్తు నః ॥

వాయువులు సుఖముగా వీచునుగాక. నదులు మధురజలములను స్రవించునుగాక. ఓషధులు మాకు మధురములుగా ఉండునుగాక! రాత్రులు, దినములు, సంధ్యలు ప్రీతికరము లగునుగాక! పృథివీపరాగము సుఖమును కలిగించునుగాక! తండ్రియైన ద్యులోకము మమ్ము అనుగ్రహించునుగాక! వృక్షగుల్మలతాదులు మాకు తియ్యనిఫలములను, సుగంధి పుష్పములను ఒసగునుగాక! సూర్యభగవానుడు సుఖకరుడగునుగాక! దిక్కులు మాకు అనుకూలములై ఉండునుగాక! ——ఋగ్వేదసంహిత.

యజ్ఞేశాచ్యుత గోవింద మాధవానంత కేశవ
కృష్ణ విష్ణో హృషీకేశ వాసుదేవ నమోఽస్తుతే.

—విష్ణుపురాణము.



# వివేకానందవాణి

ప్రపంచమంతయు మరణముదెసకే సాగుచున్నది. ప్రతిదీ మరణించునదే. మన అభివృద్ధి, మన అహంకారము, మన సంస్కరణములు, మన భోగములు, మన సంపద, మన జ్ఞానము: అన్నిటికీ గమ్యమొక్కటే – మరణము. ఏది తప్పినను అది తప్పదు. నగరములు పొడసూపును. అడుగంటును; సామ్రాజ్యములు మింటికెగయును, మంటకూలును; గ్రహమండలములు విచ్ఛిన్నములై, ధూళిపాలై, ఇతర మండల వాతావరణములో తేలియాడును. ఆదిమకాలమునుండియు కథ ఇట్లే నడచుచున్నది. మరణమే అన్నిటికిని అంతము. జీవితమునకు, సౌందర్యమునకు, సంపదకు, అధికారపదవికి, అన్నిటికి — సౌశీల్యమునకు కూడ – మరణమే అంతము. పుణ్యపురుషులు, పాపపురుషులు, ప్రభువులు, బిచ్చగాండ్రు: అందఱు మృతినొందువారే. సర్వము పయనించునది మరణము వైపునకే. కాని ప్రాణములపై ఎంతతీపి! ఎట్లో జీవమును అంటిపట్టుకొని ఉందుము. ఎందుకో, మనకే తెలియదు. ఆ పట్టు వదలుట మనకు అసాధ్యము. ఇదియే మాయ.

మానవుని ఆత్మను అతని ఇంద్రియములు బలాత్కారముగా బయటికి లాగుచున్నవి. సుఖము, ఆనందము లేనిచోట అతడు వానికై వెదకులాడుచున్నాడు. ఇది వెఱ్ఱి, ఇది నిరర్థకము, సుఖమిచటలేదు, అని యుగయుగములుగా మనము వినుచున్నాము, కాని ఆ పాఠము మన మనస్సులకెక్కదు. మంటలోనికి దుముకు రెక్కల పురుగులవలె మాటిమాటికి మన మీ ఇంద్రియభోగములలోనికి దుముకుచున్నాము. సంతుష్టి లభించును అను ఆశ నశింపదు, నూత్నోత్సాహముతో మరల మరల యత్నించుచుందుము. మాటి మాటి



కిట్లు మోసపోయి, జవసత్త్వములు ఉడిగి మరణింతుము. ఇదియే మాయ.

జగద్రహస్యములను తెలిసికోవలెనని మన వాంఛ. వానిని గూర్చిన విచారమెప్పటికిని మానజాలము. అవి తెలిసి తీఱుననుకొందుము. తెలియకపోవునని నమ్మనేరము. కాని కొన్ని అడుగులు సాగుటతోడనే, కాలము అను ఆద్యంతరహితమగు గోడ అడ్డు తగులును. అది దాట శక్యముకానిది. మఱికొన్ని అడుగులు సాగినచో, అనంతాకాశము అను మఱియొక గోడ ఎదుర్కొనును. అదియు దాట శక్యము కానిదే. ఇవంతయు కార్యకారణములు అను గోడలలోపల చిక్కుపడియుండును. వీనిని దాటి మనము పోజాలము. కాని ప్రయత్నములు మానము. మానుట మనకు తగముకాదు. ఇదియే మాయ.

తనబిడ్డ అత్యద్భుత ప్రతిభా సంపన్నుడై జన్మించెనని, అంత లోకోత్తరశిశు వెన్నడును పుట్టలేదని ప్రతి తల్లియు తలంచును. ఆమె ఆత్మఅంతయు ఆ బిడ్డయందే మగ్నమైయుండును. వాడు పెరిగి పెదవాడై, త్రాగుడు

మరగి, మృగప్రాయుడై ఆమెను హింసింప వచ్చును. కాని వాడు హింసించుకొలది ఆమె ప్రేమ అధికమగుచుండును. అది అస్వార్థమగు మాతృప్రేమ అని లోకము ప్రశంసించును. కాని నిజమునకు ఆమె ఆ జన్మదాసి. ఆదాస్యమునుండి తప్పించుకొనుట ఆమెకు అశక్యము. వేయిమాఱులాభారము నామె వదల్చుకొన గోరును, కాని అది అసాధ్యము. ఇందుకు కారణమేమి అని ఎప్పుడైన విచారించుకొన్నచో, ప్రేమ అను ఆశయమును కల్పించుకొని తృప్తినొందును. కాని నిజమునకది ప్రేమకాదు. ఆమెబుద్ధి నేదియో ఆవరించి లొంగదీసి కొనినది. ఎంత యత్నించినను దాని నామె విదిర్చివేయజాలదు. ఇదియే మాయ.

మృత్యుదేవత మన భూలోకమున రేయుంబవళ్ళు వికట తాండవమాడుచున్నది. కాని ఎప్పటికిని బ్రతికి యుందుమనియే మనము నమ్మికొని యుందుము. "లోకమున అత్యంత విచిత్రమగు విషయమేది?" అని ధర్మరాజొకసారి ప్రశ్నింప బడెను. "అనుదినము జనులు మనచుట్టును మరణించు చున్నారు; కాని తాము మరణింపమని జనులు తలంచుచుందురు" అని ఆయన బదులుచెప్పెను. ఇదియే మాయ.

అన్నిటికిని కాలము తీఱును. కాల మన్నిటిని శిక్షించును. ఏదియు దానిని ప్రతిఘటింప జాలదు. పుణ్యాత్ములను, పాపాత్ములను, భూపులను, కాపులను, సురూపులను, కురూపులను; అందఱిని అది మ్రింగివేయును. ఎవ్వరిని విడువదు. దానిదెసకే సర్వము పర్వులిడుచున్నది: మన జ్ఞానము, మన కళలు, మన శాస్త్రములు – సర్వమును. ఆ మహా ప్రవాహమును ఎవ్వరును అరికట్టజాలరు; ఒక క్షణమాత్రము ఆపలేరుకూడ. విషూచ్యాది క్రూర వ్యాధులు గ్రామములపైబడి జనులను చంపుచుండగా ఆ ఘోరదృశ్యమును చూడజాలని వారు త్రాగుట, ఆవేశముతో చిందులు త్రొక్కుట, ఇత్యాదులచే స్మృతితప్పి మొద్దువాఱి పోవునట్లు, మనమును సర్వ విధములగు ఇంద్రియ భోగములలో బడి ఈ అనివార్య వినాశ కారియగు కాలమును మఱవజూతుము. ఇదియే మాయ.

తనకు మాయను చూపుమని నారదు డొకసారి శ్రీకృష్ణుని ప్రార్థించెను. కొన్నాళ్ళపిదప శ్రీకృష్ణుడొక ఎడారికిపోవుచు, నారదుని తనవెంట రమ్మనెను. కొన్ని మైళ్ళు నడిచిన పిదప "నాకు దప్పియగుచున్నది. కొంచెము నీరు తెమ్ము" అని నారదు నడిగెను. తెచ్చుటకతడు బయదేరెను.

చెంతనున్న యొక పల్లెకుపోయి నీటికొఱకొక యింటితలుపు తట్టెను. జగన్మోహనాంగి యగు నొక యువతి తలుపు తెఱచెను. ఆమెను చూచుటతోడనే తన ప్రభువు దప్పిగొని నీటికై వేచియున్నమాటనే మఱచి, నారదు డా సుందరితో సల్లాపములాడుచు కూర్చుండెను. ఆ దినమంతయు తన ప్రభునియొద్దకు పోలేదు. మఱునాడుకూడ సరససల్లాపములందే కాలము గడపెను. ఈ ఇష్టాగోష్ఠులు సాగుకొలది వారికి పరస్పరము ప్రేమ అధికమై వివాహము చేసికొనిరి. బిడ్డలను గనిరి.

పండ్రెండేండ్లు గడచినవి. నారదుని మామ మరణించెను. ఆస్తిఅంతయు వారికి సంక్రమించెను. భార్య, బిడ్డలు, భూములు, పశువులు, మున్నగాగల సకల సంపదననుభవించుచు, నారదుడు మిక్కిలి సుఖజీవనము చేయుచున్నాననుకొనెను

ఇట్లుండగా చేరువనున్న యేఱు ఒకటి పొంగి మహాప్రవాహమై, గ్రామమును ముంచి వైచెను. ఇండ్లు కూలినవి. ప్రవాహము మానవులను, పశువులను, కొట్టుకొనిపోయి ముంచివేసెను. నారదుడు ప్రాణములు దక్కించుకొనుటకై పాఱిపోవలసివచ్చెను. భార్య నొకచేత, ఇరువురు బిడ్డల నొకచేత పట్టుకొని, భుజముపై నొకబిడ్డ నెక్కించుకొని, అతడా మహాప్రవాహమును దాటుచుండెను.

కాని ఆ ప్రవాహపు ఉరవడి కాగక, పట్టు తప్పి, భుజముమీది బిడ్డ జాఱిపడి కొట్టుకొనిపోయెను. నిరాశాగ్రస్తుడై నారదుడు విలపించెను. ఆ బిడ్డను కాపాడుకొనుయత్నములో నుండగా చేతనున్న బిడ్డలు జాఱిపోయిరి. చివరకు భార్యకూడ, యావచ్ఛక్తితో పట్టుకొని యున్నను, ఆగక ప్రవాహమువాత బడి పోయెను.

నారదుడు గట్టుపైపడి తీవ్ర శోకావేశ పరవశుడై ఏడ్చుచు, మొత్తుకొనుచుండెను. వెనుకనుండి మృదుస్వరమున "నారదా, ఏవీ నీళ్ళు? నీళ్ళు తెచ్చెదనని వెళ్ళితివి. నీ రాకకై నిరీక్షించుచున్నాను. అఱగంట దాటినది" అను మాటలు వినవచ్చెను. "అఱగంటయేనా?" అని నారదు డాశ్చర్యముతో పల్కెను. అతని మానసమున పండ్రెండేండ్లు గడచినవి. కాని ఆ చరిత్రమంతయు జరిగినది అఱగంటలోనే! ఇదియే మాయ.

ఈ మాయ ఏదో ఒక రూపమున మనల నందఱిని ఆవరించుకొని యున్నది. ఇది గ్రహించుటకు శక్యముకాని ఘోరస్థితి. ఎంత బోధించినను దీనిని నమ్మువారు అరుదు. అన్ని దేశములలోను ఇంతే. స్వానుభవముచేత కనుగొన్నగాని, మానవులది నమ్మజాలరు.

(శ్రీ వివేకానంద సంపూర్ణ గ్రంథావళి. సం. 4 నుండి)

భగవంతుని ప్రశాసనమువలననే భూమ్యాది సకలలోకములు తమ తమ పరిధులను అతిక్రమించక నిలిచియున్నవి. భగవంతుని శాసనమువలననే సూర్యచంద్రులు నియమిత దేశకాలములందు ప్రకాశించుచున్నారు. భగవంతుని ఆజ్ఞవలననే హిమాలయాది పర్వతములనుండి ప్రవహించు నదులు కొన్ని పశ్చిమసముద్రమును చేరుచున్నవి. కొన్ని తూర్పుసముద్రమును చేరుచున్నవి. భగవంతుని శాసనమువలననే కాలచక్రము నియమముగా తిరుగుచున్నది. భగవంతుని శాసనమువలననే సాగరములు చెలియలికట్టను అతిక్రమించుటకు సాహసింపక యున్నవి. భగవంతుని శాసనమువలననే ఆయా కాలములందు ఆయా కర్తలకు చెందవలసిన ఆయా కర్మఫలములు నియతముగా చెందుచున్నవి.

సుమతీ! రాముడు నిర్వికారము సదా శుద్ధంబు బుద్ధంబు అచిం
త్యము అవాచ్యంబు అతులంబు అతీంద్రియము సత్తామాత్రమున్ స్వప్రకా
శము నిర్ద్వంద్వము నిర్వికల్పము అజమున్ సచ్చిదానంద రూ
పము అమూర్తంబు అజరంబు కేవల పరబ్రహ్మంబు చింతింపగన్.

—శ్రీ సీతారామాంజనేయ సంవాదము.

# కర్కటికకథ

(జ్ఞానవాసిష్ఠములోని ఒక కథాసంగ్రహము)

సూరి నాగమ్మ

కర్కటియను ఒక రాక్షసి కాటుకకొండతో పోలదగు ప్రతిమయా? అన్నట్లు నల్లని వర్ణము గలదై భీకరాకారముతో హిమవత్పర్వత ఉత్తరభాగమందు నివసిస్తూ ఉండినది. అది మనుష్యులను భక్షించేది కావటంవల్ల ఆ యాహారం సంపాదించుకోవడం చాలా కష్టమయి దాని జఠరాగ్ని బడబాగ్నివలె ఎంతకూ తృప్తిపడలేదు. అందువల్ల అది ఒకనాడు చాలాసేపు విచారించి "ప్రజలందరినీ ఒక్కసారి మ్రింగితే తృప్తి కలుగునేమో. అందుకు తగిన శక్తి తపస్సువల్లగాని కలుగదు' అని నిశ్చయించుకున్నది.

అట్లు నిశ్చయించి ఎవరికీ ప్రవేశింపరాని ఒక పర్వతంమీదకుపోయి, ఒక్క కాలిమీదనే నిలిచి రాతిబొమ్మవలె చలన రహితయై వుండగా వేయేండ్లు గడచినవి. అప్పుడామెకు వరాలిచ్చేందుకై బ్రహ్మదేవు డక్కడకు వచ్చాడు. ఆమె మనస్సులోనే ఆ బ్రహ్మకు నమస్కరించి "నేను ఏవరం కోరితే నా ఆకలి తీరుతుంది?" అని ఆలోచించి నిర్ణయించుకొని ఆ బ్రహ్మదేవునితో ఇట్లాగన్నది. "ఓ బ్రహ్మదేవా! నేను బ్రతికివున్న ఒక సూదిని కావలెను. ఈ వరంవల్ల సర్వజంతువుల హృదయాలలో ప్రవేశించి వాటిని చంపి ఆకలి తీర్చుకుంటాను. ఆకలి తీరటంకంటె సుఖం ఏమున్నది!" అని అంటూవుండగానే బ్రహ్మ "ఓ కర్కటీ! నీ తపస్సుకు మెచ్చితివి, నీ వడిగిన వరమిచ్చితిని. నీవు కేవలం సూచికవు (సూదివి) కావు. షూచికవు. (ఇకనియే కలరా.) శాస్త్రవిరుద్ధమైన ఆహారం తినేవారిని, దుర్మార్గాను వర్తులనూ అపరిశుద్ధ ప్రదేశములందు నివసించువారినీ హింసింతువు. నాసికారంధ్రముల ద్వారా పీల్చబడి లోనికి ప్రవేశింతువు. వాత వ్యాధి రూపముగల దానవై యుందువు. గుణవంతులైనవారు వాసిష్ఠమందు చెప్పివున్న మంత్రమును జపించినచో నీవు వారిని బాధింపక విడచిపొమ్ము" అని ఆజ్ఞాపించి బ్రహ్మదేవుడు అంతర్ధానమాయెను.

తత్క్షణమే ఆ కర్కటి క్రమంగా తగ్గి తగ్గి సన్నని సూదిఅయింది. కేవల వాతరూపం గలదియై ఎక్కువ స్థూలంగాగాని, కృశించిగాని వున్నవారి శరీరంలో వాయువుతోకలసి ప్రవేశించి విషూచికా వ్యాధిగా పరిణమించి హింసించుట కారంభించి అంతటా విహరించ సాగింది. అట్లా చాలాకాలం విహరించి ఆ రాక్షసి తానుచేసే ఆ పనిమీద విసుగు కలిగి, 'ఛీ నేనుచేసే పని ఎంత చెడ్డది! తెలిసి తెలిసి ఎందుకిలా చేశాను. పూర్వంవలె నాకు పెద్ద శరీరమూ లేదుగదా? దురాశవల్ల ఇంత అనర్థం కలిగింది, ఆశయొక్క ప్రభావం ఎంత చెడ్డది! ఛీ – ఇట్లవుండటం సరికాదు.' అని నిశ్చయించి సంహారేచ్ఛవదలి తపస్సానరింప హిమవత్పర్వత శిఖరమునకేగి ఆ సూదిఅంత దేహంతోనే ఘోరమైన తపస్సుచేసింది. తన మనస్సును సర్వ విషయములనుండీ బలాత్కారంగా మరలించింది. ఏ ఆహారము తినకుండా పట్టుదలతో తా నొనర్చిన ఘోరకార్యమునకు పరిహారముగా వేయేండ్లు తపస్సు చేసేసరికి మనస్సు నిర్మలమై అత్యుత్తమస్థితికి వచ్చింది. వెంటనే పరమార్థము స్పష్టమయింది. ఈ విధంగా తత్త్వం తెలుసుకొని సంకల్ప శూన్య

మైన మనస్సుతో మఱి వేయి సంవత్సరాలు నిర్వికల్ప సమాధిలో నిలిచిపోయింది.

అప్పుడు బ్రహ్మదేవుడువచ్చి "ఓ పుత్రీ నీవు తపః ప్రభావముచేత తత్త్వమెరిగి జీవన్ముక్తురాల వయినావు. ఇక ఈ సూదిరూపం వదలి పూర్వరూపం పొంది స్వేచ్ఛగా సర్వ లోకాలలోనూ విహరించుము. నీ మనస్సులో వున్న అజ్ఞానాంధకారంపోయింది. ఇక శాశ్వతమైన బ్రహ్మానందం అనుభవించు. ఏ మానవుడు యుక్తాయుక్త విమర్శలేక భ్రష్టులై అపరిశుద్ధ దేశముల నివసింతురో అట్టివారిని మాత్రమే ఆహారార్థం ఉపయోగించుకో" అని చెప్పి ఆ బ్రహ్మ అంతర్హితుడైనాడు. వెంటనే ఆ కర్కటి పూర్వశరీరం ధరించింది. సంశయాలన్నీ తీరుటవల్ల ఆ రాక్షసి చిత్తం సచ్చిదానంద పూర్ణమై విషయాలను చూచుటవల్ల పరితాపం ఏమాత్రమూ లేక నిశ్చలమైనది. ఈ విధమైన ప్రభావంతో ఆ దినంనుండీ బహుకాలం నిర్వికల్ప సమాధిలోనే నిలిచినది.

ఒకప్పుడు దానిచిత్తం చలించి బాహ్యవృత్తికి అభిముఖమయింది. అప్పుడు మళ్ళీ ఆకలి జ్ఞప్తికివచ్చింది. ఎంత జ్ఞానవంతులకైనా శరీరం వున్నంతకాలం దాని స్వభావం తొలగిపోదుగదా? అంత ఆరాక్షసి "బ్రహ్మ నాజాతి ననుసరించి మూఢులగువారిని నాకు ఆహారంగా కల్పించాడు గదా? ఇక అట్టివారిని వెదకాలి" అని నిశ్చయించి హిమవత్పర్వతమును వదలి దానిక్రింద నున్న కిరాతుల రాజ్యానికివచ్చి దాని కాశ్రయమైన ఒక అరణ్యంలో నివాసం ఏర్పాటు చేసికొనింది.

అలా వుంటూవుండగా ఒక కృష్ణపక్ష రాత్రి అంధకార బంధురమైనవేళ, విక్రముడనే పేరుగల ఆ దేశపురాజు, మంత్రిసహితంగా రాత్రివేళ చేయదగిన తస్కరవధ మొదలైన రాచకార్యాలు చేసే నిమిత్తం ఆ అరణ్యంలో ప్రవేశించారు. వారు శస్త్రధరులై మహాధైర్యంతో ఆ యరణ్యంలో తిరుగుతూ అక్కడున్న భేతాళుని (గ్రామదేవతను) చూచే నిమిత్తం వెళ్ళుతూ ఉండిరి. వారినిచూచి ఆ కర్కటి "నా కిప్పటికి తగిన ఆహారం దొరికింది. వీరు ఆత్మజ్ఞానంలేని మూఢులైతే భక్షిస్తాను. ఆత్మజ్ఞాన సంపన్నులైతే చంపరాదు గదా ? ఏమంటె వారుండటం లోకానికే క్షేమం. అందువల్ల వీరు ఎటువంటివారో పరీక్షించే నిమిత్తం చమత్కారంగా కొన్ని ప్రశ్నలడుగుతాను." అని నిశ్చయించి ఆ కర్కటి అతి భయంకరంగా సింహనాదంచేసి ఈవిధంగా మాట్లాడింది.

"ఓ పాంథులారా! మీ రెవ్వరు ? మహాజ్ఞానసంపన్నులో అజ్ఞానవంతులో గాని నాకు ఆహారమగుటకు సిద్ధమై నేడిటకు వచ్చితిరి. ఒక్క క్షణంలో మృతినొందగలరు గావున మీ యదార్థ స్వరూపములను తెలుపుడు ?" అనిన ఆ విక్రమ రాజేంద్రుడు ఇల్లాగన్నాడు. "ఓ భూతమా ? నీ వెవ్వరు? ఎక్కడున్నావు? నీరూపం చూపు. నీకు భయపడువా రెవ్వరూ ఇక్కడ లేరు." అది విని ఆ రాక్షసి సింహనాదంచేసి పక పకా నవ్వింది. దాని దంతకాంతివల్ల చీకటి తొలగి దాని భీకర స్వరూపం వారికి గోచరించింది. వారు ధైర్యవంతులు గనుక భయపడక, "ఓ రాక్షసీ! నీవు నిష్ప్రయోజనముగ ఇంత ఆడంబరం చేస్తావెందుకు ? నీకు కావలసినది ఆహారమే గదా? దాని కింత గొడవెందుకు ? నీవంటివారనేకవేలమంది మా ప్రతాపాగ్నికి గడ్డిపరకలైనారు. నీవనగా మాకెంత. నీవు కార్యసాధన పరురాలవైతివేని నీ యిష్టమేదో అడు

గును. మమ్ము వేడిన యాచకులెవ్వరూ స్వప్నంలోగూడా వృథాగా మరలిపోలేదు.'' అన్నాడు. అది విని ఆ రాక్షసి తనలో ''ఆహా! వీరు సామాన్యులుగారు. వీరిని కొన్ని ప్రశ్నలడిగెదను'' అని నిశ్చయించి క్రూరమైన నవ్వు, అరపు అన్నీ వదలి సౌమ్యంగా ''అయ్యా! మీరెవ్వరో దయచేసి తెలుప గోర్తాను'' అన్నది. అదివిని మంత్రి ''ఓ రాక్షసీ! ఈ మహాత్ముడీ కిరాత దేశములను రాజు. నేను ఇతనికి మంత్రిని. మేమిప్పుడు రాత్రి సంచారార్థం వచ్చాము. మీవంటి దుష్టులను చంపాలంటె ఇదే సమయంగదా ?'' అన్నాడు.

అంతనా కర్కటిరాజు నుద్దేశించి ''ఓ రాజా! నీ మంత్రి దుష్టుడు. రాజునకు దుష్ట మంత్రికూడదు. సరే అది అటుండనిమ్ము, నేను కొన్ని ప్రశ్నలడుగదలచాను. వాటికి మీరు సరైన ప్రత్యుత్తర మీయగలిగితే నానుండి తప్పించుకొనగలరు. లేకున్న నా కాహార మగుట తప్పదు'' అన్నది. అది విని ఆ రాజు ''నీవు యథేచ్ఛగా ప్రశ్న లడుగవచ్చును'' అన్నాడు. అప్పుడా రాక్షసి ఈ విధంగా ప్రశ్నించింది. ''ఏ పరమాణువు వాస్తవస్థితిలో ఒక్కటి అయ్యును అనేకములుగ లెక్కింపబడుచున్నది! ఏ పరమాణువునందు సముద్రమునందు బుట్టు అలలవలె అనేక బ్రహ్మాండములు పుట్టుచు అడగుచు వున్నవి? ఏది ఆకాశమయ్యును ఆకాశధర్మములు లేక వున్నది? ఏది ఒకానొకటియయ్యును ఏదియు గాకున్నది? ఎవడు పోవుచూ ఉండిన్నీ పోవనివాడై వున్నాడు? ఎవడు నిలువకుండియు నిలిచియున్నాడు? ఎవడు చేతనుడై ఉండిన్నీ రాతితో సమానంగా వున్నాడు? ఎవడు ఆకాశంలో చిత్తరువు వ్రాశాడు? సన్నని విత్తనంలో మహావృక్షం ఇమిడివున్నట్టు ఏ అణువునందు సర్వ ప్రపంచములు వున్నవి? అలలు మొదలగునవి సముద్రజలముకంటె భిన్నము కానట్లు ఈ సర్వ ప్రపంచము ఎవనికంటె భిన్నము కాదు? ఓ రాజమంత్రులారా! మీ బుద్ధి బలం చేత ఈ ప్రశ్నలను ఉత్తరం చెప్పలేకపోతిరేని నా జఠరాగ్నికి కట్టెలవుతారు. దీనికి ఏమీ ఆలస్యంలేదు'' అన్నది.

ఈ విధంగా ఆ కర్కటి ఆ అరణ్యంలో అర్ధరాత్రివేళ లోకోత్తరమైన ఆ ప్రశ్నలడుగగానే మంత్రి వెంటనే ''ఓ రాక్షసీ! నీవు పరిపూర్ణ బ్రహ్మజ్ఞానికి బోధ చేయదగిన వాక్యములచేత పరబ్రహ్మమునే వర్ణించావు. పరబ్రహ్మమే ఆకాశమునకంటె మిక్కిలి సూక్ష్మమగుటచేత పరమాణువని చెప్పబడుతున్నాడు. ఆయనకు నామము లేదు. రూపము లేదు, గుణములేదు ఇవన్నీ లేనివాడగుటచేత ఏ ఇంద్రియములకు గోచరుడు కాడు. అట్లున్నను ఆయా ఇంద్రియము లన్నిటికీ ఆధారభూతుడగుటవల్ల ఆయనకు శుద్ధవిజ్ఞానమే స్వరూపము. భ్రాంతివలన ఆయననే అనేక జీవులుగా చూచుచున్నారు. ఇట్టి జ్ఞానరూప పరమాణువునందే (ఆత్మయందే) సంకల్పబలమువలన అనేక బ్రహ్మాండములు పుట్టి ఆ సంకల్పము నశింపగానే అణగిపోతూవున్నవి. తనకంటె బయట ఏ పదార్థమూ లేనందువల్ల ఆ బ్రహ్మమే ఆకాశమవుతుంది. అనగా ఆకాశమువంటి దగును. జ్ఞానమే స్వరూపమగుటచేత ఆ పరబ్రహ్మమునకు ఆకాశధర్మము లేవియు లేవు. కావున ఆ బ్రహ్మము ఆకాశము కాదు. అందువల్లనే ఆ బ్రహ్మము ఇట్టిదని నిర్దేశించుటకు వీలుకాదు. సర్వ పదార్థములందూ సత్తారూపముతో (ఉండుట అనుస్వరూపంతో) ఉండువాడుగాన ఒకానొక పదార్థముగగూడ ఉన్నాడు. జ్ఞాన ప్రకాశమే స్వరూపముగా గలవాడగుటవల్ల

ఆయనే చైతన్యరూపుడు. తనకన్న అన్య పదార్థము లేనందున ఆయనయే పాషాణ రూపుడు. ఆయనయే ఆకాశరూపమైయున్న తనయందు చిత్తరువును వ్రాయుచున్నాడు. ఈ ప్రపంచమంతయు జ్ఞానమాత్రమే కావున సముద్రముకంటె అలలు భిన్నం కానట్లు ఆ బ్రహ్మముకంటె భిన్నంకాదు. భేదమనునది గూడ జ్ఞానమాత్రమే యగుటవల్ల నీటికంటె తడి వేరుకానట్లు ఆ పరమాత్మకంటె అది భిన్నము కానేరదు" అని మంత్రి చెప్పిన మాటలు విని ఆ కర్కటి ఇల్లాగన్నది. "ఓ రాజా? నీ మంత్రి పరమార్థమును బాగుగా వివరించాడు. ఇక నీవు మాట్లాడవలసింది" అని అన్నది.

ఆ రాజు 'ఓ కర్కటీ! జాగ్రత్స్వప్న సుషుప్తులను మూడవస్థలందును కార్యకారణ రూపమైన ప్రపంచం తోస్తుంది. జాగ్రత్స్వప్నావస్థలందు అజ్ఞాన కార్యములైన పశుపక్ష్యాదులు కానవచ్చును. సుషుప్తియందు సర్వకారణమైన అజ్ఞానమొక్కటే కానవగును. ఇట్లు అవస్థాత్రయమందు భ్రాంతివల్ల తోచే కార్యకారణ ప్రపంచం సంపూర్ణంగా గోచరం కానప్పుడు — అనగా తద్విషయభ్రాంతి సంపూర్ణంగా నశించినప్పుడు — ఆ తత్త్వరూపం ఎరుగ నగునని పెద్దలు చెప్తారు. సర్వసంకల్పవర్జితమై నిర్మలమైవున్న మనస్సుమాత్రమే ఆ పరమాత్మను తెలిసికొనగలదు. ఆ సర్వవ్యాపకుని సంకోచవికాసములవల్లనే ప్రళయములు, సృష్టులు జరుగుతున్నవి. ఎప్పుడు జీవమనోహంకారాది రూపములతో ఆ బ్రహ్మము విస్తరించునో అప్పుడు సృష్టి. ఆ వికాసమెప్పుడు లేదో అదే ప్రళయం. చిత్తరువులు వ్రాయబడిన వస్త్రం మడిచినట్లయితే అందున్న బొమ్మలు కనబడవు. తెరచినప్పుడు ఆ బొమ్మలు కనుపిస్తవి. అట్లాగే ఆ బ్రహ్మమున్నూ మనోవిజృంభణ మున్నప్పుడు ప్రపంచ రూపంతో కనుపిస్తుంది. లేనప్పుడు కనుపించదు. ఆ బ్రహ్మము సర్వవేదాంత వాక్యములకు లక్ష్యభూతము. [illegible] వికారములు లేనందున వాక్కులకగోచరము. కోటి కోటి బ్రహ్మాండములు ఆ బ్రహ్మముయొక్క మధ్యమునందే ఉన్నవి. సర్వము సంకల్పమయమే భ్రాంతిమయమే కావున ప్రతి జీవునియందును అనేక బ్రహ్మాండము లున్నవి కదా? ఈ విధముగ అతి విచిత్రమైన ఈ ప్రపంచసృష్టి ఆ పరబ్రహ్మముయొక్క సంకల్ప మాత్రమే. కావున ఆ పరబ్రహ్మముయొక్క స్వాభావికమైన అపరిచ్ఛిన్న రూపమునకు హానిలేదు. కర్కటీ! ఇట్టి పరబ్రహ్మమే నీ ప్రశ్నలన్నిటికీని ఉత్తరము. నీవు సత్తామాత్రమగు ఆ పరబ్రహ్మమును గూర్చియే బహువిధములుగ ప్రశ్నించావు" అని చెప్పాడు.

ఈ విధంగా రాజు చెప్పిన మాటలువిని ఆ కర్కటి బ్రహ్మానుభవము చే నిశ్చలమై నిలిచెను. ఏ విషయమం దభిరుచి గలవారికి ఆ విషయమునుగురించి ప్రస్తావము వచ్చినట్లయిన మనస్సు పరవశమగుట సహజమేగదా! ఆ విధంగా శాంతమైన మనస్సు విశ్రాంతి చెందింది అప్పుడు దానికి ఆకలివల్ల కలిగిన తాపంగూడా తెలియలేదు. ఈ విధంగా పరమానంద మగ్నురాలయిన ఆ కర్కటి "ఓ రాజమంత్రులారా! ఆహా! మీ బుద్ధి ఎంత పవిత్రమైనది. బ్రహ్మజ్ఞానమనే సూర్యుడు దాన్ని ప్రకాశింపజేస్తూవున్నాడు. నాబోటి వారికిగూడా మీ వంటి వారు పూజనీయులే. కావున మిమ్ము నేను పూజిస్తాను. మీ అభీష్టమేమో త్వరగా తెలియజేయుడు" అన్నది. అప్పుడా రాజు "ఓ కర్కటీ! నీవు రాక్షసకులమనే అరణ్యమునకు

పూగుత్తివంటి దానవు. మా కోరికలను చెప్పమన్నావుగావున ఒక్కటి అడుగుతాను. ఈ నాటినుండీ నీవు ఏ భూతములకూ హింసకావింపకుము'' అని రాజనగానే సంతోషించి ఆ కర్కటి ''ఓ రాజా! నీ ఇష్టానుసారం నడుచుకుంటాను. ఈ దినంనుండీ ఏ ప్రాణినీ హింసించను, ఇది యదార్థం'' అన్నది. అందుకా రాజు ''ఓ కర్కటీ! నీవు మాంసాహారినిగదా? అది మాని ఈశరీరాన్ని ఎల్లా పోషించగలవు?'' అన్నాడు. అందుకా కర్కటి చిరునవ్వునవ్వి ''నేను పూర్వం చాలా కాలం నిర్వికల్పసమాధియందే నిలిచివున్నాను. అప్పుడు నాకీ భోజన వాంఛ లేదు. సమాధినుండి లేవగానే ఇది కలిగింది. కాబట్టి నేను దీన్ని లెక్కచేయను. ఇదివరకు తపస్సు చేసిన హిమవన్నగముననే వెళ్ళి పూర్వంలాగానే నిర్వికల్ప నిష్ఠలో జీవంగల ప్రతిమలాగా నిలిచిపోతాను. ఆ సమాధి పరమానంద కరంగదా! కాబట్టి ఆ సమయంలో వేరేదీ తోచదు. ఒకసారి మెలకువవస్తే మళ్ళీ ఆ సమాధినే అవలంబించి వుంటాను.

పతన పర్యంతం అట్లాగే గడుపుతాను. ''పరమాత్మ సర్వవ్యాపకుడు'' అని తెలిసినవెనుక పరులను హింసించుట అయుక్తమే గదా. నా స్థితి కడు తగనిదే యగును. అందువల్ల సమాధియందే నిలిచివుంటాను. అప్పుడు ఆకలి లేనిది తెలియునే తెలియదు'' అని స్నేహపూర్వకంగా పలికి ఆ కర్కటి వారివద్ద శెలవుపొంది హిమాలయాభిముఖియై యథేచ్ఛగా వెళ్ళింది. ఆ రాజ మంత్రులది చూచి ఆశ్చర్య చకితులై ఆ కర్కటిక నభినందించుచు తమ రాజ్యమునకరిగి సుఖశాంతుల ననుభవిస్తూ అప్పుడప్పుడా కర్కటి క్షేమ సమాచారముల నెఱుగదలచి హిమాలయమునకు పోవుచు వచ్చుచు నుండిరి.

సామాన్యమానవుడు ఒక క్షణమున్నైనా మాటలాడక యుండజాలడు. మాటలాడుట కెవ్వరును లేనిచో, అతడు తప్పక మనసులో మాటాడుకొనుచుండును. 'ఆలోచించుట' అనగా అదిగాక మరేమి? తనతో తానే మాటాడుకొనుటయే. అగుచో, నిరర్థకముగా వ్యర్థ సంభాషణ ప్రసక్తుడై యుండుటకన్న భగవన్నామము స్మరించుచు, ఆయననుగూర్చి సాధ్యమైనంత సేపు తలచుచుండుట ఎంతో శ్రేష్ఠతరముకాదా? కార్యార్థముగాని, వర్తకవ్యవహారములందుగాని, అనేకవిధ ప్రసంగములు చేయుట ఆవశ్యకమే. కాని నీవు ఒంటిపాటుని యున్నప్పుడును, ముఖ్యకార్యమేదియు లేనప్పుడును, నిరుపయోగములగు ఇతరభావములందు మగ్నుడవై యుండుటకన్న ఈశ్వరస్మరణము, ఆయన నామోచ్చారణము, అభ్యసించుట శ్రేయస్కరమనుట నిస్సంశయము. వేఱు తలంపులను నివారించుకొనుటకు సదా జపమనుష్ఠించుచుండుట అవసరము. జపమనగా భగవన్నామము అవిరామముగా, ఆవర్తించుటే గదా!

'విరజానందస్వామి'

ముదిమి పులివలె బెదిరిస్తూ నిలిచియున్నది. రోగాలు శత్రువుల్లాగా దేహాన్ని బాధిస్తున్నవి. ఓటికుండనుంచి నీళ్లు కారిపోయేటట్లుగా ఆయుష్షు రోజురోజుకూ తరిగిపోతున్నది. అయినా జనులు అహితాన్ని చేస్తున్నారు. —భర్తృహరి.

# యా దేవీ సర్వభూ షు

యాదేవీ సర్వభూతేషు విష్ణుమాయేతి శబ్దితా।
నమస్తస్యై, నమస్తస్యై, నమస్తస్యై నమోనమః॥

సర్వభూతములందును విష్ణుమాయ అను పేర నిలిచియుండు దేవికి మాటిమాటికి నమస్కారములు.

యాదేవీ సర్వభూతేషు చేతనేత్యభిధీయతే।
నమస్తస్యై, నమస్తస్యై, నమస్తస్యై నమోనమః॥

సర్వభూతములందును చేతనా (తెలివి) స్వరూపయై నిలిచియుండు దేవికి మాటిమాటికి నమస్కారములు.

యాదేవీ సర్వభూతేషు బుద్ధిరూపేణ సంస్థితా।
నమస్తస్యై, నమస్తస్యై, నమస్తస్యై నమోనమః॥

సర్వభూతములందును బుద్ధి స్వరూపయై నిలిచియుండు దేవికి మాటిమాటికి నమస్కారములు.

యాదేవీ సర్వభూతేషు నిద్రారూపేణ సంస్థితా।
నమస్తస్యై, నమస్తస్యై, నమస్తస్యై నమోనమః॥

సర్వభూతములందును నిద్రాస్వరూపయై నిలిచియుండు దేవికి మాటిమాటికి నమస్కారములు.

యాదేవీ సర్వభూతేషు క్షుధారూపేణ సంస్థితా।
నమస్తస్యై, నమస్తస్యై, నమస్తస్యై నమోనమః॥

సర్వభూతములందును క్షుధా (ఆకలి) స్వరూపయై నిలిచియుండు దేవికి మాటి మాటికి నమస్కారములు.

యాదేవీ సర్వభూతేషు ఛాయారూపేణ సంస్థితా।
నమస్తస్యై, నమస్తస్యై, నమస్తస్యై నమోనమః॥

సర్వభూతములందును ఛాయా (ప్రతిబింబము) స్వరూపయై నిలిచియుండు దేవికి మాటిమాటికి నమస్కారములు.

యాదేవీ సర్వభూతేషు శక్తిరూపేణ సంస్థితా।
నమస్తస్యై, నమస్తస్యై, నమస్తస్యై నమోనమః॥

సర్వభూతములందును శక్తి స్వరూపయై నిలిచియుండు దేవికి మాటిమాటికి నమస్కారములు.

యాదేవీ సర్వభూతేసు తృష్ణారూపేణ సంస్థితా।
నమస్తస్యై, నమస్తస్యై, నమస్తస్యై నమోనమః॥

సర్వభూతములందును తృష్ణా (దప్పి) స్వరూపయై నిలిచియుండు దేవికి మాటిమాటికి నమస్కారములు.

యాదేవీ సర్వభూతేషు క్షాంతిరూపేణ సంస్థితా।
నమస్తస్యై, నమస్తస్యై, నమస్తస్యై నమోనమః॥

సర్వభూతములందును క్షాంతి (ఓర్పు) స్వరూపయై నిలిచియుండు దేవికి మాటిమాటికి నమస్కారములు.

యాదేవీ సర్వభూతేషు జాతిరూపేణ సంస్థితా।
నమస్తస్యై, నమస్తస్యై, నమస్తస్యై నమోనమః॥

సర్వభూతములందును జాతిస్వరూపయై నిలిచియుండు దేవికి మాటిమాటికి నమస్కారములు.

యాదేవీ సర్వభూతేషు లజ్జారూపేణ సంస్థితా।
నమస్తస్యై, నమస్తస్యై, నమస్తస్యై నమోనమః॥

సర్వభూతములందును లజ్జా (వినమ్రత) స్వరూపయై నిలిచియుండు దేవికి మాటిమాటికి నమస్కారములు.

యాదేవీ సర్వభూతేషు శాంతిరూపేణ సంస్థితా।
నమస్తస్యై, నమస్తస్యై, నమస్తస్యై నమోనమః॥

సర్వభూతములందును శాంతి స్వరూపయై నిలిచియుండు దేవికి మాటిమాటికి నమస్కారములు.

యాదేవీ సర్వభూతేషు శ్రద్ధారూపేణ సంస్థితా।
నమస్తస్యై, నమస్తస్యై, నమస్తస్యై నమోనమః॥

సర్వభూతములందును శ్రద్ధా (ఆసక్తి) స్వరూపయై నిలిచియుండు దేవికి మాటిమాటికి నమస్కారములు.

యాదేవీ సర్వభూతేషు కాంతిరూపేణ సంస్థితా।
నమస్తస్యై, నమస్తస్యై, నమస్తస్యై నమోనమః॥

సర్వభూతములందును కాంతి (అందము) స్వరూపయై నిలిచియుండు దేవికి మాటిమాటికి నమస్కారములు.

యాదేవీ సర్వభూతేషు లక్ష్మీరూపేణ సంస్థితా।
నమస్తస్యై, నమస్తస్యై, నమస్తస్యై నమోనమః॥

సర్వభూతములందును లక్ష్మి (భాగ్యము) స్వరూపయై నిలిచియుండు దేవికి మాటిమాటికి నమస్కారములు.

యాదేవీ సర్వభూతేషు వృత్తిరూపేణ సంస్థితా।
నమస్తస్యై, నమస్తస్యై, నమస్తస్యై నమోనమః॥

సర్వభూతములందును వృత్తి (కార్యపరత) స్వరూపయై నిలిచియుండు దేవికి మాటిమాటికి నమస్కారములు.

యాదేవీ సర్వభూతేషు స్మృతిరూపేణ సంస్థితా।
నమస్తస్యై, నమస్తస్యై, నమస్తస్యై నమోనమః॥

సర్వభూతములందును స్మృతి (జ్ఞప్తి) స్వరూపయై నిలిచియుండు దేవికి మాటిమాటికి నమస్కారములు.

యాదేవీ సర్వభూతేషు దయారూపేణ సంస్థితా।
నమస్తస్యై, నమస్తస్యై, నమస్తస్యై నమోనమః॥

సర్వభూతములందును దయాస్వరూపమై నిలిచియుండు దేవికి మాటిమాటికి నమస్కారములు.

యాదేవీ సర్వభూతేషు తుష్టిరూపేణ సంస్థితా।
నమస్తస్యై, నమస్తస్యై, నమస్తస్యై నమోనమః॥

సర్వభూతములందును తుష్టి (తృప్తి) స్వరూపమై నిలిచియుండు దేవికి మాటిమాటికి నమస్కారములు.

యాదేవీ సర్వభూతేషు మాతృరూపేణ సంస్థితా।
నమస్తస్యై, నమస్తస్యై, నమస్తస్యై నమోనమః॥

సర్వభూతములందును మాతృ (తల్లి) స్వరూపమై నిలిచియుండు దేవికి మాటిమాటికి నమస్కారములు.

యాదేవీ సర్వభూతేషు భ్రాంతిరూపేణ సంస్థితా।
నమస్తస్యై, నమస్తస్యై, నమస్తస్యై నమోనమః॥

సర్వభూతములందును భ్రాంతి (పొరపాటు) స్వరూపమై నిలిచియుండు దేవికి మాటిమాటికి నమస్కారములు.

ఇంద్రియాణా మధిష్ఠాత్రీ భూతానాం చాఖిలేషుయా।
భూతేషు సతతం తస్యై వ్యాప్త్యై దేవ్యై నమోనమః॥

సర్వభూతముల ఇంద్రియములను లోబఱచుకొని, సర్వభూతములపై ఎల్లప్పుడును ఏలుబడి కలదియగు సర్వవ్యాపకురాలగు దేవికి నమస్కారములు.

చితిరూపేణ యాకృత్స్న మేతద్వ్యాప్య స్థితాజగత్।
నమస్తస్యై, నమస్తస్యై, నమస్తస్యై నమోనమః।

ఈ అఖిలజగత్తును వ్యాపించి చిత్ (జ్ఞాన) స్వరూపమై నిలిచియుండు దేవికి మాటిమాటికి నమస్కారములు.

అనేకులు లక్ష్యమేదియు లేక, చీకటిలోపలె జీవితములు గడపుచున్నారు. లక్ష్య సహితుడు ఒక వేయితప్పు లొనర్చిన లక్ష్యరహితుడే బది వేల తప్పు లొనర్చుననుట నిస్సంశయము. కావున లక్ష్యము నొకదానిని కలిగియుండుట ముఖ్యము. లక్ష్యమునుగూర్చి సాధ్యమైనంత వినవలెను. నిరంతర శ్రవణముచే అది మన హృదయములో ప్రవేశింపవలెను; మన బుద్ధి కెక్కవలెను; రక్తనాళములలో దూఱవలెను; ప్రతి రక్తబిందువు నందును సృజింపవలెను; ప్రతి రోమకూపమునకు వ్యాపింపవలెను. అంతట దానినిగూర్చి ధ్యానింపవలెను.

కర్మాచరణమునకు పురికొల్పునని భావములే కనుక మనస్సును అత్యున్నత భావములతో నింపించుకొనుము. ప్రతిదినము వానినిగూర్చి వినుచుండుము. తలంచుచుండుము. అపజయములను లక్ష్యము చేయకుము. అవి కలుగుట చిత్రమా? జీవితమునకు భూషణములుగదా అవి! అవి లేని జీవితములో అందము ఏమున్నది? ఈ పోరాటములు, జయపరాజయములు, ఒడుదుడుకులే జీవితమునకు స్వారస్య మిచ్చునవి! అవియే జీవిత సౌరభములు.

కావున పొరపాట్లను; పోరాటములను, కష్టనష్టములను లక్ష్యపెట్టవలదు. అపజయములచే నిరుత్సాహ మందకుము. లక్ష్యసిద్ధికై వేయిసార్లు పోరాడుము. వేయిసార్లును ఓటమియే ప్రాప్తించెనేని, ఇంకొకసారి మరల ప్రయత్నించుము.

అన్నిటియందును దైవమునుచూచుటే ఆదర్శము. అట్లు చూడజాలవేని నీ కత్యంత ప్రియమగు దానియందు మొదట చూడుము. ఆ పిదప మఱొకదానిలో, తరువాత ఇంకొక దానిలో. ఇట్లు క్రమవ్యాప్తి నొందింపవచ్చును. ఆత్మకు జీవిత పరిమితిలేదు. దాని జీవిత మనంతము. కావున కాలము చాలదని భీతిలక, సావకాశముగా ఉద్యమము సాగింపుచుండుము. కార్యసిద్ధి చేకూరగలదు.

# శ్రీ రామకృష్ణ కథామృతము

(రెండవ భాగము)

అనువాదము: ప్రవ్రాజిక శ్యామాప్రాణ

తెల్లవారినది. నిద్రనుండి లేచి చూచుసరికి రామకృష్ణులు పసిబాలుని వలె దిగంబరులై దేవుళ్ల పేర్లు స్మరించుచు గదిలో నాల్గువైపుల తిరుగుచుండిరి. ఒకపరి గంగానది దర్శనము చేయుచు మరొకపరి గదిలోగల దేవుళ్ల పటములకడ మోకరిల్లుచు, వేరొకపరి మధుర స్వరముతో నామస్మరణచేయుచు తిరుగుచుండిరి. ఒక్కొక్కసారి యిట్లు పల్కుచుండిరి: వేదములు పురాణములు, తంత్ర శాస్త్రములు, గీత, గాయత్రి, భాగవతము, భక్తులు, భగవానుడు. గీత నుద్దేశించి పలుమార్లు త్యాగీ త్యాగీ త్యాగీ అని పల్కుచుండిరి. అటుపై ఒక్కొక్కసారి బ్రహ్మము నీవే, శక్తివి నీవే, ప్రకృతి నీవే. చతుర్వింశతి తత్వములు నీవే అని మాటి మాటికి పల్కుచుండిరి. ఇంతలో కాళికాలయములోను, రాధా కృష్ణాలయములోను మంగళ హారతులు జరుగుచుండెను. కంచుగంటలు మ్రోగించు చుండిరి. శంఖములు పూరించు చుండిరి. భక్తులు లేచి బయటకువచ్చి చూచు సరికి దేవళములలో పూజకై పువ్వులుకోయుట ఆరంభమాయెను. నౌబత్తులో మేళగాళ్లు మేలుకొలుపు పాటల వాయించు చుండిరి.

నరేంద్రాది భక్తులు ప్రాతఃకాల కృత్యముల ముగించుకొని ఠాకూరుకడకు వచ్చిచేరిరి. ఠాకూరు ఉత్తరమువైపు వరండాలో నిలబడి యుండిరి.

నరేంద్రుడు:-పంచవటికడ నానక్ సాంప్రదాయపు సాధువులు కొందరు కూర్చొనియుం డుట కాంచితిని అనెను.

శ్రీ రామకృష్ణులు:-అవును వారు నిన్ననే



వచ్చిరి. (నరేంద్రునితో) మీ రందరు చాపపై ఒకటిగ కూర్చొనుడు. నేను చూడ వేడుకపడు చున్నాను అనిరి. భక్తులందరు చాపపై కూర్చొనిన తర్వాత ఠాకూరు ఆనందముగ వారిని పరికించుచు సంభాషించు చుండిరి. నరేంద్రుడు సాధనానుష్ఠానముల గూర్చిన చర్చ లేవనెత్తెను.

శ్రీ రామకృష్ణులు:-భక్తియే సారము. వానిని ప్రేమించినచో వివేక వైరాగ్యములు వాటంతట అవే వచ్చును.

నరేంద్రుడు:-స్త్రీలతోకూడ సాధనలు చేయుట శాస్త్రములలో కలదా ?

శ్రీ రామకృష్ణులు:-అవన్నియు మంచిదారులు కావుసుమా! చాల కఠినములైనవి. ఈ సాధనలద్వారా ఎక్కువగా అధఃపతనము నొందు అవకాశములు కలవు. స్త్రీతోడకూడి వీర భావముతోను దాసీభావముతోను మాతృ భావముతోను మూడు విధములుగ సాధన చేయుదురు.

వీరభావసాధన చాల కష్టము. నాది మాతృభావము. దాసీభావముకూడ పరవాలేదు కాని సంతానభావము చాల పవిత్రమగు భావము. నానక్ పంథీ సాధువులు శ్రీ రామకృష్ణులకు అభివాదన మొనర్చుచు "నమో నారాయణాయ" అని పల్కిరి. ఠాకూరు వారిని ఆసనములపై కూర్చొనమని పల్కిరి.

తరువాత ఠాకూరు ఇట్లు పల్కుచుండిరి :- ఈశ్వరునికి సాధ్యముకాని దేదియు లేదుసుమా! వాని స్వరూపమును ఎవ్వరును నోట వర్ణింపజాలరు. వానికి అంతయు సాధ్యమే. ఒక కథ వినుము.

ఒకానొక తోటలో ఇద్దరు యోగులుండిరి. భగవత్ సాధనలతో వారు దినములు గడుపుచుండిరి. నారదమహర్షి ఆ దారిన పోవుచుండెను. అది తెలుసుకొని యొక యోగి నారదుని యిట్లు ప్రశ్నించెను- మీరు శ్రీమన్నారాయణుని దగ్గఱనుంచి వచ్చుచున్నారా ? వారేమి చేయుచున్నారు ?

నారదఋషి :-ఆయన ఒక సూది రంధ్రముగుండ ఏనుగును ఒంటెను దూర్చుచున్నారు. మరల వాటిని బైటికిలాగి తీసుకొని వచ్చుచుండుటయు చూచి వచ్చితిని. అది విని అతడు భగవంతునికి అంతయు సాధ్యమే. ఇందులో ఆశ్చర్యమేమియు లేదుసుమా! అనెను. కాని రెండవ వ్యక్తి "అదెప్పటికి కానేరదు. ఇది అసంభవము, నీవు అతని (నారాయణుని) కడకు పోనేలేదు" అనెను.

పగలు సుమారు 9 గంట లయినది. ఠాకూరు గదిలోనికివచ్చి కూర్చొనిరి. కోన్నగరమునుండి మన్మోహనుడు సపరివారముగ వేంచేసెను. అతడు శ్రీ వారికి ప్రణమిల్లి ఇట్లు పల్కెను. "నేను వీరిని కలకత్తాకు తీసికొని పోవుచున్నాను" అంత ఠాకూరు వారి యోగక్షేమములు అరయుచు "కలకత్తాకు తీసుకొని పోవుచున్నావా? నేడు అగస్త్య యాత్రా దినము. ప్రయాణమునకు సరియైనదికాదు." అని పలికి మరల "ఇవన్నియు నాకేమియు తెలియవు" అనిరి. అటుపై నవ్వుచు వేరు ప్రసంగము నారంభించిరి.

నరేంద్రుడు, వాని స్నేహితులందరు స్నానముచేసి వచ్చిరి. ఠాకూరు ససంభ్రమముగ నరేంద్రునితో "త్వరగా వెళ్లి వటవృక్షముక్రింద కూర్చొని ధ్యానము చేయుము. ఆసనము ఇవ్వనా ?" అనిరి. నరేంద్రుడు వాని బ్రహ్మసమాజ స్నేహితులు పంచవటి పాదపమూలమున ధ్యానము చేయు చుండిరి. సుమారు 10-30 గంటలవేళ శ్రీ రామకృష్ణులు అచ్చట హాజరైరి. మాస్టరు కూడయుండెను. శ్రీ రామకృష్ణులు బ్రహ్మభక్తులతో "ధ్యానము చేయునపుడు సంపూర్ణముగ వానిలో నిమగ్నులై పోవలెను. పైపైన తేలుచుండిన సముద్రము లోపలయున్న రత్నములు అందునా ? అని పల్కి ఈ క్రిందిపాట పాడ నారంభించిరి.

దూబ్ దేరేమన్ బోలే

..................

[భావము :-" కాళీ" అనుచు ఓ మనసా ! హృదయరత్నాకరము యొక్క అగాధ జలములో మునకలు వేయుము. రెండు మూడు మారులు మునకలు వేసియు రత్నములు దొరకనిచో నిరాశ పడకుము. రత్నాకరములో (సముద్రములో) రత్నములు లేకపోలేదు. నీవు శ్వాసము బిగపట్టి నిలుపుము. ఈతకొట్టి తల్లి కడ చేరుకొనుము ఆలోతగు జ్ఞాన సముద్రపు అట్టడుగుననే ముత్యములు తయారగును. నీవు భక్తితో వానిని ఏరుకొనవచ్చును. కాని

ఇంకొక విషయములో జాగ్రత్త పడుము. కామాది రూపములగు మొసళ్లు ఆహారము వెదుకుచు పొంచియున్నవి. నీవు వివేకమనెడి పసుపు పూసికొనినచో ఆ వాసనకు అది నిన్ను ముట్టవు. ఒక్క దుముకుదుమికి అచ్చట పుష్కలముగా పడియున్న రత్నములను మాణిక్యములను ఇష్టమైనన్నిటిని తెచ్చుకొనుమని రామప్రసాద్ పలుకుచున్నాడు.]

నరేంద్రుడు వాని స్నేహితులు పంచవటి అరుగునుండి దిగి ఠాకూరుకడకు న- ఠాకూరు వారితో మాట్లాడుచు తమ గదివైపునకు నడచి వచ్చుచుండిరి. "నీళ్లలో మునకలు వేసినచో మొసలి పట్టుకొనును. హృదయరత్నాకరుని లోతగు నీటిలో కామక్రోధాదులగు ఆరు మొసళ్లు కలవు. కాని వివేక వైరాగ్య రూపమగు పసుపు పూసికొనినచో అవి నిన్నంట జాలవు.

వివేక వైరాగ్యము లుదయించినచో పాండిత్యమువలన ఏమిలాభము? లెక్చరువలన ఏమి లాభము? ఈశ్వరు డొక్కడే సత్యము. మిగిలినదంతయు అనిత్యము. అతడేవస్తువు. మిగిలినదంతయు పనికిమాలినది, అవస్తువులు. దీనినే వివేకమందురు.

మొదట వానిని హృదయ మందిరములో ప్రతిష్ఠింపుము. అటుపైననే యిష్టమైనచో ఉపన్యాసము లిచ్చుకొనుము. వివేక వైరాగ్యములు లేనిదే కేవలము బ్రహ్మము బ్రహ్మము అనగనే సరిపోవునా? అదెట్లన వట్టి శంఖము ఊదినట్లే అగును. ఒక కథ వినుము——ఒక గ్రామములో పద్మలోచనుడను పేరుగల బాలుడుండెను. ఆ గ్రామమువారు వానిని "పోదో" అని పిల్చెడివారు. ఆ గ్రామములో ఒక పాడుపడిన దేవాలయముండెను. ఆలయ ప్రాంగణమంతయు రావి మఱ్ఱిచెట్లతో నిండిపోయెను. గర్భగుడిలో గబ్బిలములు గూడుల నేర్పఱచుకొని వాసము చేయుచుండెను. నేలయంతయు గబ్బిలముల రెట్టతో నిండియుండెను. అందుచే ఆ గుడికి ఎవ్వరు వెళ్లువారుకారు.

ఒకనాడు సంధ్యాసమయమున గ్రామస్థులకు శంఖధ్వని వినిపించెను. చెవియొగ్గి వినగా పాడుపడిన ఆలయమువైపునుండియే అని విశదమాయెను. ఎవరో ఆ పాడుబడిన దేవళమును బాగుచేయించి విగ్రహ ప్రతిష్ఠ కావించిరి కాబోలును. అందుచే అచ్చట సాయంకాలపు హారతి జరుగుచున్నదని తలంచి గ్రామస్థులందరు ఆబాలగోపాలము భగవద్దర్శనార్థమై ఆలయముకడకు వచ్చి చేరిరి. కాని అచటికి వచ్చి చూచుసరికి ఆలయము యథాప్రకారము మురికితో నిండియుండెను. ఒక వ్యక్తి గుడితలుపు తెరిచిచూడగా పద్మలోచనుడు ఒకవైపున నిలబడి శంఖము ఊదుచుండెను. భగవత్ ప్రతిష్ఠ లేదు. ఆలయము పరిశుభ్రము చేయలేదు. గబ్బిలముల రెట్టతో నిండియుండెను. అంత ఆ వ్యక్తి ఇట్లు బిగ్గరగా కేకలిడెను.

మందిరే తోర్ నహీ కే మాధవ్.

[భావము:—హృదయ మందిరమున మాధవుని ప్రతిష్ఠింప గోరుదువేని, భగవల్లాభము కోరుదువేని కేవలము "ఫూ, ఫూ" అని శంఖము ఊదిన లాభమేమి?]

మొదట చిత్తమును శుద్ధముచేయుము. మనస్సు పరిశుద్ధమైనచో భగవంతుడు ఆ పవిత్రమగు ఆసనమున వచ్చి కూర్చొనును. గబ్బిలముల మురికియున్నచో దేవుని ప్రతిష్ఠింపజాలము. పదకొండు గబ్బిలములు అనగా పదకొండు ఇం

క్రియనులు. ముందు మాధవుని ప్రతిష్ఠ చేయుము. అటుపై ఇష్టమున్నచో ఉపన్యాసము లిమ్ము.

ముందు మునక వేయుము. మునక వేసి రత్నముల బైటికి తీసుకొనిరమ్ము. అటుపైననే ఇతరములగు పనులుసుమా! మునక వేయుటకు సిద్ధముకారు. మాధవుడు లేడు. భజనయు లేదు. వివేక వైరాగ్యములు లేవు. చిలకపలుకులవలె రెండుమాటలు నేర్చుకొని లెక్చరివ్వడమే?

ఇతరుల కుపదేశించుట అంత సులభమా? భగవద్దర్శనమైనపిదప భగవదాదేశము పొందినచో లోకులకు విద్య నేర్పవచ్చును. ఈ విధముగ పల్కుచు ఠాకూరు ఉత్తరమువైపు వరండాలో వచ్చి నిల్చిరి. మణి (మాస్టరు) ప్రక్కనే నిలబడియుండెను. ఠాకూరు మాటిమాటికి "వివేక వైరాగ్యములు లేనిచో భగవంతుని పొందజాలరు" అని పల్కుచుండుట విని మాస్టరు తనలో ఇట్లు తలంచుచుండెను.

"వివేక వైరాగ్యములనగా కామినీ కాంచనము లనియా అర్థము?"

మణికి వివాహమైనది-వయస్సు 28 సం॥లు కాలేజీలో చదివి ఆంగ్లేయవిద్య నభ్యసించెను.

మణి :-(రామకృష్ణులతో) "నన్ను నీవు సరిగా చూచుటలేదు. నేను ఆత్మహత్య చేసుకొందును" అని భార్య పల్కినచో ఏమిచేయవలెను?

రామకృష్ణులు :- (గంభీరముగా) అట్టి భార్యను వెంటనే త్యజించవలెను. భగవన్మార్గమున విఘ్నము కలుగజేయువారిని వెంటనే త్యజించవలెను. ఆత్మహత్య చేసుకొననిమ్ము. మరేమైనను చేసుకొననిమ్ము" ఈశ్వర మార్గమున ఆటంకపఱచునట్టి భార్య అవిద్యాస్త్రీ

ఈమాటలు విని అత్యంత దుఃఖితుడై మణి గోడ నానుకొని నివ్వెరబోయి నిలచియుండెను. నరేంద్రాది భక్తులుకూడ మౌనముగ నిల్చియుండిరి. ఠాకూరు భక్తులతో మాట్లాడుచుండిరి. తటాలున మణికడకువచ్చి మెల్ల మెల్లగ ఇట్లు పల్కిరి.

యదార్థముగుభక్తి అంతరంగమున నున్నచో రాజు, దుష్టప్రజలు, భార్య, అందరును దాని వశములోనికి వచ్చెదరు. భర్తకు ఆంతరంగిక భక్తియున్నచో భార్యయు క్రమేణ భగవన్మార్గము ననుసరించును. భర్త తాను మంచివాడైనచో ఈశ్వరేచ్ఛచే భార్యయు మంచి మార్గమునకు వచ్చును.

మణి దుఃఖాగ్నిలో దగ్ధుడగు చుండెను. లోలోన ఇట్లు తలచుచుండెను. "ఆత్మహత్య చేసుకొన్నచో చేసుకొననిమ్ము. నేనేమి చేయుదును?"

మణి :-(రామకృష్ణులతో) సంసారములో చాల భయము కలుగుచున్నది.

రామకృష్ణులు :- (మణి, నరేంద్రాదుల తోడ) నిజమే. అందుచేతనే శ్రీ చైతన్య దేవులు నిత్యానందునితో ఇట్లనిరి. "చూడు అన్నా! ఈ సంసారజీవులకు గతి లేనేలేదు."

మణితో ఏకాంతమున:- చూడుము. ఈశ్వరునిపట్ల భక్తిశ్రద్ధ కలుగనిచో వేరొండు గతి లేనేలేదు సుమా! ఈశ్వర లాభమునొంది సంసారము చేసినచో భయములేదు. నిర్జన ప్రదేశములకుపోయి అప్పుడప్పుడు సాధనల ద్వారా శుద్ధ భక్తి నుపార్జింపగల్గినచో సంసారములో నుండినను ఎట్టి భయములేదు. శ్రీ చైతన్య దేవులవారికి గృహస్థ భక్తులుకూడ నుండిరి. వారు పేరుకుమాత్రమే గృహస్థులు. అనాసక్తులై యుండెడువారు.

దక్షిణేశ్వరాలయములో నైవేద్యము. ఆరగింపులు ముగిసెను. మేళములు వాయించుచుండిరి. మధ్యాహ్నము గుడితలుపులు మూయబడెను. దేవుళ్లకు పవళింపుసేవ ముగిసెను.

అటుపై రామకృష్ణులు భోజనము చేయుటకై కూర్చొనిరి. నరేంద్రాది భక్తులు నేడు కూడ ఠాకూరుకడనే ప్రసాదము స్వీకరించిరి.

నేడు క్రీ.శ. 1883 మార్చి 11 వ తేదీ ఆదివారము ఫాల్గుణ శుక్ల ద్వితీయ. శ్రీరామకృష్ణుని జన్మదినము.

శ్రీ రామకృష్ణుల అంతరంగ భక్తులు, వారి పుట్టినరోజు పండుగ కడువేడుకగ చేయుచుండిరి. అందుచే భక్తులు వేకువనుండి పరమహంసలవారి కడకు రాదొడంగిరి. వేకువజామున శ్రీ భవతారిణీ కాళికాలయములో దేవి జాగరణసేవలు మొదలుపెట్టిరి. మేలుకొలుపులతో దేవి మంగళహారతులు ముగిసెను. అటుపై ప్రభాతభేరి మ్రోగుచుండెను. మేళగాండ్లు చావిడిలో కూర్చొని చక్కని రాగాలాపనలు చేయుచుండిరి. వసంతకాలము. చల్లని గాలి వీచుచుండెను. వృక్షములు, లతలు నవపల్లవములతో సింగారించుకొని ఆనందమున తలలూపుచుండెను. భక్తులు తమ హృదయములో శ్రీ రామకృష్ణుని స్మరించుచు ఆనందమున నృత్యములు చేయుచుండిరి.

భవనాథ్, రాఖాల్, భవనాథుని స్నేహితుడగు కాళీకృష్ణుడు, మొదలగువారు మాష్టరుకన్న ముందుగనే దక్షిణేశ్వరము చేరుకొనిరి.

శ్రీ రామకృష్ణులు తూర్పువైపు వరండాలో కూర్చొని భక్తులతో ఆనందముగ మాట్లాడుచుండిరి. మాష్టరువచ్చి శ్రీ రామకృష్ణులకు సాష్టాంగ ప్రణామములు చేసెను.

శ్రీ రామకృష్ణులు :-(మాష్టరుతో) నీవు వచ్చితివా ? (భక్తులతో) సిగ్గు, అసహ్యము, భీతి, ఈ మూడింటిని వదలవలెను. ఆహా! ఈ దినము భక్తులకు ఎంత ఆనందము కలుగునో మీరే చూచెదరు. కాని ఈ దినము శ్రీహరిని కీర్తించుచు ఆనందముతో నృత్యము చేయజాలనట్టి దౌర్భాగ్యులకు ఏనాటికి ఆనందము కలుగజాలదు సుమా! భగవంతునికడ బిడియమేల! మీరింక ప్రార్థన ప్రారంభించుడు.

భవనాథ్, కాళీకృష్ణుడు కలసి ప్రార్థన ఆరంభించిరి.

ధన్య ధన్య ఆజ్ దిన్ ......జయ జయహో మారి.

[భావము:-నేడు చాల ఆనందమగు దినము. ధన్యమైనది. మేమందరము కలసి భారతదేశమున సత్యధర్మము ప్రచారము చేసెదము. నలువైపుల నీనామము మారుమ్రోగుచున్నది. ప్రతి ఒక్కరి హృదయములోను, నీవు విరాజిల్లుచున్నావు. ప్రభూ! సిరిసంపదలు కాని, గౌరవ మర్యాదలుకాని, మరేమియు అక్కర లేదు. నీ పాదపద్మములకడ శరణుజొచ్చితిని. అమృతకలశము లభించినది. మరణ భయము లేదాయె. ఆపదలకు భయపడను. నీకు మంగళమగుగాక.]

—(సశేషం)

# స్వామి తురియానంద ప్రసంగములు

ఏ ఉపాసకుడును జడమును ఉపాసించుట లేదు. భగవంతుని సచ్చిదానంద విగ్రహమునే భక్తులందరును ఆరాధించుచున్నారు. సకాములగువారే స్వర్గభోగములను తదితర విషయములను ప్రార్థించుచున్నారు.

'తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి
ఏవం త్రయీ ధర్మమను ప్రపన్నా
గతాగతం కామకామా లభన్తే'

(వారు విపులమగు ఆ స్వర్గలోకమున భోగములను అనుభవించి పుణ్యక్షయము కాగా మర్త్యలోకమునకు తిరిగి వచ్చుచున్నారు. ఇట్లు కామ్యకర్మములను అనుసరించు భోగపరాయణులు సంసారమున తిరుగాడుచున్నారు.)

ఇది కర్మకలాపములను ఆశ్రయించినవారిని గురించినమాట. స్వర్గాదులు యథార్థోపాసకుల గమ్యములు కావు. సచ్చిదానంద స్వరూపమును, ప్రజ్ఞానఘనమును అగు ఆత్మయే వారికి కావలసినది. ఉపాసకులు వారి వారి సంస్కారములను అనుసరించి ఈ ఆత్మను లేక బ్రహ్మమును వివిధములగు ఉపాస్యములుగా వీక్షించుచున్నారు.

కొందరు దానిని పూర్ణముగను, తమ్ము అంశములుగను భావించుకొనుచున్నారు. కొందరు దానిని తమనుండి అభేదము అగునదిగ పరిగణించుచున్నారు. మరికొందరు దానిని తమనుండి వేరగు 'మహాప్రభువు'గ వీక్షించుచున్నారు. కాని, వీరుకూడ తమ్ము జడములుగ భావించుకొనరు – చైతన్యముగనే ఎంచుకొనుచుందురు. కనుక, ఉపాసకుని విషయమున జడత్వశంకయే పొడమదని మనకు తేటతెల్లమగుచున్నది. ఉపాస్య ఉపాసకులు ఇరువురు చైతన్యయుక్తులే కాని, సంస్కారభేదమును అనుసరించి ఉపాసకులలో సంబంధ బాంధవ్య



మున వైచిత్ర్యత ఏర్పడుచున్నది.

తన సభలోఉన్న మునులకందరకును (సంశయమును పోగొట్టి) సంతోషమును కలిగింప శ్రీరామచంద్రప్రభువు ఒకప్పుడు అచ్చట ఉన్న హనుమంతుని చూచి 'నీవు నన్ను ఏతీరున ఆరాధించుచుందువు?' అని ప్రశ్నించెను. జ్ఞానులలో అగ్రగణ్యుడగు ఆంజనేయస్వామి ఈ ప్రశ్నయొక్క ప్రయోజనమును గుర్తించి ఇట్లు సమాధాన మొసగెను.

దేహబుద్ధ్యాస్మి దాసస్తే జీవబుద్ధ్యా త్వదంశకః
ఆత్మబుద్ధ్యా త్వమేవాహం ఇతి మే నిశ్చితా మతిః

(నాకు దేహాభిమానము కలిగినప్పుడు నీ సేవకుడను అను భావమును, నేను జీవాత్మను అని ఊహించుకొనునప్పుడు నీ అంశను అను భావమును, నన్ను ఆత్మగా భావించుకొనినప్పుడు నీకును నాకును అభేదమను భావమును నిశ్చయించుకొని నిన్ను ఆరాధించు చుందును.)

ఈ విధమున హనుమంతుడు భక్తులందరి

యొక్క భావమును వ్యక్తీకరించినాడు. ఇదియే వేదాంతసారము. ఎవరును అధైర్యపడనక్కర లేదు. ప్రతి ఒక్కరికి యథార్థమగు స్థానము కల్పింపబడినది. ఎవరేస్థితిలో ఉండినను ఆ పరమేశ్వరుని ఒక్కనినే ఆరాధించుచు ఆయనతో సంబంధ బాంధవ్యములను కల్పించుకొనుచున్నారు.

సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తః స్మృతిర్జ్ఞాన మపోహనంచ
వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో
వేదాన్త కృద్వేదవిదేవ చాహం

(నేను ప్రాణులందరి హృదయములలోను వెలయుచున్నాను. నానుండియే స్మృతియును జ్ఞానమును, విస్మృతియును కలుగుచున్నవి. సమస్త వేదములవలన తెలియనగునది నేనే. వేదకర్తయును, వేత్తయునుకూడ నేనే.)

చిన్మయుడగు ఆ పరమపురుషుడే ఓతప్రోత భావమున సర్వవ్యాపియై వెలయుచున్నాడు. వేదములయందంతటను వెదుకవలసినది ఆయననే - ఆయనయే వేదాంత ప్రవర్తకుడును, వేదార్థవేత్తయును. ఈ విషయమును గ్రహించినయెడల నీవు వేదాంత లక్ష్యమును అందుకొనెదవు. ఇది అర్థముకానియెడల నీవు వేదములను పిండి త్రాగినను, వేదాంత తత్త్వము బోధపడదు.

'నేనును నా తల్లియును - మే మిరువురమే యున్నారము' అను గురుదేవుని వాక్యములను ఈ రీతిగనే గ్రహింపవలెను. శ్రీరామకృష్ణుడు ఇచ్చట జడ చైతన్యములనుగూర్చి ప్రసంగింపలేదు. ఆయన ఒక్క చైతన్యమును గురించియే చెప్పినాడు. ఆ చైతన్యమాపుడే సర్వమును అయిఉన్నాడు.

అథవా బహునైతేన కింజ్ఞాతేన తవార్జున
విష్టభ్యాహమిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్ ॥

(అర్జునా! నా విభూతులను ఇంత ఎక్కువగ తెలిసికొన నీకు కలిగెడు లాభ మేమి? నా ఒక అంశమువలననే సమస్త విశ్వమును వ్యాపించి ధరించియున్నాడనని తెలిసికొనుము.)

ఆయన తన అంశము ఒకదాని వలననే చరాచరాత్మకమైన ఈ విశ్వమునంతటిని వ్యాపించియున్నాడు. తక్కిన మూడు భాగములును అంతటిని అతిక్రమించి సర్వదా ముక్తమై తనరారుచున్నవి. వేదములుకూడ ఆయన దివ్యత్వము నిట్లు స్తుతించుచున్నవి.

'పాదోఽస్యవిశ్వా భూతాని, త్రిపాదస్యామృతందివి'

జీవులందరును ఆయనకు ఒక పాదమే, మిగిలిన మూడు పాదములును ద్యులోకమున అమృతమయములై యున్నవి.

ఆయన కానిదేదియును లేదు. ఆయనకంటె అన్యమగున దింకొకటి కలదని వచించువాడింకను భ్రాంతియందే యున్నాడు. అతడు నిద్రపోవుచు పలవరించుచున్నాడు - అతడు చెప్పెడిదేమియో అతనికే తెలియదు. అద్వైత తత్త్వమగు బ్రహ్మమే భ్రాంతివలన నానాత్వ విలసితమగు ఈ విశ్వముగ తోచుచున్నది. ఈ భ్రాంతదృష్టిని అనుసరించియే శ్రుతులు 'ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః - ఈ ఆత్మనుండి ఆకాశము పుట్టినది,' అని చెప్పుచున్నవేగాని, పరమార్థదృష్టిని అనుసరించి కాదు. పరమార్థదృష్టి ననుసరించి సృష్టి ప్రళయములుకాని, బద్ధముక్తులుగాని, బంధ మోక్షములుగాని లేవు.

న నిరోధో న చోత్పత్తిర్న బద్ధో న చ సాధకః
న ముముక్షుర్న వైముక్త ఇత్యేషా పరమార్థతా॥

ఇదియే చరమనిర్ణయము,

# సంకల్పశుద్ధి

## శ్రీ నిర్వికల్పానంద స్వామి.

'ఎవరిమనస్సులో ఏయేకోరికలు ఉంటాయో ఆయా కోర్కెలవల్ల ప్రేరేపింపబడి ఆయా అనుకూల స్థానాల్లో వాళ్ళుపుట్టి, వాటిని పొందుతూ ఉంటారు' అని ఉపనిషత్తు చెప్తోంది.

'అయితే, నేను కోరిన కోర్కెలన్నీ సిద్ధిస్తున్నాయా, సిద్ధిస్తే వేరేస్వర్గంతో నాకు పనేముంది, ఈ భూలోకమే నాకు స్వర్గం' అని ఎవరైనా పూర్వపక్షం చెయ్యవచ్చు.

కాని, విచారించిచూస్తే ఆకోర్కెను సక్రమంగా, ఘట్టిగా, కోరలేదనిన్నీ; ఈ కోరక పోవటంవలనే అది సిద్ధింపలేదనిన్ని తెలుస్తుంది.

ఐతే దారిద్ర్యంలో మునిగితేలే పేదలు కోరుకున్నంత మాత్రాన్నే అన్నీ సిద్ధించే పక్షంలో, అల్లా దారిద్ర్యకూపంలో మునిగి ఉండటం దేనికి? అనే ప్రశ్న రావచ్చు.

దానికి సమాధానం: వాళ్ళకూడా మన మనుకుంటున్నట్లే దారిద్ర్యంలో ఏవిధమైన అపూర్వ శోభా ప్రత్యక్షం కాకపోయినా, ఆ పూటకింత కలో గంజో దొరికితే తృప్తి పడతారేగాని, లక్షాధికార్లం కావాలని కలలో కూడా అనుకోరు.

లక్షాధికార్లం కావాలని వాంఛించేవాళ్ళే లక్షాధికార్లు అవుతున్నారు.

అనుకున్నా ఇంతహోదా నాకు సిద్ధించేది కాదు కాబట్టిన్నీ, నాకు ఉపార్జించే శక్తి లేదు కాబట్టిన్నీ నేను కోరుకోటం లేదంటే అది వేరే విషయం. కోరుకున్నవాడికి అది-మంచే కాని వ్వండి, చెడ్డేకానివ్వండి -సిద్ధిస్తున్నదనే ఫలితాంశం.

ఇదంతా సంకల్పం యొక్క శక్తి.

ఐతే, ఈ సంకల్పమనేది భౌతికాకృతి పొందాలి అంటే, కొంత సమయం పట్టవచ్చు. అది రూపాన్ని స్వీకరించినప్పుడు భస్మాసురవరం లాగా మనకు తోచవచ్చు. అయినా, మన జీవితంలో మనకు తటస్థించేవన్నీ మనం ఒకప్పుడు కావాలిఅని అనుకొన్నవే అనే అంశం మటుకు నిజం. మనం కోరుకున్నాం అనే సంగతిని మనం విస్మరిస్తాం. కొంచెం, జ్ఞాపకశక్తిని ప్రేరేపిస్తే ఆ సంగతి తెలుస్తుంది.

ఇకపోతే, ఈ సంకల్పాన్ని పరిపూర్ణంగా నిర్మించటంలో లోటుండి మనం విసుక్కునే పరిస్థితులు దాపురించవచ్చు.

నాకు మంచివంటబ్రాహ్మడు ఒకడుకావాలి అనుకున్నాను. వచ్చాడు. వంటా అదీ బాగానే చేస్తాడు కాని, ఎడ్డెమ్మృగం. 'ఇదేమిరా? భగవంతుడా!' అని అనుకుంటే, 'అల్లాంటివాణ్ణే నీవు ఎందుకు కోరలేదు? అనేభావం స్ఫురిస్తుంది. ఈ తడవ పరిశుభ్రతను పాటించి చక్కని వంటచేసే వంటబ్రాహ్మడు కావాలి అనుకున్నాను. సరే, వచ్చాడు. కాని, ఈ మారువచ్చినవాడు కోపిష్ఠి ఇదేమయ్యాఅంటే, మళ్ళీ అదే సమాధానం. ఈ తడవ మళ్ళీ పరిశుభ్రతను పాటించేవాడు, వంటబాగా చేసేవాడు, కోపిష్ఠి కానివాడు అయిన బ్రాహ్మడు కావాలి అనుకున్నాను. ఈ మారువచ్చిన వాడిలో ఈ గుణాలన్నీ ఉన్నాయి. కాని దొంగ...ఇల్లా ఎంతగా సంకల్పించుకున్నా ఏదో ఒకలోటు మిగిలిపోతూనే ఉంటుంది.

దీన్ని స్ఫురింపచేసేదే నరసింహావతారం!

హిరణ్యకశిపుడు కోరిన వరాలకు ప్రతిగా జలమూ, స్థలమూ ఆకాశమూ కాని ఊరువుల మీద, శస్త్రాస్త్రాలుకాని గోళ్ళతో, పగలూ రాత్రికానీ సంధ్యాసమయంలో, దేవమనుష్య రాక్షస తిర్యగాది యోనుల్లో వేటికీ చెందని నృసింహావేషంతో అతని వధ జరిగింది. చిత్ర మేమిటంటే, అతడు కోరుకున్నది అమృతత్వం కాదు—వీటి వీటినుంచి మృత్యువు రాకుండా ఉండటం. అతను కోరుకున్నది కోరుకున్న లాగానే ఉండిపోయి మరణం సిద్ధించింది. వరాలు దక్కాయి.

ఇంత బాదరబందీ ఉంది కాబట్టే మహర్షులు దేన్నీ కోరకుండా వుండటమే శాంతికి ఉపాయం అని నిర్వచించారు.

కాని, సంకల్పించినవి సిద్ధిస్తాయి అనే సత్యాన్ని ఈ విషయం ఖండించటం లేదు. మనం కోరుకోటంలోనే ఏదో ఒక లోపం ఉండిపోతుంది. కనుకనే, భగవంతుణ్ణి కల్పవృక్షమని భక్తులు చెప్తారు. ఆ కల్పవృక్షచ్ఛాయల్లో కూర్చొని ఎవరికేది కావాలనుకొంటే అది దొరుకుతుంది. భోజనం కావాలనుకుంటే భోజనం, శయ్య కావాలనుకొంటే శయ్య, పెద్దపులిమీద పడా లనుకుంటే పెద్దపులి.

ఈ కోరిన కోర్కెలు మనశ్శాంతి నిస్తా యన్నమాట ఉత్తదని పైనే చెప్పాం.

ధ్రువుడు తపస్సుచేసి పదివేలఏళ్ళు రాజ్యం పాలించాలని కోరుకున్నాడు. సిద్ధించింది. కొంత కాలం పోయాక, రత్నాలగని దగ్గరకు వెళ్ళి గాజుముక్కను ఏరుకో వచ్చానే అని విల పించాట్ట!

భగవంతుడు 'నీకేం కావాలి' అని అడిగి నప్పుడు ప్రహ్లాదుడు కోరినకోర్కె, నాకేమీ కోర్కెలు లేకుండా చెయ్యమనే.

మన జీవితాల్లోకూడా కోర్కెలను కోరు కుంటూ కోరుకుంటూ, చివరకు కోరవలసిన కోర్కె, ఏకోరికా లేకుండా చెయ్యమనే!

దీర్ఘో జాగ్రతో రాత్రిః దీర్ఘం శ్రాంతస్య యోజనం
దీర్ఘాబాలానాం సంసారః సద్ధర్మం అవిజానతాం.

జాగరణ చేసేవారికి రాత్రి దీర్ఘము. అలసిపోయి ఉన్నవారికి యోజనం అతిదూరం. సద్ధర్మం తెలియని మూఢునకు సంసారం అతిదీర్ఘం. (ధర్మపథం)

యథాధేను సహస్రేషు వత్సోవిందతి మాతరమ్
తథా పూర్వాకృతం కర్మ కర్తారమను గచ్ఛతి.

దూడ వేలకొలది ఆవులలో తన తల్లి నెట్లు గుర్తించి చేరుచున్నదో అట్లే పూర్వ కృతమగు కర్మఫలము కర్తను పొందుచున్నది. (మహాభారతం.)

తెఱవబడిన తొమ్మిది వాకిళ్లుగల ఈ దేహమనేపంజరమున ప్రాణవాయువనే పక్షి నిలిచియుండుట ఏది కలదో అది ఆశ్చర్యముకాని, దీనినుండి వెడలిపోవుట ఎటుల ఆశ్చర్య మగును? (సుభాషితము)

# మాతృదేవిచరణసన్నిధి

ఆంగ్ల గ్రంథము:
ఎట్ ది హోలీమదర్స్ ఫీట్

అనువాదము:
పి. గణపతిశాస్త్రి

కొంతకాలంనించి అమ్మ చాలా అనాసక్తంగా బాగా దిగులుగా ఉంటున్నారు. గోలప్ మా మేడకిందిభాగంలో ఎవరితోనో వాదోపవాదాలు కొనసాగిస్తున్నారు.

'ఇప్పుడీ వాదోపవాదాలన్నీ దేనిని గురించి?' అడిగారు అమ్మ.

దానిమీద "గోలాప్‌మా ఏదో రుసరుస ప్రారంభించారు." అన్నాను నేను.

అమ్మ: పొద్దస్తమానము, ఆ సణుగుడు ఆ రుసరుస మంచివికావు. ప్రతిసంగతి పూర్తిగా అధ్వాన్నంగా తయారయ్యేసరికి ఎవ్వరికయినా ఎంతయినా బాధ కలుగుతుంది. కుండ బద్దలు కొట్టినట్టు మొహంమీదే మాట్లాడుతూండడం గోలాప్ కొక అలవాటుగా తయారయింది. అలాగ నిర్మొహమాటంగ మాట్లాడితే పైవాళ్లు ఏమనుకుంటారో అని ఆమె ఏమాత్రమూ లక్ష్యపెట్టదు. కాని నా ధోరణి అటువంటిది కాదు. ఎవరి మనస్సయినా నొచ్చుకుంటుందేమో అని నే నెంతో ఆలోచిస్తాను. అప్రియమయినప్పుడు యథార్థమయినా చెప్పడం మంచిది కాదు.

ఇంకొకసారి గోలాప్‌మా కుండ బద్దలు కొట్టినట్టు మాట్లాడి ఎవరిమనస్సో నొప్పిస్తూంది. అమ్మ అది గమనించి, "గోలాప్‌ని ఇదేమిటి; నీకీ ధోరణి ఒక అలవాటుగా మారిపోతూందే!" అంటూ మందలించారు.

మతి స్థిమితం లేనిమనిషి ఒకాయన మధ్యాహ్నంవేళ వచ్చి, అమ్మతో ప్రసంగం ప్రారంభించి పెద్ద గొడవచేశాడు. ఆ సంఘటన ఉట్టంకించి అమ్మ ఇలా గన్నారు.



'ఠాకూరెన్నడు తమశక్తి ఇతరుల కెవ్వరికి ఏమాత్రము తెలియకుండా చాలా జాగరూకత వహించారు. ఇప్పుడది అంతా పూర్తిగా నడిబజారు పాలయింది. ఇదంతా ఆ స్కూల్ మాష్టర్ [మహేంద్రనాథ్ గుప్త] మూలంగానే అందరి నోళ్లలోను పడింది. అతడు తన "కథామృతంలో అంతా ఆమూలాగ్రంగా అందరికీ వెల్లడించి, మనస్సులన్నీ మార్చివేశాడు.

గిరీశబాబు ఠాకూరును అయినదానికి కాని దానికి బలవంతంచేసి చీటికి మాటికి నిందిస్తూండేవాడు. ఈ మనుష్యులుకూడా అన్ని విధాలా గిరీశబాబును అనుకరించాలని ప్రయత్నిస్తున్నారు.

"అయితే అందరు నా దగ్గిరే ఎందుచేత మంత్రం స్వీకరించాలి? బేలూరుమఠంలోనా నాయన లెంతోమంది ఉన్నారుగదా! అక్కడికి ఎందుకు వెళ్లరు? వారికి శక్తిసామర్థ్యాలు లేవా? తమదగ్గిరికి వచ్చినవారినందరిని నా దగిరికే పంపిస్తున్నారు! నే నెంతవరకు వెళ్లా

నంటే కుటుంబ గురువులదగ్గిర మంత్రోపదేశాలు పొందకపోవడం పాపమనికూడ అనడం ప్రారంభించాను! అయినా వా రెవ్వరు తమ కుటుంబ గురువులదగ్గిరికి వెళ్లరు. నా దగ్గిరికే వస్తారు.''

నేను: అమ్మా, మీరు మంత్రోపదేశం చేసినప్పుడు మీ సంకల్పం ప్రకారమే చేస్తున్నారు. దీనిలో ఇంకొకరి ప్రమేయమేమి లేదు గదా! మీరు స్వతంత్రంగా చేసినవేగదా, ఆ మంత్రోపదేశాలన్నీని!''

అమ్మ: అవును నిజమే! నేను అర్థించినవారి మీది జాలికొద్ది ఉపదేశిస్తున్నాను. అంతే! లేకపోతే నన్ను కదలనివ్వరు! కిమిలి కమిలి పలవిస్తారు. ఆ పైన నాకు వారిమీద వల్లమాలిన జాలి కలుగుతుంది. ఆ జాలివల్లనే మంత్రా లుపదేశిస్తున్నాను. లేకపోతే నాకా ఉపదేశాలవల్ల జరిగే దేమిటి? ఒకరికి మంత్రోపదేశం చేసినప్పుడు గురువువారి పాపాలన్ని స్వీకరించవలసి ఉంటుంది. ఈ శరీరం ఎప్పుడో ఒకప్పుడు చనిపోయేదేకదా! పోనీ అర్థించిన వారి కుపకారం చేస్తూనే ఇది నశించిపోనీ! అంతకన్న ఇంకేమి కావాలి?

ఉద్బోధన కార్యాలయము: అమ్మ గది 24, ఏప్రెల్, 1912. అప్పటికి మధ్యాహ్నం ఒంటిగంటన్నర అయింది. మధ్యాహ్న భోజనం ముగించుకున్న తరవాత తాంబూలంకోసం మేడమీదికి వెళ్లాను. ఆ సమయంలో అమ్మ ఎవరితోనో మాట్లాడుతున్నారు. ఆ మాటలిలాగ వినిపించాయి.

అమ్మ: మనుషులు తమ సహజస్వభావం విడనాడలేరు. చైతన్యదేవులు ఒకప్పుడు 'తమ సహజస్వభావం విడనాడి, నన్ను అర్చించిన వారిమీద నా అనుగ్రహం ప్రసరిస్తుంది.' అని అన్నారు.

నేను: అమ్మా! మీరు ఒకప్పుడు జయరాంబాటిలో 'మనిషి తన సంకుచిత స్వభావం విడనాడుకోగలిగితే చాలా బాగుంటుంది.' అని అన్నట్టు జ్ఞాపకం. ఇంకొకనాడు 'ఒక్కొక్కరికేసి చూడగానే వారిమీద ఎంతో ఆత్మీయత కలుగుతుంది. వారి స్వభావం అటువంటిది! అలాగే మరికొందరికేసి చూసినప్పుడు దీనికి వ్యతిరేకమయిన భావం కలుగుతుంది.' అని అన్నారు మీరు.

అమ్మ: అవును! నీ వన్నమాట నిజమే నాయనా! అన్నిటికి మనిషి సహజస్వభావమే ప్రధాన కారణం! అంతే! ఇంకేముంది?

గోలాప్‌మాను గురించి ప్రసంగిస్తూ నేను ఇలాగన్నాను. 'గోలాప్‌మా ఒక కొబ్బరి బొండం ఇస్తే ఆ సంగతి ఇంట్లో అందరిఎదట చాటిస్తుంది.' అని శరత్ మహారాజు [శారదానందస్వామి] అన్నారు,

అమ్మ: అవును! ఈ మధ్యన అది అందరికీ ఒక అలవాటుగా తయారయింది. ఏ మాత్రం చిన్న సంఘటన జరిగినా దానిమీద పెద్ద గందరగోళం లేవదీస్తారు. జోగెన్ [జోగేన్‌మా] నిమ్మకి నీరెత్తినట్టు ప్రశాంతంగా ఉండేది. కాని ఇప్పుడామె ధోరణి అంతా పూర్తిగా మారిపోయింది. ఓరిమి చాలా గొప్ప సుగుణము. నిజానికి దానితో సమానమయిన సుగుణమే లేదు! అది లేకపోయిన తరవాత ఎన్ని సుగుణాలుంటే మాత్రం ఏమిలాభం?

నాకు తలనొప్పి ప్రారంభమయింది. నేను మధ్యాహ్నం నాలుగు గంటలవేళ మేడమీదికి వెళ్లినప్పుడు అమ్మతో ఆ సంగతి చెప్పాను.

దానిమీద ఆమె అది విపరీతమయిన వేడివల్ల వచ్చి ఉండవచ్చునని అన్నారు.

ఆ తరవాత ఆమె ఒక ఆకుమీద నెయ్యి, హారతికర్పూరము కలిపి నా దగ్గిరికి తీసుకు వచ్చారు. ఆపైన తమ స్వహస్తాలతో నా నుదుటిమీద వేసి మర్దనా చేశారు. ఆ తరవాత మరి కొంతసేపటికి నా తలనొప్పి పూర్తిగా తగ్గింది...

కలకత్తాలో వేదాంతం అభ్యసించడానికి ఒక పోలిష్ మహిళ భారతదేశానికి వచ్చింది. ఆ సందర్భంలో ఆమె శ్రీ శారదాదేవిని గురించి విని ఆమె సందర్శనానికి వచ్చింది. ఆమె అమ్మతో కొంతసేపు సంభాషించింది. ఆ తరువాత శ్రీరామకృష్ణుల ఉపదేశాలకు, బాహై మతస్థుల సూక్తులకు చాలా దగ్గిర పోలిక లున్నాయని ఇవి రెండు అన్ని మతాలలోను ఐక్యమున్నదని బోధిస్తున్నాయని వెల్లడించింది. ఆమె బాహై సంప్రదాయానికి చెందినట్టు కనబడింది.

ఆ పోలిష్ వనిత వెళ్ళిపోయిన తరవాత నేను "ఆమె ఎటువంటి వ్యక్తిలాగ స్ఫురించినదని అమ్మ నడిగాను.

అమ్మ: చాలా ఉత్తమురాలని నా కని పించింది.

నేను: ఆమె చాలా దూరంనించి వచ్చింది. పోలెండు దేశానికి, ఉద్బోధన కార్యాలయానికి మధ్యన చాలాదూరం ఉంది. ఎంతదూరం ఉందో మీకు ఊహించడంకూడా చాలా కష్టమమ్మా!"

అమ్మ: ఠాకూరు ఒకప్పుడు ఆనందా వేశంతో తన్మయులయి, "భవిష్యత్తులో ప్రతి ఇంట నన్ను అర్చిస్తారు. నా కెంతమంది ... ఇదమిత్థంగా నిర్ణయించడం కూడా చాలా కష్టం!" అని అన్నారు. సోదరి నివేదిత ఒకప్పు డిలాగ అన్నది. "అమ్మా, మేము నిజంగా వంగదేశీయులమే! మా కర్మ ఫలితాలనుబట్టి వేరే దేశంలో జన్మించాము. అంతే! కాని త్వరలోనే మేము పూర్తిగా బెంగాలీల మయిపోయిన సంగతి నీవు గ్రహించ గలవు!" ఇది ఆమె చిట్టచివరి జన్మ.

ఉద్బోధన కార్యాలయము. మే 1, 1912. వైశాఖ పూర్ణిమ.

అమ్మ పేరట వచ్చిన ఉత్తరాలు చదివి విని పించడానికి పొద్దున్నే ఆమెదగ్గిరికి వెళ్ళాను. ఆ సందర్భంలో నే నిలాగ అన్నాను.

నేను: ఇక్కడికి వచ్చి మీ దర్శనం చేసు కోవాలని ఉన్నదని మీ శిష్యురాలి కుమార్తె ఒకామె భర్తగారి ఇంటిదగ్గిరనించి వ్రాసింది. అయితే ఈ విషయం అత్తమామలు మొదలయినవారి కెవ్వరికి తెలియనివ్వకూడదని ఆమె అభిలాష.

అమ్మ: అయితే మనం సమాధానం వ్రాయ నక్కరలేదు! ఈ దాగిలిమూతల వ్యవహారం నా కిష్టంలేదు! జయరాంబాటిలో పోస్ట్‌మన్ జోగీంద్ర మా ఉత్తరాలు చదువు తూండేవాడు. "ఏమిటీ! పోస్ట్‌మాన్ మీ ఉత్తరాలు చదువుతున్నాడా?" అని చాలా మంది అన్నారు. ఏం? చదివితే తప్పేం? నా కెవ్వరిదగ్గిర దాచవలసిన రహస్యాలేవి లేవు? చదవాలని అనుకున్నవాళ్లు ఎవళ్లైనా నా ఉత్తరాలు చదవవచ్చును.

నేను: ఇంకొక శిష్యురాలు మీరు తిరిగి జయరాంబాటికి ఎప్పుడు వెడుతున్నారని వ్రాసింది. జగద్ధాత్రీ పూజా సమయంలో

ఆగ్రహాయన [నవంబరు - డిసెంబరు] మాసంలో జయరాంబాటి వెడుతున్నారని వ్రాయనా?

దానికి అమ్మ అంగీకరించలేదు!

అమ్మ: వద్దు! వద్దు! ఆ సమయంలో మనం అక్కడికి వెడతామని ఎలాగ నిర్ణయించగలవు? ఆ సమయానికి నేను ఎక్కడ ఉన్నా ఉండవచ్చును. అది అంతా ఆ భగవానుని నిర్ణయంమీద ఆధారపడి ఉంటుంది! అంతే! ఈ వేళకి మట్టుకి మనం ఇక్కడ ఉన్నాము. రేపు ఇక్కడినించి నిష్క్రమించవచ్చును! ఏ సమయానికి ఏం జరుగుతుందో, ఎవరు చెప్పగలరు?

కాని నేను దాని కంగీకరించలేదు!

నేను: అలాంటిమాట లెందుకనాలి? అమ్మా, మా అందరి సమక్షంలోను మీ రున్నారు కనకనే ఎంతోమందికి మానసికశాంతి చేకూరుతూంది.

"అవును నాయనా! నిజమే!" అని అన్నారు అమ్మ.

"అయితే మా అందరికోసము మాతోనే ఉండిపో అమ్మా!" అంటూ ప్రాథేయపడ్డాను నేను.

అమ్మ: నా మీద భక్తి పెంచుకున్నవారందరిమీద నా కెంతో అభిమానం కలుగుతూంటుంది." అని అన్నారు అమ్మ. ఆ సమయంలో భక్తులమీది కరుణతో అమ్మ గొంతు వణికింది.

నేను విసనకర్రతో విసురుతున్నాను. ఆ సమయంలో కరుణార్ద్రమయిన గద్గదస్వరంలో అమ్మ అన్నారు.

"నాయనా, నీవు చిరకాలం జీవించాలని, భగవానునిమీద నీలో నిత్యము ప్రగాఢమయినభక్తి పెంపొందాలని, పరిపూర్ణమయిన ప్రశాంతి చేకూరాలని నిన్ను ఆశీర్వదిస్తున్నాను. ఈ ప్రశాంతి చాలా ముఖ్యమయినది! అది చాలా అవసరం."

ఆ తరవాత నేను తిరిగి ప్రశ్నించాను.

"అమ్మా, నా సంగతి మాటి మాటికీ అడగాలని అనిపిస్తూంటుంది. ఠాకూరు శ్రీరామకృష్ణులను నేను ఎన్నడు చూడలేకపోతున్నానెందుచేత? ఆయన నిజంగా మన అందరి ఆత్మీయులయితే, సంకల్పించినంతలోనే మన సమక్షంలో సాక్షాత్కరించ వచ్చునుగదా! ఎందుచేత మన కట్టెదట కనిపించరు?',

అమ్మ: మనుషు లీలాగ యమయాతన లనుభవిస్తూంటే ఆయన మనకెందుచేత కనిపించరని నేనుకూడా ఆశ్చర్యపడుతూంటాను. రాము తల్లికి [బలరామ్ భార్య] ఒకసారి చాలా జబ్బుచేసింది. ఆ సమయంలో అక్కడికి వెల్లి ఆమె నొకసారి చూసిరావలసిందని ఠాకూరు నాతో అన్నారు.

"అక్కడికి వెళ్లడానికి వాహనమేమీ లేదే? మరి ఎలాగ వెళ్లడం?" అన్నాను నేను. దానిమీద ఠాకూరు "బలరామ్ కుటుంబానికి ఒక పెద్ద ఆపద ఎదురయింది! అటువంటప్పుడు నీ వొకసారి వెళ్లి చూడవద్దూ! నడిచివెళ్లు!" అన్నారు. అయితే చిట్టచివరికి ఒక పల్లకీ లభ్యమయింది. నేను దక్షిణేశ్వరంనించి బయలుదేరి ఆవిణ్ణి చూడడానికి వెళ్లాను. మొత్తం మీద ఆవిణ్ణి రెండుసారులు చూశాను. రెండోసారి నేను శ్యామపుష్కర్‌లో ఉండడంజరిగింది. అప్పుడు కాలినడకనే రాత్రివేళ బలరామ్ భార్యని చూడడానికి వెళ్లాను...ఆపత్సమయంలో ఠాకూరు సాక్షాత్కరించకపోతే, ఇక మనుషులు ఏమి చెయ్యగలరు?

—(సశేషం)

# విచిత్ర సాధకులు

## పూర్ణానంద్

గ్రామోప్రాంతాల్లో ఉండే కొండగుట్ట లెక్కడానికి ప్రత్యేకంగా దారులంటూ ఉండవు. ఎవరి ప్రయోజనాన్ననుసరించి వారు, ఎవరిశక్తి ననుసరించి వారు తలోదారిని ఎక్కుతారు. చాలామంది తొక్కిన దారులు ఒకటీ, రెండో - ఏర్పాటుగా కనబడితే కనబడతాయి ఈ దారుల్లో ఎక్కడం సులువుకాని లభించే మట్టుకు తక్కువ. నిత్యకర్మగా కొండకి వెళ్ళి వచ్చేవారు ఈ దారుల్లోపోయి కొద్ది కొద్దిగా ప్రయోజనం సాధించుకుంటూరు. వీరి ప్రయత్నమూ కొద్దే, ఫలితమూ కొద్దే.

హఠాత్తుగా అద్దు తెలిసిన అవసరంకోసం కొండవైపు మళ్ళే వారికి దారుల్తో పని లేదు. వారి అవసరం పెద్దది. దీక్షా పెద్దదే. ఫలితం కూడా పెద్దదే అవుతుంది.

ధ్రువుడూ, వాల్మీకీ, విచిత్ర సాధకులు. తండ్రిప్రేమ నిజమనుకున్నాడు ధ్రువుడు; భార్య ప్రేమ నిజమనుకున్నాడు వాల్మీకి. వారికి వేరే ఆలోచన ఏమీ లేదు. ఇతనికి తండ్రి తొడ మీద కూచుని ఆనందించడం, అతనికి ప్రేయసితో విహరించడం, ఇవీ పరమానంద ప్రదాయకాలు. కాని వారి నమ్మకాలకి దెబ్బ తగిలింది. పట్టని విరిగిపోయాయి. 'అయితే ఏమిటి గతి!' అని ఇద్దరూ హడలిపోయారు. ధ్రువుడికి తల్లీ, వాల్మీకికి నారదుడూ దారి చూపించారు. 'అదుగో కొండ' అని ఇద్దరూ తుపాకి గుళ్ళలాగు పరిగెత్తి చేరుకున్నారు వారి భక్తికి ఇంద్రాదులే కాదు, పరమేశ్వరుడుకూడా పాపం తల్లడిల్లిపోయి ఉంటాడు.

ధనుర్దాసు విచిత్ర సాధకుడు, అతడు మల్లులకి గురువు. మకాం శ్రీరంగంలో. కాని సవాలుచేసే పైవూరి మల్లులికి శిష్యులే జవాబు లిచ్చేసి పంపేశేవారు. ధనుర్దాసు నివాసం ఎప్పుడూ అంతఃపురం లోనే. అతనిభార్య హేమాంగికి చక్కని కళ్ళు. ఆ కళ్ళు చూచుకుంటూ కాలం గడిపేశేవాడు ధనుర్దాసు. ఒక నాడు రంగనాథుల తిరువీధి ఉత్సవం చూడాలని హేమాంగి ముచ్చటపడింది. ఆమె కన్నులకి ఎండతగులకుండా గొడుగువేసి తీసుకు వెళ్ళాడు ధనుర్దాసు ఆమెని. నాటి ఉత్సవంలో అందరికళ్ళూ స్వామిమీద. ధనుర్దాసుకళ్ళు హేమాంగి ఆకర్షణీయమైన నేత్రములమీద.

శ్రీ రామానుజులు శిష్యబృందంతో వస్తూ ధనుర్దాసు దీక్షని గుర్తించి శిష్యులికి చూపించారు. శిష్యులు 'దీక్ష' అనే మాటకి ఒప్పుకోలేదు. 'లౌల్యము' అన్నారు. రామానుజులు 'ఇవాళ సాయంత్రం అతణ్ణి నేను రమ్మన్నానని చెప్పి రంగనాథుల సన్నిధికి తీసుకరమ్మని' ఒక శిష్యుడితో చెప్పి తిరిగి పోయినారు. నాడు గురుదేవులు ఎందుకు ఉపవాసం చేశారో శిష్యు లూహించుకోలేక పోయారు ... అనుకున్నట్లు చీకటిపడగానే ధనుర్దాసును తీసుకొని శిష్యుడు ఆలయం చేరుకున్నాడు. రామానుజుల్ని చూడగానే ధనుర్దాసు ఒళ్ళు ఝల్లు మంది. స్వామి అడిగారు 'ఈ వేళ ఉదయం స్వామి తిరువీధి ఉత్సవానికి వస్తూ గొడుగువేసి వేటినయ్యా అంత శ్రద్ధగా కాచికొన్నావు?''

ధనుర్దాసు సిగ్గుతో ''చిత్తం. నా భార్య హేమాంగి కన్నుల్ని''.

''వాటికోస మింత శ్రద్ధ ఎందుకు''

చక్కని కన్నులు స్వామీ!''

"అంతకంటె చక్కని కన్నులు—లేవు స్వామీ! ఉండవు"

"అలాగా, ధనుర్దాసూ! నిదానించి రంగనాథుల కన్నులు చూడు!" ధనుర్దాసు చూశాడు. ధనుర్దాసే చూశాడు. జగత్తును పాలించే కన్నులతో స్వామి ధనుర్దాసును చూచినాడు. అతనిలో మందాకిని జల జల ప్రవహించింది. "ఏలా దాచితి విన్నినాళ్ళు దయలేనే లేదటయ్యా!" అని పరమ భక్తుడు పలవించి పోయాడు. ఇట్లా ఒకక్షణంలో ధనుర్దాసు లక్ష్యం పొందగలిగాడు.

లీలాశుకుడు అనే బిల్వమంగళుడు ధనుర్దాసుని మించిన 'లోలుడు'. తండ్రి మరణశయ్యమీద వున్నాడు. భార్య ఏకాకి. అర్ధరాత్రి భయంకరంగా వురిమి పిడుగు పడితే 'చింతామణికి పిడుగు పడితే భయ'మని వెంటనే బయల్దేరాడు. గాలి, వాన, ఉరుములు మెరుములు,—యేరు పరవళ్ళు తొక్కుతూ పారుతోంది. ఏదో శవం కొట్టుకొస్తుంటే దానిని పట్టుకొని ఏరు దాటాడు. చింతామణి ఇంటి తలుపులు మూసివుంటే గోడకన్నంలో తల దూర్చి వేలాడుతూన్న పాము తోకపట్టుకు ఎక్కి దూకాడు.

"ఇంత రాత్రివేళ, చావు బ్రతుకులమీద వున్న తండ్రిని వదలి, యేటి ఉరవడికి జంకక, శవాన్ని తెప్పచేసుకొని, పాముతోక పట్టుకు ఎక్కి గోడదూకావా? వెర్రిబ్రాహ్మడా! ఎవర్ని వెతుక్కుంటూ వచ్చావు? నేను నీదాన్ననుకున్నావా? ఎందుకయ్యా యింత మమకారం?" అని దూషించింది చింతామణి. 'నేను నీదాన్ననుకున్నావా?' అన్న వాక్యం విని అతడు స్తంభించిపోయాడు.

"చింతామణి నాదికాదా? ఎవత్తెకోసం పరుగులెత్తుకుంటూ వచ్చానో ఆమె నాది కాదా? ఐతే నావారెవరు?" అని ప్రశ్న వేసుకున్నాడు బిల్వమంగళుడు. మేధావి, పండితుడు కనక లోపలినుంచి జవాబువచ్చింది. "ఉన్నారు లేకపోతే నిరపాయంగా యేరు దాటించిందెవరు? నాగుపాము కరవకుండా కాచిందెవరు? ఉన్నారు". ఎవరో కనబడకుండా రక్షించారతణ్ణి. ఆ అదృశ్య రక్షకుణ్ణి అన్వేషిస్తూ బిల్వమంగళుడు బయల్దేరాడు. సోమగిరి యోగీంద్రుడు తారసిల్లి శ్రీకృష్ణుణ్ణి చూపించాడతనికి. ఫలం? "చింతామణిర్జయతు సోమగిరిర్గురుర్మే శిక్షాగురుశ్చ భగవాన్ శిఖిపింఛ మౌళిః" అని ప్రారంభించి అమృత ప్రవాహంగా ప్రవహించిన శ్రీకృష్ణ కర్ణామృతము.

ముక్తి యాత్రికులు మూటలూ ముల్లే బంధు, మిత్ర పరివారమూ, అంతటితోనూ ప్రయాణం సాగిస్తే వారిగమనం మందంగానే వుంటుంది. ఈ బావర బందీలు వదిలిపెట్టి రెక్కలు కట్టుకొని ఎగిరిపోతారు విచిత్ర సాధకులు. వారియాత్ర క్షణంలో కడతేరుతుంది. లౌకికులగమనమే ప్రమాణంగా తీసికుంటే ఆసన్నసిద్ధుల గమనం విపరీతంగానే కనపడుతుంది. వైపరీత్యం మనది. దబ్బాకవాలీలలతో కదలాలంటాం. "ఇవన్నీ వదలిపెట్టి తీరాలా?" అని అడుగుతాం.

# ప్రజాసేవ

ఒక దినమున కొందరు యువకులు పరమహంసయొద్దకు వచ్చి "మేము ప్రజాసేవ జేయ నిశ్చయించుకొంటి" మని చెప్పిరి. శ్రీరామకృష్ణుడు ఆ ఉత్సాహపూరితుల కిట్లు నుడివెను.

"మీ నిశ్చయము ప్రశంసనీయమైనదే. ప్రజాసేవలో నిమగ్నులగుట మంచిదే. కాని మున్ముందు దైవోపాసన సల్పి యతనిని గురించి ధ్యానముచేసి మీ హృదయములను శుభ్రపఱచికొని తరువాత ప్రజాసేవ చేయ బూనుడు. దైవమునుగూర్చి చింతించితిరేని మీ శక్తి వృద్ధిజెందును. భక్తియుతులై ఈశ్వరుని ప్రార్థించితిరేని మంచిచేయుటకు మీకు సమర్థతగల్గును. ఈశ్వరకృపచే మీ పని బాగుగా చేయుటకు నిపుణతయును, తగిన సౌకర్యములును గలుగును. ఎల్లపుడును భగవంతుని ప్రార్థించుచుండుడు. అతనిని ప్రేమించినవారతనిని కీర్తించుచు పాడిన పాటలను మీరు పాడుచుండుడు. అందుచే ప్రజాసేవ చక్కగా చేయుశక్తి మీకు లభించును."

ప్రజాసేవచేయ సమకట్టిన ప్రతి దేశాభిమానియు శ్రీరామకృష్ణుడు చేసిన యీ ముఖ్య బోధను గమనింపవలెను. ప్రజాసేవచేయవలెననెడి అమితమగు కోరికతో, చేయవలసిన పనులను వెదకుచు 'ఇది చేయుదుము, అది చేయుదుము' అని తిరుగకుడు. మీ చేతికందిన పనిని మొదట చేయుచుండుడు. పేరు ప్రతిష్ఠలు సంపాదించుటకై యీ పనికంటె ఆ పని శ్రేష్ఠమని చెప్పుచు తిరుగవలదు. సంఘమునకు సేవచేయుట అనగా కీర్తి, లాభముల నపేక్షింపకుండుటయు, మీ ధర్మముల నిర్వర్తించుటయు అని అర్థము. భక్తికొఱకును, నిశ్చల హృదయముతో సేవచేయు బుద్ధికొఱకును ఏకాగ్రతతో ప్రార్థింపుడు.

దేశమునకు సేవ పలువిధముల చేయవచ్చును. సంఘమునకు సేవచేయుట మంచిదే కాని కీర్తి సంపాదింపవలెనను దురాశతో దానిని ప్రారంభింపరాదు. పేరు సంపాదింపవలెనను కాంక్ష క్లిష్టసమయములు వచ్చినపుడు ప్రజాసేవకుల ప్రయత్నములను తారుమారు చేయును. యశస్సంపాదన కాంక్షగాని, మఱి యితర స్వార్థపరత్వముగాని హృదయములో స్పష్టముగానైనను, ప్రచ్ఛన్నముగానైనను ఉండెనేని, యెంత ఉత్తమ ప్రయత్నములైనను నిష్ప్రయోజనములు కాగలవు.

'నే నితరుల నిమిత్తమెంతయో కష్టించితిని గాని నాకేమియు లాభము చేకూరలేదు' అని యెందరో దేశాభిమానులు మొరపెట్టుట మనము వినమా! ఇట్టి చింతకును, మనస్సులోని అసంతృప్తికిని, కారణమేమి? ఫలాపేక్షతో పనిచేసి ఆ ఫలమును పొందకయుండుటయే. పేరుప్రతిష్ఠలు సంపాదించుటకై దేశమునకుగాని, సంఘమునకుగాని సేవచేయ ప్రారంభించువారు ఆపదలపాలగుదురు. ఇట్టి యపవిత్రమయిన యుద్దేశము ఎట్టి మంచిపనినైనను పాడుచేయును. ఒకరి లాభము నిమిత్తముగాని, సంఘసేవకొఱకుగాని మన మెట్టి మంచిచేసినను దానిని మనము దేవుని కర్పించి అతని కరుణను నమ్ముకొనియుండవలెను. ఇటుల చేసితిమేని జయము చేకూరినపుడు పొంగిపోవుటయును, అపజయము చేకూరినపుడు క్రుంగిపోవుటయును కలుగవు.

స్వలాభము నిమిత్తమును, కీర్తి సంపాదింపవలెనను కోరికతోను చేయునది నిజమైనసేవ కానేరదు. అది యొక విధమయిన వ్యాపారము. దేశమునకు సేవచేసిన గొప్ప దేశాభిమానులు పేరుప్రతిష్ఠలు పొందినది వాస్తవమే.

కాని ఆ జగద్విదిత పురుషులు ప్రతిష్ఠకొఱకు పెనుగులాడలేదు. వారికి లభించిన జయఖ్యాతులలోగల రహస్యమేమన ప్రతిష్ఠనాశింపక పనిచేయుటయే. ఈ నియమును మఱచి అట్టి కీర్తిని తాముకూడ సంపాదింపవలెనను లక్ష్యముతో పాటుపడినవారు తఱచుగా ఆశాభంగశోకము నొందుట మనము చూచియున్నాము.

కీర్తి ప్రతిఫలముల నాశింపక ప్రజాసేవ యెట్లు చేయనగునని కొందఱు ప్రశ్నింపవచ్చును. అట్టి సందర్భ మనస్కులు తమగృహ ధర్మములనుమాత్రమే నిర్వర్తించుచు న్యాయబుద్ధితో నడచుకొనినచో, సంఘసేవచేసినవారే యగుదురు. అట్టివారు ప్రజాసేవచేయ సమకట్టక, అందుచే కలుగు విచారము, విసుగు తప్పించుకొనవచ్చును.

ఆసక్తి, వాంఛ లేకుండ ప్రజాసేవచేయుట కష్టము. అందులకే శ్రీరామకృష్ణుడు ఇటులనెను. "ప్రజాసేవలో చొరబడుటకు ముందు భగవత్కటాక్షమును సంపాదింపుము. 'ఓ ప్రభూ! నా హృదయమును భక్తితో పూరింపుము' అని మొదట ప్రార్థింపుడు."

ప్రజాసేవలో నిమగ్నులగువారలకు శ్రీ రామకృష్ణు డొసగిన యీ హెచ్చరిక చాల ముఖ్యమయినది. తాముపడిన కష్టము, వ్యయపఱచిన ధనము వృధాయయినదని చాలమంది విషాదపూరితులగుచున్నారు. దీని రహస్యము వారు ప్రారంభమున అవలంబించిన మనోదృష్టి తప్పుగా నుండుటే. పాలకుండలో నొక మజ్జిగ చుక్కపడి యేరీతిగా ఆ పాల నన్నిటిని పెరుగుగ మార్చునో ఆ తప్పుయొక్క మహిమయు అట్టిదే. పేరుప్రతిష్ఠలు పునాదిగా నిర్మింపబడిన సౌధముయొక్క గతి మఱి యెట్లు వేఱగును? అది తప్పక పతనమొంది విచారమును గలిగించును. అందులకే "మీరు ప్రజాసేవకై నడుముకట్టుటకు ముందు భగవంతుని ప్రార్థింపుడు. భక్తి యను ఉపకరముచే మీ మనస్సును శుభ్ర పఱచుకొనుడు. తదుపరి పనిని ప్రారంభింపుడు. పునాది గట్టిదియు సుస్థిరమయినదియు నయినచో సరిగ నిర్మించిన కట్టడము సురక్షితముగనే యుండును" అని శ్రీ రామకృష్ణుడు నుడివెను.

శస్త్రచికిత్స మొదలిడుటకు ముందు వైద్యు లేమి చేయుదురు? వారి చేతులు, కత్తులు శుభ్రముగా నుండునట్లు కడిగి కత్తిని ప్రయోగింతురు. అట్లే ప్రజాసేవ చేయ నుద్యమించిన వారు ముందుగా తమ మనస్సును శుభ్రపఱచుకొనవలెను. అప్పు డీశ్వరకృపచే నంతయు సక్రమముగా నుండును. చేయు కృషి సాఫల్యమొందుటకును, మనశ్శాంతి బడయుటకును వేఱొండు ఉపాయములేదు. భగవంతునియెడ పరిపూర్ణ శరణాగత భావమును, అతని అనన్య ప్రాభవజ్ఞానమును సాధించుటకు మంత్రములు జపించుట చాలదు. కేవల శుష్కకర్మ కలాపము నిష్ప్రయోజనము. హృదయమునందు భక్తి దీపింపవలెను. దానికి తరువాతనే యేవిధమయిన ప్రజాసేవయందైనను ప్రారంభింపనగును. దైవముయొక్క తోడ్పాటు నాశింపక ప్రారంభింపబడు ఏ కార్యమయినను అసత్యమయినదియు, మోసమయినదియు అగును. దుఃఖమును, కోపమును, ఈర్ష్యను జనింపజేయును.

ప్రజాసేవచేయ మొదలిడినపుడు మాత్రమే భగవంతుని తలంచి పూజించుట చాలదు. శ్రీ రామకృష్ణ భగవానుడు ఉపదేశించినటుల మనము పనిచేయుచున్నంతకాలముకూడ మనసులో భగవంతునియందు తలంపు దృఢముగ నిల్పి పనిచేయవలెను.

సంఘసేవ, భగవంతునిపూజ, యీ రెండును వేఱని యెంచుట తప్పు. అన్నికర్మలు భగవంతుని యుపాసనయే యని చేయవలెను. భగవంతునిమీది తలంపు, చేయబడు కర్మ కవరోధముకాదు. భగవంతునిమీది భక్తితో కర్మముచేయు నభ్యాసము మన కెక్కువ యానందమును గలిగించును. పనిచేయుటకు మనకది నిపుణతను, ఉత్సాహము నిచ్చును. గాంధిమహాత్మునికి విజయము గలుగుటలో గల రహస్యమిదియే యని నేను నిస్సందేహముగా చెప్పగలను. ఏ పనిచేసినను, ఏ సాధనమును సంకల్పించినను, ఏ పూనిక నుపక్రమించినను, భగవచ్చింతనము—నడచువాని వెంట నీడ చనునట్లు - అతని హృదయమున ఎప్పుడును నిలిచి అనుసరించుచుండెను. ఈ తలంపు అతని పనికి అంతరాయమును కలుగజేయుటకు మారుగా విజయమునకే ఆధారమగుచుండెను. మనము చేయగల చిన్నపనులందు సైతము ఈ భగవచ్చింతనము అదేరీతిగ మన ప్రక్కన నీడవలె నిలిచి మనకు గుప్తముగా తోడ్పడును. సంఘసేవకుడు ఎడతెగక భగవచ్చింతన మనస్సులో నుంచుకొనియే కృషిసల్పుట ముఖ్యావసరము. నిర్మలమైన మనస్సు మహానిధివంటిదే కాక అమోఘమగు సాధనము కూడ. దానిని బడయుటకు మార్గము భక్తి యొకటియే.

(శ్రీ రామకృష్ణోపనిషత్తునుండి)

ఉద్యానమామ్ర కదలీపనసైరసూన్యం హర్మ్యం పశుద్రవిణ భోగచయైస్సమృద్ధం
దాంపత్యమాత్మజ కళత్రసుఖైః ప్రపుష్టం త్వద్భక్తధీరహృదయం నవిలోభయన్తి॥

మామిడి అరటి పనసలతో నిండిన తోటలు, ధనధాన్యములతో భోగభాగ్యములతో నిండిన ఇండ్లు వాకిండ్లు, అనుకూలురైన భార్యాబిడ్డలవలన గలిగే సంసారసుఖములు - ఇవి ఏవీ నీ భక్తుని ధీర హృదయమును ప్రలోభపెట్టజాలవు. —శ్రీ రామకృష్ణ కర్ణామృతము.

* * * *

పరిశీలించితి మంత్రతంత్రములు చెప్ప న్వింటి సాంఖ్యాది యో
గ రహస్యంబులు వేదశాస్త్రములు వక్కాణించితిన్ శంక పో
దరయం గుమ్మడికాయలోను యవగింజంతైన నమ్మించి సు
స్థిర విజ్ఞానము త్రోవ జెప్పగదవే శ్రీ కాళహస్తీశ్వరా!

*

జానామి ధర్మం న చ మే ప్రవృత్తి ర్జానామ్యధర్మం నచ మే నివృత్తిః।
కేనాపి దేవేన హృదిస్థితేన యథా నియుక్తోస్మి తథాకరోమి॥

ఇది ధర్మం, ఇది అధర్మం అని నాకు బాగా తెలుసు. కాని ధర్మాన్ని పాటించలేక పోతున్నాను. అధర్మంగా నడుచుకోవడం మానలేకపోతున్నాను. నా హృదయంలో ఉన్న ఏదో ఒక అజ్ఞాతశక్తి నన్నెట్లా ఆడిస్తున్నదో అట్లా ఆడుతున్నాను. అంతే.

—మహాభారతంలో ఒకచోట దుర్యోధనుడు కృష్ణునికి చెప్పినది.

# ఈశావాస్యోపనిషత్

'సమతాసంధ'

సపర్యగాచ్ఛుక్రమ కాయమవ్రణ
మస్నావిరగ్ం శుద్ధమపాపవిద్ధమ్
కవిర్మనీషీ పరిభూః స్వయంభూ
ర్యాథాతథ్యతో అర్థాన్వ్యదధాచ్ఛాశ్వతీభ్యః సమాభ్యః ॥౮॥

సః ఆ ఆత్మ స్వ- స్వతఃసిద్ధమైనది – కారణములేనిది కార్యముకానిది పర్యగాత్ సర్వవ్యాప్తమైనది అకాయం శరీరములేనిది అస్నావిరమ్ కండరాలు లేనిది అపాపవిద్ధమ్ అజ్ఞాన సంపర్కములేనిది శుక్రమ్ ప్రకాశస్వరూపం గలది అవ్రణం చెక్కు చెదరనిది (పూర్ణమైనది) శుద్ధమ్ నిర్మలమైనది కవిః అన్నిటిని చూచునది మనీషీ సర్వజ్ఞమైనది. పరిభూః అన్నిటిని ఆవరించినది. యాథాతథ్యతః సక్రమముగ శాశ్వతీభ్యః నిత్యులైన సమాభ్యః ప్రజాపతులకు (సంవత్సరములకు) అర్థాన్ విధులను వ్యదధాత్ ఏర్పాటుచేసెను.

స్వతఃసిద్ధమైన ఆత్మ సర్వవ్యాప్తమైనది. శరీరము, కండరాలులేనిది. అజ్ఞానరహిత ప్రకాశస్వరూపంకలది, పూర్ణమైనది, సర్వదృక్కు, సర్వజ్ఞము. అన్నిటినీ ఆవరించినది. నిత్యులైన ప్రజాపతులందరి విధులను సక్రమంగా ఏర్పాటు చేసినది.

1. సక్రమంగా:—"విశ్వంలో అన్ని వస్తువులను శాశ్వతంగా క్రమబద్ధం చేసింది ఆత్మ. అనంతమైన పరంపరలో ప్రతి యుగముయొక్క ధర్మనిర్ణయం చేసినది ఆత్మ" అనికూడా ఈ మంత్రానికి అర్థం చెప్పబడినది.

అంధం తమః ప్రవిశంతియే అవిద్యాముపాసతే
తతోభూయ ఇవ తే తమో య ఉ విద్యాయాగ్ం రతాః ॥౯॥

యే ఎవరు అవిద్యాం అవిద్యను ఉపాసతే సేవింతురో తే వారు అంధం గ్రుడ్డివానిగ జేయు తమః చీకటిలోనికి ప్రవిశంతి ప్రవేశించెదరు. యే ఉ విద్యాయాం రతాః ఎవరు విద్యయందే ఆనందమును పొందుదురో తే వారు తతః అంతకంటె భూయః ఇవ ఎక్కువైనట్లు తోచు తమః చీకటిలో ప్రవిశన్తి ప్రవేశించెదరు.

అవిద్యను సేవించువారు[1] (జ్ఞానరహితమైన కర్మకాండను సేవించువారు) గ్రుడ్డితనమును కలిగించు చీకటిలో ప్రవేశించెదరు. కేవలము విద్యయందే ఆసక్తులైనవారు[2] (కేవల శాస్త్రజ్ఞానమునందే నిమగ్నమైనవారు) అంతకన్న దట్టముగతోచు చీకటిలోనికి ప్రవేశించెదరు.

1. అవిద్యను సేవించువారు :—అవిద్య అనగా అజ్ఞానము. ఇక్కడ కర్మకాండ అని అర్థం. కర్తృత్వరహితమైన ఆత్మనుగూర్చిన అజ్ఞానమే కర్మకాండకు మూలము.

2. కేవలము విద్యయందే ఆసక్తులైనవారు :—విద్య యనగా శాస్త్రజ్ఞానము-దేవతల, కర్మకాండల గూర్చిన శాస్త్రజ్ఞానము.

కర్మకాండతో తృప్తులై వైదికకర్మల అంతరార్థమును తెలుసుకొన ప్రయత్నించని వారు రజోగుణపూరితులు. అంతరార్థమును కర్మల ప్రాముఖ్యమును తెలుసుకొనడంవలన ప్రాప్తించు సత్వశుద్ధిని వారు పొందలేరు. దేవతల, యజ్ఞములగూర్చిన శాస్త్రజ్ఞానముతో తృప్తులై, కర్మశూన్యులగువారు మొదటి తరగతికన్న అధమశ్రేణిక చెందినవారు. కర్మశూన్యతవలన జడులై వారు తమోగుణ ప్రాబల్యానికి లోనయినవారు. ఈ స్థితి సత్యమునకూ చాలా దూరమైనది

అన్యదేవాహుర్ విద్యయా అన్యదాహుర విద్యయా
ఇతి శుశ్రుమ ధీరాణాం యేనస్తద్ విచచక్షిరే ॥10॥

విద్యయా విద్యవలన అన్యత్ మరొకఫలము ఆహుః చెప్పెదరు. అవిద్యయా అవిద్యవలన అన్యత్ ఏవ నిజానికి మరొకటి ఆహుః చెప్పెదరు ఇతి ఈ విధముగ ధీరాణాం బుద్ధిమంతులవలన శుశ్రుమ విన్నాము యే ఎవరు నః మాకు తత్ దానిని విచచక్షిరే స్పష్టముగా బోధించిరో.

విద్య (కర్మనుగూర్చిన తత్త్వజ్ఞానము)వలన ఒకఫలం లభిస్తుందని[1] అవిద్యవలన (జ్ఞానశూన్యమైన కర్మకాండవలన) మరొకఫలం లభించునని[2] చెప్పెదరు. మాకు వివరించిచెప్పిన బుద్ధిమంతులవలన మేము విన్న విషయమిది.

1. ఒకఫలం లభిస్తుందని :—కర్మలగూర్చిన తత్వజ్ఞానమువలన లభించునవి దేవలోకములు.

మరొకఫలం లభించునని :—కేవల కర్మకాండవలన లభించునవి పితృలోకములు.

విద్యాంచ అవిద్యాంచ యస్తద్ వేదోభయగ్ం సహ
అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయా అమృతమశ్నుతే ॥11॥

యః ఎవడు విద్యాంచ అవిద్యాంచ విద్యను అవిద్యను తత్ ఉభయం సహ రెండింటిని వేద తెలుసుకొనునో అతడు అవిద్యయా అవిద్యచేత మృత్యుం మృత్యువును తీర్త్వా దాటి విద్యయా విద్యవలన అమృతం అమృతత్వమును అశ్నుతే పొందును.

ఎవడు విద్యను అవిద్యను రెండింటిని తెలుసుకొనునో వాడు అవిద్యవలన (కర్మకాండవలన) మృత్యువును జయించి విద్యవలన (కర్మకాండను గూర్చిన తత్త్వజ్ఞానమువలన) అమృతత్వాన్ని పొందును.

# గేయ సుమములు

అగుగాక నిర్మలము అస్థిచర్మములు
అగుగాక నిర్మలము రక్తమాంసములు
అగుగాక నిర్మలము అస్థిగతమజ్జ
అగుగాక నిర్మలము దేహమంతయును
పడిపోవు గాకనా సర్వబంధములు
పడిపోవు గాకనా సర్వమలినములు
అగుగాక నిర్మలము జ్ఞానేంద్రియములు
అగుగాక నిర్మలము కర్మేంద్రియములు
అగుగాక నిర్మలము సర్వకర్మలును
పడిపోవు గాకనా సర్వబంధములు
పడిపోవు గాకనా సర్వమలినములు
అగుగాక నిర్మలము నాదుమానసము
అగుగాక నిర్మలము ముఖ్యప్రాణంబు
అగుగాక నిర్మలము భూమివాయువులు,
అగుగాక నిర్మలము జలమగ్ని నింగి,
పడిపోవు గాకనా సర్వబంధములు
పడిపోవు గాకనా సర్వమలినములు
అయ్యేదను గావుతనే పావనుండ
పావనుండ నేనయ్యేదను గాత
నేనె ఆత్మను నేను, శుద్ధుడను నేను,
నేనె ముకుందను. నేనానందమయుడ.

మునగవే లోతుకు మునుగవే మనస
సర్వేశు సౌందర్య సంద్రంబునందు
అట్టడుగు లోతులను అందగలవేని
ప్రభుప్రేమ రత్నము దొరకదె వదట ॥ము॥
వెదకవే హృదయాన వెదుకవే మనస
వెదకగనె గాంచెదో బృందావనంబు
శ్రీ కృష్ణచంద్రుడు క్రీడించు నెపుడు
భక్తిశ్రద్ధముతోడ పాడియాడుచును ॥ము॥
వెలిగింపవే మనస వెలుంగు జ్యోతి
వెలిగింపవే నిత్య విజ్ఞానదీప్తి
ఆరకుండగ జేయుమా దీపశిఖను
నిరతము కదలక నీడెందమందు ॥ము॥
నీ పడవ నెవ్వరు నెట్టుచున్నారు
గట్టిగా నేలపై పట్టి త్రోయుచును
అతడె నీ గురువని అనియె కబీరు
భావింపుమా గురుపద పద్మములను ॥ము॥

అనువాదం: బి. ఎస్. ఆర్. ఆంజనేయులు

## వార్తలు: పాకాల శ్రీ రామకృష్ణ సేవాసంఘం ద్వితీయ వార్షికోత్సవాలు

పాకాలలోని శ్రీ రామకృష్ణ సేవాసంఘం ద్వితీయ వార్షికోత్సవాలు మేనెల 24 వ తేదీన ప్రారంభమై 27 వ తేదీన సమాప్తమైనవి. ప్రతిరోజూ ఉదయమూ, సాయంకాలమూ రాజమండ్రి మఠాధ్యక్షులు శ్రీ నందానంద స్వాములవారు ఆధ్యాత్మిక ప్రసంగాలు గావించారు. వరుసగా మూడురోజులు రాణీరాసమణి, శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి జీవితచరిత్రలను తెలిపే చలనచిత్రాలు ప్రదర్శింపబడినవి. 25 వ తేదీన పేదలకు అన్నదానం జరిగింది. ఆనాటిసమావేశంలో ప్రసంగించిన పార్లమెంటు సభ్యులు శ్రీ పి. రాజగోపాల నాయుడు ధ్యానమూ, యోగమూ – ఇవి రెండూ ప్రాచీన హైందవమహర్షులు మానవ జాతికి అందజేసిన అమూల్యసంపదలనీ, వీటి ద్వారా మానవుడు భౌతికజీవితంలో ప్రశాంతతను పొందవచ్చునని తెలియజేశారు. సేవా సంఘ అధ్యక్షులు శ్రీ ఎన్. సి. రామచంద్రా రెడ్డి సంఘ కార్యకలాపములలో ఇతోధికంగా తోడ్పడాలని గ్రామప్రజలకు విజ్ఞప్తి చేశారు. కార్యదర్శి శ్రీ ఎన్. పరంధామనాయుడు వందనసమర్పణ చేశారు.

—క. సదానంద.



# శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004

## 1977 జూలై నెల కార్యక్రమము

శ్రీ రామకృష్ణానందస్వామి జయంతి బహిరంగ సమావేశము 17-7-77 సా॥ 5-00 నుండి 7-00 వరకు
అధ్యక్షులు: శ్రీమత్ తపస్యానందస్వామి.
ఉపన్యాసకులు: శ్రీ టి. ఎస్ అవినాశిలింగం (తమిళము)
స్వామి ఆత్మానందజీ (ఆంగ్లము)

**ఆదివారములందు సత్సంగ సమావేశములు:**

| | |
|---|---|
| సా. 4-00—4-20 వరకు | శ్రీవిష్ణుసహస్రనామ పారాయణము (3-7-77, 24-7-77)<br>శ్రీలలితా సహస్రనామ పారాయణము (10-7-77, 31-7-77) |
| 4-20—4-30 ,, | ధ్యానము. |
| 4-30—5-30 ,, | ఉపన్యాసము (తమిళము)<br>శ్రీదక్షిణామూర్తి స్తోత్రము: డా. టి. ఎమ్. పి. మహాదేవన్ (24-7-77)<br>శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రము: శ్రీ వి. ఆర్. కళ్యాణసుందరశాస్త్రి (10-7-77)<br>శ్రీమద్భాగవతము: శ్రీ అణ్ణా (31-7-77)<br>శ్రీమద్రామాయణము: శ్రీ పిచ్చునాథన్ (3-7-77) |
| 5-35—6-30 | ఉపన్యాసము (ఆంగ్లము)<br>శ్రీమద్భగవద్గీత: శ్రీ స్వామి గంభీరానందజీ (3-7-77, 10-7-77, 24-7-77)<br>మాండూక్యకారిక: డా॥ టి. ఎమ్. పి. మహాదేవన్ (31-7-77) |
| 6-30—8-00 | ఆరాత్రికము, భజన. |
| విశేషోపన్యాసములు: | 12, 13, 14 తేదులందు సా॥ 7-15 నుండి 8-15 వరకు<br>తులసీదాసు రామాయణోపన్యాసములు (హిందీ)<br>స్వామి ఆత్మానందజీ, రామకృష్ణ ఆశ్రమము, రాయపూరు. |

**ప్రత్యేకోపన్యాసములు:** శనివారములందు సాయంకాలము 5-45 గంటలకు.

శ్రీమద్రామాయణ పఠనము: శ్రీ పి. రామకృష్ణన్, ఐ.సి.ఎస్. (రిటైర్డు) (4-6-77)
గజేంద్రమోక్షము: శ్రీ ఆర్. కోదండరామన్. (11-6-77)

**ఇతర వారములందు ఉపన్యాసములు: సాయంకాలము 6-45 గంటలకు.**

| | |
|---|---|
| సోమవారములు: | శ్రీరామకృష్ణ కథామృతము: శ్రీమత్ అమృతానందస్వామి (ఆంగ్లము) |
| మంగళవారములు: | అధ్యాత్మరామాయణము: శ్రీమత్ గంభీరానందస్వామి (ఆంగ్లము) |
| బుధవారములు: | శ్రీ మహాభారతము: శ్రీ 'అణ్ణా' ఎస్. సుబ్రమణియన్ (తమిళము) |
| గురువారములు: | శ్రీ విరంజనచైతన్య రామకృష్ణదేవుని ఉపదేశములు (తమిళము) |
| శుక్రవారములు: | ఉపన్యాసము: స్వామి కీర్తిదానందజీ (ఆంగ్లము) |

తదితరములు: 24-7-77 అంటర్యోగము. ఏకాదశి దినములందు (12-7-77, 27-7-77) సాయంకాలము రామనామభజన (ఆరాత్రికానంతరము)

గురుపూర్ణిమ (18-7-77)

శుక్రవారములందు సాయంకాలము 6-30 గంటలకు తిరువళ్లిక్కేణి 18. దక్షిణ మాడవీధిలో శ్రీరామకృష్ణ మందిరమున శ్రీ గోలోకానందస్వామి గారి గీతోపన్యాసములు. (ఆంగ్లము)

ఈ కార్యక్రమములకు అందరిని సాదరముగా ఆహ్వానించుచున్నాము.

అధ్యక్షులు,
శ్రీరామకృష్ణమఠము, మద్రాసు-600004.

శ్రీ రామకృష్ణ గ్రంథ

## వివేకానందసింహగర్జనము

### శ్రీ చిరంతనానందస్వామి

భారతీయులను ధీరజనులను చేయుటకు శ్రీవివేకానందస్వామి యొసగిన యుద్బోధనలనుండి అమూల్యములు ఉత్తేజకరములు అగువచనములను కొన్నింటిని రచయిత సేకరించి యనువదించిరి. శరీరమును పులకింపజేసి మనస్సును లోగొను రచన.

పుటలు : 30 వెల : 20 పైసలు.

## యువకులకు వివేకానందుల పిలుపు

అనువాదకులు :

### వి. ఎస్. ఆర్. ఆంజనేయులు

నవభారతయువత నుద్బోధించుచు శ్రీ వివేకానందస్వామి యొనర్చిన యుపన్యాసములనుండి మేటి రత్నములను సేకరించి ఆంగ్లమున వివేకానంద స్పీక్స్ టు యంగ్ మెన్ అను పుస్తకము ప్రచురితమైనది దాని కిది యనువాదము. యువకులయందు ఆత్మవిశ్వాసమును దేశభక్తిని కార్య తత్పరతను ప్రోత్సహించు అమూల్య సంకలనము.

పుటలు : 56 వెల : 75 పైసలు.

ప్రథమ ముద్రణము.

## సర్వం విష్ణుమయం జగత్

అనువాదకుడు :

### శ్రీ చిరంతనానందస్వామి

వివేకానందస్వామి లండను నగరమున నొసగిన గాడ్ ఇన్ ఎవ్విరిథింగ్ అను ఉపన్యాసమున కిది యనువాదము. మతధర్మములపై స్వామి యుపన్యసించుచు మానవ జీవితోద్దేశమును జీవన విధానమును మనోహరముగ ఈశావాస్యోపనిషత్తుకు ధారాళ వ్యాఖ్యగ వివరించి యున్నారు.

పుటలు : 36 వెల : 35 పైసలు.

## పారమార్థిక సంభాషణలు

అనువాదకులు :

### కందుకూరు మల్లికార్జునంగారు

మాతృదేవి శ్రీ శారదాదేవి, శ్రీ బ్రహ్మానందస్వామి, శ్రీ ప్రేమానందస్వామి, శ్రీ తురీయానందస్వామి, శ్రీ శివానందస్వామి, శ్రీ శారదానందస్వామి అనెడి ఆర్గురు జ్ఞానసిద్ధుల అమూల్యములగు భాషణము లిందున్నవి. నిత్యనూతనములగు పారమార్థిక సమస్యలకు వారిచ్చు ఉపదేశములు ఆధ్యాత్మ సాధకుల కత్యంతము ఉపయోగకరములు.

పుటలు: 424 వెల: రూ. 6-50

ఇట్లు వ్రాయుడు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004

# మా తెలుగు ప్రచురణలు

| శ్రీ రామకృష్ణులపై : | రూ. పై. |
|---|---|
| శ్రీ రామకృష్ణ కథామృతము | 8-00 |
| ,, (క్యా | 12-00 |
| శ్రీ రామకృష్ణ జీవిత చరిత్ర | 10-00 |
| (క్యాలికో) | 14-00 |
| శ్రీ రామకృష్ణ బోధామృతము | 8-00 |
| ,, (క్యాలికో) | 15-00 |
| శ్రీరామకృష్ణోపనిషత్తు | 3-75 |
| శ్రీ రామకృష్ణ పరమహంస నీతికథారత్నములు | 2-50 |
| గురూప దేశములు | 2-00 |
| శ్రీ రామకృష్ణ పరమహంస జీవిత సంగ్రహము | 0-75 |
| నా గురుదేవుడు | 1-25 |
| శ్రీ రామకృష్ణ దివ్యవాణి | 1-50 |
| **శ్రీ శారదాదేవిపై :** | |
| శ్రీ శారదాదేవి జీవిత చరిత్ర | 4-00 |
| శ్రీ శారదా ప్రసంగములు | 3-00 |
| శ్రీ శారదాదేవి | 2-50 |
| **శ్రీ వివేకానందస్వామిపై:** | |
| శ్రీ వివేకానంద జీవిత చరిత్ర | 4-00 |
| బాలల వివేకానందుడు | 2-00 |
| శ్రీ వివేకానంద సంపూర్ణ గ్రంథావళి 10 సంపుటముల సెట్టు (సాదా) | 65-00 |
| ,, క్యాలికో | 73-50 |
| విడి సంపుటములు ఒక్కొక్కటిసాదా | 5-00 |
| ,, ,, క్యాలికో | 6-50 |
| సందేశ తరంగిణి (మొదటి భాగము) | 4-00 |
| ,, (రెండవ భాగము) | 5-50 |
| జ్ఞానయోగము (ముద్రణలో) | |

| | రూ. పై. |
|---|---|
| భక్తియోగము | 4-00 |
| రాజయోగము | 6-25 |
| కర్మయోగము | 4-00 |
| వివేక సూర్యోదయము | 4-00 |
| యువకులకు వివేకానందుల పిలుపు | 0-75 |
| శ్రీ వివేకానంద సింహగర్జనము | 0-20 |
| సర్వం విష్ణుమయం జగత్ | 0-35 |
| భారత యువజనులారా! | 3-00 |
| ప్రబోధ రత్నాకరము | 2-50 |
| శ్రీ వివేకానంద లేఖావళి (మొదటి భాగము) | 2-25 |
| ,, (రెండవ భాగము ముద్రణలో). | |
| హిందూ మతము | 4-00 |
| అనుష్ఠాన వేదాంతము | 2-50 |
| ప్రాచ్యము, పాశ్చాత్యము | 1-25 |
| షికాగో నగరోపన్యాసములు | 1-00 |
| కులము, సంస్కృతి, సామ్యవాదము | 3-00 |
| భారత దేశము | 2-00 |
| భారతీయ మహిళ | 2-00 |
| నా సంస్కరణ యుద్ధ విధానము (ముద్రణలో) | |
| నవీన భారత దేశము | 0-40 |
| పవహారి బాబా (ముద్రణలో) | |
| నా జీవితము, జీవిత కార్యము | 1-25 |
| గురు, శిష్య సంవాదములు (ముద్రణలో) | |
| శ్రీమద్భగవద్గీత (టీకాతాత్పర్య విశేషార్థసహితము) | 9-00 |
| పారాయణగీత తాత్పర్యసహితము | 3-75 |
| ,, మూలము | 2-00 |

సంపాదకులు : శ్రీ చిద్ఘనానందస్వామి.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-600021) న ముద్రింపబడి,

శ్రీ చిద్ఘనానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మద్రాసు-600004) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము 34 1977 - జూలై : పింగళ - ఆషాఢము సంచిక 7

## విషయ సూచిక

## శ్రీ వివేకానంద జీవితచరిత్ర

(శ్రీ చిరంతనానందస్వామి ప్రణీతము)

ఇందు శ్రీ స్వాములవారి జీవితమున నింతకుపూర్వము గ్రంథస్థములుగాని ముఖ్య సంఘటన లెన్నియో శ్రీవారి సోదర శిష్యులవలన విని వ్రాయబడినవి. ఇది శ్రీ స్వాములవారి సంపూర్ణ చరిత్ర!

నిర్దుష్టమైన భాష, అందమైన అచ్చు, ఆకర్షకమైన రూపము.

432 పుటలు వెల. రూ. 4-00

(పదవ కూర్పు)

## శారదాదేవి జీవిత చరిత్ర

రచయిత:

శ్రీ చిరంతనానందస్వామివారు

శ్రీ రామకృష్ణభగవానుని సతీమణియు ఆదర్శమాతయు, యోగినియునగు మహనీయురాలి దివ్యచరిత్ర. ప్రతి స్త్రీయును పురుషుడును చదువవలసిన గ్రంథము. తియ్యని తెలుగు. పాలవంటి శైలి.

ఆఱవకూర్పు.

పుటలు 246 వెల రూ. 4-00

## బాలల వివేకానందుడు

బెంగాలీ మూలము:

శ్రీ నిరామయానందస్వామి

అనువాదకులు:

శ్రీ కరణం రంగనాథరావు

జగద్విఖ్యాతుడైన వివేకానందస్వామి జీవితచరిత్ర బాలబాలికలకు సులభముగా అర్థమగునట్లు రచింపబడినది. స్వామివారి బాల్యవిశేషములు శ్రీ రామకృష్ణుల సాంగత్యము పాశ్చాత్యదేశములకు పయనము మాతృదేశమున వారి కార్యక్రమము మనోహరముగ సంగ్రహింపబడినది.

పుటలు · 80+viii వెల · రూ. 2-00

(రెండవ ముద్రణము)

## రామకృష్ణోపనిషత్తు

తమిళ రచయితలు:

శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్యులుగారు

ఆంధ్రానువాదకులు

గౌ॥ న్యాయమూర్తి

శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు

శ్రీరామకృష్ణ దేవుని దివ్యోపదేశ వాక్యము లాధారముగాగొని, వానిని విరివి పఱచి, మనోహర కథా రూపముగను, సంభాషణరూపముగను అమర్చబడినవి.

128 పుటలు వెల రూ. 3-75

ఇట్లు వ్రాయుడు మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004



ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్యవరాన్నిబోధత.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము 34 | 1977 – జూలై : : పింగళ – ఆషాఢము | సంచిక 7

## ప్రార్థన

యో బ్రహ్మాణం విదధాతిపూర్వం యోవై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై
తం హ దేవమాత్మ బుద్ధిప్రకాశం ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే
నిష్కలం నిష్క్రియం శాంతం నిరవద్యం నిరంజనం
అమృతస్య పరంసేతుం దగ్ధేంధన మివానలం

సంసార మహోదధిని అతిక్రమించుటకు అమృతత్వతీరమును చేరుటకు వారధివంటి వాడును, బుద్ధియందు ఆత్మజ్ఞానప్రకాశమును కలిగించువాడును, బ్రహ్మదేవుని సృష్టించి అతనికి వేదములను అనుగ్రహించినవాడును అగు ఆ స్వప్రకాశస్వరూపుని, నిరవయవుని, నిష్క్రియుని, నిర్వికారుని, నిరవద్యుని, నిరంజనుని మోక్షార్థినై శరణుజొచ్చుచున్నాను.

—శ్వేతాశ్వతరోపనిషత్.

అనలునకు రవికిని శశాంకునకును గ్రహతారకములకు తేజంబు
ఎవ్వనివలన ఆవహిల్లెడు అనుపాధిక తేజుగొల్తు అవ్విశ్వాత్మున్
ఎవ్వడు సచరాచరగురుడు ఎవ్వని నాభిసరోజమీనె విధాతన్
నివ్వటిలు జగములన్నియు ఎవ్వనిచే, అమ్ముకుందు నెప్పుడు కొలుతున్
స్థావరములు జంగమములు ధాతలోనుగాగ ప్రళయంబునొందిన కాలమునను
నిలుచు నెవ్వడొకండ ఆ నిత్య సత్య లలితు శార్ఙ్గి ప్రసన్నుగా గొలుతు నిమతి.

—శాంతిపర్వము,

# వివేకానందవాణి

సత్త్వరజస్తమోగుణములు – వీనిలో ఏదో యొకటి ఎక్కువగనో తక్కువగనో – ప్రతి మానవునందు ఉన్నట్లే, బ్రాహ్మణత్వమును, వైశ్యత్వమును, శూద్రత్వమును కల్పించు గుణములు సహజములై ప్రతి మనుష్యునందును – హెచ్చు తక్కువలుగా – నిలిచియుండును. కాని ఒక్కొక్క తరుణమున ఒక్కొక్క గుణము – పరిమాణ తారతమ్యములతో – అతిశయిల్లి వ్యక్తమగుచుండును. వివిధ వ్యాపార ప్రసక్తుడగు ఒకే మానవుని కైకొందము. జీవనమునకై ఒకని కొలువు కొలుచునపుడు అతడు శూద్రుడు, లాభము ఆర్జించుకొనుటకై ఏదో ఒక వ్యవహారమందు ప్రసక్తుడై యున్నప్పుడు అతడు వైశ్యుడు, ధర్మనిర్వాహణార్థమై దుష్టులతో పోరాడునప్పుడు అతని క్షత్రియగుణములు అభివ్యక్తములగును; భగవద్ధ్యాన మగ్నుడై యున్నప్పుడు అతడు బ్రాహ్మణుడు. స్వభావ కారణమున మానవుడు ఒక కులమునుండి మఱొక కులమునకు మాఱుట సాధ్యము. కానిచో విశ్వామిత్రుడు బ్రాహ్మణుడు ఎట్లయ్యెను? పరశురాముడు క్షత్రియు డెట్లయ్యెను?

* * *

కులము అనునది సాంఘికవ్యవస్థ. సాంఘిక జీవనమున నేను ఒక కార్యము ఒనర్పగలను. నీవు మఱొక కార్యమును ఒనర్పగలవు. నీవొక దేశమును పాలింపగలవు. నే నొక పాత చెప్పులజతను బాగు చేయగలను. కాని ఆ కారణమున నీవు నా కన్న అధికుడవు కాజాలవు, ఏలన నీవు నా చెప్పులు బాగు చేయగలవా? నేను దేశమును ఏలగలనా? చెప్పులు బాగుచేయు తెలివి నాకు గలదు. వేదాధ్యయనము చేయు తెలివి నీకు కలదు. కాని అందుచేత నీవు నా తలపై ఎక్కి త్రొక్కవగునా? కులవ్యవస్థ మంచిదే. జీవితసమస్యను పరిష్కరించుటకు అదియే సరియైన మార్గము. మనుష్యులు వర్గములుగా ఏర్పడియే తీరుదురు. అది మాన్పుట నీకు శక్యముకాదు. ఎచటికి పోయి చూచినను, కులము ఉండును. కాని ఈ అధికార తారతమ్య ముండరాదు. వానిని అంతరింపజేయవలెను. జాలరికి వేదాంతము నేర్పితివేని, అతడు ఇట్లనును: "నీ వెట్లు మానవుడవో అట్లే నేనును మానవుడనే; నేను జాలరిని, నీవు విద్వాంసుడవు; కాని నీలో ఉండు ఈశ్వరుడే నాలోకూడ కలడు." అదియే మనము అభిలషించునది కూడ – ఇతరులకన్న ఎక్కువ అధికారము ఎవ్వరికిని ఉండరాదు; ఎల్లరకును సమానమగు అవకాశములు ఉండవలెను.

కర్షకులు కార్మికులు సమ్మె కట్టినచో మీ అన్నవస్త్రముల సరఫరాలు ఆగిపోవును. కాని వారిని నిమ్నశ్రేణివారు అని తిరస్కారబుద్ధితో పలుకుచు మీ సంస్కృతినిగూర్చి మీరు ప్రగల్భము లాడుచుందురు! జీవిత సంగ్రామమందే మునిగియుండి వారు జ్ఞానోన్మేషము నొందు అవకాశమునే కాంచజాలకయుండిరి. ఎంతో కాలమునుండి వారు మనుష్యబుద్ధిచే నడుపబడు యంత్రములవలె పని చేయుచుండిరి! బుద్ధిచాతుర్యముగల విద్యావంతులు వారి కష్టార్జితములో ఎక్కువ భాగమును తాము అపహరించుచుండిరి. ప్రతి దేశమందును ఇట్టి దురపహరణమే! కాని కాలము మాఱినది. నిమ్నశ్రేణులవారికి ఈ మోసము క్రమ క్రమముగ తెలియవచ్చుచున్నది. వా రెల్లరును ఒకటిగాచేరి, దీనిని ప్రతిఘటించి, తమకు న్యాయముగా రావలసిన భాగమును బలాత్కరించియైన లాగుకొన ఉద్యుక్తులగుచున్నారు... అగ్రశ్రేణులవారు నిమ్నశ్రేణులవారిని ఇక

మీదట పీడింపజాలరు. అట్టి ప్రయత్నము లన్నియు విఫలమగుట సిద్ధము. నిమ్నశ్రేణుల వారికి సక్రమముగా రావలసినదంతయు వారికి లభించునట్లు చేయుటయే అగ్రశ్రేణులవారికి ఇప్పుడు గల క్షేమమార్గము.

అణగద్రొక్కబడిన ప్రజలు చిర నిద్రనుండి మేల్కొన్నతోడనే, మీరు ఆచరించుచున్న హింసావృత్తినంతయు గ్రహించి, ఒక్క ఊదు ఊదిరేని మీ రెల్లరును ఆమూలాగ్రముగా ఎగిరిపోవుదురు! మీ యందు నాగరికత ప్రవేశ పెట్టినది వారే. ప్రాచీనకాలమున మహత్తర శక్తిమంతమై విరాజిల్లుచుండిన రోము నాగరికత గాల్ జాతివారిచే ఎట్లు నేలపాలు చేయబడి, దుమ్ములో కలిసిపోయెనో యోచింపుడు! కావుననే నేను మీ కొనర్చు హితబోధ - నిద్రిలుచున్న ఈ నిమ్నశ్రేణులవారిని విద్యా, సంస్కృతి ప్రదానమూలమున మేల్కొలుప యత్నింపుడు. వారు మేల్కొన్నప్పుడు - ఎప్పుడో ఒకనాడు వారు మేల్కొనుట నిస్సంశయము - మీ రొనర్చిన ఉపకారమునుకూడ వారు జ్ఞప్తి పెట్టుకొని, మీ యెడ కృతజ్ఞులై యుందురు.

*

అధునాతన హిందూదేశమును ఉద్భవింప నిండు. అది కర్షక కుటీరములనుండి నాగటిని చేతబూని ఉద్భవించుగాక! జాలరులయొక్కయు, చెప్పులు కుట్టువారియొక్కయు, వీధు లూడ్చు వారియొక్కయు గుడిసెలనుండి అది ఉత్పన్న మగుగాక! చిల్లర దుకాణములనుండియు, కార్ఖానాలనుండియు, పొలములనుండియు, ఉదయించునుగాక! తోటలనుండియు, అడవుల నుండియు, తిప్పలనుండియు, కొండలనుండియు అది వెలువడునుగాక! సామాన్యప్రజలు ఎన్నో వేల సంవత్సరములుగా, కుయ్యోడక హింసల నందిరి. అందుచే వారి సహనశక్తి అత్యద్భుతము. ఎడతెగని ఇడుమల నంది వారు జంకని ప్రాణశక్తి నార్జించిరి. పుడిసెడు గంజిత్రాగి వారు లోకమును ఉర్రూత లూగింపగలరు; ఒకరొట్టెలో సగపాలు వారికి ఇండు, వారి కార్యోత్సాహమునంతయు ఇముడ్చుకొనుటకు ఈ అఖిలప్రపంచము చాలదు, స్వచ్ఛమును, నైతికమును, అగు జీవితమువలన కలుగు అద్భుతబలముకూడ - లోకమున మరెచ్చటను కానరానిది - వారికి కలదు. అంతటి ప్రశాంతత, అంతటి సంతృప్తి, అంతటి ప్రేమ, అంతటి నిరంతర మౌన కార్యాచరణశక్తి, కార్యావసరములందు అంతటి సింహబలము - మరెచ్చట మీకు కానిపించును!

'అనాదియైన అవిద్యయందు నిదురించుచున్న జీవులారా! మేల్కొనుడు. ఆత్మజ్ఞానాభిముఖులు కండు. సర్వ అనర్థకారియు, ఘోరరూపమును అగు అజ్ఞాననిద్రను వదలించుకొనుటకు పరమోత్కృష్టులైన ఆచార్యుల ఉపదేశమును పొందుడు. అనుభవజ్ఞానమును సంపాదించుకొనుటకు తీవ్రప్రయత్నమును చేయుడు. జ్ఞానసాధనమార్గము దుర్గమము (కత్తి అంచుమీద నడచుట వంటిది) అని మేధావులు చెప్పుచున్నారు. ఎంతసాధన చేయవలెను! ఎంత అభ్యాసము చేయవలెను! ఎంత జాగరూకత ఉండవలెను! ఎంత బుద్ధిసూక్ష్మత సంపాదించవలెను! కాబట్టి ఎంతమాత్రము ఆలసింపకుడు. త్వరపడుడు'—అని కఠోపనిషత్ తల్లివలె అనుకంపతో మనలను హెచ్చరించుచున్నది.

# శ్రీరామాయణ మహామాలారత్నము—హనుమంతుడు

## 'వాసా సుబ్రహ్మణ్యశాస్త్రి'

రామాయణంలోని విభిన్న పాత్రలమీద ప్రత్యేక సంచికకు కోరిన పన్నెండు వ్యాసములలో ఇంతవరకు నాలుగు మాత్రమే అందినవి. కాబట్టి ప్రత్యేక సంచికను వెలువరించే ప్రయత్నం తాత్కాలికంగా విరమించుకొని ఆ వచ్చిన నాలుగు వ్యాసములను నెలకు ఒకటి చొప్పున ప్రచురింప దలచుకొంటిమి. ఈ నెల, ఆంజనేయస్వామినిగురించి చర్చించిన శ్రీ వాసా సుబ్రహ్మణ్యశాస్త్రిగారి వ్యాసమును పాఠకులకు అందించుచున్నాము.

గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసం।
రామాయణ మహామాలా రత్నం వందే
నిలాత్మజమ్॥

హనుమంతుడు రామాయణమనే మహా మాలకు మేరుపూసయట. వాల్మీకి చిత్రించిన అద్భుతము, సుందరము, మహోజ్జ్వలమునైన పాత్ర హనూమంతుడు. ఈతడు కథానాయకుడు గాగల కాండ అగుటచేతనే ఐదవ కాండకు సుందరకాండ అని పేరు వచ్చినది.

మహానుభావుడనీ, సుమహా ప్రాజ్ఞుడనీ వాల్మీకి హనుమకు విశేషణములు వాడినాడు. కిష్కింధాకాండనుండి జరిగిన కథలో హనుమ చాలా కీలకపాత్రను నిర్వహించాడు. అంజనా సుతుడగుటచే హనుమకు ఆంజనేయుడని పేరు. కేసరి యీతని తండ్రి. హనుమ పుట్టుకను గూర్చిన గాథ యిట్లున్నది.

దేవేంద్రుని అమరావతిలో ఉన్న అప్సరసలలో పుంజికస్థల ఒకర్తె. ఈమె ఆకర్షణీయమైన సౌందర్యంకల్గి నవయౌవనంలో మిస మిస లాడుతూ ఉండేది. ఒకసారి యీమె అరణ్యంలో తపస్సుచే కృశించిన శరీరంగల ఒక మహర్షినిచూచి యౌవన చాంపలంచే ఫక్కున నవ్విందట. అది చూచి కోపగించిన మహర్షి 'ఓసి పొగరుబోతా! వానరంవంటి చపలస్వభావం కలదానవు కాన వానర రూపమేదాల్చి చరించు' అని శాపమిచ్చాడట. తన తప్పును గ్రహించి పుంజికస్థల మహర్షి కాళ్లమీదపడి పలువిధాల ప్రాధేయపడ్డది. అప్పు డాయన కొంచెం శాంతించి 'రమణీ! నా శాపం అనుభవించక తప్పదు. నీకు వానర రూపంవచ్చినా నీవు కోరినపుడు మామూలు రూపము నీకు రాగలదు' అని అనుగ్రహించాడు. శాపానుసార మామె కుంజుడనే వానరముఖ్యునికి కుమార్తెగా జన్మించి సుమేరు గుహలో నివసిస్తూఉండేది. ఆమె పేరే అంజన. ఆమె కేసరికి భార్య అయినది. సంతానం కల్గకపోగా అంజనాదేవి అలమటించి పరమ శివుని ఆరాధించినది. భూ భారమును తగ్గించ డానికై మహావిష్ణువు భూమిమీద అవతరించి నప్పుడు తానూ అవతరించి ఆ మహాత్కార్యంలో పాలు పంచుకోదలచి పరమశివుడు తన ఏకాదశ రూపాలలో ఒకటైన రుద్ర రూపంతో ఆమెకు కుమారుడుగా జన్మిస్తానని వరమిచ్చాడు. ఆ విధంగా జన్మించినవాడు కాన శివాంశ ఉన్నది హనుమలో. ఒకవిధంగా విష్ణ్వంశకూడా ఉన్నది. దశరథుడు కైకకిచ్చిన పాయసంలోని భాగాన్ని ఆమె చేతిలోనుండి ఒక డేగ ఎత్తుకొని పోతూండగా ఆ హవిస్సు గాలికెగిరి అంజనవద్ద పడినది. అంజన దానిని

భక్షించి గర్భిణి అయినది. ఆ హవిస్సునలననే రామాదులు జన్మించుటచే రామాదులకు హనుమ సోదరుడుకూడా కాగలడు. ఇక హనుమ వాయుపుత్రుడని ప్రసిద్ధికదా! ఒకసారి అంజన కామరూపిణియై సుందరమైన మానుషరూపంతో క్షౌమవసనధారిణియై పర్వతాగ్రమున చరుస్తూ ఉండినది. వాయుదేవుడామె సౌందర్యానికిముగ్ధుడై ఆమెను ఆలింగనం చేసుకొన్నాడట. 'ఎవరయ్యా నీవు. నా ఏకపత్నీవ్రతాన్ని భంగింపజేస్తున్నావు' అని అంజన అనగా వాయుదేవుడు - ''నీకు భయ మక్కరలేదు. నిన్ను నేను మనసా పొందియుండుటచే నీ పాతివ్రత్యానికి భంగములేదు. నా అంశ వల్ల నీకు పరాక్రమవంతుడు బుద్ధిశాలి అయిన సుతుడు జన్మిస్తాడు. ఈతడు గొప్ప సత్త్వము, తేజము, బలముగల్గి నాతో సమానుడు కాగలడు.'' అన్నాడు. అప్పుడు అంజన గుహలో ఆంజనేయుని గన్నది. ఈ విధంగా ఆంజనేయునిలో శివాంశ, విష్ణ్వంశ, వాయ్వంశ కూడా సమ్మేళన మందియున్నవి. అంజన ఫలములకై దగ్గర అడవిలోనికి వెళ్లగా శిశువు ఏడుస్తూ ఆకలిచే పండనుకొని సూర్యుని పట్టుకొనుటకై ఎగురసాగినాడు. ఎగిరెగిరి సూర్యుని సమీపించాడు. అది రాహుగ్రహణ సమయం. రాహువుకూడా సూర్యుని గ్రసించుటకై సమీపిస్తూ హనుమనుజూచి భయపడి, ఇంద్రుని సమీపించి ''నా కాహారంగా సూర్యచంద్రుల చేసితినంటివి. ఇప్పుడు మరియొకడు సూర్యుని గ్రసించబోతున్నాడేమి?'' అని ప్రశ్నించాడు. ఇంద్రుడు క్రుద్ధుడై ఐరావతమెక్కి వెళ్లగా హనుమ ఐరావతగజాన్నే యెదిరించాడు. ఇంద్రుడు వజ్రం విసరగా హనువు దెబ్బతిని హనుమ క్రిందపడి మూర్ఛపోయాడు. తండ్రి వాయుదేవుడు కుమారు నొడిలోనికి దీసికొని ఒక గుహలో కూర్చున్నాడు. వాయుప్రసారము లేక జగము క్షోభించగా దేవతల ప్రార్థనపై బ్రహ్మ దేవతలతో సహా వచ్చి హనుమను స్పృశించినాడు. హనుమ మూర్ఛనుండి లేవగా వాయువు వీవసాగినాడు. బ్రహ్మాదిదేవతలు హనుమకు శస్త్రాస్త్ర అవధ్యత్వమును, బలమును, చిరాయువును వరములుగా నిచ్చారు సూర్యుడు తన తేజస్సులో భాగము నిచ్చెను. బ్రహ్మ కామరూప, కామచారముల నొసంగెను. వాయుదేవుడు పుత్రుని అంజనకిచ్చి వెడలిపోయెను. బాలు డడవిలో పెరుగుతూ కపిచాపములచే మునుల సమిత్కుశ వల్కలాదుల నదిలో పాఱవేయుచుండెను. అప్పుడు వారు 'నీవు బలవంతుడవే కాని నీ బలమును నీవు మఱచిపోయెదవుగాక! ఇతరులు జ్ఞప్తికి తెచ్చిననే నీ బలం నీకు తెలియగలదు'' అని శాపమిచ్చినారు. ఆ పిదప హనుమ సూర్యునితోపాటు రోజూ తిరుగుతూ వ్యాకరణశాస్త్రం నేర్చినాడు. హనుమ నవ వ్యాకరణ పండితుడట; మంచి వక్తృత్వ కౌశలమున్నా కలవాడు.

సుగ్రీవునిపక్షాన రామలక్ష్మణు లెవరో కనుగొనుటకై వెళ్లి హనుమ భిక్షురూపంలో వారితో సంభాషించినాడు. హనుమ ప్రసంగ ధోరణికి శ్రీరామచంద్రుడే ముగ్ధుడై యిట్లు ప్రశంసించినాడు. ''ఋగ్యజుస్సామవేదములలో విద్వాంసుడు కానివాడిట్లు ప్రసంగించలేడు. ఈతడు సమస్త వ్యాకరణాన్ని నిశ్చయంగా పఠించాడు. ఈతని ప్రసంగంలో ఒక్క అపభ్రంశపు మాటా దొరలలేదు. మాటలాడునపుడు ముఖనేత్ర వైఖరులలో ఎక్కడా వికారలేశమూ కన్పించలేదు. అతి ప్రసంగం చేయక సందేహాల కవకాశమీయక స్పష్టంగా ధారావాహిగా మధ్యమస్వరంలో సంస్కార

సంపన్నంగా మాట్లాడినాడు. ఇట్టి విచిత్ర వాక్కౌశలంతో కత్తియెత్తిన శత్రువునైనా లొంగదీసుకోగల దనిపిస్తూన్నది. ఇట్టివాడు దూతగా కలరాజుకు యెట్టి కార్యాలైనా సిద్ధించకమానవు.'' ప్రథమ సమావేశంలోనే హనుమ రామలక్ష్మణుల నాకర్షించెను. హనుమ తన వాక్కౌశలంతో దూత కృత్యాన్ని చక్కగా నెరవేర్చి రామ సుగ్రీవులకు సఖ్యమును సంధానించినాడు. శాప హతుడైన వాలి ఋశ్యమూకమునకు రాలేడు కాన ఋశ్యమూకముననే నివసించుమని సుగ్రీవునికి సలహా యిచ్చినది హనుమంతుడే. వాలి వధకు పిదప సుగ్రీవుడు భార్యను పొంది సుఖలోలుడై వర్షర్తువు గతించినా రామకార్యమును స్మరించనపుడు లక్ష్మణుడు క్రుద్ధుడైరాగా హనుమ సుగ్రీవుని కావార్త చెప్పి, ''నీవు వెళ్లి నమస్కరించి లక్ష్మణుని కోపం తొలగించు, రాముడు చెప్పినదిచేసి వాగ్దానం నిలబెట్టుకో!'' అని హితవుచెప్పి మంత్రిగా తన కర్తవ్యం నెరవేర్చాడు.

హనుమంతుడు కార్యశూరుడు. ఆతనిలో కార్యసాధకునకు వలయు లక్షణములన్నీ ఉన్నవి. సుగ్రీవుడు సీతాన్వేషణకై దక్షిణానికి పయనించే కపియూథంలో హనుమను చేర్చి అంగద జాంబవదాది వీరులున్నా హనుమకే విశేషార్థం చెప్పినాడు.

కార్యసాధకునకు కేవలము బలమున్న చాలదు. బలముతోపాటు చురుకు, వేగము కూడా ఉండవలె. బలం ఉండికూడా కొందరు సమయం వచ్చినపుడు పరాక్రమించలేరు. హనుమకు పరాక్రమంకూడా ఉన్నది. ఇవిఅన్నీ ఉన్నా సూక్ష్మమైన బుద్ధికూడా ఉండవలె. బుద్ధిఉన్నచో అది యుక్తిని, సమయస్ఫూర్తిని కలిగిస్తుంది. బలమూ, బుద్ధీ ఉన్నా దేశకాల పాత్రలను గుర్తెరిగి ఔచిత్యంతో, నీతితో వానిని ప్రయోగించవలె. కార్యసాధనకు వలసిన ఈ లక్షణాలన్నీ హనుమలో పేరుకొనియున్నవి. కాబట్టే సుగ్రీవుడు యోధనాయకుడైన అంగదునికూడా వదలి హనుమకే విశేషార్థం చెప్పినాడు. సుగ్రీవునికి హనుమపై ఉన్న విశ్వాసాన్ని చూచిన్నీ, తానుకూడా హనుమను పరీక్షించినవాడు కాబట్టిన్నీ రాముడు కూడా హనుమలోనే విశ్వాసముంచి ఆతనికే స్వనామాంకితమైన అంగుళీయకాన్ని సీతకు చూపించుట కానవాలుగాఇచ్చి ఇలా అనెను.

''నీ ఉద్యమము, సత్త్వగుణో దంచితమైన నీ పరాక్రమము, సుగ్రీవుడు నీకిచ్చిన సందేశము నాకు కార్యసిద్ధి నిశ్చయమని చెప్పతూ ఉన్నవి.'' రజోదూషితము, లేక తమోదూషితము అయిన పరాక్రమము కార్యకారి కానేరదు. సత్త్వగుణో దంచితమైన పరాక్రమమే అట్టిది కాగలదని అట్టి పరాక్రమము హనుమ కున్నదనీ రాముని నమ్మకము.

బలపరాక్రమములున్నా భృత్యునికి విశేషమైన స్వామిభక్తికూడా ఉండవలె. స్వామిభక్తి లేనివాడు స్వామికార్యములను సాధించలేడు. ఆతని బలపరాక్రమములు విద్రోహానికే దారి తీయవచ్చును. హనుమ స్వామిభక్తుడు, విశ్వాసపాత్రుడునూ. అంగదాది కపివీరులు సీతాన్వేషణకై దక్షిణదిశలో తిరిగి తిరిగి, ఒక గుహలోనికి ప్రవేశించారు. అక్కడ ఒక తాపసి స్వయంప్రభ వీరికి ఫలాదులనిచ్చి ఆకలి తీర్చినది. అక్కడ ఉండగానే సుగ్రీవుడిచ్చిన సమయం కాస్తా దాటిపోవచ్చింది. అంగదుడు ''కార్యం చెడగొట్టి సుగ్రీవుని సమీపించలేము. ఈ గుహ నిగూఢంగా ఉన్నది. మన మిక్కడనే ఉండిపోవుట మంచిది'' అనెను.

అప్పుడు హనుమ యిలా ఆలోచించినాడు. "అంగదు డిక్కడ ఉన్నచో వేరొక వానర వర్గాన్ని నిర్మించిన వాడగును. కొన్నాళ్లకు బలం పెంచుకొని సుగ్రీవు నెదిరించవచ్చును. ఇది సుగ్రీవుని రాచరికమునకు భంగకరము. అందుచే ఈ ఆలోచనను మొదటనే త్రుంచ వలెను" అని యిట్లాలోచించి హనుమ యుక్తిగా ఇట్లనెను.

"యువరాజా! మన వానరవీరుల కుటుం బములన్నీ ఋశ్యమూకంలో ఉన్నవి. భార్యా సుతులను వీడి చిరకాలం వీరిచట నుండలేరు. ఇచటనున్నా లక్ష్మణ బాణములకు గురికాక తప్పదు. లక్ష్మణుని కోపమునకు గురియై మనము బ్రతుకలేము. ఇచటనుండి పోవుట యేమి క్షేమకరము? ఋశ్యమూకమందలి వానరరాజ్యానికి సుగ్రీవానంతరము రాజు కావలసిన యువరాజవగు నీవు యిచటనే ఉండి పోవుట తగదు." అని నేర్పుగా బదులు చెప్పి వానరులను భేదించి, అంగదుని ఆ ఆశయం నుండి మరలించినాడు. దీనివలన ఆంజనేయుడు గొప్ప స్వామిభక్తి, దూరదృష్టి. రాజనీతి పరి జ్ఞానముకూడా కలవాడని స్పష్టమవుతూన్నది- 'నయపండిత!' అని సుగ్రీవుడిచ్చిన బిరుదును సార్థక మొనర్చుకొన్నాడు హనుమ.

ఇంతటి బుద్ధి బలపరాక్రమాలున్నా హను మంతునికి ఏకోశానా గర్వలేశమూ లేదు. ఆతడు నయంతోపాటు వినయమూ కలవాడు. సంపాతివలన సీత లంకలో ఉన్నదెరిగి అంగ దాదులు సాగరతీరాన్ని జేరి శతయోజనాయత మైన సాగరాన్ని దాటగల వారెవరా అని విచారణ చేయసాగారు. ఆయా వానరులు తమ తమ శక్తి సామర్థ్యాలను చెపుతూన్న ప్పుడు హనుమ ఏమీ పట్టనట్లు ఒక మూల కూర్చున్నాడు. శతయోజనాలు దాటి లంక చేరి తిరిగి రాగలవాడొకడూ అందు కాన్పించ లేదు. అప్పుడు జాంబవంతు డిట్లన్నాడు. "నేను వయస్సులో ఉన్నప్పుడయితే ఈ సముద్రాన్నవలీలగా దాటివచ్చేవాడినే. కాని నేడు నేను వృద్ధుణ్ణి, నాకంతటి జవసత్త్వాలు నేడు లేవు, అయినా విచారించబనిలేదు. ఈ సాగరాన్ని దాటి కార్యసాధన చేసి రాగల వానిని నేను చూపిస్తాను" అని మూలనున్న హనుమను లేపి, ఆతని శక్తిని జ్ఞప్తికి దెచ్చి, 'హనుమా! విజృంభించు. సాగరాన్ని దాటు వారిలో నీవుత్తముడవు సమస్తవానరసైన్యము నీ పరాక్రమాన్ని చూడగోరుతూన్నది! అన్నాడు- అదివిన్న హనుమ తనరూపం పెంచి ఉత్సాహాతిశయంతో యిట్లన్నాడు,

"మేఘములను మర్దిస్తాను, కొండలను కంపింపజేస్తాను, సముద్రాన్ని అల్లకల్లోలం చేస్తాను, లంకానగరాన్ని పెకలించుకు రమ్మంటే అలాగే పెకలించుకు వస్తాను." హనుమయొక్క యీ వాక్యాలు గర్వసూచ కాలుగా కన్పించవచ్చు. కాని అవి ఆతని ఆత్మవిశ్వాసానికి సాక్షులు. కార్యం సాధింప గలవాడు తనవారిలో ఉత్సాహాన్ని కల్పించు టకు చెప్పినవి గర్వవాక్యాలు కానేరవు. హనుమ సమర్థుడు, కార్యసాధకుడున్నూ. చే పట్టిన కార్యంలో ఏకాగ్రత, దీక్షకలవాడు. కార్యమధ్యంలో సుఖాలను కోరువాడుకాడు. సముద్రంపై వెళ్తున్నప్పుడు సముద్రుని ప్రేర ణపై మైనాకుడు లేచి తనపై విశ్రాంతి తీసికొని ఫలాలను ఆరగించ మంటాడు, 'ఆగినచో కార్యం చెడిపోవును. ఇది విశ్రాన్తికి సమయం కాదు' అని హనుమ ఆతని ఆతిథ్యాన్ని నిరాకరించి పయనం సాగిస్తాడు. సాగర మధ్యంలోనుండి నాగమాతయగు సురస లేచి ఆతనిని మ్రింగడానికై నోరు తెరచింది.

హనుమ తనదేహం పెంచాడు. సురస తన నోటిని పెంచింది. హనుమ ఎంతగా శరీరాన్ని పెంచుతే సురసకూడా అంతగా నోటిని పెంచుతూ వచ్చింది. అప్పుడు బుద్ధిశాలియగు హనుమ ఒక చిన్నయీగ అంతవాడై సురస గొంతులోనుండి ఉదరంలోనికిపోయి వెంటనే బయటికివచ్చి "తల్లీ! శెలవు నీ గర్భకోశం కాకాను కాన నీపుత్రుణ్ణి. నన్ను ఆశీర్వదించు వెళ్లొస్తా" నన్నాడు. నాగమాత ఆతని బుద్ధికుశలతకు సంతసించి ఆతని నాశీర్వదించి పంపింది. తర్వాత ఎగురుతూన్న ఆకనినీడను గుర్తించి సింహిక అను రాక్షసి ఆకనిని నిరోధింపగా ముష్టిఘాతంతో ఆమెను హతమార్చి ముందుకు పోయాడు. సముద్రందాటి స్వరూపంతో ప్రవేశించుట మంచిదికాదని సూక్ష్మరూపంతో లంకలోనికి ప్రవేశించబోగా లంకిణి ఆతన్ని నిరోధించినది. గర్జించి ముష్టిఘాతంతో ఆమెను మూర్ఛచెందించి ముందుకుపోయాడు. రామకార్యాలను మూడు మాయలు నిరోధించును. సాత్త్వికమాయ, రాజసమాయ, తామసమాయ. సురస సాత్త్వికమాయ కావున ఆమెను మాతృభావంతో చూచి ఆమెను సంతోషపెట్టి ముందుకు పోయాడు. సింహిక తామసమాయ. తామసిక మాయను సంహరించ వలసినదే. కావున ఆమెను ముష్టిఘాతంతో సంహరించి పురోగమనం చేశాడు. లంకిణి రాజసమాయ. రాజసికమాయను మూర్ఛచెందించిన చాలును. అట్లుచేసి హనుమ లంకాప్రవేశం చేసినాడు. ఈ విధంగా త్రివిధ మాయలను హనుమ వివేకంతో మూడు పద్ధతులతో నిర్జించి పురోగమించినాడు. హనుమ ఊహాశక్తి కలవాడు. రావణాంతః పురంలో బహు సుందరియైన మండోదరిని తొలుత సీతగా భ్రమించినా సీత ప్రవాసంలో ఇంత నిశ్చింతగా నిద్రపోలేదు కాన యీమె సీతకాజాలదు అని నిశ్చయించుకొన్నాడు. హనుమ బ్రహ్మచారి; వనితాపరాఙ్ముఖుడు, రావణాంతః పురంలో సీత నన్వేషిస్తూన్నపుడు రాత్రివేళ పలువురు అంతఃపురాంగనలచట నిద్రిస్తున్నారు. ఇట్టి స్థితిలో తాను వీరిని పరికింపవచ్చునా? అని హనుమ సంశయపడ్డాడు. మరల తానే సమాధానము చెప్పుకొన్నాడు. ఇచట హనుమ వాక్యాలు వినండి—

"నేను రావణుని స్త్రీలనందరను పరికించిన మాట వాస్తవము. అయినా నామనస్సులో ఎట్టి వికారమూ కల్గలేదు. సర్వేంద్రియ ప్రవృత్తికీ మనస్సే హేతువవుతూ ఉంటుంది. అట్టి నామనస్సు నిశ్చలంగా స్థిరంగా ఉన్నది. నేను పరిశుద్ధమైన మనస్సుతోనే అన్వేషణచేశాను" ధర్మాధర్మములకు చిత్తము గీటురాయి, హనుమ గుణగణములో నీ చిత్తశుద్ధి మేకు పూసగా నిలవగలదు. ఇట్టి చిత్తశుద్ధిని, కార్య తన్మయతను, ధర్మరక్తిని, ఇంద్రియ సంయమమును చూచిన హనూమంతునికి చేతులెత్తి జోహారు లర్పించనిదే ఉండలేము.

హనుమ వెదకి వెదకి అశోకవనంలో శింశుపా వృక్షంక్రింద కూర్చొనియున్న ఒక వనితనుచూచి తానువిన్న లక్షణాలతో సరిపోల్చి సీత అని నిర్ణయించుకొన్నాడు. హఠాత్తుగా నెదుటపడిన ఆమె అనుమానమూ, భయమూ కలుగవచ్చు. రావణభృత్యునిగాభావించవచ్చు. అందుచేత యుక్తిగా చెట్టుమీదచేరి రామ చరితాన్ని గానం చేశాడు. ఆక్రమంలో తాను సీతాన్వేషణకై లంకకువచ్చిన సంగతి చెప్పాడు. ఆమె పైకి చూడగా మెల్లగా క్రిందకుదిగి నమస్కరించి ఆమెతో సంభాషణ సాగించాడు. తర్వాత రామాంగుళీయకాన్ని సమర్పించాడు. హనుమ యిక్కడ చక్కని

వివేకాన్ని యుక్తినీ ప్రదర్శించాడు. సరే సీతను దర్శించడమయింది. అంతతో ఆగితే ఎలా? ఆంజనేయుడు యధాశ్రుతగ్రాహి మాత్రమే కాడు. రాక్షసవానర సంగ్రామం అనివార్యం అని ఊహించి, రావణబలం, రాక్షసుల యొక్క యుద్ధవైఖరి, లంకానగరంయొక్క తీరుతెన్నులు, రహస్యాలు తెలుసుకొనడం మంచిదని భావించాడు. ఈ పనులకు ద్వారం కల్పించుకోవడానికై అశోకవనంలోని పండ్లను భక్షిస్తూ కొమ్మలను విరవడం ప్రారంభించాడు. అక్షయ కుమారాదులు ఎదిరించవస్తే వారిని వధించాడు. ఇది సామాన్యవానరం కాదని ఇంద్రజిత్తువచ్చి బ్రహ్మాస్త్రం విసిరితే దానికి కావాలని లొంగి రావణదర్బారుకు వేంచేశాడు. రావణుడు నిలువరించి నీ వెవడవు? పేరేమి? సముద్రమెలా దాటగల్గావు అని అడిగితే పేరు చెప్పి రామకృపఉంటే వేయి యోజనాలైనా దాటవచ్చని జవాబిచ్చాడు. ఇచ్చట సముద్ర లంఘనాన్ని తన పరాక్రమంగా చెప్పుకోక రామకృపగా చెప్పుకొన్నాడు. 'చెట్లు ఏల విరిచావు' అని అడిగితే - "నేను కోతిని. కోతికి చెట్లు నివాసాలు; పండ్లు కాయలు ఆహారం. నేను తింటూండగా రాక్షసు లదలించారు. కొమ్మలు విరచాను" అన్నాడు. అక్షయునేల చంపావని అడిగితే - 'నేను చంపాలని చంప లేదు నన్ను కొట్టితే నేనూ నెమ్మదిగా దెబ్బలు కొట్టా - దానికే వాడు చచ్చిపోయాడు' అని జవాబిచ్చాడు. చివరికి రావణు డుగ్రుడై వధిం చమని ఆజ్ఞ యిచ్చినా విభీషణుడు నివారించగా ఆతనితోకకు నిప్పు పెట్టించాడు. దానితో లంకానగరంపై నెగురుతూ లంకలోని సౌధా లన్నిటికి నిప్పు ముట్టించాడు. ఈ విధంగా శత్రుబల రహస్యాలు తెలుసుకొన్నాడు. లంకానగరాన్ని పాడుచేసి వారిని దుర్బలుల్ని చేశాడు. చెప్పినదానిని చేస్తూ, ఆనుషంగిక ముగా అవసరమైన యితర కార్యాలనుకూడా చేసి ఉత్తమభృత్యు డనిపించుకొన్నాడు. లంకనుండి బయల్దేరుతూ మరల సీతాదేవి దర్శనంచేసి, ఆమె యిచ్చిన చూడామణి పుచ్చుకొన్నాడు. వానరులు సముద్రం దాట గలరా? రాక్షసులతో యుద్ధం చేయగలరా! అని సీత అడిగినది.

"అమ్మా! మా వానరులలో నేనొక సామాన్యుణ్ణి, నేనే యింతపని చేశాను. నాతో సమానులు, నన్ను మించినవారు ఎందరో వానరసైన్యంలో ఉన్నారు. నాకంటె తక్కువ వాడు సుగ్రీవునివద్ద లేనేలేడు." అని ఆమెకు నమ్మకం కల్గునట్లుగా చెప్పాడు. హనుమ తాను సాధించినదానికి ప్రగల్భించుటకు బదులు తాను సామాన్యుడనని చెప్పుకొన్నాడు. అంతటి నిగర్వి, వినీతుడూ మన హనుమంతుడు.

శ్రీరాముడు వానరసైన్యంతో సాగర తీరాన విడిసియున్నపుడు విభీషణుడు తన అను చరులతో వచ్చి వాలి రాముని శరణు కోరాడు. విభీషణుని చేర్చుకొను విషయమై వానరముఖ్యులు చర్చించారు. పలువురు శత్రు పక్షంనుండి వచ్చినవాడు విశ్వాస్యుడుకాడు. శత్రువుల చారుడై మన రహస్యాలను రావ ణుని కందించి మనకు ద్రోహం చేయగలడు. అందుచేత చేరదీయవద్దు" అన్నారు. అప్పుడు ఆంజనేయు డిట్లు తన అభిప్రాయం చెప్పాడు. "విభీషణుడు శత్రువుల చారుడుమాత్రం కాదు. మనలను ద్రోహంచేయు బుద్ధితో రాలేదు. దురుద్దేశ్యములేదు కాని యాతడు రాజ్యా శలో వచ్చాడు. శ్రీరాముడు వాలిని సంహ రించి సుగ్రీవునికి పట్టము కట్టినవార్త విని, అన్నచే అవమానము పొంది శ్రీరాముని సహాయంతో లంకారాజ్యమును పొందే ఆశతో

వచ్చాడు. సుగ్రీవునికి వలెనే ఈతనికిని అభయ మిచ్చుటలో తప్పేమీ లేదు.'' - హనుమ తన యీ ప్రసంగంలో చక్కని రాజనీతి పరిజ్ఞానాన్ని, వ్యక్తిత్వ పరిశీలనాశ సూక్ష్మ విచారణాశక్తిని ప్రదర్శించాడు.

లక్ష్మణుడు సుషే ణుడు మందర నౌష ధిని సూర్యోదయానికి పూర్వమే తీసుకొని రమ్మని ఆదేశించెను. హనుమ మహావేగముగ పోయి సంజీవశిలతను గుర్తించుట కష్టముకాగా సుషేణుని తీసుకొని రాకపోతినే అని విచారించి చివరి కాతడే మొయ్యకొనుచుని పర్వత శిఖరాన్నే పెకలించుకొని వచ్చినాడు. ఇట్టిపని హనుమకే సాధ్యం. హనుమ యుద్ధంలో ధూమ్రాక్ష నికుంభాదులైన అనేక ప్రముఖ రాక్షసులను సంహరించాడు. కుంభకర్ణాదులు విజృంభించునపుడు వానరులు భయభీతులై పోగా మేరునగధీరుడుగానిలచి వారి- ధైర్యము, ఉత్సాహమూ కల్పిస్తూ వచ్చాడు. అనేక ముఖ్య ఘట్టాల్లో హనుమ ప్రముఖపాత్ర వహించాడు.

అయోధ్యలో పట్టాభిషేకానంతరము కానుకలిచ్చు సమయమున సీతాదేవి తన కంఠమునుండి అమూల్యమైన హారమును తీసి ఒకతూరి తనభర్తను, ఒకతూరి వానరులను పరికించినది. రాముడది గ్రహించి-

'ప్రదేహి సుభగే! హారం యస్య తుష్టాసి భామిని'.

'నీవు ఎవరియెడ ప్రీతిఉన్నదో వారికి హారం ప్రదానంచేయి' అనెను. అంత నామె

తేజస్సు, ధృతి, కీర్తి, సామర్థ్యము, నయము, వినయము, పౌరుషము, పరాక్రమము, బుద్ధి- ఈ గుణములు నిత్యము యెవని యందు ఆవాసము చేసికొని యున్నవో అట్టి వాయుసూనునికి ఆ హారమును ప్రదానము చేసినదట. వానరేశ్వరు డయిన హనుమ ఆ హారంతో ఎంతయో శోభించినాడట- ఈ విధముగా సీతాదేవి హనుమలోని విశిష్ట గుణములకు హారమనెడి ప్రశంసాపత్రము నిచ్చినది.

సీతాదేవి ప్రకృతి- శ్రీరాముడు పురుషుడు- ప్రకృతి పురుషులను సంధానము చేసినవాడు మన ఆంజనేయుడు.

సుగ్రీవుడు జీవుడు- శ్రీరాముడు పరమాత్మ- వీరికి సంధానకర్త ఆంజనేయుడే. జీవాత్మ పరమాత్మల ననుసంధించుటకు హనుమకున్న గుణము లుండాలి. హనుమ గొప్ప యోధుడు, అంతేకాదు మంచి నేర్పుగల దూత. అంతేకాదు శేముషీ విశేషము కల మంత్రి. వీటన్నిటిని మించి హనుమ గొప్ప రామభక్తుడు. నవవిధభక్తులలో కైంకర్యభక్తి లేదా దాసభక్తికి హనుమ ప్రశస్తోదాహరణమైనవాడు. రఘునాథ కీర్తన చేయుచు వినుచు ఆతడు తన్మయతతో బాష్పవారి పరిపూర్ణ లోచను డగుచుండును. శ్రీరామభక్తియే ఆతనికి సాధన, సిద్ధి కూడా- 'జయత్యతిబలో రామః' అని రాముని స్మరించి జయనాదము చేయునప్పు డాతడు నాగాయుతబలుడై శత్రు దుర్నిరీక్ష్యుడగును- దాస్యభక్తిలో హనుమ కెవ్వరును సాటిరాజాలరు.

పట్టాభిషేకమునకు పిదప అయోధ్యలో శ్రీరామునికి సదాసపర్యలు చేయుచు హనుమ తన జీవితమును ధన్య మొనర్చుకొనుచుండెను. రామ సేవలన్నిటిని హనుమయే చేపట్టుటచే లక్ష్మణాదుల కేమియు మిగలెడివి కావట. హనుమపై నసూయచెంది లక్ష్మణాదు లొక యుక్తి పన్నినారట సీతాలక్ష్మణ భరత శత్రుఘ్నులొకచో జేరి ఉదయము రాముడు

లేచునది మొదలు రాత్రి నిద్రపోవునరకు అత నికి చేయవలసిన సపర్యల నన్నిటిని ఒక పట్టికగా తయారుచేసి వానిని నాల్గు భాగములుగా తమలో పంచుకొని ఒక మంచివేళ శ్రీరాము నిచే ఆ పత్రముపై సంతకము చేయించినారట. హనుమ కది తీసికొనిపోయి 'హనుమా! ఇది రామాజ్ఞ, నేటినుండి యీ పత్రములో నున్న ప్రకారము రామ సపర్యలు జరుగవలె' అన్నా రట. ఆ సపర్యలలో హనుమ కేమియు కేటా యించ బడలేదు హనుమపత్రమును బాగుగా పరిశీలించి—'సరే యిందు ఉదాహరింపబడని సేవను నేను చేయవచ్చును కదా!' అనినాడు. పట్టికలోలేని సేవలే లేవను ధైర్యముతో లక్ష్మణు డట్లే చేయవచ్చు నన్నాడు. 'అట్లయి నచో రామచంద్రు డావులించినపుడు చిటి కెలువేయు సేవను నాకు వదలిన చాలును' అన్నాడు హనుమ. లక్ష్మణాదు లంగీకరించి నారు. హనుమమాత్రం నిత్యము రాముని పాదాలచెంతనే కూర్చొనుచు ఆతని ఆవులింత నెదురుచూచుచు, ఆతని ముఖముపైననే సదా దృష్టిని నిలిపి యుండెడివాడు. ఇట్లు హనుమ శ్రీరామచంద్ర ముఖారవింద మధువును సదా నయనాలతో గ్రోలుచుండెడివాడు. రాత్రివేళ మాత్రము శ్రీరాముడు సీతా సమేతుడై శయన మందిరమున కేగునపుడు హనుమ లోనికి ప్రవేశింప వీలుకాకపోయెను. కాని రాముడెప్పుడు ఆవలించునో? హనుమ గదికి బయటనే ద్వారముచెంత కూర్చొని రాముడే సమయమున ఆవులించినను దాని కన్వయించు నని తాను చిటికెలు వేయసాగెను. బయట హనుమ చిటికెలు వేయుచుండ లోన రామున కావులింతలు రాజొచ్చెను. ఇట హనుమ చిటి కెలు వేయుచునే యుండెను. అట రాముని ఆవులింతలకు విరతియే లేకుండెను. ఆ స్థితిని జూచి సీతమ్మ అదేమి రోగలక్షణమో అని భయపడి బయటికివచ్చి అత్తలకు నివేదించినది. రాజవైద్యులు వచ్చినారు. ఆవులింతలకు వైద్యులును నిదానమును గుర్తించలేక పోయి నారు. ఇంతలో లక్ష్మణుడు ఆ చెంతనుండి పోవుచు హనుమ చిటికెలు వేయుటను గమ నించి బిగ్గరగా 'హనుమా ఏమా కపిచేష్టలు. చిటికెలు వేయుట మానెదవా లేదా?' అని గద్దించెను. తోడ్తో హనుమ చిటికెలు వేయుట మానెను. శ్రీరామునికావులింతలు తగ్గిపోయి నవి. హనుమ సేవాతత్పరతకు లక్ష్మణాదు లందరును సిగ్గుతో తలవంచుకొనిరి. శ్రీరామ సేవ నిరతిలో ఆంజనేయు డజేయుడని వారు తీర్మానమునకు వచ్చిరి. నాటినుండి శ్రీరామ సేవలను స్వేచ్ఛగా చేయుట కాంజనేయుని కామోదము తెల్పినారు. హనుమ దాస్యభక్తి అట్టిది. హనుమనుమించిన దాసభక్తు డుద యించలేదు. హనుమలోనున్న గుణము లన్ని టిలోనికి మకుటాయమైనది శ్రీరామ చరణార వింద భక్తి.

"యావత్ స్థాస్యన్తి గిరయస్సరితశ్చ
మహీతలే।
తావ ద్రామాయణ కథాలోకేషు
ప్రచరిష్యతి"

హిమవద్వింధ్యాది నగములు, గంగాగోదా వర్యాది నదులు ఉన్నంతవరకు శ్రీరామగాథ లోకమున వర్తించుచునే యుండును. రామ గాథ ఉన్నంతవరకు హనుమ గాథకూడ లోక మున వర్ధిల్లగల దనుటలో సందియములేదు.

# ఈశావాస్యోపనిషత్

'సమతానంద'

హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితమ్ ముఖమ్
తత్ త్వం పూషన్ అపావృణు సత్యధర్మాయ దృష్టయే ॥

హిరణ్మయేన పాత్రేణ బంగారు మూతచే సత్యస్య సత్యముయొక్క ముఖమ్ ద్వారము అపిపాతమ్ మూయబడినది పూషన్ ఓ సూర్యభగవానుడా తత్ దానిని సత్యధర్మాయదృష్టయే సత్యమును అన్వేషించు నేను చూచుటకొరకు త్వమ్ నీవు అపావృణు తొలగించుము.

సూర్యమండలము బంగారుమూతవలె సత్యద్వారమును మూసియున్నది. ఓ సూర్యభగవానుడా సత్యాన్వేషకుడనైన నేను దర్శించుటకు దానిని తొలగించుము.

పూషన్నేకర్షే యమ సూర్య ప్రజాపత్య
వ్యూహ రశ్మీన్ సమూహ
తేజోయత్ తే రూపం కళ్యాణతమం
తత్ తే పశ్యామి యో అసావసౌ పురుషః సోహమస్మి ॥

పూషన్ పోషకుడా ఏకర్షే అంతరిక్షంలో ఏకైక ప్రయాణీకుడా యమ నియామకుడా ప్రాజాపత్య ప్రజాపతి సంతానమా సూర్య సూర్యభగవానుడా రశ్మీన్ కిరణ పుంజమును వ్యూహ తొలగించుము తేజః తేజస్సును వ్యూహ ఉపసంహరించుము యత్ ఏది తే నీయొక్క కళ్యాణతమం ఉత్కృష్టమైన కల్యాణమును చేకూర్చు రూపమ్ రూపమును తత్ అది తే (ప్రసాదాత్) నీ అనుగ్రహమువలన పశ్యామి చూచుచున్నాను. యః ఎవరు అసౌ పురుషః ఆ పురుషుడో సః అతడు అహమ్ అస్మి నేనే.

ఓ సూర్యభగవానుడా! ప్రజాపతి సంతతికి చెందినవాడవు, అంతరిక్షంలోని ఏకైక ప్రయాణీకుడవు, అన్నిటినీ నియమించి నిలబెట్టుకర్తవు, నీ కిరణపుంజమును తొలగించుము. నీ తేజస్సును ఉపసంహరించుము. నీ అనుగ్రహమువలన కళ్యాణతమమైన సత్యస్వరూపమును చూచుచున్నాను. ఆ సూర్యమండలాంతర్వర్తియగు పురుషుడు నేనే.

వాయురనిల మమృత మధేదం భస్మాంతం శరీరమ్
ఓం క్రతోస్మర కృతగ్ంస్మర క్రతోస్మర కృతగ్ం స్మర ॥

అథ ఇప్పుడు వాయుః శ్వాస అమృతమ్ నిత్యమైన అనిలమ్ సర్వవ్యాప్తమైన ముఖ్య ప్రాణములో (ప్రతి పద్యతామ్ లీనమగుగాక.) ఇదమ్ శరీరమ్ ఈ శరీరము భస్మాన్తమ్ (భూయతీ) భస్మమగుగాక ఓం - క్రతో ఓ మనసా కృతమ్ వెనుకటి సుకృతమును స్మర స్మరించు.

నా శ్వాస నిత్యమైన సర్వవ్యాప్తమైన ప్రాణశక్తితో లీనమగుగాక! ఈ శరీరము భస్మమగు గాక! ఓం. ఓ మనసా గత సుకృతాన్ని స్మరించు. స్మరించు.

అగ్నే నయ సుపథా రాయే అస్మాన్
విశ్వాని దేవ వయునాని విద్వాన్
యుయోధి అస్మజ్జు హురాణమేనో
భూయిష్ఠాం తే నమఉక్తిం విధేమ ॥

అగ్నే ఓ అగ్నీ అస్మాన్ మమ్ములను రాయే మా కర్మఫలాన్ని అనుభవించుటకు సుపథా మంచిమార్గమున నయ నడపుము - తీసుకొనిపొమ్ము దేవ ఓ దేవా విశ్వాని వయునావి అన్ని చర్యలను విద్వాన్ ఎరిగినవాడవు. అస్మత్ మానుండి జుహురాణమ్ కుటిలమైన ఏనః పాపము యుయోధి, నశింపజేయుము తే నీకు భూయిష్టామ్ అనేక నమఉక్తిమ్ నమోవాక ములను విధేమ సమర్పించు చున్నాము.

ఓ అగ్నిదేవా! మా సుకృత ఫలమును అనుభవించుటకు సన్మార్గమున నడపుము మా చర్యల నన్నిటినీ ఎరిగినవాడవు ఓ దేవా? (కుటిలమైన) మా పాపములను నశింపజేయుము నీ కివే తిరిగి తిరిగి మా నమోవాకములు.

ఓ త్రిపురాంతక శివా! మధురములును, అమృతమయములును అగు శబ్దములు అర్థములుగల వేదములను నిశ్వాసమువలె అనాయాసముగా ఆవిర్భవింపజేసిన నీకు బ్రహ్మదేవుడైనను తన వాక్చాతుర్యముచే చమత్కారమును కలిగింపనేర్చునా? ఇక నేనెంత! నా స్తుతి కౌశలమును ప్రదర్శించి నిన్ను రంజింపజేయాలనే అభిప్రాయము నాకెంతమాత్రమూ లేదు. కాని ఇప్పుడు నీ గుణకథనమునకు పూనుకొని నిన్ను స్తుతించుట కేవలము నా వాక్కులను పునీతము చేసికొనుటకే.

—పుష్పదంతుడు.

ఆత్మ తత్త్వాన్ని శాస్త్రంవలనగాని, ఆచార్యునివలనగాని విని, ఆ విన్నదాన్ని సాక్షాత్కరించుకొనుటకు సన్న్యాసము, శమము, దమము, ఉపరతి, తితిక్ష, సమాధానము—ఇత్యాదులను అభ్యసించుటకు పూనుకొనవలెను. కేవలం కుతూహలాన్ని తీర్చుకొనటానికిగా నానావిషయాలను వినటం చదవటంవలన కాలాన్ని వ్యయం చేసికోవడమే అవుతుంది. శ్రమను కలిగించుకోవడమే అవుతుంది.

—బృహదారణ్యకోపనిషత్తు.

# శ్రీ రామకృష్ణ కథామృతము

## (రెండవ భాగము)

అనువాదము: ప్రవ్రాజిక శ్యామాప్రాణ

చేతులుజోడించి శ్రీ రామకృష్ణులు పాటలు వినుచు, తదేకధ్యానముతో అంతర్ముఖులైరి. శ్రీ రామకృష్ణుని మనస్సు చెమ్మతగలని అగ్గిపుల్లవంటిది గదా! అందుచే కొంచెము భక్తిపూర్వకమగు పాటలు వినుటతోడనే సంపూర్ణముగ బాహ్యస్పృహ కోల్పోవుదురు. సామాన్య మానవుల మనస్సు విషయాసక్తమైనందున చెమ్మగిల్లిన అగ్గిపుల్ల ఎంతగీచినను వెలుగని రీతిని చైతన్యము కలుగదు. కాళీకృష్ణుడు భవనాథుని చెవిలో ఏదోచెప్పి లేచి శ్రీ రామకృష్ణులకు నమస్కరించి శలవు తీసుకొనెను.

శ్రీ రామకృష్ణులు :- ఎక్కడికి పోవుచున్నాడు?

భవనాథ్ :-అతడు పనిమీదపోవుచున్నాడు.

శ్రీ రామకృష్ణులు :-ఏమిపని?

భవనాథ్ :-శ్రమజీవుల విద్యాలయములో ఏదో అవసరమైన పని కలదట.

(కాళీకృష్ణుడు వెడలి పోయెను)

శ్రీరామకృష్ణులు :—వానికి అదృష్టము లేదాయె.

ఈ దినము ఎంత భగవన్నామ సంకీర్తన జరుగును. ఎంతో ఆనందము కల్గునుకదా! వాడందుకు నోచుకొనలేదు.

సుమారు 9 గం॥ లాయెను.

శ్రీ రామకృష్ణుని ఆరోగ్యము సరిగా లేనందున నదిలో మునిగి స్నానము చేయలేదు. భక్తులు బిందెలతో తెచ్చిన గంగాజలముతో శ్రీరామకృష్ణులు స్నానము చేసిరి. నూతనవస్త్రములు ధరించి అంతర్ముఖదృష్టితో తమ గదినుండి కాళికాలయమునకు బయలుదేరిరి. వారి అంతర్ముఖదృష్టి ఎట్టిదనగ పక్షులు గ్రుడ్లు పొదుగునపుడు చూచు దృష్టివంటిదే.

వారు గర్భమందిరంలోనికి పోయి దేవికి ప్రణమిల్లి చందనము అలందిన పుష్పములతో పూజింప మొదలిడిరి. విధి నియమములు పాటింపక, ఒకసారి పువ్వులు దేవి చరణములపై మరొకసారి తమ శిరస్సుపైన సమర్పించుకొనుచుండిరి. ఈ విధముగ పూజ ముగిసిన తర్వాత దేవికి నివేదించిన పూలను తీసికొని కండ్లకద్దుకొనిరి. భవనాథునితో "దేవునికి నైవేద్యముచేసిన ఆ లేత టెంకాయను తీసికొనుము" అనిరి. రామకృష్ణులు కాళికాలయమునుండి శ్రీ రాధాకృష్ణ ఆలయమునకు వచ్చి నమస్కారములు చేసిరి. రాధాకృష్ణాలయమునకు ఎదుటవైపున గల 12 వ శివాలయమువైపు చూడ్కుల ప్రసరించి శివలింగములకు నమస్కారములుచేసి తమగదికి తిరిగివచ్చిరి.

గదిలో రామ్, నిత్యగోపాల్, కేదార్, చటర్జీ మున్నగు భక్తులు సమావేశమైయుండిరి. వారు శ్రీరామకృష్ణులకు ప్రణామము చేసిరి. పరమహంస వారి క్షేమ సమాచారములనడిగిరి.

శ్రీ రామకృష్ణులు నిత్యగోపాల్‌తో నీవేమైన తినెదవా? అని అడిగిరి. నిత్యగోపాలుని వయస్సు 24 సం॥ లు. అవివాహితుడు. వాని మనస్సు సర్వదా భగవద్ధ్యానములో నిమగ్నమై యుండును. అందుచే, శ్రీరామకృష్ణులు వానిది పరమహంసస్థితిఅని పలుమార్లు చెప్పిరి. అతడపుడపుడు ఒంటరిగా కాని లేక రాఖాం

బుతో గాని, దక్షిణేశ్వరమునకు వచ్చుచుండును. పరమహంస వాని భగవద్ధ్యానము చూచి వానిని బాలగోపాలుని బోలె ఎక్కువ ప్రేమించెడివారు. నిత్యగోపాల్ పసిపిల్లవాని వలె తలఊచి దేవుని ప్రసాదమును తీసికొని ఆరగించెను. తరువాత శ్రీ రామకృష్ణులు గదికి పడమటి వైపునగల వరండాలోనికి వానిని తీసికొనిపోయి మాట్లాడుచుండిరి.

ఇంచుమించు 23 సం॥ వయస్సుగల ఒక భక్తురాలు శ్రీరామకృష్ణుల దర్శనమునకు తరుచు వచ్చుచుండును. ఆమె నిత్యగోపాలుని, అద్భుతమగు భగవద్ధ్యానమునకు ముగ్ధురాలై వానిపై పుత్రవాత్సల్యము అమితముగా చూపుచుండును. అప్పుడప్పుడు వానిని తన ఇంటికి కూడ తీసికొని పోవుచుండును.

శ్రీరామకృష్ణులు- (నిత్య గోపాలునితో) నీవు ఆమెఇంటికి పోవుచుందువా ఏమి?

నిత్య గోపాలుడు చిన్నపిల్లవానివలె - అవునండీ, ఆమె నన్ను పిలుచుకొని పోవుచుండును.

శ్రీ రామకృష్ణులు - ఒరే! సాధూ! సావధాన్! ఎప్పుడో ఒక్కమారు పోయినపొమ్ము- కాని మాటి మాటికి పోకసుమా! మునిగి పోయెదవు జాగ్రత్త! కామినీ కాంచనములే మాయ. సాధువులు స్త్రీలకు చాల దూరముగా ఉండవలెను. బ్రహ్మ విష్ణువులుకూడ ఇక్కడనే పడిపోవుచున్నారు. నీవుకూడ పడిపోయెదవు. జాగ్రత్త సుమా!

నిత్యగోపాలుడు శ్రద్ధగా వినుచుండెను. మాస్టరు (తనలో) ఇదేమి ఆశ్చర్యము! నిత్య గోపాలునిది పరమహంసస్థితి అని శ్రీ రామకృష్ణులు చాలసార్లు చెప్పిరిగదా! మనస్సు ఇంత ఉన్నతస్థితికి పోయిన పిదపకూడ, పతితుడగుట సంభవమా? స్త్రీ సాన్నిధ్యము వలన సాధువులుకూడ పతితులగుదురా! సాధువులు స్వయముగ, కఠోర నియమములు పాటించి లోకమునకు మార్గదర్శకులై ఉండవలెను. అట్లు కానిచో లోకులెట్లు ఉద్ధరింప బడగలరు! ఆమె పరమ భక్తురాలయి నప్పటికి నిత్యగోపాలుడు ఆమె సాన్నిధ్యమువలన పతితుడయే ఉపాయము గలదని పరమహంస చెప్పుచున్నారు. శ్రీ చైతన్య మహాప్రభువులు తమ శిష్యుడగు చిన్న హరిదాసుని, కఠోరముగా శాసించిన దెందులకో నేనిప్పుడు గ్రహించుకోగలుగుచున్నాను. సన్యాసులు స్త్రీలతో ఎట్టి చనువును కలిగి యుండరాదు అనియే శ్రీ గౌరాంగ ప్రభువుల ఆజ్ఞ. ఈ విషయము చక్కగ ఎరిగియు హరిదాసు వితంతువగు ఒక భక్తురాలితో సంభాషించెను. హరిదాసు సన్యాసికదా! సన్యాసులు కఠోర నియమముల పాటింపవలెను. అందుచేతనే, మహాప్రభువులు హరిదాసుకు కఠినశిక్ష విధించి వానిని తరిమి వేసిరి.

భక్తులపై శ్రీ రామకృష్ణులకు గల వాత్సల్యము ఏమని వర్ణింపను? భక్తునకు ఎట్టి ప్రమాదము కలుగకుండునట్లు ముందు ముందుగానే హెచ్చరించుచున్నారు.

శ్రీ రామకృష్ణులు "సాధూ-సావధాన్" అని గంభీరముగ పల్కుటను విని భక్తులు చకితులై నివ్వెరబోయిరి.

శ్రీ రామకృష్ణులు ఉత్తరపు వరండాలోనే యుండిరి. దక్షిణేశ్వర నివాసియగు భక్తుడొకడు వచ్చెను. అతడు సర్వదా వేదాంతవాదములు చేయుచుండును. అతడు కేదార చటర్జీతో శబ్ద బ్రహ్మమునుగూర్చి మాట్లాడు చుండెను.

భక్తుడు - అనాహతశబ్దము లోపల బయట సదా వినవచ్చు చుండును.

శ్రీ రామకృష్ణులు - కేవలము శబ్దమువినిన చాలదు. శబ్దము తెలియజేసే అర్థమును చూడ

వలయును. నిన్ను చూచిననే ఆనందము కలుగును కాని నీపేరు విన్నమాత్రమున ఆనందము కలుగదు కదా!

భక్తుడు - శబ్దమే బ్రహ్మము. అదియే అనాహత శబ్దము.

శ్రీ రామకృష్ణులు - (కేదారాది భక్తులతో) ఇప్పుడు అర్థమైనది. వీనిది ఋషుల మతము. ఋషులు శ్రీరామునితో "ఓ రామ చంద్రా, నీవు దశరథుని పుత్రుడవనియే మేమెరుంగుదుము. కాని భరద్వాజాది మునులు నిన్ను అవతార పురుషునిగ పూజింతురు. కాని మేము అఖండ సచ్చిదానంద బ్రహ్మోపలబ్ధినే కోరుచున్నాము". శ్రీరాముడు ఈ మాటలు విని నవ్వి వెడలిపోయెను.

కేదార్ - ఆ ఋషులకు ఎట్టి మందబుద్ధి? వారు శ్రీరాముని భగవదవతారమని తెలిసికొన జాలరైరి కదా!

శ్రీ రామకృష్ణులు - (గంభీరముగ) నీ విట్టి మాటలు చెప్పకు సుమా! రుచిభేదము లుండును: ఎవరికే వస్తువులు రుచించునో అట్టి పదార్థములనే తల్లి బిడ్డలకు వండిపెట్టును. ఋషులు జ్ఞానులు. అందుచే వారు అఖండ సచ్చిదానంద పరబ్రహ్మమునే కోరిరి. భక్తులు భక్తిరసము నాస్వాదించుటకై, మానవరూపమున భగవదవతారమునే కోరుదురు. అవతార పురుషుని దర్శించిన తోడనే అజ్ఞానాంధకారము పటాపంచలగును. పురాణములలో ఈ విషయము తెలుపబడి యున్నది. శ్రీరాముడు సభలో ప్రవేశించుట తోడనే, ఒక్కపెట్టున వేయిసూర్యులు ఉదయించినంతటి వెలుగు కలిగెను. ఆ వెలుగుకు సభాసదుల హృదయ కమలములు ఒక్కపెట్టున వికసించినవి.

'హృదయ కమలములు వికసించినవి' అను మాట పల్కుటతోడనే శ్రీ రామకృష్ణుల మనస్సుకూడ తన హృదయకమలమున లీనమై, బాహ్య జ్ఞానము కోల్పోయి సమాధిస్థితి నందెను. నిలబడి మాట్లాడుచుండిన శ్రీ రామకృష్ణులు అట్లే ఒక రాతిబొమ్మవలె నిశ్చలమై పోయిరి. ముఖము దివ్య తేజస్సుతో దేదీప్యమానమై వెలుగుచుండెను. భక్తులు కొందరు కూర్చొనియు కొందరు నిలబడియు నుండిరి. అత్యద్భుతమగు ఆ సమాధిస్థితిని తిలకించి నివ్వెరబోయిరి. చాలసేపయిన తరువాత పెద్ద నిట్టూర్పుతో రామ, రామ అని పల్కిరి. అటుపై మెల్లగా మనస్సు సహజస్థితికి తిరిగిరాగా నేలపై కూర్చొనిరి. భక్తులు కూడ కూర్చొని ఆ ప్రేమరాజ్యములో కల్గుచుండిన పరివర్తనల నెల్ల తిలకించుచుండిరి.

శ్రీ రామకృష్ణులు - (భక్తులతో) అవతార పురుషులు చాల గోప్యముగనుందురు. అవతారపురుషులను ఏ ముగ్గురో నలుగురో భక్తశిరోమణులు మాత్రమే తెలుసుకొన గల్గుదురే కాని సామాన్యప్రజలు వాని అంతు తెలిసికొన జాలరు సుమా. శ్రీరామచంద్రుడు పూర్ణబ్రహ్మావతారము అను విషయమును కేవలము పన్నిండు మంది ఋషులు మాత్రమే తెలిసికొనగలిగిరి. మిగిలినవారు "ఓ రామచంద్రా! నిన్ను దశరథుని కుమారుడవని మాత్రమే ఎరుగుదుము" - అనిరి.

విదేశమునకుపోయి క్వీన్ (విక్టోరియా మహారాణి)నుచూచి ఆమెతో మాట్లాడివచ్చిన వ్యక్తియే, ఆమెనుగూర్చి యథాతథముగా వర్ణింపగలడు. ఆమెను చూడకయే ఆమెను గూర్చి వర్ణించుట సరికాదు.

భరద్వాజాది ఋషులు రాముని ఇట్లు స్తుతి చేసిరి. "ఓ రామా! అఖండ సచ్చినదానంద స్వరూపుడవు నీవే, కాని, మా కొరకు భూలో

కముున మానవునై అవతరించితివి. యోగ మాయను ఆశ్రయించి మానవునివలె ప్రవర్తించుచున్నావు" శ్రీరామచంద్రుని పరమ భక్తులు భరద్వాజాదిమునులు. వారి భక్తి పరిపక్వమైనది, నిశ్చలమైనది.

భక్తులు ఈ అవతారతత్త్వమును గూర్చి వినుచుండిరి. కొందరు లోలోన ఇట్లు తలంచుచుండిరి. ఇదేమి వింత? వేదములలో అవాఙ్మానస గోచరునిగా వర్ణింపబడిన అనంత స్వరూపుడు ఐదడుగుల మనుష్యుడై జన్మించునా? శ్రీరామకృష్ణులు చెప్పుచున్నారు కాన ఒప్పుకొనవలసినదే. అటుల కాదేని రాముని పేరు వినుటతోడనే ఈ మహాపురుషునకు సమాధిస్థితి ఎట్లు కలుగును? నిశ్చయముగ ఈయన తన హృదయములో శ్రీరామచంద్రుని దర్శించుచున్నారు. అందుచేతనే ఈయనకు ఇట్టి స్థితి కలిగినది.

ఇంతలో 'కొన్నగరము'నుండి భక్తులు మృదంగ వాద్యములతో సంకీర్తనము చేయుచు వచ్చిచేరిరి.

మన్ మోహన్, నవాయ్, ఇంక కొందరు భక్తులు శ్రీరామకృష్ణుల దగ్గరకు వచ్చిరి. శ్రీరామకృష్ణులు భగవత్ ప్రేమోన్మత్తులై వారితోబాటు సంకీర్తనముచేయుచు నృత్యము చేయుచుండిరి.

తటాలున సమాధిస్థితి నంది నిశ్చలముగ నిలబడిరి. వెంటనే వారికి భక్తులు పుష్పమాలికలు వేసిరి. సాక్షాత్ శ్రీ గౌరాంగ మహాప్రభువులు ఎదుట నిలబడినట్లుగనే భక్తులకు తోచెను.

శ్రీ గౌరాంగ మహాప్రభువులకు భక్త్యావేశము కలిగినచో ఒక్కొక్కప్పుడు అంతర్ముఖులై సంపూర్ణ బాహ్యజ్ఞానమునే కోల్పోయి రాతిబొమ్మవలె నిశ్చలమై పోయెడివారు. ఒక్కొక్కప్పుడు కొద్దిగ బాహ్యజ్ఞానము ఉండెడిది. అట్టిచో, భగవత్ ప్రేమతో నృత్యము చేసెడివారు. శ్రీ రామకృష్ణులు చాలసేపు సమాధిస్థితిలోనే యుండిరి. భక్తులు వారిచుట్టు భజనలు చేయుచు తిరుగుచుండిరి. ప్రేమానురంజితమగు ముఖమండలము అందరి హృదయములను ఆకర్షించెను. చాల ప్రొద్దెక్కినతరువాతనే శ్రీ రామకృష్ణులు మామూలు స్థితికి వచ్చిరి.

కొంతసేపు విశ్రమించి నూతన వస్త్రములను ధరించి చిన్న మంచముపై కూర్చొనిరి. పసుపురంగు పట్టుపంచలు కట్టుకొని ఆనందముతో కలకలలాడుచు దివ్య తేజస్సుతో దేదీప్యమానమై వెలుగుచున్నట్టి వేదాతీతుడగు ఈ దివ్యమోహన విగ్రహమును ఎంతసేపు చూచినను కన్నులకు తనివి తీరుటలేదే!

## గోస్వామితోడ సర్వధర్మ సమన్వయమును గూర్చి ముచ్చటించుట

శ్రీ రామకృష్ణులు భోజనము చేసినపిదప కొంతసేపు విశ్రమించిరి. నేను పెక్కురు భక్తులు వచ్చియుండిరి. గదిలోనేగాక వరండాలోకూడ భక్తులుండిరి. గదిలో కేదార్, సురేష్, రామ్, మన్ మోహన్, భవనాథ్, గిరీంద్ర, రాఖాల్ మున్నగువారు కూర్చొని యుండిరి. ఇంతలో రాఖాలుని తండ్రియు, వైష్ణవ గోస్వామిగారును వచ్చి గదలో కూర్చొనిరి శ్రీ రామకృష్ణులు లేచి గోస్వామిగారితో సంభాషించుచుండిరి.

శ్రీ రామకృష్ణులు, గోస్వాములను చూచిన చాల భక్తిశ్రద్ధలు చూపుదురు. లేచి వారలకు నమస్కరింతురు. ఒక్కొక్కసారి సాష్టాంగ నమస్కారములుకూడ చేయుదురు.

శ్రీ రామకృష్ణులు – (గోస్వామితో) ఉపాయమేమి?

గోస్వామి – అయ్యా నామమే చాలును. అదియే ఉపాయము. కలియుగములో నామ మహాత్మ్యమును గురించియే ఎక్కువగ శాస్త్రములలో చెప్పబడియున్నది

శ్రీ రామకృష్ణులు – అవును. వాస్తవమైన మాటనే చెప్పిరి. భగవన్నామస్మరణతో గొప్ప మాహాత్మ్యము కలదు. సందేహము లేదు. కాని భగవంతునిపై అనురాగము లేక చేసిన వట్టి నామస్మరణవలన ఏమి ప్రయోజనము? ఈశ్వరునికొరకు మనస్సు పరితపించవలెను. నాలుకతో నామజపం చేస్తూ మనస్సును కామినీ కాంచనములపై యుంచిన ఏమి లాభమో తెలుపుము.

గోస్వామి – అట్లయినచో, అజామిళుని విషయమును గురించి మీరేమనెదరు? అతడు మహా పాతకుడుకదా, చేయరాని పాపములనెల్ల చేసెను. కాని మరణించుటకు ముందు 'నారాయణా' అని తనకుమారుని పిలిచినంత మాత్రముననే తరించెనుకదా!

శ్రీ రామకృష్ణులు – అజామిళుడు పూర్వజన్మములో చాల సత్కార్యములు చేసియుండెను కాబట్టే అట్లు జరిగినది.

ఏనుగును మడుగులోదించి వళ్ళుకడిగి వదలిన లాభములేదు. అది మరల మట్టి పూసుకొనును. శాలలో కట్టివేయుటకు ముందుగా వళ్ళు కడిగించినచో పరిశుభ్రముగ ఉండును.

భగవన్నామ మహిమచే మనస్సు నిర్మలమగును. దానిని మరల పాపకార్యముల వైపు పోనిచ్చిన కలుషిత మగును. అందుచే గట్టి మనోబలము కావలెను. ఇకమీదట నేనెన్నడు పాపకార్యములు చేయను అని దృఢ ప్రతిజ్ఞ పూనవలెను.

గంగాస్నానము చేసిన పాపములు పారిపోవుగందురు. ఒకవేళ పారిపోయిన ప్రయోజనమేమి? తిరిగి రాకూడదు సుమా! గంగలో మునకలు వేయునపుడు పాపములు అన్నీ ఒడ్డునగల చెట్టుపై కూర్చొనును. మునకలు వేసి బయటకు వచ్చినవెంటనే పాపములన్నియు చెట్టుపైనుండి మీద దుముకును (అందరు ఫక్కున నవ్వుదురు)

అందుచే భగవన్నామముతో బాటు ప్రార్థన కూడ చేయుము. భగవంతునిపై అనురాగము కలుగవలెను— అని ప్రార్థింపుము.

ధనము, పేరు ప్రతిష్ఠలు, భోగ విలాసములు ఇవన్నియు రెండుదినముల పాటివి. ఇట్టి అనిత్య వస్తువులపై మోజుతగ్గి పోవునట్లుగ భగవంతుని ప్రార్థింపుము.

(గోస్వామితో) – త్రికరణశుద్ధి కలిగినచో ఏ మతమును అనుసరించినను ఈశ్వరుని పొందవచ్చును. శైవులు, వైష్ణవులు, వేదాంతులు, క్రైస్తవులు, మహమ్మదీయులు, ఏ మతావలంబులైనను సరే త్రికరణశుద్ధి కలిగియున్నచో తప్పక భగవల్లాభమును పొందుదురు.

కాని మతములను గురించి కొందరు తగవులాడుకొను చుందురు. మా శ్రీకృష్ణుని భజింపనిచో ముక్తి లేదనియు, కొందరు మా కాళికాదేవిని ఉపాసింపనిచో తరింపవనియు, మరికొందరు మా క్రైస్తవ ధర్మము స్వీకరించనిచో ఉద్ధరింప బడవనియు ఇట్లు పలువిధములుగ వాదించుకొను చుందురు. ఈ సంకుచిత భావములు ఉండరాదు. నా మతమొక్కటే సరియైనది మిగిలిన వన్నియు సరియైనవికావు అని తలచుట చాలతప్పు. పలుమార్గముల ననుసరించి భగవంతుని చేరవచ్చును. మతముల గూర్చియేగాక సాకార నిరాకార రూపముల

గూర్చియు వాదులాడుచుందురు. కొందరు దేవునికి రూపము కలదనియు, కొందరు దేవుడు రూప రహితుడనియు వాదించుకొనుచుందురు. సాక్షాత్కారము పొందినవాడు దేవుని సాకారునిగను, నిరాకారునిగను ఈ రెండింటికి అతీతుడైన వానిగను చూచును.

ఒక కథ వినుము. కొందరు గ్రుడ్డివారు ఒక ఏనుగుదగర నిలబడిరి. ఒకవ్యక్తి ఈ జంతువును ఏనుగు అందురు అని వారికిచెప్పి దీని ఆకారమును వర్ణింపుడు అనెను. అంత వారు ఏనుగును తాకిచూడ మొదలుపెట్టిరి. ఒకగ్రుడ్డివాడు ఏనుగు ఒక స్తంభములాంటిది అనెను. అతడు ఏనుగు కాలుమాత్రమే తడివిచూచెను. అటుపై ఇంకొకడు తప్పు తప్పు ఏనుగు ఒక చాటలాంటిది అని బిగ్గరగ అరచిచెప్పెను. అట్లే ఏనుగు తొండము, ఉదరము తడవినవారు వేఱువేఱు విధముగ వర్ణింప మొదలుపెట్టిరి. భగవంతుని గూర్చికూడ ఎవరు ఎంతవరకు తెలిసికొనగలరో అంతవరకే చెప్పగలరు. దానికి మించి చెప్పలేరుకదా! ఇంకొక కథవినుము. ఒకవ్యక్తి ఫలానా చెట్టుక్రింద ఎఱ్ఱని రంగుగల ఒక చిన్న జంతువును చూచివచ్చితిని అని చెప్పెను. ఈ మాటవినిన మరొక వ్యక్తి ఆ చెట్టుక్రింద నేనుకూడ ఆజంతువును చూచితిని. అది ఎఱ్ఱరంగు కానేకాదు. ఆకుపచ్చ రంగు. ఇంతలో మఱొకవ్యక్తి అచ్చటకువచ్చి అది ఎరుపురంగూకాదు ఆకుపచ్చరంగూకాదు నా కళ్ళార చూచితిని. అది నీలిరంగుగలది. ఈ విధముగా పెక్కురు గుమికూడి ఆ జంతువు రంగునుగూర్చి వాదలాడుకొనుచుండిరి. దారిన పోవు ఒక పెద్దమనిషి మీరిట్లు వాదులాడుటకు కారణమేమి? అని అడిగెను. వారి జవాబులు విని అతడు మీరందరు పలుకునది నిజమే ఎవ్వరూ అబద్ధము చెప్పుటలేదు. అది ఊసరవెల్లి. ఇష్టమువచ్చినట్లు మాటిమాటికి రంగులు మార్చుకొనును. ఒక్కొక్కప్పుడు దానికి ఏరంగూ ఉండదు అనెను.

(గోస్వామితో) రమేశ్వరుడు కేవలము సాకారమూర్తి అని పలుకుట పొరపాటు. అతడు శ్రీకృష్ణుడుగా మానవరూపము ధరించి వచ్చెను. భక్తునకు దర్శనమిచ్చును. ఇదియు వాస్తవమే. మరల అతడు నిర్గుణుడు. అఖండ సచ్చిదానంద స్వరూపుడు. ఇదియు వాస్తవమే సుమా! వేదములుకూడ వానిని సగుణుడుగాను నిర్గుణుడుగాను వర్ణించినవి.

అఖండ సచ్చిదానంద స్వరూపమును అనంత సాగరముగ భావింపుము. చలికాలమున రాత్రులందు అక్కడక్కడ మంచు గడ్డలు కట్టును. కాని సూర్యరశ్మి సోకగనే ఆ గడ్డలు కరిగి మరల సముద్రపునీటిలో ఏకమగును. అటులనే భక్తునియొక్క ప్రభావమున భగవంతుడు సాకారరూపములు దాల్చిననూ జ్ఞానోదయమైనంతనే మరల అద్వితీయమగు అఖండ సచ్చిదానంద స్వరూపములో విలీనుడై పోవును.

పాపచర్యలు తలపునకు తెచ్చుకొని మనస్సును క్లేశపఱచుకోవలదు. ఏలన ఆ పాపమెంత ఘోరమైనదిగా ఉన్నను, ఆ ఘోరత మానవదృష్టికే కాని ఈశ్వరదృష్టికి కాదు. ఒక్కచూపుతో కోటిజన్మముల పాపములను ఆయన పటాపంచలు చేయగలడు.

—బ్రహ్మానందస్వామి.

# సంశయము నుంచుకొనకుము

నీ స్వభావమును మార్చుకొని స్వాధీనము లోనికి తెచ్చుకొనుట ఎట్లు అని యాతురత పడకుము. బొగ్గు చాల నల్లనిది. నిప్పుతో కూడినపు డది తేజోవంతమగును. దానికి స్వాభావికమగు నలు పంతరించును. అదేమాదిరి జ్ఞానమను అగ్నితో సంపర్కము గలిగినపుడు నీ హృదయములోని మాలిన్య మంతరించును.

నీ హృదయమును పరిశుద్ధముగాను, మాలిన్యరహితముగాను ఉంచుకొనుము. మంచి చేయుశక్తి నీకప్పుడు అపారమై యుండును. అప్పుడే చాకిరేవునుండి వచ్చిన తెల్లగుడ్డకు ఏ రంగు వేసినను పట్టును. మనస్సు చాకిరేవునుండి అప్పుడే వచ్చిన గుడ్డవంటిది. సత్సాంగత్యము, హృదయపూర్వకప్రయత్నము దాని నీశ్వరుని వైపునకు త్రిప్పును. ఆంగ్లవిద్య నభ్యసించిన వారి యుపన్యాసమును వినుము, వారెక్కువ యాంగ్ల పదములను వాడుదురు. సంస్కృత పండితులు ఎక్కువ సంస్కృతపదముల నుపయోగింతురు. సత్సాంగత్యము కలవారియొక్క మనస్సు పాపమువైపునకు ఎప్పుడుగాని తిరుగదు. దుస్సాంగత్యముకలవారు సదా పాపపు సంగతులనే తలపోయుచుందురు. తా మెట్టి వారితో సాంగత్యము చేయుదురో అట్టివారి రంగు (లక్షణములు) తమ తలంపులకు పట్టును. సత్సాంగత్యము నైతికభావములకు దోహదము నిచ్చును. దుస్సాంగత్యము చెడుతలంపులనే వృద్ధిచేయుచుండును.

మనలను మనము మోసపుచ్చుకొనకుండ ఉందుముగాక! సత్యము, భక్తిమాత్రమే భగవంతునిసాన్నిధ్యమునకు చేరుటకు మార్గములు. దేవుని మఱచితిమేని మృతినొందుదుము. భక్తి లేనిదే మనము నిజముగ బ్రతుకనే లేము.

జ్ఞానము, భక్తి వేరు కావు. భక్తియును సత్యమునుగూడి జ్ఞానము అగును. ఇతరులను చంపుటకు ఖడ్గముగాని తుపాకిగాని కావలెను. ఆత్మహత్యకొరకు సూదియే చాలును. అట్లే ఇతరులకు బోధచేసి వారి యజ్ఞానమును పోగొట్టుటకు చాల జ్ఞానము కావలెను. భగవంతుని తన హృదయములోపలకు తెచ్చుకొనుటకు ఎక్కువ పాండిత్యము అవసరము లేదు. భక్తి మాత్రమే చాలును.

అన్నిమతములకు మూలము భక్తి. ఒకడు నిజమయిన భక్తి గలిగినవాడైనచో, అతని మతము అతని యవసరములకు చాలును. చదువు మూలమునగాని, ఇతర మతములలో కలియుటవలనగాని, భక్తి లేనివానికి నిజమైన జ్ఞానము కలుగదు.

"నా ఆవు ఇది తినును, ఇది తినదు" అనుచు పశులకాపరి తన కిష్టమువచ్చిన పదార్థములతో తన ఆవును మేపును. ఆవు దానిని వాసన చూచి చూడకయే తల త్రిప్పుకొనును. అది యెక్కువ పాలనీయదు. కాని, ఏది పెట్టినను ఎక్కువ ఆప్యాయతతో తిను ఆవు, పాలు బాగుగ నిచ్చును. సంశయాయత్తచిత్తముల నుండి జ్ఞానమనెడు పాలు ధారాళముగ ప్రవహింపవు.

తృష్ణతో బాధపడునతడు చివరకు నదిలోని మురికినీటితోనైనను తన దప్పిని తీర్చుకొనగనుకట్టును. పరిశుద్ధమైన నీటికొఱకు అచట నూతిని త్రవ్వ నారంభింపడు. భగవంతునియందలి తృష్ణయు నిట్టిదే. ఆయనయందు తృష్ణగలవారు తమ మతము దోషయుక్తముగ కనబడుచున్నను, క్రొత్తమతములకై అన్వేషించుచుండరు. ఒక నూత్నమతమునుకూడ స్థాపింప

జూడరు. భగవంతునికొఱకు లోకనికి నిజమైన తృష్ణ గలిగెనేని స్వమతసాహాయ్యమునవే తన దప్పిని చల్లార్చుకొనుటకు యత్నించును. నూతన సిద్ధాంతములను కల్పించుటతో తన కాలమును వ్యర్థపరుచుకొనడు.

లుబ్ధుడు ద్రవ్యముకొఱకై యెట్లత్యాశ పడునో అటులనే భక్తుడు భగవంతునికొఱకు కూడ తపించుచుండును. మునిగిపోవుచున్న వాడు ఊపిరాడక ఎట్లు ఉక్కిరిబిక్కిరియగునో అట్లే అతడును భగవంతునికొఱకు ఆతురత పడును.

"కొందరు గ్రుడ్డినమ్మకమునుగూర్చి నిరసన భావముతో మాటలాడుదురు. వారియుద్దేశము నాకు బోధపడదు. గ్రుడ్డినమ్మకమనుమాటకు వారి యర్థమేమి? 'గ్రుడ్డిభక్తి' యను నొక ప్రత్యేకవిధమగు భక్తి లేదు. 'జ్ఞాన'మున్నది. 'భక్తి' యున్నది. భక్తికి కన్నులు లేవు. భక్తి యంతియు గ్రుడ్డిదే" యని శ్రీ రామకృష్ణు డనెను.

నాస్తికజీవితము సల్పసమకట్టితిమేని మనకు నాశమే సంభవించును. సంశయముల నన్నిటిని వీడి గాఢమైన భక్తిని వృద్ధిపఱచుకొనవలెను. ప్రపంచము శూన్యమునుండి యుద్భవింపలేదు. శూన్యమునుండి మనుజుని ప్రాణము, తలంపు జనింపగలవా? పరమేశ్వరుడుండుటను గుఱించి గాని, ఈశ్వరకటాక్షముయొక్క సత్యమును గుఱించిగాని మన కెట్టి సందేహము ఉండ నవసరములేదు.

"నరకమును గురించిన తలంపులతో బాధ పడకుము. భగవంతుని చింతించి యతని నిట్లు ప్రార్థింపుము: 'నేననేక నిషిద్ధకార్యములను చేసితిని. మిథ్యాకృత్రిమములైన పనుల ననేకములను చేయనైతిని. ఓ ఈశ్వరా! నాయందు కరుణింపుము' నీ పాపపుంజములు భస్మీపటలమై పోవును" అని శ్రీ రామకృష్ణభగవానులు చెప్పిరి.

* * *

బ్రాహ్మసమాజ ప్రధానాచార్యుడగు కేశవ చంద్రసేనుతో ముచ్చటించుచు శ్రీ రామకృష్ణ పరమహంస యొకానొకప్పు డిట్లు చెప్పెను: "నీవు జగమును సృష్టించితివి. నీ మహిమ వర్ణనాతీతము. నీవిది చేసితివి. అది చేసితివి' అని భగవంతుని ప్రార్థించుటవలన ప్రయోజన మేమి? తండ్రి ముందఱ కుమారుడు కూర్చొని, 'ఆహా! నా తండ్రి కింతమంది నౌకరులున్నారు, ఇన్ని గుఱ్ఱము లున్నవి, ఇన్ని బండ్లున్నవి, ఇన్ని తోటలున్నవి' అని ప్రశంసించునా? అట్లు చేయడు. ప్రేమగల కుమారుడు తండ్రియొక్క సంపద నిట్లు ప్రశంసింపడు. తండ్రియొక్క ప్రేమనుగురించికూడ ఎక్కువ తలపోయడు. అవి యుండుట చిత్రముగాదని అతనికి తెలియును.

మనము భగవంతుని బిడ్డలము ఆయన ప్రేమ ప్రకృతిసూత్రము. దానినిగురించి యాశ్చర్యము కనుపఱచుటగాని, భావించుటగాని, స్మరించుటగాని అనవసరము. ఇట్టి వృథా ప్రలాపములతో మనము కాలము వ్యర్థపఱచు కొనరాదు. సరిగా భగవత్సన్నిధానమును చేరుటకే సమకట్టవలెను, భార్య భర్తను సమీపించు రీతినిగాని, బిడ్డ తల్లిని చేరుమాడ్కిగాని, యతనియొద్దకు మనము చేరవలయును. మన మతనిని చనవుతో సమీపించి భర్తను భార్య కోరురీతిగ, తండ్రిని బిడ్డ కోరురీతిగ, మనకు కావలసినపనిని చేయుమని అడుగవచ్చును. దూరముగానున్నచో, మనము అతని నాలింగనము చేసికొననేరము. ఆయనదగ్గఱకు వెళ్ళుటకు భయపడరాదు. అతడు నీవాడే యనియు, నీ బంధువు లందరికన్నను నీకు సమీపస్థుడనియు

సమ్మనము ఆయనతో నీవు పూర్ణమగు చనవుతో దాపరికమేమియు లేక వ్యవహరింప వచ్చును.

భక్తిమార్గముయొక్క రహస్య మిదియే. భక్తిలో భయముగాని, ఆశ్చర్యముగాని, అణకువకై నగాని తావులేదు. ప్రేమ, విశ్వాసము, శ్రద్ధ భక్తియొక్క లక్షణములు. ఆరంభములో జంకు- భయము నైతము- ఉండ వచ్చును. భక్తి విజృంభించుకొలది వాని స్థానమున విశ్వాసము జనించును. భక్తుడప్పటి భగవంతుని తన స్వాంత సొమ్ముగ ఎంచి యతనిని చేరును.

* * *

తన శిష్యులలో నొకరితలి యొకర్తవుడు శ్రీ రామకృష్ణునియొద్దకు వచ్చి యిట్లనెను: "నేను ముసలిదాన నయితిని. నా కుటుంబ చింతలను వదల్చుకొన దలచితిని. బృందావనమునకుపోయి రాధాసాన్నిధ్యమున విరక్తిమార్గ మవలంబించి కాలముగడప నెంచితిని."

బరమహంస ఆ ముసలికి నిజముగా నిది సాధ్యముకాదనియు, ఆమె వైరాగ్య మూహా ప్రపంచములోనిదే యనియు, ఆమె యింకను కుటుంబాసక్తి పూర్తిగా వీడలేదనియు తెలిసి, యామెతో నిట్లనెను:

"అమ్మా! నీ మనుమరాలియెడ నీకు గల యనురాగము నాకు తెలియును. నీవు బృందావనమున కేగినను మఱి యే యితర ప్రదేశమునకు జనినను, ఎచటికి పోయినను, నీ మనుమరాలిని మరువజాలవు. నీవు లేనియప్పుడామెకు సంరక్షణ జరుగుచున్నదో లేదో అని ఆలోచించుచుందువు. నీ శరీరము బృందావనములో నున్నను, నీ మనస్సంతయు మనుమరాలిమీదనే యుండును. కాని నీ మనుమరాలినే దేవిగా నెంచి నీ ప్రేమ నామెయెడల జూపుము. ఇంటియందే యుండి బిడ్డను జాగ్రత్తగా జూచుకొనుచు ఆమె రాధయే యను భావము నీ మనస్సున కెక్కునట్లు చేసికొనుము. బిడ్డయందలి ప్రేమ యామెకు దేవియెడల భక్తిగా మారును. పిల్ల నాడించునపుడు, దాని కాహార మిడునపుడు, బొట్టు నుదుట నుంచునపుడు, సదా నీ విది యంతయు దేవికే చేయుచున్నట్లూహింపుము. అప్పుడు నీవు స్వస్థలములోనున్నను, వైరాగ్యముయొక్క లాభమును, బృందావనములో నుండి కృష్ణుని భజించు లాభమును పొందుదువు"

* * *

"నీ వెవరిని ప్రేమించినను - బిడ్డనుగాని, తల్లినిగాని, తండ్రినిగాని, స్నేహితునిగాని - ఆ వ్యక్తి భగవత్స్వరూపమే యనియు, దేవియొక్క యవతారమే యనియు ఎంచుట నలవరచుకొనుము. ఇది మనకందఱకు సులభమయినట్టిదియు, అమోఘమైనట్టిదియు నగు మార్గము. ఇదియే మన జీవితమును మాలిన్యరహితముగా చేసికొను పథము" అని శ్రీ రామకృష్ణుడు బోధించెను.

ఒకనాడు అర్ధనిశాసమయమున రామస్వామిపడెయాచి నిద్రనుండి మేల్కాంచెను: సమీపమున నున్నయరణ్యమున గల తన స్నేహితుడు సెంగోడన్ గుడిసెకు జనెను. పేరుతో పిలుచుచు తలుపు తట్టెను. సెంగోడన్ నిద్రలేచి "నీకేమికావలెను? ఇట్టి రాత్రి సమయములో నన్నెందులకు నిద్రలేపితివి?" అని యడిగెను.

"చుట్ట కాల్చుకొనుటకు నిప్పుపుల్ల కావలెను" అని పడెయాచి బదులు చెప్పెను. "ఎంత వేడుకగా నున్నది. నీ చేతిలోని దీప

ముతో ఏల చుట్ట కాల్చుకొనలేను?'' అని సెంగోడన్ ఆశ్చర్యముతో పల్కెను.

తన చేతిలోని లాంతరులో నిప్పున్నదని రామస్వామికి జ్ఞప్తికి రాలేదు భగవంతుడు తమ హృదయములలోనే శాశ్వత నివాసము చేయుచుండుట తెలియక, బయట నెచటనో కలడని వెదకువారి తెలివితక్కువ తనమును స్పష్టము చేయుటకు శ్రీ రామకృష్ణుడు ఈ పై కథ నుడివెను.

తన వక్షఃస్థలమును చూపుచు, "ఇచట భగవంతుని జూచువాడు బాహ్యప్రపంచమంతటిలోను అతని యునికిని చూచును తన హృదయములో భగవంతుని చూడనివాడు మఱెచటను అతనిని జూడజాలడు. తన హృదయమను గుడిలో భగవంతుని దర్శింపగలిగిన యతడు కాశిలోను, కంచిలోను అతనిని చూడగలడు. అపు డతనికి బ్రహ్మాండమంతయు దేవునియొక్క యొక గొప్ప దేవాలయముని తెలియవచ్చును. హృదయములో ఈశ్వరుని సందర్శింపలేక పోయి ఆ కాశివీధియందును, అంతకన్న ఉన్నతమైన ప్రాంతములందును ఆయనను వెదకుటయు అవిద్యచే ఆచరింపబడిన దానిని మనము నిశ్చయించుకొనవలెను, జ్ఞాన జ్యోతి వెలుగునపుడు ఈశ్వరుడు హృదయమను దేవాలయములో ప్రజ్వరిల్లును.

హృదయమునందు భగవంతుని దర్శించుట యనగా ఇతరులు ఆయననుగురించి నుడివినపలుకుల నంగీకరించుట కాదు. దానిని తద్గర్భిత భావసహితముగ గ్రహించి, తదనుసారముగ తన జీవితమును మార్చుకొనవలయును. భగవంతుని తన హృదయములో కనుగొనిన యతని జీవితమంతయు పూర్తిగ మారిపోవును. చాలకాలముక్రిందట డబ్బునుంచి పోగొట్టకొని వెదకుచు తుదకు తన జేబులోనే దానిని కనుగొనినవానివలె అతడుండును. తల్లి తనబిడ్డ చనిపోయినట్లు కలగనెనని యనుకొనుము. కలలో ఆ బిడ్డకై విలపించునా. హఠాత్తుగ మేల్కాంచి ఆ బిడ్డ తన ప్రక్కననే సుఖముగా నిద్రించుట చూచును. ఆమెకెంత సంతోషము కనో దానిని స్మరింపుము. ఈశ్వరుడు మన హృదయమునం దుండుట ఎఱిగినప్పుడు మనము అట్టి యానందమే పొందుదుము.

* * *

ఒకదినమున మిక్కిలి ఆతురతతో యశోద రాధను "నా గోపాలు డెచట? ఇంకను ఇంటికి రాలేదే. అత డెచటికి వెళ్లినది నీకు తెలియునా?" అని యడిగెను.

రాధ నిద్రలేచి "అమ్మా! నీ వాతురత పడకుము. కన్నులను మూసికొని గోపాలుని గుఱించి ధ్యానముచేయుము. వెంటనే నీ వతని చూతువు" అనెను. యశోద ఆట్లొనర్చి తన ముద్దులగోపాలుని చూచెను.

అంతట యశోద రాధ నొకవర మడిగెను. "రాధా! నా కన్నతల్లీ! నీ భక్తియొక్క ఫలితమే నీ శక్తి. నాకుకూడ దానినియవా? నాకు మార్గము చూపుము." యశోద వరమును బడసెను.

అన్ని చోట్లను, ఎల్లప్పుడును, మనముకూడ రాధా యశోదలమాడ్కి గోపాలుని చూడ నగును. అయినను మనముకూడ రాధాయశోదలవలె గోపాలుని చూచుటకు ఆవేదనపడవలెను. ఆవేదన హృదయములో నుద్భవింపవలెను. నిజమయిన ఆవేదనతో మనము కోరితిమేని భగవత్సందర్శనము మనకు తప్పక సంభవించునని కఠోపనిషత్తు చెప్పుచున్నది.

—శ్రీ రామకృష్ణోపనిషత్తునుండి

# మాతృదేవి చరణసన్నిధి

ఆంగ్ల గ్రంథము:
ఎట్ ది హోలీమదర్స్ ఫీట్

అనువాదము:
పి. గణపతిశాస్త్రి

నేను: అవునమ్మా! శరీరం ఉన్నంతకాలము మనిషి బాధపడక తప్పదు! నా బాధలన్నీ తొలగించి వెయ్యవలిసిందని కూడా నేను ఠాకూరు నెప్పుడు ప్రార్థించలేదు! కాని తీరని దుఃఖాలతో సతమవుతున్న సమయంలో ఆయన సాక్షాత్కరించి మన కింత ఊరట కలిగించవచ్చునుగదా!

అమ్మ: అవును, నాయనా! నీవన్నది నిజమే! ఇదే సంగతి నేనాయనతో మొర పెట్టుకున్నాను. దానిమీద ఆయన "అటు వంటివారు లక్షలున్నారు! నా కిష్టంవచ్చిన పద్ధతిలో వారితో వ్యవహరిస్తాను." అన్నారు.

నేను: నే నెంతగా బాధ పడుతున్నానో గమనించలేరా, ఠాకూరు?

అమ్మ: గమనించలేకేం? అయితే నీవంటి వా రింకా లక్షలకొద్దీ ఉన్నారుగదా మరి?...

నేను: రేవుల్లో పనిచేసే పాటకపు జనం చాలా అదృష్టవంతులమ్మా! జీవితస్వప్నంలో నించి మేలుకున్నవారు, భగవానుని అన్వేష కులు మాత్రమే విపరీతమయిన వేదన లనుభ విస్తారు అంతే!

అమ్మ: అవును నీవన్నది నిజమే నాయనా! ఆ పాటక జనం తమ జీవితం చాలా హాయిగా గడిపివేస్తారు. ఇంత తింటారు, తాగుతారు. హాయిగా కాలక్షేపం చేస్తారు! కాని భగ వానుని భక్తులే యెంత నేలపాలవుతారు.

నేను. అమ్మా, అలాగ యాతనల పాలవు తున్న వారికేసి చూస్తూంటే నీకు జాలి వెయ్యదా?

అమ్మ: వారిని గురించి నే నెందుకు బాధ పడాలి? ప్రపంచాధినేత భగవానుడు వారి సంగతి చూసుకుంటాడు.

నేను: అమ్మా, నీ మీద భక్తిప్రపత్తులు పెంపొందించుకున్న భక్తులకోసం తిరిగి ఈ లోకానికి మరలిరావాలని అనిపించదా నీకు?

అమ్మ: ఈ లోకంలో జన్మించడమంటేనే బాధ లనుభవించడమన్న మాట! చాలు! చాలు! ఇంతకన్న యాతన లనుభవించలేను! తిరిగి ఈ లోకానికి మరలిరావాలని నా కని పించడంలేదు!...

అమ్మ సహోదరులదగ్గరనించి కొన్ని ఉత్త రాలు వచ్చాయి. ఆర్థికంగా సహాయం చెయ్య వలిసిందని వ్రాస్తూ వారు ఆ లేఖలలో తమ తమ కలహాలను గురించిన గొడవలన్నీ ఏకరువు పెట్టారు. అవి చదివిన తరువాత నేను సూచించాను.

నేను: అమ్మా, వారికి పుష్కలంగా సొమ్ము ఇయ్యాలని నా ప్రార్థన. ఈ విషయమై ఠాకూరు ముందు నివేదించవలిసిందని కోరుతున్నాను. సమస్త భాగ్యభోగాలు పూర్తిగా అనుభవించిన పిమ్మట వారి కిక లేనిపోని లంపటా లేవి మిగలవు.

అమ్మ. అది ఎన్నటికి జరగదు! బ్రతుకు మీది వ్యామోహం వారి నెన్నడు విడిచి పెట్టదు. వారి కెంతటి భాగ్యభోగా లమరినా చిట్టచివరికి జరిగేదింతే! ప్రాపంచిక వ్యామో హాలలో పడి కొట్టుమిట్టాడుతున్న వారి కెన్న టికి అనాసక్తి పొందడం చేరదు. జీవితంలో ఎదురుపడుతున్న ఇబ్బందులనుగూర్చి వారెల్ల ప్పుడు ముక్కుతూ మూలుగుతూనే ఉంటారు.

కాళీకి ఎప్పుడూ డబ్బు ఇబ్బందులే! ఇప్పుడు ప్రసన్నకూడా కాళీ అడుగుజాడలలో పడుతున్నాడు. కాని వరదామాత్రం సొమ్ము కావాలని అడగడు. "సోదరి సొమ్ము ఎక్కడినించి తేగలదు?" అని అంటూంటాడు.

"మీ మతిపోయిన మరదలుకూడా సొమ్ము తే తెమ్మని అడగదు!" అన్నాను నేను.

అమ్మ అంతే కాదు! ఎవరయినా సొమ్మిస్తే వెంటనే దూరంగా విసిరివేస్తుంది. ఆవిడ!

నేను: ఇటువంటి కుటుంబంలో నీ వెందుకు జన్మించావమ్మా? దానిమీద అమ్మ ఇలాగ వివరించారు.

అమ్మ: నా తల్లిదండ్రు లిద్దరు చాలా మంచివారు మా నాయన రామభక్తులు! మా అమ్మ చాలా జాలిగుండెగల వ్యక్తి. ఎవరికన్నా భోజనం పెట్టడం అంటే ఆవిడ కెంతో సంతోషం. ఆపైన అందరి కష్టసుఖాలలోను ఆదుకుంటూ ఉంటుంది. మాయామర్మం తెలియని వ్యక్తి ఆమె. హుక్కా అంటే మా నాయన కెంతో ప్రీతి. వీధమ్మట పోయేవా రందరిని కాస్త హుక్కా తాగిపొమ్మని ఆహ్వానిస్తూ ఉండేవా రాయన. దగ్గిర కూర్చోబెట్టుకుని హుక్కా అందించేవారు అన్ని అతిథి మర్యాదలు స్వయంగా ఆయనే చేస్తూండేవారు.

ఉద్బోధన కార్యాలయము. ప్రార్థన మందిరము. 2 మే - 1912.

"అమ్మా, ఠాకూరు తరచుగా కొంతమంది తమకెంతో ఆత్మీయులన్నట్టు ప్రసంగిస్తూ ఉండేవారు దీని అంతరార్థమేమిటి?" అని నే నడిగాను.

దానిమీద మాతృదేవి వివరించారు.

అమ్మ: ఆ వ్యక్తులు తమ నిత్య సహచరులని ఠాకూరు అభిప్రాయం. ఎవరన్నా మహారాజు విదేశానికి ప్రయాణమయితే, అనుచరులు ఆయన వెంట బయలుదేరతారు. నేను జయరాంబాటికి ప్రయాణమయినప్పుడు నా పరివారం నా వెంట వస్తున్నారుగదా! ఇందుచేత ఎంతో ఆత్మీయులయినవారు యుగయుగాలలో ఒండొరు లనుసరిస్తూంటారు. "నా హృదయ సన్నిహితులయిన వారందరు నా దుఃఖాలపాలు పంచుకుంటారు" అని ఠాకూరు అంటూండేవారు. ఆయన తమ యువక శిష్యులకేసి చూపించి వారు నా కష్టసుఖాలలోను యాతనలలోను పాలు పంచుకుంటారు అని అంటూండేవారు. ఠాకూరుతో బాటు ఆయన అంతరంగికులుకూడా భూమిమీద అవతరిస్తూంటారు. ఠాకూరు నరేంద్రుణ్ణి సప్తర్షి మండలంనించి అవతరింపజేశారు. దక్షిణేశ్వరంలో కాళీ దేవాలయంలో ధ్యాన నిమగ్నులయి ఉన్న తరుణంలో ఠాకూరు శంభు మల్లికను కాళీమాత విగ్రహం వెనకాల చూశారు. బలరామ్‌ను యథాతథంగానే సందర్శించారాయన. మొట్టమొదటగా చూపినప్పుడు "నేను సరిగ్గా ఇదే ఆకారంలో చూశాను పచ్చని శరీరచ్ఛాయ, తలమీద తలపాగా, అచ్చంగా ఇదే ఆకారం." అని ఉట్టంకించారాయన. ఆతరువాత సురేంద్ర మిత్రనుకూడా అలాగే సందర్శించారు. "ఈ ముగ్గురు నాకు ఆ భగవానుడు ఏర్పరచిన సప్లయిదారులు" అని ఆ తరవాత అన్నారాయన.

అమ్మ ఇంకా ఇలాగన్నారు.

ఈ రోజుల్లో జనం బాగా తెలివిమీరిపోయారు. ఠాకూరు చిత్రపటాలిప్పుడు వారి చేతికి వచ్చాయి. ఇదిగో, ఈ మాష్టరు మహాశయుడున్నాడే! ఈయన సామాన్య మనిషి కాదు! ఠాకూరు నోటమ్మట వెలువడిన ప్రతి మాట వ్రాసుకున్నాడాయన.

నేను: తాను రచించిన శ్రీరామకృష్ణ కథామృతాన్ని [గాస్పెల్] గురించి మాష్టర మహాశయులు 'అది పూర్తిగా ప్రకటి చా లంటె ఏపది పన్నెండు సంపుటాలదాకా పెరగ వచ్చునని అన్నారు. దానికి ఆయనకి తగినంత అవకాశం లభిస్తుందా మరి?'

అమ్మ: అవును నాయనా, నీవన్నదినిజమే! ఆరోజు కారోజు బాగా పెద్దవాడవుతున్నా డాయన. ఆ పుస్తకం ప్రచురణ పూర్తికాక మునుపే ఆయన మరణించవచ్చును.

నేను: ఠాకూరుకు కొందరు తెల్లవారితో పరిచయం కలుగుతుందనో, మరేదో నీవు నాతో జయరాంబాటిలో అన్నావుకావమ్మా!

అమ్మ: లేదు. నేను అలాగనలేదు! తెల్ల వారిలో చాలామంది ఠాకూరుశిష్యులు కాగల రని మాత్రమే నేనన్నాను అంతే! ఉదాహరణకు, ఇప్పుడు ఆయన దగ్గిరికి ఎంతమంది క్రిస్టియనులు వస్తున్నారో గమనించావా? ఈపైన నూరేళ్ల తరవాత మళ్లీ భూతలిమీద అతను అవతరించ బోతున్నామని ఠాకూరు స్వయంగా అన్నారు. ఈ నూరేళ్లు తమ భక్తుల హృదయాల్లో నివసిస్తారాయన. తిరిగి ఈ భూతలి మీద అవతరించబోవడం లేదని నేనాయనతో అన్నాను. ముక్కలు ముక్కలుగా నరికి వేసినా తానీ భూమిమీదికి తిరిగి దిగి రాదలుచుకో లేదని లక్ష్మికూడా అన్నది. దానిమీద ఠాకూరు నవ్వుతూ "రాకేం జేస్తావు! కాల్మి ముక్క వేళ్లలాగ మన వేళ్లన్నీ ఒండొంటితో పెనవేసుకు పోయాయి. ఒకటి లాగితే అన్ని పైకి వచ్చేస్తాయి.

ఠాకూరు తరుచుగా అంటుండేవారు. "పట్టి మాటలవల్ల ప్రయోజన మేమిటి? మామిడి పళ్లు తినాలన్న కోరికతో తోటలోకి వచ్చారు. పళ్లుతిని వెళ్లండి. తోటలో చెట్లకి ఎన్నెన్ని కొమ్మలుంటే వాటికి ఎన్నెన్ని ఆకులుంటే మనకేం?

నేను: కంటికి ఏదైనా ప్రత్యక్షంగా కని పిస్తే తప్ప దీనివల్ల ప్రయోజన మేమిట?

దానిమీద కవంతసేపు ఊరుకుని అమ్మ ఇలాగన్నారు.

"అవును! నీవన్నది యధార్థమే. ఏకొ కొంత ప్రత్యక్షానుభవం కావాలి నిజమే. కాని ఒకప్పుడు అలాంటి అనుభవం కలగకపోయినా నిరుత్సాహ పడకూడదు!'

నేను: ఇటీవల శరత్ మహారాజ్ [శారదానంద స్వామి] ఇలా గన్నారు స్వామి వివేకానందకూడా ఒకప్పు డిలాగే సెలవిచ్చారు. పక్కగదిలో బంగారునాణాల కుప్ప ఒకటి ఉన్నదనుకోండి! దానిసంగతి ఆ పక్కగది లోనే ఉన్న దొంగ కొకనికి తెలిసిందనుకోండి! అయితే మధ్యన ఒక అడ్డగోడ ఉన్నందున ఆ బంగారం స్వాధీనం చేసుకోడానికి వీలుపడదు! అప్పుడు ఆ దొంగకంటికి ఒక్క కునుకయినా పడుతుందా? ఆ బంగారం అంతా చేజిక్కించు కోడ మెలాగా అని ఆత్రపడు తూంటాడు. ఇలాగే ఒక వ్యక్తికి భగవాను డున్నాడన్న దృఢనిశ్చయం కలుగుతుం దనుకోండి! ఆపైన అతనికి మరి సంసారంమీద వ్యామోహం కలుగుతుందా?

అమ్మ: అవును నాయనా, నీవన్నది అక్షరాలా యధార్థం!

నేను: అమ్మా, నీవేమని అన్నా, సంసారం పరిత్యజించి విరక్తి పెంపొందించుకోవడం మిక్కిలి ముఖ్యమయిన కర్తవ్యం. నేను నా జీవితలక్ష్యమయిన పరిపూర్ణత్వం సాధించుకో గలనా అమ్మా!

అమ్మ: తప్పకుండా సాధించుకోగలవు నాయన ఠాకూరు శరణాగతి పొందినవారికి

సమస్తము సంప్రాప్తిస్తుంది. సర్వసంగ పరిత్యాగమే ఆయన మహనీయ వైభవము. నాకిప్పటికీ గుర్తుంది. ఆయన గదిలో సుగంధ ద్రవ్యాలపంచీ ఖాళీ అయింది. అందుచేత మధ్యాహ్న భోజనం ముగించుకొన్న తరవాత ఠాకూరు సుగంధ ద్రవ్యాలకోసం నహబత్ కిందఉన్న నాగదికి వచ్చారు. నోట్లో వేసుకోవడానికి కొన్ని సుగంధద్రవ్యాలిచ్చాను. ఆపైన మిగిలినవి ఒక పొట్లంలోపెట్టి ''ఇవి దగ్గిర అట్టే బెట్టుకోండి'' అని ఆయన చేతికిచ్చాను.

తిరిగి నా గదిలోనించి బయలుదేరారాయన. కాని తమగదికి వెళ్ళడానికి బదులుగా దక్షిణపు దెసవైపున్న గంగానదివైపు వెళ్లారు. ఆ సమయంలో ఠాకూరుకు దారి తిన్నగా స్ఫురించలేదు. చూపే తిన్నగా ఆనడం లేదనిపించింది. ''అమ్మా, నే నిక్కడపడి మునిగిపోవాలా?'' అని గట్టిగా కేకపెట్టారు. నదికి బాగా వరద వచ్చింది. అందుచేత నేనెంతో ఆదోళనపడ్డాను. పట్టపగటివేళ నేనెన్నడు గదిదాటి బయట అడుగుపెట్టలేదు. పోనీ అనుకుంటే ఆ దరిదాపుల్లో ఎవ్వరు కనిపించలేదు! ఆ పరిస్థితిలో ఆయనకు సాయపడడానికి కింకఎవ్వరిని పంపించగలను? ఎలాగయితేనేం? అంతలోనే దేవాలయానికి చెందిన బ్రాహ్మణులు ఒకాయన అటువేపు వచ్చారు. హృదయ్‌ని పిలవడానికి ఆయన్ని పంపించాను. అప్పుడు అతడు భోజనం చేస్తున్నాడు. కాని ఆ మాట వినగానే చేతులు కడుక్కోవాలని అయినా ఆలోచించకుండా గంగాతీరానికి పరుగెత్తుకువెళ్లాడు. వెంటనే ఠాకూరును వెంటబెట్టుకుని వచ్చాడు. లేకపోతే ఆయన ఆ సమయానికి గంగిలో పడిపోయిఉండవలసిన దే!

నేను: ఆయన గంగాతీరానికి ఎందుకు వెళ్లవలసి వచ్చింది?

అమ్మ: అట్టే బెట్టుకని దాచుకోడానికి ఆయనకు కొన్ని సుగంధ ద్రవ్యాలిచ్చానుగదా! అటువంటి పవిత్ర సర్వసంగ పరిత్యాగి ఏవస్తువు ఏమాత్రముకూడ బెట్టకోరాదు. అందువల్లనే ఆయనకు ఆనాడు తనుగదికి తిరిగివెళ్లే దారి కనిపించలేదు. ఠాకూరు అంతటి మహనీయ సర్వసంగ పరిత్యాగి.

వైష్ణవసన్యాసి ఒకాయన ఒకప్పుడు పంచవటికి వచ్చారు. మొట్టమొదట ఆయనకు దేనిదమీ మమకారం ఉండేదికాదు. కాని క్రమక్రమంగా ఆయనలో విపరీతమయిన లోభం పెరిగింది. పాత్రసామానులు, బిందెలు, ధాన్యం మొదలయినవన్ని కూడబెట్టడం ప్రారంభించాడు. ఠాకూరు అది అంతా గమనించి ''ఇది ఇంక అధోగతికే తీసుకపోతుంది!'' అన్నారు. అంటే ఆ సన్యాసికి ఆయా వస్తువులమీద విపరీతమయిన మమకారం కలిగిందన్నమాట! ఠాకూరు ఆపైన అతనికి సర్వ సంగపరిత్యాగం బోధించి, పంచవటినించి ఇంకొకచోటికి ఎక్కడికయినా వెళ్లిపోవలసిందని హిత వుపదేశించారు. ఆ సన్యాసికి చిట్టచివరికి ఆ విధంగా బంధనవిముక్తి కలిగింది.

శిష్యుడు ఒకడు మాతృదేవి పాదాలకు నమస్కరించాలని వచ్చాడు. అతడు నమస్కరించి వెళ్లిపోయినతరవాత అమ్మ ఇలాగన్నారు.

అమ్మ: హరీష్‌మీద అర్ధ్రమయిన అభిమానం కలిగిన తరవాత నేనొకపారం నేర్చుకున్నాను. ఇప్పుడు ఎవ్వరిమీద నేను ఎటువంటి అభిమానము వ్యక్తీకరించడంలేదు.

: శేషము.

# శారదానందస్వామితో సంభాషణలు

శిష్యుడు: "దినమునకు ఎన్నిసార్లు జపించవలెను?"

స్వామి: "శక్త్యనుసారము కనీసము పదివేలసార్లు జపింపుము. మంత్రము పెద్దదైనచో ఐదువేలసార్లు. మఱియు పెద్దదైనచో రెండువేలసార్లయినను మంచిదే."

శిష్యుడు: "గాయత్రీమంత్రమును వేయిసార్లుచ్చరించుటకే ఐదారుగంటలు పట్టును."

స్వామి: "సరే, మంత్రము మిక్కిలి పెద్దదైనచో, వేయిసార్లైనను ఏల ఉచ్చరింపరాదు? దినము తప్పక వేకువనే నిద్రలేచి జపింపవలెను. మంత్రము అంత పెద్దదికాదేని, రెండువేలసార్లతో ప్రారంభించి క్రమక్రమముగా అధికపఱుపుము. అది చాలును. అభ్యసించువా రెవ్వరును లేరు. అందఱును వ్యర్థకాలయాపన చేయువారే. విజయము సాధింపవలెనన్నచో గాఢతరాభ్యాస మవసరము.

"గాఢపరిశ్రమ చేయుము జయము సిద్ధము. నిద్రాహారముల కందఱకును తీఱిక లభించును. ఆధ్యాత్మిక సాధనలకే తీఱిక దొరకనిది!"

"అది సరేగాని, నీవిప్పు డేమి చదువుచున్నావు"

శిష్యుడు: "అధ్యాత్మరామాయణము."

స్వామి: "మంచిపని. శ్రీ గురుదేవునికి ఆ గ్రంథముపై చాల ప్రీతి. అందులో ననేకభాగము లాయన ముఖస్థము లొనర్చుకొనెను. ఆయన కద్భుతమగు జ్ఞప్తి యుండెడిది. ఆయన 'శ్రుతిధర' సార్వభౌముడు. ఒక్కసారిమాత్రమే విన్న విషయములుకూడ ఆయనకు జ్ఞప్తియుండెడివి. స్వామిజీ అంతకన్న కొంచెము తక్కువ తరగతివాడు. చదువుటయో, వినుటయో రెండుసార్లు జరిగినపిదప ఆయనకు జ్ఞప్తియుండెడిది."

శిష్యుడు. "ఈ యద్భుతశక్తి యెట్లు లభ్యమగును? వారి బుద్ధిసూక్ష్మతయేనా, ఇతర కారణ మేదైన కలదా?"

స్వామి. 'వీరిబుద్ధి పరిపూర్ణముగా వీరికి వశవర్తియై యుండెడిది. ఏవస్తువుపై ఆబుద్ధిని చొనిపినను, అది ఆవస్తువును అంటుకొని పోవును ఇందుకు అపారమగు కేంద్రీకరణశక్తి కావలెను. ఒకేసారి విన్న లేక చూచిన విషయముకూడ వారికి సంవత్సరముల తరబడిగా జ్ఞప్తియుండును.

"శమదమాదులగు ఆఱు గుణసంపదలలో శ్రద్ధ (పరిపూర్ణ తత్పరత్వము) ఒకటి ఈ పరిపూర్ణ విశ్వాసము—తన గురువాక్యము నందును ఈశ్వరునందున, శాస్త్రములందును పరిపూర్ణ విశ్వాసము—ఇదియే పారమార్థిక క్షేత్రమున అత్యంత ముఖ్యము. 'ఫలాన పనిని చేయుమని గురువు నన్నాజ్ఞాపించినాడు. నేనది చేసితినేని నాకు విజయము చేకూరుట నిస్సంశయము. అన్యథా జరుగనేరదు' అని తలంచు జాజ్వల్యమాన శ్రద్ధ గురువాక్యములం దుండుట అత్యావశ్యకము.

"శ్రుతిధరునకును సామాన్య మానవునకును భేదమేమి? శ్రుతిధరుడు తన మానసిక శక్తుల నన్నిటిని ఏకాగ్రమొనర్చి దేనిమీద నైన ప్రసరింపజేయగలడు. సామాన్య మానవుని మానసికశక్తులు చెదరియుండును. వాని నేకాగ్రమొనర్చి ఉద్దిష్టవస్తువుపై కేంద్రీకరించు శక్తి అతని కుండదు. లౌకికుల బుద్ధి ఎన్నో వస్తువులమీదకి చీలియుండును. వివాహమయ్యెనేని, బుద్ధిలో సగపాలు భార్యమీద నిలు

చును. మిగిలినదానిలో నెక్కువభాగము బిడ్డల మీఁదకి, ద్రవ్యముమీఁదకి, ఆస్తిమీఁదకి ఇట్లి న్నిటిమీఁదికిపోయి యుండును. ఇంకనుమిగిలి యుండు కొంచెమును భోగ్యవస్తువులందు విభజింప బడియుండును. కాని బుద్ధినంతయు ఏకాగ్రముచేసి, ఏకముఖముగా ప్రసరింపజేయుట అసాధ్యప్రాయమైన విషయము. శ్రీ గురుదేవులు మనస్సును ఆవగింజల పొట్లమునకు పోల్చువాడు. 'ఆ పొట్లము చిరిగెనేని, గింజలు చెల్లాచదరై దశదిశల వ్యాపించును. వానిని మరల చేర్చుట ఎంత దుష్కరము! కొన్ని దొరకనే దొరకవు! కాని పరిపూర్ణ శ్రద్ధగల వానికి అసాధ్యము కూడ సాధ్యముగా మారి పోవును.

"సత్యము నెన్నటికిని మఱచిపోరాదు దానిని—సత్యమును, ఈ క్షణిక ప్రపంచమున గల ఏకైక నిత్యవస్తువును—దృఢముగా చేత చిక్కించుకొని యుండవలెను. శ్రీ గురుదేవు డొకసారి హరిమహరాజ్‌తో (తురీయానంద స్వామితో) ఇట్లనెను: 'నీవు వేదాంతము చదువుచున్నావు. దాని సార మేమి? బ్రహ్మ మొక్కడే సత్యము, జగత్తు మిథ్య అనియే కదా! ఇం కేమైన కలదా? నీకు కావలసినది సారము. తక్కినదంతయు పాఱవైవుము'. వివిధశాఖలయొక్కయు, మతములయొక్కయు సిద్ధపురుషులు చేసిన బోధ లన్నియు శ్రీ గురుదేవు డొకసారి వినెను. పిదప నొకనాడు వివిధ మతశాస్త్రములు పెక్కిటిని తెప్పించి వాని నన్నిటిని నొక దండగా గ్రుచ్చి ధరించి, ఇంచుక సేపు నృత్యమొనర్చి, ఆ పుస్తకము లన్నిటిని 'తునాతునుకలు'గా చించి పాఱవైచెను. కొన్ని వస్తువులు పంపుమని నీ కొకరు జాబు వ్రాసినప్పుడు, ఆ వస్తువులు సేకరించి పంపిన పిదప, ఆ జాబులో ఏమిపని? నిజమునకు, మానవునికి కావలసినదీ జగత్తుయొక్క సారము మాత్రమే."

శిష్యుడు: "ధ్యానకాలమున నా మనస్సును ఇష్టదైవముమీఁదగాని, గురువుయొక్క మూర్తిమీఁదగాని నిలుపజాలకున్నాను".

స్వామి: "'నిలుపజాలకున్నాను' అనుట నిష్ప్రయోజనము. సక్రమాభ్యాసము చేయవలెను. నిరంతర పరిశ్రమము వలయును. గత్యంతరము లేదు ప్రతిదినము. కొన్ని గంటలు నియమించుకొని, ప్రాతస్సాయంకాలమునందు పూనికతో అభ్యాసము లొనర్పవలెను. ఇష్టదైవముయొక్క పటమును ఎదుట నుంచుకొని ధ్యానము చేయ బ్రయత్నింపుము.

శిష్యుడు: "నిర్ణీతకాలములో కొంచెము వ్యత్యాసములు కలిగిన నెట్లు? సరియైన కాలమందే ధ్యానమునకు కూర్చుండక పోయినచో నేమి?"

స్వామి: "ఒకటి రెండు దినములు కొంచెము వ్యత్యాసము కలిగినను హానిలేదు, కాని పని చేయుచుండు కాలమంతయు అతనిని జ్ఞప్తి యుంచుకొని అతనినిగూర్చి తలంచుచుండ వలెను. అట్లు చేయుము."

శిష్యుడు: "జపధ్యానములు పూర్తిగా విడనాడినచో కేవలము కర్మమూలముననే అభీష్టసిద్ధి కలుగునా?"

స్వామి: "కర్మ మొనర్చు బుద్ధి సరియైనదైనచో కలుగును కాని ఇది సామాన్యముగా జరుగదు. జపధ్యానములు పరిత్యజింపరాదు."

శిష్యుడు: "మనస్సునందు పెక్కుసార్లు చెడుతలంపులు రేకెత్తుచుండును. వాని బారి నుండి తప్పించుకొను టెట్లు?"

స్వామి "దృఢసంకల్పముతో వానిని తఱిమివేయవలెను. 'నిరంతరాభ్యాసముచేతను, వైరాగ్యము చేతను మనస్సు నిగ్రహింప బడును' అని గీతలో చదివియున్నావు గదా. వేఱుమార్గము లేదు. భగవంతుని శరణ మర్థింపుము. అతనిని స్వకీయునిగా నొనర్చు కొనుము. చెడుతలంపు లెగిరిపోవును. అతనిని స్వకీయునిగా చేసికొనితీఱవలెను.

శిష్యుడు: పెక్కుతడవలు ధ్యానవేళ లందు గూడ కామము తీవ్రరూపమున చూపట్టును."

స్వామి: దానిని "లక్ష్యపెట్టకుము. అది అందఱకును చూపట్టును. భగవంతుని శరణు చొచ్చి దానిని తఱిమివేయుము. కాని భోజన విషయమున జాగ్రత్త పుచ్చుకొనుము. జీర్ణ కోశమును రేగజేయు పదార్థములను, సులభ ముగా జీర్ణముకాని పదార్థములను విస ర్జింపుము.

శిష్యుడు: 'మన మంత్రమున కర్థమేమి?"

స్వామి: "'జగత్తునకు సృష్టిస్థితిలయకారు డగు భగవంతుడు నా క్లేశములను పోగొట్టును గాక' అని. అన్ని మంత్రముల కిదియే అర్థము. భగవంతునియందు విశ్వాసముంపుము. అట్లు చేయవేని, ఇట్టి వివరణములు వేలకొలఁదిగా విన్నను ఉపకారము కలుగదు. భగవంతుని ప్రార్థింపుము. అతనిని ప్రేమింపుము."

శిష్యుడు: "ఆసనప్రాణాయామాదులు మన స్సుయొక్క సంస్కారములను తొలగింప తోడ్ప డునా?"

స్వామి: "వానివలన ముఖ్యమైన దేదియు సాధింప ననువుపడదు. ఒకవేళ కొంచెము గుణ మేదైన లభించునేమో. భగవంతునిపై నీ ప్రేమ అధిక మగు కొలది, నీ మనస్సు మఱిమఱి నీకు వశ మగుచుండును.'

శిష్యుడు: "గురువునుగూర్చి ధ్యానించుట నాకు ఇష్టము. ఇష్టదైవభావము నా మనస్సులో నంతగా ప్రకాశించుచుండదు. కావున నేను గురుధ్యానము చేయుచున్నాను. ఇది చాలదా?"

స్వామి: "చాలదు. పని నంత తేలిక చేసికొననేల? గురుధ్యానానంతరము ఇష్టదైవ ధ్యానముకూడ చేయుము. కాని గురువుకై నీ మన స్సెక్కువగా పరితపించు చున్నయెడల, అతని నెక్కువకాలము ధ్యానింపుము. ఇష్టదైవ ధ్యానము చేయజాలవేని, అతడు కలడు అని మైనను తలంపుము. అందుచేతకూడ నీకు మనశ్శాంతి చేకూరును."

శిష్యుడు: "ఇరువురును తాత్త్వికముగా నొక్కరేయని నేను వినియున్నాను. అగుచో అందులో నే యొకరిని గూర్చి ధ్యానించినను చాలునుగదా! అట్లేల కాదు?

స్వామి: "కాదు. వా రిరువురును ఒక్కటే అను అనుభవజ్ఞానము కలిగినప్పుడు—ఆ దశ యందుమాత్రమే—నీ వట్లు చేయవచ్చును. నీ పని నంత సులభ మేల చేసికొందువు?"

శిష్యుడు: "జపము ధ్యానముతోకూడనే చేయవలెనా, ధ్యానానంతరము చేయవలెనా?"

స్వామి: "ధ్యానముతోకూడనే చేయ వలయును. ధ్యానము గాఢ మగుకొలది, జపము తనంతట తానే నిలిచిపోవు నని నీవు పురోగమన మందుకొలది నీకే తెలియ వచ్చును."

# గ్రంథ పరిచయం

## శ్రీ చిదంబరక్షేత్ర సర్వస్వము

వెల రూ. 16-00 లు.

దీనిలో శ్రీ పతంజలిమహర్షి రచించిన శ్రీ చిదంబరేశ్వరుని నిత్యపూజా సూత్రములు అనష్ఠింపవలసిన పూజా పద్ధతులు, సూతసంహితలో చెప్పబడిన చిదంబర మాహాత్మ్యమును పొందుపర్చబడినవి.

దీనిని పరిశోధించినవారు చతుశ్శాస్త్రపండితులైన సోమశేఖ దీక్షితులు. శ్రీ కామకోటి శంకరాచార్యులవారు, శ్రీ శృంగేరి శంకరాచార్యులవారు ఆశీర్వదించి వ్రాసినారు. మంచి కాగితములో నాగరలిపితో అచ్చువేసి చక్కగా బైండు చేయబడి యున్నది.

ఈ గ్రంథములో చెప్పిన ప్రకారము దీక్షతో పూజించు భక్తులు, చిదంబరేశ్వరుని అనుగ్రహమున సర్వ శుభములు పొందుదురనుటకు సందేహము లేదు.

అణ్ణా ఎన్. సుబ్రహ్మణ్యన్.

## శ్రీ చిదంబర మాహాత్మ్య వేదపాదస్తవములు

ఆంధ్రతాత్పర్య సహితము

అనువాదకులు:

శ్రీ శ్రీపాద వెంకటేశ్వర్లు, శ్రీ కొల్లి అనంతపద్మనాభశాస్త్రి

వెల రూ. 12-00 లు.

ఈ గ్రంథము ఉత్తమశ్రేణికి చేరిన భక్తిగ్రంథము. శ్రీ వేదవ్యాసులు, జైమిని, శ్రీ శంకర భగవత్పాదులు, రచించిన సంస్కృత శ్లోకములకు ఇది చక్కని ఆంధ్రానువాదము. ఇందు, చిదంబర రహస్యముయొక్క వివరణము, శివకామ సుందరీస్తుతి, శివకామ సుందర్యష్టకము, చిదంబర మాహాత్మ్యము మొదలైనవి పొందుపరుప బడినవి. అనేకులు ప్రసిద్ధ పండితులు ఈ గ్రంథ ప్రాశస్త్యమును గూర్చి చక్కని అభిప్రాయము లిచ్చియున్నారు.

దీనిని చదివి సారాంశమును గ్రహించిన ఆస్తికజనులు శ్రీ శివకామసుందరీ నటేశ్వరుల పరిపూర్ణ కృపాకటాక్షమునకు పాత్రులై సర్వశుభములు బడయగలరనుటలో సందేహము లేదు.

## శ్రీ నటరాజ శ్రీ శివకామసుందరీ స్తోత్ర రత్నములు

వెల రూ. 4-00 లు.

శ్రీ చిదంబర మాహాత్మ్య వేదపాదస్తవ గ్రంథమునకు అనుబంధ గ్రంథమే ఇది. ఇందు శ్రీ నటరాజ సహస్రనామ స్తోత్రము, అష్టోత్తరశతనామ స్తోత్రము, శ్రీ శివకామసుందరీ అష్టోత్తర శత సహస్రనామ స్తోత్రము, శివపంచాక్షరీ స్తోత్రము మొదలైన శైవసంబంధ స్తోత్రములు ముఖ్యమైనవి కలవు. చిదంబర క్షేత్ర దర్శనమే మోక్షమునిచ్చునని ప్రఖ్యాతిగలదు. ఆ క్షేత్రమందున్న శ్రీ శివకామసుందరీ నటేశ్వరుల దర్శనము ఎంత ఫలమునిచ్చునో, స్తోత్రమువల్ల ఎట్టి ఫలము సిద్ధించునో చెప్పుటకు ఆ నటరాజస్వామికే సాధ్యముగాని ఇతరులకు అలవికాదు. అట్టి మహిమాన్వితములైన స్తోత్రములను పారాయణజేసి సర్వులు శ్రీ శివకామసుందరీ నటరాజస్వామి అనుగ్రహమునకు పాత్రులు అగుదురుగాక !

పైమూడు గ్రంథములకు సంపాదకులు, ప్రకాశకులు శ్రీ దర్భాసూర్యనారాయణ, F I E.

పైమూడు గ్రంథముల ప్రతులకు :

శ్రీనివాసనిలయం,

14/139, గాంధిపురం.2. రాజమహేంద్రవరం.3.

## భగవద్రామానుజస్తుతి

ప్రకాశకులు: గోదా గ్రంథమాల
ముసునూరు కృష్ణాజిల్లా.
వెల రూ. 8-00 లు.

శ్రీమాన్ కె. టి. యల్. నరసింహాచార్యుల వారు విశిష్టాద్వైత సంప్రదాయమును అమూలాగ్రముగ తెలుసుకొన్న పండితులు గోదా గ్రంథమాలద్వారా శ్రీ వైష్ణవ సంప్రదాయమునకు సంబంధించిన అనేక గ్రంథములను ప్రకటించినారు.

ఈ గ్రంథమును తమిళ భాషలోనుంచి ఆంధ్రభాషకు లిపి పరివర్తనచేసి తమిళ మూలమునకు దివ్య సూర్యాలోకమను టీకవ్రాసి ఆంధ్రులకు ఉపకారమొనర్చినారు. పై గ్రంథమునకు సంస్కృత శ్లోకములు రచించి ప్రకటించుటయే కాక సందర్భానుసారముగా అక్కడక్కడ ప్రఖ్యాత తెలుగుకవుల పద్యములను గూడ చేర్చుట ముదావహము. శ్రీమద్రామానుజులు వైష్ణవమతస్థాపకులు, శ్రీవిష్ణుభక్తులు. భక్తుల సేవించిన భగవంతుని సేవించుటయే యగును. కాబట్టి శ్రీ భగవద్రామానుజస్తుతిని పఠించి అందరు భగవదనుగ్రహమునకు పాత్రులౌదురుగాక!

చిర్రావూరు వెంకట్రావు.

ఈశ్వరుడు తన మాయచే మనలను ఎట్లు కప్పివైచెనో అట్లే దయామయుడై ఈ లోకమున అవతరించి సాధన లొనగ్చును. ఇట్లు చేయుట మనకొఱకు—మాయా ఆవరణమును భేదించుకొని వెలికివచ్చు మార్గము మనకు చూపుటకొఱకు. ఇంతేకాక మాయాకల్పనములను తాను స్వయముగా కూడ మనకై భేదించును. ఒకతండ్రి తన కొడుకులందఱితో ఒకతోటకు పోయెను. కొందరు ఇటు అటు తిరుగుచు ఆటలాడుచు వినోదించుచుండిరి. కొందఱు పుష్పములు కోయుచుండిరి. కొందఱు కొబ్బరికాయలు కోయుచుండిరి. ఒకడుమాత్రము చేపలు పట్టుటకు తటాకముకడకు పోయెను. ప్రొద్దు గ్రుంకువేళ తండ్రి కొమాళ్ళనందఱను రమ్మని పిలిచెను. చేపలు పట్టునతడు తప్ప అందఱును వచ్చిరి. ఎన్నిసార్లు పిలిచినను అతడు రాలేదు—చేపలు పట్టుటలో అతడు మునిగిపోయియుండెను. బాగుగ చీకటిపడినను అతడు రాకపోగా, తండ్రియే అతనియొద్దకుపోయి, గాలమును వెడలివైచి బండియొద్దకు ఆ బాలుని లాగుకొనివచ్చెను. అట్లే భగవంతుడును అప్పుడప్పుడు వచ్చి మన ఆటవస్తువులను చిన్నాభిన్నమొనర్చి, మనలను తనయొద్దకు ఈడ్చుకొనిపోవును.

—ప్రేమానందస్వామి.



సంపాదకులు : శ్రీ చిద్ఘనానందస్వామి.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-600021) న ముద్రింపబడి,

శ్రీ చిద్ఘనానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మద్రాసు-600004) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము 34 1977 - ఆగస్టు : పింగళ - శ్రావణము సంచిక 8

## విషయసూచిక



## శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రమ్

అనువాదము: చిర్రావూరు వెంకట్రావు

ఇందు సహస్రనామస్తోత్రము నిత్యపారాయణము చేయువారికిని, నామావళి అర్చన చేయువారికిని వీలగునట్లు సమకూర్చబడినది. ఈ పుస్తకముయొక్క ప్రయోజనమును, మాహాత్మ్యమును తెలియజేయు పూర్వభాగమునకు ఉత్తరభాగమునకు చక్కని తేట తెలుగులో తాత్పర్యము వ్రాయబడినది.

శ్రీ లక్ష్మీదేవీని అర్చించువారు పఠించుటకు శ్రీ లక్ష్మీ అష్టోత్తర నామావళికూడ చివర పొందుపర్చబడినది.

ప్రథమ ముద్రణ

58 పేజీలు వెల రు. 1-25



శ్రీ రామకృష్ణమఠ-సేవాసంఘముల సర్వాధ్యక్షులు శ్రీమత్ స్వామి వీరేశ్వరానందజీ మహరాజ్ దక్షిణదేశమునకు విజయము చేయుదురని తెలియ జేయుటకు సంతోషించుచున్నాము. సంఘ గురువులైన శ్రీవారి కార్యక్రమము ఈవిధముగా ఉండును.

| | | |
|---|---|---|
| హైదరాబాద్ | ఆగస్టు | 20 నుండి 31 వఱకు |
| బెంగళూర్ | ఆగస్టు | 31 నుండి 1 సెప్టంబర్ వఱకు |
| మైసూర్ | సెప్టంబర్ | 1 నుండి 4 వఱకు |
| బెంగళూర్ | సెప్టంబర్ | 4 నుండి 11 వఱకు |
| సేలమ్ | సెప్టంబర్ | 11 నుండి 14 వఱకు |
| నాట్టరమ్ పల్లి | సెప్టంబర్ | 14 |
| మద్రాస్ | సెప్టంబర్ | 14 నుండి 20 వఱకు |



ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్యవరాన్నిబోధత.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము 34 1977 – ఆగస్టు :: పింగళ – భాద్రపదము సంచిక 8

## ప్రార్థన

నమో నేదిష్ఠాయ ప్రియదవ దవిష్ఠాయ చ నమో
నమః క్షోదిష్ఠాయ స్మరహర మహిష్ఠాయ చ నమః
నమో వర్షిష్ఠాయ త్రినయన యవిష్ఠాయ చ నమో
నమః సర్వస్మై తే తదిదమతిసర్వాయ చ నమః.

—శివమహిమ్నః స్తోత్రమ్.

అంతరాత్మగా అతి సమీపంగాను, వాక్కులకు మనస్సుకు అందక అతి దూరంగాను ఉన్న ఓ ఏకాంతప్రియా శివా! నీకు నా నమస్కారములు.

అతి సూక్ష్మమైన పరమాణువుగాను, అతి స్థూలమైన బ్రహ్మాండముగాను ఉన్న ఓ కామదహనా! నీకు నా నమస్కారములు.

విశ్వసృష్టికి పూర్వమే ఉండినవాడవు కనుక వయస్సులో అందరికి పెద్దవాడవు; పుట్టుకయే లేనివాడవు కనుక వయస్సులో అందరికన్ననూ చిన్నవాడవు – అయిన ఓ త్రినయనా! నీకు నా నమస్కారములు.

వ్యక్త అవ్యక్తమైన సర్వముగాను, వ్యక్త అవ్యక్తమైన సర్వమును అతిక్రమించిన నిర్గుణ స్వరూపముగాను నీవే ఉన్నావు, అట్టి సర్వుడవు – అతి సర్వుడవు అయిన ఓ శంకరా! నీకు నా నమస్కారములు.

# వివేకానందవాణి

"నీవు కన్నులారఁ జూచు నీ సోదరుని ప్రేమింపఁ జాలనిచో నీ కగోచరుడగు భగవంతు నెట్లు ప్రేమింపగలవు"? అను బైబిల్ వచనము మీకు జ్ఞప్తిలేదా? మానవముఖమున మీరు దేవునిఁ గనఁజాలనిచో, మేఘములలో, లేక నిర్జీవ జడపదార్థ నిర్మిత విగ్రహములలో, లేక మీ మనః కల్పితగాథలలో వాని నెట్లు గాంచఁగలరు? సమస్త స్త్రీ పురుషులలో మీ రేనాఁడు భగవంతునిఁ గాంచ నారంభింతురో, నాఁటినుండియే మీరు పారమార్థికులని చెప్పెదను; కుడిచెంపపై మిమ్ముఁ గొట్టినవానికి నెడమచెంపఁ జూపుట యనఁగా నేమో మీ కపుడు బోధపడఁగలదు. మానవుని బ్రహ్మస్వరూపముగాఁ గాంచఁగలిగిన నాఁడు, సర్వమును—పెద్దపులినిసైతము—మీ రాహ్వానింపఁ గలుగుదురు. మన కేది ప్రాప్తించినను,—మన తండ్రి, మన తల్లి, మన మిత్రుఁడు, మన బిడ్డఁడు మొదలగు వివిధ రూపములఁ దాల్చి మనకు దర్శన మిచ్చు పరమేశ్వరుఁడే, అల శాశ్వత పరమాత్మయే యని గ్రహింపఁ గలుగుదుము; మనతోఁ గ్రీడించు మన యంతరాత్మయే వారు.

మన మానవబాంధవ్యము లీవిధముగా దివ్యము లొనర్పఁబడఁదగిన చందముననే, మన భగవత్సంబంధమును వీనిలో నేరూపమునైనను గైకొనవచ్చును; భగవానుని మన తల్లిగాఁగాని, తండ్రిగాఁగాని మిత్రునిగాఁగాని, ప్రాణప్రియునిగాఁగాని భావింపవచ్చును. భగవంతుని మన తండ్రియని పిలుచుటకంటెఁ దల్లి యనుట యున్నతాదర్శము. మిత్రుఁడనుట యంతకంటెను నుత్తమము, కాని మన ప్రాణప్రియుఁడనుట సర్వోత్తమము. ప్రియునకును బ్రియురాలికిని భేదమును గాంచకుండుటయే పరమోత్తమభావన. ప్రాచీన పారసీకగాథ యొకటి కలదు. దానిని మీరు వినియుందురు. ప్రియుఁడు తన ప్రియురాలి యింటిగుమ్మము కడకు వచ్చి తలుపుఁ దట్టఁగా "ఎవరు వా" రని యామె యడుగును. "నే"నని యాతఁడు సమాధానింపఁగా బదులురాదు. రెండవసారి యాతఁడు వచ్చి, "నేనే" యిచ్చట నున్నది" యనును. అప్పుడును దలుపు తెఱవఁబడదు. మూఁడవతడవ వచ్చినప్పుడు, "ఎవరు వా"రని లోపలినుండి వచ్చు ప్రశ్నకు, "ప్రియురాలా! నీవే నేను" అని సమాధానింపఁ దలుపు తెఱవఁబడును. మనకు భగవంతునితోఁ గల సంబంధము నిట్టిదే. అతఁ డన్నిటను గలఁడు. అన్నియు నాతఁడే. ప్రతి పురుషుఁడును బ్రతి స్త్రీయును బ్రత్యక్షసజీవమూర్తియుఁ గేవలానందమయుఁడు నగు భగవంతుఁడే. భగవంతుఁ డజ్ఞాతుఁ డనువా రెవరు? వానిని వెదకి కనుఁగొనవలయుననువా రెవరు? మనము నిత్యము భగవంతునిఁ గనుఁగొనుచునే యున్నాము. నిత్యము భగవంతునియందే మనుచున్నాము. ఎల్లెడలను భగవంతుఁడు తెలియవచ్చుచునే యున్నాఁడు. సదా పూజింపఁబడుచునే యున్నాఁడు.

కలలం బోలెడి పుత్ర మిత్ర వనితా అగారాది సంయోగముల్
జలవాంఛారతిన్ ఎండమావులకు ఆసల్ చేయు చందంబునన్
తలతున్ సత్యములంచు; మూఢుడ వృథా తత్త్వజ్ఞుడన్; నాకు నీ
విలసత్పాదయుగంబు సూపి కరుణన్ వీక్షింపు లక్ష్మీపతీ!

—అక్రూరుడు.

# మోక్షధర్మములు

సేనజిత్తు అను రాజుకు ఆప్తుడగు ఒక విప్రుడు చెప్పిన ఉపదేశవాక్యములు.

ధనికులు, పేదలు, మధ్యతరగతివారు - అందరూ వారి వారి పనులలో తగుల్కొని ఆయాసపడుచూ దుఃఖించుచున్నారు. చూడుము. ఈ సంసారములో నీవు సుఖపడదలచు కొన్నచో నిరాయాసంగా జీవించదలచు కొన్నచో చేయవలసిన పనులన్నీ ఈశ్వరార్పణబుద్ధితో చేయుము. అదొక్కటే మార్గము.

ఈ విశ్వంలో ఉండేది ప్రతిదీ భగవంతునిదే. మనకేదీ చెందదు. చివరకు ఈ దేహం కూడా మన స్వంతము కాదు- ఈ భావం బాగా దృఢము చేసికొనుము.

కాష్ఠము కాష్ఠము సముద్రములో అలల తాకుడుకు యాదృచ్ఛికముగా కలుస్తవి. తిరిగి విడిపోతవి. అట్లాగే ఈ సంసారసముద్రములో కర్మవశాత్తు మనుషులు మనుషులు కలుస్తారు. తిరిగి విడిపోతారు. కనుక భార్యాబిడ్డలయెడ, బంధుమిత్రులయెడ స్నేహాన్ని పెంచుకొనవద్దు; ఒకరోజు వారితో వియోగము కలిగియే తీరుతుంది. హృదయంలో ఉన్న ఈశ్వరునితోనే మనకెప్పుడూ వియోగము కలగనిది.

కొన్నేళ్ళక్రితం మనం ఇక్కడ ఉండలేదు. కొన్నేళ్ళ తరువాత మనము నిశ్చయముగా ఇక్కడ ఉండబోము. మధ్యలో ఈ అల్పకాలములో వారితో వీరితో లేనిపోని సంబంధ బాంధవ్యాలను ఆరోపించుకొని ఆసక్తి పెంచుకొని భగవంతుని మఱచి శోక మోహములకు వశమగుట ఎందులకు ?

తిలలు (నువ్వులు) స్నేహము (చమురు) కలిగి ఉన్నందువలన గానుగలో నలిగిపోవుచున్నట్లు జీవులు భార్యాపుత్రాదుల యెడలగల స్నేహముచే నానావిధ క్లేశములకు లోనయి సంసారచక్రమున నలిగిపోవుచున్నారు.

నిమిత్తము ధనసంపాదనకు పూనుకొని మానవులు అశుభ కర్మలనైననూ ఆచరించుటకు సిద్ధపడి ఇహపరలోక శుభములకు దూరమగుచున్నారు.

పుత్రదారయుతమైన కుటుంబములలో తగుల్కొని మానవులు బురదగుంటలో కాలిడి బైటకురాలేని అడవిఏనుగువలె నశించిపోవుచున్నారు.

ప్రారబ్ధవశమున పుత్రనాశము, విత్తనాశము, బంధునాశము మఱియు కళత్రనాశము కలుగగా మానవులు దావాగ్ని తుల్యమైన మహద్దుఃఖము పొందుచున్నారు.

ప్రారబ్ధమే అన్నిటికీ కారణము. సుఖము ప్రారబ్ధమువలననే కలుగుతుంది, ధనంవలన ఆప్తులవలన కాదు. దుఃఖము ప్రారబ్ధము వలననే కలుగుతుంది, శత్రువులవలన కాదు. ధనము ప్రారబ్ధమువలననే కలుగుతుంది, తెలివితేటలవలన కాదు. దారిద్ర్యమూ ప్రారబ్ధము వలననే కలుగుతుంది, జడత్వమువలన కాదు.

సుఖము తరువాత దుఃఖము కలుగుతుంది. దుఃఖము తరువాత సుఖము కలుగుతుంది. సుఖదుఃఖములు చక్రమువలె సదా పరిభ్రమించుచున్నవి. కాబట్టి ఎవ్వరికీ ఎప్పుడూ సుఖమే ఉండదు. ఎప్పుడూ దుఃఖమే ఉండదు. ఇవి రెండు ఒకటి వెంబడి ఒకటి వచ్చుచు పోవుచునే ఉండును. ఇది ఇట్లుండగా సుఖమునకు పొంగిపోవుట ఎందులకు? దుఃఖమునకు క్రుంగిపోవుట ఎందులకు?

సుఖం వా యది వా దుఃఖం
ప్రియం వా యది వా అప్రియం

ప్రాప్తం ప్రాప్త ముపాసీత
హృదయేన అపరాజితః.

విషయతృష్ణను తీర్చుకొనడంవలన సుఖం కలుగుతుంది – అని మానవులు భ్రమించుచున్నారు. నీవా భ్రమకు లోను కావలదు పెద్దలు చెప్పిన ఈ శ్లోకమును జ్ఞప్తియందుంచుకొనుము.

యచ్చ కామ సుఖంలోకే
యచ్చదివ్యం మహాత్ సుఖం
తృష్ణాక్షయ సుఖస్యైతే
నార్హతః షోడశీం కలాం.

ఈ లోకంలోని కామసుఖములు, పైలోకంలోని దివ్య సుఖములు – అన్నీ కలిసినా తృష్ణాక్షయంవలన కలిగే సుఖంలో పదునారవ భాగానికైనా సమముకావు.

ఆనందపూర్ణమైన బ్రాహ్మీస్థితిని అందుకొనవలెనని నీకు ఇచ్ఛ ఉన్నచో ఉపాయము చెప్పెదను వినుము.

వేదాంతశాస్త్ర శ్రవణంలో అభిరుచి కలిగించుకొనుము. ఇతరులలో దోషాలను చూడకుము. దోషాలు కనపడినా 'అంతా రాముని ఇచ్ఛ' అనే భావంతో శాంతిని రక్షించుకొనుము. పెద్దలు చెప్పిన ఈ శ్లోకమునుకూడ జ్ఞప్తియందుంచుకొనుము.

యదా నకురుతే ధీరః సర్వభూతేషు పాపకం
కర్మణా మనసా వాచా బ్రహ్మ
సంపద్యతే తదా.

"నా బోటివాడికి ఈ జన్మలో బ్రహ్మజ్ఞానము కలుగుతుందా. ఎందుకు వట్టి ఆశలు?" అని సందేహపడకుము. రాజా! ఇది వినుము.

పింగళ అనే ఒక వేశ్య ప్రియునికొఱకు సంకేతస్థలములో వేచిఉండినది. పది నిముషములు అయినది. అరగంట అయినది. ఒకగంట అయినది. రెండుగంటలు అయినది. ఎంతకూ ప్రియుడు రాలేదు. ఇక రాడని పింగళ నిరాశ చేసికొన్నది. ఆ క్షణంలోనే పింగళకు పురాకృత సుకృతం వలన మెఱుపు మెఱిసినట్లు జ్ఞానోదయం కలిగింది. అప్పుడు ఆవిడ ఇలా అన్నదికదా!

"ఎంత మూర్ఖురాలై ఉంటిని. హృదయమందిరంలో అత్యంత సమీపంలో ఉన్న రమణునితో ఇన్నాళ్ళు ఐక్యము కాలేకపోతినే!

తొమ్మిది ద్వారములు మూసివేసి ఇక ఈ హృదయనాథునితోనే రమించెదను. ఈ ప్రియతముని పొందిన ఏ వనిత ఇక మానవ మాత్రుని ప్రియునిగా భావించగలదు?

దైవానుగ్రహమో, పురాకృత సుకృతమో, మోహనిద్ర వదలిపోయినది. మేలుకొంటిని. రమణుని – హృదయగృహంలో దాగి ఉన్న వానిని కనుగొంటిని. ఆప్తకామినైతిని. ఇక, కాముకులు అనే నరకప్రాయులైన ధూర్తులు నన్ను వంచించలేరు."

రాజా ఆశలు లేనివాడు ప్రశాంతముగా జీవించును. నైరాశ్యమే పరమసుఖము. నీవును పింగళవలె ఆశను రూపుమాపి సుఖముగా ప్రశాంతముగా జీవించుము.

సుఖం నిరాశః స్వపితి నైరాశ్యం పరమంసుఖం
ఆశామనాశాం కృత్వాహి సుఖం స్వపితి
పింగళా.

# మాతృదేవి చరణసన్నిధి

ఆంగ్ల గ్రంథము:
ఎట్ ది హోలీమదర్స్ ఫీట్

అనువాదకు:
పి. గణపతిశాస్త్రి

ఉద్బోధన కార్యాలయము: 25, జూన్, 1912. ప్రార్థన మందిరానికి పక్కనేఉన్న అమ్మ గదిలో మంచందగ్గిర మేము కూర్చున్నాము.

నేను: ఆస్పత్రులలో సేవ, ప్రజాసేవా కేంద్రాలలో పని, పుస్తకాల విక్రయము లెక్కలు వేయడము మొదలయిన వ్యవహారాలు కూడవని కొందరు విమర్శిస్తారు. "ఠాకూరు ఎన్నడయినా ఇటువంటి వ్యవహారాలలో కలగజేసుకున్నారా?" అని వారడుగుతారు. అటువంటప్పుడు భగవద్భక్తితో మఠంలో చేరిన కొత్త శిష్యుల కిటువంటి కార్యాలు విధించడ మెందుకని ప్రశ్నిస్తారు. ప్రార్థన, ధ్యానము, భక్తి, గీతాగానము, ఇవే అటువంటివారికి సదా కర్తవ్యాలని, మిగిలిన కార్యాలవల్ల మనస్సులో కోరికలు మొలకెత్తుతాయని అవి భగవంతునినుండి దూరంగా తొలగిస్తాయని అంటారు.

అమ్మ: ఆ మాటలేవి లక్ష్యపెట్టకు నాయనా? ఏదో ఒకపని చేస్తూండకపోతే, నీకు కాలం ఎలా గడుస్తుంది? ఇరవైనాలుగు గంటలు ఎవరయినా ప్రార్థన, ధ్యానము కొనసాగించగలరా? ఇక ఠాకూరుమాట! ఆయన సంగతే వేరు. అదీగాక మధుర్ ఆయనకు భోజనాది సౌకర్యాలన్నీ చక్కగా సమకూర్చారు. నీవు కష్టించి పనిచెయ్యడంవల్ల చాలినంత ఆహారం సమకూరుతున్నది. లేకపోతే ఇంటింటికి వెళ్లి బిచ్చమెత్తుకోవాలి. పని, పాటు లేకపోతే జబ్బు చేస్తుంది. ఈ రోజుల్లో ఎంతో ఔదార్యంతో సన్యాసుల నాదుకుని ఆదరించేవా రెవ్వరున్నారు? కనక అటువంటి వారిమాట లేవి నీవు చెవిని పెట్టవద్దు నాయనా! ఠాకూరు ఆదేశించిన మార్గంలోనే సాగిపో! మన మఠం ఇదే పద్ధతిలో ముమ్ముందుకు సాగిపోతుంది. ఈ పద్ధతి నచ్చనివారు తమదారిన తాము తరలిపోవచ్చును.

ఉత్తర భారతదేశంలో సన్యాసులను కొందరిని మణిమల్లిక్ సందర్శించాడు. ఆపైన ఠాకూరు "వారిని గురించి నీ అభిప్రాయమేమిటి?" అని ఆయన్ని ప్రశ్నించారు. మణీమల్లిక్ "నేను వారిని సందర్శించాను కాని –" అని సమాధానం చెప్పారు "ఏమిటా కాని?–" అని తిరిగి ప్రశ్నించారు ఠాకూరు. "వారంతా సొమ్ము కావాలని అడుగుతారు." అన్నారు మణిమల్లిక్ – దానిమీద ఠాకూరు మళ్లీ అందుకున్నారు. "ఎంత సొమ్ము? బహుశః పొగాకు, గంజాయి, కొనుక్కోడానికి ఒక కానీగాని, రెండు కానులుగాని అడిగి ఉంటారు. అంతే! నీమట్టుకు గ్లాసులకొద్ది పాలూ, నెయ్యి, ఇంకా మిగిలిన వస్తువులు కావాలి. సన్యాసికి పొగాకుకాని గంజాయికాని కొనుక్కోవడానికి కానీ గాని రెండు కానులు గాని కావాలి. అది ఏమయినా పెద్ద మొత్తమా? అన్ని వస్తువులు నీవే అనుభవించాలా? ఆ సాధువులకు కానీ ఖరీదయిన పొగాకుగాని, గంజాయిగాని అక్కరలేదా?"

కోరికలే అన్నింటికి ప్రధాన కారణాలూ. కోరికలు లేని వ్యక్తి ఇక దేన్ని అడుగుతాడు?... నాకేసి చూడు బాబూ! నాకీ వస్తువులన్ని ఉన్నాయి. అయినా నాకు వాటిమీద కోరిక లేవి లేవు!...రవంత కోరికకూడా లేదు!

నేను: నీలో కోరిక లెలాగ మొలకెత్త గలవుతల్లీ? కాని మా మనస్సుల్లో ఎన్నెన్ని కోరికలు తల లెత్తుతూంటాయి! వాటిని తొల గించుకోవడ మెలాగ?

అమ్మ: నీలో మొలకెత్తుతున్నవి, నిజానికి కోరికలు కానేకావు! ఆ కోరికల్లో ఏమి లేనే లేదు! అవి ఎంతగా బయటికివస్తే అంత మంచిది!

నేను: భగవానుడు సాయంచేస్తే తప్ప నే నెలాగ నా మనస్సుతో పోరాడగలనని నిన్న నే ననుకున్నాను. ఒక కోరిక తొలగిపోగానే వెంటనే వేరొకటి పొటమరిస్తున్నది! దాని మీద అమ్మ ఇలాగ వివరించారు.

అమ్మ: ''నేను'' అన్నది ఉన్నంతకాలము సహజంగా కోరిక లుద్భవిస్తూనే ఉంటాయి. కాని ఆ కోరికలు నీ కపకారం చెయ్యవు. భగవానుడు నిన్నెల్లప్పుడు సంరక్షిస్తాడు. సమస్తము పరిత్యజించి, సర్వసంగ పరిత్యాగంలో శరణాగతిపొంది, భగవానుని పాదా లాశ్ర యించిన సత్పురుషుల నాదైవం సంరక్షించక పోతేం? ఆ తప్పిదం అంతా ఆ భగవానునిదే! మనల నా భగవంతుడు పాలముంచినా నీట ముంచినా ఏ మాత్రము నమ్మిక చెదరనియ్య కూడదు. అంతేకాదు. ఎల్లవేళలా మంచే చేస్తూండాలి. అది అయినా ఆ భగవంతుడు అనుగ్రహించిన శక్తిసామర్థ్యాలనుబట్టే సాధ్య పడుతూంటుంది.

నేను: అమ్మా! భగవానునిమీద నా కంతటి దృఢమయిన నమ్మిక ఉన్నదా? ఆయన అనుగ్రహిస్తే తప్ప మరి వేరేదారి ఏమి ఉన్నది!

అమ్మ: నీ కంత భయపడవలిసినంతటి అవ సర మేమిఉన్నది నాయనా? భయపడకు! భార్యతోను, పిల్లలతోను నీకిక సాంసారిక మయిన జీవితం సంభవించదు! ఇక నీకా జంజాటమే ఏర్పడదు. మరి నీ కెందుకీ లేని పోని భీతి?

ఉద్బోధన కార్యాలయము. 7, జూలై, 1912.

''అమ్మా, రథోత్సవానికి నీవు పూరీ వెళ్ల వలిసి ఉన్నదికదా?'' అని నే నడిగాను.

అమ్మ: ఆ గుంపుల రద్దీలోనికి వెళ్లాలా? కలరాగాని, ఇంకేదయినా రోగంగాని రా వచ్చును. పూరీలో బస చెయ్యడానికి గదు లెక్కడా దొరకడంలేదని యాత్రికుల మార్గ దర్శి లక్ష్మీకాంత అన్నాడు. మరీ చిన్న చిన్న గదులకుకూడా పదేసి రూపాయల అద్దె తీసు కుంటున్నారట! అందుచేత శీతకాలంలో అక్క డికి వెళ్లడం మంచిదని సలహా ఇచ్చాడాయన.

నేను: పూరీ జగన్నాథస్వామి ఏ దైవా నికి చిహ్నమమ్మా?''

అమ్మ: నే నొక కలలో ఆ దైవాన్ని శివ లింగస్వరూపంలో చూశాను.

నేను: అయితే నీవు జగన్నాథుని మూర్తి సందర్శించ లేదన్నమాట?''

అమ్మ: లేదు! నాకు శివలింగంమాత్రమే సాక్షాత్కరించింది. అది శివదేవుని చిహ్న మయిన శివలింగమే!...అది చాలా పవిత్ర మయిన పుణ్యక్షేత్రం. కాకపోతే అంతమంది జనం అక్కడికి కెందుకు వెళతారు? విమలా దేవతకూడా అక్కడే వెలసింది. మహాష్టమి నాటి రాత్రి ఆమె పూజ జరుగుతుంది. ఆమె సాక్షాత్తు దుర్గాదేవతే సందేహము లేదు! అందుచేత శివుడు అక్కడ ఎందు కుండకూడదు?

నేను : మొట్టమొదటగా జగన్నాథ దేవాలయం ఒక బౌద్ధ దేవాలయమని కొందరంటారు. ఆ విగ్రహంకూడా బుద్ధునిదేనట! శంకరాచార్యుల కాలంలో బౌద్ధుల నక్కడినించి తొలగించినపిమ్మట అక్కడి మూర్తిని శివలింగంగా మార్చివేశారట! ఆ తరువాత వైష్ణవం బాగా వ్యాప్తి పొందిన తరవాత, ఆ శివుడే జగన్నాథుడయినాడని చెబుతారు. ఆ విష్ణుమూర్తి జగన్నాథుడే కదా!

అమ్మ : నా కవన్నీ తెలియవు నాయనా! కాని కలలో నా కక్కడ శివలింగం కనిపించిన మాట మాత్రం వాస్తవం.

నేను : మహమ్మదీయ విధ్వంసకులు ఎన్నెన్ని దేవాలయాలు నేలమీద కూల్చివేశారు! ముక్కులు, చెవులు చెక్కివేసి, ఎన్నెన్ని విగ్రహాలు వికృతంగా మార్చివేశారు!

అమ్మ : ఆ విధ్వంసకుల భయంవల్ల నే బృందావనంలో గోవిందదైవతం జయపూర్‌లో తలదాచుకున్నారు. పురోహితులప్పుడు దేవాలయం ముఖద్వారంలో ప్రాయోపవేశం ప్రారంభించారు. ఆ సమయంలో దివ్యాదేశం వినిపించింది అది ఇది. విగ్రహం వెళ్లిపోయింది గాని నే నిక్కడినించి వెళ్లలేదు. తిరిగి ఇంకొక ప్రతిమ తయారుచెయ్యండి. తిరిగి నేనా మూర్తిలో ప్రవేశిస్తాను.

నేను : గుజరాత్‌లో సోమనాథ దేవాలయంలో శివదేవునిమూర్తికి ప్రతిదినము గంగోత్రినించి సేకరించిన పవిత్రోదకంలో అభిషేకం చేసేవారు. ఆ నీరు వరసలవారీగా తమ శిరస్సులమీద ఉంచుకున్న కడవలతో మనుష్యులు మోసితెచ్చేవారు. కాని మరి కొంతకాలానికి సుల్తాన్ మహమ్మద్ ఆ విగ్రహం నేలమట్టంచేసి తుత్తునియలుగా విదళించాడు. మంచి గంధంచెక్కతో చేసిన దేవాలయం ముఖద్వారం కవాటం తనతో తీసుకుపోయాడు. ఇదంతా ఇలాగ ఎందుకు జరగాలి?

అమ్మ : విగ్రహ విధ్వంసకులవైపు చూడగానే భగవానుడు తన కాలికి బాధి చెప్పి పడుగు ప్రారంభిస్తాడు. అయితే ఇదంతా ఎందుకిలాగ జరగాలి? ఆయన సర్వ సమర్థుడు. తన కిష్టంవచ్చినట్టు ప్రవర్తించగలడు. కాదు! కాదు! నిజం చెప్పవలసివస్తే ఇదంతా ఒక లీల అంతే!

నేను : అమ్మా! కర్మ ఫలితాలన్నీ పూర్తిగా తుడిచివెయ్యడానికి వీలు పడుతుందా? జ్ఞానోదయం జరిగినంతలోనే కర్మఫలితాలన్ని నశిస్తాయని మన పురాతన గ్రంథాలుద్ఘోషిస్తున్నాయి. అయినా ఈ జన్మలో ఇంతకు మునుపే పారబ్ధములయిన కర్మఫలితా లనుభవించక తప్పదు.

అమ్మ : సుఖదుఃఖాలన్ని పురాతన కర్మ ఫలితాలే! ఠాకూరుకుకూడా అటువంటి కర్మల ఫలితాలు అనుభవించక తప్పలేదు. ఆయన పెద్దన్న ఒకప్పుడు జ్వరంలో సంధి పేలాపన సమయంలో మంచినీరు తాగుతున్నారు. ఆ సమయంలో రవంత నీరు లోపలికి పుచ్చుకున్నంతలోనే ఠాకూరు ఆయనచేతిలో గ్లాసు లాగేసుకున్నారు. దానితో ఆయనకి కోపం వచ్చి ఇలా అన్నారు! నీవు నన్ను మంచినీరు లోపలికి పుచ్చుకోకుండా అడ్డుకున్నావు. ఇందుచేత నీవుకూడా నాలాగే బాధ పడతావు! నీకుకూడా నాలాగే గొంతులో బాధ బయలు దేరుతుంది. దానిమీద ఠాకూరు ఇలాగ ప్రతిమాలుకున్నారు.

'అన్నా, నేను నీకు ఏవిధమయిన అపకారము చేసిఉండలేదు. నీకు జబ్బు చేసింది.

నీవు ఎక్కువగా నీరు తాగితే రుగ్మత ఎక్కువవుతుంది. అందుచేతనే నేనలాగ చేశాను. అయినా నీవెందు కలాగ నన్ను శపించావు?' దానిమీద ఆయన అన్నగారు 'నాయనా! నా నోటినించి అటువంటి మాట లెందుకు వెలువడ్డాయో నాకు తెలియదు!' అంటూ కంటనీరు పెట్టుకున్నారు. ఆ మాట లేవి అబద్దాలు కాజాలనని, అవి అక్షరాలా అలాగే జరగి తీరతాయని ఠాకూరు జబ్బుపడిన తరవాత నాతో అన్నారు. ఆ శాపంవల్లనే తమ గొంతులో వ్యాధి బయలుదేరిందని, ఇందువల్ల మేముకూడా అంతగా వ్యథపడ నక్కరలేదని కూడా ఆయన అన్నారు.

అది విని "మీకే ఇంత యాతన తప్పనప్పుడిక సామాన్య మానవులగతి ఏమిటి? వారిక తమ బ్రతుకు లెలాగ కొనసాగించగలరు?" అని ఆయనతో వాదించాను నేను. ఆ పైన ఠాకూరు తిరిగి "మా అన్న ఋషితుల్యుడు. అందువల్లనే ఆయనమాటలలాగ అక్షరాలా నిజమయ్యాయి. అయితే మిగిలిన సాధారణ మానవులమాటలలాగ గొప్పగా, తిరుగు లేకుండా పని చెయ్యవు!"

తాను చేజేతులా చేసిన కర్మల ఫలితాలన్ని తప్పక అనుభవించి తీరవలసిందే! కాని భగవానుని గూర్చి ప్రార్థిస్తే పెద్దపుండుతో బాధ పడవలిసిన పరిస్థితిలో ముల్లు గుచ్చుకున్నంత బాధతోనే ఆ కర్మఫలితం తొలగిపోతుంది. జపము, తీవ్ర నియమనిష్ఠలు మొదలగు వానివల్లకూడా పాపకర్మల దుష్పరిణామాలు చాలావరకు తగ్గించుకోవచ్చును.

నేను: అయితే కర్మ ఒక్కటే ప్రపంచాన్ని నడిపించే మహనీయశక్తి అన్నమాట! అటువంటప్పుడు భగవంతునిమీది అంతటి నమ్మిక సంపాదించుకో వలసినంతటి అవసరమేమి ఉన్నది? ఉదాహరణకు బౌద్ధులు కర్మమీదనే విశ్వాసం సంపాదించుకున్నారు. అంతేగాని వారికి భగవంతునిమీద నమ్మికలేదు!

అమ్మ: "కాళి, దుర్గ, కృష్ణుడు మొదలయిన వారెవ్వరు లేనేలేరని అంటావా?"

ఆమె తీవ్రంగా ప్రశ్నించారు.

నేను: అయితే జపతపాలవల్ల నియమనిష్ఠలవల్ల ఒక వ్యక్తి తప్పక తన కర్మల ఫలితాలనుండి తప్పించుకోవచ్చు నన్నమాట!

అమ్మ: ఎందుకు తప్పించుకోకూడదు? ఒక మంచిపని చెయ్యడం చాలా మంచిది. మంచి పనివల్ల మంచి ఫలితం కలుగుతుంది. చెడ్డపని వల్ల చెడు ఫలితం కలుగుతుంది.

—సశేషం.

యత్కర్మ కుర్వతో అస్యస్యాత్ పరితోషో అంతరాత్మనః।
తత్ ప్రయత్నేన కుర్వీత విపరీతం తు వర్జయేత్॥

అంతరాత్మకు పరితోషం కలిగించేపనులను అతి ప్రయత్నంతో చేస్తూఉండవలెను. పరితోషం కలిగించని పనులను అతి ప్రయత్నంతో త్యజించవలెను.

—మనువు.

# వేదములు

**'సమతానంద'**

వేదము లనగానేమి? వాని మూలమేది? వాని స్వరూపమెట్టిది? అను విషయముల గూర్చిన అవగాహన మహనీయుడైన సాయనాచార్యుని భాష్యమువలన మనకు లభిస్తున్నది. ఇష్టప్రాప్తికి, అనిష్ట పరిహారానికి అలౌకిక ఉపాయములను ప్రకాశింపజేయు విజ్ఞానరాశి వేదము అని సాయనాచార్యుల నిర్వచనము. ప్రత్యక్ష అనుమాన ప్రమాణముల కందని విషయాలను వేదము తెలియజేస్తుంది. సకల దేవతలనుగూర్చి, ధర్మమునుగూర్చి పరబ్రహ్మ తత్వమునుగూర్చి ప్రతిపాదించునది వేదము. పరిచ్ఛిన్నుడైన మానవునివాక్కు, ఎంత గొప్పదైనా నిర్దోషము కాజాలదు. పరమసత్యాన్ని తుదిమాటగా చెప్పజాలదు. అలౌకిక విషయాలలో, దివ్యవాణియైన వేదమే స్వతః సిద్ధమైన, దోషరహితమైన, దేశకాలాతీతమైన పరమ ప్రమాణం కాగలదు.

ప్రజానీకంయొక్క నైతిక, ఆధ్యాత్మికశక్తిని ఉద్దీపనచేస్తూ, ఉన్నత జీవితాదర్శముపైపు ఆకర్షిస్తూ, భారతజాతియొక్క భావనను, జీవిత విధానాన్ని ప్రభావితంచేస్తూ, ఉన్న దివ్య చోదకశక్తియే వేదవిజ్ఞానము.

అపౌరుషేయములుగా సనాతనములుగా గురు–శిష్య పరంపరద్వారా అనాదికాలంనుండి అనుస్యూతంగా ప్రవహిస్తున్నది వేదస్రవంతి. వేదములు అపౌరుషేయములని గట్టిగా నమ్మేవారిలో రెండు వాదనలున్నవి. నిత్యమైన బ్రహ్మనుగూర్చి ధర్మమును గూర్చిన జ్ఞానమునకు మూలము వేదము. శబ్దమునకు అర్థమునకు గల సంబంధము నిత్యమైనది. అందువలన భాషరీత్యా, వస్తురీత్యా వేదములు నిత్యమైనవి. అని ఒక పక్షమువారి వాదన.

వేదములు ప్రతిపాదించే అలౌకికమైన, ఆధ్యాత్మిక సూత్రములు నిత్యమూ – త్రికాలాబాధ్యములు. అందుచే వేదములు నిత్యమైనవి. అపౌరుషేయమైనవని రెండవ పక్షమువారి వాదన. వీరు వేదభాషయొక్క అపౌరుషేయత్వాన్ని అంగీకరించరు. స్వార్థరహితులైన, విశ్వాసపాత్రులైన ఆప్తపురుషులైన ఋషి వాక్యములు వేదవాక్కు అని వీరి వాదన.

సృష్ట్యాదిని ప్రజాపతుల సంకల్పరూపమైన యజ్ఞంలో యజ్ఞపురుషుడైన పరమాత్మనుండి ఋక్, యజుస్, సామములు ఆవిర్భవించినట్లు ప్రసిద్ధమైన పురుషసూక్తములో వివరించబడినది. పరమాత్మ బ్రహ్మను సృష్టించి, బ్రహ్మకు వేదరాశిని అందించినట్లు శ్వేతాశ్వతరోపనిషత్తు వివరిస్తుంది. అగ్నినుంచి ధూమము వెలిసినట్లు పరమాత్మనుంచి ఉచ్ఛ్వాసనిశ్వాసరూపముగా ఋగ్వేదాదులు వెలువడినట్లు బృహదారణ్యకము వివరిస్తుంది. వేదములకు మూలము పరబ్రహ్మ – అందుచే అవి అపౌరుషేయములు అని బ్రహ్మసూత్రముల వివరణ. శబ్దముయొక్క నిత్యత్వమును ప్రతిపాదిస్తుంది మీమాంసాసూత్రము. భగవంతుడు బ్రహ్మ మనస్సులో వేదరాశిని స్ఫురింపజేసినట్లు పురాణముల, ముఖ్యముగా శ్రీమద్భాగవతము యొక్క వివరణ. అపౌరుషేయమైన వేదరాశిని స్మరించి, బ్రహ్మ సృష్ట్యాదిని గురుశిష్య పరంపరద్వారా వ్యాప్తిచేసినట్లు స్మృతుల వివరణ. వేదవిషయమైన ప్రవృత్తి, నివృత్తి నిష్ఠలను, మరీచ్యాది ప్రజాప్రతులద్వారా, సనకసనందనాది ఋషులద్వారా నారాయణుడు ప్రవర్తింప

జేసినట్లు గీతాభాష్యములో శ్రీ శంకరా చార్యులు వివరించారు. మన ఆర్షవాఙ్మయం లోని ఈ వివిధమైన వివరణలు - వేదవాక్కు యొక్క దివ్యత్వాన్ని, దానిపట్ల హైందవ సంస్కృతికి అనాదినుండిగల పూజ్యభావాన్ని సూచిస్తున్నవి.

భాష, శైలిభేదాన్ని అనుసరించి కాలనిర్ణ యంచేస్తూ వేదమును వివిధ భాగములుగా విభజించే పాశ్చాత్య పండితుల విధానాన్ని సంప్రదాయసిద్ధమైన భారతీయ విద్వాం సులు అంగీకరించరు. కాని వేదరాశిని విభాగం చేయుటలో, వారి విధానం - తార్కికపద్ధతి వారికున్నది. విద్ అను ధాతువునకు తెలుసు కొనుట, విచారణచేయుట అను అర్థంలో బోధ ద్వారా,అనుభూతిద్వారా పొందిన విజ్ఞానమును విద్య అంటారు. ఈ దృష్ట్యా విద్యగా వేదంలో రెండు దశలున్నవి. పరా, అపరా అను ఈ దశలు, క్రిందితరగతులకు చెందినవి. అధ్యా త్మిక విజ్ఞానము పై స్థాయికిచెందిన పరావిద్య. ఆవిజ్ఞానమునకు దారిచూపే క్రిందిస్థాయి అపరా విద్య. శాస్ అను ధాతువునకు శాసించుట, విదితము చేయుట అను అర్థములు కలవు. ఈ దృష్ట్యా వేదము అజ్ఞాత జ్ఞాపకశాస్త్రము అనగా తెలియనిదానిని తెలియజేయునది లేదా ప్రవృత్తిలేనిచోట ప్రవృత్తిని కలిగించు అప్రవృత్త ప్రవర్తన విధి నిషేధశాస్త్రము. వేదములకు, నిగమము, శ్రుతి, ఆమ్నాయము అను పేర్లుకూడా కలవు. నిగమమనగా అనాది సిద్ధమైన నిర్ణయపాఠము. శ్రుతులనగా శిష్యునిచే గురువునుండి శ్రవణం చేయబడిన దివ్యవాక్కు. ఆమ్నాయ మనగా పలుపార్లు పఠించుట, చింతన చేయుటద్వారా నేర్చినది. కర్మకాండ, జ్ఞానకాండ విభాగము అపరా, పరావిద్యలవంటివే. యజ్ఞయాగాది కర్మల గూర్చినది కర్మకాండ. జగజ్జీవేశ్వర విచార ణకు సంబంధించినది జ్ఞానకాండ. ఈ విభాగము ఉపనిషదితర, ఉపనిషద్ విభాగానికి సరిపో తుందనే సామాన్య అభిప్రాయం ఉన్నది. ఈ స్పష్టవిభాగము చేయలేము. ఉపనిషత్తులలో కర్మకాండకు సంబంధించిన భాగములు కొన్ని కలవు. అలాగే సంహితాభాగములో తాత్త్విక రహస్యములకు సంబంధించిన భాగములున్నవి. కాబట్టి ఈ విభజనలు విషయ ప్రయోజనాన్ని అనుసరించిన అవగాహనగా భావించాలిగాని అడ్డుగోడలవంటివిగా భావించరాదు.

వాక్యస్వరూపము, విషయము, శైలి - వీని ననుసరించి సంప్రదాయసిద్ధంగా వేదం నాలుగు భాగాలుగా విభజింపబడింది. ఋక్, యజుస్, సామ, అథర్వణములు ఈ విభాగము లోనివి. ఋక్ ఛంధోరూః కలిగిన దేవతాస్తుతి. కర్మలో వినియోగానికి సంబం ధించిన రచన, లేక ఛందోరూపం కలిగిన వాక్యము యజుస్సు సామము గానయోగ్య మైన స్తుః ఈ మూడు సమష్టిగా ఋక్ - యజుస్సామ సంహితలుగా వ్యవహరించబడు చున్నవి వీనికి అనుబంధించిన సంబంధించిన బ్రాహ్మణములు, ఆరణ్యకములు, వాని సంబంధించిన ఉపనిషత్తులు కలిపి ఋగ్య జుస్సామ అథర్వవేదములుగా పేర్కొనబడు తున్నవి. అపౌరుషేయమై, బ్రహ్మకు స్ఫురింప చేయబడినదని పురాణములు చెప్పే వేదరాశి, వేదపాఠము చేయువాని అశ్రద్ధ, గందరగోళము వలన అగమ్యగోచర మయినది తరువాత కాలంలో. ద్వాపరయుగ ప్రారంభంలో వ్యాస నామం కలిగిన కృష్ణద్వైపాయన మహర్షి వేదరాశిని సుస్పష్టంగా ఋక్, యజుస్, సామ అథర్వభాగములుగా విభజించి పైల, వైశం పాయన, జైమిని, సుమంతులను నలుగురు శిష్యు

లకు నాలుగు వేదముల పరంపరను వ్యాప్తి చేయు కార్యమును అప్పజెప్పడం జరిగింది. వీరి శిష్య పరంపర కాలక్రమేణా అనేక శాఖలుగా చీలిపోయారు. ఒక్కొక్క శాఖ ఆ వేదమును తమ ప్రత్యేకరీతిలో సంశ్లిష్టపాఠముగా పదిలపరచుకుని తమ శిష్య పరంపరకు అందిస్తూ వచ్చారు. ఈ విధముగా కఠ, కౌతుమ, వాజసనేయ, మాధ్యందిన - మొదలగు పేర్లతో వివిధ శాఖలు బయలుదేరినవి. ఇట్టి శాఖలు ఋగ్వేదంలో 21, కృష్ణ యజుర్వేదంలో 94, శుక్ల యజుర్వేదంలో 15, సామవేదంలో 1000, అధర్వవేదంలో 15. ఉన్నట్లు ముక్తికోపనిషత్తులో చెప్పబడింది. వీనిలో చాలా శాఖలు ఖిలమై వాటిపేర్లు మాత్రం మిగిలినవి.

శైలి, విషయములబట్టి ఇంకొక విభజన - మంత్రము, బ్రాహ్మణము అనునది. ఈ విభాగ నిర్వచనం కల్పశాస్త్రము చేస్తుంది. ఈ విభాగముపైన చెప్పిన నాలుగు వేదముల విభాగము లోని అంతర్భాగము. ప్రతి వేదానికి సంబంధించిన మంత్రభాగము, బ్రాహ్మణభాగములు కలవు. స్తుతిరూపమైన, ఛందోభాగము మంత్రము. తదితరము బ్రాహ్మణము. ఋక్, యజు, స్సామ సంహితలలోని స్తుతిరూపమైన మంత్రభాగమునకు, తదితరమునకు వినియోగ రీత్యా భేదం కనిపిస్తుంది. ప్రత్యక్షముగానో, పరోక్షముగానో ఇహపరలోక సంబంధమైన అభ్యుదయను - పరమపురుషార్థమైన నిశ్శ్రేయసము చేకూర్చగల యజ్ఞయాగాది క్లిష్ట కర్మకాండను సక్రమంగా, తు-చ-తప్పకుండా నిర్వహించుట వేదముయొక్క సర్వసామాన్య వినియోగము. ఈ విధానములో వేదంలో ప్రతిభాగానికి ఆవాహన, స్తుతి, క్రియా కలాపమునకు సంబంధించినవిధంగా అర్థం చెప్పవలసియుండును. యజ్ఞకాండలో హోత దేవతా స్తోత్రాన్ని పఠించును. అధ్వర్యు క్రియాకలాపమును నిర్వహించును. ఉద్గాత సామగానము చేయును. బ్రహ్మ, కార్యకలాపమునంతను పర్యవేక్షించుచు - సక్రమంగా నడిపించుచు - పొరపాట్లను సరిదిద్దుతూ సలహాలనిస్తూ- వైదిక యజ్ఞమూర్తిగా వ్యవహరించును. హోత, అధ్వర్యు, ఉద్గాత బ్రహ్మలు నలుగురు నాలుగు వేదాల ప్రతినిధులు. అందులో బ్రహ్మ అధర్వవేద ప్రతినిధి.

సంహితలలో ఋగ్వేదం ప్రధానమైనది. ఇతర వేదములలోని అత్యధికభాగము ఋగ్వేదములోని మంత్రాల పునరుక్తియే. శాకల శాఖ ననుసరించి దానిలో 1028 స్తోత్ర రూపమైన ఋక్కు లున్నవి. వీనిలో అనేక దేవతలకు సంబంధించిన స్తోత్రా లున్నవి. ఇందులో కొన్ని పెద్దవి. కొన్ని చిన్నవి. అన్నిటికన్న పెద్ద ఋక్కులో 52 పాదము లున్నవి. ఈ ఋక్కులు పది మండలాలుగా విభజించబడినవి. ఇందులో దశమమండలంలో గుప్తమైన ఆధ్యాత్మిక, తాత్విక రహస్యాలు గల భాగములు ఎక్కువగా ఉన్నవి. మిగతా మండలాలలోకూడా ఇట్టివి కొన్ని లేకపోలేదు. ఐతరేయ, కౌషితకి, పైంగి, సాంఖ్యాయనాదులైన బ్రాహ్మణములు ఋగ్వేదమునకు సంబంధించినవి. ఐతరేయ, కౌషీతకి ఆరణ్యకములు పై పేరుగల బ్రాహ్మణముల కనుబంధము. ఈ ఆరణ్యకములలోని చివరభాగములు ఐతరేయ కౌషీతకి ఉపనిషత్తులు.

యజుర్వేదంలోని తైత్తిరీయ సంహిత కృష్ణ యజుర్వేదమను పేరుతో వ్యవహరించబడుతుంది. ఇది గద్యలోవుండి యజ్ఞం చేయించు అధ్వర్యునికి ఉపయోగించుభాగము. కర్మకాండకు సంబంధించిన సూత్రాలు వాని

వివరణ ఈ భాగంలో కలదు. యజుర్వేదంలో 40 అధ్యాయములుగల శుక్ల యజుర్వేదమనే ఇంకొక భాగం కలదు. ఇందులో చక్కని క్రమ బద్ధమైన విభజన గోచరిస్తుంది. తైత్తిరీయ - భాల్లవ - శాట్యాయన, మైత్రాయణ, కఠ బ్రాహ్మణములు కృష్ణ యజుర్వేదములోనివి. వీనిలో మొదటిది చాలా ప్రసిద్ధమైనది. సంహితకు అనుబంధమై తైత్తిరీయ ఆరణ్యకమునకు అనుబంధంగా కలిగి ఉన్నది. తైత్తిరీయ ఉపనిషత్తు దీనిలోనిదే. ఇలాగే మైత్రాయణి ఉపనిషత్తు ఉన్నది. మాధ్యందిన, కాణ్వశాఖలలో శుక్ల యజుర్వేదం నిలిచియున్నది. దీనిలో సుప్రసిద్ధమైన శతపథ బ్రాహ్మణములో బృహదారణ్యక ఉపనిషత్తు ఉన్నది.

ఋగ్వేదంలోని అష్టమ నవమ మండలాల లోని భాగము సామవేద సంహితలోనికి తీసుకొనబడింది. ఉద్గాతగానం చేయుట కనుగుణ్యంగా ఇవి సంస్కరించబడినవి. సామ విధాన, మంత్ర, ఆర్షేయ, వంశ, దైవతాధ్యాయ, తలవకార, తాణ్డ్య సంహితోపనిషత్తులను ఎనిమిది బ్రాహ్మణములు ఇందులోనివి. వీనిలో ఆ వేదమునకు సంబంధించిన అధ్వరుడు నిర్వహించవలసిన విధులు పేర్కొనబడినవి. వీనికి సంబంధించిన ఆరణ్యకములు కనిపించడంలేదు. ఛాందోగ్య, కేనోపనిషత్తులు సామవేదానికి అనుబంధములు. ఇతర వేదములకున్నట్లు, అధర్వవేదమునకు యజ్ఞ సంబంధము కనపడదు. దానికి సంబంధించిన బ్రహ్మ పర్యవేక్షకునిగా వ్యవహరించును. శౌనకసంహిత ననుసరించి అధర్వవేద సంహితలో 760 ఋక్కులు, 6000 పాదములు ఉన్నవి. ఇవి 20 అధ్యాయాలుగా ఉన్నయి. వీనిలో 1200 పాదములు ఋగ్వేద సంహితలోనివి. మొత్తంలో ఆరవభాగము గద్యగా ఉన్నది. తాంత్రిక విషయాలు, తాత్విక విషయాలుకూడా దీనిలో కలవు. దీనికి సంబంధించిన ఆరణ్యకం కనపడదు. ముండక, మాండూక్య ప్రశ్నోపనిషత్తులను ప్రసిద్ధ ఉపనిషత్తులు ఈ అధర్వవేద సంబంధమైనవిగా వ్యవహరించ బడుచున్నవి. అంత ప్రాముఖ్యములేని గోపథ బ్రాహ్మణము అధర్వవేదములోనిదే.

సంహితాభాగముయొక్క అర్థం బ్రాహ్మణములు అందిస్తాయి. అందువలన అవి వ్యాఖ్యాన తుల్యమయినవి. యజ్ఞములోని సూక్ష్మ వివరములను - వాని మూలమును అంతరార్థమును-శక్తిని- వినియోగాన్ని గూర్చి ఇతిహాసముల రూపములో వివరిస్తాయి.

బ్రాహ్మణములగూర్చి సాయనుని నిర్వచనము, ఇదిమిత్థమని స్పష్టంగా తేల్చి చెప్పదు. ఈ విషయం ఆయనే అంగీకరించారు. అందుకనే మంత్రముకాని తదితరమంతా బ్రాహ్మణమే. బ్రాహ్మణములో ఎక్కువభాగం ఒకే రకమైన విషయాన్ని గూర్చిన వివిధమైన వివరణలే.

స్వరూపంలో, విషయంలో బ్రాహ్మణములకు ఉపనిషత్తులకు మధ్యస్థానము కలవి ఆరణ్యకములు. ఇవి బ్రాహ్మణము వలె కర్మకాండకు సంబంధించిన విషయములతో కూడినవి. కాని వీనిలో కర్మకాండ బాహ్యరూపాన్ని గాక, అందులోని అధ్యాత్మిక సంకేతములను గూర్చిన మననము ఎక్కువగా కనిపిస్తుంది.

ఆరణ్యకములు వానప్రస్థ దీక్షను తీసుకొన్నవారు ఏకాంతమైన అరణ్యవాసం చేస్తూ పఠించవలసినవి. ఈ కారణంవలన ఇవి అధిక పవిత్రతకలవి. ఉపనిషత్తులలోని విషయ విచారణా విధానాలు ఆరణ్యకములలోకూడా ఉన్నవి. విషయదృష్ట్యా ఆరణ్యకములను

ఉపనిషత్తులను స్పష్టమైన హద్దులో విభజించ లేము.

ఉన్నతమైన జ్ఞాన సారాంశము ఉపనిషత్తులు. ఇందులో శ్రీ శంకరాచార్య భాష్యం కలవి పది. ఇందులో 5 ప్రసిద్ధ సంహిత, ఆరణ్యక భాగములు. సంప్రదాయము ననుసరించి 1180 ఉపనిషత్తులు, శాఖకు ఒకటి చొప్పున ఉన్నట్లు చెప్పబడుతున్నది. వీనిలో 200 మాత్రమే ఈ నాటికి బయటపడినవి. వీనిలో కొన్ని ఆధునికమైనవిగా కనిపిస్తయి. వీనిలో జాగ్రత్తగా పరిశీలింపదగినవి 108 ఉన్నవి. ఉపనిషద్బ్రహ్మేంద్ర అనువారు వీనికి భాష్యం వ్రాశారు. ముక్తికోపనిషత్తు వీనిలో ప్రతి ఒక్క ఉపనిషత్తును ఏదో ఒక వేదానికి అనుబంధంగా పేర్కొంటుంది. కాని అయిదు మాత్రమే ప్రస్తుత రూపంలో వేద భాగంగా కనిపిస్తాయి. ఇంకా కొన్ని ఇదివరలో సంహిత బ్రాహ్మణములకు సంబంధం కలిగి తరువాత వానినుండి విడివడి యుండవచ్చు.

*

నీలి గగన పళ్ళెమందు నిలిచి జ్యోతులూ
కాంతులీని వెలుగుచుండె సూర్యచంద్రులూ ॥నీ॥
మిణుకు మిణుకు మనుచు వెలుగు రత్న తారలూ
నీదు చకిత రూపమునకు తొడుగు ఉడుపులూ ॥నీ॥
మందగమనమునను వీచు మలయపవనమూ
పరిమళంబు గొలుపు మధుర ధూపధూమమూ ॥నీ॥
ఇందునందు సోకుచున్న పిల్లగాలులూ
నీదు దివ్యముఖమునకును చామరంబులూ ॥నీ॥
శుభ్రమైన పూలతోట కానుపించునూ
పర్వమునను వెలుగు దీప శిఖలవోలెనూ ॥నీ॥
జననమరణములను తొలగద్రోయు ఓ ప్రభూ
ఎంత అద్భుతంబు నీకు జరుగు అర్చనా ॥నీ॥
వ్యోమమందు ఉద్భవించు ప్రణవనాదమూ
మరల మరల మారుమ్రోగు భేరివాద్యమూ ॥నీ॥
నాదు మనసు పగలు రాత్రి సుధను కోరునూ
వాసుదేవు దివ్యచరణ కమలమందునూ ॥నీ॥
కురియుమయ్య నీదు పరమ కరుణ వర్షమూ
దప్పిగొన్న నానకు పై పురుషోత్తమా ॥నీ॥
పరమ పూజ్యమైన నీదు పుణ్యనామమూ
అగునుగాక నిత్యమైన అతని గేహమూ ॥నీ॥

—అనువాదం : బి. ఎస్. ఆర్. ఆంజనేయులు.

# శ్రీ రామకృష్ణ కథామృతము

## (రెండవ భాగము)

శ్రీ రామకృష్ణులు – (భక్తులతో) రాఖాలుని స్వభావము ఎట్లు మారిపోయినదో చూచితిరా! సర్వదా లోలోన అతడు భగవన్నామమును జపించుచుండును. పరీక్షించి చూచినచో వాని పెదిమలు కదలుచుండుట గమనింపవచ్చును. రాఖాలు, నరేంద్ర – వీరు నిత్యసిద్ధులు. పుట్టుకతోనే వీరికి జ్ఞానము కలిగినది. సంసారములో వీరు జీవించలేరు.

వేదములలో హోమపక్షిని గురించి చెప్పబడినది. అది ఒక విచిత్రమగుపక్షి. సామాన్యపక్షులవలె అది చెట్లుచేమలపై నివసింపదు. ఆకాశములోనే చాల ఎత్తున అది నివసించును. అంత ఎత్తునుండి దాని అండములు భూమిని చేరుటకుముందే అందుండి హోమపక్షి పాపలు ఉత్పన్నములై తిరిగి తల్లిపక్షినే చేరుకొనును.

రాఖాలు, నరేంద్రుడు మున్నగువారు హోమపక్షి వంటివారు. సంసారములో వారెన్నటికీ దిగరు. జగజ్జనని సామీప్యమునే వారు కోరుదురు.

సాయంకాలము సుమారు 6 గంట లాయెను. శ్రీ రామకృష్ణులు దక్షిణపువైపు వరండాలో కూర్చొని భక్తులతో మాట్లాడుచుండిరి.

శ్రీ రామకృష్ణులు (కేదారాది భక్తులతో) సంసారము వదలిపెట్టిన సాధువులు శ్రీహరి నామస్మరణ చేస్తూనే ఉండవలెను. వారికి వేరే పనేమీ లేదుకదా! సాధువులు భగవద్ధ్యాన పరాయణులైనచో ఆశ్చర్యపడవలసిన పనిలేదు. భగన్నామస్మరణతో, ధ్యానముతో కాలము గడపక ఉండే సాధువులను చూచి లోకులు నిందింతురు. గృహస్థులు భగవద్ధ్యాన పరాయణులైనచో అది గొప్పగా ప్రశంసించదగిన విషయము. జనకరాజును చూడుము. గృహస్థుడుగా ఉండిన్నీ కర్మయోగము జ్ఞానయోగము – అను రెండు కత్తులతో సాముచేసి సంసారబంధములను పటాపంచలు చేసివేసెను.

సర్వదా సత్సాంగత్యము చేయవలెను. గొప్పసాధువులైనవారు సాధారణ మానవులకు భగవంతునిచేరు మార్గమును చూపించగలరు.

కేదార్–నిజమే సాధారణజీవుల నుద్ధరించుటకే మహానుభావుల ఆగమనము. ఒక్క రైలు ఇంజను చాల పెట్టెలను లాగుకొని పోవునుకదా!

చీకటి పడినవెంటనే భక్తులు శ్రీ రామకృష్ణుల పాదపద్మములకు ప్రణామములు చేసి శెలవు తీసికొనుచుండిరి. శ్రీ రామకృష్ణులు భవనాథ్‌ను చూచి "నీవు ఇక్కడే ఉండుము. నిన్ను చూచినచో నాకు ఈశ్వరావేశము కలుగుచుండును." అనిరి. భవనాథ్ వయస్సు 20 సం॥ లు. సంసారములో పడలేదు. చూచుటకు చాల చక్కనివాడు. ఒకసారి భగవంతుని పేరు విన్నచో చాలును ఆనందభాష్పములు రాల్చును. అంత పవిత్రహృదయుడు కాబట్టే శ్రీ రామకృష్ణులు వానిని సాక్షాత్ నారాయణునిగా భావించెడివారు.

క్రీ. శ. 1883. ఏప్రిల్ 8వ తేది ఆదివారము.

శ్రీ రామకృష్ణులు (మణిలాల్ మల్లిక్‌ను చూచి) నీవు ఈ మధ్య కాశికి పోయిఉంటివి కదా. అక్కడి సాధువులను మహాత్ములను దర్శించితివా?

మణిలాల్–అవునండీ! కాశీకి పోయిఉంటిని. అక్కడ త్రైలింగస్వాములను చూచితిని, భాస్కరానందస్వాములను ఇంకా చాలమంది సాధువులనుకూడ దర్శించితిని

శ్రీ రామకృష్ణులు — వాళ్ళను గురించి కొంచెము చెప్పుము.

మణిలాల్ – త్రైలింగస్వాములు మణికర్ణికా ఘట్టంలో ఉన్న వేణీమాధవ్ ఆలయంలోనే నివసించుచున్నారు. పూర్వం ఆయనకున్న మహిమ ఇప్పుడు తగ్గిపోయిందని ప్రజలు చెప్పు కుంటున్నారు.

శ్రీ రామకృష్ణులు – సామాన్య ప్రజల అభిప్రాయాలవి.

మణిలాల్ — త్రైలింగస్వాములు ఎవ్వరి తోనూ మాట్లాడరు. ఎప్పుడూ మౌనమే. భాస్కరానందస్వాములు అట్లాగాక అందరితో మాట్లాడతారు.

శ్రీ రామకృష్ణులు – భాస్కరానందస్వామితో ఏమైనా మాట్లాడితివా?

మణిలాల్ – చాల విషయాల గురించి మాట్లాడితిని. పాపపుణ్యాల గురించి ఆయన నా కిట్లా చెప్పినారు. "పాపపు ఆలోచనలు చేయకుము. పాపమైన పనులు చేయకుము. పుణ్యమైన ఆలోచనలు చేయుము. పుణ్య మైన పనులను చేయుము. ఇదియే ఈశ్వరునికి ఇష్టము."

శ్రీ రామకృష్ణులు – ఇది సంసారులకు తగిన ఉపదేశము. బ్రహ్మసత్యం జగన్మిథ్య అని తెలిసికొన్నవాని భావనలే వేరు. ఈశ్వరుడు ఒక్కడే కర్త. ఈశ్వరుడే సర్వమును చేయు చున్నాడు. జీవులందరు అతని చేతిలోని కీలు బొమ్మలు. ఈ విధమైన వివేకము గలవారికి ఈశ్వరునిపై అత్యంత ప్రీతి కలుగును. వారు చేయు కర్మలన్నియు సత్కర్మలే అగును. పాపకర్మలు వారు చేయజాలరు. వారు పాప పుణ్యములకు అతీతులై ఉండెదరు.

ఒక ఊరిలో సన్యాసులమఠ మొకటి ఉండెను. ఆ సన్యాసులు ప్రతిదినమూ భిక్ష మునకు ఊరిలోనికి పోవుచుందురు. ఒకరోజు ఒక సన్న్యాసి ఆ ఊరి జమీందారు ఒక పేదవానిని కొట్టుచుండుట చూచెను. సన్న్యాసి కొట్టవలదని జమీందారుకు చెప్పగా ఆ జమీం దారు సన్న్యాసిమీదకూడ కోపించి స్పృహ తప్పి పడిపోవునట్లు కొట్టెను. ఇది తెలిసిన వెంటనే తక్కిన సన్యాసులువచ్చి ఆ సాధువును మఠమునకు చేర్చి సేవ చేయుచుండిరి. ఒక సాధువు పాలు త్రాగించుచు అతనిని అడిగెను. 'పాలు త్రాగించునది ఎవరని గుర్తు పట్ట గలవా?' సన్న్యాసి దానికి ఇట్లా బదులు చెప్పెను. 'స్పృహతప్పి పోవునట్లుగా కొట్టిన ఈశ్వరుడే ఇప్పుడు స్పృహ వచ్చునట్లుగా పాలు త్రాగించుచున్నాడు.'

ఓ మణిలాల్ చూడు ఈశ్వరదర్శనం లేనిదే ఇంత ఉన్నత మనోభావం కలుగదు.

మణిలాల్ – అవునండీ! మీరు చెప్పినది, మహోన్నతస్థితికి చెందిన విషయము.

శ్రీ రామకృష్ణులు – భాస్కరానందస్వామి భక్తుల గృహంలో ఉంటున్నారా? ఆయన వయస్సు ఎంత ఉంటుంది?

మణిలాల్ – అవును ఆయన ఒక భక్తుని ఇంట నివసించుచున్నారు. వయస్సు ఏబది ఏబదిఐదు సంవత్సరము లుంటుంది.

శ్రీ రామకృష్ణులు – ఇంకే మడిగితివి.

మణిలాల్ – భక్తి ఎట్లా కలుగుతుంది అని అడిగితిని. దానికి ఆయన ఇట్లా చెప్పినారు. 'నామ జపం చేయుము. రామనామజపం చేయుము.'

శ్రీ రామకృష్ణులు – ఆహా ఇది ఎంత మంచిమాట.

దక్షిణేశ్వరమున శ్రీ రామకృష్ణులు బ్రహ్మ సమాజంవాళ్ళకు భగవత్ప్రేమ తత్త్వమును చెప్పుట.

శ్రీ రామకృష్ణులు - (బ్రహ్మసమాజభక్తులతో) మీరు ప్రేమ ప్రేమ - అంటుంటారే, అది అంత సామాన్య విషయంకాదు. ఎవరికంటే వారికి లభించదు. శ్రీ కృష్ణచైతన్య మహాప్రభువులవారికి భగవత్ ప్రేమ కలిగిందని చెప్పవచ్చు.

భగవత్ ప్రేమ కలిగినవాళ్ళలో రెండు లక్షణాలు చూడవచ్చు. ఒకటి – వాళ్ళు బాహ్య ప్రపంచమును మరచిపోవుదురు. శ్రీ కృష్ణ చైతన్యులకు ఆ స్థితి కలిగింది. వారు అడివిని బృందావనంగా భావించిరి. సముద్రమును యమునానదిగా భావించిరి. రెండు – వారికి దేహముమీద ధ్యాసయే ఉండదు. భగవత్సాక్షాత్కారమువల్లనే నిజమైన ప్రేమ కలుగును. భగవంతునిఎడల అనురాగం తీవ్రంగా ఉన్న వానికి అ భగవత్సాక్షాత్కారము కలుగును. అనురాగం ఉన్నవానిలో ఈ లక్షణములు పొడసూపును. వివేకము, వైరాగ్యము, జీవదయ, సాధుసేవ, సాధు సాంగత్యము, భగవన్నామస్మరణ, సంకీర్తనాప్రీతి, సత్యభాషణము మొదలగునవి.

ఒక భక్తుడు - స్వామీ ఇంద్రియనిగ్రహానికి నిత్యానిత్య వస్తువివేకం చేయవలెనా ?

శ్రీ రామకృష్ణులు – అదియు ఒక మార్గమే. కాని దానికన్న భక్తిమార్గము చాల సులభము. భక్తి కలిగినచో బాహ్యేంద్రియ నిగ్రహము, మనోనిగ్రహము అప్రయత్నముగానే కలుగును. భగవంతునిఎడల భక్తి ఉన్నచో ఇంద్రియ విషయములు తుచ్ఛము లనిపించునుకదా !

భక్తులు - భక్తి కలుగుటలేదే. ఏమి చేయుదును.

శ్రీరామకృష్ణులు – భగన్నామజపం చేయుము. భక్తి కలుగును. పాపములు నశించును. ఇంద్రియ సుఖములపై ఆసక్తి క్షీణించును.

భక్తుడు – నామజపం సాధ్యమగుటలేదే.

శ్రీ రామకృష్ణులు – భగవంతుని ప్రార్థించుము. భగన్నామముపై రుచి కలుగును. ఏమీ భగన్నామముపై అరుచియా! రుచిని కలిగించుకొనవలసినదే. సన్నిపాతజ్వరము గల రోగికి ఏదీ తినడానికి రుచించదు. అట్లని తినకుండా ఉండనియవచ్చునా ? సహించకపోయినా అతనిచేత బలవంతముగా తినిపించవలెను. లేకపోతే అతనికి శక్తి ఎట్లా వస్తుంది. ఎటా కోలుకుంటాడు. అట్లే నీకు నచ్చకపోయినా మొదట బలవంతముగా ఏదో ఒక నామమును స్మరించుము. శివుడో, కృష్ణుడో, కాళియో – ఏదో ఒక దైవమును స్మరణ చేయుచుండుము. నామస్మరణవలన మెల్లగా భక్తి, అనురాగము వృద్ధియగును.

అహంకార మమకారముల వలననే జీవులు నానా అగచాట్ల పాలగుచున్నారు. అహంకారము మిట్టభూమి వంటిది. మిట్టభూమిలో నీరు నిలువదు. పల్లపుభూములలో నీరు నిలుచును. పైరు సమృద్ధిగా పండును. సత్సాంగత్యము చేయవలెను. ఇండ్లలో సంసారమును గురించిన మాటలేకదా!

జ్ఞానమనే దీపం లేకపోతే ఈ దేహమనే దేవాలయం కళకళ లాడదు. జ్ఞానం అందరికి సాధ్యమగును. ప్రార్థనద్వారా పరమాత్మ సాన్నిధ్యము కలిగించుకొనవచ్చును. జ్ఞానసిద్ధి కలిగినవ్యక్తి భగవత్ప్రసంగములనే వినును.

భగవద్విషయములనే పలుకును - అన్య విషయములేవీ వానికి నచ్చవు.

పులి, అన్య జంతువులను గబగబ తినివేయు రీతిని - భగవత్ ప్రేమ కామాది శత్రువులను మ్రింగివేయును. గోపికలకు ఈశ్వరానురాగము కల్గినది. అందుచే కామక్రోధాదులు వారిలో లేకపోయెను. రాధ జగత్తునంతయు కృష్ణమయముగా చూచుచుండెను. 'ఇదేమివింత' - అని సఖులను అడిగినది. 'సఖీ నీవు ప్రేమ అనెడి కాటుకను పెట్టుకొని చూచుచున్నావు. అందుకే నీ కిట్లా అగపడుచున్నద'ని వారు బదులుచెప్పిరి.

సర్వదా కామినీ కాంచనములను స్మరించువారు ఒకమారైనా భగవంతుని స్మరింపజాలరు. వీరే సంసారములో బంధింపబడినట్టి జీవులు. ఇట్టివారు ఘనకార్యములు చేయజాలరు. కాకులు పొడిచిన పండ్లు దేవుని నైవేద్యమునకు పనికిరానట్లు కామ కాంచనములచే కొట్టబడిన మానవులు ఆత్మలను భగవంతునికి అర్పించుకొనజాలరు.

పట్టుపురుగు తాను అల్లుకొనిన గూటిలోనే స్వయముగా బంధింపబడును. కొన్ని పట్టుపురుగులు స్వీయబంధములను ఛేదించుకొని బయట పడగలవు. కాని ఇది చాల అరుదు. జీవులును ఇట్లే తాము అల్లుకొనిన సంసారబంధములలో తగుల్గొందురు. అరుదుగా కొందరు మాత్రమే బంధములను ఛేదించుకొని బయట పడుదురు. వీరే ముక్తపురుషులు.

వీరిలో సాధనసిద్ధులు కొందరు, కృపాసిద్ధులు కొందరు. రైతు కష్టించి సేద్యముచేసి మెట్టపొలములో ఏనాపంటలు పండించునట్లు సాధనసిద్ధుడు పట్టుదలతో సాధనలుచేసి ఈశ్వర లాభము పొందును. కృపాసిద్ధులు కేవలం భగవంతుని కృపవలన సాక్షాత్కారలాభము పొందినవారు.

మరొక తరగతివారు నిత్యసిద్ధులు. వీరు జ్ఞానముతోనే జన్మింతురు. లోకోపకారము చేయుటకే వీరు జన్మింతురు.

ఓ రామ్‌లాలూ బృందావన గోపికల గురించి కొన్ని పాటలు పాడవయ్యా.

రామ్‌లాల్ - 'ధోరోనా ధోరోనా రథచక్ర ... . ............'

(భావము : అక్రూరుని రథచక్రములు గోపికలు పట్టుకొనిరి. అంత అక్రూరుడు ఇట్లనెను. బ్రహ్మాండచక్రము ఎవని ఆజ్ఞచే తిరుగుచున్నదో, ఆ హరియే రథియై ఈ రథములో ఉన్నాడు. మీరు రథచక్రములను పట్టుకొని ఏమి ప్రయోజనము? రథమునకు ఇష్టప్రకారము నడిచే సామర్థ్యము ఉన్నదా?)

పాటలు వినుచు శ్రీ రామకృష్ణులు తన్మయులై క్రమేణ సమాధిస్థితి నందిరి. సంపూర్ణముగ బాహ్యజ్ఞానమును కోల్పోయిరి. ఈ అత్యద్భుతమగు మనఃస్థితిని భక్తులు తదేకముగ చూచుచుండిరి. కొంతసేపైనతరువాత మెల్లగా బాహ్యజ్ఞానము కలిగెను. అస్పష్టముగా తనలో తాను - "ఇదేమి ఆశ్చర్యము. ఏ వైపు చూచినను నీవే అగపడుతున్నావు - హే కృష్ణా! - హే దీనబంధో! హే ప్రాణవల్లభా! హే గోవిందా! హే గోపాలా!-అనుచుండిరి. గోవిందా గోపాలా అనుచు మరల బాహ్యస్మృతి కోల్పోయిరి.

అపూర్వమైన ఇట్టి భగవత్ ప్రేమోన్మాదమును చూచి భక్తులు ఆశ్చర్యచకితులై శ్రీ రామకృష్ణులందే దృష్టులనునిలిపి బాహ్యప్రపంచమునే మరచి ఆనందించిరి.

—సశేషం.

# పాణిని

## గోడా వేంకటేశ్వరరావు

వేదాంత శాస్త్రమునకు, వ్యాకరణమునకును చాల దగ్గర సంబంధము కలదు. అద్వైత వేదాంత ప్రవర్తకులగు శ్రీ శంకర భగవత్పాదులును వారి గురువగు గోవింద భగవత్పాదులును, పరమగురువగు గౌడపాదులును వ్యాకరణశాస్త్ర పారంగతులు. ఈ విషయం చాల వింతగా కనిపించవచ్చు. దీనికన్న వారి కథ మరీ వింతగా ఎంతో ఆశ్చర్యకరంగా వుంటుంది. దానిని కొంచెం చూద్దాం.

మన భారతదేశంలో పూర్వకాలంలో సంస్కృతభాషలో మట్టుకు తొమ్మిది రకాలైన వ్యాకరణాలు వుండేవి. వాల్మీకి రామాయణంలో ''ప్రోక్తం వ్యాకరణం నవం'' అని కొత్తదైన, తొమ్మిదవది అగు వ్యాకరణము చెప్పబడినదని వున్నది. ఆంజనేయస్వామివారికి నవ వ్యాకరణ పండితుడని ప్రసిద్ధి. అందులో ప్రస్తుతం మనదేశంలో శాశ్వతంగా నిల్చిపోయిన వ్యాకరణం ''త్రిముని వ్యాకరణం.'' దీనికి పాణిని, కాత్యాయనుడు, పతంజలి అని ముగ్గురు మునులు ప్రవర్తకులు.

అందు పాణిని వ్యాకరణ సూత్రములు రచించిన మహనీయులు. ఈయనకు లౌకిక విద్యలు గాని, వేదాధ్యయనము కాని సక్రమంగా రాని కారణంవల్ల, అప్పుడు చాల ప్రసిద్ధులగు వర్షుడు, ఉపవర్షుడు అను వ్యాకరణ పండితులవద్దకు విద్యాభ్యాసమునకై పంపబడిరి. కాని పాణినికి వ్యాకరణమునందునూ అంత అభిరుచి కలుగలేదు పాణిని తర్వాత చేరిన శిష్యులందరు విద్యాభ్యాసము పూర్తి చేసుకొని పోవడం చూచి వర్షుని భార్య పాణినిని నెమ్మదిగా పిలిచి, కరుణతో 'నాయనా! నీవు విద్యాభ్యాసమును మానుకొని ఈశ్వరారాధనయందు నిమగ్నుడవు కమ్ము' అని గురుకులము నుండి పంపివేసెను. అసలే గురుకులమునందభిరుచిలేని పాణినికి ఆ సలహా చాల సమంజసముగా తోచి హిమాలయ ప్రాంతమునందు పరమేశ్వరుని గూర్చి తపస్సుచేయ నారంభించెను. కొద్ది కాలములోనే భక్తవత్సలుడగు పరమేశ్వరుడు పాణినికి ప్రత్యక్షమై తన చేతనున్న ఢక్కను వాయించెను. ఆ ఢక్క నుండి వచ్చిన శబ్దములను ఆధారముగ చేసుకొని పాణిని మహర్షి, ఎనిమిది అధ్యాయములు కల్గిన సూత్రపాఠము, ధాతుపాఠము, గణపాఠము. పాణినీయ శిక్ష మొదలగు సర్వము వ్యాకణ శాస్త్రమున రచించిరి. ఈ వ్యాకరణము ఇతః పూర్వమువున్న ఎనిమిది వ్యాకరణముల కంటె చాల సులభముగ నుండుట వల్లను, పరమేశ్వరానుగ్రహమువలన అవతరించినందువలనను దేశం మొత్తం అతిత్వరలో వ్యాపించిపోయెను. దీనిని గాంచి అసూయ చెందిన కాత్యాయన మహర్షి పాణిని సూత్రములకు వ్యాఖ్యానము రాసెదనని ఆరంభించి కొన్ని సూత్రములను ఖండించివేసెను.

దీనిని చూచి చాల ఖిన్నులై పాణిని మహర్షి నీవు త్వరలోనే యముని పాలగుదువని శపించిరి. కాత్యాయన మహర్షియు చాల కోపావిష్టులై సూర్యోదయమునకు పూర్వమే నిన్ను సింహము చంపుగాక అని పాణినికి ప్రతి శాపమిచ్చి వెళ్ళిపోయెను. అట్లే ఇరువురును సూర్యోదయమునకు పూర్వమే చనిపోయిరి. ఈ విషయము పంచతంత్ర మందుగల,

''సింహో వ్యాకరణస్య కర్తు రహరత్
ప్రాణాన్ ప్రియాన్ పాణినేః''

అను శ్లోకముచే సూచింపబడుచున్నది.

కాలక్రమమున పాణిని వ్యాకరణము నశించుటను గాంచి దానిని పునరుద్ధరించుటకై ఆదిశేషులు పతంజలిగ చిదంబర క్షేత్రమునందు అవతరించి, పాణిని సూత్రములకు మహాభాష్యమును రచించిరి. సంస్కృత వాఙ్మయమందు గాని, ప్రపంచమందలి ఏ వాఙ్మయమందు గాని ఈ మహాభాష్యమునకు సరియగు మరో పుస్తకము కానరాదు. తక్కిన శాస్త్రముల భాష్యములకు శ్రీ భాష్యము, అణుభాష్యము, శాంకరభాష్యము అని పేర్లేగాని పతంజలి రచించిన వ్యాకరణ భాష్యమునకే మహాభాష్యమని రూఢి. "మహాభాష్యం వా పఠనీయం, మహారాజ్యం వా శాసనీయం" అను ఆర్యోక్తి జగద్విఖ్యాతమైనది. మహర్షి పతంజలి తన మహాభాష్యమును తానే శిష్యులకు బోధించుచుండిరి. వారి భాష్యపాఠమును వినుటకై దూరమైన హిమాలయ ప్రాంతములనుండి సైతము శిష్యులు వచ్చుచుండిరి.

ఒకరోజు మహర్షి పతంజలి నటరాజ ఆలయమున వేయికాళ్ళ మంటపమందు ప్రతి స్తంభముయొక్క సమీపమునందును ఒక్కొక్క శిష్యుని కూర్చొన నియమించి, తానును తెర వెనుక కూర్చొండి మహాభాష్యమును ఆదిశేష రూపముతోనే అనగా వేయి శిరస్సులు గల మహాసర్పరూపముతోనే శిష్యులకు బోధింపు చుండిరి. పాఠము జరుగునప్పుడు మధ్యలో ఎవ్వరును తెరతీసి చూడరాదని శిష్యులను ఆజ్ఞాపించియుండిరి. కాని "కృదతిఙ్" అను సూత్రమునకు భాష్యము చెప్పునప్పుడు కుతూహలముచే ఒక శిష్యుడు తెరను తొలగించగా తత్క్షణమే సహస్ర ఫణామండల మండితుడగు ఆదిశేషభగవానుని అత్యుగ్ర విషజ్వాలలచేత శిష్యులందరు భస్మీభూతులైరి.

దైవవశాత్తు పై సంఘటన జరుగుటకు కొలది క్షణములకు మునుపే ఒక శిష్యుడు దప్పికచేత నదీతీరమునకు వెడలి, దాహము తీర్చుకొని తిరిగివచ్చి తక్కిన శిష్యులు భస్మమైనదిచూచి మహాభీతితో గురువు పాదములపై పడెను. పాఠము పూర్తికాకమునుపు అనుమతి తీసుకొనక వెళ్ళినందులకు పతంజలి శిష్యునిపై కోపమువచ్చినను క్షమాపణ వేడుకొన్నందు వలన కరుణించి "బ్రహ్మరాక్షసుడవు కమ్మ"ని శపించి, తన వ్యాకరణమును ఒక బుద్ధిమంతుడగు శిష్యునికి చెప్పినచో శాపవిముక్తి కల్గునని చెప్పి అంతర్హితుడయ్యెను. వెంటనే ఆ శిష్యుడు బ్రహ్మరాక్షసుడై నదీతీరమందలి మఱ్ఱిచెట్టుపై నుండసాగెను. ఈ శిష్యుడే తర్వాత గౌడపాదాచార్యులని ప్రసిద్ధిచెందిన మహనీయులు.

ఆ కాలముననే కాశ్మీరు దేశమునకు చెందిన చంద్రశర్మయను నాతడు చిదంబరమందు వ్యాకరణపాఠము పతంజలి చెప్పుచున్నాడని విని తానును నేర్చుకొనుటకై దక్షిణ దేశమునకు బయలుదేరి గౌడపాదులుండు వటవృక్షమునకు చేరెను. గౌడపాదులవారు బ్రహ్మరాక్షస రూపముతోనే ఆ దారిన వచ్చువారిని "పచి ధాతువునకు నిష్ఠాప్రత్యయము వచ్చిన ఏమి రూపము?" అని ప్రశ్నించుచుండిరి. వారిలో "పక్తం" అని అశుద్ధరూపమును చెప్పినవారిని భక్షించుచుండిరి. చంద్రశర్మ చాల బుద్ధిమంతుడగుటవలన యోచించి పై ప్రశ్నకు "పక్వం" అని సరైన సమాధానము చెప్పెను. ఇందుకు గౌడపాదులు అమితమైన సంతోషము పొంది, చంద్రశర్మను దీవించి, అతనికి పతంజలి అంతర్ధానమైన విషయమును, తన శాపవిమోచన సంగతియు చెప్పి తానే పాఠము చెప్పుటకు సిద్ధముగా ఉన్నాననియు చెప్పెను.

చంద్రశర్మయు అందులకు సమ్మతించి చెట్టెక్కి మరో కొమ్మయందు కూర్చెండెను. భాష్యపాఠము ఆరంభమైనది. కాగితము, కలము మొదలగునవి లేవు కావున చంద్రశర్మ మఱ్ఱిఆకులమీదనే తన రక్తముతో పాఠములను వ్రాసికొనెను. ఇట్లు బ్రహ్మరాక్షసుడు తొమ్మిది రోజులు ఎడతెరపిలేక పాఠము బోధించి, చంద్రశర్మను దీవించి, తాను శాపవిముక్తుడై ఆ తరువాత తపస్సుకై బదరికాశ్రమమునకు వెళ్ళిపోయెను.

చంద్రశర్మ తొమ్మిది రోజులుగా నిద్రాహారములు లేకపోవుటవలన బడలిక చెంది గ్రామము బయటనున్న ఒక చెట్టుక్రిందకు చేరి, తాను తెచ్చుకొన్న ఆకులకట్టను తలక్రిందనే యుంచుకొని నిద్రించెను. అ సమయమున కొన్ని మేకలు వచ్చి ఆ ఆకులను కొన్నిటిని తిన నారంబించెను. అంతలో చంద్రశర్మ మేల్కొని జరిగిన అనర్థమునకు విచారించెను. ఇప్పటికిని మహాభాష్యమందు అచ్చటచ్చట ''అజాభక్షిత మేతత్'' (ఈ స్థలమునందు మేకలు భక్షించినవి) అని యుండుట మనము చూడవచ్చును.

తరువాత చంద్రశర్మ ఉజ్జయినీ నగరంలో స్థిరపడి గృహస్థాశ్రమమును స్వీకరించెను. అచ్చట అనేక శిష్యులను చేరదీసి వారిని వ్యాకరణ శాస్త్ర పారంగతులను చేయుచుండెను. ఇట్లు కొన్ని సంవత్సరములు గడిపి చివరకు తన గురువును దర్శించుకొనుటకై బదరికాశ్రమమును చేరెను. గురువు అనుగ్రహముపొంది సన్యాసము స్వీకరించి గోవింద భగవత్పాదులను పేరుతో తాను భాష్యపాఠము నేర్చుకొనిన వటవృక్షము క్రిందనే ఆశ్రమము నిర్మించుకొని, తపస్సు చేయుచుండెను. ఆదిశంకరులు పూర్ణానదియందు తనను మొసలి పట్టుకొనుటవలన తల్లి అనుమతిపొంది సన్యాసము స్వీకరించి గురువును వెదకుచువచ్చి గోవింద భగవత్పాదులను తన గురువుగ స్వీకరించెను. ఆతర్వాత ఆయనదగ్గర వేదాంతరహస్యములను తెలిసికొని వారణాసినిచేరి అచ్చట బ్రహ్మసూత్రములకు, ఉపనిషత్తులకు, భగవద్గీతలకు అత్యుత్తమ భాష్యములు రచించి, అద్వైతమతమును స్థాపించి జగద్విఖ్యాతులైరి.

వ్యాకరణసూత్రమును రచించినపాణినియు, భాష్యమును రచించిన పతంజలియు, దానిని ప్రచారముచేసిన గౌడపాద, గోవింద భగవత్పాదులును, అద్వైతమత ప్రవర్తకులగు భగవాన్ ఆదిశంకరులును భారతీయ సంస్కృతికి గావించిన మేలు చెప్ప నలవికానిది. వారు మనకు నిత్యస్మరణీయులు.

తద్యథామ్రే ఫలార్థే నిమితే ఛాయా గంధావనూత్పద్యతే
ఏవం ధర్మం చర్యమాణమర్థా అనూత్పద్యంతే.

మామిడిచెట్టు పండ్లకొఱకై మాత్రమే నాటబడిననూ దానినుండి చల్లనినీడయు మంచివాసనయు జనించునట్లు; ధర్మము చిత్తశుద్ధికై మాత్రమే ఆచరింపబడిననూ దానినుండి ఐశ్వర్యముకూడ కలుగును.

ఆప స్తంబుడు.

# వివేక వైరాగ్యాలు

## నిర్వికల్పానందస్వామి

చాలామంది సామాన్యంగా వేసేప్రశ్న: మనస్సును భగవంతునిమీదికి మరల్చటం ఎట్లా? అని. దానికి సంక్షేపంగా చెప్పవలసిన సమాధానం వివేక వైరాగ్యాలవల్ల అని.

ఇటు భక్తిశాస్త్రంగాని అటు జ్ఞానశాస్త్రం గాని మనకు తెలియపరిచేది: తెలిసికోవల్సింది ఒకటే ఉన్నదని. దాన్ని మన అభిరుచినిబట్టి భగవంతుడనిగాని లేక ఆత్మ అని గాని అనుకోవచ్చు. కాని, మన మనస్సు ఈ సద్వస్తువును వదలి తక్కినవన్నీ కావలి అంటుంది.

ఇల్లూ వాకిలీ గొడ్డు గోదా, ధన ధాన్యాలూ, పేరుప్రఖ్యాతులు, పాండిత్యము – ఇల్లా ఎన్నని చెప్పవచ్చును!

ఇవన్నీ ఉన్నా, ఇంకా ఎక్కువగా కావాలనే మనస్సు పీడిస్తూవుంటుంది. ఏడు ద్వీపాలకూ రాజైనవాడు తాను జయించకుండా వదిలిపెట్టిన ఎనిమిదోద్వీపం మరెక్కడైనా ఉందా అని తహ తహ పడ్తూ ఉంటాడు.

తెల్సుకోవల్సింది ఆ భగవంతుణ్ణి ఒకణ్ణే అని పరమార్థశాస్త్రాలు ఏకకంఠంగా ఘోషిస్తూ వుంటే, లౌకిక శాస్త్రాల్ని నేర్చుకొని అందులో ప్రావీణ్యతను సంపాదించే ప్రయత్నం మనకు అఖండంగా వుంటోంది.

"ఈశ్వర సాక్షాత్కారాన్ని పొందటానికి మనం ఎం. ఏ. డిగ్రీని సంపాదించటానికి పడ్డంత శ్రమకూడా పడనక్కరలేదు." అని ఒకసారి శ్రీ బ్రహ్మానందస్వామివారు అన్నారు.

ఇది ఆపాతదృష్టికి చిత్రంగానే వుండవచ్చు. పరభాష అయిన ఆంగ్లంలో సాధారణ జ్ఞానాన్ని పొందటానికి మనం ఎంతకాలాన్ని వినియోగిస్తున్నాము! ఐదో ఏట అక్షరాభ్యాసం ప్రారంభిస్తే ఇరవై ఐదో ఏట ఈ ఎమ్. ఏ. డిగ్రీ మనకు లభిస్తోంది.

ఇల్లా ఆబాల్యంగా ఇరవైఏళ్ళు భగవంతుణ్ణి ధ్యానించి, ఆదేరీతిగా మనస్సును ఆయన్ని ఆహ్వానించటంలో వినియోగించామని మనలో ఎందరు చెప్పగలుగుతారు.

లేక మన బంధువో స్నేహితుడో రోగశయ్యమీదవుండి చావుబ్రతుకులమధ్య తేల్తున్నప్పుడో, ఏదైనా వ్యాజ్యంలాంటి వ్యవహారాలు తటస్థించినప్పుడున్నా, లేక రాత్రి మేల్కొని వుండాల్సిన రైల్వేలాంటి ఉద్యోగాలు తటస్థమైనప్పుడున్నా అనాయాసంగా నిద్రను పారదోల్తున్నాం. ఇల్లా నిద్రారహితమైన రాత్రులను ఎన్నిటిని మనం భగవంతుడు కావాలంటూ గడిపాం? – అన్నదికూడా ఆలోచించి చూడవల్సిన విషయం.

'భగవద్విషయంగా ఇల్లాంటిది ఎందుకు తటస్థించదు?' అని మనం ప్రశ్నించిచూసుకొంటే, మనస్సు విషయాసక్తమై ఉందని తేల్తుంది. ఈ ఆసక్తి ఎంత తక్కువగావుంటే అంత సులభంగా భగవంతుడివైపుకి మనస్సు మొగ్గుతుంది. ఈ అనాసక్తిభావమే వైరాగ్యం.

ఈ వైరాగ్యం లభించటానికే సదసద్వస్తు విచారం ఉపాయం. ఏ వస్తువు స్థిరమైంది, ఏ వస్తువు అస్థిరమైంది అనే విషయాన్ని బాగా వితర్కించి చూడటంవల్ల, ప్రపంచం అంతా అనిత్యమని మనకు తెలియవస్తుంది.

ఎంత దిట్టమైన ఇంటిని కట్టుకున్నా భూకంపం వచ్చి దాన్ని ఒక్కనిముషంలో కూల్చి వేస్తుంది.

తరతరాలువారు అనుభవించాలని కూడబెట్టు కొన్న ధనం హారతి కర్పూరంలా హరించిపో తుంది. ఎంతో జాగ్రత్తగా కాపాడుకొంటున్న శరీరంలో ఏ వైద్యాలూ కుదర్చలేని వ్యాధి ప్రవే శిస్తుంది. ఆత్మీయులనుకొన్నవాళ్లే, శత్రువు లుగా మార్తారు. ఇది ప్రపంచస్థితి!

ఇల్లా ప్రపంచరీతిని విచారించి, అది అసద్వ స్తువని నిర్ణయించుకొన్ననాడే స్థిరమైన వైరాగ్యం కలుగుతుంది.

ఈ వైరాగ్యం కలుగగానే నిత్యవస్తువు కొఱకు ఆవేదన కలుగుతుంది, ఈ ఆవేదనే భగ వత్సాక్షాత్కార సూర్యోదయాన్ని సూచించే 'అరుణోదయం' అని పరమహంసులవారు చెప్తూ వుండేవారు.

కనుక, సంసార సముద్రంలోపడి కొట్టుకుపో తున్న జీవుడికి ఈ వివేక వైరాగ్యాలే కనుక లభిస్తే, 'ఇక ఫరవాలే'దని చెప్పవచ్చును.

మనశ్శాంతిని పొందుదామనుకొన్నవాళ్ళు ఈ వివేక వైరాగ్యాలనిమిత్తమే ప్రయత్నం చెయ్యాలి. వేదాంతదర్శన పఠనానికి అధికారి కాదలచుకొన్నవాడి కుండవల్సిన లక్షణాలలో, ఈ వైరాగ్యమొకటి అని పూర్వులు చెప్పారు. 'ఇహాముత్రార్థ ఫలభోగవిరాగం' అంటే ఈ వైరాగ్యమే.

## శ్రీ రామదాసు కాఠియా బాబాజీ

### చిర్రావూరు వెంకట్రావు

150 సంవత్సరాలకు పూర్వం అమృతసర్ జిల్లాలో నాచమారీ గ్రామానికి కొంచెం దూరంలోవున్న చెట్టుక్రింద ఒక స్వామీజీ కూర్చొనిఉండెను. ఆ చుట్టుపట్ల గ్రామాల వారేగాక దూరప్రాంతాల నుంచికూడ స్త్రీ పురుషులు తండోప తండాలుగావచ్చి స్వామీ జీని దర్శించి ఆశీర్వాదాలు పొందుతూ వుండే వారు. ఆయనగారి ఆశీర్వాదంవల్ల వచ్చిన వారికి శారీరక మానసికరుజలు నివారణమై మనశ్శాంతి లభిస్తూవుండేది. ఒక రోజున నాలు గేండ్ల బాలుడువచ్చి "మహారాజ్! ప్రతిరోజు దేశంలో అన్నివైపులనుంచి స్త్రీ పురుషులు గుంపులు గుంపులుగా వచ్చి మీ పాదాలకు నమస్కారం చేస్తున్నారు. వారా విధంగా రావడానికి మీలో వున్న గొప్పతనం ఏమిటి? మీ కింత శక్తి కలగటానికి కారణం ఏమిటి? అని ప్రశ్నించాడు.

స్వామీజీ : బిడ్డా! ఆశక్తికి కారణం రామ నామం. రామనామమే నన్నింత గొప్పవాడ్ని చేసింది.

బాలుడు : స్వామీ! రామనామం చేస్తే నేనుకూడ ఇంత గొప్పవా డ్నవుతానా?

స్వామి : అవునుబాబూ! రామనామం జపిస్తే నీవుకూడ ఇంత గొప్పవాడవు అవు తావు. దేశంలో నాల్గువైపులా నీ గొప్పతనం వ్యాపిస్తుంది. ఆబాలగోపాలం నిన్ను దర్శించి తరిస్తారు. నీకు శ్రీరాముని దర్శనం లభిస్తుంది. ఆయనలో లీనమైపోతావు—

బాలు : స్వామీ! అయితే ఈ క్షణంనుంచే రామనామజపం చేసాను.

స్వామి : ఓం. నాయనా! నీ దీక్ష ఫలిస్తుంది.

ఆ పిల్లవాడే పెరిగి పెద్దవాడై మహాత్మా రామదాస్ కాఠియా బాబాజీ అని లోకంలో ప్రసిద్ధి పొందాడు.

రామదాస్ తండ్రి పరమ నైష్ఠికుడు. తగిన సమయంలో కుమారునకు ఉపనయనం చేసి విద్యాభ్యాసంకోసం పొరుగూరిలో వున్న గురుకులానికి పంపించాడు.

రామదాస్ కుశాగ్రబుద్ధి కలవాడైనందున స్వల్పకాలంలోనే పాఠాలు వల్లించి తర్వాత ఏకాంతంగా ఒకచోట కూర్చొని రామనామ జపం చేస్తుండేవాడు. ఈ విధంగా పదిహేడు పద్దెనిమిది సంవత్సరాలు గడిచాయి. గురువుగారి వద్దనున్న విద్యంతా గ్రహించి ఇంటికి తిరిగివచ్చాడు. ఇంటికి రాగానే ఒక్క భగవద్గీత మాత్రం తీసుకొని మిగతా పుస్తకాలన్నీ కట్టగట్టి ఒకమూల వుంచాడు.

తర్వాత గాయత్రీ మంత్రసిద్ధికై యథావిధిగా మంత్రం జపించటం ప్రారంభించాడు. క్రమంగా ఒక లక్ష జపం పూర్తి అయింది. ఒకరోజున గాయత్రీదేవి ఆకాశమండలంలో ఆవిర్భవించి "వత్సా! నీవు మిగిలిన ఇరువది మూడులక్షల జపం జ్వాలాముఖిలో పూర్తి చేయుము" అని ఆదేశించింది.

రామదాస్ గాయత్రీదేవిని చూచి "తల్లీ! నీ బిడ్డనైన నా మీద నీవు సర్వదా కృపాదృష్టి నిల్పాలని ప్రార్థిస్తున్నా" అన్నాడు.

గాయత్రీదేవి "ఏవమస్తు" అని చెప్పి అంతర్ధానమైంది—

గాయత్రీదేవి ఆజ్ఞానుసారం రామదాస్ జ్వాలాముఖికి బయలుదేరాడు. మార్గమధ్యంలో నింబార్క సంప్రదాయానికి చెందిన స్వామీ దేవదాస్‌జీ అను మహానుభావుడు కనుపించారు. ఆయన ముఖంలో దివ్యతేజస్సు ప్రకాశిస్తు వుండినది. ఆ జ్యోతిర్మయ పురుషుని చూచి భయభక్తులతో సాష్టాంగ ప్రణామం చేయగా ఆ మహానుభావుడు రామదాసుని వినయ విధేయతలు చూచి శిష్యునిగా స్వీకరించి సన్యాస దీక్ష ఇచ్చారు

రామదాస్ తండ్రికి అది తెలిసింది. వెంటనే వచ్చి గురుదేవుని కాళ్ళపైబడి బ్రతిమాలి కొన్నాళ్ళపాటు పుత్రుడు తనవద్దనే వుండటానికి అనుమతి సంపాదించి తనవెంట బెట్టుకొని ఇల్లు చేర్చాడు. ఇంటి వాతావరణం తన సాధనలకు భంగం కలిగిస్తున్నదని గ్రహించి రామదాస్ ఒకరోజు ఇంటినుండి వెళ్ళిపొయ్యాడు. తిరిగి తన గ్రామానికి ఎప్పుడు వెళ్ళలేదు.

రామదాస్ ఇల్లు వదిలివెళ్ళి నప్పటినుండి తన గురుసేవలో నిమగ్నుడయి ఆయన ఆజ్ఞానుసారమే తన సాధనలు చేసికొనుచుండెను.

స్వామీ దేవదాస్‌జీ రామదాసుని చాలా కఠినపరీక్షలకు గురిచేశారు. ఒకసారి గురుశిష్యులు హిమాలయ పర్వతంమీదకు వెళ్ళారు. అక్కడ గురుదేవుని ఆజ్ఞానుసారం కుటీరంబైట రామదాస్ ఆసనంవేసుకొని సాధనలు చేస్తుండెను. చలిబాధ పోవుటకు నెగడుముందు కూచొని రాత్రులుకూడ ఆసనం వదలకుండ వుండెను.

ఒకరోజు రాత్రి రామదాసుకు కునుకుపట్టి గమనించక పోవటంవల్ల మంచు కురిసి నెగడు చల్లారిపోయింది–చలికి రామదాసుకు వణుకు పుట్టింది. మెల్ల మెల్లగా నరాలు కొంకర్లుపోవటం ప్రారంభించాయి. తిరిగి నెగడు వెలిగించి మంట చేయకపోతే శరీరం కొంకరపోయి రక్తం గడ్డకట్టి చావవలసి వస్తుందనుకున్నాడు. గురువుగారు ఏమంటారోనని భయం కలిగింది. చివరకు

సాహసించి కుటీరం దాపుకుపోయి బైట నిలబడ్డాడు. లోపలనుంచి గురుదేవులు "ఎవరక్కడ?" అని గద్దించారు.

"మహారాజ్! శిష్యుడు రామదాసు" అని జవాబిచ్చి చలిమంట ఆరిపోయిన కారణం విన్నవించుకున్నాడు.

గురువుగారు కోపంతో "రామదాసి! తల్లి దండ్రులను ఏడిపించి ఇల్లు వదలివచ్చింది నిద్ర పోవటానికా? ఈ రోజుకు నిప్పు తీసుకొనిపో, ఇంకెప్పుడు నిప్పు ఇవ్వబడదు. జాగ్రత" అని హెచ్చరిస్తు మండుతున్న కట్టెను బైటకు విసరివేశారు. రామదాసు దాన్ని తీసుకొని సెగడు వెలిగించుకొన్నాడు.

ఒకరోజున గురుదేవుడు అతన్ని కొండ మీదినుంచి దూకించారు. మరొకసారి వళ్లు హూనం అయ్యేటట్లు కొట్టారు. ఇంకొకసారి తాను ఎక్కడికో వెళ్లుతు తిరిగొచ్చేదాక ఆసనం వదలిపోవద్దని రామదాసుని ఆదేశించి వెళ్లిపొయ్యారు. ఆ పోవటం పోవటం తొమ్మిదో రోజు తిరిగి వచ్చారు.

స్వామీ దేవదాస్‌జీ ఈ విధంగా శిష్యుణ్ణి పరీక్షించి చివరకు వత్సా! నిన్ను పరీక్షించటం పూర్తయింది. గుర్వాజ్ఞ యథాతథంగా పాలించావు. నీవు ఈ శరీరంతోనే భగవత్ సాక్షాత్కారం పొందుతావు. అని చెప్పి అంతర్థానం అయినారు.

తర్వాత రామదాస్‌జీ కాలినడకతో ఎని మిదిసార్లు భారతదేశంలోవున్న పుణ్యస్థలాలు పవిత్రతీర్థాలు దర్శించారు. చివరకు భరతపురం సైలానీకుండంవద్ద భగవత్ సాక్షాత్కారం లభించింది. ఆ విషయాన్ని గురించి శ్రీ రామదాస్‌జీ ఈ విధంగా చెప్పారు.

"రామచంద్రుని గాంచెను రామదాసు
కోర్కె తీరంగ సైలాని కుండమందు
ఇట్టివార్తలు భక్తుల కింపుగూర్చు
నాస్తికులు వెక్కిరింతురు నమ్మలేక॥"

చివరిరోజుల్లో వారు తన జీవన్ముక్త జీవితాన్ని బృందావనంలో గడిపారు. కటిప్రదేశమందు కొయ్యలంగోటా కట్టుకొనటంవల్ల వారిని కాఠియా బాబాజీ అని పిల్చేవారు. మహాత్ములైన ఈ సాధువుయొక్క ప్రభావం చూచి అక్కడివారు ఆయన్ని తమ ప్రత్యక్షదైవం అని చెప్పుకొనేవారు.

శ్రీ రామదాస్ కాఠియా బాబాజీ ఒకరోజు తెల్లవారుజామున యోగాసనంపై కూర్చొని అస్థిరమైన శరీరాన్ని వదలి శాశ్వతానంద ప్రదమైన పరంధామాన్ని చేరుకొన్నారు.

దేవ, భూ, అంతరిక్ష-లోకములు, మనస్సు, ఇంద్రియములు-అన్నీ ఏ అక్షరబ్రహ్మమునందు కూర్చబడిఉన్నవో అట్టి సర్వాశ్రయమైన పరబ్రహ్మమే మీయొక్క, సకలప్రాణుల యొక్క నిజస్వరూపమై ఉన్నది. కాబట్టి సంకుచితభావములను, ప్రసంగములను; సంకుచిత దృష్టిని, నడవడికను వదలి మోక్షప్రాప్తికి రాచబాటయైన అఖండ ఆత్మజ్ఞానమును సంపాదించుకొనుడు.

—ముండకోపనిషత్తు.

# షోడశకళవిద్య

## సదాశివం

సమస్తజగత్తును పదునాలుగు భాగములుగా విభజించి, ఉపాసనార్థం వాటియందు బ్రహ్మదృష్టిని ప్రతిపాదించుటకు; ఆధ్యాత్మిక జీవనమున శ్రద్ధా తపస్సుల ఆవశ్యకతను ప్రదర్శించుటకును ఈ క్రింది ఆఖ్యాయిక ఛాందోగ్యోపనిషత్తున చెప్పబడినది.

సత్యకాముడు తల్లితో "అమ్మా నేను విద్యాగ్రహణనిమిత్తం గురుకులవాసం చేసెదను. నా గోత్రమేమిటో చెప్పి నన్ను పంపించుము" అన్నాడు. సత్యకామునితల్లి జాబాల ఇట్లా బదులుచెప్పినది

"నీ గోత్రమేదో నాకు తెలియదునాయనా. అతిథి అభ్యాగతులకు పరిచర్యలుచేస్తూ గృహకృత్యాలలోనే మునిగి ఉండి గోత్రాదులను మఱచిపోతిని. యౌవనంలో నాకు నీవు జన్మించితివి. తరువాత కొన్నాళ్ళకే నీతండ్రి దివంగతులైరి. అప్పటినుండి నేను అనాథనైతిని. నాపేరు జాబాల. నీపేరు సత్యకాముడు. గోత్రాదుల ప్రసక్తివచ్చిన సత్యకామ జాబాలుడన"ని చెప్పుము.

హారిద్రుమతుని పుత్రుడైన గౌతముని సత్యకాముడు సమీపించి తనను శిష్యునిగా గ్రహించమని వేడుకొనెను. 'నీ గోత్రమేమి?' అని గౌతముడు ప్రశ్నించగా సత్యకాముడు తల్లి తనకు చెప్పినది సమస్తమూ అల్లేపాఠము ఒప్పజెప్పునట్లు నిస్సంకోచముగా, నిర్భయముగా చెప్పివేసెను.

గౌతముడు ఆశ్చర్యచకితుడై ఇట్లనెను. 'ఋజువుగా, సత్యముగా పలికితివి. నీవు బ్రాహ్మణుడవు. నిన్ను శిష్యునిగా స్వీకరించెదను. సమిధలు తీసికొనిరమ్ము. ఉపనయన సంస్కారములు కావించెదను.'

ఉపనయనము జరిగినవెంటనే గౌతముడు గోశాలనుండి కృశించిన నాలుగువందల గోవులను విడిపించి సత్యకామునికి అప్పగించెను.

'ఈ నాలుగువందల గోవులు వేయి అయినప్పుడే తిరిగివచ్చెదను' అని ప్రతిజ్ఞచేసి సత్యకాముడు గోవులవెంబడి అరణ్యమునకు బయలుదేరెను.

పచ్చిక, నీరు పుష్కలముగా ఉన్నటువంటి, క్రూరమృగములబాధ లేనటువంటి అరణ్యప్రదేశములందు గోవులను అతిశ్రద్ధతో సత్యకాముడు పాలన చేయుచుండెను. తన సుఖమును పూర్తిగా ఉపేక్షించి అతడు గోవులను తన స్వంతబిడ్డలవలె పాలన చేయుచుండగా కొన్నిసంవత్సరములు గడచినవి.

శ్రద్ధాతపస్సులచే సత్యకాముని అంతఃకరణము పరిశుద్ధమై, ప్రసన్నమై, జ్ఞానగ్రహణయోగ్యమై ఉండుటను దిక్సంబంధినీ దేవత అప్పుడు తెలిసికొని అతనిని అనుగ్రహించుటకుగా ఒక ఋషభమును ప్రవేశించినదై సత్యకాముని సమీపించి ఇట్లనెను.

'ఓ సత్యకామా! ఇప్పుడు మేము వేయి సంఖ్యకు వచ్చితిమి. నీ ప్రతిజ్ఞ నెఱవేఱినది. ఇక మమ్ములను ఆచార్యకులమునకు చేర్చుము. నేను నీకు బ్రహ్మముయొక్క ఒక అంశమును ఉపదేశించెదను వినుము. తూర్పు, పశ్చిమము, ఉత్తరము, దక్షిణము—ఈ దిక్కులు బ్రహ్మముయొక్క అంశమే. వేఱుకాదు. దిక్కులమయంగాఉన్న బ్రహ్మమునకు 'ప్రకాశవాన్'

అని పేరు. 'ప్రకాశవాన్'గా బ్రహ్మమును ఎవరు ధ్యానించెదరో వారు లోకమున ప్రఖ్యాతి వంతులగుదురు. రేపటిసాయంకాలమున అగ్ని దేవుడున్ను నీకు ఉపదేశించగలడు.'

మఱునాడే సత్యకాముడు గోవులను ఆచార్య కులమునకు మరలించెను. సూర్యాస్తమయము కాగా గోవులు పరస్పరము అభిముఖములై ఎక్కడ నిలిచినవో-అక్కడనే వాటిని విశ్రమింపజేసి సత్యకాముడు అగ్నికి అభిముఖముగా ఆసీనుడై దిక్ దేవత చెప్పినట్లుగా ధ్యానించుచుండెను. అప్పుడు అగ్నిదేవత సత్యకాముని ఉద్దేశించి ఇట్లు చెప్పెను.

'ఓ సత్యకామా! బ్రహ్మముయొక్క ఒక అంశమును నానుండి వినుము. ఈ భువి, అంతరిక్షం, దివి, సముద్రము - బ్రహ్మముయొక్క అంశమై ఉన్నవి. వేఱుకావు. ఈ అంశమునకు 'అనంతవాన్' అని పేరు. 'అనంతవాన్'గా బ్రహ్మమును ఎవరు ధ్యానించెదరో వారు అనంతులగుదురు. రేపటిదినము 'హంస' నీకు మఱొకఅంశమును బోధించగలదు.'

మఱునాడు సాయంకాలము ఆదిత్యుడు ఆవేశించిన 'హంస' ఒకటి సత్యకాముని సమీపమున వ్రాలి ఇట్లనెను.

'ఓ సత్యకామా, అగ్ని, సూర్య, చంద్ర విద్యుత్ రూపములతో బ్రహ్మమే ప్రకాశించుచున్నాడు. ఈవిధముగా వెలుగుచున్న బ్రహ్మముయొక్క అంశమునకే 'జ్యోతిష్మాన్' అని పేరు. 'జ్యోతిష్మాన్'గా బ్రహ్మమును ఎవరు ధ్యానించెదరో వారు తేజోవంతులై ఉందురు. రేపటిదినము 'జలచరపక్షి' ఒకటి నీకు మఱొక అంశమును ఉపదేశించగలదు.'

మఱునాడు సాయంకాలమున ప్రాణదేవత ఆవేశించిన 'జలచరపక్షి' సత్యకాముని సమీపించి ఇట్లనెను.

'ఓ సత్యకామా, జీవుని ఫలభోగ ఆశ్రయమైన దేహములో ఉన్నటువంటి ప్రాణము, చక్షువు, శ్రోత్రము, మనస్సు బ్రహ్మముయొక్క అంశమే. దేహములో ఈవిధముగా వెలయుచున్న బ్రహ్మముయొక్క అంశమునకు 'ఆయతనవాన్' అని పేరు. 'ఆయతనవాన్'గా బ్రహ్మమును ఎవరు ధ్యానించెదరో వారు ఆశ్రయవంతులై ఉందురు.

ఇట్లు నలుగురు దేవతల అనుగ్రహమును పొందినవాడై సత్యకాముడు చివరకు ఆచార్యకులమును చేరెను.

శిష్యుని ప్రసన్నముఖమును ప్రహసిత వదనమును. సహజ వినయ గాంభీర్యములను చూచి గౌతముడు విస్మయ అహ్లాదభరితుడై 'సత్యకామా! బ్రహ్మజ్ఞానివలె దివ్యముగా భాసించుచున్నావు. ఎవరు ఉపదేశించిరి నీకు' అని అడిగెను.

'భగవాన్! మీ శిష్యుడైన నన్ను అనుశాసించుటకు, బోధించుటకు మానవమాత్రులెవరు సాహసించగలరు? దేవతలే నాకు ఉపదేశించిరి. ఆచార్యులనుండి గ్రహించిన విద్యయే సాధుతమమని మీవంటి ఋషీశ్వరులు చెప్పగా వినియున్నాను. కాబట్టి గురుదేవా! మీరే నాకు విద్యను అనుగ్రహించవలసినది' అని సత్యకాముడు వినయభరితముగా విన్నవించుకొనెను.

గౌతమాచార్యుడు సత్యకామునియెడల పరమప్రీతుడై నలుగురు దేవతలు చెప్పిన షోడశకళ విద్య'నే అతనికి మరల ఉపదేశించెను. అందులో ఒక అంశమైననూ వదలిపెట్టలేదు. వదలిపెట్టలేదు.

# కౌసల్య

యామజాల పద్మనాభస్వామి

'వేద వేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా.'

వేదాలుమాత్రం తెలుసుకునే పరమ పురుషుడు దశరథుని కొడుకై అవతరించగా వేదాలు సత్యలోకములో ఉండలేక వాల్మీకినోట రామాయణమనే పేరుతో అవతరించాయి. ఆ పరమ పురుషుని కన్నతల్లి కౌసల్య. ఒక బిచ్చగాడు నేను పది పన్నెండేండ్ల వయస్సులో ఉన్నపుడు మా యింటిముంగిట నిల్చి ఒకపాట పాడేవాడు. ఆ పాట నాలుగు చరణాలూ పూర్తిగా పాడిన తరువాతనే నేను బియ్యం వాడి జోలెలో వేసేవాడను. ఆ పాట ఇది:—

ఎన్నినోములు నోచెనో కౌసల్యాదేవి
ఎన్ని దానము లిచ్చెనో ఎన్నినోములు నోచె
ఎన్నిదానము లిచ్చె కన్నతండ్రీ అని కౌగలించుటకు॥ ఎ॥
పాలు బువ్వ పెట్టి పంచదారను వేసి
జోలపాటలు పాడి జోకొట్టి లాలింప ॥ఎన్ని॥

ఇది ఏభై ఏండ్లక్రిందటి మాట. మిగతా రెండు చరణాలూ జ్ఞప్తిలో లేవు. లేకపోవుగాక. ఉదాహరించిన రెండు చరణాలలో కౌసల్యాదేవి మాతృత్వ సౌభాగ్యం మహిమోపేతంగా మనకు ప్రత్యక్షమవుతూంది. అలాటి అదృష్టవంతురాలు అయినతల్లి మళ్లీ ద్వాపరయుగములో దేవకి ఒక్కతెయే. కారణం? ఆమెకూడా పరమపురుషుని కన్నతల్లి అయింది కనుక...ఇక్కడ ఈ తల్లీ కొడుకుల జననాంతర సౌహృద్యం తెలుసుకోనడం ఆవశ్యకం.

పృశ్ని, పృశ్నిగర్భుడు అనే మునిదంపతులు. వనములో నివసిస్తూ కాలక్షేపం చేస్తూన్నారు. ఒకనాడు పృశ్ని అడిగింది భర్తను. 'మనం కఠోర నియమాలతో శ్రీహరినిగూర్చి తపస్సుచేసి మోక్షం పొందుదాము' అని. 'అలాగే చేద్దాము'-అన్నాడు పృశ్నిగర్భుడు. రోజూ నియతంగా స్వీకరించే కందమూలాలు విడిచిపెట్టారు కొంతకాలం జలంమాత్రమే ఆహారం...క్రమంగా అదికూడా త్యజించారు. వాయుభక్షణతో గడిపారు కొన్నాళ్లు. క్రమేణ అదికూడా విడిచారు. కొంతకాలానికి శల్యమాత్రా వశిష్టులయారు...

ఒకనాటి బ్రాహ్మీముహూర్తం. శంఖచక్రగదాపద్మధరుడు, పీతాంబరుడు, నీలమేఘశరీరుడు, భక్తజనరక్షాదక్షుడు. పుండరీకాక్షుడు, దివ్యభూషణుడు మధురభాషణుడు ప్రత్యక్షమయాడు. మునిదంపతులు అల్లల్లన కనులు విప్పి చూశారు. విశ్వమోహనమూర్తియై ఎట్టయెదుట నిల్చిఉన్న వనమాలిని చూసి తమ్ము తామే నమ్మలేకపోయారు. అలాగే కన్నులు మూసుకున్నారు. వెంటనే తెరచిచూశారు. చిగురాకువంటి పెదవిపై చిరు మల్లెపువ్వులాగ దరహాసం మెరుస్తూంది. మోహనాంగుడైన శ్రీహరి 'మీ తపస్సుకి మెచ్చాను. ఏమి కోరినా ఇస్తున్నాను నిస్సంకోచంగా కోరుకోండి' అన్నాడు. ఆ పుణ్యదంపతులు ఏమి కోరుకోవాలో తెలియక రెప్పవాల్చక అలా చూస్తూ నిల్చున్నారు. కొంతసేపటికి పృశ్ని ప్రభూ! నాకోరిక మనవిచేసేదా అని మధురస్వరముతో అడిగింది. 'తప్పక చెప్పవచ్చు. తీరుస్తానమ్మా సందేహించకు' - అని అన్నాడు శ్రీహరి. 'అదిగో అమ్మా అని అన్నావు కదూ! అదే నా కోరిక. నాకు కొడుకువై పుట్టాలి' అని కోరింది. - హరి పృశ్నిగర్భుణ్ణి చూసి 'మునిచంద్రా! ఏమంటావు? అని అడిగాడు. 'ఏమనేది? కోరిందిగా యీమె.' నరుడగా మూడు జన్మలలో మాకు కొడుకువై పుట్టు -

అని అన్నాడు ముని. సరే – అలాగే కానీ యండి. మీరు నా సుందరరూపం చూసి మోహపడి నన్ను కొడుకుగా పుట్టాలని కోరు కున్నారు. మీ అసలుకోరిక మోక్షం. మూడు జన్మలు అయాక మీకు మోక్షం యిస్తాను... అని అంతర్ధాన మయిపోయాడు.

మునిదంపతులు ఏదో మాయానాటకం చూసినట్టు కొంతసేపు ఆశ్చర్యంగా అలా చూస్తూ యీ లోకానికి వచ్చారు. సరే కానీ సర్వేశ్వరుడికి తల్లిదండ్రులమయే అదృష్టం పట్టింది...అని సంతోషిసూ కొంతకాలానికి తనువులు చాలించారు.

మొదటి జంట అదితి కశ్యపులు. శ్రీహరి వారిగర్భాన వామనుడై పుట్టాడు.

రెండవజన్మ కౌసల్యా దశరథులు. వారి నోములపంటగా శ్రీహరి రాముడై జన్మించాడు

మూడవ పుట్టువు దేవకీవసుదేవులు. హరి వారి ముద్దులబిడ్డడై కృష్ణుడు అనే పేరుతో దుష్టశిక్షణా శిష్టరక్షణా చేశాడు. ఇదే వీరి జన్మరహస్యం...

భూలోకములో కౌసల్య దివ్యమాత అయిం దంటే అతిశయోక్తి ఏముంది?

పూర్వజన్మ సంస్కారంగల బుద్ధిమంతు రాలు కౌసల్య.

'సత్యం తపః, ధర్మం తపః, స్వాధ్యా యస్తపః' అనే నిర్వచనానికి ప్రథమో దాహరణం కౌసల్య. సామాన్య స్త్రీ ధర్మా న్ననుసరించి కొడుకు కలగాలని ఎన్ని నోములో నోచింది. ఎన్ని దానాలో చేసింది. అవన్నీ ఫలించి జగన్నాథుడు కొడుకుగా పుట్టాడు, తరించాననుకున్నాది. చిన్నారిరాముడు ఎంత వేగం పెరిగి పెద్దవాడవుతాడా? గృహస్థు అవుతాడా? రాజ్యాధిపతి అవుతాడా? అని కాలచక్రభ్రమణమును చూస్తూఉంది. విద్యా వంతుడయాడు బుద్ధిమంతుడని అందరి మన్న నలూ అందుకున్నాడు. సీతాదేవి అర్థాం గిగా వచ్చింది. ఇక రాజ్యాధికారి కావాలి. తాను రాజమాతగా నలుగురిలో మన్నన పొందాలి. ఆ ఒక్క కోరికా నెరవేరేసమయం రానేవచ్చింది. అమ్మయ్య! నా కన్న తండ్రి పట్టాభిషిక్తు డవుతాడు. త్వరగా కావాలి, కావాలి – నిర్విఘ్నంగా అది జరగాలి అని ఇష్టదేవతా సమర్చన చేస్తూంది అంతఃపుర ములో.

రాజవుతాడని వెయ్యికళ్లతో ఎదురు చూస్తూన్న తల్లిదగ్గరకు ఆ కొడుకు వచ్చి 'అడవికి వెళ్లుతూన్నానమ్మా! ఆశీర్వదించి ఆనందంగా పంపు – అని నమస్కరించాడు.

హా హతాస్మి – అని కత్తివ్రేటుకి కదలి లాగా కౌసల్య దబ్బున నేలపై కూలింది. కొంతసేపటికి తెలివి వచ్చింది. లేచింది. కన్న తండ్రీ! చిన్నారి రామన్నా! అడవికి వెళ్లడ మేమిట్రా?

ఔనమ్మా! నేను పద్నాలుగేళ్లు వనవాసం చెయ్యాలి. భరతుడు రాజ్యమేలాలి. పిన్నమ్మ కోరిన వరాలివి. నాయనగారు ఇచ్చారు. రేపో నేడో భరతుడు తాతగారింటినుంచి వస్తాడు. పట్టాభిషిక్తు డౌతాడు.

అమ్మా! నాయనగారికి 'సత్యసంధుడు' అని అసాధారణమైన బిరుదు ఉంది. దానిని కాపాడడం కుమారుడనైన నా విధి. రాజ్యం పై తృకంకాదు. వంశ పరంపరయా వస్తూంది. దానిని నిలపవచ్చు. వదులుకోవచ్చు. కాని సత్యవ్రతపాలన అనే పైతృకమైన ఆ స్తిని, నేను వమ్ము చెయ్యలేను. కనుక ఆయనను

సత్యవ్రత పాలకుణ్ణిగా లోకానికి చాటడం ఆవశ్యకం. ఆయనమాట కాదనడం నావంటి వాడికి తగదు. అన్నీ తెలిసినదానవు నువ్వు. ఋజుబుద్ధితో ఆలోచించు. కన్నీరు కార్చక ఓర్చుకో. ఈ పద్నాలుగేళ్లూ ఇట్టే గడిపి వస్తాను. రాజు నవుతాను. మరేమీ అనకు. దీవించిపంపు – అని కొంచెం వివరంగా అన్నాడు. ఆ తల్లి ఓర్చుకోలేకపోయింది. ఆ పరిస్థితిలో ఆ తల్లేకాదు. ఏ తల్లీ ఓర్చుకోలేదు.

'యది పుత్రః నజాయేథాః మమ శోకాయ రాఘవః
నస్మ దుఃఖ మతో భూయః పశ్యేయ మహమప్రజాః'

'ఏక ఏవహి వంధ్యాయాః శోకో భవతి మానసః
అప్రజాస్మీతి సంతాపః నహ్యన్యః పుత్రః విద్యతే'

నాయనా! రాఘవా! నువ్వు పుట్టకపోతివా నాకీ దుఃఖం లేకపోయేదిరా.

నన్నేడిపిస్తున్నావు. నువ్వుపుట్టి యీ లాగు అవడంకన్న నాకు పుట్టక ఉంటే యింత దుఃఖం లేకపోను.

సంతతి లేకపోయిందే–అనే దుఃఖం ఒకటే. అంతకుమించి మరేలాటిసంతాపమూ ఉండదు. ఇప్పుడు నా బ్రతుకు అధ్వాన్నమయిపోయింది.

'నదృష్టపూర్వం కళ్యాణం సుఖం వా పతిపౌరుషే
అతి పుత్రే విపశ్యేయం ఇతిరామః మయాస్థితమ్'

ఉన్నది ఉన్నట్టు చెప్తున్నాను విను రామా! నేను నీ తండ్రికి పెద్దభార్యను అనేది పేరుకే, అంతవాణ్ణి చేపట్టి యింతి యింటికి వచ్చినా నేటివరకూ సుఖమంటే ఏమిటో ఎరగను. సరే యింతకాలానికి నా వరాలమూట కొడుకు పుట్టాడు. వీడివల్లనే నా సంసారజీవితములో సుఖమంటే ఏమిటో అనేది అనుభవిస్తానని గంపెడాసతో బ్రతికిఉన్నాను. ఆ ఆశకూడా అడియాస అయింది.

'అపశ్యంతీ తవ ముఖం పరిపూర్ణ శశి ప్రభం
కృపణా వర్తయిష్యామి కథం కృపణ జీవికామ్'

రాజ్యంవద్దు, భోజ్యంవద్దు. నన్ను కనిపెట్టు కని నా కంట పడుతూఉంటే అదే చాలు. పున్నమ చందమామలాటి నీ ముద్దుమోము చూస్తూ తృప్తిగా జీవితం వెళ్లిద్దామను కున్నాను. అదికూడా కాదా? నిన్ను చూడ లేక దౌర్భాగ్యజీవితం ఎలా గడుపుతాను రామచంద్రా!

రాజ్యం భరతుడికి చెందితే చాలుకదా! నువ్వు అడవికి వెళ్లడం ఎందుకూ? ఇక్కడే ఉండు. నా కంటపడుతూ ఉండు. అదే నాకు చాలును; అన్నట్టు తల్లిమాట గ్రహించాడు. అది అసాధ్యం అన్నాడు కొడుకు.

'త్వయా మయా చ వైదేహ్యా లక్ష్మణేన సుమిత్రయా
పితుర్నియోగే స్థాతవ్యం ఏషధర్మ స్సనాతనః'

అమ్మా! ప్రాకృత కాంతలాగు మాట్లాడు తున్నావు. నువ్వు, నేను, సీత, లక్ష్మణుడు, పినతల్లి సుమిత్ర నాయనగారి శాసనము ననుస రించి ప్రవర్తించవలసిందే. ఆలాగు ప్రవర్తిం చడమనేదే సనాతనధర్మం.

నువ్వు, పినతల్లి సుమిత్ర పతిశాసనానికి కట్టుపడిఉండాలి.

నేను, లక్ష్మణుడు పితృశాసనమునకు బద్ధుల మయి ఉండాలి.

సీత మామగారిమాట జవదాటకూడదు.

మానవ జీవితధర్మాలు తెలిసిన పెద్దల మాటలివి. నీకు తెలియనివికావు. ఈ ధర్మ మును కోసలరాజపుత్రివై, దశరథపత్నివై, ననుగన్న తల్లివై అతిక్రమించడం అధర్మం.

ఇంకేమనాలి? ఆలోచించింది కౌసల్య. గట్టి మాట అన్నది.

'యద్యైవ తేపుత్ర! పితా తథాహం
గురు స్స్వధర్మేణ సుహృత్తయా చ
న త్వానుజానామి నమాం విహాయ
సుదుఃఖితా మర్హాసి పుత్ర! గంతుమ్'

నాయనా! మంచిదే. నువ్వు చెప్పినది సనాతనధర్మమే. ఆదేవిధంగా నే నంటూన్న మాట విను. స్వధర్మమును, నీ మేలునుకోరి ప్రవర్తించడములో నీకు మీ నాయన ఎట్టి పూజ్యుడో కన్నతల్లినైన నేనూ ఆలాటి పెద్ద దాననే. కనుక నా మాటను కాదనకూడదు కదా! ఏమిటది! ఈ లాగు ఏడుస్తూన్న నన్ను విడిచి నువ్వు వెళ్లిపోవడం తగదు. తండ్రికన్న తల్లి ఎక్కుడు-అనే సనాతనధర్మమును బోధించిందన్నమాట కౌసల్య. ఈ మాటకి చక్కని లోకస్వభావమును వివరించింది.

'కథం హి ధేనుఃస్వంవత్సం గచ్ఛంతమను గచ్ఛతి
అహంత్వాను గమిష్యామి యత్రవత్సగమిష్యసి.'

నిన్ను విడిచి నేను క్షణమైనా బ్రతికి ఉండలేను. నన్ను నీతో తీసుకొనివెళ్లు. అని కొడుకుతో అడవికి వెళ్లడానికి నిశ్చయించుకున్నది. తండ్రిమాట జరుగవలసిందే. నేను అడవి వెళ్లకతప్పదు అనే కొడుకు నిర్ణయాన్ని కాదనలేకపోయింది. సనాతనధర్మం తెలియని ఇల్లాలు కాదామె. కనుక పుత్రవాత్సల్యం ఊతగా కానక కన్న సంతానం కాన కొడుకుతో కానకు పోవాలనుకొన్నది.

దూడవెంట ఆవు వెళ్లడం లోక సామాన్య రీతి కనుక నువ్వు ఎక్కడకు వెళ్లితే నేనూ అక్కడకే వస్తానని తన మాటను వత్స శబ్దంతో బలపరచుకున్నది.

అయితే అన్నిధర్మాలూ రాశిపోసినట్టున్న ఆ సుగుణాభిరాముడు రాముడు అందుకు అంగీకరిస్తాడా? నహి!

ఏమిటమ్మా నీ ఆరాటం!

'భర్తుః కిల పరిత్యాగః నృశంసః కేవలం స్త్రియః
సభవత్యా నకర్తవ్యః మనసాపి విగర్హితః.'

భర్తను విడిచిపెట్టడం అనేది స్త్రీకి పరమ నికృష్టమైన పద్ధతి. నీవంటి ధర్మశీల ఆలాటి నీచకృత్యం మనసాకూడా ఆచరించరానిది. ఒప్పనిపనికి తలపెట్టక ధర్మవిరుద్ధపద్ధతని నడువక నన్ను దీవించి పంపుమమ్మా! అన్నాడు ఆ ఆదర్శ పూర్ణపురుషుడు. కాదనలేక పోయింది. స్వస్తివాచనం పలికింది. సచరాచర పదార్థకోటిని ప్రత్యక్ష పరోక్ష భూత సముదాయమును పేరు పేరునా చెప్పి వనవాసములో తన తనయుని కాపాడవలసిందని అభ్యర్థించింది. ఆ మంగళాశాసనం అంతా కౌసల్య ఆత్మశక్తికి ప్రతిరూపమే. చివరగా ఒక్క మాట అన్నాది.

'సర్వలోక ప్రభుర్బ్రహ్మా భూతభర్తా తథర్షయః
యేచశేషా స్సురా స్తేతు రక్షంతు వనవాసినమ్.'

సర్వలోకప్రభువు, సర్వ భూతపతి అయిన సర్వేశ్వరుడూ, సర్వశక్తి సంపన్నులైన ఋషులూ, ఇంకా నాస్తుతికీ, మతికీ అందక మిగిలియున్న అమరులూ వనవాసివైన నిన్ను రక్షింతురుగాక!

సర్వలోకేశ్వరుణ్ణి కోరింది. అమాయకంగా ఆమె అలాగనలేదు. ఆయనకుకూడా మేల్కొలుపుపాడే ఆత్మశక్తి ఆ తల్లికి ఉన్నది. ఈ మంగళాశాసనమే రామునకు వనవాససమయములో అంగరక్షా కవచమయింది.

రాముడు అడవికి బయల్దేరాడు. వెంటనే సీతకూడా ఉన్నాది. అత్తా! వెళ్లివస్తానన్నది. దగ్గరగా తీసుకుని ఆ అత్తగారు ముద్దుకోడలితో ముచ్చటగా మూడు మాటలాడింది. అమ్మా! ఇంతవరకూ నా కొడుకు ధనవంతుడు ఈ నాటినుంచి వనవాసి. నువ్వు చులకనగా చూడ కూడదు.

'స్త్రీణాం పవిత్రం పరమం పతిరేకో విశిష్యతే'

స్త్రీలకు పరమపవిత్రమైన విశిష్టపదార్థం పతి. పతికి బాధకంగా ప్రవర్తించకూడదు. అన్నీ సర్దుకుంటూ వనవాసం చేసి సుఖంగా మా రామన్నతో తిరిగిరా చిన్నారి సీతమ్మా! అన్నది. మరి, దశరథునితో ఆమె,

'గతిరేకా పతిర్నార్యాః ద్వితీయా పతిరాత్మజః
తృతీయా జ్ఞాతయో రాజన్! చతుర్థీ నేహ విద్యతే'
'తత్రత్వం చైవ మే నాస్తి రామశ్చ వనమాశ్రితః
న వనం గంతు మిచ్ఛామి సర్వథా నిహతాత్వయా.'

ఇల్లాలికి భర్త ప్రధానమైన గతి. సుతుడు రెండోపక్షం. జ్ఞాతులు మూడోదారి. వీరిని తప్పించి మరీ గతిలేదు. ఈ పద్ధతి నా జీవితానికి విరుద్ధమైపోయింది ప్రభూ! నువ్వు నాకు కాకుండా అయిపోయావు. కన్నకొడుకు అడవికి వెళ్లిపోయాడు. జ్ఞాతుల నాశ్రయించే దుర్గతి నాకు లేదు. అది నాకు అంగీకార్యమూ కాదు. సతీధర్మము ననుసరించి నిన్ను విడిచి కొడుకుతో అడవికి వెళ్లలేకపోయాను. అన్నివిధాలా నీ వల్ల నా గతి అధోగతి అయిపోయింది. సర్వ రాజ సంస్తూయమానుడవు పతివైనా సర్వభూత హితుడైన రాముడు సుతుడైనా నేను గతిలేని దాననయాను. అని ఆమె విచారించడం లోక సామాన్యమయిన మాతృత్వ మర్యాదకి పై పూతగా పరిగణించడం సముచితమని నేను భావిస్తాను.

యమదేవా! సంపద ఎంత కావలెనో అంత కోరుకో అని నన్ను ప్రలోభపెట్టు చున్నావు – కాని అవి రేపటివఱకు ఉంటాయో ఉండవో అని సందేహపడదగినంత అస్థిరములు గదా! ఈ అప్సరసలతో ఆనందించమంటున్నావు. ఈ ఆనందించడమనేది ఏమిటి? ధర్మమును, బలమును, ప్రజ్ఞను, తేజస్సును, యశస్సును హరింపజేసుకోవడమేగదా! దీర్ఘాయుస్సును ఇచ్చెద నంటున్నావు, మీ ప్రభువైన బ్రహ్మదేవుని ఆయుస్సు సహితము (8640000000 × 360 × 100 = సంవత్సరములు) అల్పమే కదా! ఇక మనలాంటివారి దీర్ఘాయుస్సు ఎంత! కాబట్టి వస్తువాహన ములు, ఈ అప్సరసలు, వీరి నృత్యగీతములు అన్నీ మీదగ్గరే ఉండనీ. నేను మిమ్ములను కోరు చున్నది ఇది. ధర్మాధర్మములకు, కార్యకారణములకు, కాలత్రయమునకు – అతీతమైన పరమ తత్త్వమును గుఱించిన ఉపదేశము.

-నచికేతుడు.

# బాలల శారదాదేవి

బి. ఎస్. ఆర్. ఆంజనేయులు

## విద్యాభ్యాసము

శారద పల్లెటూరిలోనే పెరిగి పెద్దదవుతూ వచ్చింది. వీధిబడిలోకే పలకా బలపం తీసుకొని కొన్నిసార్లు వెళ్లింది. కాని చదువు సాగలేదు. పెద్దకూతురు కావటంవల్ల యింట్లో పనులు ఎక్కువ. బడికిపోయి నేర్చుకున్నదే చదువు అని మీరు అనుకోవద్దు. మన భారత దేశంలో పుస్తకాలు చదువకుండానే ఎందరో గొప్పవారైనారు. తరతరాలనుండి అలా వస్తూనే వుంది. రామకృష్ణుడు యిప్పటి చదువును "పొట్టకూటి చదువు" అన్నాడు. ఆయన ఏ గ్రంథాలు చదువలేదు. కాని, పెద్దపెద్ద కాలేజీ చదువులు చదివినవాళ్లు, పండితులుకూడా ఆయనదగ్గర కూర్చుండి నేర్చుకున్నారు. చదువురాని మన శారదను ఆయన 'సరస్వతి అవతారం' అని చెప్పాడు. కారణమేమంటే చదువువల్ల యేది వస్తుందో అది ఆమె యివ్వగలదు.

శారదకు చదువు అసలేరాదని మీరు అనుకోవద్దు. ఆమె స్వంతంగా నేర్చుకొని పుస్తకాలు చదివేది; మన పురాణాలలోని కథలు మొదలైనవన్నీ వీధినాటకాల ద్వారాను, తల్లి దండ్రులవద్దను తెలుసుకున్నది. ఆమె సోమరిగా ఎప్పుడూ వుండేది కాదు. పొలానికి పోయి ఆవులకు గడ్డి కోసేది, మోపుకట్టి మోసుకువచ్చేది. పొలంలో పనిచేసే కూలీలకు అన్నము తీసుకుపోయేది. అలా యింట్లో వారికి బైటివారికి సహాయంగావుంటూ పెరుగుతూ వచ్చింది.

శారద కప్పుడు పదకొండేండ్లు వచ్చాయి వాళ్ళనాన్నకు బీదవాళ్ళంటే ఎంతో ప్రేమ అని మనకు తెలుసు. ఒకసారి జయరాంబాటి ప్రాంతంలో కరువు వచ్చింది. పంటలు పాడయిపోయినాయి. అన్నానికి కష్టమైపోయింది. ఇక బీదలసంగతి చెప్పాలా! కడుపు పట్టుకొని అకలితో అల్లాడిపోయినారు. వీళ్ళ యింటిమీదుగా అలాంటివాళ్లు పోవటం రామచంద్ర ముఖోపాధ్యాయ చూచాడు. వాళ్ళయింట్లోకూడా ఎక్కువ బియ్యము లేవు. కొద్దివడ్లే వున్నాయి. వాటిని దంపించి, పెద్దపెద్ద కుండలతో వండించాడు. ఆ అన్నాన్ని, గంజిని పేదలకు పోశాడు. వాళ్లు తినటానికి ఆత్రపడుతున్నారు. చిన్న శారద యిది చూచింది. ఆమెహృదయం కరిగింది. వేడి అన్నం, గంజి తింటుంటే నోరు చెయ్యి కాలుతయిగదా! వెంటనే విసనకర్ర తీసుకొని వాళ్ళందరిదగ్గర విసరుతూ వేడి చల్లార్చింది. చదువువల్ల రావలసిన సంస్కార మిదే గదా! అందువల్లనే శారద చదువుల సరస్వతి.

కరువునందున పేదలు కడుపుకాలి
అర్చుచుండగ అన్నమువార్చి తండ్రి
వేడివేడిగ పెట్టుట చూడలేక
విసనకర్రతో శారద విసరసాగె.

సంపాదకులు : శ్రీ చిద్ఘనానందస్వామి

శ్రీ ఎమ్ బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు—600 021) న ముద్రింపబడి,

శ్రీ చిద్ఘనానందస్వామిచే శ్రీ రామకృష్ణ మఠము (మద్రాసు—600 004) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము 34 | 1977 - సెప్టెంబరు : పింగళ - భాద్రపదము | సంచిక 9

## విషయసూచిక

# రామకృష్ణ సేవాసంఘము-ఒక విన్నపము

ఇటీవల అతివృష్టిచే కలిగిన ఉద్ధృతమైన వరదలవలన ఉత్తర భారతములోని అనేకప్రదేశములందు ప్రాణనష్టము, వస్తునష్టము ఎక్కువ సంభవించినది. పల్లపు ప్రదేశములందు నీరు నిలిచిపోవుటవలన వేలాదిప్రజలు నిర్వాసితులైరి. ఈ దారుణపరిసితులందు సహజముగానే ఉత్పన్నములగు వ్యాధులున్ను విజృంభించి ప్రజలను మరింత బాధలకు లోను జేయుచున్నవి.

డిల్లీ, హౌరా, రహరా మొదలగు ప్రాంతములందు రామకృష్ణ సేవాసంఘము సహాయకార్యక్రమములను ప్రారంభించినది. బాధితులకు ప్రస్తుతము గోధుమలు, అటుకులు, బెల్లము, అన్నము పంచిపెట్టబడుచున్నవి. వైద్యసదుపాయముకూడ కొన్నిచోట్ల చేయబడుచున్నది.

మిద్నాపూర్ జిల్లాలోని ఘటాల్‌ప్రాంతంలో అన్నము, నివాసము, పనులు లేక దుఃఖితులైన వేలాదిప్రజల సహాయముకొఱకు విస్తృతమైన కార్యక్రమమును చేపట్టితిమి.

ఈ సేవాకార్యక్రమములను నిర్వహించుటకు, తక్కిన బాధిత ప్రాంతములకు ఈ కార్యక్రమములను విస్తరింపజేయుటకును ధనరూపమైన, వస్తురూపమైన విరాళములకై ఉదారహృదయములను అర్థించుచున్నాము. పూర్వమువలె ఇప్పుడున్ను ప్రజల సహకారము లభించగలదని విశ్వసించుచున్నాము.

విరాళములు కృతజ్ఞతతో ఈ క్రింది విలాసములందు స్వీకరింపబడును.

రామకృష్ణ మిషన్, బేలూరుమఠము. హౌరా - 711-202

రామకృష్ణ మఠము, మైలాపూరు. మద్రాసు - 600-004

బేలూరు మఠము,
15-8-1977.

స్వామి గంభీరానంద,
కార్యదర్శి.



ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్యవరాన్నిబోధత.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము 34 1977 – సెప్టెంబరు : : పింగళ – భాద్రపదము సంచిక 9

## ప్రార్థన

దేవ్యా యయా తతమిదం జగదాత్మశక్త్యా
నిఃశేషదేవగణశక్తిసమూహమూర్త్యా
తామమ్బికామఖిలదేవ మహర్షిపూజ్యాం
భక్త్యా నతాః స్మ విదధాతు శుభాని సా నః.

తన శక్తిచేత ఈ జగత్తునంతటను వ్యాపించియుండునదియు, సర్వదేవగణముల శక్తి సమూహముయొక్క మూర్తరూపమైనట్టిదియు, సర్వదేవతలచేతను, మహర్షులచేతను ఆరాధింపదగినదియు అగు అంబికకు మేము సభక్తికముగా ప్రణమిల్లుచున్నాము. మాకు ఆమె శుభముల నిచ్చుగాక!

-దేవీమాహాత్మ్యము.

# వివేకానందవాణి

ఈ జగత్తంతయు నిత్యాత్మ (అనగా, ఈశ్వరుని) విరాట్ శరీరమగుచో, ఒక్కొక్క క్షేత్రమునకు ఒక్కొక్క ప్రభావవిశిష్టత ఉండుట చిత్రమా? ఈశ్వరుడు ఒక్కొక్క క్షేత్రమున — స్వతస్సిద్ధముగనో, పరిశుద్ధాత్ముల హృదయపూర్వక వాంఛితమును తీర్చుకొఱకో — అధికముగా ప్రసన్నుడగును.

సామాన్యమానవుడు అట్టి క్షేత్రములను భక్తితత్పరబుద్ధితో సందర్శించెనేని వానికి ఇష్టార్థసిద్ధి అతిసులభముగా కలుగును. కావున పుణ్యక్షేత్రసందర్శనఫలముగా ఆత్మవికాసము సకాలమున ప్రాప్తింపవచ్చును.

కాని ఒక సత్యమునుమాత్రము చక్కగా ఎఱిగియుండుము — మానవశరీరమున కన్న ఉత్తమమైన పుణ్యక్షేత్ర మెచ్చటను లేదు. అచ్చట నున్నంత ప్రత్యక్షరూపమున ఆత్మ మఱెచ్చటను కానిపింపదు. నీవు చూచు ఆ జగన్నాథరథము ఈ శరీరరథముయొక్క స్థూల చిహ్నము మాత్రమే.

నీవు ఆత్మను చూడవలసినది ఈ శరీర రథమునందే. ''ఆత్మానం రథినం విద్ధి'' (రథమున కూర్చుండియుండువాడు ఆత్మ యని ఎఱుగుము) అనియు, ''మధ్యే వామనమాసీనం విశ్వే దేవా ఉపాసతే'' (శరీరమధ్యమున కూర్చుండియుండు వామనమూర్తిని దేవతలెల్లరును పూజింతురు) అనియు నీవు చదివియుండలేదా? ఈ ఆత్మను చూచుటే జగన్నాథుని నిజముగా చూచుట. ''రథే చ వామనం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే'' (రథమున నుండు వామనుని చూచినవానికి పునర్జన్మము ఉండదు) అను వాక్యమున కర్థము: నీయందుండు ఆత్మను — దేనిని ఉపేక్షించి, నీ శరీరమనెడు జడపదార్థ సంఘాతముతో నీ వెల్లప్పుడును ఐక్యభావము కలిగియున్నావో, ఆ ఆత్మను — ప్రత్యక్షపఱచుకో గలిగితివేని నీకిక పునర్జన్మము ఉండనేరదు అని.

కొయ్యతో నిర్మింపబడిన ఈశ్వరవిగ్రహమును దర్శించుటచేత జనులకు మోక్షము లభించునేని, ఏటేట కోట్లకొలది జనులు ఈ ఆధునిక కాలమున — రైళ్లు ఏర్పడి, ప్రయాణ సౌకర్యములు ఇంత యధికమైయున్న ఈ కాలమున — మోక్ష మొందుచుండవలెను. భక్తకోటికి శ్రీ జగన్నాథునియెడ గల విశ్వాసము మిథ్యయని గాని, ప్రమాదజనితమని గాని, నేను చెప్పను. ఆ విగ్రహముపై ఆధారపడి క్రమోన్నత సత్యపరిజ్ఞానము నందువారు కొందఱు కలరు. కావున ఆ మూర్తియందును, దాని మూలమునను, భగవంతుని సాక్షాత్కార విశేషము లభించు ననుటకు సందియము లేదు.

ఓ ప్రభూ! నీవు నిరాకారుడవని తెలిసీ, ధ్యానం చేసేటప్పుడు నీకు రూపమును కల్పించితిని. అనిర్వచనీయుడవని తెలిసీ నిన్ను స్తుతించితిని, కీర్తించితిని. సర్వవ్యాపివై నీవు సర్వత్ర ఉన్నావని తెలిసీ తీర్థయాత్రలు చేసితిని. ఓ జగదీశా! నా యీ మూడు దోషములను నీవు కరుణించి క్షమించవలయును.

-వ్యాసుడు.

# పదేశసాహస్రి

ఉపోద్ఘాతప్రకరణం

చైతన్యం సర్వగం సర్వం సర్వభూతగుహాశయం
యత్ సర్వవిషయాతీతం తస్మై సర్వవిదే నమః

జ్ఞానస్వరూపుడును, సర్వవ్యాపియును, సర్వము అయినవాడును, సకల ప్రాణుల అంతఃకరణములందున్నవాడును, సర్వవిషయాతీతుడును, సర్వమును ప్రకాశింపజేయువాడును అగు సర్వేశ్వరునకు నమస్కరించుచున్నాను.

ఇది చేయవలెను, ఇది చేయకూడదు – అని క్రియలను గుఱించి సమగ్రముగా వేదము కర్మకాండలో చర్చించినది. జ్ఞానకాండయగు ఉపనిషత్తులందు బ్రహ్మవిద్యను ముముక్షువులకు వేదము బోధించుచున్నది.

కర్మలవలన దేహయోగము; దేహయోగమువలన ప్రియము అప్రియము; ప్రియము అప్రియమువలన రాగము ద్వేషము; రాగము ద్వేషమువలన క్రియలు; క్రియలవలన ధర్మము అధర్మము; ధర్మాధర్మములవలన తిరిగి దేహము – ఈ విధముగా అజ్ఞునకు నిలుపులేక నిత్యము సంసారభ్రమణము చక్రభ్రమణమువలె కలుగుచుండును.

ఈ సంసారభ్రమణమునకు మూలము అజ్ఞానము. అజ్ఞానమును తొలగించుటకే ఉపనిషత్తులందు బ్రహ్మవిద్య బోధింపబడినది.

అజ్ఞానమునకు కర్మవిరోధికాదు, కావున అది దానిని తొలగింపజాలదు. విద్యవలననే అది సాధ్యమగును. అజ్ఞానము ఉన్నంతవరకు రాగద్వేషములు తప్పవు. రాగద్వేషములు ఉన్నంతవరకు కర్మలు తప్పవు. కాబట్టి శ్రేయస్సు కలుగుటకు ఉపనిషత్తులు బ్రహ్మవిద్యను బోధించుచున్నవి.

చీకటి వెలుగు ఒకేచోట ఉండజాలనట్లు విద్య కర్మ ఒక్కచోట ఉండజాలదు. నేను యజ్ఞదత్తుని కుమారుడు దేవదత్తుడను, నేను విద్యార్థిని, స్కూలుటీచరును, వ్యాపారిని, రైతును–ఇటువంటి అభిమానము ఉన్నప్పుడే కర్మలు సాధ్యమగును. పరిచ్ఛిన్న చిత్తవృత్తియే ఈ అభిమానమునకు కారణము. అపరిచ్ఛిన్న చిత్తవృత్తి గలవానికి 'నేను కర్తనుకాను భోక్తనుకాను మఱేమనగా నిర్వికారుడైన బ్రహ్మస్వరూపుడను' అను భావము ఉండును. దీనినే విద్య అందురు. కాబట్టి పరిచ్ఛిన్న చిత్తవృత్తియైన కర్మ, అపరిచ్ఛిన్న చిత్తవృత్తియైన విద్య–ఒక్కచోట ఉండజాలవు.

కర్మలు పురుషాధీనములు. జ్ఞానము వస్తువు అధీనము. ఏ కర్మనైనను చేయుటకు, చేయకుండ ఉండుటకు, వేఱు విధముగా చేయుటకు వీలగును. పాలను త్రాగవచ్చును, త్రాగకుండ ఉండవచ్చును, మఱి దేనితోనైననూ కలిపి త్రాగవచ్చును; కాని పాలు తెలుపు అనే జ్ఞానము పురుషాధీనముకాదు. అది వస్తువు అధీనము. మన ఇచ్ఛానుసారం నలుపుజ్ఞానమో ఎఱుపు జ్ఞానమో అక్కడ మనకు కలుగదు.

విద్యకు కర్మకు సహజమైన వైషమ్యము ఉన్నది. కనుక ముముక్షువులైనవారు కర్మలను పరిత్యజించవలసియున్నది.

కాని ఎంతవరకు మానవుడు అవిద్యవలన 'నేను పురుషుడను, స్త్రీని' అని దేహధర్మములను ఆత్మయందు ఆరోపించుకొనునో; 'నాకు చూపు బాగున్నది కాని చెవులు సరిగా వినపడుటలేదు' అని ఇంద్రియ ధర్మములను ఆత్మయందు ఆరోపించుకొనునో; 'నాకు ఆకలి వేయుచున్నది, దప్పిక కలుగుచున్నది' అని ప్రాణధర్మములను ఆత్మయందు ఆరోపించు

కొనునో; 'నాకు దుఃఖముమీద దుఃఖము కలుగుచున్నది' అని మనోధర్మములను ఆత్మయందు ఆరోపించుకొనునో అంతవరకు శాస్త్రోక్తమైన కర్మలను చేసి తీరవలసినదే.

నిర్విశేషసదా చిదానందాత్మ స్వభావమును ఆవిర్భవింపజేయుటకుగా శ్రుతి 'న ఇతి న ఇతి' అని ఆత్మయందు ఆరోపింపబడిన దేహప్రాణ మనోబుద్ధ్యాది ధర్మములను నిషేధించుచున్నది.

వేదప్రమాణ జనిత జ్ఞానాగ్నిచే దగ్ధము కావింపబడిన అవిద్య మరల ఎట్లు తల ఎత్త గలదు? 'అహం బ్రహ్మాస్మి' అని అపరోక్షానుభూతి కలిగిన తరవాత కర్త భోక్త అను అభిమానము ఎట్లు ఉండగలదు?

'న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వమానశుః' - అని శ్రుతి ఉద్ఘోషించుచున్నందువలన వివేకవైరాగ్యశమదమాది సాధనసంపత్తిగల ముముక్షువులు సర్వకర్మలను సన్యసించి జ్ఞాననిష్ఠులు కావలెను.

'కర్మలు పరిత్యజించినచో పాపము సంభవించదా!' అన్నచో అహంకార మమకారములున్నవానికే కర్మ పరిత్యాగమువలన పాపము సంభవించును. అహంకారముగాని, కర్మఫలాపేక్షగాని ఆత్మజ్ఞాననిష్ఠులకుండదు గనుక వారిని ప్రత్యవాయదోషము అంటదు.

శ్రద్ధాభక్తి పురస్సరముగ ఉపనిషత్ విద్యను శ్రవణమనన నిధిధ్యాసము చేసినచో సంసారకారణమైన అవిద్యాబీజము నాశనమగును. గర్భవాస జన్మజరారోగాది ఉపద్రవములు తొలగును. అఖండ సచ్చిదానంద బ్రహ్మప్రాప్తి కలుగును.

ఉపోద్ఘాత ప్రకరణం సమాప్తం.

గీత అత్యద్భుతగ్రంథము. అది స్మృతిగ్రంథమే ఐననూ పెక్కండ్రు దానిని ఉపనిషత్తులలో చేర్తురు. వాని సారమంతయు దానియందుండుటయే ఇందుకు కారణము. ప్రతి అధ్యాయము చివరను అది ఉపనిషత్తుగా పేర్కొనబడియుండుట నీవు ఎఱుగవా? గీతకు 'శ్రీమద్భగవద్గీతోపనిషత్తు' అని పేరు. కావుననే 'గీతాజలములో ఒక్కసారి స్నానమాడినవారికి జన్మజన్మాంతరములనుండి సంచితమైన సంసారమలమంతయు విమోచనమగును' అని మన ఋషులు పలికిరి. మన మనశ్శరీరములు జన్మజన్మాంతరములనుండి పేరుకొన్న మాలిన్యములతో నిండియున్నవి. అదంతయు ఒక్క గీతాజల స్నానముతో నశించిపోవును. దానిని పైపైన చదివిన చాలదు. లోతునకు పోవలెను. నీవు ఉపవిషత్తులను మొదట పఠించితివేని, గీత నీకప్పుడు మిక్కిలి చక్కగా అర్థమగును.

-తురీయానందస్వామి.

# శారదా నవరాత్రులు

## సి. వి. రావు

ఆశ్వీయుజ కార్తీకమాసములు శరదృతువు. ఆశ్వీయుజ శుక్లపాడ్యమి మొదలు తొమ్మిది రాత్రులకు నవరాత్రులని పేరు. ఈ నవ రాత్రులు శరదృతువునందు వచ్చుటవలన శారదా నవరాత్రులని పిలుచుట వాడుక అయినది. ఈ తొమ్మిది రోజులు శ్రీ దేవిని వివిధ నామరూపములతో ఆరాధించి పూజించుటచేత దేవీ నవరాత్రులనికూడ పిలుచుచున్నారు.

నవరాత్రులలో శ్రీ దేవిని ఒక్కొక్క ప్రదేశములో ఒక్కొక్క నామములో ఆరాధించుచున్నారు. కాశ్మీరములో అంబ అనియు, రాజపుత్రస్థానములో భవాని అనియు, గుజరాత్ లో కల్యాణి అనియు, మిథిలలో ఉమా అనియు, మీనాక్షి, కామాక్షి, చాముండి, సరస్వతి, దుర్గ, భగవతి, యను పేర్లతో అక్కడక్కడను శ్రీ దేవీపూజలు చేయుచున్నారు.

శ్రీ దేవి అనగా ఎవరు? అను ప్రశ్నకు ఆదిశంకరులు సౌందర్యలహరి ప్రథమ శ్లోకములో 'శివశ్శక్త్యాయుక్తో' యని చెప్పినారు. అనగా దేవిని శక్తిగా చెప్పియున్నారు. శివుడు గూడ శక్తితో కూడినగాని సమర్థుడు కాడని అర్థము. సృష్టిలో పిపీలకాది బ్రహ్మపర్యంతము శక్తిలేకున్న కార్యనిర్వాహకమునకు సమర్థవంతము కాదనుట సత్యదూరము కాదు.

శక్తియనగా బలము. ఆ బలమువలననే మనము మాటలాడుట, నడుచుట మొదలగు నిత్యకృత్యములు చేయగలుగుచున్నాము. శక్తి గలవాడు సకలకార్యము లొనరించుటకు కర్తయగుచున్నాడు. శక్తిచేతనే భూమి నిల్చియున్నది. శక్తిచేతనే అంతరిక్షము నిల్చియున్నది. స్వర్గము, దేవతలు, మనుష్యులు, పక్షులు, పశువులు, నిలిచియున్నవి. సకలలోకములు శక్తిచేతనే నిలిచియున్నవి. కాబట్టి శక్తిని ఉపాసింపవలయును.

ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి, ఆదిశక్తి, పరాశక్తియైన జగన్మాతయే శ్రీదేవి.

ఈ దేవినిగూర్చి త్రిపురోపనిషత్తు, త్రిపురతాపిన్యుపనిషత్తు, భావోపనిషత్తు, సరస్వతీరహస్యోపనిషత్తు మొదలగు అనేక ఉపనిషత్తులలోను, ఇతర తంత్ర గ్రంథములలోను పురాణములలోను విస్తారముగా చెప్పబడియున్నది.

వేదము ప్రతి మానవుని ''మాతృదేవో భవ'' అని ఆజ్ఞాపించుచున్నది. మానవులకు అనేకజన్మలు కలుగుచున్నవి. ప్రతి జన్మలోను ఒక తల్లి గలదు. ఆ తల్లులందరికి తల్లియైన జగన్మాతను పూజించిన తల్లులందరిని పూజించినట్లగును.

శ్రీ ఆదిశంకరులు ''మాతాచ పార్వతీ దేవి పితా దేవో మహేశ్వరః'' అని పార్వతీ పరమేశ్వరులను లోకమునకు తల్లిదండ్రులని చెప్పియున్నారు. లలితా సహస్రనామములలో గూడ శ్రీ మాతా అని తల్లిగానే భావించి ఆ పేరుతోనే దేవి నామములు ప్రారంభమగుచున్నవి. కాళిదాసు తన మొదటి కావ్యము మొదటి శ్లోకములో ''జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ'' అని జగత్తునకు పార్వతీ పరమేశ్వరులనే తల్లిదండ్రులుగా చెప్పియున్నాడు.

కాబట్టి అట్టి జగన్మాతను వారి వారికి తోచిన నామరూపములతో పూజించుట ప్రతి వారికిని ముఖ్యమైయున్నది.

దేవిని పూజించుటకు సర్వులకు అధికారమున్నది. రామభజన ఏ విధముగా సర్వ సామాన్యమైనదో దేవీ పూజకూడ ఆ విధముగానే అందరకు అందుబాటులో ఉన్నది. దేవిని పూజించు భక్తులకు ఇహలోక సంపదలేగాక పరలోక సౌఖ్యములు కలిగి చివరకు మోక్షము కూడ లభించుచున్నది.

ఒకప్పుడు దేవతలు దేవినిజూచి నీ వెవరవని ప్రశ్నించగా అప్పుడు దేవి,

'అహం బ్రహ్మస్వరూపిణీ మత్తః ప్రకృతి పురుషాత్మకం జగత్ శూన్యం చా శూన్యం చ' అని తన స్వరూపాన్ని వర్ణిస్తూ తాను 'బ్రహ్మ స్వరూపిణి అనియు, ప్రకృతి పురుషాత్మకమైన జగత్తును సృష్టించితిననియు, ఆనందమైనదియు ఆనందము కానిదియు, విజ్ఞానమైనదియు, కానిదియు, బ్రహ్మమైనదియు బ్రహ్మ కానిదియు, పంచభూతమైనదియు పంచభూతములు కానిదియు, తానేననియు, వేదములు అవేదములు, విద్యా అవిద్య, రుద్రులు, వసువులు, ఆదిత్యులు, విశ్వేదేవులు, మిత్ర, వరుణ, ఇంద్ర, అగ్ని, అశ్వనీ దేవతలు, సోమ, త్వష్ట, పూష, భగ, విష్ణు, బ్రహ్మ, ప్రజాపతి మొదలైన రూపములన్నియు తన స్వరూపములే' అనియు సమాధానం చెప్పినది.

కాబట్టి దేవిని పూజించుటవలన సకల దేవతలను ఆరాధించిన ఫలము సమకూరుచున్నది.

ఈ దేవియే యోగమాయగా ద్వాపర యుగమందు యశోదగర్భమున జనించి వసుదేవునిచేత తీసికొనిరాబడి కంసునికత్తికి అందకుండ ఆకాశమునకెగసి వింధ్యాచలములో నివాసము చేయుచున్నది.

ఆ ఆదిశక్తి కలియుగములో దుర్గ, భద్రకాళి, విజయ, వైష్ణవి, కుముద, చండిక, కృష్ణ మాధవి, కన్యక, మాయ, నారాయణి, ఈశాని, అంబికా, శారదా నామములతో ఆరాధింపబడుచున్నది.

సీతారామ లక్ష్మణులు గంగను దాటునప్పుడు, సీతాదేవి గంగారూపములో నున్న శక్తినిచూచి తామందరు వనవాసము నుండి సుఖముగా వచ్చిన ఉత్సవము చేయింతునని ప్రార్థించినది. విరాటనగరమున అజ్ఞాతవాసము చేయబోవునప్పుడు ధర్మరాజు తమను పరులు గుర్తింపకుండునట్లు చేయుమని దుర్గను స్తోత్రము చేసియున్నాడు. కౌరవపాండవ యుద్ధమునకు ముందు అర్జునుడు దుర్గను ప్రార్థన చేసియున్నాడు.

సృష్ట్యాదినుండి దేవదానవ మానవులందరు తమ తమ శుభములకొరకు శ్రీ దేవిని అనేక రూపములతో అనేక సమయములందు పూజించి ధ్యానించి వారి వారి కోర్కెలను పూర్తి చేసుకున్నారు.

సత్వగుణ సంపన్నులైన దేవతలను తమోగుణమూర్తులైన దానవులు కష్టముల పాలు చేయగా, దేవతల రక్షణార్థము శ్రీ దేవి నవరాత్రులలో చండముండాది రాక్షసులను సంహరించి దేవతలకు మేలు కలిగించినది. ఆ కారణములవల ఆ నాటినుండి ఈ నాటివరకు నవరాత్రి తొమ్మిది రోజులు శ్రీ దేవిని వివిధ నామములతో పూజించి ఆరాధించి వారి వారి శక్త్యానుసారముగా వేడుకలు జరుపుకొనుట భారత దేశములో సంప్రదాయమైనది.

# శ్రీ రామకృష్ణ కథామృతము

## (రెండవ భాగము)

**అనువాదము :** ప్రవ్రాజిక శ్యామాప్రాణ

రామకృష్ణులు అదే పారవశ్యస్థితిలో మంచముపై కూర్చొనియుండిరి. స్నేహితులను కొందరిని వెంటబెట్టుకొని డిప్యూటీ మాజిస్ట్రేటు అధరసేన్ అక్కడకు వచ్చెను. అతని వయస్సు 29 సంవత్సరములు. అతని స్నేహితుడు శారదాచరణుడు, తన పెద్దకుమారుడు మరణించినందువలన తీవ్రశోకమున మునిగెను. తన దుఃఖమును పోగొట్టుకొను మార్గము అతనికి కనపడలేదు. అందుకే అధరసేన్ అతనిని శ్రీ రామకృష్ణుల సన్నిధికి తీసికొని వచ్చెను.

శ్రీ రామకృష్ణుల మనస్సు సహజస్థితికివచ్చి తనతో తానే మాట్లాడుకొనుచుండిరి.

శ్రీ రామకృష్ణులు : విషయలోలురకు కూడ అప్పుడప్పుడు జ్ఞానము కలుగుచుండును. కాని అది చాల క్షీణమైనది. చిన్నదీపపు శిఖవంటిది.

ప్రాపంచికులకు జ్ఞానవిషయంలో గట్టి పట్టుదల లేదు. మంచినీటికోఱకు బావి త్రవ్వనారంభించి రాతినేల తగిలినవెంటనే ఆ స్థలం వదలి మఱొకచోట త్రవ్వుదురు. మళ్ళీ అక్కడ రాయి తగిలినచో ఆ స్థలం వదలిపెట్టి మఱొకచోట త్రవ్వుదురు. గట్టి పట్టుదలతో ఒకేచోట ప్రయత్నించరు.

ఎవరికర్మ వారు అనుభవించవలసినదే. తన కష్టనష్టాలకు ఇతరులను నిందించి ఏమి ప్రయోజనము? భగవద్దర్శనమైనచో తర్కములు, వివేచనములు — అన్నీ సమసిపోవును.

నేను నాది అనుకొనుటయే అజ్ఞానము. నీవెవరో ఆలోచించి చూడుము. నీ వనునది ఈ శరీరమా? ఎముకలా? చర్మమా? రక్తమాంసములా? 'ఇవేమియు నేను కాదు. నేను ఆత్మను' — ఇట్లు తలంచుటయే జ్ఞానము.

బిడ్డ ఎంతవరకు ఏడ్చుచుండును? తల్లివచ్చి ఎత్తుకొని పాలు త్రాగించువరకేకదా! అటుపై తృప్తిపడి ఆనందించును.

భగవంతుడు సర్వభూతములలో ప్రకాశించుచున్ననూ పవిత్రులు, సరళస్వభావులు, భవవద్భక్తిపరులును అగు మహాత్ములలో అతడు ఎక్కువగా ప్రకాశించును. అనగా అట్టివారిలో, భగవంతుని ప్రత్యక్షముగా కాననగును.

అటుపై శ్రీ రామకృష్ణులు అధరసేనుని క్షేమసమాచారముల నడిగిరి. అధరుడు తన స్నేహితుని పుత్రశోకమునుగూర్చి చెప్పెను. శ్రీ రామకృష్ణులు వానికి బదులు చెప్పక పాడదొడంగిరి.

'జీవ్ సాజో సమరే

(భావము: యమభటులు నీ ఇంట్లో ప్రవేశించిరి. నీవు వారితో పోరుసల్పుటకు సిద్ధపడుము. భగవన్నామమనెడి ఆయుధముతో యుద్ధము చేయుము.)

నా మనోభావమేమనగా ; నేను యంత్రమును, నీవు నడపువాడవు. నీ వెట్లు నడపిన

అట్లే నడతును. ఎట్లు పల్కించిన అట్లే పల్కుదును.

మంచివానిపై భారము వేసినచో అతడు నీ కెన్నటికి కీడు చేయడుకదా? అందుచే నీవు వానికి వకాల్తా ఇచ్చివేయుము. అతని ఇచ్ఛ వచ్చినట్లే చేయనిమ్ము.

అయ్యో! కడుపున పుట్టిన బిడ్డకదా! పోతే దుఃఖము కలుగదా! రావణాసురునివంటి రాక్షసుడుకూడ కుమారుని చావునకు మిక్కిలి దుఃఖించెను. ఆ దుఃఖము వాని ఎముకలలో దూరి వాటిని తొలిచివేసినవి. రావణుడు మరణించిన వెంటనే లక్ష్మణుడు పరుగిడిపోయి చూడగా వాని అస్థిపంజరమంతయు రంధ్రములతో నిండియుండెను. లక్ష్మణుడు రాముని వద్దకుపోయి ఇట్లు చెప్పెను. 'అన్నా! నీ బాణముల మహిమ ఏమని చెప్పను! నీ బాణముల ప్రభావమువలెననే రావణుని ఎముకలు అన్నీ తూట్లుపడినవి.' అంత రాము డిట్లు బదులు చెప్పెను. 'సోదరా నీవు చూచిన రంధ్రములు నా బాణప్రయోగమువలన ఏర్పడ... పుత్రశోకమే వాని ఎముకలను తొలచివేసెను!'

ఇల్లు వాకిలి, స్త్రీ పుత్రాదులు అన్నీ అనిత్యములు రెండు దినాలపాటివి. ఈ అనిత్య సంసారముకొఱకు దుఃఖింపనేల?

తాటిచెట్టునుండి ఒకటి రెండు తాటి కాయలు పడిపోవును. వానికై విలపించి ఏమి ప్రయోజనము?

ఈశ్వరుడు సృష్టి, స్థితి, ప్రళయములనెడి మూడు కార్యములను సర్వదా చేయుచుండును. మరణము అనివార్యము. ప్రళయమునందు అంతయు ధ్వంసమైపోవును. ఏమియు నిలుపదు. జగజ్జనని సృష్టిబీజముల కొన్నింటిని ఏరి దాచి యుంచును. సృష్టికాలమున వాటిని బైట పెట్టును. పల్లెటూరి ముసలమ్మలకడ ఒకముంత ఉండును. (అందరు నవ్వుదురు.) దానిలో ఆమె అన్నిరకాల కాయగూరల గింజలు దాచి ఉంచును. గింజలునాటే తరుణము రాగానే వాటిని బైటకు తీయును.

(అధరునితో) నీవు డిప్యూటీ మాజిస్ట్రేటు కదా ఈ పదవి నీకు భగవంతుని అనుగ్రహము వల్లనే లభించినది. వానిని మరువకుము. అందరూ ఇక్కడ ఉండునది రెండు దినములు మాత్రమే. తరువాత చేరుకొనవలసిన స్థలము

భగవన్నామముయొక్క బీజాక్షరములో గొప్పశక్తి కలదు. ఆ శక్తి అజ్ఞానమును పోగొట్టును. చెట్లగింజలు ఎంత మెతగా ఉండును. కాని అది ఎంతటి గట్టినేలనైననూ సరే పగులగొట్టి బైటకి వచ్చునుకదా! అంకురము మృదువైనదైననూ ఏమి? బీజముయొక్క శక్తిద్వారానే నేలను పగులగొట్టును.

కామ కాంచనములలోనే మునిగిఉన్నచో మనస్సు చంచలమై వాటి వైపునకే పోవును. అందుచేతనే చాల జాగ్రత్తగ ఉండవలెను. త్యాగపురుషులకు అంతగ భయములేదు. ఎందుచేతననగా వారు కామ కాంచనములకు దూరముగానే ఉండి సాధన భజనల చేయుచు సర్వదా భగవంతునిమీదనే మనస్సును నిలిపి ఉందురు.

తేనెటీగ పుష్పములనుండియే మధువును గ్రోలి మత్తెక్కియుండురీతిగా, త్యాగి భగవత్ చింతనామృతమును గ్రోలి ఉన్మత్తుడై ఉండును.

సర్వదా ఈశ్వరునిమీదనే మనస్సు నిల్పుము. మొదట కొంచెము కష్టముగా ఉండును. కాని అటుపై సుఖముగా 'పెన్షన్' అనుభవించవచ్చును.

శ్రీరామచంద్రదత్తుని ఇంటికి శ్రీరామకృష్ణుల రాక క్రీ. శ. 1883 జూన్ 2 వ తేది.

నేడు రామదత్తుని ఇంట్లో ఉత్సవము. ముంగిలి చిన్నదైననూ చిన్న వేదికను చక్కగా ఏర్పాటు చేసెను. దానిమీద ఆసీనులై శాస్త్రులు పురాణము చదువుచుండిరి. అది సత్య హరిశ్చంద్రోపాఖ్యానము. శ్రీ రామకృష్ణుని ఆగమనము వినగానే రామ్ ఎదురేగి ప్రణామముచేసి వినయముతో వారిని మంటపములోనికి తీసికొనివచ్చి వారికై ప్రత్యేకముగా ఉంచబడిన ఆసనముపై కూర్చుండబెట్టెను. నాలుగువైపులా భక్తులు కూర్చొనిరి. మాస్టరు ప్రక్కనే కూర్చొనెను. అందరూ పురాణకథ వినసాగిరి.

''విశ్వామిత్రుడు హరిశ్చంద్రమహారాజుకు ఇట్లు చెప్పుచున్నాడు.''

''మహారాజా! సకలరాజ్యమును నాకు సమర్పించితివి. అందుచే నీవీ రాజ్యమున నివసింపరాదు. వారణాసీనగరము శివునిది. అక్కడ నిన్ను దిగవిడిచి వచ్చెదను''

శివునిపేరు వినగానే శ్రీ రామకృష్ణులు భావపరవశులై 'శివ, శివ' అనుచుండిరి.

హరిశ్చంద్రుని కథ ముగిసినవెంటనే శ్రీ రామకృష్ణులు అశ్రువులను తుడుచుకొనుచు 'ఉద్ధవ సంవాదము వినిపించుము' అని శాస్త్రులను కోరిరి.

శాస్త్రులు చెప్పదొడగిరి : ఉద్ధవుడు బృందావనమునకు రాగానే గోపగోపికలెల్లరు వాని చెంతకు వేగమునవచ్చి కృష్ణుడెట్లున్నాడని అడిగిరి. అతడు మమ్ములను పూర్తిగా మరచెనా లేక ఎప్పుడైనా మమ్ములను తలుచుకొనునా—అని కొందరు అడిగిరి. కొందరు ఉద్ధవుని తీసికొని పోయి బృందావనములోని పలు ప్రదేశములు చూపించుచు కృష్ణలీలలను వర్ణించుచుండిరి. ఇచ్చటనే శ్రీ కృష్ణుడు గోవర్ధనగిరి నెత్తెను. ఇచ్చట ధేనుకాసురుని వధించెను. ఇచ్చటనే శకటాసురుని చంపెను. ఈ స్థలములలోనే ఆవులను మేపెను. ఈ యమునాతీరమునందే మాతో విహరించెను — అని చెప్పుచుండిరి. అంత ఉద్ధవుడిట్లు చెప్పెను. 'మీరు కృష్ణునికై ఇంత విలపించెద రెందుకు? అతడు సాక్షాత్ భగవంతుడు. సర్వ భూతములలోను నివసించుచున్నాడు. అతడు లేనిచోటేదియు లేదు!'

గోపికలు బదులు పలికిరి: 'మాకు అవన్నియు తెలియవు. ఎందువలనంటే నీలాగ మేము చదువుకోలేదు. బృందావన కృష్ణునే మేము ఎఱుగుదుము. అతడు ఇక్కడ మాకు ఎన్నో లీలలు చూపెను.'

ఉద్ధవుడు : అతడు సాక్షాత్ దేవదేవుడే. వానిని స్మరించినవాడు మరల జన్మింపనవసరములేదు. వానికి ముక్తి అఱచేతిలోనిది.

గోపికలు : ముక్తి గిక్తి ఇవన్నీ మాబోటి పల్లెప్రజలకు అర్థముకాదు. మా ప్రాణవల్లభుడగు కృష్ణునే మేము చూడగోరుచున్నాము.

ఇదంతయు వినుచు శ్రీ రామకృష్ణులు భావావేశులైరి. గోపికలు చెప్పునది నిజమే అని చెప్పి మధురకంఠముతో ఇట్లు పాడదొడంగిరి.

'అమి ముక్తిదితే కాతర్ నై
శుద్ధ భక్తి దితే కాతర్ హాయి'

శ్రీ రామకృష్ణులు : గోపికలది ప్రేమభక్తి, అవ్యభిచారిణీభక్తి, ఏకనిష్ఠాభక్తి. జ్ఞానమిశ్రమగు భక్తినే వ్యభిచారిణీ (చంచలమగు) భక్తి అందురు. అదెట్లన శ్రీకృష్ణుడే సర్వమును అయి ఉన్నాడు, అతడే పరబ్రహ్మ, సర్వాంతర్యామి.

కాని శుద్ధప్రేమ భక్తిలో ఎట్టి కలగలపు ఉండదు. హనుమంతుడు ద్వారకకుపోయి సీతారాముల దర్శించుకొందును అనెను. కృష్ణుడు వెంటనే రుక్మిణితో 'నీవు త్వరగా సీతరూపము ధరింపుము. నేను రాముని రూపము ధరింతును. ఆంజనేయునికి ఆ విధముగానే మనము దర్శనమీయవలెను' అనెను.

రాజసూయయాగము చేయునప్పుడు రాజులందరు ధర్మరాజునకు నమస్కరించిరి. విభీషణుడుమాత్రము ఇట్లు పలికెను. 'నేను నారాయణునికే నమస్కరింతును కాని ఇతరులకు నమస్కరింపను.' అంత నారాయణుడగు కృష్ణుడే ధర్మరాజునకు మ్రొక్కెను. అటుపై విభీషణుడున్ను మ్రొక్కెను.

భక్తుడు : మహాశయా! ఏది మంచిది? ప్రేమ భక్తియా లేక జ్ఞాన మిశ్రితమగు భక్తియా?

శ్రీ రామకృష్ణులు : భగవంతునిపై ఎక్కువ ప్రేమ కలుగనిచో ప్రేమ భక్తి కలుగజాలదు. ప్రేమభక్తికి రెండు లక్షణము లున్నవి: అహంకారము, మమకారము. యశోదకు ఇట్టి లక్షణములు కలవు. 'నేను నా గోపాలుని సరిగా పోషించకపోయిన ఎవరు పోషింతురు. నేను వానిని జాగ్రత్తగా కాపాడకపోయినచో జబ్బు చేయును' అని చింతించును. 'అమ్మా! నీ కృష్ణుడు సామాన్యుడు కాదు. భక్తులపాలిట చింతామణి' అని ఉద్ధవుడు చెప్పగా యశోద ఇట్లనెను 'ఓరే నాయనా! మీ చింతామణి గురించి నాకు తెలియదు. మా గోపాలుడు ఎట్లున్నాడో చెప్పుము!'

ముగ్గురు స్నేహితులు ఒక అరణ్యములో పోవుచుండిరి. ఒక పులి అగపడెను. ఒకడు భయముతో గట్టిగా కేక పెట్టినాడు. రెండవ వాడు నెమ్మదిగా 'భగవంతుని ప్రార్థించెదము' అన్నాడు. మూడవవాడు 'దేవునికి అంత కష్టమిచ్చుటెందులకు? మనము ఈ చెట్టుఎక్కి కూర్చొన్న సరిపోవునుకదా.' అన్నాడు. మొదటివాడు దేవుడున్నాడనే నమ్మకము లేని వాడు. రెండవవాడు జ్ఞాని. భగవంతుడు కలడు. సృష్టి, స్థితి, లయములకు అతడే మూలము అని ఎరిగినవాడు. మూడవవాడు ప్రేమభక్తుడు. భగవంతుని కెందుకు కష్టము కలిగించవలెను? అనే భావము కలిగినవాడు.

—

సుఖము, అనుకూలము, ప్రియము - అయినదాన్నే ఇష్టమందురు. దుఃఖము, ప్రతికూలము, అప్రియము - అయినదాన్నే అనిష్టమందురు. నాకు ఇష్టమే కలగాలి, అనిష్టము కలగకూడదు అనే మనస్తత్వముతో ఇష్టప్రాప్తికి, అనిష్ట పరిహారానికి ప్రయత్నం చేసేవారికే, వారికి తగిన వెలుగు చూపడానికి వేదములో కర్మకాండ చెప్పబడినది. నాకు ఇష్టమూ వద్దు, అనిష్టమూ వద్దు. ఈ రెండింటిని అతిక్రమించి భగవంతునిలో లీనము కావాల అనే పరిపక్వమైన బుద్ధి గలవారికే వేదములో జ్ఞానకాండ చెప్పబడినది.

—మహాభారతము.

# భాగవతము — కథాతత్త్వ విచారము

ధూళిపాళ శ్రీరామమూర్తి

స్వభక్త పక్షపాతేన తద్విపక్ష విదారణమ్
నృసింహ మద్భుతమ్ వందే పరమానంద విగ్రహమ్ ॥

సామాన్యముగా పురాణముల కన్నింటికిని ఐదు లక్షణములు చెప్పుదురు.

"సర్గశ్చ ప్రతి సర్గశ్చ వంశోమన్వంతరాణి చ
వంశానుచరితం చేతిపురాణం పంచలక్షణమ్॥

సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరములు, వంశానుచరితము అనునవి యైదును లక్షణములు. కాని భాగవత పురాణమునకు మాత్రము పది లక్షణములను చెప్పిరి.

అత్ర సర్గో విసర్గ శ్చస్థానం పోషణమూతయః
మన్వంతరేశానుకథా నిరోధో ముక్తిరాశ్రయః
దశమస్య విశుద్ధ్యర్థం నవానామిహలక్షణం
వర్ణయంతి మహాత్మానః శ్రుతేనార్థేన చాంజసా,

సర్గము, విసర్గము, స్థానము, పోషణము, ఊతులు, మన్వంతరములు, ఈశానుకథలు, నిరోధము, ముక్తి, ఆశ్రయము అనునవి పది లక్షణములు. అనగా ఈ పదింటియొక్క వివరణము ఈ గ్రంథమునందు ఉండునన్నమాట. అపుడొక దోషమును చెప్పవచ్చును. ఈ పదియును దేనికది యొక్కొక్క విషయమగును కదా. అప్పు డర్థభేదమువలన శాస్త్రభేదము వచ్చునని ఆ దోషస్వరూపము. భాగవత మొక శాస్త్రగ్రంథము. దానియందు ఒకే విషయము ప్రధానముగా చెప్పవలెను. అంతేగాని పది విషయములు చెప్పుటవలన వానికి పది ప్రయోజనములు, పదిమంది యధికారులు, పది సంబంధములు చెప్పవలసివచ్చును. అప్పుడది పది శాస్త్రముల కూటమి యగును. అట్లగుట దోషము. కాబట్టి భాగవతమునకు చెప్పిన ఈ పది లక్షణములలో చివరి లక్షణము ఆశ్రయమనునది ప్రధానమనియు దాని తత్త్వమును విశదముచేయుటకు తక్కిన తొమ్మిది లక్షణములు చెప్పవలసి వచ్చినదనియు పై శ్లోకములందు స్పష్టము చేయబడినది.

సర్గము :—పరమేశ్వరుడు పృథివ్యాప తేజో వాయురాకాశములను పంచమహాభూతములను, శబ్దస్పర్శ రూపరస గంధములను పంచతన్మాత్రలను, వాక్పాణిపాద పాయుపస్థలను పంచకర్మేంద్రియములను, త్వక్చక్షుర్జిహ్వా శ్రోత్రఘ్రాణములను పంచ జ్ఞానేంద్రియములను, మహదహంకారములను, సత్త్వరజస్తమస్సులను, ప్రకృతిగుణముల వైషమ్యమువలన సృష్టించి వాని యన్నింటితో విరాడ్రూపమును నిర్మించుట.

విసర్గము :—విరాట్ పురుషుని యొక్క పుత్రుడు వైరాజుడు. ఆయన చేసిన చరాచరాత్మకమైన సృష్టి వైరాజము. ఈ వైరాజునకు పురుషుడనిపేరు. కావున ఆయన చేసిన సృష్టి పౌరుషమైనది.

స్థానము :—స్థానమనగా స్థితి. అనగా సృజింపబడిన జీవకోటికి కొన్ని ధర్మములను, కొన్ని మర్యాదలను ఏర్పాటుచేసి ఆయా మర్యాదలనవి తప్పకుండ నుండునట్లు చూచుచు, వానికి ఉత్కర్ష కల్గించుట. తాత్పర్యమేమన భగవంతు డవతారములెత్తి జగత్తును పరిపాలించుట.

పోషణము :-పరమేశ్వరుడు భక్తుల ననుగ్రహించుటయే పోషణము.

ఊతులు :-ఊతులనగా కర్మ వాసనలు. పుణ్య కర్మవాసన, పాప కర్మవాసన అని ఇవి రెండు విధములు.

మన్వంతరము :—పరమేశ్వరానుగ్రహము కల్గి మన్వంతరాధిపతులైన సత్పురుషుల ధర్మము మన్వంతరములు.

ఈశానుకథలు :-భగవంతుని అవతార చరిత్రములు. ఆయన భక్తుల కథలు.

నిరోధము :-పరమేశ్వరుడు యోగ నిద్ర పొందిన తరువాత జీవుడు తన యుపాధులతో కూడి ఆయనయందు లయమగుట.

ముక్తి :-అవిద్యవలన ఆరోపితమైన మిథ్యా రూపము వదలి స్వస్వరూపముతో నుండుట.

ఆశ్రయము :-సృష్టి స్థితిలయములు ఎచ్చట జరుగుచున్నవో, దేనివలన తెలియబడుచున్నవో అది ఆశ్రయము. అదియే పరమాత్మ యని పరబ్రహ్మయని చెప్పబడుచున్నది.

ఇట్టి పరబ్రహ్మ స్వరూపమును స్పష్టము చేయుటకు తక్కిన తొమ్మిది లక్షణములు చెప్పవలసి వచ్చినది. పదవ లక్షణమైన పరబ్రహ్మము లక్ష్యము. దాని లక్షణము లీ తొమ్మిది యన్నమాట. కావున న్యాయమునకు తొమ్మిదే లక్షణములు. ఈ తొమ్మిదింటిలో మధ్యనున్నది- ఐదవ లక్షణము ఊతులన్నది. ఏ గ్రంథమునకైనను కొన్ని ఆయువుపట్టు లుండును. అనగా ఆ గ్రంథ రహస్యములు అట్టి చోటులయందు నిక్షిప్తములై యుండు నన్నమాట. వీనిని గ్రంథ గ్రంథులని యందురు. మానవుని శరీరనిర్మాణము వంటిదే గ్రంథ నిర్మాణముకూడా. బొటనవ్రేలు, నాభి, కంఠము, నొసలు, శిరస్సు, మొదలైనవి మానవ శరీరమునందున్న ఆయువుపట్టులు. వీనిలోకూడా శరీరమధ్య గతమైన నాభి చాలా ముఖ్యమైనది. అచ్చట ప్రాణాపానముల ముడి యుండును. ఆ ముడి ఊడిపోవుటయే మృత్యువు. అచ్చట నాడి ఆగిపోయినచో ప్రాణి మరణించెనన్నమాట. కావున అది ముఖ్యమైన ఆయువుపట్టు. అట్లే గ్రంథమునందును. గ్రంథమునకు నాభిస్థానమునందు దాని నిర్మాణ రహస్యము అధికముగా నిక్షిప్తమై యుండును. కాబట్టి ఈ ఊతులన్న పదవ లక్షణమందు భాగవత గ్రంథ రహస్యము మనకు దొరకవచ్చునన్నమాట.

ఇంతేకాక భాగవతము పన్నెండు స్కంధముల గ్రంథమైనను మొదటి రెండు స్కంధములు ఉపోద్ఘాత రూపములు. మూడవ స్కంధమునుండియే ప్రధాన గ్రంథ మారంభమగును. మూడునుండి పండ్రెండువరకు పది స్కంధములందును పూర్వము చెప్పిన పది లక్షణములు, ఒక్కొక్క స్కంధమునందొక్కొక్క లక్షణము చొప్పున వివరింపబడినవి. ఆశ్రయమును వివరించిన పండ్రెండవ స్కంధము పరబ్రహ్మ స్వరూప వివరణము కాబట్టి దానిని-ముఖ్యమగుటవలన లక్ష్యముగా భావించితిమి. దాని స్వరూపాభివ్యక్తికై చెప్పినవి తక్కిన తొమ్మిది స్కంధములు. వీనిలో మధ్యది సప్తమస్కంధము. పూర్వము చెప్పిన లక్షణములలో మధ్యస్థమైన ఊతులన్న లక్షణము ఈ తొమ్మిదింటిలో మధ్యస్థమైన సప్తమ స్కంధమునందు వర్ణింపబడినది. ఇట్లు గ్రంథ శరీరదృష్టి చేతకూడా సప్తమ స్కంధము నాభిస్థానమై భాగవతమునకు ముఖ్యమైన ఆయువు పట్టగుచున్నది.

మరియును భాగవతము ప్రధానముగా భక్తిని చెప్పునది. ఈ భక్తి సగుణభక్తి యనియు, నిర్గుణభక్తి యనియు రెండు విధములు. ఈ సగుణభక్తి ఎనుబదియొక్క విధములు. నిర్గుణభక్తియందు భేదములు లేవు. ఈ ఎనుబదిరెండు విధముల భక్తిలో ఏది ప్రధానమైనదో అది ఇక్కడ చెప్పబడినది. భక్తులలో ప్రథమ గణ్యుడైన ప్రహ్లాదు నాశ్రయించి ప్రధానమైన భక్తిభేద మిచ్చట వివరింపబడినది. ప్రహ్లాదునికి గురువు నారదుడైనను, నారదుడు దేవమునియై మహాభక్తుడై నిరంతర హరినామ స్మరణమునందు లీనమై యుండువాడైనను భక్తులను పరిగణించునపుడు శిష్యుడైన ప్రహ్లాదునకు ప్రథమస్థానమిచ్చి ఆయనకు ద్వితీయస్థాన మిచ్చినారు.

ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుక శౌనక హృన్నివాస
భక్తానురక్త పరిపాలన పారిజాత
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబమ్‌॥

ఈ శ్లోకము చాలా ప్రసిద్ధమైనది. ఇంతే కాదు. పరమేశ్వరుని దశావతారములలో తక్కిన యవతారములకు భక్తపాలనము అనునంగికమై వేరు వేరు ప్రధాన కార్యములున్నవి. ఆ ప్రధాన కార్యములు భూభారహరణము, ధర్మరక్షణము, దుష్టశిక్షణము, శిష్టరక్షణము మొదలైనవి. మత్స్య, కూర్మ, వరాహ, వామన, రామావతారములెల్ల యిట్టివే. భక్తపాలనము ప్రధాన కార్యముగా పెట్టుకొనివచ్చిన అవతారము నృసింహావతారము. ప్రధానముగానేమి నృసింహావతారమునకు భక్తపాలన మొక్కటియే కారణము. మరియొకటి లేనేలేదు. అందుచేతకూడా ఈ సప్తమస్కంధము గ్రంథమంతటిలో ప్రాముఖ్యము పొందుచున్నది. ఈ నృసింహామూర్తి యొక్క యనుగ్రహము ఏ కొంచెమైనను లేనిచో భాగవతగ్రంథ మర్థమగుట కష్టము.

వ్యాసోవేత్తి శుకోవేత్తి రాజావేత్తి వా న వా
శ్రీధరస్సకలంవేత్తి శ్రీనృసింహప్రసాదతః

వ్యాసు డెరుగును, శుకు డెరుగును. మరియు పరీక్షిత్తునకు తెలియునో లేదో శ్రీధరస్వామి మాత్రము శ్రీ నృసింహమూర్తి ప్రసాదము వలన భాగవతము, సమస్తమును చక్కగా తెలియగలిగినాడు. వ్యాసుడు శ్రీమన్నారాయణుని యవతారము. శుకమహర్షి బ్రహ్మవేత్త. కావున వారిద్దరికి నృసింహమూర్తితో తాదాత్మ్యమే. మరి పరీక్షిత్తు గర్భస్థుడై యుండి పరమేశ్వర దర్శనము చేసినవాడు. ధర్మమూర్తి. పరమ భాగవతుడు. అట్టివాని విషయమునకూడా తెలియునో తెలియదో గట్టిగా తెలియుననిగాని తెలియదనిగాని చెప్పుటకు వీలులేదు. మరి వ్యాఖ్యాతయైన శ్రీధరస్వామి శ్రీ నృసింహోపాసకుడు. ఆయనకు మాత్రము భాగవతము సర్వాంగీణముగ తెలియునట. ఈ కారణములవలన భాగవత కథ లన్నింటిలో ఈ ప్రహ్లాదచరిత్రయే ముఖ్యమని మనము గ్రహింపవలసి యున్నది.

ఊతులనగా కర్మవాసనలనియు వానిని గురించి ప్రహ్లాదచరిత్రమున వ్యాఖ్యానము చేయబడెననియు పూర్వము చెప్పితిని. ఈ కర్మవాసనలన్న లక్షణమునకే ఇంత ప్రముఖస్థానమీయనేల అని ప్రశ్న. ఈ కర్మవాసనలయందే సర్వసృష్టి రహస్యమున్నది. కర్మచేతనే జన్మ వచ్చినది. కర్మచేతనే ప్రవృత్తియందు వైచిత్ర్యము వచ్చినది. ఈసృష్టియందలి వైచిత్ర్యమంతయు కర్మవలన నేర్పడినదే. సంగ్రహముగా నింతవరకు తెలిసికొన్న చాలును. తర్వాత దీనిని గురించి ప్రసక్తమైన చోటున వివరముగ విచారించికొందము.

ఎంత విజ్ఞానికైనను వాని విజ్ఞానమును ఈ కర్మవాసనలు పనిచేయనీయవు. వాని విజ్ఞానము వాని కక్కరకు రానియ్యవన్నమాట. ఈ కర్మయే బంధము. దీనినుండి ముక్తుడగుటయే మోక్షము. ఈకర్మవాసనలు శుభాశుభ రూపమున రెండు విధములు. శుభ కర్మవాసన. అశుభ కర్మవాసన. శుభ కర్మవాసనకు ప్రహ్లాదుడు ప్రతినిధి. అశుభ కర్మవాసనకు హిరణ్యాకశిపుడు ప్రతినిధి. ఈ రెండింటి సంఘర్షణమే ఈ కథ. ఈ సంఘర్షణ పరాకోటినందు కొన్నపుడు అందుండి నృసింహస్వామి ఆవిర్భావము జరిగినది. హిరణ్యాకశిపుడు, హిరణ్యాక్షుడును పూర్వజన్మమున శ్రీ మహావిష్ణువునకు అనుచరులు. వైకుంఠవాసులు. సారూప్యముక్తి నొందిన మహానుభావులు. సాలోక్య, సార్ష్టి, సామీప్య, సారూప్య, సాయుజ్యములు అనునవి పంచవిధముక్తులు. వారి వారి ఉపాసనా తారతమ్యమునుబట్టి వారి వారి కట్టి యట్టి ముక్తులు సంభవించును. ఇందు ఒకదానికంటె యొకటి శ్రేష్టము. సాలోక్యమనగా వైకుంఠ లోకమునందుండుట. సామీప్యమనగా, అందునను విష్ణువునకు సమీపముననుండుట సార్ష్టి యనగా సమీపమున నుండుటయేకాక ఆయనతో సమానమైన ఐశ్వర్యాదిగుణములు గలిగియుండుట. సారూప్యమనగా ఆయనతో సమానమగు రూపమునుకూడా పొంది యుండుట. సాయుజ్యమనగా ఆయనతో ఏకత్వము చెందుట. అనగా లీనమగుట. ఈ ఏకత్వమొక్కటి మాత్రము జయ విజయులకు కలుగలేదు. తక్కిన నాల్గు దశలు వారికి గలవు. ఎక్కించి ద్భేదమున్నది. ఆ భేదమునకు కారణము భేదబుద్ధి. వారుచేసిన ఉపాసనయందు వా రవలంబించిన దృష్టి విశేషము. వారు చేసినది సగుణభక్తి. నిర్గుణ భక్తిగాదు. సగుణభక్తిలో చాలా యుత్తమోత్తమమైన కోటికి చెందినది. గుణమున్నంత వరకు గుణకృతమైన భేదము తప్పదు.

కర్మ నిర్హారముద్దిశ్య పరస్మిన్వా తదర్పణం
యజేద్యష్టవ్యమితి పృథక్భావ స్స సాత్త్వికః

ఈ సాత్త్వికభక్తి మూడు విధములు. పాపక్షయము నుద్దేశించి పరమేశ్వరుని ప్రీతి కొరకు లేక తన కేర్పడిన విధినిబట్టి ఇట్లు ఏదియో యొకదానిని ప్రధానము చేసికొని భేదబుద్ధితో చేయు ఉపాసన. అనగా ఆ చేయు ఉపాసనము పాపక్షయమును కోరియో, ఈశ్వర ప్రీతికొరకో, లేక స్వధర్మ నిర్వహణకొరకో చేయుట. ఈ మూడింటియందును తాను వేరు, ఈశ్వరుడు వేరు అను భేదభావమున్నది. జయ విజయులు చేసినది ఇట్టి సాత్త్వికోపాసనయే. కావున వారికి సాయుజ్యము కలుగలేదు. వారంత మహానుభావు లైనప్పటికి, అంత యుత్తమస్థితి పొందియున్నప్పటికి వారియందు ఈ భేదబుద్ధి లేశమాత్రముగా ఉన్న కారణమున అచ్చటకు విష్ణుదర్శనమునకు వచ్చిన సనకసనందనాదులను వారు నిరోధించిరి. సనకసనందనాదులు శుద్ధ సాత్విక మూర్తులు. భేదబుద్ధి లేశమాత్రమైనను లేనివారు. పరమేశ్వరునితో ఏకత్వము అనగా సాయుజ్యముపొంది జీవన్ముక్తులై చరించువారు. జయవిజయులు ఎంత సాత్త్వికోపాసన చేసినను వారియందున్న భేదబుద్ధి, వారి రజోగుణమును తమోగుణమును వ్యక్తము చేయుచున్నది. కావున వారు శుద్ధ సత్త్వ సంపన్నులుగారు. ఈ రజస్తమోగుణములు నిశ్శేషముగా క్షాళనము పొందియుండలేదు. కాబట్టి వారు సనకసనందనాదులను పరమేశ్వరునికంటె భిన్నులనుగా చూచుట వారికి నిరోధరూపమైన యవమానము చేయుట

తటస్థించి వారి కోపమునకు పాత్రులైరి. ఇచట ఒక శంక రావచ్చును. సనకసనందనాదులు శుద్ధ సత్త్వమూర్తులు. భేదబుద్ధి లేనివారు, జీవన్ముక్తులు, సర్వాత్మదర్శనులుగదా. వారికి మానావమానములతో పనియేమి? నిగ్రహానుగ్రహములేమి? యని. అందుచేత వారికి నిజముగ కోపము రాలేదు. ఎందుచేత? కోపహేతువైన రజస్తమోగుణములు వారియందు లేవు. కావున వచ్చినది కోపముగాదు. అందుచేత చేసినది నిగ్రహమును కాదు. అమృతకుంభమును తన్నినచో విషము చిందునా? కావున వారు జయవిజయులకు చేసినది అనుగ్రహమే. ఏది జయవిజయులలో సాయుజ్యమునకు ప్రతిబంధకముగానున్నదో, అట్టి భేదభావమును అనతికాలములో తొలగించుకొనుటకు వారిని అనుగ్రహించిరి. కాని అది కోపరూపమున చేసిన ప్రసాదము. వారి కోపము వట్టి నటన. నటనమాత్రమెందుకన్నచో లోకసంగ్రహముకొఱకు. పిల్లవానితో కుస్తీ పట్టినట్లన్నమాట. కావున మహాత్ముల కోపము వలన జయవిజయులకు అశుభవాసన సంప్రాప్తమైనది.

—సశేషం

మాయమ్మ పదస్వర్గ మందున్నతంబుగా
పయనించెనొక గాలిపడగలా నామది
పాపంపు సుడిగాలి బలముగా వీచుచు
పడివడిగ భువివైపు పడద్రోసెదానిని॥ మా॥

విజ్ఞానమను పాగ వీడిపడిపోయెను
నే దాని విడువగా నేలమీదికి దూకె
ఏ రీతి మరి యిది ఎగురును నింగికి
తునకలై దాని తల తునిగిపోయిన పిదప॥ మా॥

ఒకవైపు క్రిందికి వంచుచు మాయమె
కలచె యా నిశ్చల గమనంబు నించుక
నేనెంత శ్రమపడి ఎగురింప జూచిన
మరిదాని నింగికి మరలింపలేనైతి॥ మా॥

భక్తి సూత్రముచేత బంధింపబడి కూడ
యిటు ఆడినందున మిగిలె దుఃఖమెతనకు
అతినీచ స్థితి యందు ఆర్వురు సమకూడి
పడద్రోసి వైచిరి బలమైన శత్రులు॥ మా॥

దారాసుతాదులందలి ప్రేమదారము
పెనవేసి విడరాని పీటముడి పడిపోవ
నా గాలిపడగ తా నడిమికి రెండుగా
చిక్కుపడి దానిలో చినిగిపోయినదయ్యో॥మా॥

అటునవ్వ యిటు యేడ్పులందించు ఆటను
ఆడినందుకు దిగులు నంది "నరేశ్చంద్ర"
ఈ ఆటతానసలు ఆడకుండిననెంత
బాగుండునోయని భావింపగాసాగె॥ మా॥

అనువాదం: బి. ఎస్. ఆర్. ఆంజనేయులు.

# మాతృదేవి చరణ సన్నిధి

ఆంగ్ల గ్రంథము:
**ఎట్ ది హోలీమదర్స్ ఫీట్**

అనువాదము:
**పి. గణపతిశాస్త్రి**

ఉద్బోధన కార్యాలయము ఉదయము.

నేను : అమ్మా, నీవు అప్పుడప్పుడు రామాయణం చదువుతూండడం చూశాను. అయితే చదవడం ఎప్పుడు నేర్చుకున్నావమ్మా!

అమ్మ : నా చిన్నతనంలో ప్రసన్న, రామనాథ్ మొదలయినవాళ్లు మా గ్రామంలో ప్రాథమిక పాఠశాలకు వెడుతూండేవారు. అప్పుడప్పుడు నేను వారివెంట ఆ స్కూలుకు వెళుతూండేదాన్ని. ఆ విధంగా నాకు కొంచెం చదువు వచ్చింది. ఆ తరువాత కామార్పుకూరులో లక్ష్మి, నేను కలిసి అక్షరాలు నేర్చుకుంటూండేవాళ్లము.

కాని నా మేనల్లుడు హృదయ్ మా చేతిలోని పుస్తకాలు, లాక్కుని "ఆడవారు చదువుకోకూడదు. చదువుకుంటే నవలలమీదికి నాటకాలమీదికి బుద్ధి పోతుంది" అంటూ అడ్డుకునేవాడు. కాని లక్ష్మి ఆ ఇంటి ఆడబడుచు కనక పుస్తకం ఇవ్వకుండా నిస్కరించేది. అంతేకాదు. ఆ పుస్తకం తనదగ్గిరే ఉంచుకుంటానని పట్టుపట్టి తన దగ్గిరే అట్టే పెట్టుకునేది.

నేను తరవాత ఒక అణాఖర్చుతో ఆ బాలశిక్ష ఇంకొకకాపీ రహస్యంగా కొనిపించి నా దగ్గిర దాచుకున్నాను. లక్ష్మి మాత్రం మా గ్రామం పాఠశాలకువెళ్లి పాఠాలన్ని నేర్చుకుని వచ్చి నాకు నేర్పుతూఉండేది. కాని దక్షిణేశ్వరంలోనే నేను బాగా చదవడం నేర్చుకున్నాను. ఠాకూరుకు అప్పుడు శ్యామపురంలో వైద్యం జరుగుతూండేది. నేనప్పుడు ఒంటరిగా ఉండేదాన్ని. బాబాముఖర్జీ ఇంటినించి ప్రతిదినము గంగలో స్నానం చెయ్యడానికి ఒక అమ్మాయి వస్తూండేది. ఆమె చాలాసేపు నా దగ్గిరే ఉండి పోయేది. ఆమెకూడా నాకు చదువు చెప్పి, తిన్నగా వచ్చింది, లేనిది పరీక్షచేసి కనుక్కునేది. నేనా అమ్మాయికి చాలా కూరలు, మాలికలు మొదలయినవి ఇస్తూండేదాన్ని. అవి అన్ని మాకు దేవాలయం పూలతోటలోనించి వస్తూండేవి.

నేను : ఠాకూరు జయరాంబాటికి తరుచుగా వస్తూండేవారా? లేక ఒకటి రెండు సారులు మాత్రమే వస్తూండేవారా?

అమ్మ : చాలా సారులు వచ్చేవారు. అలాగ వచ్చినప్పుడు పది పన్నెండు రోజులపాటు ఉండి పోయేవారు. తమ గ్రామానికి వెళ్లినప్పుడు ఆయన జయరాంబాటి, సిహోరు మొదలయిన మిగిలిన ప్రదేశాలుకూడా సందర్శిస్తూండేవారు. ఒకప్పుడాయన సిహోరులో ఉన్న గొల్ల పిల్లలకందరికి విందు చేశారు.

నేను : అది ఆయన భక్తిసాధనల సమయంలో జరిగిందా? లేక ఆ తరవాత జరిగిందా? ఎప్పుడు జరిగింది?

అమ్మ : తరవాతే! భక్తిసాధనలు చేసే సమయంలో ఆయన కేవలం పిచ్చివారులాగుండేవారు! ఆ పరిస్థితిలో ఆయన మామగారి ఇంటికి వెళ్లిఉంటే, అందరు పూర్తిగా మతి పోయిందని అని ఉండేవాళ్లు... ఆ రోజుల్లో ఠాకూరును గురించి అనేకులనేక విధాలుగా మాట్లాడుతూండేవారు... "అయితే మీ అల్లుడు పిచ్చివాడన్నమాట!... ఇకముందు

గ తేమిటి?..." ఇలాగ ఏ వేవో అటూండే వారు.

నేను : అమ్మా, నిన్న ఇక్కడికి వచ్చిన మహేంద్రగుప్తను నేనింతకుముందెన్నడు చూడ లేదు.

అమ్మ : అతను ఇంతకుమునుపు ఒకసారి ఇక్కడికి వచ్చాడు. చాలా చిన్న తనంలో ఠాకూరును సందర్శిస్తూండేవాడు.

నేను : అంతే కాదమ్మా. నేను చిన్న నరే న్‌నుకూడా ఎప్పుడు ఇక్కడ చూడలేదు.

అమ్మ: అవును! అతడు ఇక్కడికి రాడు! కాని చిన్న నరేన్ ఠాకూరుదగ్గిరికి వెడుతూండే వాడు బక్కపలచగా నల్లగా ఉండేవాడు. ముఖంమీద మశూచిక మచ్చలు. ఠాకూరుకి అతనంటే ప్రాణం. అందుచేత చిన్న నరేన్‌ని గురించి చాలా మథనపడుతూండేవారు. 'నా కిప్పుడు చిన్న నరేన్ జ్ఞప్తికి వస్తున్నాడు. ఇప్పుడతడు నన్ను చూడడానికి రాగలడు.' అతనినిగురించి అలా అంటూండేవారు.

నేను మళ్లీ అందుకున్నాను.

నేను : పోయి బాబు యిక్కడికి ఒకే ఒక్క సారి వచ్చారు. కాని బెల్‌ఘూరియా తారక్ బాబు కొన్నిసారులు వచ్చారిక్కడికి.

అమ్మ : పోయి బాబుకూడా అప్పుడప్పుడు ఇక్కడికి వస్తూంటాడు. తను చాలా లేమి అనుభవిస్తున్నా, నాకు ప్రతినెలా ఒక రూపాయి ఇస్తూంటాడు. నే నొకవేళ జయరాంబాటిలో ఉంటే ఆ రూపాయి అక్కడికి పంపిస్తాడు. పోయి బాబు, మహేంద్ర ఠాకూరు నన్ను సందర్శించడానికి వచ్చినప్పుడు చాలా చిన్నవాళ్లు, పది, పదకొండేళ్ల వయస్సు. అంతే.

కాశీపూర్ తోటలో ఒకప్పుడు హోలీ పండుగ సమయంలో అందరు హోలీ ఉత్సవాల్లో పాల్గొనడానికి వెళ్లిపోయారు. కాని ఆ పసివాళ్లిద్దరు మాత్రం ఠాకూరుదగ్గిరనించి కదల లేదు! వాళ్లిద్దరు ఠాకూరుకు విసురుతూ ఒకరి తరవాత ఇంకొకరు పరిచర్య చేశారు. పాపం చిన్న పిల్లలుగదా, అంత బాగా పరిచర్య చెయ్యలేకపోయారు. ఆ సమయంలో ఠాకూరుకు దగ్గుతెర వచ్చింది. తలనొప్పి ప్రారంభమయింది. అందుచేతనే ఆయనకు విసరవలసిన అవసరం కలిగింది.

అయితే, ఆయన, "అందరు హోలీ ఉత్సవాల్లో కలిసి ఆడుకుంటున్నారు. త్వరగా కిందికి వెళ్లండి!" అని మాటి మాటికి ప్రోత్సహించారు. కాని వాళ్లా మాట చెవిని పెట్ట లేదు. పోయి "మేము కిందికి వెళ్లదలచు కోలేదండి! మేమిద్దరము ఇక్కడే ఉండి పోతాము. మీరిక్కడ ఇలాగ ఉన్నప్పుడు మే మెలాగ వెళ్లగలము!" అన్నాడు. ఆ విధంగా ఆ పసివారిద్దరు వెళ్లజాలమని తిరస్కరించిన తరవాత. ఠాకూరు కళ్లమ్మట నీళ్లతో దుఃఖించి, "వాళ్లిద్దరు నా బాలరామచంద్రులు! నన్ను ఆదుకుని పరిచర్య చెయ్యడానికి ఇక్కడికి వచ్చారు. వాళ్లిద్దరు నన్ను విడిచి ససేమిరా వెళ్లమంటున్నారు. ఆ ఉత్సవంలో పాల్గొనాలన్న ఆలోచనే లేదీ పసివారికి!" అన్నారు.

నేను : శిష్యులెంతోమంది ఠాకూరును సందర్శిస్తూండేవారు. ఎవ్వరు ఇక్కడికి రారే! వారందరు ఏమయిపోయారు?

అమ్మ: వారందరు తమంతట తామే ఎక్కడో అక్కడ ఆనందంగా తమకాలం వెళ్ల బుచ్చుకుంటున్నా రనుకుంటాను!

నేను : ఎటువంటిదమ్మా ఆనందం?

అమ్మ : అవును, నిజమే సుమి! అదే ఉచ్చ మయిన ఆనందం! లేకపోతే సాంసారిక జీవితం

లో వారి కెక్కడయినా ఆనందం లభించ గలదా? ప్రపంచజనని ఆ కాళికామూర్తే! మంచి చెడుగులు రెండు ఆ జగన్మాతనుండే ఆవిర్భవించాయి....ఇతరుల తప్పిదాల అంత రువులోనికి తన మనస్సు దించివేసుకున్న తర వాతే మనిషి వారిదోసగు లెన్నుతున్నాడు. కనక ఇతరుల లోపాలెన్నడు ఎన్నరాదు. ఎవరో విమర్శించినంతమాత్రాన ఎవరికయినా ఉన్నది ఏమాత్రమయినా పోతుందా? అందు వల్ల విమర్శించిన వ్యక్తే బాధపడతాడు. అంతే! చిన్ననాటినించి నా ధోరణి ఇంతే! కనక నేను ఇతరులదోసగు లెన్నడు ఎన్నను. ఎంత చిన్న సేవ చేసినా నేను వారిని జ్ఞాపకం పెట్టుకోవ డానికి ప్రయత్నిస్తాను. అసలు ఇతరులలో దోసగులు అన్వేషించాలని అనుకోవడమే ఒక తప్పు పని! కనకనే నేనితరులలో లోపాల కోసం చూడను. తప్పులు మన్నించేధోరణి నిజంగా దివ్యధోరణి.

నేను : వివేకానందస్వామి ఇలాగంటూండే వారు "ఎవరయినా దొంగ ఒక గదిలో ప్రవే శించి ఏదయినా ఎత్తుకుపోతూంటే సహజంగానే 'దొంగ! దొంగ!' అని అరుస్తావు? కాని పసి పాపల మనస్సులలో దొంగలు లేరు! ఒక మనిషిని పసిపాప లెవరు దొంగగా గుర్తిం చరు."

అమ్మ : అవును, నిజమే! సహజంగా పవిత్ర మయిన మనస్సున్నవారు ప్రతిది పవిత్రమైనది గానే భావిస్తారు. బృందావనంలో మాధవజీ దేవాలయంలో ఎవరిదో ఒకపాప నేల మలినం చేసింది. ప్రతివారు ఆ సంగతి ప్రస్తావించారు గాని, ఎవ్వరు అక్కడినేల పవిత్రం చెయ్యా లన్నమాటే ఆలోచించలేదు! గోలప్‌మా ఆ సంగతి కనిపెట్టి, తన చీర చెరగులోనించి అంచు చించి, ఆ ప్రదేశం అంతా దానితో తుడిచి పరిశుభ్రం చేసింది. ఆపక్కనే ఉన్న ఒకావిడ, ఆమె ఆ ప్రదేశం బాగుచేస్తున్నది కనక, "ఆ పసిపాప ఆమెకన్న బిడ్డ అయిఉండాలి." అన్న ది. 'ఓ మాధవజీ! వా రేమంటున్నారో విను! విను!' అని అంతర్యంలో అనుకున్నాను నేను. ఇంకొక రిలాగ అన్నారు. 'కాదు. వారు సన్యా సినులు. వారికి పిల్లలు లేరు. ఇతరుల సౌకర్యం కోసమే వారీపని చేస్తున్నారు.'

సాయంత్రం లలితబాబు మాతృదేవికి నమ స్కరించాలని వచ్చారు. వారిప్రసంగంలో నేను కూడా పాల్గొన్నాను.

అమ్మ : "క్షురధారలాగ చాలా కష్టగమ్య మయిన మార్గమిది." అని ఠాకూరు అంటూం డేవారు. కాని భగవానుడు తన బాహుబంధ నాలతో మనల నాదుకుంటాడు.

అలాగ అన్నతరవాత, అమ్మ తిరిగి తమ మాట సరిదిద్దుకుని 'ఆయన మనకష్టాలలో ఆదుకుంటారు" అన్నారు.

నేను : ఏమోనమ్మా, ఆయన మన కేమి అనుగ్రహించడం లేదు!

అమ్మ : అందుకని బాగా దిగులుగా ఉన్నావా?

నేను : అవును.

దానిమీద లలితబాబు అందుకుని, "మర ణించిన పిమ్మట ఆయన మనల్ని గుండె కద్దు కుంటే అంతకన్న మనకేం కావాలి? అయితే బ్రతికిఉండగానే అలాగ హృదయానికి హత్తు కుంటే మరింతగా బాగుండిపోను!

అమ్మ: అవును! నిజంగానే బ్రతికిఉన్నప్పుడు కూడా మనలను భగవానులు ఎంతో ఆత్మీ యంగా గుండెకద్దుకుంటూనేఉన్నారు. ఆయన ఎల్లప్పుడు, మనల నాదుకుంటూనే ఉన్నారు.

16, ఆగస్టు, 1912.

అమ్మ: నాకు 13 ఏళ్లు నిండగానే కామార్పుకూర్‌కి వెళ్లవలసిన ఆవశ్యకత కలిగింది. కనక నేనక్కడికి వెళ్లాను. ఠాకూరు అప్పుడు దక్షిణేశ్వరంలో ఉన్నారు. అందుచేత సుమారు నెలరోజులపాటు కామార్పుకూర్‌లో ఉండి నేను జయరాంబాటికి తిరిగి వెళ్లిపోయాను. అయిదారు నెలలతరవాత తిరిగి నేను కామార్పుకూర్ వెళ్లి, ఇంచుమించుగా ఆరువారాల పాటు అక్కడే ఉండిపోయాను. ఠాకూరు అప్పటికింకా దక్షిణేశ్వరంలోనే ఉండిపోయారు. అయితే ఆయన పెద్దన్నగారు, మా వదినగారు, మిగిలిన మరికొందరు కామార్పుకూర్‌లో ఉన్నారు. ఆ తరవాత ఇంటికి తిరిగివచ్చిన పిమ్మట నాకోసం కబురు పంపించారు. దాని మీద తిరిగి నేను కామార్పుకూర్ వెళ్లాను. ఆ తరవాత మూడునెలలదాకా అక్కడే ఉండిపోయాను.

...ఆ తరువాత జయరాంబాటికి తిరిగి వచ్చాను. ఠాకూరుకు మతి చలించిందని, ఆయన నగ్నంగా సంచరిస్తున్నారని ఆ సమయంలో అనేకులముఖతః విన్నాను ఆయన గంభీరభక్తి తన్మయత ఎవ్వరికీ అవగాహన కాలేదు. అందుచేత నేనే స్వయంగా వెళ్లి అందరు అంటున్న మాటల నిజానిజాలు కనుక్కుందామని అనుకున్నాను. ఆసమయంలో ఏవో ఉత్సవాలలో గంగాదేవిలో స్నానం చెయ్యడానికని మా పల్లెటూరి స్త్రీలు కొంతమంది కలకత్తా వెళ్లుతున్నారు. అది అంతా ఫాల్గుణ మాసం దరిదాపుల్లో జరిగిందనుకుంటాను. ఠాకూరు ఆరోగ్యపరిస్థితి తెలుసుకోడానికి కలకత్తా వెళ్లాలని ఉన్నదని నేను ఒకావిడతో అన్నాను. ఆమె ఆమాట మా నాయనతో అన్నది. ఆ సంగతి నేనే స్వయంగా ఆయనతో చెప్పడానికి నా కెంతో బిడియము, భయము కలిగాయి. ఆపైన "ఆమెకు వెళ్లాలని ఉంటే తప్పకుండా వెళ్లవచ్చును." అని మా నాయన అన్నారు. ఆతరవాత ఆయనే స్వయంగా నా వెంట వచ్చారు.

"దారిలో నాకు జ్వరం తగిలింది. క్రమక్రమంగా ఆ జ్వరం మరింతగా ఎక్కువైంది. నాకు స్పృహ తప్పిపోయింది. ఆరాత్రి ఒక నల్లని స్త్రీమూర్తి నా తలదగ్గిర కూర్చుని నా కణతలు నొక్కుతున్నట్టు కలగన్నాను. "నేను దక్షిణేశ్వరంనించి వస్తున్నాను" అని ఆమె అన్నది. "నేనుకూడా ఆయనదగ్గిరికే వెళుతున్నాను. మీ కెలాంటి బంధువాయన" అని నేనడిగాను. "నేను నీ సహోదరిని. నీకు జ్వరం తగ్గుతుంది. భయపడకు!" అని నన్ను ఓదార్చింది ఆమె.

"ఆ మరునాడే నా జ్వరం తగ్గిపోయింది. చిట్టచివరికి నా ప్రయాణానికి ఒతంస వారే ఏర్పాటు చేశారు మా నాయన. రాత్రి ఇంచుమించుగా తొమ్మిదిగంటలయ్యేసరికి మేము దక్షిణేశ్వరం చేరుకున్నాము. నేను తిన్నగా ఠాకూరున్నగదికి వెళ్ళాను. మిగిలినవాళ్లంతా నహబత్‌కి వెళ్ళారు. అక్కడ ఠాకూరుతల్లి నివసిస్తున్నారు. ఠాకూరు నన్ను చూస్తూనే "అయితే నీవు వచ్చావన్నమాట! మంచిది!" అన్నారు. కేకవేసి ఒకతన్ని పిలిచి, "ఇక్కడ చాప వెయ్యి!" అన్నారు. చాప వేసినతరవాత "ఇప్పుడింక సేజోబాబు లేరు మరి! నా కుడి చెయ్యే పోయింది!" అన్నారు. ఆయన కొన్ని నెలలక్రితం చనిపోయిన, మధుర బాబునుగురించి ఆ మాట లన్నారు. ఠాకూరు అన్నకుమారుడు అక్షయ్‌కూడా కొన్ని నెలలక్రితం మరణించారు.

-సశేషం

# ఋణ విమోచనం

చిర్రావూరు వెంకట్రావు

పూర్వం విష్ణుపురం అనే నగరంలో భీమయ్య అనే చర్మకారకుడు ఉండేవాడు. అతనికి సంతానం కలుగలేదు. పూజలు వ్రతాలు చేసినా ఫలితం కలుగలేదు. ఆ నగరానికి కొంత దూరంలో వున్న ఆశ్రమంలో ఒక యోగిని ఉన్నదనీ, ఆమె చాల మహాత్మ్యకలదనీ ఆమెను దర్శనం చేసుకుంటే అతని కోర్కె నెరవేరుతుందనీ కొందరు సలహా ఇవ్వగా భీమయ్య యోగిని ఆశ్రమానికి వెళ్లి తన మనోగతం విన్నవించుకున్నాడు.

ఆమె అతని కోర్కెవిని 'కొన్నాళ్లలో నీకు కుమారుడు జన్మిస్తాడ'ని దీవించింది.

తర్వాత యోగిని చెప్పినట్లుగానే భీమయ్యకు చక్కని కుమారుడు పుట్టాడు. ఆ బిడ్డ నెత్తుకొని భీమయ్య యోగినివద్దకువెళ్లి ఆమె పాదాల ముందు ఆ పసిబిడ్డనుంచి ఆశీర్వదించమని ప్రార్థించాడు.

యోగిని ఆ శిశువును తదేకంగా కొంతసేపు చూచింది. ఆ తరువాత కొన్ని క్షణాలు ఏదో ఆలోచించుకొని భీమయ్యను చూచి ఇలా అన్నది.

"వీడు సామాన్యుడుకాడు. ఏదో ప్రారబ్ధం మిగిలి నీకు పుట్టిన బ్రహ్మజ్ఞానిలాగున్నాడు. పూర్వం నీకేదో ఋణపడిఉండి ఆ ఋణం తీర్చటానికే నీకు పుట్టిఉంటాడు. కాబట్టి నేను నీకొకటి చెబుతాను. గుర్తుంచుకో. మరిచిపోవద్దు. వీనిచేతనుండి 'ధనం' ఎప్పుడూ తీసుకొనవద్దు." అని చెప్పి అతనిని ఆశీర్వదించి పంపించింది.

ఆ పిలవాడు క్రమక్రమంగా పెరిగి పన్నెండు సంవత్సరాలవాడైనా అందరి పిల్లలమోస్తరుగా ఆటపాటల్లో పాల్గొనటంగాని ఇంటిపనుల్లో జోక్యం చేసుకోవటంగాని నలుగురిలో కలిసిమెలిసి తిరగటంగాని చేయకుండా ఒంటరిగా కూచొని ఏదో ధ్యానించుకుంటూ వుండేవాడు. తండ్రి తప్ప మిగతావారందరు ఆ పిల్లవానిని తెలివితేటలు లేని మందుడని నిరసించేవారు.

ఆ నగరం పాలించేరాజు తన పట్టణంలో దొంగలబాధ లేకుండచేయుటకు రాత్రివేళ జాముజాముకు జాగ్రత్తగా ఉండమని ప్రజలను హెచ్చరిస్తూ చాటింపువేసే ఏర్పాటుచేసి ఆ పని చేయుటకు నగరంలోఉన్న చర్మకారకులను నియమించాడు. రాజాజ్ఞప్రకారం ఇంటికొకరు చాటింపు వేస్తుండేవారు.

ఒకరోజున భీమయ్య సాయంత్రానికి తిరిగి వస్తానని పొరుగూరువెళ్లి కారణాంతరములచే రాలేకపోయినాడు.

ఆ రోజు చాటింపు వేసేవంతు భీమయ్యదని గూడెంపెద్ద కబురంపాడు. అతనిభార్య ప్రొద్దు గూకిందాకా భర్తకోసం ఎదురుచూచింది. అతను రానందున చాటింపువేయుటకు ఇరుగు పొరుగులవారిని బ్రతిమాలుకుంది, కాని ఎవరు ఆమె మాటలను వినిపించుకున్నవారు కారు. ఆమె రాజుగారితో మాటవస్తుందనీ, తమ పరువు మానం రాకుండపోతుందనీ భయపడింది. ప్రొద్దు గూకినకొద్దీ ఆమెకు భయం ఎక్కువ కాసాగింది. చివరకు గత్యంతరంలేక ఒకమూల కూచున్న కొడుకుని పిలుచుకొనివచ్చి తప్పెట చేతికిచ్చి చేయవలసినపని చెప్పింది. ఆ పిల్లవాడు మౌనంతో తప్పెట తీసుకొని బయలుదేరాడు. కాని తల్లి ఈ తెలివితక్కువవాడు

సక్రమంగా చాటింపు వెయ్యలేకనీ, రాజుగారి దండన తప్పదనీ, తమ ఆదాయానికి నష్టం కలుగుతుందనీ మనసులో బాధ పడుతునే వుంది.

తప్పెటతో వెళ్లిన పిల్లవాడు మొదటిజాము కాగానే,

"కామః క్రోధశ్చ లోభశ్చ దేహే తిష్ఠన్తి తస్కరాః
జ్ఞానరత్నపహారాయ తస్మాత్ జాగ్రత జాగ్రత."

"ఓ నగరవాసులారా! కామము క్రోధము లోభము అనేదొంగలు జ్ఞానమను రత్నమును దొంగిలించుటకు మీ శరీరంలో దాగియున్నారు. కాబట్టి జాగ్రత్తగా ఉండండి" అని కేకలు వేస్తూ చాటించాడు.

ఆ దండోరా రాజు విన్నాడు. చాలా ఆశ్చర్యం పొందాడు. మామూలు చాటింపుకు భిన్నంగాను, జనుల అజ్ఞానం పోగొట్టేదిగాను ఆ చాటింపు ఉంది. తెల్లవార్లు మేలుకొని ఏవిధంగా దండోరా వేస్తాడో విందామని నిర్ణయించుకున్నాడు.

రెండవజాము వచ్చింది. ఆ పిల్లవాడు తప్పెట వాయిస్తూ,

"జన్మదుఃఖం జరాదుఃఖం జాయాదుఃఖం పునఃపునః
సంసారసాగరందుఃఖం తస్మాత్ జాగ్రత జాగ్రత॥"

"పుట్టుటయే దుఃఖం, ముసలితనం దుఃఖం, జన్మపరంపరలకు కారణమైన సంసారమనే సముద్రం దుఃఖం. ఇవన్నీ దుఃఖము కలిగించునవే, కాబట్టి జాగ్రత్తగా ఉండండి" అని చాటించాడు.

మూడవజాములో—

"మాతానాస్తి పితానాస్తి నాస్తిబంధుసహోదరాః
అర్థంనాస్తి గృహంనాస్తి తస్మాత్ జాగ్రత జాగ్రత"

"తల్లి లేదు, తండ్రి లేదు, బంధువులు అన్నదమ్ములు లేరు. ధనం లేదు. ఇల్లు లేదు. ఇవన్నీ ఉన్నా లేనివాటితో సమానమే. కావున జాగ్రత్తగా వుండండి."

నాల్గవజాము రాగానే,

"ఆశయా బధ్యతేలోకే కర్మణా బహు చింతయా
ఆయుక్షీణం నజానాతి తస్మాత్ జాగ్రత జాగ్రత"

"ఆశచేత కట్టబడి లోకమందు మానవుడు కర్మచేతను రకరకములైన ఆలోచనలచేతను ఆయుర్దాయము తరుగుటను తెలుసుకొనలేక పోవుచున్నాడు. కావున జాగ్రత్తగా ఉండండి" అని చాటించి ఆ పిల్లవాడు ఇంటికి వెళ్లి పోయినాడు.

దండోరా విన్న రాజుగారికి అమితానందం కలిగింది. ఎవరో మహాజ్ఞాని చాటింపు వేశాడని గ్రహించాడు. తెల్లవారగనే భటులను పంపి ఆ మహానుభావుడ్ని పిలిపించి సత్కారంచేసి జన్మసార్థకం చేసుకోవాలని తీర్మానించుకున్నాడు.

తెల్లవారగా గ్రామాంతరం వెళ్లిన భీమయ్య ఇంటికి తిరిగివచ్చాడు. రాగానే భార్య చాటింపు వేయుటకు పిల్లవానిని పంపించాననీ, ఆ తెలివి తక్కువవాడు సరిగా చెప్పిన పని చేశాడో లేదోనని భయంగా ఉందని తన ఆందోళన వెల్లడించింది. అదే సమయంలో రాజభటులు వచ్చి 'రాజుగారు రాత్రి చాటింపు వేసినవానిని తీసుకొనిరమ్మన్నారు. మేము గూడెం పెద్దను విచారించగా నీ వంతని చెప్పాడు. వెంటనే రావలసింద'ని తొందరచేశారు. అందుకా దంపతులు భయపడుతూ 'పిల్లవాడు దండోరా వేశాడనీ, కొత్త కావటంవల్ల ఏదైనా పొరపాటు చేసిఉంటే క్షమించమ'నీ ఆ భటులను బ్రతిమాలగా వారు 'మాకేమీ తెలియదు ఆ చెప్పుకొనేది రాజుగారితోనే చెప్పుకోండ'నగా భీమయ్య పిల్లవానితోసహా ఆస్థానానికి వెళ్లాడు.

రాజుగారు పిల్లవాని ముఖవర్చస్సు చూచి తన ఊహ నిజమేనని సంతోషించాడు. ఆ పిల్లవాని పాదాలకు నమస్కరించి ఆసనంమీద కూర్చోబెట్టి పుష్పమాలికలతో అలంకరించి కట్టుకొనుటకు పట్టుపీతాంబరాలిచ్చి కానుకగా బంగారు నాణ్యాలున్న సంచి నిచ్చి అశ్వంపై నెక్కించి ఇంటికి సాగనంపాడు. భీమయ్య ఆశ్చర్యంతోను ఆనందంతోను పిల్లవాడెక్కిన గుర్రం కళ్ళెం పట్టుకొని మెల్లగా నడిపించు కుంటూ ఇంటికి బయలు దేరాడు. రాజసభలో పిల్లవానికి జరిగిన సన్మానం విషయం గూడె మంతటికి తెలిసి పిల్లవానిని చూచుటకు ఆ యింటిముందు వారందరు గుమికూడారు. భీమ య్యభార్య మహదానందంతో గుమ్మంలో పిల్ల వానికోసం ఎదురుచూస్తూ నిలుచుండినది.

పిల్లవాడెక్కిన గుర్రాన్ని నడిపించుకుంటు భీమయ్య ఇల్లుచేరి కొడుకును గుర్రంనుంచి నెమ్మదిగా దిగమన్నాడు, కుర్రవాడు తన చేతిలోనున్న ధనంమూటను తండ్రిచేతి కిచ్చాడు. గుర్రం దిగుతుండగానే అచేతనుడై క్రింద బడ్డాడు. అతని అంతరాత్మ పరమాత్మలో లీనమైపోయింది.

అక్కడ గుమికూడినవారందరూ ఏడుస్తుంటే భీమయ్య యోగిని చెప్పినది అప్పుడు స్మరించు కున్నాడు. "వీడు సామాన్యుడు కాడు. ఏదో ప్రారబ్ధం మిగిలి నీకు పుట్టిన బ్రహ్మజ్ఞాని. పూర్వం నీకేదో ఋణపడిఉంటి ఆ ఋణం తీర్చ టానికే నీకు పుట్టిఉంటాడు. కాబట్టి నేను నీకు ఒకటి చెబుతాను. గుర్తుంచుకో. మఱచిపో వద్దు. వీని చేతనుండి ధనం ఎప్పుడూ తీసికొన వద్దు."

త్యక్తవ్యో మమకారః త్యక్తుం యది శక్యతే నాసౌ ।
కర్తవ్యో మమకారః కింతు స సర్వత్ర కర్తవ్యః ॥

మమకారమును వదలిపెట్టవలెను. వదలిపెట్టుటకు సాధ్యముకాకపోయినచో సర్వత్ర మమకారమును పెంపొందించుకొనవలెను.

---

పర్వతమునకు ఔన్నత్యము ఉన్నదిగాని గాంభీర్యము (లోతు) లేదు. సముద్రమునకు గాంభీర్యము ఉన్నదిగాని ఔన్నత్యము లేదు. ధీరపురుషునకు ఔన్నత్యము, గాంభీర్యము— రెండును ఉన్నవి.

సత్కవి తన కావ్యనిర్మాణమునకు శబ్దార్థములందు—రెంటియందును దృష్టి ఉంచు నట్లు బుద్ధిమంతుడు తన కార్యసాధనకు పురుషకారమును, దైవమును—రెంటిని అపేక్షించును.

* * * *

రెండు వైపులనుండి గంగా ప్రవాహమువచ్చిపడిన సముద్రునకు ఎట్టి అపూర్వశోభ కలుగునో అటువంటిశోభతో ఇరుపార్శ్వములందును వీయబడుచున్న తెల్లని వింజామరలతో నీలమేఘశ్యాములుడైన శ్రీ కృష్ణమూర్తి ప్రకాశించెను. —మాఘుడు.

# సర్వాత్మత్వ వైభవము

నిర్వికల్పసమాధి అనగా నేమి ?

వికల్పములనుండి మనస్సు విడువడిన స్థితి.

వికల్పములనగా నేమి ?

(1) రూప, స్పర్శ, రస గంధాది బాహ్య విషయసంసర్గమును గుర్తించుట, (2) సుఖ దుఃఖాది భావములు, (3) చింతన, భావన, నిశ్చయము మున్నగు మనోకార్యములు, (4) 'నే నిది చేయుదును', 'నేను దీనిని గ్రహింతును', 'నేను దీనిని తెలిసికొందును', 'నేను ఇది అనుభవింతును', 'నేను దీనిని త్యజింతును', అను ప్రవృత్తి నివృత్తి రూపమైన అంతఃకరణధర్మములనే వికల్పము లందురు. సంకల్ప వికల్పాదికమైన మనోవికారము లన్నియును విడువడినపిమ్మటగాని నిర్వికల్పసమాధి అందదు.

ఈ మనోవికారములు దేనిపైన ఆధారపడి యుండును?

'నేను', 'నేను' అను భావనపైన.

నేనను స్మరణ నశించినతోడనే వికారములు నశించును. గనీసము ఎంతసేపు నేనను భావము లేకుండపోవునో అంతవరకు మనస్సుకు ఆధారము లేకుండపోవును.

మఱి సుషుప్తి (గాఢనిద్ర), అవస్థలోగూడ నేననుజ్ఞానము లేకుండపోవునుగదా. నిర్వికల్ప సమాధి అటువంటిదేనా ?

కాదు. సుషుప్తి అవస్థలో 'నేను' అను జ్ఞానము అంతర్గతముగా ఉండనే యుండును. అనగా వికారములన్నియు మనస్సున లోపల ఉండును.

కాని ఈ అహం స్ఫురణ ఈవిధముగా సుషుప్తిలోకూడ ప్రవర్తించునని ఎట్లు తెలియును ?

దానిప్రభావమును పరిశీలించుటవలన. నాడి, రక్తప్రసారము, హృదయస్పందనము మున్నగునవి ఆ స్థితులలోకూడ జరుగుచునేయుండును. వీటికి నేనను స్ఫురణయే కేంద్రము. బాహ్యచిహ్నములు, సుషుప్తి, సమాధులయందు ఒకే విధముగా కనిపించినను సుషుప్తినుండి తెలివి వచ్చినతరువాత ఆ వ్యక్తియొక్క జ్ఞానము, ఆనందము మున్నగునవేమియు మార్పుచెందక ఇదివఱకువలెనే యుండును. కోపిష్ఠియొక్క కోపము, లోభియొక్క లోభము ఇతర వికారములు నిద్రకు ముందటివలెనే ప్రవర్తిల్లును. కాని నిర్వికల్పస్థితి కలిగినతరువాత ఈ వికారములు ఇక తల ఎత్తలేవు. సరిగదా విశ్వాకారుడగు భగవంతునియొక్క అపరోక్షానుభవము కలుగుటచే సకల దుఃఖ నివృత్తి కలిగి, వాని అస్తిత్వ, నాస్తిత్వాదిక సకలసంశయములు నశించి అసాధారణమైన ప్రజ్ఞ, ఆనందము మనస్సున ఆవిర్భవించును.

మఱి శ్రీరామకృష్ణుల విషయమున ఈ అహంభావనివృత్తి కొంత సమయమే కలుగుచుండెను గదా ?

వారికి ఆవిధముగా కలిగినప్పుడెల్ల విశ్వాకారకమైన జగన్మాత ప్రత్యక్షానుభవము కలిగినది. మొదట అది మూడురోజుల పర్యంతమే యుండగా తరువాత శాశ్వతముగా ఆ స్థితియందే కొనసాగుటకు వారు ఇచ్ఛగించుచుండిరి. ఒక్కొక్కప్పుడు అహంస్ఫురణ పూర్తిగా నశించినప్పుడు బాహ్యశరీరమున అచేతన లక్షణములు కనిపించగా అంతరంగమున నిరంతర దివ్యదర్శనము కలుగుచుండెడిది. మఱియొకప్పుడు నేనను వృత్తి కొలదిగా కలుగుటతోడనే బాహ్యమున చైతన్యచిహ్నములు కలిగి అంతరంగమున మనస్సు అను ప్రతిబంధకము ఏర్పడినప్పటికిని శుద్ధస్ఫటికమువంటి పవిత్రత, సత్త్వప్రవృత్తి, కలిగి పారదర్శకమైన

వారిమనస్సు ఈ అంతర్దర్శనమును అడ్డగింప లేకపోయెడిది. ఈవిధముగా ఒకప్పుడు అహం స్ఫురణ పూర్తిగా నశించి సమస్త మనోవికారములు నిలిచిపోయి విశ్వజననియొక్క పరిపూర్ణ ప్రత్యక్షదర్శనము కలుగుట మరియొకప్పుడు కొలదిగా అహంస్ఫురణ కలుగుటతో బాటు కొంచెము (సాత్త్వికమైన) మనస్సు ప్రవర్తిల్లినను జగన్మాతృదర్శనము కొంచెము పరోక్షముగా కలుగుచునేయుండుటయు జరుగుచుండెడిది.

మఱి ఇట్టి సమాధిస్థితి ఒకప్పుడు ఆరునెలలపాటు అవిచ్ఛిన్నముగా ఉండెనని వింటిమిగదా. ఆహారాదికములు గ్రహించుట సంభవముగాని ఆస్థితియందు శరీరము నిలచుట ఎట్లు సంభవమైనది?

అట్లు నిలుచుట సామాన్యముగా సంభవము కాకపోయినను జగన్మాతయొక్క ప్రత్యేక కార్యములకొఱకు ఆమె ఇచ్ఛవలననే శరీరమటు నిలిచియుండినది.

అనగా జగన్మాత శరీరముదాల్చి వారికి ఆహారము తినిపించెనని భావమా?

అట్టిదే జరిగెను. ఒకసాధువు ఎక్కడినుండియో వచ్చి వారి అచైతన్యస్థితిని యోగజనితమైనదియు భగవదైక్యానుభూతివలన వారి శరీరము జడమయ్యెననియు గ్రహించి వారికి అతికష్టముచే కొలదిగా శరీరస్పృహ కలిగించి కొంచెము ఆహారము బలవంతముగా లోనికి నెట్టెడివాడట. ఈవిధముగా ఆరునెలలు ఆ సాధువు అక్కడనేయుండి అసాధారణమైన పూనికతో వారి శరీరమును నిలబెట్టుటకు శ్రమించెను. ఇది ప్రత్యక్షముగా జగన్మాతయొక్క సంకల్పము, ఇచ్ఛకాక మరేమనగలము.

ఒక్కొక్కప్పుడు వారి అహం స్ఫురణ పూర్తిగా నశించుటయు మరియొకప్పుడు కొద్దిగా ప్రవర్తిల్లుటయు జరుగుచుండెనని గమనించితిమి కదా. ఈ కొలది అహంస్ఫురణ కలిగినప్పుడు ఈ విశ్వము వారికి మనకువలెనే తోచలేదు. విశ్వమంతయు-అసంఖ్యాక విచార తరంగములు ఉద్భవించి లీనమగుచుండు ఒక మహామనస్సువలె తోచెడిది. స్వీయశరీరము, మనస్సు, అహంస్ఫురణ వారికి ఈ మహాచేతస్సుయొక్క ఒకతరంగమువలె కనిపించెడివి. ఆ మహాచేతస్సుయొక్క అసంఖ్యాకమైన భావ తరంగములను పరిమిత అహం ప్రవృత్తులైన వారు పాక్షికముగామాత్రమే గ్రహించుటచే వానిని బాహ్యప్రపంచము, అందలి వస్తుసంచయముగా భ్రమించి ప్రవర్తిల్లుచున్నారు ఈ పరిమితజ్ఞానము కలిగినవారు తమ జ్ఞానమునకు, అస్తిత్వ కర్తృత్వములకు ఆ అనంతమైన చేతస్సే మూలము అని తెలియలేక పోవుచున్నారు. వ్యాప్తమైన అఖండచైతన్యమును తెలిసికొనలేక పోవుటచేతనే పరిమిత జ్ఞానము కలిగిన జీవులు తమకు స్వతంత్ర ఇచ్ఛ, శక్తి కలిగినట్లుగా భ్రమించుచున్నారు. ఇదే శాస్త్రమున అవిద్య లేక అజ్ఞానమని పేర్కొనబడెనని శ్రీ రామకృష్ణులకు తెలిసెను.

శ్రీ రామకృష్ణుని అహంస్ఫురణ పూర్తిగా మాయమయినప్పుడు వారు విశ్వచేతస్సునకు అతీతమైన నిర్గుణ పరబ్రహ్మముతో ఐక్యమైయుండిరి. ప్రపంచమని పిలువబడే నానా భావ తరంగములుకూడ అహంస్ఫురణ యను ఆధారముతోబాటు మాయమయ్యెడివి. మరల కొంచెము అహంస్ఫురణ ప్రవర్తిలినతోడనే వారికి సగుణమైన విశ్వచైతన్యము మరియు దానిలోని అనంత భావతరంగములు జగన్మాతయొక్క నిర్గుణస్థితితో ఏకముగా (అభేదముగా) యున్నట్లే కనిపించెడివి. అనగా వారు నిర్గుణ

స్థితి పొందినపుడు ఈ అద్వితీయ చైతన్యము నందలి స్వగతభేదము పూర్తిగా అదృశ్య మయ్యెడిది. మరియు సగుణ విశ్వచైతన్యము యొక్క స్ఫురణ కలుగుటచే వనే వారికి ఏది శక్తియో అదే బ్రహ్మమను భావము, ఏది నిర్గుణమో అదే సగుణమనియు ఏది ప్రకృతియో అదే పురుషుడు అనియు అనుభూత మయ్యెడిది.

మఱి శంకరాచార్యులవారు ఈ విశ్వము యొక్క ప్రత్యేక అస్తిత్వమును నిరాకరించిరి కదా! శ్రీ రామకృష్ణులు విశ్వాత్మయగు జగన్మాతయందు స్వగతభేదమును అంగీకరించి ఆమెయందు సగుణ నిర్గుణములను రెండు స్థితు లను గుర్తించిరికదా! వారు అద్వైత సిద్ధాంత మును అనుసరింపనట్లేనా?

అట్లుకాదు. వారు అద్వైత, విశిష్టాద్వైత, ద్వైతములను మూడు సిద్ధాంతములను అంగీ కరించిరి. మనస్సుయొక్క ఒకస్థితియందు సత్యము ద్వైతముగా అనుభవమునకు వచ్చి నపుడు మిగతా రెండు స్థితులు అసత్యమువలె తోచును. మనస్సు అంతకంటె ఉన్నతస్థితికి పోయినపుడు గుణరహితమైన సత్య తత్త్వమే లీలావిభూతియందు గుణసహితమై ఆవిర్భవించు నని తెలియును. అప్పుడు ద్వైత, అద్వైత సిద్ధాంతములయందు నిజము లేనట్లే కనిపించు ను. కాని ఆధ్యాత్మిక సాధనలో పరాకాష్ఠ నొంది మనస్సు అత్యున్నతస్థితికి చేరినంతనే నిర్గుణానుభవము కలుగును. అప్పుడు నేను... నీవు అను భావములు కర్తృత్వ భోక్తృత్వ ములు, బంధమోక్షములు, పాపపుణ్యములు, శుభాశుభములు, మంచిచెడ్డలన్నియు - ఒకే తత్త్వమందు లీనమగును.

ఈ విషయమున దాస్యభక్తియొక్క మూర్తిభావమగు హనుమంతుని అనుభవమును వారు ఉదహరించెడివారు. "నీవు నన్ను ఏ విధముగా తలచి పూజించుచుందువు?" అను శ్రీ రామచంద్రుల ప్రశ్నకు సమాధానముగా హనుమంతుడు ఇట్లు చెప్పెను. "నేను దృశ్య మగు ఈ శరీరమునను భావన కలిగినంతనే నీవు స్వామివి నేను సేవకుడననియు, నీవు పూజింపబడువాడవు, నేను అర్చకుడననియు తలతును. నా స్వరూపము, జీవాత్మగా తోచి నపుడు నీవు పరిపూర్ణుడవనియు, నేను నీ యంశననియు భావింతును. నేను గుణరహిత మైన పరిశుద్ధ ఆత్మస్వరూపుడను భావము కలిగి సమాధియందున్నపుడు నీవు ఏ తత్త్వమో నేనుకూడ అదే తత్త్వమనియు నీవు నేను ఒక్కరే అనియు ఏ భేదము లేదనియు నా తలంపు."

'దేహ బుద్ధ్యాస్మి దాసస్తే
జీవబుద్ధ్యా త్వదంశకః
ఆత్మబుద్ధ్యా త్వమేవాహం
ఇతి మే నిశ్చితా మతిః'

అద్వైతస్థితి అనుభవమే కాని వర్ణనలకు చర్చలకు అతీతమనియు శ్రీ రామకృష్ణులు చెప్పుచుండెడివారు. నేను, నీవు అను భావ ములు; మాట్లాడుట, నడచుట మొదలగు శరీరధర్మములు ఉన్నంతవఱకు సగుణ నిర్గుణము లను రెండింటిని అంగీకరించి అనుసరింపవలెనని వారు చెప్పుచుండెడివారు. శుద్ధ సత్యము యొక్క ప్రత్యక్షానుభవము కలిగిన తరువాత ఆ సత్యతత్త్వమే తిరిగి ఈ ప్రపంచముగా భాసించుచున్నట్లు తెలియును. ఉదాహరణకు మారేడు పండుయొక్క స్వరూపమును విచా రించునపుడు నిజమైన పదార్థము బయటి తొక్కగాని గింజలుకాని కావనియు గుజ్జు మాత్రమే నిజమైన ఫలమనియు తెలియును. కాని తరువాత గుజ్జునకు ఏ పదార్థము మూలమో గింజలకు, తొక్కకు కూడ అదే పదారము మూలమని తెలియును.

# సుమిత్ర

విద్వాన్ పమిడికాల్వ చెంచు నరసింహశర్మ

సూర్యవంశ ప్రదీపకుడగు దశరథునిభార్యలలోఁ గౌసల్య, సుమిత్ర, కైకేయి, అను ముగ్గురు మాత్రమే చారిత్రక ప్రసిద్ధి నొందిరి. శ్రీ మహావిష్ణువు చతుర్భుజములా యన్నట్లొప్పిన రామలక్ష్మణ భరతశత్రుఘ్నులను గన్న మాతృదేవతలు వారేగదా? ఆధ్యాత్మిక భావమున దశరథుడు శ్రీమన్నారాయణ పరబ్రహ్మముకాగా నీ సతీమణులు శక్తిత్రయము అనగా నిచ్ఛాజ్ఞాన క్రియాశ రూపముల వెలయుచున్నారు. వీరి గుణశీలాదికమంతయుఁ దద్వాసు గుణముగానే పరిణమించియుండుట రామాయణకథా ప్రపంచమున సుగ్రాహ్యము. వానినెల్ల నియ్యెడఁ బరిశీలించుట ప్రకృత వివరణాంశముగాదు. వీరివలననే భగవానుని దివ్యమానుష లీలావిశేషములు స్థిరరూపము నొందినవి. శ్రీ రామావతారము సంపూర్ణావతారముగా జగద్వినుతికెక్కినది. మఱియు దుస్తర సంసారాబ్ధిఁ దరియించుటకు దగినంత గట్టి పునాదిగల ధర్మసేతువు నిర్మింపఁబడినది. ఈ ముగ్గురిలో సుమిత్రపాత్ర ప్రయోజనము బాహ్య కథా రూపమున నతి స్వల్పముగా దోచుచున్నను బరమార్థభావమున మిగుల విశిష్టమైనది. సార్థక నామధేయులగు లక్ష్మణ శత్రుఘ్నులఁ గన్న దివ్యజ్ఞాన మాతృశ్రీ యీ సతీరత్నమేకదా!

ఆదినుండియు భూభారమును వహించియుండు శేషుఁడే లక్ష్మణస్వామిగా నవతరించుటచే నిచ్చటను సీతారాముల సేవా సంరక్షణ భారమును వహించి తన విధిని జక్కఁగా నిర్వర్తించినాడు. ఇక సర్వ శత్రు వినాశకుఁడును, జక్రాయుధాంశ సంభూతుఁడునగు శత్రుఘ్నుఁడు భరతు నాశ్రయించి రాజ్య సంరక్షణాదికము నిర్వహించినాడు. ఇట్టి ధీరమూర్తులఁ గన్న సుమిత్ర నిజముగా సు-మిత్రయే యనవచ్చును. అనగా సుజనమిత్ర గుణములుగల సుజ్ఞానవతి యని భావము. ఇట్టి సత్యధర్మ శాంతి సహన వివేకాది సచ్చరిత్రగుణ సంపదగల సుమిత్రాదేవి సార్థకనామధేయయగుటలో దప్పేమియు లేదు. అందులో నామె మితభాషిత్వములో నందెవేసినచేయి. ఆమె హృదయమొక మహాగంభీర జ్ఞానవార్ధి! ఆమె వాక్కులు స్థిరధర్మ శాసనములు. శుద్ధ సత్త్వపూర్ణములు. వివిధ విశిష్టార్థ ద్యోతకములు. ఇట్టి విజ్ఞానఖనిగా నీ సతీరత్నమును పోషించి తనయుమేయ వాగ్విభూతిని సర్వతోముఖముల వెలయించినాడు వాల్మీకి మహర్షి పుంగవుఁడు. ఈ విషయము ముమ్ముందు విచారించి కనుగొందము. ఈ మాతృదేవి రామపాద సేవా ధురంధరుఁడై యడవులకేగుచున్న లక్ష్మణునికిఁ బ్రబోధించిన ప్రవచనములకును, రాముని దీవించిపంపిన కౌసల్య వాక్కులకును నెంతో తారతమ్యమున్నది. ఇక కైక యాడిన కఠోరవాక్కులు భగవానుని యవతార ప్రయోజమును సాధించునవి. కావున వాని కస్తూరి ఘాటు పైమధుర వాత్సల్యభాషా సుగంధములో నుండదు. ఆ శక్తి తీవ్రత వేఱుగదా!

వనవాసమున కనుజ్ఞ యొసఁగుమని నమస్కరించి నిల్చున్న రామచంద్రునితోఁ గౌసల్య యన్నమాటలు అతిశయ పుత్రప్రేమ భావితములు. కరుణారస తరంగములు. లౌకిక ప్రేమ భావనాపూరితములునై తన యిచ్ఛాశక్తి ప్రభావమునే చాటుచున్నవి. ఆమె దుస్సహ వేదనాభర మెంత గాఢమైనదో చూడుడు!

"క్రేపుబాసిన యావుక్రియ నిన్ను బాసి యీ పదునాలుగేం డ్లిందుండజాల, నినుగూడి చను దెంతు నిష్ఠురాటవుల;" – కనిమిగుల వాపో యినదట! వెంటనే శ్రీరామచంద్రుఁడు సమ యోచిత హితోక్తులతో దల్లి నూరడించెను. అప్పుడామె కొంత ధైర్యము దెచ్చుకొని ముఖ ప్రక్షాళన మొనర్చుకొని పుణ్యాహవాచనము సేయించి ప్రియనందను నిట్లాశీర్వదించినది.

"కుమారా! నీ కెళ్ళ వేళలందును సురలు, ఖేచరులు, శ్రుతులు, యతులు, తరులు, గిరులు, నదులు, నిధులు, పంచభూతములు, సూర్యచంద్రులు, త్రిమూర్తులు, శాంతి క్షమా గుణములు, సకల శుభము లిచ్చుచు గాపాడు చుందురుగాక! వృత్రాసురుని జంపఁబోవు దేవేంద్రునికి దేవత లొసంగిన మంగళములు నీ కొప్పుగాక! అమృతము దేఁబోవు గరుడు నకు వినత యిచ్చిన మంగళాశీస్సులు నీ కొప్పారుగాక! దేవరాజ్య మార్జింపఁబోవు వామనునకు దేవమాత యదితిదేవి యొసంగిన శుభ మంగళములు నీ యందు నెలకొనుగాక!" అని యాశీర్వదించినది. ఇందుఁ జనని వాక్య ములో నామె పూర్వస్మృతి యుప్రయన్నముగా ప్రకటింపబడినది. గా దుష్టరాక్షస సూర నాది కృత్యములను సూచింపఁబడినవి ఇది భగవత్సాన్నిధ్య ప్రభావమో, వాల్మీకి ప్రతిభా విశేషమో యైయుండును.

కాని మనము రెండును గూడియుండునని భావించుటయే మేలు. ఇందుఁ బుత్రవాత్సల్య భరితములైన శుభస్కర వాక్యమునే కరుణా రస ప్లావితములై కౌసల్యానోట జాలువారినవి. ఇవి కేవలమిచ్ఛాప్రయుక్తములనుట కేటి సందియము లేదు. కావుననే శ్రీరాముఁడామెకు నీతి ప్రబోధము సేయవలసి వచ్చినది.

సుమిత్ర విషయములో గరుణారస మంత పొంగులు వారక మంద్ర స్థాయిలో నిల్చినది. సముచిత ధర్మప్రబోధమే జ్ఞాన తేజో భాసితమై తారస్థాయి నందుకొన్నది. లక్ష్మణు డమ్మహాదేవికి నమస్కరించి వనవాసమున కనుజ్ఞ యిమ్మని ప్రార్థించినప్పు డా మాతృ శ్రీ పల్కిన మాటలు స్వర్ణాక్షర లిఖిత యోగ్యములు, మహోత్తమ ధార్మిక శాసన ములు, చిరస్మరణీయములునై రామాయణ కావ్య ప్రతిభాకీర్తి ప్రతిష్ఠలకు వన్నెగూర్చు నవియై యున్నవనుట సత్యము.

ఈ సందర్భమున నామె ప్రబోధభావ మంతయు ముక్తసరిగా మూడు సూక్తులతో ముగించినాడు వాల్మీకి మునీంద్రుఁడు. ఆ శ్లోక రత్న పరిశీలనమే మనకు గావలసినది. ఆమె శీల స్వభావ సమృద్ధియంతయు నా వాక్కు లందే పరిఢవించియున్నది.

"రామం దశరథం విద్ధి, మాం విద్ధి జనకా త్మజాం, అయోధ్యామటవీం విద్ధి, గచ్ఛ తాత! యథా సుఖమ్" అన్నదట! విశ్వ గర్భుఁడైన విష్ణువుయొక్క గుజ్జురూపమువలెఁ బైకఁ తోచుచున్న యా శ్లోకము వివిధ ప్రసన్న మధుర భావార్థయుక్తిచే వెల్గొందుచు వల్మీక భవుని యసాధారణ ప్రజ్ఞావిశేషమును వేనోళ్ల చాటుచున్నది. ఈ శ్లోకమున కనేకార్థములు పండిత ప్రకాండులు నిర్వచించియున్నారు. అందు ముఖ్యమైన భావ స్ఫురణల విశిష్టతను కనుగొని యానందింతము. మొదట మంద్ర స్థాయినున్న మధుర వాత్సల్యభరిత కరుణారస హ్రదములో నా కన్నతల్లితోపాటు మనము నొక్క మునక వేయుదము.

"రామం దశరథం విద్ధి",—ఆహా! ఎంత భావ పరిజ్ఞానముతో, నెంత వేదనాభరముతో,

నెంత యగాధ భావావేశముతో, నన్నమాట లివి? "నాయనా! లక్ష్మణా! ఇక నీకన్నయు, దండ్రియు వేఱుగా నుండఁబోరు. కావున రామునే దశరథునిగా భావింపుము". అనుటలో సీతారామ పాదసేవాధురంధరుఁడై వారి వెంట నడవుల కేగుచున్న పుత్రుని ప్రయాణ శుభ వేళలో దండ్రిని గురించిన యశుభవాక్కు స్పష్టముగా జెప్పుట మంచిది కాదని వ్యంగ్యముగా బ్రకటించినది. రామగతప్రాణుఁడై యాతని నెడబాసి క్షణముండలేని దశరథుఁడు పదునాలుగేండ్లు బ్రతికియుండగలఁడా? కనుక తండ్రి జీవింపడు. రామునే పితృతుల్యునిగా గ్రహించి సేవింపుము. ఇట్లు చేయక తప్పదు". అన్నట్లొక యర్థము. ఇట్లే "మాం విద్ధి జనకాత్మజాం ఇట్లు తండ్రి మరణింపగా దల్లియైన నే నుందునను నమ్మక మేమున్నది? కావున సీతమ్మయే నీకు దల్లి యనుకొనుము.

నిరంతరము నన్ను సేవించినట్లే యామెను సేవింపుము. అప్పుడే నా కాత్మశాంతియు. సత్సంతాన ఫలము లభించును. నీవును దరింతువు. ఇక అయోధ్యా మటవీం విద్ధి" ఉండవలసినవారు లేకపోవుటచే నయోధ్య త్వరలో నశించి యడవియై పోగలదు. ఒకవేళ నామమాత్రావశిష్టమైయున్నను సీతారాములు లేని పట్టణ మడవిగాగాక మఱెట్లు తలంపనగును? "గచ్ఛతాత! యథా సుఖమ్" "అందుచే నీ వీ ప్రాంతమునకు దిరిగి రావలసిన పనియుండదు. కలిగినంత సౌఖ్యముతో నీ పరోక్ష జననీ జనకుల వెంటబడిపో నాయనా!" అన్నదట! భావార్థ సూచితమగు నంతరాత్మ ప్రబోధ మనుసరించి యా సాధ్వీమణి 'పొమ్ము' అన్నదే కాని 'పోయిరమ్ము' అనలేక పోయినది. ఇట్లనుటకు కేవలము దుఃఖభావమే ప్రధానముకాదు. పరమార్థ విజ్ఞానముగూడ కారణమైయున్నట్లు గ్రహింపవలసి యున్నది. అది యెట్లో పరికింతము.

"రామం దశరథం విద్ధి" తండ్రి జీవింపడని చెప్పుటయే యిందుఁ బ్రధానము కాదు. రామ సేవాధర్మమును విధిగా లక్ష్మణుడు గుర్తించుట ముఖ్యాంశము. కావున నిందు ధర్మోపదేశమున్నది. "పితృసమో జ్యేష్ఠః" అన్నలైనగురు తండ్రులలో జ్యేష్ఠుడు (అన్న) పితృసముడు. కనుక తండ్రి లేనప్పుడు భ్రాతయే పూజనీయుడు. అట్లు భావించి సేవించువానికి పితృసేవా ఫలము లభించితీరును. అందుచే "నాయనా! నీ వికమీఁదట రాముని దశరథునిగా భావించి సేవింపుము. ఇది నీ కవశ్య కర్తవ్యము. రాముని రూపమున దండ్రి యున్నాడనియే నమ్ముము". అన్నట్లొక యర్థము. ఇట్లే "మాం విద్ధి జనకాత్మజాం" ఆ సీతమ్మను కేవల మొక యన్నభార్యగా దలంపక కన్న తల్లియగు నేనే యామెనని భావించి నన్ను సేవించినటే యా సాధ్వీరత్నమును మఱువక నారాధించుచుండుము. ఇది నీకుఁ బరమ ధర్మము.

"అయోధ్యా మటవీం విద్ధి" "దివ్య తేజో విరాజితులు, సకలజన ప్రీతిపాత్రులు, నగు మీ రడవిలో నున్నను బురములో నున్నట్లే యగును. ఇచ్చట పౌరులందఱు దమ సర్వస్వములతో మీరున్న తావులకు జేరగలరు. అప్పు డడవియే అయోధ్య కాగలదు. ఎట్లు చూచినను నీ యయోధ్యాపురికి లక్ష్మీకళ లేదు. కనుక నడవితో సమానమేయని నాభావము." "గచ్ఛతాత! యథాసుఖమ్" అడవియే అయోధ్యకాగా నీ రుద్రభూములకు రావలసిన పని యేమున్నది? కావున లభ్యమైనంత సౌఖ్యముగా పొమ్ము!" ఈ యర్థములోను

గొంతవలకు దుఃఖావేశము గర్భితమైనట్లు తోచును. మూడవ యర్థములో శుద్ధ సత్త్వ ప్రధానమైన పరమార్థ ప్రబోధమున్నది. అది యామెయొక్క విజ్ఞానపటిమకు ఛార్కాణము. అదియే మనము చక్కగా గ్రహింపవగిన యంశము.

"రామం దశరథం విద్ధి" ఇచ్చట దశరథుం డనగా పక్షివాహనుఁడగు శ్రీమన్నారాయణుం డని భావము. కాగా శ్రీరాముఁడు సాక్షా న్నారాయణాంశ సంభూతుఁ డగుచున్నాడు. అందుచే "రాముని దుష్ట దైత్యాంతకుఁడగు మహావిష్ణువని గ్రహింపుము". అనుట యథార్థ ప్రబోధము.

"అన్నిటికన్న ముఖ్యమిదియే. లౌకిక భ్రాతృ సంబంధము కేవలము వ్యావహారికము. పరమాత్మ సంబంధజ్ఞానమే తరణోపాయము. నీకా భాగ్యము పూర్వ సంస్కారఫలము. అది నీకు మాత్రమే లభించినది. ఇఁక హాయిగా నవిచ్ఛిన్నముగా నాశ్రమ ప్రదేశములలో నారాధ్యదైవము నారాధించుచు గాలము గడుపుము. ఇట్టి ప్రశాంత మహావకాశము నీకు సిద్ధించినందుల కెంతేని యాత్మశాంతి నొందు చున్నాను. కుమారా! ఈ దివ్యస్మృతి నీకు ప్రాణవాయువువలె మనసులో నిరంతరము స్పందించుచుండవలయును సుమా!" అని హెచ్చరించినది. ఇట్లే 'మాంవిద్ధిజనకాత్మజాం' 'మా' యనగా లక్ష్మీదేవి. దాని ద్వితీయా విభక్తిరూపము 'మాం' కాగా 'లక్ష్మిని' అను నర్థమిచ్చును. అప్పుడు జానకీదేవిని లక్ష్మినిగా భావింపుము. అన్నట్లగును. లక్ష్మీనారాయణులే సీతారాములైరి. కావున వారి సేవ నీకు సర్వదా యనుల్లంఘనీయమైనదని ప్రబోధించినది. ఇక "అయోధ్యా మటవీం విద్ధి" అయోధ్య యనగాఁ గేవలము శారీరక బల సంపత్తిచే సాధింపరానిది. పరమపదము లేక వైకుంఠమని యర్థము. లక్ష్మీనారాయణ స్వరూపులగు సీతారాములున్న తావులేక యడవి వైకుంఠము కాగలదు. ఈ భావనయే స్థిరపడవలయును. అందుచే "గచ్ఛతాత! యథాసుఖమ్" అట్టి దివ్య పదమును వదలి యిచ్చట నుండవలసిన పని యేమున్నది? ఆ భగవానునివెంట వెళ్లుము. ఆ జగజ్జననీ జనకుల నెన్నఁడును విడనాడకుము. వారి సేవయే నీ జీవితధ్యేయము." అని త్రికరణ శుద్ధిగా ప్రసన్న మధుర గంభీరముగా ననుశాసించినది పరమధార్మిక విజ్ఞానధీర మాతృ శ్రీ సుమిత్రా మహాదేవి. ఈ దివ్యప్రబోధ వాక్కులకు గౌసల్యా దీవనపల్కులకును నెంతో వ్యత్యాసము గన్పడుచున్నదిగదా? కౌసల్యలో గేవలము పుత్రవాత్సల్య భరిత దుఃఖావేశమే నిండుకొనియున్నది. సుమిత్రలోఁ గరుణామిశ్రిత పరమధార్మిక జ్ఞానప్రబోధము పొంగులు వారినది.

సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయత్ న బ్రూయాత్ సత్యమప్రియం,
ప్రియం చ నానృతం బ్రూయాదేష ధర్మః సనాతనః.

సత్యమునే పలుకవలెను. ప్రియము కాని సత్యమును చెప్పకూడదు. సత్యము కాని ప్రియము నున్ను చెప్పకూడదు. ఇదియే సనాతనధర్మము. —మనువు.

# నిష్కామ కర్మ

## శ్రీ నిర్వికల్పానంద స్వామి.

మనుష్య జీవితాన్ని ఆనందప్రదంగా చేయటానికిగాను గీతాకారుడు మనకు ఉపదేశించిన మహోన్నతాదర్శాల్లో నిష్కామకర్మ ఒకటి.

ఆచరించే కర్మల్ని నిష్కామబుద్ధితో చేసే రీతే 'యోగం'. ఆధునాతనులు కొందరు ఈ యోగాన్ని అనాసక్తి యోగం అనికూడా అంటున్నారు.

లోకంలో సామాన్యంగా, కామంలేని కర్మ అంటూ ఉండదు. కనుక, మొట్టమొదట నిష్కామకర్మ అనే పదమే అసంబద్ధంగా గోచరిస్తుంది. ఏ కర్మని ఫలాసక్తి లేకుండా 'చిత్త శుద్ధి' నిమిత్తం ఆచరిస్తామో అదే నిష్కామ కర్మ, అని పారిభాషికంగా వేదాంతులు వ్యవహరిస్తారు. ఈ చిత్తశుద్ధి కుదిర్తేనే ధ్యానం లభిస్తుంది. ధ్యానం పరిపక్వమైతేనే ఆత్మ సాక్షాత్కారం.

ఫలాన్ని ఎందుకు అభిలషింపకూడదు? అని ప్రశ్నవేస్తే, మానవ జీవితంయొక్క చరమ లక్ష్యం ఆత్మ సాక్షాత్కారమనిగాని లేక భగవద్దర్శనమనిగాని గ్రహించిన పక్షంలో, ఇంకా దాని సారాన్ని తరచి సంగ్రహంగా నిరూపించాల్సివస్తే, 'ముక్తి' అని తేలుతుంది.

ముక్తి అంటే జనన మరణ ప్రవాహంనుండి బయటకు పడటం.

చెయ్యబోయే కర్మలయొక్క ఫలాన్ని ఆశించినట్లయితే,—ప్రతి కర్మకు లోకంలో ఏదో ఒక ఫలం ఉండటంవల్ల,—అది లభిస్తుంది. పుణ్యాలే ఈ కర్మఫలాలు.

ఈ కర్మఫలాల్ని అనుభవించటం కోసం స్వర్గలోకానికో లేక నరకలోకానికో వెళ్ళవల్సి ఉంటుంది. అక్కడ ఆ ఫలాల్ని సంపూర్ణంగానో లేక కొంచెంగానో తాహతునుబట్టి అనుభవించిన తర్వాత, మళ్ళీ ఈ భూలోకంలోకి వచ్చి జన్మ ఎత్తాల్సి ఉంటుంది.

ఇక్కడకే ఎందుకంటే: ఈ లోకమే కర్మ భూమి. నూతన కర్మల్ని ఆర్జించటం ఒక్క మనుష్య శరీరంతోనే సంభవం.

పశుపక్ష్యాదులైన మూఢ యోనులకు విచారబుద్ధి లేదు. పూర్వజన్మల్లో చేసిన పాపం ఫలితం కాజటానికే ఈ జన్మలు కాని, అందులో మరి క్రొత్తకర్మలు చెయ్యటాని వీల్లేదు.

అట్లాగే దేవయోనుల విషయంలోకూడా, అపారమైన పుణ్యాసంచయాన్ని అనుభవించటానికి లభించిన భోగ శరీరాలే అవి కాని, జ్ఞానప్రాప్తికి ఉపయోగ పడవు.

ప్రస్తుతం ఉన్న ఒక మానవజీవి అనంతమైన కాలప్రవాహంలో లక్షలకొలది శరీరాల్ని ధరించి పశు పక్ష్యాది శరీరాల్లో లభించే హీన భోగాల్నీ, దేవతా యోనులకు సంప్రాప్త మయ్యే స్వర్గభోగాల్నీ అనుభవించే ఉంది అని స్వీకరించవచ్చు.

అయినపక్షంలో మళ్ళీ పుణ్యాపాపరూపమైన భోగాల్ని ఆశించటం పరమార్థ సాధకుడికి వ్యర్థ కాలక్షేపం. అందుకనే, కర్మల్ని ఫలాపేక్షా రహితంగా చెయ్యమని ప్రబోధం.

జ్ఞాన సంప్రాప్తికి మనుష్య శరీరమే ముఖ్య సాధనం కావటంవల్ల 'మానుమం లోకం ముక్తి ద్వార మపావృతమ్' అన్నారు.

పుణ్యపాపములు అనేవి అదృష్టరూపాలు. కనుక, ఈ ఫలాల్ని ప్రసవించే కర్మ అదృష్ట ఫల కర్మ. అర్థాత్, యజ్ఞయాగాదులు.

అందుచేత దృష్ట ఫలజనకాలైన కృష్యాదుల విషయంలో ఈ నిష్కామత్వం అనువరించదు.

ఒకడు సంవత్సరమంతా కష్టపడి ఒక తోటను సాగుకు తీసికోవచ్చనుకొందాం. చివరకు 'ఈనగాచి నక్కల పాలగునట్లు' చేస్తే అది నిష్కామకర్మ అనిపించుకోదు.

ప్రస్తుతం మనలో చాలామందికి స్వర్గ నరకాలమీద ఆస్థలేదు, పాపపుణ్యాల్ని అంగీకరిస్తున్నా. వాళ్ళు ఆయా కర్మల ఫలాన్ని—అద్వైతుల ముక్తిలాగా—ఇక్కడే పొంద తీరాలి అంటారు.

ఇల్లా వాదించేవారి విషయంలో నిష్కామ కర్మాచరణం మరింత సుగమమవుతుంది. 'ఎప్పుడో ఎదో లోకానికి పోయి అనుభవిస్తాంలే' అని అనుకున్న దానికంటె, కర్మాచరణంలో—అప్రమత్తత అధికంగా వహించాల్సి ఉంటుంది. కనక, ఇదిన్నీ 'కీడులో మేలే'.

స్వర్గ నరకాలకన్న బలవత్తరమైన విషయం ఇంకొకటి ఉంది. అదే తనపేరు నలుగురికీ తెలియాలి అనే ఉబలాటం-కీర్తి కాంక్ష. ఒకవేళ స్వర్గాదులైన అదృష్టవిషయాల్ని అవిశ్వసించో లేక తృణీకరించో బయటపడకల్గినా, ఈ కీర్తి ప్రతిష్ఠారూపమైన బంధంలోంచి బయట పడటం చాలా కష్టం.

కనుక, నిష్కామత్వాన్ని ఈపరంగా అన్వయించుకొన్నా ఫర్వాలేదు.

ఐతే ఒక విషయాన్ని మటుకు మరవకూడదు. అది—దృష్టఫలమే కానియ్యండి అదృష్టఫలమే కానియ్యండి—లభించినప్పుడు ఉబ్బి తబ్బిబ్బు అయిపోవటం, లభించనప్పుడు క్రుంగిపోవటం కూడదు. ఈ విషయాన్ని తేలియజెప్పటానికే గీతలు జయ పరా జయాల్ని సమదృష్టితో చూడమని ఆదేశిస్తూన్నవి.

శ్రీహరి నామము పాడుచు కన్నులు
అశ్రులు కురిసే దెన్నటికో
హృదయమునుండి కామ వాసనలు
రయమున తొలగే దెన్నటికో ॥శ్రీ॥

పారవశ్యమున పావననామము
భజనము చేసే దెన్నటికో
నా తనువెల్లను గగురుపాటుతో
పులుకలు చెందే దెన్నటికో ॥శ్రీ॥

అర్థార్థీ యాని కష్టాని మూఢోఽయం సహతే జనః ।
శతాంశేనాపి మోక్షార్థీ తాని చేన్మోక్షమాప్నుయాత్ ॥

ధనం ఆర్జించడానికి మానవుడు పడేకష్టంలో పడేశ్రమలో నూఱవ భాగం మోక్షం కావాలనుకొన్నవాడు పడితేచాలు, మోక్షం పొందగలడు. —పంచ తంత్రం,

# బాలల శారదాదేవి

బి. ఎస్. ఆర్. ఆంజనేయులు

## శ్రీ రామకృష్ణుని సాన్నిధ్యము

శారదకు పద్నాల్గవయేడు వచ్చింది. వాళ్ళ వూరిలోని అమ్మలక్కలు తన భర్త పిచ్చివాడని చెప్పుకోవటం విన్నది. ఇదివరకువలె యిప్పు డామె మరీ పసిపిల్ల కాదు. కొద్దిగా వ్యక్తతకూడా వచ్చింది. ఆ మాటలు ఆమెకు తెలియకుండా బాధ కల్గించటం మొదలుపెట్టినయి.

ఈ సమయంలో దక్షిణేశ్వరంనుండి శ్రీ రామకృష్ణుడు కమార్పుకూరుకు రావటం సంభవించింది. ఎన్నో సాధనలుచేసి దేవుణ్ణి అనేకరూపాల్లో చూశాడు. తోతాపురి అనే గురువు దగ్గర సన్యాసముకూడా తీసుకొని సాధనంతా ముగించాడు. అన్ని ప్రాణులలోను ఆయనకు భగవంతుడు కనుపించటంవల్ల ఆయన చూపేప్రేమ అందరిని ఆకర్షిస్తుంది.

శ్రీ రామకృష్ణుడు వచ్చాడని శారదను జయరాంబాటినుండి కమార్పుకూరుకు తీసుకొనివచ్చారు. పసితనములో ఆమె ఆయనను చూచినా తాను పెరిగి కొంచెము బుద్ధి వచ్చిన తర్వాత భర్తను చూడటం యిదే మొదటిపర్యాయము. ఆయనను చూడగానే ఆమెకు సంతోషము కల్గింది. అందరూ అంటున్నట్లు ఆయనలో పిచ్చి యేమీ ఆమెకు కన్పించలేదు. అంతేకాక ఎవ్వరిదగ్గర లేనటువంటి ఆనందం ఆయనముఖంలో కనుపించింది.

శ్రీ రామకృష్ణుడు కమార్పుకూరులో ఉన్నన్నిరోజులు శారదకూడా అక్కడే వున్నది. సన్యాసి అయినా ఆయన తన భార్యయెడల బాధ్యత వదలలేదు. ఆ రోజులలో యెన్నో మంచివిషయాలు ఆమెకు చెప్పాడు. మధురమైన పాటలు వినిపించాడు. శారద పల్లెటూరిలో పెరిగిందని మీకు తెలుసు. ఆమె మనస్సు యెంతో పవిత్రంగా వున్నది. ఆయన యిలా చెప్పాడు. "చంద్రుణ్ణీ అందరూ 'చందమామ' అని పిలుస్తారు. చంద్రుడు ఎలా అందరికి మామో, భగవంతుడుకూడా అందరికి స్వంతమే" ఆయనమాటలు ఆమె గుండెలలోనికి చొచ్చుకొనిపోయాయి. "ఆయన తనకు భర్తమాత్రమే కాదని, యెచ్చటను కానుపించని ప్రేమయొక్క రూపమే ఆయన అని ఆమెకు తోచింది ఆ రోజులలో ఆమెకు కలిగిన ఆనందాన్నిగూర్చి యిలా చెప్పింది. "అమృతంతో నిండిన పాత్ర నా గుండెలలో యుంచినట్లున్నది. ఆ సంతోషాన్ని నేను మాటలతో చెప్పలేను." ఇలా ఆరుమాసాలు గడచిపోయినయి.

అందరికి మామయేగద చందమామ ?
అయితే దేవుడు అందరివాడు నిజము.
అంత ఆప్తుడు దగ్గరవాడు మనకు
లేడు వేరొక డెందున లేడు లేడు.

# let your money grow more than 7 times




**A Cash Certificate of Rs. 1000.00 will yield Rs. 7328.07 in 20 years.**

Plan ahead for future needs and invest in UBI Cash Certificates.
Watch how your money grows !

You can buy UBI Cash Certificates in denominations of Rs. 100.00 or its multiples for a fixed period—7, 10, 15 or 20 years. On maturity, you will get back a lump sum amount which may be more than seven times of your initial deposit.

Choose the amount and term you think suit you best.
Buy a UBI Cash Certificate today.

**A few examples**

| Issue Price (Rs) | Encashment value after 7 years | 10 years | 15 years | 20 years |
|---|---|---|---|---|
| 100 | 200.79 | 270.70 | 445.39 | 732.81 |
| 500 | 1003.96 | 1353.52 | 2226.95 | 3664.04 |
| 700 | 1405.54 | 1894.93 | 3117.74 | 5129.65 |
| 1000 | 2007.92 | 2707.04 | 4453.92 | 7328.07 |
| 5000 | 10039.60 | 13535.21 | 22269.60 | 36640.37 |
| 10000 | 20079.20 | 27070.41 | 44539.19 | 73280.73 |

***For details, come to your nearest UBI branch***




# United Bank of India

సంపాదకులు : శ్రీ చిద్ఘనానందస్వామి

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-600 021) న ముద్రింపబడి,
శ్రీ చిద్ఘనానందస్వామిచే శ్రీ రామకృష్ణ మఠము (మద్రాసు-600 004) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము 34 1977 - అక్టోబరు : పింగళ - ఆశ్వయుజము సంచిక 10

## విషయసూచిక

## చందాదారులకు మనవి

* సెప్టెంబర్ (పింగళ-భాద్రపదము)నుండి చందాదారులకు క్రొత్త నంబర్లు ఇచ్చియున్నాము. ప్రభ కవరుమీద ఈ మార్పును గుర్తించవలసినదిగా మీకు మనవి చేయుచున్నాము.

* ఉత్తరములందు, M. O. కూపనులందును, మీ చిరునామాను, చందా నంబరును స్పష్టముగా వ్రాయవలసినదిగా వేడుకొనుచున్నాము.

* మీ చిరునామా మారినపుడు దయచేసి మాకు తెలుపవలసినదిగా మిమ్ములను అర్థించుచున్నాము.

* సాధారణముగ ఇంగ్లీషునెల చివరివారములో రామకృష్ణప్రభ వెలువడుచుండును గనుక మఱుసటినెల నాలుగు ఐదు తేదులలోపల మీకు ప్రభ అందకపోయినచో మాకు తెలియజేయవలసినదిగా కోరుచున్నాము.

## రచయితలకు మనవి:

Religion, Philosophy, Psychology, Ethics, Culture, Arts, Education, Practical Vedanta, Vedanta & Science: అను

అంశములమీద ప్రచురణకు అనువైన వ్యాసములు మాకు అందినచో సంతోషముగా స్వీకరించి ప్రచురించగలము.




ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్యవరాన్నిబోధత.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము 34 | 1977 – అక్టోబరు : : పింగళ – ఆశ్వయుజము | సంచిక 10


## ప్రార్థన

ఓం భద్రం కర్ణేభిః శృణుయామ దేవా భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః
స్థిరైరంగై స్తుష్టువాగ్ంస స్తనూభిర్వ్యశేమ దేవహితం యదాయుః
స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః స్వస్తి నః పూషా విశ్వవేదాః
స్వస్తి నస్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తి నో బృహస్పతిర్దధాతు.

పూజనీయులైన ఓ దేవతలారా! మేము శ్రోత్రములద్వారా మంగళకరములైన వాక్కులనే విందుముగాక.

నేత్రములద్వారా మంగళకరములైన దృశ్యములనే చూచుదుముగాక.

బలము ఆరోగ్యముగల దేహములతో మా ఆయుష్కాలమంతయు మిమ్ములను స్తుతించుచు మీకు ప్రీతిని కలిగించుచు జీవించుదుముగాక.

వేద ఇతిహాస పురాణస్మృతులచే కీర్తింపబడిన ఇంద్రుడు మాకు క్షేమమును కలిగించునుగాక.

సకలమును ఎఱిగిన సూర్యనారాయణుడు మాకు క్షేమమును కలిగించునుగాక.

విఘ్నములను ధ్వంసముచేయు గరుత్మంతుడు మాకు క్షేమమును కలిగించునుగాక.

బుద్ధికి అధిష్ఠానదేవతయైన బృహస్పతి మాకు క్షేమమును కలిగించునుగాక.

# వివేకానందవాణి

క్రమక్రమముగా మనసునకు బలమును చేకూర్పవలెను. ఒక్క ఆదర్శపురుషుని తయారు చేసితిమేని, లక్ష ఉపన్యాసములు ఫలించినట్లు. మనసును, మాటను, కలిపి నిత్యజీవితమున ప్రవర్తింపవలెను. ''ఆలోచనాగారమున చౌర్యము జరుగనీయరాదు'' అను శ్రీరామకృష్ణ ప్రవచనమునకు అర్థము ఇదియే.

కార్యసీమలన్నిటియందును మనము ఆచరణయోగ్యమార్గములనే త్రొక్కవలెను. దేశమంతయు సిద్ధాంత సూత్రములతో నిండి వినాశదశకు వచ్చినది. సరియైన శ్రీరామకృష్ణ శిష్యుడు ప్రతివాడును ఆస్తికధర్మములను కార్యరూపమున ప్రదర్శించును. మానవులును, సంఘమును పలుకు నిరర్థక ప్రలాపములను ఏమాత్రము లెక్కసేయక, నిష్ఠాభక్తులతో కొనసాగించుచుండును. తులసీదాసుని ఈ ద్విపదను నీ వెప్పుడును వినలేదా? ''హాతీ చలే బాజార్ మే కుత్తా భూం కే హాజార్ । సాధూంకో దుర్భావ్ నహీ జబ్ నిందే సంసార్ ॥''

అంగడి వీధివెంట నడచు ఏనుగును చూచి వేయి కుక్కలు మొఱుగును. అట్లే సాధువును చూచి లోకులు అపవాదము లాడుదురు. కాని అతడు వారిని ద్వేషింపడు.

నడుచుకొనవలసిన మార్గ మిది. ఎవరు ఏమి అనుచున్నను, సరకుసేయరాదు. వారి దూషణ భూషణములను లక్ష్యపెట్టువాడు ఈ జీవితమున మహాకార్యమును దేనిని సాధింపజాలడు.

''నాయమాత్మా బలహీనేన లభ్యః''— బలహీనులకు ఈ ఆత్మ లభ్యము కాదు. మన శ్శరీరములందు బలములేనిచో ఆత్మసాక్షాత్కారసిద్ధి అసంభవము. ఉత్తమ పుష్టికరాహారమును భుజించి శరీరపటుత్వమును ఆర్జించుకొనుట నీ మొదటి పని— అప్పుడుగాని మనస్సునకు దార్ఢ్యము లభింపదు. శరీరపు సూక్ష్మభాగమే మనస్సు. మనోవాక్కులందు నీవు మంచి శక్తిని నిలుపుకోవలెను. ''నేను అల్పుడను'' అని ఇట్లు నీచతను మనస్సులో ఆవర్తించుకొనుచుండువాడు క్షుద్రత్వమును, అధోగమనమును ఆర్జించుకొనును. కావుననే శాస్త్రములు ఇట్లు చెప్పుచున్నవి:

''ముక్తాభిమానీ ముక్తో హి బద్ధో బద్ధాభిమాన్యపి । కింవదన్తీతి సత్యేయం యా మతిః సా గతిర్భవేత్ ॥'' ముక్తుడ ననుకొనువాడు ముక్తుడే యగును: బద్ధుడ ననుకొనువాడు బద్ధుడే యగును. మతి యెట్టిదో, గతియు అట్టిదే యగును అను లోకోక్తి సత్యమైనది.

సర్వదా తాను విముక్తుడనని ఎవడు జాగరూకుడై యుండునో అట్టివాడు ముక్తిని పొందును. బంధితుడ నని భావించుకొనుచుండువాడు జన్మజన్మాంతరములు ఆదశయందే గడపును. ఇది యథార్థము. పారమార్థిక విషయములందును, ఐహిక విషయములందును ఇది సత్యము.

జీవితమున ఎల్లప్పుడును ధైర్యము సడలి, నిరుత్సాహులై, యుండువారు ఎట్టి కార్యమును సాధింపజాలరు. వారు ఏడ్చుచు, మొత్తుకొనుచునే జన్మజన్మాంతరములు గడపుదురు. ''వీరభోగ్యా వసున్ధరా'' (ఈ భూమిని అనుభవించునది వీరుడే) అను మాట అమోఘసత్యము. ఎప్పుడును వీరుడవై యుండుము. ''అభీః'' అని సర్వదా పలుకుము. ''భయపడవలదు'' అని యెల్లరకును చెప్పుచుండుము.

భయము మరణము, భయము పాపము, భయము నరకము, భయము అధర్మము,

భయము దుష్ప్రవర్తనము. లోకమునగల అసద్భావము లన్నియు, మిథ్యాభావము లన్నియు, ఈ భయపిశాచములోనుండి ఉత్పన్నమైనవే.

ఈభయమే సూర్యుని, వాయువును, మృత్యువును తమ తమ స్థానములందు నిలిపి, తమ తమ కర్తవ్యకర్మములు నిర్వహించుచుండునట్లును, తన ఆజ్ఞను మీఱి యేదియు తప్పించుకొని పోకుండునట్లును, చేయుచున్నది. కావుననే శ్రుతి యిట్లు చెప్పుచున్నది :

"భయాదస్యాగ్ని స్తపతి భయా త్తపతి సూర్యః । భయాదిన్ద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పఞ్చమః॥" అతని భయమువలననే అగ్ని దహించును; అతని భయమువలననే సూర్యుడు ప్రకాశించును; అతని భయమువలననే ఇంద్ర వాయువులు తమ కృత్యములను నిర్వహింతురు; మృత్యుదేవుడుకూడ భూమిపై విహార మొనర్చుచుండును.

ఇంద్ర చంద్ర వాయు వరుణాదులగు వేల్పులు భయ విరహితత్వమును సాధించుకొందురేని, వారు బ్రహ్మముతో ఐక్యమందుదురు; ఈ సృష్టిరూపమగు అధ్యాస అదృశ్యమగును. కావుననే నేను "అభీః", "అభీః" అని బోధించుట.

మూడు సంవత్సరములు పరిశ్రమించి వ్యాస భగవానుడు మహాభారత రచనమును పూర్తి చేసినాడు. ఆ తరువాత దాని తాత్పర్యమును సంగ్రహముగా నాలుగు శ్లోకములలో శుకునకు ఇట్లు బోధించినాడు.

మాతా పితృ సహస్రాణి పుత్రదారశతాని చ
సంసారేష్వనుభూతాని యాంతి యాస్యంతి చాపరే

వేనవేలు తండ్రులు తల్లులు భార్యలు పిల్లలతో జీవిత నాటకములు ఎన్నియో ఆడినైనది జీవుడు—ఈ సంసారరంగముమీద. ఇంకను ఎన్నియో ఆడవలసియున్నవి.

హర్షస్థాన సహస్రాణి భయస్థాన శతాని చ
దివసే దివసే మూఢమావిశంతి న పండితం.

హర్షమును కలిగించే అల్పకారణములు ఒక వెయ్యి, భయమును కలిగించే అల్పకారణములు ఒక వెయ్యి ప్రతిదినము మూఢునకు ఎదురగుచునే యుండును.

ఊర్ధ్వబాహుర్విరామ్యేష న కశ్చిచ్ఛృణోతి మే
ధర్మాదర్థశ్చ కామశ్చ స కిమర్థం న సేవ్యతే

ధర్మమువలన మోక్షమేగాక అర్థకామములుకూడ సిద్ధించును. మఱి ఎందుకు దానిని అచరించరు? – అని నేను రెండు బాహువులను పైకెత్తి ఉద్ఘోషించుచున్నాను. ఎవ్వరును నా మాట వినడములేదు.

న జాతు కామాన్న భయాన్న లోభాత్
ధర్మం త్యజేజ్జీవితస్యాపి హేతోః
నిత్యోధర్మః సుఖదుఃఖే త్వనిత్యే
జీవో నిత్యో హేతురస్య త్వనిత్యః.

సుఖదుఃఖములు అనిత్యములు. ధర్మము నిత్యము. కాబట్టి కామమువలనగాని, భయమువలనగాని, లోభమువలనగాని, జీవనము కొఱకుగాని ధర్మమును ఏమాత్రము ఎప్పుడును త్యజింపకూడదు.

(హృదయమును ఆవరించిఉన్న అజ్ఞానపొరలను ఒక్కొక్కటిగా వదలించుకొనుటకు ధర్మాచరణయే ఉపాయము. ఎన్నెన్నిపొరలు వదలిపోవునో అంతకు అంత జ్ఞానము, శక్తి, ఆనందము అభివ్యక్తమగుచుండును. అన్నిపొరలు వదలించుకొనగలిగితే మిగిలేది స్వస్వరూపమైన సత్యం జ్ఞానం అనంతం ఆనందం బ్రహ్మయే.)

# ద్వా సు ప ర్ణా

శరీరమును ఉపనిషత్తులు ఒకచోట రథము గాను, మఱొకచోట పురముగాను మఱొక చోట వృక్షముగాను రూపకల్పన చేసినవి.

ఇప్పుడు వృక్షరూపకల్పనను విచారించెదము. వృక్షమునకు శరీరమునకు కొన్ని పోలికలను చెప్పుటకు వీలున్నది. వృక్షము రేపటి వఱకు ఉండునను నిశ్చయములేదు. ఏ క్షణములోనైనను ఎవరిచేనైనను గొడ్డలిచే ఛేదింపబడవచ్చును. అట్లే ఈ శరీరమున్ను రేపటి వఱకు ఉండునను నిశ్చయములేదు. ఏ క్షణములోనైనను మృత్యువుచే ఛేదింపబడవచ్చును.

కఠోపనిషత్తులోని 'ఊర్ధ్వమూలోఽవాక్శాఖ ఏషఽశ్వత్థః సనాతనః' అను మంత్రమునకు ఆచార్య శంకరులు అత్యద్భుతమైన భాష్యమును వ్రాయుచు ఈ విధముగా చెప్పియున్నారు. 'శరీరమనే వృక్షమునకు బీజము అవ్యకము. జ్ఞానక్రియాశక్తి ద్వయాత్మకమైన హిరణ్యగర్భుడు అంకురము. లింగ (సూక్ష్మ) శరీరము బోదె. శబ్దస్పర్శరూపరసగంధమయములైన విషయములు చిగురుటాకులు. శ్రుతి స్మృతి న్యాయ విద్యోపదేశములు ఆకులు. క్రియలు పుష్పములు. సుఖదుఃఖ లక్షణములైన కర్మఫలములే ఫలములు.'

బృహదారణ్యకములో వృక్షమునకు శరీరమునకు మఱొకవిధమైన పోలిక చెప్పబడినది. 'ఫలపుష్ప సమన్వితమైన వృక్షము ఎట్లో అట్లే పురుషుని శరీరము. వృక్షమునకు ఆకులు ఉన్నట్లు శరీరమునకు రోమములున్నవి. బెరడు ఉన్నట్లు చర్మము ఉన్నది. రసము (Sap) ఉన్నట్లు రక్తము ఉన్నది. శకలములు ఉన్నట్లు మాంసములున్నవి. నార ఉన్నట్లు నరములు ఉన్నవి. కాష్ఠములున్నట్లు ఎముకలున్నవి. మజ్జ ఉన్నట్లు మజ్జ ఉన్నది.'

ముండకోపనిషత్తులోని రెండు ప్రసిద్ధ మంత్రములను మనము ఇప్పుడు పరిశీలించెదము.

ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే
తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి
అనశ్నన్నన్యో అభిచాకశీతి.

ఒకే జాతికి చెందిన జంటపక్షులు రెండు శరీరమనే వృక్షమును అంటిపట్టుకొని ఉన్నవి. ఆ జంటపక్షులలోని ఒక పక్షి ఫలములను ఆస్వాదించుచున్నది. మఱొక పక్షి అట్లు ఆస్వాదించక ఊరక చూచుచున్నది.

నియమ్య నియామకులైన జీవేశ్వరులు శరీరమునందున్నారు. సుఖదుఃఖ లక్షణములైన కర్మఫలములను అనుభవించుచు జీవుడు శరీరమునందున్నాడు. భోక్తయగు జీవుని భోజ్యమగు ప్రకృతిని కేవలము తన సాన్నిధ్యమాత్రముచేత నియమించుచు నిత్య శుద్ధ బుద్ధముక్త స్వభావుడు సర్వజ్ఞుడు సర్వశక్తిమంతుడు సర్వవ్యాపి సర్వసాక్షియైన ఈశ్వరుడున్ను శరీరమునందున్నాడు.

సమానే వృక్షే పురుషో నిమగ్నో
అనీశయా శోచతి ముహ్యమానః
జుష్టం యదా పశ్యత్యన్యమీశ
మస్య మహిమానమితి వీతశోకః

జీవుడు శరీరములో మునిగిఉన్నాడు. దౌర్బల్యమువలన కలిగిన మోహముచే దీనముగా శోకించుచున్నాడు. జ్ఞానభక్తియోగ మార్గములచే అనేక ప్రకారములుగా సేవింపబడిన ఈశ్వరుని, ఈశ్వరుని మహిమను జీవుడు

ఎప్పుడు తెలిసికొనునో అప్పుడే శోకమునుండి విముక్తుడగును.

భారముచే నీటమునిగిన సొరకాయవలె జీవుడు అవిద్యాకామకర్మరాగాదుల అతిభారముచే సంసారజలములందు మునిగి ఉన్నాడు. అనగా దేహాత్మభావమును నిశ్చయముగా పొంది 'నేను ఇతని కుమారుడను; అతని మనుమడను; కృశించిపోయితిని; స్థూలుడనైతిని; గుణవంతుడను; గుణహీనుడను; సుఖుడను; దుఃఖుడను'—అని భావించుకొనుచున్నాడు. పుట్టుచు చచ్చుచు, సంబంధి బాంధవులతో కలియుచున్నాడు విడిపోవుచున్నాడు.

'నేనెందుకు పనికిరానివాడను; నా కొడుకు చెప్పినమాట వినక చెడిపోవుచున్నాడు; నా భార్య చనిపోయినది. అయ్యో! ఇక నా జీవితము ఎందుకు?'— ఈవిధమైన దీన భావముతో శోకించుచున్నాడు.

ప్రేత తిర్యక్ మనుష్యాదియోనులందు అనవరతము జన్మభావమును పొందుచు సంసారమునందు పరిభ్రమించుచున్నాడు. అదృష్టవశమున ఒకానొక మనుష్యజన్మలో పరమ కారుణికుడైన ఒక ఆచార్యుని అనుగ్రహమును పొంది ఆయన చూపిన యోగమార్గమును అవలంబించి అహింస సత్య బ్రహ్మచర్య సర్వత్యాగ శమ దమాది సంపన్నుడై ఏకాగ్ర చిత్తముతో ఈశ్వరుని ధ్యానించి దర్శించుచున్నాడు.

దర్శించి 'నేను ఈ శరీరము కన్నను విలక్షణుడను, అసంసారిని, ఆకలిదప్పులు శోకమోహములు జరామరణములు మొదలగు మృత్యుధర్మములు లేనివాడను, సర్వభూతములందు సమముగా వెలయుచున్న ఆత్మస్వరూపుడను. చిత్రవిచిత్రమైన ఈ సమస్త జగత్తు నా మహిమయే నా విభూతియే'—అను అపరోక్షానుభూతిని పొందుచున్నాడు. శోకసాగరమును తరించి కృతకృత్యుడగుచున్నాడు.

వేదములందు ఒకచోట ఇట్లు చెప్పబడుచున్నది: బాధ్వుడను బ్రహ్మజ్ఞానిని భాష్కలి అనునాతడు సమీపించి 'హే భగవాన్! నాకు బ్రహ్మజ్ఞానమును బోధింపుము' అని వేడుకొనినాడు. బాధ్వుడు మౌనముగా ఉండినాడు. భాష్కలి రెండవతూరి మూడవతూరికూడ అదేవిధముగా ప్రార్థేయపడినాడు. అప్పుడు బాధ్వుడు ఇట్లు పలికినాడు. 'ఇంతసేపు నేను నీకు బోధించుచునే ఉంటిని. కాని నీవు అర్థము చేసికొనలేదు. మౌనమే బ్రహ్మ' (ఉపశాంతోఽయమాత్మా)

—శంకరాచార్యుల బ్రహ్మసూత్ర భాష్యము: 3.2.17.

పురుషులు పలికినా స్త్రీలు పలికినా బాలురు పలికినా స్త్రీ పురుషాది భేదాన్ని పాటించక వారువారు పలికిన వాక్యాల్లో మంచి ఉన్నదా లేదా అని విమర్శించి మంచి ఉంటే ఆ వాక్యాలను ఆమోదించేది. మంచి లేకపోతే ఆవాక్యాలను త్రోసిపుచ్చేది.

—భారవి.

# మానవోత్కృష్టతకై విద్య

స్వామి అనన్యానంద

**విద్య—లక్ష్యం :**

మానవులను శీలవంతులైన వ్యక్తులుగా తయారుచేయుటయే విద్యాప్రయోజనం. అంటే స్వప్రయత్నంతో, ఆత్మనిగ్రహంతో బుద్ధికీ, హృదయానికీ సంబంధించిన గుణాలను పొందటం. సత్యవ్రతం, సన్మార్గ ప్రవర్తన, వ్యక్తి జీవితంలో స్వచ్ఛత, ఆత్మవిశ్వాసం, సర్వజీవుల యెడ దయ ప్రేమ మానవ మాధవసేవ, మొదలగు ఉన్నతాదర్శాలను అసలైన విద్యకు లక్ష్యప్రాయంగా మానవాళిముందుంచాయి, భారతదర్శన శాస్త్రాలకు స్రోతస్సులైన మన ఉపనిషత్తులు.

మనకాలంలో ఉపనిషత్తులపై సజీవ వ్యాఖ్యానమని మన మనుకుంటున్న శ్రీరామకృష్ణ యిలా అన్నారు! ''యాతో దిన్ బాంచి, తాతో దిన్ సిఖ'' – నేనెంతకాలం బ్రతికి వుంటానో అంతకాలమూ నేర్చుకుంటూనే వుంటాను అని. చదువు అనేది జీవితకాలమంతా సాగేది. పాఠశాల, కళాశాల విద్యలతో అంతమయ్యేది కాదిది. ఈ జీవిత పాఠశాలలో అనుభవానికి మించిన గురువు లేడు. మనం కలిసే ప్రతివ్యక్తీ, మనం ఎదుర్కొనే ప్రతి సంఘటనా మనకోపాఠం నేర్పుతుంది; అయితే మనం జాగరూకతతో, గ్రహణశీలతలో జీవితంలో ఎదుర్కొనే ప్రభావాల గమనించ గలగాలి. మనం జీవితంలో ప్రతిక్షణం మంచిచెడులకు లోనవుతుంటాము. మంచీ, చెడూ రెండూ మనకు పాఠాలను నేర్పుతాయి – మంచిని అనుసరించాలనీ, చెడు నుండి దూరంగా తొలగాలనీ తెలుసుకుంటాము. చెడుకు ఎరైన వ్యక్తి క్రూరుడవుతాడు – సమాజానికి శాపంగా పరిణమిస్తాడు. మంచిని అలవరచుకొన్న వ్యక్తి మహానుభావుడవుతాడు.

**విద్యయే చరమ తరుణోపాయం :**

స్వామి వివేకానంద అంటూవుండేవారు – విద్య అనే గారడీమాట సాధించలేని సమస్యలేవీ లేవు అని. ఆయన ఇలా చెప్పి ఎనభై సంవత్సరాలయింది. ఆయన ఉద్దేశంలో విద్య అంటే – ప్రతి పురుషుడిలో స్త్రీలో అంతర్నిహితంగా దాగివున్న పరిపూర్ణత్వపు పునరావిష్కరణమే.

మూఢనమ్మకాలనుండి, వింతైన మతాభిప్రాయాలనుండి విడివడ్డ స్వచ్ఛమైన ఆధ్యాత్మిక జీవితమే, సర్వవిద్యలకూ, సంస్కృ మూలకందమని స్వామి గాఢంగా నమ్మారు. అందువల్ల ''విద్య మానవునిలో నిక్షిప్తమైవున్న పరిపూర్ణతయొక్క పునరావిష్కరణమే'' అన్న ఆయన నిర్వచనానికీ ''మతం మానవునిలో నిక్షిప్తమైవున్న దైవత్వపు పునరావిష్కరణమే'' అన్న నిర్వచనానికీ పెద్ద భేదమేమీ లేదు. ''పరిపూర్ణత'' అనే మాటయొక్క అర్థం ''దైవత్వం'' అయితే, విద్యకూ, మతానికీ మధ్య భేదమేముంది? మానవుడి సాంస్కృతిక, ఆధ్యాత్మిక పరిణామదశలోని ఓమజిలీలో, అతడు తనలో అతర్నిహితమైన ధార్మిక విలువల ఉచ్ఛదశకు చేరుకొంటాడు. ఆపైన ప్రక్కవారితో తనకున్న సంబంధ బాంధవ్యాల్లో ఉత్కృష్టంగా ప్రవర్తిస్తాడు. ఇదే పరిపూర్ణత సాధించటమంటే. ప్రపంచంలో మనకు తెల్సిన ఋషులూ, మహాత్ములూ అలాంటివారే – వారిలో విద్య మతం అనేవి రెండు భిన్నరూపాల్లో వుండవు – ఏకత్వాన్ని

సాధించివుంటాయి. ఇదే అసలైన విద్యకూ, మతానికీ గల ఆదర్శం

## మానవుణ్ణిగా రూపొందించే, శీలనిర్మాణం చేయగలిగే విద్య :

"మన పిల్లలకు – ప్రపంచంలో ప్రతిచోటా పిల్లలందరికీ – మానవులుగా రూపొందింపజేసే, శీలనిర్మాణం చేయకలిగే విద్య బోధింపబడాలి" అన్నారు స్వామి వివేకానంద. స్వామి వివేకానంద మాటల్లో చెప్పాలంటే – "విద్య అనేది నీ బుఱ్ఱలో ప్రవేశపెట్టబడే సమాచార మొత్తం కాదు, ఆ పైన సరిగ్గా జీర్ణంకాక జీవితమంతా అలజడిపెట్టే సమాచార సమీకరణంకాదు. మనకు కావలసింది – జీవితనిర్మాణం చేసే, మానవుణ్ణిగా రూపుదిద్దే, శీలవంతుడుగా తయారు చేయకలిగే ఆదర్శాల మేలు కలయిక...పుస్తకాలబట్టీ పెట్టే చదువువల్ల ప్రయోజనంలేదు. శీలం రూపుదిద్దేటటువంటిదీ, మానసికబలం వృద్ధి పొందింపజేసేదీ, మేధస్సును విస్తృతంజేసేదీ, (ఒక వ్యక్తిని) తన కాళ్ళమీద తనను నిలబెట్ట గలిగేదీ అయిన విద్య మనకు కావాలి. మనకు కావాల్సింది – వేదాంతంతో జోడించిన పాశ్చాత్యవిజ్ఞానం, మనలను ముందులకు నడిపే బ్రహ్మచర్యం, ఆ పైన శ్రద్ధ, ఆత్మవిశ్వాసం."

ప్రపంచంలో ఎన్నో దేశాలు తిరిగి చూసి, పాఠశాలల్లో బోధింపబడే మామూలు చదువు వల్లకూడ సమకూడే మంచిఫలితాలను గమనించిన స్వామి ఆక్రోశంతో ప్రవచించారు: "విద్య, విద్య, విద్య ఒక్కటే (తరుణోపాయం)! యిరోపా ఖండంలో ఎన్నోపట్నాల్లో దర్శించి, అక్కడి బీదప్రజలుకూడ పొందే సౌకర్యాలు, విద్య గమనించినప్పుడు నాకు మనదేశంలో బీదప్రజల పరిస్థితి కళ్ళకు కట్టినట్లయింది. నా నేత్రాలు భాష్పపూరితాలయేవి. యీ భేదం ఎందువల్ల? విద్యే కారణం – అని నాకు సమాధానం లభించింది."

## ఇప్పుడు దేశానికి కావల్సిందేమిటి

విద్యే సమాధానం – సందేహంలేదు. మనం వ్యక్తిగతంగా, సామాజికంగా లేక జాతీయంగా పడే సర్వబాధలకూ తరుణోపాయం అదే. భావిభారత పౌరులవబోతున్న మన పిల్లలకు సరైన చదువు చెప్పాల్సిన అవసరం ఎంతో వుంది. వారే జాతినాయకత్వపు భారం వహించబోతున్నది. వాళ్ళని మన మెలా రూపు దిద్దుకోబోతున్నాం! ఇప్పుడు దేశంమొత్తంమీద మన విద్యాసంస్థల్లో సమాచారాన్నందించే విద్యే కాని, మనిషినిగా తీర్చిదిద్దే విద్య లభించటంలేదు. మన విశ్వవిద్యాలయాలు ప్రతి సంవత్సరం విజ్ఞానకళారంగాలలో ఎంతోమంది పట్టభద్రులను అధికమోతాదులో ఉత్పత్తి చేస్తున్నాయి. అయితే కళాశాలలు, విశ్వవిద్యాలయాలనుండి చదువు పూర్తిచేసుకొని వచ్చేవారిలో, తమ తమ విషయాల్లో పాండిత్యంతోపాటు, శీలవృద్ధికి పాటుపడినవారు చాల అరుదుగా కన్పిస్తారు. ఇప్పుడు మన దేశానికి కావాల్సింది – దేశ వ్యవహారాలను తీర్చిదిద్దేందుకు శీలవంతులైన స్త్రీ పురుషులు. వ్యక్తిప్రతిష్ఠ, కర్మప్రతిష్ఠ (Dignity of labour) ల మేలుకలయికే యిప్పుడు కావాల్సింది.

భారతదేశం ముందుకు నడుస్తోంది. వ్యావసాయికంగా, పారిశ్రామికంగా, వైజ్ఞానికంగా అభివృద్ధి గాంచుతోంది. సైంటిస్టులు, ఇంజనీర్లు, టెక్నీషియన్ల సంఖ్యలో, ప్రపంచంలో తనే మూడవదిగా గర్వంగా చెప్పుకొనేస్థితిలో వుంది. వందలకోట్ల రూపాయల ఖర్చుతో పెద్ద పెద్ద ప్రాజెక్టులను యిప్పటికే మొదలెట్టింది

అయితే యింత ఖరీదయిన ప్రాజెక్టుల నిర్మించే, నడిపే వ్యక్తులు శీలవంతులు కాకపోయినట్లయితే, వాటిమీద ఖర్చుపెట్టేడబ్బు అనూహ్యామైన అక్రమ పద్ధతిలో మాయమవును. ధనపు ఆకర్షణ తట్టుకొని నిలబడటం చాలకష్టం. దేశసేవకై తనకుతాను అర్పించుకొని, స్వార్థత్యాగం అనే గొప్ప ఆదర్శంతో ప్రభావితమైన శీలవంతుడైన వ్యక్తి మాత్రమే యీ ఆకర్షణకు తట్టుకొని నిలబడగలడు.

### విద్యా లక్ష్యం, ఉద్దేశ్యం :

విద్యయొక్క ప్రయోజనం, లక్ష్యంఏమిటి? అన్న ప్రశ్నకు స్వామి వివేకానంద జవాబిస్తారు. ''అన్ని చదువులకూ, శిక్షణలకూ లక్ష్యం మానవుణ్ణి రూపు దిద్దుటకు అయివుండాలి. అన్ని శిక్షణల ప్రయోజనం, లక్ష్యం మానవుణ్ణి పెరిగేటట్లుగా చేయటమే. ఏ శిక్షణవల్ల మానసికశక్తులు బహిర్గతమవుతాయో, వ్యక్తీకరింపబడుతాయో, ఫలిస్తాయో అదే విద్య.'' మన నవ యువకులు, యువతులు యిలాంటి శిక్షణ, విద్య పొందినప్పుడు వాళ్లు పెద్దపెద్ద అధికారాలను కలిగిన స్థానాల నాక్రమించినా, మనం అంతా వాళ్ళచేతుల్లోపెట్టి నిశ్చింతగా వుండగలం. ఎందువల్లనంటే జాతీయ ప్రాముఖ్యత కలిగిన పెద్దపెద్ద ప్రాజెక్టుల నిర్మాణానికి పెద్ద పెద్ద మొత్తాలనుసైతం సంపూర్ణ విశ్వాసంతో వారి కప్పగించవచ్చు. వారు అంత తేలిగ్గా ధనలోభానికి వశ్యులుకారు. వారు మానసిక శక్తుల నదుపులో వుంచుకున్న వ్యక్తులవటం వల్ల చెడునడతల కెరగారు.

ఇలాంటి శీలనిర్మాణం చేసే విద్యపొందిన వ్యక్తి ప్రకృతిచేతిలో ఆటబొమ్మకాడు. విజ్ఞానం, సాంకేతిక శాస్త్రాలసహాయంతో భౌతిక శక్తుల స్వామ్యత్వం వహించి బాహ్యప్రకృతినీ; ఆత్మసంస్కారంతో, ఆధ్యాత్మిక వికాసంతో అంతర ప్రకృతినీ అదుపులో వుంచుకొంటాడు. దీన్నే ''పూర్ణవిద్య'' అన్నారు స్వామి వివేకానంద.

### బ్రహ్మచర్యము - ప్రాథమికావసరము :

ఈ ఆత్మసంస్కారానికీ, ఆధ్యాత్మిక వికాసానికీ అనివార్యమైన మూలభూత విషయమొకటుంది - అదే మనో నిశ్చలత్వం, అసలు జీవితంలో ప్రతిచోటా, మానవుడు పనిచేసే అన్నిరంగాల్లో యీ మనోనిశ్చలత్వం, చాల అవసరం. ఒకవ్యక్తి పొందే విద్య, సంస్కృతి వికాసాలలో యీ విషయం దృష్ట్వా వివేకనంద స్వామి యిలా అంటారు : ''నా ఉద్దేశ్యంలో విద్యలయొక్క సారం మనోనిశ్చలత్వం పొందటమేకాని విషయ సమీకరణంకాదు. నేను మళ్ళీ చదవాల్సివస్తే, విషయ సమీకరణం చేయను. మనస్సుని ఒక విషయంపై కేంద్రీకరింపగలిగే యీ శక్తినీ, అసంగత్వాన్నీ అలవరచుకుంటాను. అప్పుడా సంపూర్ణ పరికరంతో మనోబలంతో విషయ సమీకరణ చేస్తాను.''

ఈ మనోనిశ్చలత్వాన్ని సాధించటానికి బ్రహ్మచర్యం, పవిత్రత ప్రాథమికావసరాలు. పూర్ణబ్రహ్మచర్యం గొప్ప మానసిక శక్తుల ప్రభవింపజేస్తుంది. పవిత్రమైన మనస్సులో గొప్పశక్తి, అంతులేని మనోబలం నిబిడితమై వున్నాయి. బ్రహ్మచర్యం పాటించే వ్యక్తికి అతనిచుట్టూవుండే వ్యక్తుల నదుపుచేసే గొప్ప శక్తి లభిస్తుంది. అన్నికులాల్లో ఆధ్యాత్మికోపాసకులైనపురుషులు, స్త్రీలు బ్రహ్మచర్యాన్నీ, స్వచ్ఛజీవితాన్నీ గడిపారు. అది వాళ్ళకు ఊహించ శక్యంగాని మానసికశక్తి నిచ్చింది. ఈ అమూల్యమైన గుణం (బ్రహ్మచర్యం,

పవిత్రత అనే యీ రెండు గుణాలూ) ప్రపంచం మొత్తంమీద ముఖ్యంగా యువతలో లోపించటం చాల బాధాకరమైన విషయం. ఇప్పుడు యువకుల్లో కన్పించే అకతవక ప్రవర్తనా, జరిగే చెడుసంఘటనలకూ కారణం యిదే. బ్రహ్మచర్యం, పవిత్రత మృగ్యమవటం – దానిఫలితంగా యువతీయువకుల్లో మనోనిశ్చలత లోపించటం వాళ్లు అపమార్గాలు త్రొక్కటమూ జరుగుతున్నది. ఇది ఏ ఒక్క సమాజానికీ పరిమితమైనదికాదు – విశ్వవ్యాప్తంగా జరుగుతున్న విషయం. ఫలితం ప్రపంచంలో ఎక్కడి చూసినా యువతలో లక్ష్యరహితత్వం, దారితప్పినతనం కన్పిస్తున్నాయి

### శ్రద్ధాసిద్ధాంతము :

శ్రద్ధ లేక ఆత్మవిశ్వాసం ఏ రకమైన అభివృద్ధికైన, అది లౌకికమైనప్పటికీ, పారలౌకికమైనప్పటికీ, చాల అవసరం. స్వామి వివేకానంద మన యువకులకు యీ ఆత్మశ్రద్ధ గురించి అలసిపోనంతగా ఎప్పుడూ చెప్తూండేవారు. ఆయన మాటల్లో చెప్పాలంటే – "మనకు కావల్సిందేమిటంటే – శ్రద్ధ. ఒక మనిషికీ, ఇంకో మనిషికీ గల అంతరం, శ్రద్ధతో వచ్చిన అంతరమేగాని మరేదీకాదు....ఈ శ్రద్ధ నీలోనూ ప్రవేశించాలి. పాశ్చాత్యదేశాల్లో ఎలాంటి భౌతికమైన అభివృద్ధి సమకూడినా ఈ శ్రద్ధవల్లే సమకూడింది – కారణం తమ కండరాల శక్తిలో వారికి నమ్మకం వున్నది; అయితే మీకు ఆత్మలో విశ్వాసంవుంటే, ఇది యింకా ఎంతగా పని చేస్తుందో చూడండి."

స్వామి యింకా యిలా అంటారు. "శ్రద్ధాసిద్ధాంతాన్ని, నిజమైన ఆత్మవిశ్వాసాన్ని గురించి బోధించటమే నా జీవితధ్యేయం. మరోసారి చెప్పనివ్వండి నన్ను – నమ్మకం అనేది మానవతకు లభించిన శక్తివంతమైన వరాల్లో ఒకటి. మొదట నీలో నీవు విశ్వాసాన్ని కలిగించుకో. ఒకడు ఒక చిన్న నీటిబుడగయినా, మరోడు పర్వతంలా వుత్తుంగ తరంగమయినా, యీ నీటిబుడగకూ, తరంగానికీ వెనకవున్నది అనంత జలరాశి అని తెలుసుకో. యీ అనంత జలరాశే నీకూ నాకూ మూలభూతమైంది. అందువల్ల సోదరులారా! మీ పిల్లలకు జీవితాన్ని రక్షించేటటువంటి యీ గొప్ప సిద్ధాంతాన్ని నేర్పండి."

ఆయన చెప్తూండేవారు – భగవంతుడిలో విశ్వాసంలేనివాణ్ణి నాస్తికుడని పూర్వకాలపు మతం చెప్పేది. కాని నవీనకాలపు మతం, ఆత్మవిశ్వాసంలేని వ్యక్తిని నాస్తికుడంటున్నదీ అని. వీటితో శారీరకబలం, భయరహితమైన మనస్సు సమకూడుతాయి.

### అలా వుండండి అలా తయారుచేయండి :

మనోనిశ్చలత, పవిత్రజీవితం, ఆత్మవిశ్వాసం, శారీరకబలం, భయరహితమైన మనస్సుగల వ్యక్తియొక్క శక్తి అజేయం. అలాంటివ్యక్తి జీవితంలో ఎలాంటి కష్టనష్టాలకు తలవొగ్గడు. సమాజంలో అతడు లెక్కింపదగిన శక్తివంతులైన వ్యక్తుల్లో ఒకడుగా వుంటాడు. యీ శక్తి దాచబడదు. గుర్తింపలేక ముందుకు సాగనూ సాగదు. యీ శక్తిని సాధించినవ్యక్తి తాను నివసించే సమాజాన్ని ప్రభావితం చేస్తాడు. మంచి వ్యక్తులుగా వారిని రూపుదిద్ద ప్రయత్నిస్తాడు. ఇదుగో యిలాంటి జాగరూకులైన, సత్పథగాములైన వ్యక్తుల నుద్దేశించే స్వామి వివేకానంద మరపురాని ఆ మాటలన్నారు "అలా వుండండి – అలా తయారుచేయండి" (Be and Make) అని.

# మాతృదేవి చరణసన్నిధి

ఆంగ్ల గ్రంథము:
ఎట్ ది హోలీమదర్స్ ఫీట్

అనువాదము:
పి. గణపతిశాస్త్రి

నేను: అయితే ఆ సమయంలో మధుర బాబు అక్కడ లేరన్నమాట!

అమ్మ: లేదు! ఆయన అంతకుముందు ఏడెనిమిది నెలలక్రితమే మరణించారు. ఆయన కనక జీవించిఉంటే నేను, నహబత్ ఇరుకు గదిలో ఉండవలసిన అవస్థ పట్టి ఉండేదా! ఆయన నాకొక భవంతి ఏర్పాటుచేసి ఉండే వారు. అయినా నేను నహబత్ కి వెళ్ళాలన్న నా అభిలాష వెల్లడించాను. అయితే, ఠాకూరు దానికి అంగీకరించక, "అక్కడ నీ వైద్యానికి చాలా ఇబ్బందిగా ఉంటుంది. ఇక్కడే ఉండి పో!" అన్నారు. అందుచేత నేను అదే గదిలో ఉండిపోయాను. నాతో వచ్చిన ఒకామె నా ప్రక్కనే మేనువాల్చింది. హృదయ్ మాకోసం అటుకులు కొన్ని తీసుకువచ్చి ఇచ్చాడు. మిగి లినవారు అంతకుముందే తమ సాయంకాలం భోజనాలు ముగించుకున్నారు.

"ఆ మరునాడు డాక్టరు వచ్చాడు. నాకు బాగా నింపాదిగాఉన్న కొన్నాళ్ళ తరవాత నహబత్ కిందగదికి వెళ్ళిపోయాను. అంతకు మునుపే ఇటుకలతో కట్టిన ఇల్లు విడిచిపెట్టి అక్కడికి వచ్చారు మా అత్తగారు. ఆ ఇటుకల ఇంటిలో ఆమెకొక గది ఇచ్చారు. కాని అక్ష యుడు అక్కడ మరణించినందువల్ల ఆమె ఆ ఇల్లు విడిచిపెడుతూ ఇలాగన్నారు.

'మళ్ళీ నేనక్కడికి వెళ్ళను. ఇక్కడే ఉండి పోతాను. ఇది గంగానదికి ఎదురుగా ఉంది. ఇంక నేనా ఇటుకల ఇంటిలో ఉండను.'"

"నెలా పదిహేను రోజులపాటు మేమంతా దక్షిణేశ్వరంలో ఉన్నతరవాత, ఠాకూరు షోడశీ పూజ చేశారు. [ఆ పూజలో ఒక బాలికను దేవతగా అర్చిస్తారు.] నాకప్పటికి పదహారో ఏడు [అమ్మ తమ వయస్సు విషయంలో ఎన్నడు అంత స్పష్టంగా చెప్పలేకపోయేవారని ఇక్కడ వ్రాయడం అవసరం] రాత్రి తొమ్మిది గంటలకు ఆయన నన్ను తమ గదికి రప్పించు కున్నారు. పూజ ఏర్పాట్లన్ని పూర్తిఅయ్యాయి. హృదయే ఆ ఏర్పాట్లన్ని చేశాడు. ఠాకూరు నన్ను కూర్చోమన్నారు. నే నాయన పడుకునే మంచానికి ఉత్తరంగా ఒకచోట కూర్చు న్నాను. నేను పశ్చిమ ముఖంగా ఉన్నాను. నా కెదురుగా గంగోదకంతో నిండించిన పెద్ద మట్టిపాత్ర ఉన్నది. ఠాకూరు తూర్పుముఖంగా పడమటితలుపు దగ్గిర కూర్చున్నారు. తలుపు లన్ని మూసివేశారు. పూజ కవసరమయిన వస్తువులన్ని నా కుడివైపున అమర్చారు.

నేను: ఆ పూజ సమయంలో నీవేమి చేస్తు న్నావమ్మా!

అమ్మ; కొంతసేపటికి నా కసలు ఒంటిమీద స్పృహే లేదు! ఏమి జరుగుతున్నది నాకేమి తెలియనే తెలియదు!

కాని లక్ష్మీఅక్క, అమ్మ ఆ తరవాత తనకు చెప్పారని ఆ సంగతి నాతో ఇలాగన్నది.

"పూజ ప్రారంభంలో ఠాకూరు నా పాదా లకు పారాణి పూసి, ముఖానికి పసుపురాసి, నాకొక కొత్తచీర అలంకరించారు. ఆ తరవాత నానోట ఒక తియ్యని తినుబండారం ఉంచారు.

ఆపైన తాంబూలంకూడా నోటికందించారు.

నేనాపైన మళ్ళీ మళ్ళీ అదేసంగతి అడిగాను.

నేను: తిరిగి తెలివివచ్చిన తరవాత ఏమిచేశావమ్మా?

అమ్మ: మానసికంగా ఠాకూరుకు సాష్టాంగ నమస్కారంచేసి, తిరిగి వచ్చేశాను.

నేను: అది కాళీపూజ రాత్రి. ఆ సమయంలో ఆ ప్రాంతంలో చాలామంది ఉన్నారు. మరి ఆ పూజసంగతి ఎవరికి తెలియలేదా?

అమ్మ: ఎలాగ తెలుస్తుంది? తలుపులన్నీ మూసివేశారు. దేవాలయంలో ఉత్సవాల కోలాహలం చెలరేగింది. అందరు తమతమ పనుల్లో మునిగి ఉన్నారు. అదేగాక జనానికి ఠాకూరుతో పని ఏమి ఉంది? ఆయన నొక సారి చూడాలని, స్పృశించాలని మాత్రమే ఎవరయినా అనుకోవచ్చును. అంతేకదా?

నేను: ఆపూజసమయంలో ఇంకెవ్వరయినా అక్కడ ఉన్నారా?

అమ్మ: దీను అన్న పిల్లవాడు అక్కడే ఉన్నాడు. ఆ అబ్బాయి ఆయనతోనే ఉండేవాడు. ఆ పిల్లవాడంటే ఠాకూరుకు ఎంతో అభిమానం. దీను పువ్వులు కోసేవాడు. బిల్వ దళాలు, సేకరించేవాడు. హృదయే పూజకోసం కావలసిన ఏర్పాట్లన్నీ చేశాడు. అయితే పూజసమయంలో నేనుతప్ప ఇంకెవ్వరు అక్కడ లేరు. పూజ ముగిసేసమయానికి హృదయ్ లోపలికి వచ్చాడు. షోడశీపూజ జయరాం బాటిలో జరిగిందని రామబాబు తమ పుస్తకంలో వ్రాశారు! అది ఎలాగ సాధ్యపడుతుంది? ఠాకూరును అందరు ఆ సమయంలో "మతిచలించిన మనిషి" అని అంటూండేవారు. ఒక్క స్త్రీని కనక అక్కడ ఆరాధిస్తే వారి విమర్శకొక అంతు దరి ఉండేదికాదు.

"ఆ తరవాత నేను దక్షిణేశ్వరంలో దరిదాపుగా ఒక ఏడాదిదాకా ఉండిపోయాను. ఆపైన నాకు జబ్బుచేసి తిరిగి జయరాంబాటి వెళ్ళిపోయాను. నా వైద్యంకోసం శంభు బాబు ప్రసాద్ బాబుని పిలిపించారు.

నేను; ఠాకూరు జనని మరణించినప్పుడు నీవు దక్షిణేశ్వరంలోనే ఉన్నావా అమ్మా?

అమ: లేదు జయరాంబాటిలో ఉన్నాను. నాకు జబ్బుచేసింది. దక్షిణేశ్వరంలో ఒక ఏడాదిపాటు జబ్బు పడినతరువాత, తిరిగి మా ఇంటికి వెళ్లిపోయాను...ఆ తరవాత జయరాం బాటికి రెండు మూడు సారులు రాకపోకలు కొనసాగించాను. ఇప్పుడు రామలాల్ ఇల్లున్న ప్రదేశంలో నా కొక గది కట్టించారు. కెప్టెన్ విశ్వనాథ ఉపాధ్యాయ దానికి కావలిసిన కలపఅంతా ఇచ్చారు. ఆ గది కట్టించినది శంభుబాబు. దానికోసమని తెప్పించిన దూలం ఒకటి గంగానదివరదలో కొట్టుకుపోయింది. హృదయ్ అదివిని నా దగ్గిరికివచ్చి 'నీవు దుర దృష్టవంతురాలివి!' అంటూ నా మీద కోప పడ్డాడు. కెప్టెన్ ఆ సంగతివిని 'ఎంత కలప కావలిస్తే అంత కలప నేనిస్తా'నని వాగ్దానం చేశాడు. ఆ తరవాత కొంతకాలంపాటు నేనా గదిలో ఉన్నాను. వర్షాకాలంలో ఠాకూరు ఒకనాడు ఆ గదికి వచ్చారు. ఆ నాడు విపరీతంగా వాన కురిసింది. అందుచేత ఆ నాటిరాత్రి ఆయన తిరిగి తమగదికి వెళ్ళలేకపోయారు. రాత్రి భోజనం ముగించుకుని అక్కడే పడుకున్నారు. 'కాళీ దేవాలయం పూజారులు

రాత్రివేళ తమ ఇళ్లలో ఇలాగే కాలక్షేపం చేస్తారు. నేనుకూడా అలాగే వచ్చానని అనుకుంటున్నాను.' అంటూ నన్ను వేళాకోళం పట్టించారు.

''ఆ తరవాత ఠాకూరుకి జబ్బు చేసింది. అందుచేత ఆయనకు పరిచర్య అవసరమయింది. అందుచేత వారణాసినించి వచ్చిన ఒక ముసలావిడ ఆ గది విడిచిపెట్టి నహబత్‌లో ఉండవలిసిందని నన్ను ప్రోత్సహించింది. అందుచేత నేనా గది విడిచిపెట్టి నహబత్ గదికి తిరిగి వచ్చివేశాను. ఆయన పరిచర్య ప్రారంభించాను.

''నాలుగవసారి తిరిగి నేను దక్షిణేశ్వరానికి వచ్చినప్పుడు, మా అమ్మ, లక్ష్మి, మరి కొందరు నాతోబాటు వచ్చారు. తారకేశ్వరం దేవాలయంలో దైవదర్శనం ముగించుకుని మేమంతా దక్షిణేశ్వరం చేరుకున్నాము.... మేము గుమ్మంలో అడుగు పెట్టగానే హృదయ్ మా వైపు చుర చుర చూసి 'వాళ్ళందరు ఎందుకు వచ్చారు? ఇక్కడ వారికేం కావాలి? ఇక్కడికే ఎందుకు రావాలి?' అంటూ చాలా అమర్యాదకరంగా ప్రవర్తించాడు. మా అమ్మ దాని కేవిధంగాను సమాధానం చెప్పలేదు. అమ్మ, హృదయ్, ఒకే సిహోరుగ్రామంలో పుట్టి పెరిగారు. అందుచేత అతనికి అమ్మ అంటే భయభక్తు లేమాత్రము లేవు.

'రండి, ఇంటికి తిరిగి వెళ్లిపోదాము. నా కుమార్తె నిక్కడ ఎవరి ఒద్దికలో అట్టే బెట్టను?' అన్నది మా అమ్మ. హృదయ్ ఏం చేస్తాడో అని ఠాకూరు చాలా భయపడ్డాడు. అందుచేత ఈ వ్యవహారంలో కలగజేసుకోడానికి ఇష్టపడలేదు. ఆనాడే మేమంతా తిరిగి ఇంటికి వెళ్లిపోయాము. ఏరుదాటించే నావ ఏర్పాటులన్ని రామలాల్ చేశాడు. 'అమ్మా, నీవు రమ్మని నాకోసం కబురు పంపిస్తేనే వస్తాను.' అని నేను అంతర్యంలో జగన్మాత నుద్దేశించి విన్నవించుకున్నాను. ఆ తరవాత త్రైలోక్యబాబు కుమార్తెకు పాదపూజ చెయ్యడంవల్ల హృదయ్‌కు దక్షిణేశ్వరం విడిచి వెళ్లిపోవలిసిన అగత్యం కలిగింది. [మధురబాబు కుమారుడు త్రైలోక్యబాబు శూద్రుడు. అందుచేత బ్రాహ్మణుని పాదపూజవల్ల తన కుమార్తెకు హాని కలగగలదని భయపడ్డాడు.]

రామలాలీసమయంలో కాళీ దేవాలయానికి శాశ్వతంగా పూజారి అయ్యాడు. 'నాకింకేమి కావాలి? నేనిప్పుడు కాళీ జననికి స్వయంగా అర్చకుణ్ణి.' అని అతడు అహంకరించడం ప్రారంభించాడు. ఆ తరవాత మరి ఠాకూరుసంగతే ఆలోచించలేదు రామలాలు. ఆయన మాటి మాటికి దివ్యావేశాలవల్ల స్పృహతప్పి ఎక్కడపడితే అక్కడ పడిపోయేవారు. ఆ పైన దేవాలయానించి వచ్చిన ప్రసాదం పాసిఉండేది. అంతేకాదు. ఠాకూరుకు సరిఅయిన భోజనసౌకర్యమే అమరలేదు. ఆ సమయంలో ఆయనదగ్గిర ఎవ్వరు లేకపోయారు. అందుచేత నన్ను దక్షిణేశ్వరానికి రావలిసిందని ఠాకూరు మాటి మాటుకి కబురు పంపించారు. ఎవరన్నాసరే, మా ఊరివైపువస్తే రావలిసిందని వారిద్వారా కబురు పంపించేవారు. చిట్టచివర ఒక ఏడాదిపాటు జయరాంబాటిల ఉన్నతరవాత ( దక్షిణేశ్వరానికి వచ్చేశాను.

నేను : రాసమణి పోయినప్పుడు ఠాకూ ఎక్కడ ఉన్నారు?

అమ్మ : ఆ సమయంలో ఆయన దక్షిణేశ్వరంలో ఉన్నారు. రాసమణి మరణశయ్యమీద ఉన్నప్పుడు అంతిమక్షణాలలో, కాళీఘాటులో ఉన్న కాళీ దేవాలయంలో దీపాలనన్నిటిని

తీవ్రంగా వీచినచాలి ఆర్పివేసిందని, కాళీమాత రాసమణి కట్టెదట ప్రత్యక్షమయినదని నేను ఠాకూరువల్ల ఇంకా ఇతరులవల్ల విన్నాను. ఆమె కుటుంబానికి సంబంధించినవారంతా కాళీఘాటులో పరమపదించారు. అయితే ఒక్క మధురబాబు మాత్రమే జనబజారులో చని పోయారు. అంతే.

బేలూరు మఠము. బుధవారము. 16, అక్టోబరు, 1912.

మేమంతా మఠంలో దుర్గాపూజ జరుపు కుంటున్నాము. ఈ వేళ దుర్గాప్రతిమ ప్రతి ష్ఠాపన జరుగుతుంది. మధ్యాహ్నానికి అమ్మ ఇక్కడికి రావలిసిఉంది. అమ్మ ఇంకా రాలే దన్న ఆత్రతతో బాబూరామ్ మహారాజ్ [స్వామి ప్రేమానంద] తొందర తొందరగా అటు, ఇటు తిరుగుతున్నారు. ద్వారాని కిరు వైపుల అరటిచెట్లు, పూర్ణకుంభాలు ఇంకా కొన్ని ఏర్పాటు చెయ్యలేదని గమనించిన ఆయన "అవి ఇంకా సిద్ధం చెయ్యలేదట! మరి అమ్మ ఎలాగ లోపలికి రాగలరు?" అని కేకలు పెట్టారు.

దుర్గాప్రతిమ ప్రతిష్ఠాపన జరగగానే, అమ్మ బండి వచ్చింది. గోలాప్‌మా అమ్మ జబ్బ పట్టుకుని బండిలోనించి దిగడానికి సాయపడింది. అమ్మ నలువైపులా పరకాయించిచూసి "అంతా ఎంతో పరిశుభ్రంగా ఉంది. దుర్గా దేవే స్వయంగా విజయం చేసినట్లుంది." అన్నారు.

అష్టమిపూజనాటి సాయంత్రం మేమం దరము గిరీశబాబు సహోదరి మృత్యువును గురించి చర్చించుకుంటున్నాము. దుర్గాప్రతిమ ప్రతిష్ఠాపన జరిగిననాటి రాత్రి ఆమె అకస్మా త్తుగా మరణించింది. దానిమీద అమ్మ ఇలా గన్నారు!

"జీవితం అంటే అంతే! ఈ వేళ ఇక్కడ ఉంటాము. తెల్లారితే ఎక్కడికో వెళ్లిపోతాము! పుణ్యాపాపాలు తప్ప మనిషివెంట వెళ్లేవిలేదు! చనిపోయిన తరవాతకూడా సుకృత దుష్కృత ఫలితాలు మనిషిని అనుసరిస్తాయి.

దుర్గాదేవి ప్రతిమను గంగాజలంలో నిమ జ్జనంచేసే సమయంలో డాక్టరు కంజీలాల్, ఆ దేవి మూర్తితోబాటు నావలోనే ఉన్నారు. ఆయన రకరకాల ముఖభంగిమలతోను వేళా కోళంతోను అందరిని కడుపుబ్బ నవ్విస్తున్నారు. ఆ సమయంలో ఆ నావలో ఉన్నవారిలో చాలా మంది డాక్టరు కంజీలాల్ వినోద కార్యక్రమం గమనించి మరింతగా కులాసాగా నవ్వుతున్నారు. అక్కడ ఒక బ్రహ్మచారి ఉన్నాడు. ఆయన అభిరుచి చాలా సున్నితమయినది. అందువల్ల డాక్టర్ కంజీలాల్ హాస్యప్రదర్శన గమనించి చాలా అసహ్యించుకున్నాడు. ఆ సమయంలో మఠానికి ఉత్తర దిశలోఉన్న తోటలో అమ్మ ఉన్నారు. ఆమె అన్ని గమనించి చాలా ఆనం దిస్తున్నారు, "దేవి మూర్తిముందర ఆ హాస్య ప్రదర్శనలన్ని గమనించి చాలామంది డాక్టరు కంజీలాల్‌ను దుయ్యబడుతున్నారమ్మా!" అన్నాను నేను ఆమెకేసిచూసి. దానిమీద అమ్మ ఇలాగన్నారు.

"అబ్బెబ్బే! ఆ హాస్యప్రదర్శనలో తప్పేమి లేదు! పాటలతోను, సంగీతంతోను, హాస్య ప్రదర్శనలతోను దేవి కుల్లాసం కలిగించడం చాలా అవసరం."

మాతృదేవి పూజ పూర్తి అయ్యేటంతవరకు ఉండి, ఆ తరవాత మళ్ళీ కలకత్తాకు తిరిగి వచ్చేశారు. ఆ తరవాత మరికొన్నిరోజులలోనే ఆమె వారణాసికి బయలుదేరారు.

(సశేషం)

# భాగవత ప్రహ్లాదకథాతత్త్వ విచారము

## ధూళిపాళ శ్రీరామమూర్తి.

మరి ప్రహ్లాదుడున్నాడు. అతడు దైత్య గర్భమున జన్మించినాడు. అనగా జన్మాంతర మున రాక్షసుడుగా పుట్టుటకు తగిన పాపకర్మ మును చేసినవాడు. ఐనప్పటికి, మహాత్ముడైన నారదుని యనుగ్రహామునవలన శుభవాసన కల వాడైనాడు. జయవిజయుల కా యశుభవాసన విష్ణుద్వేషమై పరిణమించినది. ప్రహ్లాదునకో ఈ శుభవాసన విష్ణుభక్తియై పరిణమించినది. కాబట్టి ఈ కథ మహాత్ముల యనుగ్రహామును సంపాదింపవలెనని చెప్పుచున్నది. ఇందుకొరకే ఊతిలక్షణ మిందు వర్ణింపబడినది. అనగా జన్మాంతరకర్మ మెట్టిదైనను మహాత్ముల నిగ్ర హానుగ్రహములు వానినిగూడా మీరి ఫలిత మియ్యగలవన్నమాట.

పరీక్షిన్మహారాజు విష్ణువు దైత్యులను చంపిన కథలు విన్నాడు. ఆయనకు విష్ణువు పక్షపాతము కలవాడన్నట్లు తోచినది. అందుచేత శుక మహర్షిని "అయ్యా! ఎప్పుడు చూచినను విష్ణుమూర్తి రాక్షసులనే చంపినట్లు మాత్రమే చెప్పుచున్నారు. దేవతల నొక్కమాటైనను చంపలేదు. ఆయన సర్వభూతములయందు సముడు, ప్రియుడు, స్నేహితుడు అనిగదా చెప్పుదురు. మరి ఈ పక్షపాత మెందులకు? ఇంద్రునికొఱకు రాక్షసులను చంపుట ఎందు లకు? దేవతలవలన ఆయనకు ప్రయోజనమే మున్నది? రాక్షసులవలన కష్టమేమున్నది? పరమానంద స్వరూపుడైన పరమేశ్వరునకు ఒకరివలన ప్రయోజన మేముండును? ఆయన నిర్గుణుడుగదా? ఆయనకు రాక్షసులవలన భయ మేల యుండును. కనుక వారిపైన ద్వేష ముండవలసిన పని యేమున్నది? అందుచేత అడుగుచున్నాను. ఆయన ఇంద్రుని పక్షము వహించి రాక్షసుల నేల చంపెను? దానికి శుకమహర్షి యిట్లు సమాధానము చెప్పెను.

పరమేశ్వరుడు నిర్గుణుడే. అనగా సత్త్వరజ స్తమోగుణములు లేనివాడు. ఆయన జన్మ రహితుడు. రాగద్వేషములకు నిమిత్తమైన దేహేంద్రియాదులు లేనివాడు. ఐనప్పటికి తన మాయాగుణములైన సత్త్వరజస్తమస్సులను అధిష్ఠించి బాధింపదగువారిని బాధించువాడై నాడు. సత్త్వము, రజస్సు, తమస్సు, ఈ మూ డును ప్రకృతియొక్క గుణములు. పరమాత్మ గుణములుకావు. ఈ మూడింటికి ఒకే కాల మున, హానివృద్ధులుండవు. సత్త్వమునకు జయ కాలము వచ్చినప్పుడు దేవతలను, ఋషులను ప్రవేశించి వారికి జయము కల్గించును. రజో గుణమునకు జయకాలము వచ్చినప్పుడు రాక్ష సులను జయము పొందించును. తమస్సునకు జయకాలము వచ్చినపుడు యక్షరక్షస్సులను అభివృద్ధి పొందించును. అనగా ఆయా కాల ములయందు ఆయాగుణములను పొంది ఆయా గుణప్రధానులైనవారిని ప్రవేశించి వారికి వృద్ధియు తక్కినవారికి హానియు కలిగించును. కావున వైషమ్యముగాని, పక్షపాతముగాని లేవు. గుణములు ఆయనవికావు. కావున పక్ష పాతములేదు.

గుణము లాయనవి కాకపోయినను, ఆ గుణముల నధిష్ఠించుచున్నాడుగదా. అపుడు వైషమ్యము రాలేదాయన్నచో, ఆ వైష మ్యము ఆ గుణములయందు కాలముచేత కల్గి నది. ఆయనయందున్న సమత్వమునకు భంగము లేదు. కాష్ఠములయందు జ్యోతి, పాత్రలయందు

జలము, ఘటములందు ఆకాశము నానారూపములుగా కనిపించుచున్నది. కాని న్యాయమునకు జ్యోతికి, జలమునకు, ఆకాశమునకు ఆయా రూపములులేవు. అవి ఎచ్చటనున్నను ఏక రూపమే. ఉపాధులైన కాష్ఠపాత్ర ఘటాదుల రూపములు వానికున్నట్లు కన్పించుచున్నది. ఆ రూపములను వేరుచేసి, వానిని వేరుచేసి వివేకించి చూచినకాని, ఈ రూపము లుపాధి గుణమని మనకు తెలియదు. అట్లే దేవతల దేహములనుండి వాని నధిష్ఠించియున్న పరమాత్మను మనము వేరుచేసికొని చూడలేక పోవుచున్నాము. అందుచేత ఆయన వైషమ్యము పక్షపాతము కలవానివలె కన్పించుచున్నాడు - అని సమాధానము.

దీనిపైన మరల ప్రశ్న. సరె బాగున్నది. మరియిట్లయినచో పక్షపాతము వైషమ్యము, గుణకృతము, కాలకృతమగును. ఈశ్వర కృతము కాదని యొప్పికొనవచ్చును మరి ఆయాకాలములందు ఆయా గుణముల నధిష్ఠించి వారిని జయింపజేసెనంటిరి గదా. అది ఎట్లు తెలియును? అని మరల ప్రశ్న. దానికి సమాధానమిది.

అవును. అది తెలియుట కష్టమే. దానికి విచారణ కావలయును. సూక్ష్మవిచారణయందు నైపుణ్య ముండవలయును. అట్టి నిపుణులకు మాత్రమే అది తెలియును. వారు తమయందున్న పరమాత్మను విచారణచేత వివేకించి తెలిసికొన గలుగుదురు. కొంచము వివరించుకొందము.

దేవతలు గెలిచి రాక్షసులు ఓడిపోయిరి. ఈ సంఘటనము తీసికొందము. వారెందుకు గెలిచిరి. వీరెందుకోడిపోయిరి? దీనికి దేవతలు పరాక్రమవంతులు. రాక్షసులు పరాక్రమహీనులు. వారు బలవంతులు. వీరు బలహీనులు అని పైకి కన్పించుకారణము. అట్లే యైనచో మరియొక సందర్భమున దేవత లోడిపోవుట రాక్షసులు గెలుచుట జరుగుచున్నదే. అప్పుడు రాక్షసులు బలవంతులు, దేవతలు బలహీనులు అనిగదా చెప్పవలెను. ఐనచో వారే ఒకప్పుడు బలవంతులు మరియొకప్పుడు బలహీనులగుటకు కారణమేమి? దీనికి పైకి కన్పించు కారణము లేదు. కొంచెము లోపలికి దిగవలయును.

వారి వారి జన్మాంతర కర్మ పరిపాకమును బట్టి వారి కట్టి జయాపజయములు కలిగినవని చెప్పవలెను. లేక స్వభావములు కారణములుగా చెప్పవలయును. కాని ఈ స్వభావముగాని కర్మగాని కాలము నాశ్రయించి కారణములగుచున్నవి గాని, వాటియంతట యవి ఫలమిచ్చుటకు, సమర్థములుకావు. జన్మాంతరమున చేసిన కర్మ కాలమువలన పరిణతజెంది ఫలమిచ్చుచున్నది. స్వభావమైనను దానికను గుణమైన కాలమునందే విజృంభించుచున్నది. కావున కాలమునే కారణముగా చెప్పవలయును. అప్పుడు కాలము మాత్రమేల? అపుడట్లు నిపుడిట్లు చేయవలెను అన్నచో అపుడు నిపుడు అనునవి కాలభేదములు. కావున నీ ప్రశ్న పుట్టుటకు తావులేదు. కాలముచేత కర్మకు పరిణతి స్వభావమునకు - వృద్ధి హైన్యములు కలుగును - అని యొప్పికొనక తప్పదు. ఈ స్వభావమన్నది; గుణములను పట్టియుండును. కావున దీని వృద్ధిహైన్యములు గుణములకు సంబంధించినవి. కావున కాలమును బట్టి గుణములయందు వైషమ్యమేర్పడుట తటస్థించును. గుణములనుబట్టి స్వభావము, దానిని బట్టి కర్మయుండునని తేలినది. కావున వైషమ్యముగాని, పక్షపాతముకాని, కాలకృతము

గుణకృతమునని తేలినది. బాగుగనేయున్నది. మరి ఈశ్వరుని ప్రసక్తి యిందేమున్నది? ఈశ్వరుడు వారిని ప్రవేశించి, వారికి జయము వీరికపజయము నొసంగుచున్నాడంటిరిగదా! దానిమాటేమి. అన్నప్రశ్న యున్నది.

కాలముగాని, గుణములుగాని, స్వభావములుగాని, కర్మగాని జడములు. వానియంతట నవి ఫలమియ్యలేవు. కార్యకారులు గావు. ఈశ్వరాధిష్ఠితములైనపుడు మాత్రమే యివి యన్నియు కార్యకారులగుచున్నవి. కావున ఫలదాత ఈశ్వరుడు. ఈశ్వరాధిష్ఠితములు కాక, జడపదార్థములు కార్యదక్షము లెట్లగును? కావున దేవతలయందు ప్రవేశించి రాక్షసుల కపజయమును, దేవతలకు జయమును ఈశ్వరు డిచ్చినాడని చెప్పితిమి. సరే ఫలిత మిచ్చుటకు ఈశ్వరుడు సమర్థుడే. ఈశ్వరాధిష్ఠితులు కానిచో కార్యకరణమునందు సమర్థులుగారు. మరి ఫలితమును పొందుటమాత్రము జడకార్యమగునా? ఈశ్వరాధిష్ఠితులుకాక అపజయముమాత్ర మెట్లు పొందుదురు? అని మరల ప్రశ్న.

నిజమే. అందుచేతనే బాధ్యుడు బాధకుడు కూడ ఈశ్వరుడే. రెండును ఈశ్వరకార్యములే అని చెప్పుటయే యుచితము. వారినధిష్ఠించి వారికి జయమిప్పించెను. వీరి నధిష్ఠించి వీరికి నపజయము పొందించెను. అనుట సరియే. కాని యిచ్చట ప్రశ్ననుబట్టి సమాధానమిట్లు చెప్పవలసి వచ్చినది. అభిప్రాయముమాత్ర మదే. ఈశ్వరుడు సర్వభూతములయందు సముడు, ప్రియుడు, స్నేహితుడునై యుండికూడా దేవతలయందు పక్షపాతము వహించి రాక్షసులనేల సంహరించెననిగదా ప్రశ్న. కావున రాక్షసులను సంహరించెనని యంగీకరించి సమాధానము చెప్పవలసి వచ్చినది.

మరియొకటి యాలోచింతము. పై విచారణమువలన తేలిన ఫలమేమి? ఈశ్వరుడు, కర్మఫలదాతయని, ఏ గుణమునకు జయకాలమున, నాయాగుణప్రధానులను చేరి తదన్యులకు నపజయము కల్గించునని, వారికి జయము కల్గించునని, ఫలదాతృత్వ లక్షణము చెప్పబడినది. దీనిబట్టి పై ప్రశ్నయే యసంగతముగ నున్నదని తేలును. పరీక్షిత్తునకు కన్పించినది దేవతల తరపున విష్ణువు రాక్షసులను చంపుటమాత్ర మే. కాని రాక్షసులచేతిలో దేవత లెన్నితడవు లోడిపోలేదు. దానిని గురించి పరీక్షిత్తునకు ప్రశ్న పుట్టలేదు. కారణమేమి? ఆయా సందర్భములందు దేవతలు గెలిచినపుడు విష్ణువు వారికి సహాయము చేయుటయో, ఓడినపుడు ఆయనతో మొర పెట్టుకొనుటయో, జరిగినట్లు చెప్పబడినది. రాక్షసులు జయించినపుడు వారికి విష్ణువు సహాయము చేసినట్లుగాని, ఓడినపుడు వారాయనతో మొఱపెట్టుకొన్నట్లుగాని చెప్పబడలేదు. దీనినిబట్టి పరీక్షిత్తునకు తోచినదేమి? వినువాని కెవనికైనను తోచునదేమి? రాక్షసులు పరాక్రమవంతులు. పౌరుషప్రధానులు. దేవతలు అన్యసహాయ మపేక్షించుచువారు అని.

కాని న్యాయమునకు రాక్షసులు గూడ జయించుటకు పౌరుషము నెరపుటకు కారణమీశ్వరుడు వారియందుండుటయే. సత్వగుణప్రధానులుగావున దేవతలకీ విషయము తెలియును. ఈశ్వరానుకూల్యములేక అనుకూల ఫలితము కలుగదని వారికి తెలియును. అందుచేత వారీశ్వరుని ప్రార్థించుట, ఆయనవచ్చి

సహాయపడుట చెప్పబడినది. రాక్షసుల కీసంగతి తెలియదు. వారు పౌరుషమునే నమ్మిరి. వారి జయమున కీశ్వరుడే కారణ మైనను ఆ సంగతి ప్రముఖముగా చెప్పబడక పోవుటకు కారణమేమి? దైవానుకూల్యమును బట్టి కార్యములు నిర్వహించుకొనవలెననియు, అహంకారమువలన అనర్థములు కలుగుననియు ఉపదేశము. రజస్తమస్సులు బంధహేతువులు. సత్వము మోక్షహేతువు అని చెప్పుట పరమార్థము. కాబట్టి కాలశక్తిచేత క్షుభితములైన గుణములయందున్న వైషమ్యము సన్నిధి మాత్రముచేత వాని నధిష్ఠించిన పరమేశ్వరుని యందున్నట్లు భాసించినది.

ఇట్లేకాక మరియొక విధమునగూడా నీ విషయమున న్వయించుకొనవచ్చును. రాక్షసులను విష్ణువు సంహరించుట వారియందు ద్వేషముచేతనని యేల చెప్పవలెను? దేవపక్షపాతము చేతయని యేల చెప్పవలెను? ఏదో కారణమువలన వారికి అసుర జన్మరాగా వారి నుద్ధరించుటకు పరమేశ్వరుడు వారిని స్వయముగావచ్చి సంహరించెనని యేల చెప్పుకొనరాదు? చూడండి. దేవతలకు పరమేశ్వరుడు సహాయము చేసినట్లు కన్పించినను వారికెవరికిని ఆయన మోక్షమిచ్చినట్లు బంధనివృత్తిగావించినట్లు కన్పించదు. మరిరాక్షసులకో, వారెంతటి యదృష్టవంతులు! యుద్ధమునందు గరుడవాహనారూఢుడై శంఖచక్రనందక కౌమోదకీ ధారియై ఎదురుగావచ్చి వారికంఠముల నుత్తరించిన భగవంతునిచూచుచు ప్రాణములు వదలుచున్నారు. ప్రాణోత్క్రమణకాలమున పరమేశ్వర దర్శనముచేతనే వారికి తత్ప్రాప్తి కల్గుచున్నది. వారాయన, యందైక్యమై పోవుచున్నారు. ఇంతకంటె మహానుగ్రహ మేముండును? పూర్వము చెప్పిన సూక్ష్మవిచారణవలన చేసికొనదగిన యన్వయముకంటె ఇది సుఖతరముగదా! కావున యిట్లు చెప్పుకొనుచున్నాము.

—సశేషము.

దేవా మనుష్యాః పశవః పక్షివృక్షసరీసృపాః
రూపమే తదనంతస్య విష్ణోర్భిన్న మివస్థితం

దేవతలు మనుష్యులు పశువులు పక్షులు వృక్షములు పాములు మొదలగునవి భిన్నభిన్నముగా కనపడినను—అన్నియు అనంతుడైన విష్ణువుయొక్క రూపములే.

పురాణము.)

యథా హ్యేకేన చక్రేణ రథస్య న గతిర్భవేత్
ఏవం పురుషకారేణ వినా దైవం న సిధ్యతి

ఒక చక్రముతో రథమును నడుపుటకు వీలుకానట్లు, దైవమును మాత్రమే నమ్ముకొని ఏదియు ఈ లోకములో సాధించుటకు వీలుకాదు. కావున కార్యసాధనకు పురుషప్రయత్నమునుకూడ జోడించవలసియున్నది.

(యాజ్ఞవల్క్య స్మృతి)

# శ్రీ రామకృష్ణ కథామృతము

(రెండవ భాగము)

అనువాదము: ప్రవ్రాజిక శ్యామాప్రాణ

శ్రీ రామకృష్ణులు దక్షిణేశ్వరమున భక్తులతో.

క్రీ. శ. 1883 సం॥ జూన్ 4 వ తేది, సోమవారం.

నేడు ఫలహారిణీ కాళీపూజ జరుగును. అందుకే రాణిరాస్మణి మనుమడు త్రైలోక్యుడు కుటుంబముతో సహా కాళికాలయమునకు వచ్చియుండెను.

శ్రీ రామకృష్ణులు తమగదికి పడమటి వైపునగల వరండాలో కూర్చొనియుండిరి: ప్రక్కనే మాస్టరు ఉండెను. రాఖాల్ శ్రీ రామకృష్ణుని ఒడిలో తలబెట్టి పడుకొనియుండెను. అతనియందు శ్రీ రామకృష్ణులకు బాలగోపాలుని భావన గలదు.

త్రైలోక్యుడు శ్రీ కాళికాదేవిని దర్శించుటకై ఆ దారిన వచ్చుచుండుట శ్రీ రామకృష్ణులు చూచిరి. వెంటనే రాఖాల్‌ని లేచి కూర్చొనమని చెప్పిరి. త్రైలోక్యుడు శ్రీ రామకృష్ణులకు నమస్కరించెను.

శ్రీ రామకృష్ణ : (త్రైలోక్యునితో) హరికథ నిన్న ఎందుకు చెప్పింపలేదు?

త్రైలోక్య: అవునండీ నిన్న హరికథ చెప్పించుటకు కుదరలేదు.

శ్రీ రామకృష్ణ : ఈ మారు జరిగిపోయిందేదో జరిగిపోయింది. ఇకమీదట ఎప్పుడూ ఇట్లా కాకుండ చూడవలసినది. ఏర్పరచిన నియములను అనుసరించుటయే మంచిది.

త్రైలోక్య తగిన సమాధానం చెప్పి వెళ్ళిపోయెను.

శ్రీ రామకృష్ణ : రామ్! త్రైలోక్యబాబుతో అటా నేను మాట్లాడింది ఉచితమేనా?

రామ్ : మహాశయా! మీరేమీ తప్పు చెప్పలేదే?

శ్రీ రామకృష్ణ: (భక్తులతో) హాజరా నాకిట్లా ఉపదేశం చేస్తుంటాడు. 'నీవు భగవత్ చింతన మాని ఈ బాలురకై ఎందుకు ఇంతగా చింతిస్తావు?

బండిలో బలరాముని ఇంటికి పోవుచుంటిని. దారిలో హాజరా చెప్పినదే చింతించుకుంటూ చివరకి జగన్మాతకు ఆ విషయాన్ని చెప్పితిని. వెంటనే జగన్మాత స్పష్టముగా నాకీ దివ్య దృశ్యమును చూపించెను. ఈశ్వరుడే మనుష్య రూపములను ధరించియుండుటయు పవిత్రాత్ముల యందు అధికముగా ప్రకాశించుటయు ఆ దివ్య దృశ్యమునందు తిలకించితిని. వెంటనే సమాధి స్థితి నందితిని. మామూలుస్థితికి రాగానే 'ఓరీ హాజరా నీవు అనవసరముగా నా మనస్సును కలవరపరచితివికదా' అని పలికితిని.

వీరు సాక్షాత్ నారాయణ స్వరూపులని నేనెఱుగుదును. నరేంద్రునకు దేహబుద్ధి కొంచమైనను లేదు. వానిని చూడవలెనని నా మనస్సు పరితపించెడిది. ఒకనాడు భోలానాథుని ఇట్లు అడిగితిని. ఇదేమి ఆశ్చర్యము? ఒక కాయస్థబాలకుని చూచుటకై నా మనస్సిట్లా పరితపించుచున్నది! నా కేమీ అర్థమగుట లేదు. భోలానాథుడు ఇట్లు బదులు చెప్పినాడు. 'దీని సమాధానం మహాభారతంలో ఉన్నది. సమాధినుండి మహాపురుషులు సామా

న్యస్థితికి వచ్చినప్పుడు సత్త్వగుణ సంపన్నులగు వారల సాంగత్యము నిచ్ఛగింతురు!

ఆహా! ఆ రోజులలో రాత్రింబవళ్ళు ఎట్లో గడచిపోయినవికదా! సర్వదా ఉన్మత్తునివలె ప్రవర్తించితిని. నాకు పిచ్చి పట్టినదని తలచి వివాహము చేసిరి!

రామలీల చూడటానికిపోయి వేషాలు వేసిన వారిని సాక్షాత్ సీతారామలక్ష్మణ హనుమంతులుగ భావించి పూజించితిని.

మరొకరోజు పొగడచెట్టుకడ నీలిరంగు చీర కట్టుకొనియున్న ఒక వేశ్యను చూచి సాక్షాత్ సీతాదేవిగా భావించితిని. రావణుని చెరనుండి విముక్తి పొందినదై శ్రీరామునివద్దకు పోవు చున్నట్లుగా భావించితిని. అటుపై స్పృహతప్పి చాలసేపు పడియుంటిని.

ఒకదినము కలకత్తా మైదానమునకు పోయితిని. ఒక చెట్టును ఆనుకొని త్రిభంగిగ నిలబడియున్న ఒక ఇంగ్లీషు బాలకుని చూచి తిని. మురళీగానము చేయుచున్న శ్రీ కృష్ణుడే అను భావము కలిగినది.

సిహోరునందు గొల్లబాలకులచే ఆహారము తినిపించితిని. వ్రేపల్లెలోని గోపబాలకులని వారిని భావించితిని. వారు తినుచున్న ఆహారమునుండి కొంత గ్రహించి మహాప్రసాదముగా భుజించి తిని.

కొందరిట్లు తలంచెదరు. "మేము సంసారములో బంధింపబడిన జీవులము. మాకు జ్ఞాన భక్తులు కలుగనేరవు". కాని గురుకృప యున్నచో ఏ భయమూ లేదు. నీ వెవరు? నీ స్వరూపమేమి? అనేది గురువు బోధించును. సాధనలు చేయగాచేయగా అన్నీ విశదపడును. చివరకు భగవంతుడే సత్యము, తక్కినదంతా అనిత్యము అని బోధపడును.

ఒక కథ వినుడు: నిండు గర్భిణి అయిన ఒక పులి గొఱ్ఱెలమందపై ఉఱికి నపుడు ప్రసవించి మరణించినది. పులిపిల్ల మాత్రము బ్రతికి గొఱ్ఱెపిల్లలతో బాటు ఆడుచు, విహరించుచు గడ్డి తినుచూ, గొఱ్ఱెవలె అఱచుచూ పెరిగి పెద్దదగుచుండెను. ఒకరోజు ఒక పులి ఆ గొఱ్ఱెల మందపై ఉఱికెను. అక్కడ గడ్డిని తినుచుండి బెదిరి పరినెత్తుచున్న మఱొక పులినిచూచి ఆశ్చర్యపడి వేగముగా వెళ్ళి దానిని పట్టుకొనెను. అది గొఱ్ఱెవలెనే బెదరి అఱచుచుండెను. ఆ పులి దానిని ఒక జలాశయమువద్దకు ఈడ్చుకొనిపోయి "నీళ్ళలో నీ ముఖమును చూడుము. నాలాంటి ముఖమే నీది, నీవు నేను ఒకేజాతివారము వేఱుకాము" అని ఉద్బోధించి బలాత్కారముగా మాంసమునుకూడ తినిపించి తరువాత తనతో అడవికి తీసికొనిపోయెను.

బెస్తవాడొకడు ఒకరాత్రి ఒక తోటలోని మడుగులో దొంగతనముగ వలలువేసి చేపలు పట్టుచుండెను. చప్పుడుకు యజమాని మేలుకొని దివిటీ వెలిగించి కొందరు పనివారలను వెంటబెట్టుకొని తోటలో వెదుకజొచ్చెను. బెస్తవానికి తప్పించుకొను ఉపాయము కనబడక ఇటు అటు పరుగులిడుచుండెను. అంత ఒక చోట ఒక బూడిదరాశిని చూచెను. వెంటనే ఆ బూడిద వంటినిండ అలుముకొని కొంతదూరములోఉన్న ఒకవృక్షముక్రింద కండ్లు మూసుకొని కూర్చొనెను. దొంగను వెదుకుచుండిన వారు అతడ్నిచూచి ఎవరో సాధువు అని భావించి మరోవైపున వెదకుటకు వెళ్ళిపోయిరి. తెల్లవారగనే 'ఎవరో మహాత్ముడు పలానా వారి తోటలో వేంచేసియున్నాడు' అనువార్త చుట్టుపట్ల గ్రామములకుగూడ ప్రాకినది. తండోపతండములుగా పల్లెప్రజలు పుష్పములు,

ఫలములు, నారికేళములు, కానుకలతోవచ్చి అతనిని సందర్శించుచుండిరి. కౌపీనధారియై యున్న ఆ బెస్తవాడు మనస్సులో ఇట్లను కొనెను. 'నేను నిజమైన సన్న్యాసి కాదు. కేవలము వేషధారియైన నాపై లోకులు ఎంత భక్తి చూపించుచున్నారు. నిజమైన సన్న్యాసి కాగలిగితే భగవంతునే పొందగలను. సందేహము ఏమున్నది? సంసారమును వదలిపెట్టి ఇక నిజమైన సాధువు అగుటకు ప్రయత్నించెదను.''

మణిలాల్ : మహాశయా! భగవంతుని ఏ స్థానములో ధ్యానించవలెను.

శ్రీరామకృష్ణ : హృదయములో. భగవంతుని ధ్యానించుటకు అదియే తగిన స్థానము.

మణిలాల్ నిరాకారవాది. అందుచే శ్రీరామకృష్ణులు కబీరుదాసు గీతిని ఒకటి వానికి వినిపించిరి.

**సాకార్ ఆమార్‌మా, నిరాకార్ అమర్‌బాప్**
**కాకే నిందా కాకేవందే దోనోం పల్లాభారీ ॥**

(సాకారము మా తల్లి, నిరాకారము మా తండ్రి. త్రాసులోని రెండు తట్టలూ సమానము. ఎవరిని నిందించను? ఎవరిని పొగడను?)

హలధారి పగలు సాకారధ్యానము, రాత్రులందు నిరాకార ధ్యానము చేసెడివాడు. ఏదో ఒక భావమును అవలంబించి విశ్వాసముంచిన చాలును. సాకారమైనా, నిరాకారమైనా - కావలసినది శ్రద్ధ ఒక్కటి.

శంభుమల్లిక్ విశ్వాసమే విశ్వాసము. అతడు బాగ్ బజారునుండి ఇక్కడకు నడచివచ్చెడివాడు. ''ఇంతదూరం నడచివస్తుంటారు. ఏదైనా ప్రమాదము కలుగవచ్చును. బండిలో వచ్చుట మంచిది'' అని ఒకాయన సలహా ఇవ్వగా అతను కండ్లెఱ్ఱజేసి ''ఎంత మూర్ఖముగా మాట్లాడుచున్నావు! భగవంతుని స్మరించుకొనుచు నేను నడచెదను. ఆపదలు గీపదలు నా దగ్గర కెట్లు రాగలవు?'' అని అన్నాడు.

(సశేషం)

గానమునకు పుట్టుకస్థానము హృదయము. భావోద్వేగము కలిగినపుడు అది అచ్చట నుండి ధ్వనిరూపముగా వెలువడును. ఆ ధ్వని లయబద్ధమైనపుడు గానము అగును. శాంతి సౌభాగ్యముగల దేశములోని గానము ప్రశాంతముగను ఆహ్లాదముగను ఉండును. సంక్షుభిత దేశములోని గానము ఉద్రేకమును అసంతృప్తిని ప్రకటించునదిగ ఉండును. పాడయిపోయిన దేశములోని గానము విషాదభరితముగను గతవైభవస్మరణతో నిండినదిగను ఉండును.

—కన్‌ఫ్యూషియస్.

ఉదయించుటకుముందు, సూర్యుడు తన ప్రభచే రాత్రికృతమగు చీకటిని పాఱద్రోలునట్లు అభ్యుదయమును కోరు పురుషుడు ముందు అజ్ఞానకృతమైన రాగద్వేషాదులను పాఱద్రోలవలెను.

—భారవి.

# అద్వైతసిద్ధి

సదాశివం

క్రీ. శ. 1537 వ సంవత్సరము. వసంత ఋతువు. ప్రాతఃకాలము. తూర్పు వంగదేశము నందు ప్రవహించుచున్న పద్మానదిమీద ఒక పడవ మెల్లగా సాగిపోతున్నది. తూర్పు దిక్కును శోభాయమానము చేయుచు బాల భానుడు ఉదయించి, ప్రకృతి సౌందర్యమును దర్శించుటకు అంతవరకు ఆవరణముగా ఉండిన చీకటిని పూర్తిగా తొలగించివేసినాడు. వింత వింత పుష్పములను అతి నేర్పుగా అమర్చి ప్రకృతిమాత విరాట్ పురుషుని అర్చించుచున్నట్లుగా ఉన్నది—వృక్షలతా గుల్మాదులు పుష్పించిఉండిన ఆ వసంతఋతువు శోభ. నానారకములైన పక్షులు ఉత్సాహ ముతో పరస్పరము సంభాషణలు సాగించు కొనుచున్నవి. భావము స్ఫురింపకపోయినను అవి చేయుధ్వని మానవులకు శ్రవణానందముగా ఉండినది.

పడవమీద న్నెండేండ్ల బాలుడొకడు తండ్రిప్రక్కన ఆసీనుడైయుండి తూర్పుదిక్కును ఎగబ్రాకుచుండిన బాలభానుని తదేకముగా చూచుచుండెను. హృదయమును కలచివేయు చున్న ఒక దైన్యభావమును, ఒక ఆవేదనా భావమును— ఆ బాలునిముఖము వ్యక్తము చేయుచుండినది. ఉన్నట్లుండి దైన్య ఆవేదనా ఛాయలు ముఖమున అంతరించినవి. మోమున గాం ్భీర్యము ద్యోతకమైనది. మందహాసముచే కలిగిన ముఖవికాసము ఆ గాంభీర్యముతో విడ దీయరాని విధముగా మిళితమయి బాలుని వదనమునకు ఒక వినూత్న సౌందర్యమును కలిగించినది.

హృదయములో ఆధిక్యము వహించిన ఏ భావతరంగము ఈ పరిణామమునకు కారణ మైనది?

'ఇకమీదట మానవులను స్తుతించను. మెప్పించను. దేవునినే స్తుతించెదను. మెప్పిం చెదను' – అను ఒక దృఢసంకల్పము బాలుని హృదయములో జనించినది. ఆ భావతరంగమే విజృంభించి దైన్య ఆవేదనా భావతరంగములను అణచివేసి బాలుని వదనమునకు ప్రశాంత గాంభీర్య మందహాసవికాస మిశ్రిత రామణీయ కమును తీసికొని వచ్చినది.

ఆ సుకుమార బాలహృదయమును అట్లు అంతవరకు కలచివేయుచుండిన ఆదైన్య ఆవే దనాభావతరంగముల ఉద్భవమునకు గల కారణముఏమి? అని అన్వేషించ దలచు కొన్నచో కాలచక్రమును ఒకరోజు వెనుకకు త్రిప్పవలయును.

ఆశువుగా కవిత్వము చెప్పగలవారలకు లోక ములో ఎప్పుడున్ను కొఱతలేదు. కాని ఒక బాలుడు ఆ పని చేసినచో లోకులు దానిని ఒక అద్భుతకర్మగా మెచ్చుకొని 'ఆహా ఆహా' అనెదరు. ఈ బాలునకు ఆ నేర్పు ఉండినది. చుట్టుప్రక్కల గ్రామములవారిని 'ఆహా ఆహా' అనిపించుచుండెను. ఇది చూచిన ఆ పిల్లవాని తండ్రికి ఒక ఆలోచన స్ఫురించినది. తక్షణమే పిల్లవానిని తీసికొని ఆ ప్రాంతమును పరిపా లించుచున్నవాని నగరమునకు బయలుదేరెను.

బయలుదేరుటకుగల ప్రయోజనమును పిల వానికి ఇట్లు చెప్పెను. "రాజు సమీపమునకు నిన్ను తీసికొనివెళ్ళెదను. అప్పుడు నీవు ఆ రాజు నుద్దేశించి కొన్ని స్తుతిపద్యములను చెప్ప వలసినది. రాజు తప్పక మెచ్చుకొనును. తరు వాత మనలను ఘనముగ సన్మానించి పంపించును."

తండ్రీ కుమారులు రాజు సమీపమునకు వెళ్ళినారు. బాలుడు ఆశువుగా రాజును ఇంద్రుడు చంద్రుడని స్తుతించినాడు. రాజు ఏ మాత్రము విననట్లు లేదు. బలవంతుడైన మతొక రాజుతో కలహము సంభవించినందున పరమ వ్యాకులమునకు లోనయిఉండెను. కాబట్టి స్తోత్రములను వినవలెనను ఉత్సాహము, ఉబలాటము వానికి ఆ సమయమున ఎంతమాత్రము లేదు. ఆశతో వచ్చినవారిని నిరాశపుచ్చక సన్మానముచేసి పంపవలెనను కర్తవ్యస్మరణ అంతకన్నను లేదు.

తండ్రీ కుమారులు నిదురపట్టని రాత్రిని నగరములో గడపి వేకువజామున తమ గ్రామమునకు బయలుదేరినారు.

తూర్పున బాలభానుడు ఉదయించుచుండగా క్రింద పద్మానదిజలములు జలజల ప్రవహించుచుండగా చెట్లమీద పక్షులు కలకలా రావము చేయుచుండగా బాలునకు మాత్రమే వదలిపోయినది–'నిద్రలేని దీర్ఘ రాత్రి కారణమైన హృదయక్షోభ.

ఇల్లును వదలిపెట్టి నవద్వీపమును చేరినాడు బాలుడు. ఆ రోజులలో నవద్వీపము ఒక గొప్ప విద్యాకేంద్రముగా విరాజిల్లుచుండినది. నవ్యన్యాయశాస్త్రమునకు ముఖ్యముగా పేరు గడించి ఉండినది. నవద్వీపమునుండి పండితుడు వచ్చుచున్నాడని చెప్పినచాలును – తక్కిన ప్రాంతములందున్న పండితులకు భయము కలిగించుటకు! అక్కడ హరిరామ తర్కవాగీశుడను సుప్రసిద్ధ నవ్యన్యాయ పండితుని ఆశ్రయించినాడు బాలుడు.

చైతన్య మహాప్రభువు ఆగమనముతో ఉప్పొంగిన భక్తిప్రవాహము వంగదేశమును ప్లావితము చేయుచున్నరోజులవి. ఆ ప్రవాహములో బాలుడున్ను తలమునకలైనాడు.

కృష్ణభక్తి పరవశుడగుచుండినను బాలుడు కొన్ని ఏండ్లలో నవ్యన్యాయశాస్త్రమునందు అపారమైన పాండిత్యమును గడించిన యువకుడైనాడు. ఎక్కడ చూచినను భక్త్యావేశము పొంగులు వారుటను గమనించి మనస్సున ఇట్లనుకొనినాడు. ''ఈ ఆవేశము ఎన్నాళ్ళుండును? ఆవేశము చల్లారిపోయిన తరువాత చైతన్య సంప్రదాయము నిలుచుటకు ఆధారమేది? కాబట్టి నేను దీనికి తాత్త్వికమైన ఒక ఆధారమును నిర్మించెదను.'

భక్తి సంప్రదాయములకు జీవుడు, జగత్తు, ఈశ్వరుడు అను పారమార్థిక భేదమును అంగీకరించవలసియున్నది. కాని భగవాన్ ఆదిశంకరాచార్యుల అద్వైత సిద్ధాంతమో శ్రుతియుక్తి అనుభవ బలములతో హిమవత్పర్వతమువలె అప్రకంప్యమై ఉండుటను యువకుడున్ను గుర్తించినాడు.

ఉపాయమును ఆలోచించి మనస్సున ఈనిర్ణయమునకు వచ్చినాడు. ''బౌద్ధులను ఓడించి అర్ష మతమును పునరుద్ధరించుటకు కుమరిల భట్టు సంకల్పించినవాడై, బౌద్ధగురువుల దగ్గర నే శిష్యుడుగాచేరి వారిశాస్త్రముల లోతుపాతులను తెలిసికొనివచ్చి చివరకు తన లక్ష్యమును సాధించినట్లుగా; నేనున్ను అద్వైతగురువులను చేరి శిష్యునిగా నటించి వారిశాస్త్రముల లోతుపాతులను తెలిసికొనివచ్చి, ఆ తరువాత అద్వైతమును ఛిన్నాభిన్నము చేసెదను.'' ఈ సంకల్పముతో వారణాసినిచేరి అక్కడ రామతీర్థ అను సన్న్యాసిని ఆశ్రయించినాడు.

రామతీర్థుని ప్రభావమువలన నటనాశిష్యుడు కొన్నాళ్ళకే నిజమైన శిష్యుడైపోయినాడు. ''ఉత్తమోత్తమ భక్తికి లక్షణము అభేదము. భేదముకాదు. భక్తికి పూర్ణవికాసము కలుగనంతవరకే జీవుడు వేఱు, జగత్తు వేఱు, ఈశ్వ

రుడు వేఱు – అను భేదము స్ఫురించుచుండును. కాని వేదముల పరమతాత్పర్యము జీవ బ్రహ్మైక్యమే'' – అను నిశ్చయమునకు వచ్చుటకు యువకునకు చాలరోజులు పట్టలేదు.

శ్రద్ధాభక్తి పురస్సరముగా శుశ్రూష చేయుచు గురుముఖతః తెలిసికొనవలసిన శాస్త్రవిషయములన్నియు తెలిసికొనిఅయినది. ఆ తరువాత ఒకరోజు రామతీర్థను యువకుడు ప్రార్థించినాడు—'సన్న్యాస దీక్షను అనుగ్రహించవలసినది' గా.

రామతీర్థ శిష్యుని చూచినాడు. ఆ చూపులలో తనతల్లిచూపుల వాత్సల్యముకన్నను ఎన్నియోరెట్లు అధికమైన వాత్సల్యము ఉన్నదను అనుభూతి శిష్యునికి కలిగినది. కొన్ని క్షణములతరువాత గురువు ఇట్లనినాడు ''మధుసూదనా, నిన్ను నాఅంతటివానిని చేసితిని. ఇప్పుడు నీవు నాకు సమానుడవైతివి. ఏ విధముగా ఇక నేను నీకు సన్న్యాసదీక్ష ఇవ్వగలను? ఇక్కడకు వచ్చినప్పుడే నీవు అడిగి ఉండవలసినది. సరి అది అట్లుండనీ. నీకు దీక్ష ఇవ్వగల గురువు ఈ కాశిలో లేకపోలేదు. విశ్వేశ్వర సరస్వతి ఉన్నారు. ఆయనను పోయి వేడుకొనుము. ఆ స్వామి నీకు దీక్ష ఇవ్వగలరు.''

విశ్వేశ్వర సరస్వతి అనుగ్రహముతో మధుసూదనుడు మధుసూదనసరస్వతి అను సన్న్యాసి అయినాడు.

ఆ కాలములోనే ద్వైత సంప్రదాయమునకు చెందిన వ్యాసతీర్థ అను మహామేధావి 'న్యాయామృతము' అను గ్రంథమును రచించినాడు. నవ్యన్యాయమునందు మహాపండితుడైన ఆయన తన అద్భుతవాదకౌశలముతో ఆ గ్రంథమునందు, అద్వైతసిద్ధాంతము అహైతుకము, అసంగతము, అయథార్థము అని తీర్మానించినాడు.

శంకరభగవత్పాదుల భాష్యములందు అచంచలమైన విశ్వాసము అద్వైతులకున్నది గనుక పదివేల న్యాయామృతములు పైన బడినను ఏమియుకాదు. కాని సిద్ధాంతములపై వచ్చు ఆక్షేపణలకు తగినసమాధానము చెప్పవలసిన బాధ్యత (అందరు స్వీకరించవలసిన అవసరము లేకపోయినను) కొందరైనను స్వీకరించవలసియున్నది.

'న్యాయామృతము' నకు తగిన సమాధానము చెప్పవలసిన బాధ్యతను మధుసూదన సరస్వతి స్వీకరించినాడు. దైవఘటన ఎంత చిత్రము! అద్వైతమును ఛిన్నాభిన్నముచేయ సంకల్పించిన నవద్వీపయువకుడే వారణాసిలో మధుసూదన సరస్వతిగా పరిణతిపొంది అద్వైతమునకు ఒక కోటను—పరపక్షులు సమీపించుటకైనను అశక్యమైనదానిని—నిర్మింప సంకల్పించినాడు. ఆ సంకల్పమునుండియే 'అద్వైతసిద్ధి' అను మహాగ్రంథము ఆవిర్భవించినది. అద్వైత సిద్ధాంతములో మంచి పాండిత్యము సంపాదించుకొనవలెనను అభిలాష గలవారందరకు అవశ్యము పఠనీయమై ఈ అద్వైతసిద్ధి ఈనాటికీ విరాజిల్లుచున్నది.

వ్యాసతీర్థుల న్యాయామృతమునకు సమాధానముగా మధుసూదన సరస్వతి అద్వైతసిద్ధిని రచించినాడు. అది సరియే! కాని గీతకు వ్యాఖ్యానము చేయవలసిన అవసరమేమున్నది? ఆచార్యశంకరులు ఈవరకే గీతకు అత్యుత్తమమైన వ్యాఖ్యానము చేసియున్నారుకదా! అది చాలదా? అని ఒక సందేహము. నిజమే. ఆచార్యశంకరులను మించి గీతకు వ్యాఖ్యానము చేయు సామర్థ్యము ఇంకెవరికున్నది! కాని

సన్న్యాసగురువైన విశ్వేశ్వర సరస్వతి ఆజ్ఞను శిరసావహించి మధుసూదన సరస్వతి గీతకు 'గూఢార్థదీపిక' అను భాష్యమును రచించి నాడు.

'ఓం నమః పరమహంసాస్వాదిత చరణ కమల చిన్మకరంధాయ భక్తజనమానస నివాసాయ శ్రీ రామచంద్రాయ'- అని దైవమునకు నమస్కరించి గీతా వ్యాఖ్యానమునకు పూనుకొనినాడు.

'భగవత్పాద భాష్యమాలోచ్యాతి ప్రయత్నతః
ప్రాయః ప్రత్యక్షరం కుర్వే గీతాగూఢార్థదీపికాం'

భగవత్పాదుల భాష్యమును అతి ప్రయత్నముతో ఆలోచించియే గీతలోని ప్రతి పదమునకు గూఢార్థదీపిక అను వ్యాఖ్యానమును చేయబోవుచున్నాను - అని మొదటి శ్లోకములో చెప్పియుండుట గమనించదగినది.

కృష్ణభక్తి పరవశుడుగా కదా మధుసూదనుడు నవద్వీపములో ఉండినది! అద్వైతి అయిన తరువాత ఆ భక్తి ఏమయినది? ఏమయినదో మధుసూదన సరస్వతినే అడిగెదము. ఆయన ఇట్లు చెప్పుచున్నాడు

ధ్యానాభ్యాస వశీకృతేన మనసా తన్నిర్గుణం నిష్క్రియం
జ్యోతిఃకించన యోగినో యదిపరంపశ్యంతి పశ్యంతు తే
అస్మాకం తు తదేవలోచనచమత్కారాయ భూయాచ్చిరం
కాళిందీ పులినోదరే కిమపి యన్నీలం మహోధావతి.

ధ్యానాభ్యాసముచే కలిగిన అతినిర్మలమైన మనస్సుతో యోగులు నిర్గుణము నిష్క్రియము అయిన పరమజ్యోతిని దర్శించిన దర్శింతురుగాక! మాకు మాత్రము ఎల్లప్పుడు నయనానందముగా కాళిందీ నదీతీరములో పరుగిడుచున్న ఆ నల్లనిజ్యోతియే దర్శన మిచ్చుచుండునుగాక!

వంశీ విభూషితకరాన్నవ నీరదాభాత్
పీతాంబరాదరుణ బింబ ఫలాధరోష్ఠాత్
పూర్ణేందు సుందరముఖాదరవిందనేత్రాత్
కృష్ణాత్పరం కిమపి తత్త్వమహం న జానే

పిల్లనగ్రోవి చేత బట్టుకొనియున్నవాడును, నీలమేఘశ్యాములుడును, పీతాంబరుడును, అరుణకాంతులు వెదజల్లుచున్న అధరములు గలవాడును, పూర్ణచంద్రునివలె సుందరమైన వదనముకలవాడును, అరవిందాక్షుడును అగు కృష్ణునకు మించిన తత్త్వము నాకేమియు తెలియదు.

అనంతశాస్త్రం బహువేదితవ్యమల్పశ్చ కాలో బహవశ్చ విఘ్నాః
యత్సారభూతం తదుపాసితవ్యం హంసో యథా క్షీరమివాంబుమిశ్రం॥

తెలుసుకోవలసిన శాస్త్రవిషయాలకు ఒక లెక్క ఒక పరిమితి అనేది లేదు. జీవితకాలమా అల్పము. అల్పములో ఎన్నియో అంతరాయములు. కాబట్టి నీళ్ళపాలనుండి పాలనుమాత్రమే గ్రహించు హంసవలె బుద్ధిమంతుడు శ్రేష్ఠతమమైన గ్రంథములనుమాత్రమే పఠించవలెను.

—ఉత్తరగీత.

# శ్రీ రామకృష్ణుడు—వాత్సల్యభావము

## దాములూరిసత్యనారాయణ

జటాధారియను నాతడు దేశసంచారియైన సాధువు. ఇతడు శ్రీరామభక్తుడు. ఈ భక్తాగ్రణి చిరకాలము శ్రీరామదేవుని తన ధ్యాన పూజాదికములచే సంతుష్టుని జేసి, ఆయన దర్శనభాగ్యమును బడయగలిగెను. జటాధారి కోరినవిధమున, శ్రీరామచంద్రుడతనికి బాలుని రూపమున ప్రత్యక్షమగుచుండెను. బాలరాముడే జటాధారికి సర్వస్వము.

జటాధారి బాలరాముని తనతో భుజింపజేసెడివాడు. అతనితో ఆడుకొనెడివాడు అతనికి సకల పరిచర్యలను చేసెడివాడు. రాత్రులందు నిద్రించునప్పుడు బాలుని తనప్రక్కలో పండుకొనబెట్టుకొనెడివాడు. తన యారాధ్యదేవుని సమక్షమున జటాధారి సర్వమును మరచిపోయెడివాడు.

తనకుకలిగిన ఈ భగవత్సాక్షాత్కారమును గురించి, జటాధారి ఎన్నడును, ఎవరితోడను చెప్పలేదు. కాని, ఈ రహస్యము పరమహంస వారికి తెలియకుండ ఉండునా!

జటాధారిని గురించి, శ్రీరామకృష్ణ పరమహంసవారు శిష్యులతో ఇట్లు చెప్పెడివారు: ''బాబాజీ, రామలాలు (బాలరాముడు) నకు యావజ్జీవ భక్తుడు. తానెక్కడకు వెళ్ళినను బాలుని వెంటదీసికొని వెళ్లెడివాడు. భిక్షావృత్తిచే గడించిన పదార్థములను వండి బాలరామునికి పెట్టెడివాడు. ఒక్కొక్కప్పుడేదియో తెచ్చియిమ్మని బాలరాముడు మారాముచేసెడివాడు. అల్లరిపిల్లవానివలె గోలచేసెడివాడు. అహోరాత్రములు జటాధారి ఆ విగ్రహమునకు సేవ చేయుచు నిత్యానందస్థితిని అందెడివాడు. బాలరాముని చేష్టలను నేనుచూచితిని. వానిని కనిపెట్టుటకై రోజంతయు బాబాజీ యొద్దనే గడపెడివాడను. ఈ విధముగా దినములు గడచినవి.

''బాలరామునకు, నాకు మిక్కిలి స్నేహమయ్యెను. జటాధారియొద్ద నేనున్నంతసేపు బాలరాముడు ఉల్లాసముగా ఉండెడివాడు. నేనచటనుండి లేచిన తక్షణమే, బాలుడు నా వెంటబడి నాగదికి వచ్చెడివాడు. ఇక వాదములతో వాని ఎదుట మనమాగలేము. మొదట నేనిది 'భ్రమ' యేమోననుకొంటిని; తన సేవకొఱకై యావజ్జీవమును అర్పించిన జటాధారిని విడచి, క్రొత్తవాడనగు నా యొద్దనే యుండిపోవుటకు బాలరాముడెట్లొప్పగించును? ఒకటి రెండు పర్యాయములు, నేను మోసపోవుచుంటినేమోనని తర్కించుకొంటిని. కాని, ప్రతిరోజును అట్లే జరుగుచుండెను. మిమ్ముల నెంత స్పష్టముగా చూచుచున్నానో, బాలరామునికూడ అట్లే జూచితిని.

''ఒక సమయమునందు నా ఎదుట ఒయ్యారముగా నృత్యము చేసెడివాడు. మరియొకప్పుడు నా వీపుమీదవచ్చి పడెడివాడు; ఎత్తుకొనమని నన్ను బలవంతము చేసెడివాడు. అప్పుడప్పుడు బాలుని నా యొడిలో కూర్చుండబెట్టుకొనెడివాడను. కాని వాడుండెడివాడుకాడు. ఆ ఎండలో పొలములమీద పోయెడివాడు, ముండ్లపొదల నుంచి పుష్పములు గోసెడివాడు, లేదా గంగానదిలో మునుకలు బెట్టెడివాడు. ఎండలో పరుగెత్తకుమయ్యా నీ పదములు బొబ్బలెక్కును; నీళ్ళలో అంతసేపు నానకుము. జలుబుచేసి జ్వరమువచ్చునని నేనెంత మందలించినను పెడచెవిని బెట్టెడివాడు. ఆ సుందర నయనములతో నా వంకచూచి, చిరునవ్వు నవ్వెడివాడు. కొంటెపిల్లవానివలె నన్ను పరిహాసము చేయుచు వెక్కిరించెడివాడు.

నేనప్పుడప్పుడు తాలిమి కోల్పోయి, ఇదిగో ఆగుము అల్లరిపిల్లడ, నిన్ను చిదుక కొట్టెదను చూడుము – అని యరచెడివాడను. వానిని దూరముగా లాగుకొనిపోయి, రకరకములగు ఆటవస్తువులనిచ్చి గదిలో కూర్చొని ఆడుకొనుమనెడివాడను. కాని ఒక్కొక్కప్పుడు, నేను వానితో పడలేక, వానిని బాదెడివాడను. కన్నులనీరు నించుకొని, వణకెడు పెదవులతో బాలరాముడు నావంక చూచెడివాడు. అయ్యో! వానినట్లు దండించినందులకు నేనెంత రెపరెపలాడి పోయితిననుకొంటిరి! నేను బాలుని యొడిలో గూర్చుండ బెట్టుకొని ఓదార్చెడివాడను. అవన్నియు వాస్తవముగా జరిగిన విషయములు.

''ఒకరోజున నేను స్నానార్థము బయలుదేరితిని. బాలరాముడుకూడ నా వెంట వత్తుననెను. 'సరే' నని నేను వానిని తీసుక వెళ్ళితిని కాని, నీళ్ళలోనుంచి రాడాయెనే; నేనెంత మందలించినను వినడయ్యె. అప్పుడు నాకు కోపమువచ్చినది. వానిని నీళ్ళక్రింద అట్లే నొక్కిపట్టి, 'ఏదీ, ఇప్పుడాడుము నీ యిష్టము వచ్చినట్లు,' అని కసరితిని. పాపము! ఊపిరియాడక బాలుడు గిజగిజ కొట్టుకొనెను. మరల నేను అనుతాపపడి వాని నెత్తుకొంటిని.

ఒకప్పుడు బాలుడేదియో తెచ్చియివ్వమని నన్ను కోరెను. నేను దానిని తేలేకపోయితిని. వానికదే కావలయునట! వానిని మరపించుటకు, చక్కగా ఊకతీయని యటుకులనిచ్చి తినుమంటిని. పాపము! నమలునప్పుడు ఆ సుకుమార బాలుని నాలుక గీఱుకొనిపోయినది. నే నా దృశ్యమునుజూచి భరించలేక పోయితిని. నేనెంతయో ఏడ్చితిని. బాలుని నా యొడిలో కూర్చుండబెట్టుకొని, 'నాయనా, రామచంద్ర! మీ తల్లి కౌసల్యాదేవి అమితవాత్సల్యముతో నీకు వెన్నమీగడలు గుడువంబెట్టినది. నేనో అవివేకినై, నీకెట్టి కఠినపదార్థముల నిచ్చితినయ్యా! యని విలపించితిని.''

పరమహంస వారీవిషయములను చెప్పుచు, తద్భావపరవశులై మిక్కిలి విలపించిరి. వినుచున్నవారి హృదయములును కరగిపోయెను.

పరమహంసవారు మరియు ఇట్లు చెప్పిరి: ''బాబాజీ భోజనము తయారుచేసి యుంచెడివాడు. కాని ఆ సమయమునకు బాలరాముడు అతనికగుపించెడివాడు కాడు. బాలునికై వెదకి, విసిగి వేసారి, బాబాజీ నాగదియొద్దకు వచ్చెడివాడు. అప్పుడు బాలరాముడు నాతో ఆడుకొనుచుండును.

''బాబాజీ మనసులో నొచ్చుకొని ఇట్లనెడివాడు: 'భోజనము సిద్ధముగానున్నది. నేను నీకొరకై వెదకులాడుచుంటిని, నీవో, ఇచ్చట సుఖముగా ఆటలాడుకొనుచున్నావు! సరియే అది నైజమేనాయె. నీకు కనికరమనునది లేదు. నీ ఇచ్చవచ్చినట్లు చేయుదువు. కఠినుడవై, నిర్ధయుడవై, నీవు తలిదండ్రులను విడచి కాననముల కేగితివి. నీ వియోగమును సహింపజాలక నీతండ్రి గుండె బ్రద్దలై చనిపోవ ఆయన శవమును జూచుటకైనను రాకపోతివి'. ఈ విధముగా చీవాట్లుపెట్టుచు బాబాజీబాలుని భోజనమునకు తీసికొనివెళ్ళెడివాడు. బాలరాముడు నన్ను విడచిపోవుటకు ఇష్టపడెడివాడు కాడు. ఆ బాలుని వదలిపెట్టి యుండలేక బాబాజీకూడ నా యొద్ద చాలరోజులవరకుండెను.

''ఒకరోజున జటాధారి నాతో, ఏడ్చుచు ఇట్లనియెను: 'అత్యంత దయామయుడగు రామలాలు (బాలరాముడు) నా కోరిక నెరవేర్చినాడు. నేను కోరినరూపమున నాకు ప్రత్యక్షమయినాడు. కాని, బాలరాముడు నిన్ను వదలి రాడట! నీ యొద్దనే యుండునట!

కాని నేనిందులకు దుఃఖింపను. బాలుడు నీ యొద్దనేయుండి సుఖముగా ఆడుకొనుచున్నచో నాకు సంతోషము. వాడు సుఖముగా ఉన్న నా కంతియే చాలును. వానిని నీ యొద్దనే సుఖముగా ఉండనిమ్ము. బాలుని నీకు ఒప్పగించి, నాదారిన నేను పోవుచున్నాను.''

ఎంత చిత్రముగా, మధురముగా ఉన్నది! ఈ సంఘటన. అవును; శ్రీ రామకృష్ణ పరమహంసవారి జీవితకథలోని మధురతరమయిన సంఘటనములలో ఇదియొకటి.

అయిన, దీనివలన తెల్లమగునదేమి? భగవంతుడు భక్తజన సులభుడు. ఆయన మనకు అతి సమీపములో ఉన్నాడు; మనలను అత్యధికముగ ప్రేమించుచున్నాడు.

భగవంతుడు—మన కత్యంత సమీపమున ఉన్న—మనలను అధికముగా ప్రేమించుచున్న — భగవంతుని — మనమందరమును ఏల చూడలేకున్నాము? నిజముగా భగవంతుని జూడవలయునను ఆవేదనయే మనకున్నచో మనము తప్పక ఆయనను చూడగలము! కాని అట్లు చేయుచున్నామా? మనకీ విషయమున ఓర్పు తక్కువ. ప్రాపంచిక విషయములకో, మన మెంతకాలమయినను వేచియుందుము. కాని మనము కోరగనే భగవంతుడు ప్రత్యక్షము కావలయునని మనయాశ. మన మెంత సేపటికిని ఐహిక విషయములలో చిక్కుకొని పోతిమి. మనకు భగవంతుడెట్లు కాన్పించును?

జటాధారి తన మైహిక వాంఛలను సుఖమును పరిత్యాగము చేసెను. అతని జీవితమున ఒకేయొక లక్ష్యమును పెట్టుకొనెను. అది భగవత్సాక్షాత్కారము. వాత్సల్య భావమున అతడు భగవంతుని ఆరాధించెను. అహో రాత్రములు, తదేకదీక్షతో అతడు చలించక ధ్యానపూజలతో భగవానుని సంతుష్టినిజేసి, ఆయన దర్శనమును పడయగలిగెను.

శ్రీ రామకృష్ణ పరమహంసవారు వాత్సల్యభావమున దేవదేవుని అరాధించినది చూడుడు. ఆ వాత్సల్యభావమున తానును మాతృత్వములో లీనమై, కౌసల్యాదేవియై, బాలరాముని తో ఆడుకొనెను. పాడుకొనెను. భగవానుడైన శ్రీరామమూర్తియు వారి సమీపమున బాలుడై వర్తించెను. ఆ సన్న్యాసులుబెట్టిన యన్నమును తినుచు, వారుపెట్టిన చీవాట్లు వినుచు, కొట్టిన దెబ్బలు తినుచు, ఆ మాయామానుష విగ్రహుడు వారుచూపు మాతృప్రేమలో ఓలలాడెను.

శ్రీ రామకృష్ణుని వాత్సల్యభావ ప్రభావము చూచితిరా! బలరాముడు జటాధారిని వదలి రామకృష్ణునియొద్దనే యుండుటకు ఇచ్చగించెను. భగవంతుడే భక్తునివెదకికొనుచు వచ్చినాడు.

శ్రీ రామకృష్ణులవారు భగవత్సాక్షాత్కారమును ఎట్లు పడయగలిగిరి? నిష్కాపట్యము, అఖండమైన యోర్పు, పరిత్యాగము – కావలసినవి. వీనితోడనే శ్రీ రామకృష్ణుడు తన తీవ్ర సాధనలయందు జయము గాంచగలిగెను.

సూర్యాస్తమయ మగుచున్నప్పుడు, రాత్రి వచ్చినప్పుడు, తెల్లవారునప్పుడు, ఆయన ఎంత ఆవేదన పడెడివాడు! ఎంత విలపించెడివాడు! అప్పుడే తన జీవితమున ఒకరోజు గడచినదే. భగవంతుని కననైతినేయని. ఎంత తహతహపడెడివాడు! భగవంతుని చూడజాలని జీవితము వృథాయని సాహసమునకు సహితము కడంగినాడు! అప్పుడే భగవతికాళి అయనకు సాక్షాత్కరించినది.

కావున, ఒక్కమాటలో చెప్పినయెడల, కావలసినది ఆవేదన! అప్పుడు భగవంతుని మనము వెదుక నక్కరలేక, భగవంతుడే మనలను వెదకికొనుచువచ్చును.

# దేవారాధనా ఫలము

సి. వి. రా॥

భగవంతుడు జగత్తులో చరాచరము లన్నిటియందును వ్యాపించిఉన్నాడు. రోగుల వ్యాధులను నివారించుటకు వైద్యశాలలో వైద్యులున్నరీతిగా భగవంతుడు జీవులకు కలుగు జననమరణమను వ్యాధిని నివారించుటకు హృదయంలో నివసించియున్నాడు.

అట్టి దైవము జగమంతటా వ్యాపించి యున్నప్పటికీ జ్ఞానుల హృదయములందును, దేవాలయములందును, స్పష్టముగా ప్రకాశించుచున్నాడు. జ్ఞానుల హృదయములందు నిర్గుణ మూర్తిగాను, దేవాలయములందు సగుణ మూర్తిగాను నిలిచియున్నాడు.

పాలలో వెన్న దాగియున్నను కంటికి కనుపించదు. ఆ పాలనే పెరుగుగామార్చి తరిచినప్పుడు వెన్నముద్దగా కనుపించుచున్నది. ఆ విధంగానే జగమంతటా వ్యాపించిన భగవంతుడు పవిత్ర దేవాలయములలో విగ్రహ రూపంగా దర్శనమిస్తున్నాడు.

కాబట్టి పరిపూర్ణ ఆత్మజ్ఞానముతో నిండిన పుణ్యమూర్తులను దేవాలయములోని దేవతా మూర్తులను ఆరాధించినవారికి దైవసాక్షాత్కారము లభించుననుటలో సందేహము లేదు.

భగవంతుడు సర్వవ్యాపి కాబట్టి ఏ చోటు నందైనను దైవారాధన చేయవచ్చునను భావము శ్రేష్టముకాదు. ఎందుకనగా పూర్వ జన్మకర్మ వాసనలు నశింపనిదే భగవంతుడు సాక్షాత్కరింపడు. ఇతర స్థలములందు ఆరాధించినవారి కర్మవాసనలు వాడిపోవునేగాని సంపూర్ణముగా నశించిపోవు. నిర్మలజ్ఞానులైన మహాత్ములు నివసించు స్థలములందును దేవాలయములందును దైవారాధన చేయువారి కర్మవాసనలు మాడి, భస్మమైపోగలవు.

తీక్ష్ణమైన ఎండలో ఆరవేసిన వస్త్రము వేడిగా ఉండునేగాని భస్మంకాదు. అదే వస్త్రమును సూర్యకాంతపు అద్దము మూలముగా వచ్చు కాంతిలో ఉంచిన భస్మమగును. సూర్య రశ్మికి లేనిశక్తి సూర్యకాంతపు అద్దం మూలంగా ప్రసరించు రశ్మికి కలదు. కారణమేమన దూరములోనున్న సూర్యునియొక్క వేడిని సూర్యకాంతపురాయి ఆకర్షించి కేంద్రీకరించి ప్రసరించుచున్నది. ఆ విధంగానే సర్వత్రా వ్యాపించిన దైవశక్తిని జ్ఞానులు యోగులు, దేవాలయములందున్న విగ్రహములు ఆకర్షించి ప్రసరింపజేయుట సత్య దూరముకాదు. కాబట్టి అన్యస్థలములలో దేవుని ఆరాధించిన ఎండలోవేసిన వస్త్రము మాదిరి కర్మ నశింపదు. జ్ఞానుల సాన్నిధ్యములోను, దేవాలయములందును భగవంతుని ఆరాధించిన సూర్యకాంతముక్రింద ఉంచిన వస్త్రమువలె కర్మ నాశనమవుతుంది. కర్మ నాశనమైనవారికి దైవదర్శనం లభిస్తుంది. గనుక మఠములలోను దేవాలయములోను ఆరాధన చేయుట ముఖ్యమైనది.

దేవాలయములందున్న నిర్జీవప్రతిమలకు అట్టిశక్తి కలదా? యను సందేహము వలదు. ఆ విగ్రహములు దేవతలచేతను, మునులచేతను, నాయనారులను శైవభక్తులచేతను, ఆళ్వారులను వైష్ణవభక్తులచేతను, పీఠాధిపతులచేతను, మఠాధిపతులచేతను ప్రతిష్ఠింపబడినవి. అందువల్ల ఆరాధించువారియొక్క

కర్మపాశములను సడలించి కోరిన వరములిచ్చి దయచూపించు పరిపూర్ణశక్తి కలిగియున్నది.

గోవు శరీరమందంతటా పాలు నిండియున్నను పొదుగుమూలముగా పాలను పిండినట్లు విశ్వమంతటా నిండిన భగవంతుని కరుణారసమును పవిత్రదేవాలయములందున్న విగ్రహముల మూలముగాను, జ్ఞానధనులైన మహాత్ములమూలముగాను పొందవచ్చును.

పక్షి ఆకాశమందు విహరించుటకు రెండు రెక్కలు ఆధారమైనట్లు భగవదారాధనకు పుష్పములును ఉదకములును ముఖ్యములై యున్నవి. పుష్పములతో పూజించునప్పుడు భక్తుడు తన హృదయమనుపుష్పమునే దేవునకు అర్పించుచున్నాననియు, ఉదకమును సమర్పించునపుడు తనకున్న సమస్తగుణములను దేవుని పాదములకడ వదులుచున్నాననియు భావించుకొనవలయును. పుణ్యము చేసినవారికే అట్టి పుష్పోదకములు లభించుచున్నవి. అట్టి పుష్పోదకముల పూజను చూచియే భగవంతుడు మెచ్చి వరము లిచ్చుచున్నాడు.

సర్వత్రా వ్యాపించిన భగవంతుని పూజించుటకు తనయొద్దనే సులభంగా లభించు హృదయపుష్పమును గుణోదకమును ఉపకరణముగా భక్తుడు చేసుకొనవలెను. వానికి తోడుగా నిర్మలభక్తి, ఆచారము ఉండవలెను.

కరుణామయుడైన భగవంతుని భక్తిభావముతో యథావిధిగా పూజించినవారికిని, ఆరాధనావిధానము తెలియక క్రియామాత్రముగా పూజించిన భక్తిహీనులకును, తగినంత ఫలితము దొరుకుచునే యుండును.

సక్రమముగా పూజావిధానమును గుర్తెరిగిన శైవోపాసకుడగు మార్కండేయుడు యముని బారినుండి తప్పించుకొని చిరంజీవియైనాడు.

కైలాసపర్వతముపై బిల్వవృక్షముమీద గంతులువేయుచున్న ఒక వానరము పార్వతీపరమేశ్వరుల శిరస్సులందు ఆ బిల్వపత్రములు బడునట్లు చేసినది. ఉద్దేశ్య రహితముగా, క్రియామాత్రముగా జేసిన ఆ పుణ్యమువల్ల ఆ వానరము ముచికుంద చక్రవర్తిగా బుట్టి ముల్లోకములను పరిపాలించినట్లు పురాణములు చెప్పుచున్నవి.

చెర్వుకు నాలుగు గట్టులలో
నాలుగు విధముల పాత్రలలో
నీటిని తెచ్చెడి స్త్రీలనిరి
అక్వా, వాటర్, పానీ, వారీ.

అంధులు నల్వురు, ఏనుగును
తాకుచు నాలుగు వైపులను
ఏనుగు రూపము నిట్లనిరీ
స్థంభం, పీపా, పామూ, చేటా.

ఊసర వెల్లికి రంగులను
పాంథులు నల్వురు చూచుచును
చెప్పిరి యిట్లని గట్టిగను
ఎరుపూ, పసుపూ, ఊదా, నీలం.

శ్రీ గురుదేవులు యిట్లనిరీ
అన్నిపేరులు దేవునివే
అన్నిరూపులు దేవునివే
సగుణ నిర్గుణాతీతుడును.

—బి. యస్. ఆర్.

# 'దదద'

పూర్వం ఒకప్పుడు దేవతలకు, మనుష్యులకు, అసురులకు ఉపదేశం పొందాలనే తలంపు కలిగింది. తమ తండ్రియైన ప్రజాపతి దగ్గరనే శిష్యులుగా చేరారు. శిష్యత్వానికి ప్రధానంగా ఉండవలసిన లక్షణం బ్రహ్మచర్యం కాబట్టి వారందరు బ్రహ్మచర్యాన్ని అవలంబించారు.

కొంతకాలం అయినతరువాత దేవతలు ప్రజాపతిని సమీపించి 'ప్రభో! మమ్మలను అనుశాసించి పంపించండి' అని ప్రార్థించారు. ప్రజాపతి వారికి ఉపదేశంగా 'ద' అనే అక్షరం మాత్రమే ఉచ్చరించి 'నేను చేసిన ఉపదేశం అర్థమైందా?' అన్నాడు

'బాగా అర్థమైంది ప్రభో! 'దమం అలవరచుకోనండి'' అని మాకు ఉపదేశించారు. మేము స్వభావతః విషయలోలురం కాబట్టి మీరు మాకావిధంగా ఉపదేశించారు' – అన్నారు దేవతలు. ఓం (అవును) అన్నాడు ప్రజాపతి.

ఆ తరువాత మనుష్యులు ఆయన్ను సమీపించి అనుశాసించమని ప్రార్థించారు. వారికి కూడ ఆయన 'ద' అనే అక్షరమే చెప్పి 'ఉపదేశం అర్థమైందా?' అని అడిగాడు.

'చక్కగా అర్థమైంది. ఇంతకన్న హితమైన ఉపదేశం ఇంకేముంటుంది! మేము స్వభావతః లోభగుణం కలవారం కాబట్టి మీరు మాకు ''దత్తం (దానం) చేయండి'' అని అనుశాసించారు.' అని బదులు చెప్పారు మనుష్యులు. ప్రజాపతి 'ఓం' (అవును) అన్నాడు

ఆ తరువాత అసురులుకూడ ఆయన్ను వేడుకొన్నారు ఉపదేశం చేయండని. వారికికూడ ఆయన 'ద' అనే అక్షరమే పలికి 'అర్థమైందా'– అని అడిగాడు.

మాకు బాగా అర్థమైంది. స్వభావతః మేము క్రూరులం, హింసాపరులం గనుక మీరు మాకు ''దయకలిగి ఉండుడు'' – అని బోధించారు.' అన్నారు అసురులు. ప్రజాపతి 'ఓం' (అవును) అన్నాడు.

'దమం అలవరచుకోనండి, దానంచేయండి, దయకలిగి ఉండండి' – అని ప్రజాపతి చేసిన అనుశాసనం ఈనాటికీ వినపడుచునేయున్నది. ఆకాశంలో మేఘం 'దదద' అని ఉఱుముచు ప్రజాపతి ఉపదేశాన్నే మనకు వినిపించుచున్నది.

విషయలోలుపత్వం, లుబ్ధత్వం, క్రూరత్వం కొద్దో గొప్పో మానవులందరిలోను ఉన్నవి గనుక అందరున్ను ప్రజాపతి శాసించినట్లు దమం అలవరచుకోనవలెను, దానం చేయవలెను, దయకలిగి ఉండవలెను.

ఈ ప్రజాపతి అనుశాసనానికి అనుగుణంగానే గీతలో శ్రీకృష్ణుడు, 'త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః కామఃక్రోధస్తథా లోభస్తస్మాదేతత్త్రయం త్యజేత్' – అన్నాడు.

ప్రజాపతి అనుశాసనం విధిముఖంగా ఉంది. కృష్ణునిది నిషేధముఖంగాఉంది. అంతే తేడా. ఈవిధి నిషేధరూపాలను జోడించిచూస్తే మనకేమి తెలుస్తుంది? తెలిసేది ఇది:

కామాన్ని దమంచే జయించవలెను
క్రోధాన్ని దయచే జయించవలెను
లోభాన్ని దానంచే జయించవలెను

లెక్కలేనన్ని దోషాలు మనలో ఉన్నవి గదా! కామ క్రోధ లోభాలను మూడింటిని మాత్రమే జయించితే తక్కినవానిమాటేమిటి? అన్నప్రశ్నకు సమాధానం ఇది: తక్కిన అన్ని దోషాలకు పుట్టుకస్థానం ఈ మూడుదోషాలే. కాబట్టి ఈమూడు దోషాలను జయించగలిగితే తక్కిన అన్నిదోషాలను జయించినట్లే లెక్క.

---

# గ్రంథ పరిచయము

## కైవల్యసాధని :

గ్రంథకర్త: శ్రీ చిన్మయ రామదాసు, పేజీలు 100, వెల : రు. 1-50, ప్రతులకు : శ్రీ మళయాల సద్గురు పెద్దాశ్రమము, తాడేపల్లి పోస్టు, వయా కొడాలి, దివి తాలూకా, కృష్ణా జిల్లా.

ఇది చిన్న పుస్తకమైనను సారవంతమైన విషయములతో నిండియున్నది. 'భక్తులు, ముముక్షువులున్ను తప్పక కంఠస్థము చేయదగినది'-అని మొదటిపేజీలోనే తెలిపియున్నందు వలన, ఇది వారికొఱకు ప్రత్యేకముగా వ్రాయబడినదని తెలియుచున్నది. స్మృతులనుండి ప్రసిద్ధమైన సంస్కృతశ్లోకములను గ్రహించి వాటికి ఇందు సరళమైన తెలుగులో తాత్పర్యము వ్రాయబడియున్నది.

## హాస్యగాథా ద్విశతి :

రచయిత: తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు, పేజీలు 44, వెల: రు. 3-0-0, ప్రతులకు: త్రివేణీ పబ్లిషర్స్: మచిలీపట్టణము-1.

ఇందులో 216 పద్యము లున్నవి. వచనమువలె సులభముగా అర్థమయే రీతిలోనే రచింపబడినవి. 'మృదువుగా హాయిగా శుచిస్మితము కలుగజేయుచే సత్యమగు హాస్యసృష్టియగును' అని రచయిత తన గ్రంథముయొక్క ప్రయోజనమును నాలుగవ పద్యమునందు సూచించియున్నారు. మచ్చునకు ఒక పద్యమును చూడుడు.

'చాల అన్యాయమండి మాస్టారుగారు!
నాకు లెక్కలమార్కు సున్నయగుటెట్లు?'
'నేను చేయగల్గినదేమి గాని లేదు
ఇంతకన్న తక్కువమార్కు లీయరాదు!'

## రత్నత్రయి రెండుభాగములు :

పేజీలు : 150+267, వెల: రు. 8-00+12-00.

ఈ రెండుభాగములందు ఆండాళ్ గానముచేసిన 'తిరుప్పావు' అను తమిళ గ్రంథము తెలుగులిపిలో ప్రతి పదార్థ వ్యాఖ్యానముతో సహా ముద్రింపబడినది.

## రత్నయుగళి :

రచయిత : కె. టి. ఎల్. నరసింహాచార్యులు, పేజీలు 91. వెల : రు. 4-00.

నారద భక్తిసూత్రములకు 'భక్తివివేచన' అను లఘు వివరణము, పరాశర భట్టరుయొక్క 'శ్రీ గుణరత్నకోశము'నకు 'రత్నాలరవళి' అను గద్యకవితానువాదము ఇందు ముద్రింపబడినవి.

## శ్రీ నరసింహతాండవము (హరికథ)

రచయిత : నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్య, పేజీలు 38, వెల : రు. 1-50.

పై మూడు పుస్తకముల ప్రతులకు : శ్రీ గోదాగ్రంథమాల, ముసునూరు, కృష్ణాజిల్లా.

## పరమార్థవాణి : (ఆధ్యాత్మిక మాసపత్రిక)

సంవత్సరచందా : రు. 15-00. వివరములకు : ఆధ్యాత్మ ప్రచారకసంఘము, జయశ్రీ టాకీస్ రోడ్, రాజమండ్రి—4.

సమీక్షార్థము పంపబడిన శ్రీ కృష్ణాష్టమి ప్రత్యేకసంచికలో శ్రీ కృష్ణస్తుతులు, సంభవామి యుగేయుగే, విజయతే గోపాల చూడామణిః, శ్రీ రాధామాధవము, గోవిందుడు, వాసుదేవపరాగతిః — అను వ్యాసములు మఱియు అక్కడక్కడ శ్లోకములు, గేయములు, సూక్తులును గలవు.

-సదాశివం.

# బాలల శారదాదేవి

బి. ఎస్. ఆర్. ఆంజనేయులు

## శ్రీ రామకృష్ణు డిచ్చిన శిక్షణ

శ్రీ రామకృష్ణుడు కమార్పుకూరులో యున్నప్పుడు శారదకు భగవంతుని విషయాలే కాక అనేక సామాన్య విషయాలలోకూడా మంచి శిక్షణ యిచ్చాడు. "దీపాలు పెట్టేటప్పుడు లాంతరుగ్లాసులు బాగా తుడవాలి. వత్తులు సరిగా కత్తిరించాలి. కూరలు తరిగేటప్పుడు చెక్కు సన్నగా తీయాలి." అని చెప్పాడు. ఇంకా యిలా చెప్పాడు. "పడవలోగాని, బండిలోగాని ఎక్కేటప్పుడు ముందుగా యెక్కే సామాన్లు జాగ్రత్త పెట్టుకోవాలి. దిగేటప్పుడు అన్నీ దిగినవో లేదో చూచుకొని చివరకు దిగాలి. వస్తువులు యేవి వుండాల్సినచోట అవి పెట్టాలి. అలా పెట్టకపోతే యింట్లోయున్న యితరులకు యిబ్బంది కలుగుతుంది. అంతేకాక చీకట్లో కూడా వాటిని శ్రమలేకుండా తీయవచ్చు." శారద ఈ పనులన్నీ సరిగా చేస్తున్నదో లేదో అని కనిపెట్టుతూకూడా వుండేవాడు.

ఒకసారి ఒక బిచ్చగాడువచ్చి వాకిట్లో బిచ్చమడుగుతున్నాడు. శారదకు బీదలంటె ప్రేమ యెక్కువకదా! వాడి అరుపు వినబడగానే దోసెడు బియ్యముతెచ్చి వాడి జోలెలో వేసింది. ఆ వెయ్యటంలో రెండు గింజలు క్రిందపడ్డయి. రామకృష్ణుడు యిది గమనించాడు. ఆమె యింట్లోకి వస్తుండగా "నీవు యేం చేశావో తెలుసా?" అని అడిగాడు. ఆమెకు భయంవేసింది. అలాగే నిలబడిపోయింది. ఆయన మళ్లీ యిలా అన్నాడు "నీవు బిచ్చము వేస్తున్నప్పుడు నీ అజాగ్రత్తవల్ల రెండు గింజలు క్రిందపడ్డాయి. చిన్న విషయాలలో అజాగ్రత్తే పెద్ద విషయాలలోకి వస్తుంది. అది చివరకు దైవధ్యానందాకా వస్తుంది."

భూమిలో గింజలు పెడితే మొలకలు వస్తయ్యని మీకు తెలుసు. ఆ మొలకలేగా పెద్దవై చెట్లయ్యేది. మీరు ఇప్పుడు చిన్న పిల్లలు. రేపు పెరిగి పెద్దవా రయ్యేదికూడా మీరే కదా! అలాగే యిప్పుడు చిన్నగావుండి కనుపించని అజాగ్రత్తలే రేపు పెద్ద పెద్ద లోపాలై మార్చుకోటానికి వీలుకాకుండా నిలచిపోతాయి.

ఈ స్వల్పవిషయాలే మనిషి గొప్పను, కొద్దిని తెలియజేస్తాయని శారద పూర్తిగా గ్రహించింది.

ఏకులని వదలివేసిన మేకులగును.
మెదలకుండిన మొలకయె ముదిరిపోవు
తప్పు చిన్నది యైనను ముప్పు తెచ్చు
చిన్న పనులందె మానవు డెన్నబడును.

సంపాదకులు : శ్రీ చిద్ఘనానందస్వామి

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు–600 021) న ముద్రింపబడి,

శ్రీ చిద్ఘనానందస్వామిచే శ్రీ రామకృష్ణ మఠము (మద్రాసు–600 004) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణప్రభ

సంపుటము 34 1977 - నవంబరు : పింగళ - కార్తీకము సంచిక 11

## విషయసూచిక




## శ్రీ రామకృష్ణప్రభ

సంవత్సర చందా: **7-00.** జీవిత చందా: **100-00.**

విడి ప్రతి: **70** పైసలు.

రామకృష్ణమఠము

మైలాపూరు

మద్రాసు 600004.

# రామకృష్ణమిషన్ - ఒక విన్నపము

ఆంధ్రదేశమున, తుపానుబాధితులనిమిత్తము రామకృష్ణ మిషన్, రాజమహేంద్రవరము, సహాయకార్యక్రమములను ప్రారంభించినది. గుంటూరు, విజయవాడలందు బాధితులకు బియ్యము, పప్పుదినుసులు పంచిపెట్టబడుచున్నవి. ఈ సేవా కార్యక్రమములందు తగినవిధముగా సహకరించవలసినదిగా ప్రజలను వేడుకొనుచున్నాము. ధనరూపమైన, వస్తురూపమైన విరాళములకై ఉదారహృదయులను అభ్యర్థించుచున్నాము. విరాళములు, కృతజ్ఞతతో ఈ క్రిందివిలాసమునందు స్వీకరింపబడును.

శ్రీ రామకృష్ణమఠము

వీరభద్రాపురము, రాజమండ్రి – 533 101

స్వామి నందానంద,
కార్యదర్శి.

* * *

తమిళనాడులో తుపానువరద-బాధితుల నిమిత్తము రామకృష్ణ మిషన్, మద్రాసు, సహాయ కార్యక్రమములను తిరుచ్చిజిల్లాలో ప్రారంభించినది. ఈ సహాయ కార్యక్రమములకు విరాళముల నొసగువారు ఈ క్రింది విలాసమునకు పంపవలసినదిగా అర్థించుచున్నాము.

శ్రీ రామకృష్ణ మిషన్ రిలీఫ్

శ్రీ రామకృష్ణమఠము

మైలాపూరు, మద్రాసు – 4.

స్వామి తపస్యానంద,
అధ్యక్షుడు.



ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్యవరాన్నిబోధత.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము 34 1977 – నవంబరు : : పింగళ – కార్తీకము సంచిక 11

## ప్రార్థన

కలయంగ నెల్లయెడలం దలలును లోచనములును వదనములు నగు ని
ర్మలు నిర్వికారు నిన్నుం గొలిచెద సర్వైకసాక్షి గోవింద హరీ

నిను నెఱుగకున్న సంసారనిమగ్నతపోదు గోచరము కావు మనం
బునకు నఖిలేంద్రియములకు ననునేమనువాడ వింక నారాయణుడా

ఫలములు కోరక కర్మంబులు నడపుచు వాని విమలబోధాగ్ని హతిం
బొలియించుచు నిర్ద్వంద్వత నెలకొను నేకాంతి జనులు నిను గంద్రు హరీ

అచరములును జరంబులునైన భూత సముదయంబులు మణులు సూత్రముననున్న
కరణి నీయంద యున్నవి కాన సమత నేకభక్తినే గోరెద నిమ్ము దేవ!

— శాంతి పర్వము.

# వివేకానందవాణి

ప్రపంచమంతయు తిరిగిచూడగా, ఈ దేశ ప్రజలవలె ఇంత గాఢతమస్సునందు మునిగి పోయి యుండువారు నా కింకే దేశమునను కానిపింపలేదు. పై చూపునకు సాత్త్వికస్థితిని అనుకరించురీతి కానిపించును. కాని లోపల కేవల జడత్వము—చెట్టుమోడులు, రాతి బండలు: వీనియందు ఎంతటి జడత్వమో, అంతటి జడత్వము! అట్టివారు ఈ లోకమున ఏమి కర్మము నొనర్తురు! అట్టి జడులు, అట్టి సోమరులు, అట్టి ఇంద్రియ సుఖైకలోలురు, ఈ లోకములో ఎన్నాళ్లు బ్రతికియుండనేర్తురు!

పాశ్చాత్యదేశములు చూచివచ్చి, ఆ పిదప అవసరమైనచో నా మాటలను ఆక్షేపింపుము. పాశ్చాత్యదేశీయుల జీవితమునందు ఏమి సాహసము, ఏమి కర్మతత్పరత, ఏమి ఉత్సాహము, ఏమి రజోగుణ వికాసము దీపించుచుండును! ఇక మీ దేశమందన్ననో, రక్తము హృదయమునందే ఘనీభవించిపోయి, రక్తనాళములలో ప్రవహింపజాలకున్నట్టు, శరీరము పక్షవాత గ్రస్తమై చచ్చుకొని పోయినట్టు, కానిపించును!

కావున మొదట రజోగుణాభివృద్ధిచే జనులకు చులుకుదనము కలిగింపవలెనని నా యభిప్రాయము. అప్పుడుగాని వారికి ఈ జీవితమున కష్టము నెదుర్కొను సామర్థ్యము లభింపదు. శరీరమందు బలములేక, హృదయమందు ఉత్సాహములేక, బుద్ధియందు స్వాతంత్రతలేక వీరేమి చేయుదురు—ఈ నిర్జీవపిండములు! ప్రోత్సాహము కలిగించి వారిని ప్రాణవంతుల నొనర్పవలెనని నా సంకల్పము—ఈ కార్యమునకే నా జీవితమును అంకిత మొనర్చినాను.

వేదమంత్రములందు గల అమోఘశక్తి మూలమున వారిని మేలుకొల్పెదను. "లెండు! నిదుర మేలుకొండు!" అను అభయసందేశమును వారికి చాటుటకొఱకే నేను జన్మించితిని. ఆ కార్యమునందు మీరు నాకు సహాయులు కండు.

ప్రతి గ్రామమునకు, దేశమునందలి ప్రతి ప్రాంతమునకు పోయి బ్రాహ్మణులు మొదలు చండాలురవఱకును గల సర్వప్రజలకును ఈ అభయవాక్కులు బోధింపుడు. "మీ యందు అనంతశక్తి కలదు, నిత్యానందమునందు మీకు పాలు కలదు" అని ప్రతివానికిని తెలుపుడు. అట్లు వారిలో గల రజోగుణమును మేలుకొల్పుడు, వారికి జీవిత సమస్యల నెదుర్కొను శక్తి కలిగింపుడు. ఆ పిదప మోక్షవిషయము వారికి బోధింపుడు. దేశ ప్రజలలో గల ఆంతర శక్తిని మేలుకొల్పి, అన్యాధారమపేక్షింపక స్వతంత్రముగా నిలుచు సామర్థ్యమును వారికి చేకూర్పుడు. మంచి అన్నవస్త్రములు, యథేచ్ఛములగు భోగములు, కలిగి సుఖజీవనము చేయు మార్గమును వారికి నేర్పుడు. ఆ పిదప ఈ భోగబంధమునుండి విముక్తులగు విధానమును వారి కెఱిగింపుడు.

జడత్వము, నీచత, కపటము: ఇవి దేశమందంతటను నిండిపోయినవి. బుద్ధిమంతుడగు వాడు ఇదంతయు చూచుచు, ఊరకుండగలడా? వాని కన్నులలో నీరు క్రమ్మదా? మదరాసు, బొంబాయి, పంజాబు, బెంగాలు—ఎక్కడ చూచినను జీవచిహ్నములు కానిపించుట లేదు.

మీరు విద్యాధికులని మీ తలంపు, వ్యర్థ విషయములుతప్ప మీ రేమి నేర్చుకొంటిరి? పరులభావములను - విదేశభాషలో గలవానిని - కంఠస్థముచేసి, మీ మెదడులను వానితో నింపించుకొని, కళాశాల లిచ్చు పట్టము లార్జించుకొనుటతోడనే విద్యాధికులైనట్టు మీరు తలంచుకొనుచున్నారు! ఇదీ! విద్య

యనగా ఇదా? మీ విద్యకు గల పరమ లక్ష్య మేమి? ఒక గుమస్తాపనియో, ఒక మోటు న్యాయవాదిపదవియో; అధికమైనచో, ఒక డెప్యూటీ మ్యాజిస్ట్రేటుపనియో—ఇంతేకదా. ఇందుచేత మీకు గాని, దేశమునకు గాని ఎట్టి ఉపకారము కలుగును?

ధనధాన్య సమృద్ధికి పేరొందిన ఈ భారత దేశమున అన్నమో రామచంద్రాయని ఆక్రందించువారి హృదయవిదారక రోదనధ్వను లెట్లు వినవచ్చుచున్నవో కన్నులు విప్పి చూడుడు! ఈ లోపమును మీ విద్య తీర్చునా? అసంభవము! పాశ్చాత్య విజ్ఞానశాస్త్ర సాహాయ్యముతో భూమిని త్రవ్వి, దున్ని, ఆహారపదార్థములను పండింపుడు—ఇతరులయొద్ద నీచసేవ యొనర్చి కాదు—, మీ స్వయంకృషిచేతను, పాశ్చాత్య విజ్ఞానశాస్త్రసాహాయ్యము చేతను, పంటలు సమృద్ధిగా పండించు నూత్న మార్గములు కనిపట్టి మీ రీ కార్యమును సాధింపవలెను.

కావుననే నేని దేశప్రజలకు నిరంతర కర్మతత్పరత్వమును బోధించుచున్నాను. అప్పుడు గాని వారు తమకు వలయు అన్న వస్త్రములను తామే ఉత్పత్తి చేసికొనజాలియుండరు. అన్న వస్త్రములు లేక, ఆ వ్యాకులతలో మగ్నులై, దేశప్రజలు వినాశదశకు వచ్చియున్నారు—ఈ దుర్దశను తొలగించుటకై మీరు ఏమి చేయుచున్నారు? మీ శాస్త్రములను గంగలో పాఱవేయుడు. అన్న వస్త్రములు సంపాదించుకొను మార్గమును ప్రజలకు మొదట బోధింపుడు. ఆ పిదప శాస్త్రము చదివి వినిపింప తీఱిక దొరకును.

తీవ్రకర్మతత్పరతను ఉద్దీపింపజేసి వారి సాంసారిక లోపములను తీర్పనిచో, పారమార్థిక ప్రసంగములకు ఎవ్వరును చెవియొగ్గరు. కావున నేను చెప్పునది ఏమనగా, మీయందు గల ఆత్మశక్తిని మొదట మేలుకొల్పుకొనుడు, ఆ పిదప తమయందు ఆత్మశక్తి కలదు అను విశ్వాసమును సామాన్యప్రజలకు మీచేత నైనంతవఱకు కలిగింపుడు, తదనంతరము వారి ఆహార పదార్థములను సంపాదించుకొను విధమును వారికి నేర్పుడు.

ఇదంతయు జరిగిన పిదప మతబోధ చేయుడు సోమరులై కూర్చుండి యుండుటకు అవకాశము లేదు—ఏ క్షణమునందు మరణము ఆసన్నమగునో ఎవ డెఱుగును?

# బ్రాహ్మణా అభివదంతి

జనకుని సదస్సులో గార్గి యాజ్ఞవల్క్యుని ఒక చిక్కు ప్రశ్న వేసింది. ఆ ప్రశ్నకు జవాబు మాటల్లో చెప్పడానికి కుదరదు. యాజ్ఞవల్క్యుడు చెప్పడానికి ప్రయత్నిస్తే – చెప్పడానికి సాధ్యం కానిదాన్ని చెప్పడానికి ప్రయత్నించాడనే దోషం పైన బడుతుంది. అట్లని చెప్పకుండ ఊరకున్నా దోషమే. ప్రశ్నకు బదులు చెప్ప లేకపోయాడని అందరు ఒకటే గోల జేస్తారు. చెప్పినా ఇబ్బంది. చెప్పక పోయినా ఇబ్బంది.

'కస్మిన్ను ఖల్వాకాశ ఓతశ్చ ప్రోతశ్చ?' (ఎందులో అవ్యాకృతాకాశం కూర్పబడి యున్నది?) - అన్నదే గార్గి ప్రశ్న.

బదులు చెప్పినా దోషం, చెప్పకపోయినా దోషం - అనే ఈ రెండు దోషాలను పరిహరిస్తూ 'ఏతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదంతి' (ఓ గార్గీ! అవ్యాకృతాకాశాని ఆధారమైన తత్త్వాన్నే 'అక్షరం' అని బ్రహ్మవేత్తలు పలుకుచున్నారు) - అని బదులు చెప్పాడు యాజ్ఞవల్క్యుడు.

ప్రశ్నకు తగిన సమాధానం చెప్పినందువల్ల, చెప్పలేక పోయాడన్న దోషానికి అవకాశం లేదు. 'బ్రహ్మవేత్తలు చెప్పుచున్నారు'-అని చెప్పడంవల్ల అవాచ్యమైనదాన్ని చెప్పాడనే దోషానికీ అవకాశంలేదు.

ఇంత నేర్పుగా సమాధానం చెప్పిన యాజ్ఞవల్క్యుని గార్గి తిరిగి ప్రశ్నించింది. 'ఏమిటాక్షరతత్త్వం?'

ఆ 'అక్షరాన్ని' ఇంకా పొడిగించి చెప్పాలంటే యాజ్ఞవల్క్యునికి ఉన్నది ఒక్కటే మార్గం. అది 'నేతి నేతి' మార్గం. ఆ మార్గాన్నే అవలంబించి బదులు చెప్పాడు.

'ఆ "అక్షరం" స్థూలంకాదు. సూక్ష్మం కాదు. దీర్ఘంకాదు. హ్రస్వంకాదు. లోహితం కాదు. స్నేహంకాదు. ఛాయకాదు. చీకటి కాదు. వాయువుకాదు. ఆకాశంకాదు. తేజస్సు కాదు. రసంకాదు. నేత్రం, శ్రోత్రం, వాక్కు, ప్రాణం, మనస్సు, ముఖం - లేనిది, అంతరం లేనిది. బాహ్యంలేనిది. దేనిని భక్షించనిది. దేనిచేతను భక్షింపబడనిది.'

ఇక్కడ గమనించవలసిన సూక్ష్మవిషయం ఒకటుంది. 'అదికాదు, ఇదికాదు' అని యాజ్ఞవల్క్యుడు వర్ణించింది మన ఆత్మకు వేరైన తత్త్వాన్నా? ఆత్మకు వేఱుకాని తత్త్వాన్నా?

ఆత్మకన్న వేరైనతత్త్వాన్ని, యాజ్ఞవల్కుడు 'అస్థూలం, అనణు' అని అట్లా నిషేధరూపంగా వర్ణించిఉంటే ఆ వర్ణన కేవలం శూన్యాన్ని వర్ణించినట్లే అయిఉండేది, శూన్యాన్ని ప్రతిపాదించినట్లే అయిఉండేది. శూన్యాన్ని ప్రతిపాదించడానికి యాజ్ఞవల్కుడు అంత ఆయాస పడవలసిన అవసరం లేదుకదా! కాబట్టి యాజ్ఞవల్క్యుని నిషేధవర్ణనయొక్క ఉద్దేశం వేఱు. 'అస్థూలం, అనణు' అనే ఆ నిషేధ వర్ణన ఆత్మవిషయకమైన మన భ్రాంతిని తొలగించుటకే ఉద్దేశింపబడింది. భ్రాంతి తొలగితే ఆత్మయే అక్షరతత్త్వం, అక్షర తత్త్వమే ఆత్మ అనే అభేదజ్ఞానం మనకు కలుగుతుంది.

అభేద ప్రతిపాదనమే సకలశ్రుతుల పరమ తాత్పర్యంగా ఉన్నది. వైకుంఠంలో నారాయణుడున్నాడు, కైలాసంలో శివుడున్నాడు. వారు అప్పుడప్పుడు జగత్కల్యాణం కొఱకు అవతరిస్తుంటారని మనం పురాణ ప్రమాణ బలంవలన నమ్మగలిగినప్పుడు, ఉత్తమోత్తమ ప్రమాణమైన శ్రుతి, తల్లివలె ఆదరంగా 'తత్త్వమసి, తత్త్వమసి' (జగత్కారణుడైన పరబ్రహ్మస్వరూపమే నీ నిజస్వరూపం) అని చెప్పుచుండగా విశ్వసించుటకేమి కష్టం?

'తత్త్వమసి' ఇత్యాది శ్రుతిమాత వాక్కులను, పరమ ప్రమాణంగా స్వీకరించగలవారి భాగ్యమే భాగ్యం అటువంటివారు విడువక ఉపనిషత్తులను శ్రవణ, మనన, నిదిధ్యాసనం చేయవలెను. అంతకన్న ఉత్తమసాధన వారికి వేఱొకటి లేదు.

'ఆసుప్తేరామృతే కాలం నయేద్వేదాంత చింతయా'

# శ్రీ రామకృష్ణ కథామృతము

(రెండవ భాగము)

అనువాదము : ప్రవ్రాజిక శ్యామాప్రాణ

నేడు క్రీ. శ. 1883 జూన్ 5 వ తేది, మంగళ వారము, అమావాస్య.

మధ్యాహ్నము భోజనమైనపిదప శ్రీ రామ కృష్ణులు తమకు పూర్వము కలిగిన ప్రేమోన్మత్త స్థితినిగూర్చి మరల చెప్పుచుండిరి.

శ్రీ రామకృష్ణులు: (మాస్టరుతో) ఎటువంటి రోజులు గడిచెనో తెలియునా? ఈ ఆలయములో భుజించెడివాడను కాను. బారానగరములోనో, అరియాదాహాలోనో, దక్షిణేశ్వరములోనో ఎవరైన బ్రాహ్మణుల ఇంటికిపోయి మౌనముగా కూర్చుండెడివాడను. ఇంటివారేమైన అడిగినచో నే నిక్కడ భోజనము చేసెదను' అనిమాత్రమే జవాబు చెప్పువాడను.

ఒకదినము మధురబాబుతో 'నన్ను శ్రీ దేవేంద్రనాథ ఠాగూరుగారింటికితీసికొనిపొమ్మ'ని పట్టుపట్టితిని. దేవేంద్రుడు ఈశ్వరుని స్మరించును గనుక వానిని చూడవలెనని కోరిక గలిగెను. మధురబాబు జమీందారుకదా! ముందు వెనుక లాలోచించి చివరకు ఇట్లనెను. 'దేవేంద్రుడు నేను ఒకేక్లాసులో చదువుకొన్నాము. మిమ్ములను పిలుచుకొనిపోయెదను.'

ఇంకొకదినము బాగ్‌బజార్‌లో శ్రీ దీనబంధు ముఖర్జీ అను భక్తుడు కలడనివిని వారింటికి తీసికొనిపొమ్మని మధురుని బలవంత పెట్టితిని. వాళ్లు చాల బీదవాళ్లు. చిన్న ఇల్లు. తలవనితలంపుగ గొప్ప జమీందారు ఇంటికి వచ్చెను. దానికితోడు ఆదినము వాని కొమారుని ఉపనయనము. మమ్ములను కూర్చొనబెట్టుటకు కూడ స్థలము లేనందున ఇంటియజమాని చాల బాధపడెను. అట్టి విశేషదినమున వారింటికి పోయి వారిని ఇబ్బంది పెట్టినందులకు మధురబాబునకు సిగ్గువేసెను. తిరిగివచ్చునపుడు 'ఇక మీదట మీమాట వినను' అనెను. నేను నవ్వి ఊరకుంటిని.

ఒకమారు శ్రీ కుమార్‌సింగ్ సాధులను భిక్షకు పిలిచెను. అచ్చటికి చాలమంది సాధువులు వచ్చియుండిరి. వారు నన్నేదో ప్రశ్నించిరి. వారికి నాజోలి ఏల అని తలవంచుకొని పోయి కూర్చొంటిని. ఔపాసనము చేయకముందే భోజనముచేయ నారంభించితిని. అందరూ ఒక్కపెట్టున ఇదేమి? అని కేక పెట్టిరి.

* * *

సాయంకాలము 5 గంటలాయెను. శ్రీ రామకృష్ణులు తమగది ప్రక్కవరండా మెట్లుపై కూర్చొనియుండిరి. రాఖాల్, మాస్టరు, హాజరా ప్రక్కనే కూర్చొనియుండిరి.

శ్రీ రామకృష్ణులు: భగవంతుడే సర్వమునై యున్నాడు. మంచిచెడ్డలకు, పాపపుణ్యములకు, భక్తిజ్ఞానములకు సర్వమునకు అతడే కర్త.

ఒక కథ వినుము. ఒకఊరిలో ఒక రైతు ఉండెను. అతడు పొలమును సాగుచేసికొని జీవించెడివాడు. వానికి చాలకాలమైనతరువాత ఒక కుమారుడు పుట్టెను. లేకలేక కలిగిన సంతానము కనుక అల్లారుముద్దుగా పెరుగుచుండెను. ఒకనాడు రైతు పొలములో పని చేయుచున్నప్పుడు ప్రక్కయింటాయనవచ్చి 'మీ కుమారునికి చాల జబ్బుచేసినది. ప్రమాదస్థితిలో యున్నాడు' అని తెలిపెను. రైతు ఇంటికి చేరులోపలనే బాలుడు మరణించెను. వాని

భార్య రోదనమునకు అంతు లేకుండెను. అతడేమియు పలుకక మౌనముగ కూర్చొనియుండెను. వాని కంటినుండి ఒక్క నీటిబొట్టయినను జారలేదు.

'అట్టి బంగారుబిడ్డడు పోయెను. ఈయన కంటనుండి ఒక్కబొట్టయినా రాలలేదే!' అని ఆ రైతుభార్య ఏడుస్తూ అక్కడ గుమిగూడిన వారితో చెప్పుచుండినది. కొంతసేపయినతరువాత రైతు భార్యకు ఇట్లు జవాబు చెప్పెను. 'నేను నిన్న ఒక కలకంటిని. నేను రాజు నైతిని. ఏడుగురు కుమారులుండిరి. సర్వగుణసంపన్నులై పెరుగుచుండిరి. విద్యాబుద్ధులు నేర్చుచు క్రమముగా పెద్దవారగుచుండిరి. ఉన్నట్లుండి నాకు మెలకువ వచ్చెను. ఆ ఏడుగురు కుమారులకై దుఃఖించుటయా? లేక ఈ ఒక్కకుమారునకై దుఃఖించుటయా? అని ఆలోచించుచున్నాను!

యథార్థజ్ఞానులకు స్వప్నజాగరములు రెండును సమానములుగ తోచును.

ఈశ్వరుడే కర్త. వాని ఇష్టప్రకారమే అంతయు నడచుచున్నది

హాజరా: కాని తెలిసికొనుట చాల కష్టము.

శ్రీ రామకృష్ణులు: (మాస్టరుతో) నీకు సాకారము ఇష్టమా? నిరాకారము ఇష్టమా?

మాస్టరు: నిరాకారమే ఇష్టము. కాని భగవంతుడు సాకారుడు అను నమ్మకము కూడ కలదు.

శ్రీ రామకృష్ణులు: బేల్‌ఘర్‌లోని శ్రీ మోతీసీల్‌గారి తోటకు తీసుకొనిపోయెదవా? అచ్చట ఒక కొలను కలదు. ఆ కొలనులో చాల చేపలున్నవి. బొరుగులు వేసినచో అవి నీళ్ళపైకి వచ్చి వాటిని తినుచు ఆనందముతో తిరుగాడును. ఆ దృశ్యము నాకు చాల ఆనందమును కలిగించును. సచ్చిదానంద సముద్రమున ఆత్మరూపమగు చేపలు ఆనందముగా క్రీడించుచున్నట్లు భావన కలుగును.

భగవంతుని దర్శించుకొనవలెనన్న సాధనలు చేయవలెను. నేను కఠోర సాధనలు చేసితిని. 'అమ్మా దర్శనమిమ్మ'ని రాత్రింబవళ్ళు మట్టినేలపైబడి పొర్లాడుచు విలపించెడివాడను. కన్నీళ్ళతో నేల అంతయు బురద అయ్యెడిది.

మాస్టరు: తమరికే అట్టి కఠోర సాధనలు చేయవలసి వచ్చెనుగదా! ఇక మా బోటి సామాన్యులో కష్టపడకయే భగవద్దర్శనమును కోరుదురు!

శ్రీ రామకృష్ణులు: (నవ్వుచు) అమృత్ ఇట్లనును. ఒకరు నిప్పు రాజబెట్టిన పదిమందికి ఉపయోగపడును.

మాస్టరు: లీల విలాసార్థమే అని తమరే ఆనతిచ్చిరిగదా!

శ్రీ రామకృష్ణులు: అట్లు కాదు. లీలయు సత్యమే సుమా. నీకొకటి చెప్పదలచితిని. నీవు ఇక్కడకు వచ్చునప్పుడు వట్టి చేతులతో రాక ఏదైన తీసికొనిరమ్ము. ఇట్లు నేనే స్వయముగా చెప్పకూడదు. అయినా మీకు తెలియదనియే నేర్పుచున్నాను. అధరునికికూడ ఇట్లే చెప్పితిని. 'ఒకపైస తమలపాకులైన తీసికొనిరమ్మ'ని భవనాథునికికూడ చెప్పితిని.

నేడు క్రీ. శ. 1883 జూన్ 15 వ తేది.

ఒక సాధకుడు: స్వామీ! గృహస్థాశ్రమములో భగవత్సాక్షాత్కారము లభింపగలదా?

శ్రీ రామకృష్ణులు: ఎందుకు లభించదు? తప్పక లభింపగలదు. కాని కుమ్మరి పురుగువలె సంసారములో నివసింపుము. కుమ్మరిపురుగు బురదలోనే నివసించినను దానికి బురద అంటుకొనదు. భగవంతునిపై మనస్సునిల్పి సంసారములో పనులన్నియు చేయుము. కాని ఇది చాల కఠినమైనది. జంజాటములనడుమ భగవంతునిపై మనస్సు నిల్పుట చాల కష్టమే!

ఒక భక్తుడు: అట్లయిన ఉపాయమేమి స్వామీ!

శ్రీ రామకృష్ణులు: ఉపాయము కలదు. అదియే తీవ్రమగు వైరాగ్యము. ఇది అనిత్యము అని దృఢముగా తెలిసికొన్నచో వెంటనే ఆ అనిత్యవస్తువును వదలివేయవలెను. గట్టి పట్టుదల ఉండవలెను. నాకొకసారి జబ్బు చేయగా డాక్టర్ గంగాప్రసాద్ మందిచ్చి నీళ్ళు మాత్రము త్రాగరాదని పథ్యము పెట్టిరి. దానిమ్మపండురసము త్రాగవచ్చునని చెప్పిరి. అందరు 'నీరు త్రాగకుండ ఎట్లుండుట' అని చింతించుచుండిరి. నేను నీళ్ళు త్రాగనని దృఢ సంకల్పము చేసికొంటిని.

కొన్నిదినములు నిర్జనప్రదేశములో నివసించి పట్టుదలతో సాధనలుచేసినచో భగవద్దర్శనము లభించును. అటుపై సంసారములో యున్నను భయములేదు. అందుకనియే నేను ఈ బాలురను ఇచ్చట యుండమని చెప్పుచుందును. కొంతకాలము ఇచ్చట నివసించినచో భగవద్భక్తి కలుగును. అటుపై సంసారములో యుండవచ్చును.

ఒక భక్తుడు: మహాశయా! సర్వమునకు ఈశ్వరుడే కర్తయైనచో మంచిచెడ్డలు, పుణ్యపాపములగూర్చి పలుకనేల? పాపకార్యములకును అతడేగదా కర్త! పాపముకూడ వాని ఇష్టప్రకారమే జరుగును కదా!

శ్రీ రామకృష్ణులు: పాపపుణ్యములు కలవు. కాని భగవంతుడు స్వయముగా నిర్లిప్తుడు. వాయువు నిర్లిప్తము. సువాసనయు, దుర్వాసనయు వాయువులో వచ్చిచేరును. అట్లయ్యు వాయువు నిర్లిప్తమే. వానిసృష్టియే నానారకములు. మంచి చెడ్డలు, పుణ్యాత్ములు, దుర్మార్గులు–అందరును వాని సృష్టియే. కాని భగవంతుడు నిర్లిప్తుడే. వాని లీలల మనము తెలిసికొనలేము.

సంసారములోనే లిప్తమైయున్నచో అది మనస్సును చాల క్రిందికి లాగివేయును. ఎంత క్రిందికి దింపివేయునో తెలియనే తెలియదు. ఒకసారి నన్ను కోట చూపించుటకు తీసికొని పోయిరి. బండి కోటముందరవచ్చి నిల్చిన పిమ్మటనే మేము చాల లోతునకు దిగివచ్చితిమని తెలిసికొంటిమి. బండి పోవునపుడు మేము క్రిందికి దిగిపోవుచున్నామని తెలియనేలేదు. అటులనే కామ కాంచనముల ఆసక్తి కలిగిన వారిమనస్సు వారిని చాల క్రిందికి లాగివేయును. సంసారములో కామమే కాదు, దానితోపాటు క్రోధముకూడ కలదు. కోరినకోర్కె నెఱవేరనిచో క్రోధము కలుగును.

—సశేషము.

# ప్రహ్లాద కథాతత్త్వ విచారము

ధూళిపాళ శ్రీరామమూర్తి.

పూర్వము రాజసూయ యజ్ఞమునందు శిశుపాలుడు, శ్రీ కృష్ణునిచే చంపబడి ఆయనయం దైక్యమయ్యెను. ధర్మరాజదిచూచి ఆశ్చర్య పడి అచ్చట కూర్చునియున్న నారదుని ఇట్లడిగెను. ''మహర్షీ! ఇది చాలా ఆశ్చర్యముగా నున్నది. పరతత్త్వమైన వాసుదేవునియం దైక్యము చెందుట ఏకాంతభక్తులకుకూడా దుర్లభము! మరి యట్టిస్థితి కృష్ణద్వేషియైన శిశుపాలున కెట్లబ్బినది. పూర్వము వేనుడు భగవంతుని నిందించెను. ఋషులు వానిని నరకమున త్రోసిరి. మరి శిశుపాలుడు బాల్యమునుండియు మహాపాపి. వీడును దంతవక్త్రుడును కృష్ణునియందు క్రోధమాత్సర్యములు వహించి ఎప్పుడును విష్ణునింద చేయుచుండియు దుష్ప్రాపమైనభగవత్సాయుజ్యమును పొందిరి. ఇది యెట్లు? గాలిలో పెట్టిన దీపమువలె ఈ సందేహమువలన నా మనస్సు కొట్టుకొను చున్నది. ఈ యాశ్చర్యమునకు కారణము చెప్పుము

నారదు డాతని ప్రశ్నకు ఇట్లు సమాధానము చెప్పెను. 'రాజా! నిందాస్తవములు, పురస్కారతిరస్కారములు శరీరమునకు సంబంధించినవి. ఈ శరీరము ప్రకృతిపురుషుల గురించిన యవివేకముచే కల్పింపబడినది. ఈ శరీరము ప్రకృతివికారము. అనాత్మపదార్థము దీనియందు ఆత్మభ్రాంతి ఉన్నందువలన దీనికి కల్గిన నిందాస్తుతులు దీనియందుగల ఆత్మాభిమానమువలన పురుషుడు తనకు కల్గినట్లు భావించును. ఈ శరీరమునందు నేను, నాది యని అభిమానము ప్రాణులకుండును. ఈ యహంకార మమకారములే సమభావ రాహిత్యమునకు వైషమ్యమునకును హేతువులు. శరీరమును తిట్టిన, తన్ను తిట్టినట్లు, కొట్టిన తన్ను కొట్టినట్లును. అట్లే ఇతరశరీరమును తిట్టిన, వానిని తిట్టినట్లు, కొట్టిన, వానిని కొట్టినట్లు. ఈ యభిమానమే తప్పు. సర్వశరీరములందున్న దొకటే యాత్మపదార్థము. ఆత్మ అనాత్మ వివేకము లేకపోవుటవలన ఈ యభిమానము కల్గినది. మరి పరమేశ్వరుడు సర్వమునకు ఆత్మస్వరూపుడు. ఆయనకు శరీరములయందు ఇట్టి యభిమానముండదు. ఇట్టి వైషమ్యము ఉండదు. కనుక ఆయనకు శరీరములం దాత్మభ్రాంతి లేదు. ఆయన కేవలుడు. సచ్చిదానంద స్వరూపుడు. తనకంటె ఇతరము, మరియొక పదార్థమున్న దనుభ్రాంతి లేనివాడు. అందుచేత పూర్వము చెప్పిన నిందాస్తవాదు లాయన కంటవు. ఆయన తన పరమాత్మస్వరూపము నందే నిరంతరముండుచు లోకహితమునకై దండమువూని యుండును. ఆయన దండకర్త అన్నమాట. కాబట్టి ఏ యుపాయముచేతనైనను భగవంతునియందు మనస్సు నిలుపవచ్చును.

తస్మాత్ వైరానుబంధేన నిర్వైరేణ భయేన వా।
స్నేహాత్కామేన వాయుంజ్యాత్ కథంచిన్నేక్షతేపృథక్॥

'వైరముచేత, భక్తిచేత, భయముచేత, స్నేహముచేత, కామముచేత, ఎట్లైనను సరే మనస్సును ఈశ్వరునియందు లగ్నముచేయుము. పరమేశ్వరు డనుగ్రహించును. నీ వాయనను ధ్యానించుట కావలెను. ఏ మార్గమున ధ్యానించితివని ఆయన చూడడు. మార్గభేదమును పట్టించుకొనడు. మరి వైరముచేత మనుజుడు

త్వరగా సిద్ధిని బొందును. భక్తియోగమువలన అంత గాఢమైనభావన సిద్ధించదు. చూడుము. భ్రమరము కీటకమును తెచ్చి, దాని గూడు నందుపెట్టి యది పారిపోకుండ దానిచుట్టును ధ్వనిచేయుచు తిరుగును. ఆ కీటకమునకు ద్వేషము, భయమును ఆ భ్రమరముపైగలిగి దాని యందే మనస్సు గాఢముగా లగ్నమై, కొంత కాలమునకు అదికూడ భ్రమరమై పోవును. అట్లే మాయామానవుడైన శ్రీకృష్ణపరమాత్మ యందు వైరయోగముచే పాపములు కడిగి వేసుకొని పరిశుద్ధులై యాయనయం దైక్య మగుదురు.

'గోప్యః కామాద్భయాత్కంసో
ద్వేషాచ్చైద్యాదయోనృపాః ।
సంబంధాద్వృష్ణయః స్నేహా
ద్యూయం భక్త్యా వయం నృపా ॥

'కామమువలన గోపికలు, భయమువలన కంసుడు, వైరమువలన శిశుపాలుడు, స్నేహము వలన మీరును (పాండవులును), యాదవులును, భక్తివలన మేమును పరమేశ్వరానుగ్రహము పొందితిమి.

'ఈ చెప్పిన ఐదుమార్గములందును వేనుడు చేరడు. వేనుడు నాస్తికుడు. వాని కీశ్వరుడు లేడు. ఈశ్వరుడే లేనప్పుడు ఆయనయందే భావమైన నెట్లుండును? ఏ భావముతోగాని ఆయ నను ధ్యానించు టెట్లుండును? కావున అతనికి నరకమే గతియైనది. నరకమనగా సంసారము. జన్మమృత్యు జరావ్యాధి దుఃఖప్రవాహము. అతడు నాస్తికుడు గాన ఈశ్వరచింత జేయ లేదు. మరి యేమిచేసినాడు? సంసారరూపమైన యీ లోకమునే చింతించినాడు. దేనిని చింతించిన ఆగతియే గల్గుటలో నాశ్చర్యమేమున్నది. సంసారముగురించి చింతించినాడు. సంసారము నందే పడినాడు.'

నారదు డీమాటలుజెప్పి మరల, 'రాజా! నీ పినతల్లి కొడుకులైన శిశుపాల దంతవక్త్రులు పూర్వము విష్ణుపార్శ్వస్థులు. విప్రశాపమువలన పదచ్యుతులై భూలోకమునందు బుట్టినార'ని చెప్పెను.

ధర్మరాజునకిది మరియు నాశ్చర్యము గొలిపినది. 'మహర్షీ! విష్ణుపార్శ్వజనులైన మహానుభావులు ఏకాంతభక్తులు. వారికి సంసారపాతము గల్గినదనుట నమ్మ శక్యముగాని మాట. వారికి శాప మెందుకుగల్గినది? ఇట్టి మహానుభావులకు శాపమేమి? ఈ శాపము బెట్టగల సమర్థు లెట్టివారు వైకుంఠపురవాసులకు దేహము, ఇంద్రియములు, ప్రాణములతోడి సంపర్కముండదు. వారు శుద్ధసత్త్వమయదేహులు. అట్టివారికి ప్రాకృత దేహసంబంధము గల్గుట, దానిచేత వారు సంసారబంధమునందు చిక్కుట యెట్లు సమకూరును? ఇదియంతయు నాకు విశదముగా చెప్పుడు' అని యత డడిగెను. నారదు డిట్లు చెప్పెను.

'పూర్వమొకప్పుడు బ్రహ్మపుత్రులైన సనందనాదులు, స్వేచ్ఛగా మూడులోకములందు తిరుగుచు విష్ణులోకమునకు పోయిరి. వారు సనాతనులైన మరీచ్యాది మహర్షులకంటె పెద్దవారైనను, ఐదారుసంవత్సరముల వయస్సు గల పిల్లలవలె నుండుటయు, దిగంబరులైయుండుటయు చూచి, వారిని చిన్నపిల్లలనుకొని, ద్వారపాలకులైన జయవిజయులు వారిని నిరోధించిరి. వారికి కోపమువచ్చి 'రజస్తమోరహితమైన పరమేశ్వరుని పాదమూలమున మీరు నివసించుట కర్హులుగారు. మీరు బాలిశులు (మూఢులు). కావున పాపిష్ఠులైన యసురులై

జన్మింపుడు' అని శాపము నిచ్చిరి. వారక్కడ నుండి క్రిందికి పడుచుండుటజూచి దయగల వారై 'మూడుజన్మల యనంతరము మరల మీకు స్వస్థానము గల్గును లెండ'ని యనుగ్రహించిరి. ఆ జయవిజయులు తొలిజన్మమున దితి కడుపున హిరణ్యాకశిపు, హిరణ్యాక్షులై పుట్టిరి. పరమేశ్వరుడైన విష్ణువు నృసింహావతారము దాల్చి హిరణ్యాకశిపుని, వరాహావతారము దాల్చి హిరణ్యాక్షుని సంహరించెను. హిరణ్యాకశిపుడు విష్ణుభక్తుడైన ప్రహ్లాదుని, తనపుత్రుని చంపవలెనని నానాబాధలు పెట్టెను. ఆ ప్రహ్లాదుడు ప్రశాంతుడు. సమదర్శనుడు. సర్వభూతాత్మభూతుడు. కావున భగవంతుని తేజస్సా యనకు రక్షకమై నిలిచినది. హిరణ్యాకశిపుని ప్రయత్నము లాతనిపై విఫలములైనవి. తర్వాతి జన్మయందు వారిద్దరు కైకసి కడుపున విశ్రవసునకు రావణ కుంభకర్ణులై జన్మించిరి. సర్వలోకములను బాధించిరి. శ్రీ మహావిష్ణువు శ్రీరామచంద్రుడై జన్మించి వారిని చంపెను. మార్కండేయమహర్షి నీకా కథ చెప్పగలడు. ఆ జయ విజయులే మూడవజన్మమున క్షత్రియులై మీ పినతల్లి కుమారులై జన్మించిరి. శ్రీ కృష్ణుని చక్రపుదెబ్బచే వారి పాపములన్నియు విడిపోయి, వారిపుడు శాపమోక్షమును పొందిరి. వైరానుబంధముచేత తీవ్రమైన ధ్యానము కుదిరి వారికి ఈశ్వరసాయుజ్యము కలిగినది. మరల వారు విష్ణులోకమున స్వస్థానమును బొందిరి.'

—సశేషము.

# రామకృష్ణుడు-పరమహంసభావము

స్వామి స్వాత్మానంద

క్రీ. శ. 14 వ శతాబ్దంలో విద్యారణ్యస్వామి శృంగేరి పీఠాధిపతిగా ఉండిరి. ఈయన జ్ఞాని. వేదాంత గ్రంథకర్త. గొప్ప అనుభవజ్ఞుడు. ఈయన వ్రాసిన గ్రంథాలలో 'జీవన్ముక్తి వివేకము' ఒక సుప్రసిద్ధ గ్రంథము. దీనిలోని ప్రతి అక్షరానికి శ్రీ రామకృష్ణుని జీవితంలో ఉదాహరణలు కనబడతాయి.

శ్రీరామకృష్ణ అనగానే పరమహంస అనే పదం మనకు జ్ఞాపకం వస్తుంది. ఈ పరమహంస అనేపేరు శ్రీ రామకృష్ణుని నామముతో ఒకటైపోయింది. పరమహంసజీవితం విద్యారణ్యస్వామి విపులంగా తమ గ్రంథములో తెలియజేసారు. 'స్థితప్రజ్ఞుడు ఎలా ఉంటాడు, ఎలా మాట్లాడుతాడు, ఎలా నడుస్తాడు' అన్న అర్జునుని ప్రశ్నకు కృష్ణుడు జవాబు చెప్పినట్లు విద్యారణ్యస్వామి పరమహంసగూర్చి జీవన్ముక్తివివేకంలో చెప్పారు.

పరమహంస అనేపేరు సన్యాసులకే చెల్లుతుంది. ఇది అత్యున్నతస్థానము. ఈ పై మెట్టు ఎక్కాలోపల కొన్ని దిగువమెట్లు దాటాలి. వీటిలో మొదటిది కుటీచక సన్యాసము. మరో విధంగా చెప్పాలంటే 'తీవ్రసన్యాసం' అనాలి. ఈ తీవ్రసన్యాసి తన బుద్ధిబలంతో ప్రపంచంలోని మంచి, చెడ్డలను విచారిస్తాడు. తాత్కాలికసుఖాలైన, భార్య, పిల్లలు, భోగాలు అక్కర్లేదని వదలివేస్తాడు. ఇలా ప్రపంచానికి దూరమై సాధనలు చేస్తాడు కుటీచక సన్యాసి. ఇలా సాధనలు చేయగా చేయగా చావు, పుట్టుకలు లేకుండా ఉండడానికి ప్రయత్నిస్తాడు. దీనిని బహూదకసన్యాసమంటారు. ఇది రెండవమెట్టు.

మొదట తనకు భార్యా పిల్లలు అక్కర్లేదంటే రెండవదశలో తిరిగి పుట్టకూడ దనుకుంటాడు. దీనినే తీవ్రతరసన్యాసమంటారు. దీనిలో సాధన చేయగా చేయగా హంసత్వం పొందుతాడు. ఈ స్థితి పరిపక్వమొందినపుడు పరమహంస అని అంటారు.

విద్యను మనం విజ్ఞానార్జనకుకాక ధనార్జన కోసమే అభ్యసిస్తున్నాము. ఈ పొట్టకూటివిద్య నా కవసరము లేదని శ్రీ రామకృష్ణుడు తన చిన్నతనంలోనే దానిజోలికే పోలేదు. శ్రీ రామకృష్ణుని అన్న, రామ్‌కుమార్ తమ్ముని భావిజీవితాన్ని సరిదిద్దడానికని 'నాయనా, ముందు ముందు నీ వెలా జీవితాన్ని నెట్టుకొని రాగలవు' అని మందలించాడు. 'అన్నా, ఈ పొట్టకూటివిద్య నా కవసరంలేదు' అని నిర్మొహమాటంగా శ్రీ రామకృష్ణుడు చెప్పాడు. ఇలా చెప్పడానికి నిజమైన వైరాగ్యం కావాలి కదా! ఈవిధంగా ఆరంభమైన శ్రీ రామకృష్ణుని కలకత్తా జీవితం దక్షిణేశ్వర దేవాలయంలో వికసించింది. కాళికాదేవి సన్నిధిలో అనేక సాధనలుచేసి వాటిగమ్యాన్ని చేరాడు. ఇదే శ్రీ రామకృష్ణుని జీవితంలో తీవ్రసన్యాసాన్ని తెలియజేస్తుంది.

తోతాపురి అనే సన్యాసిని గురువుగా చేసుకొని శ్రీ రామకృష్ణుడు తీవ్రతరసన్యాసాన్ని స్వీకరించాడు. కాషాయాంబరాలు, దండకమండలాలు వదలేశాడు. కనుక ఇది విద్వత్ సన్యాసము.

ఈ సన్యాసానంతరం యితని జీవితం ఎలా ఉంటుంది. పసిబాలుడులా కల్లాకపటాలు లేకుండా ఉంటాడు. సుఖ, దుఃఖాలకు కారణాలయిన అహంకార, మమకారాలు లేవు. క్షుధానివృత్తికొఱకే భిక్షకుపోతాడు. భిక్ష ఎత్తుకోడానికి పాత్రకూడా ఉంచుకోడు. ఉండడానికి ఇల్లులేదు. ఎండవానలనుండి రక్షించుకోడానికి ఏ సమయానికి ఏది దొరికితే అదే అతని వాసస్థానము. అది పాడుపడిన యిల్లో, దేవాలయమో, గడ్డిమేటో, నది గట్టో, కొండ చరియో, లోయో, కావచ్చు కాని అదే అతని నివాసస్థలము. ఎప్పుడూ పరబ్రహ్మ చింతనలోనే ఉంటాడు. శుభా శుభకర్మలు రెండూ బంధాలే. అందుచే వాటిని నిర్మూలించడానికి కృతనిశ్చయుడై ఉంటాడు. చినిగిన వస్త్రాన్ని వదిలిపెట్టేలాగ చివరిదశలో ఈ శరీరాన్నికూడా వదిలేస్తాడు.

ఈ లక్షణాలన్నీ శ్రీ రామకృష్ణుని జీవితంలో మనకి కనబడతాయి. బాలురకు శత్రువు మిత్రుడు ఒకలాగే కనబడతారు. మంచిఏదో, చెడుఏదో తెలుసుకోలేడు. ఇది నాది, అది నీది అన్న ఆలోచనే ఉండదు. ఎప్పుడూ అమ్మ చాటునే ఉంటాడు. ప్రతీదానికి అమ్మమీదే ఆధారపడతాడు. చీకు, చింతా లేని ఆనందమయజీవితం. ''నేను జగద్ధాత్రి పుత్రుణ్ణి, నాకు భయంలేదు. ఆడుతూ, పాడుతూ, సంతోషంగా కాలం వెళ్ళబుచ్చుతాను'' అని శ్రీ రామకృష్ణుడు అనేవాడు. క్రొత్తవారిని కలుసుకోవాలంటే భయం. ఒకసారి పరిచయమయ్యాక అరమరికల్లేక మాట్లాడేవాడు. అప్పుడప్పుడు చిన్నబుచ్చుకోవడం బుజ్జగింప పడడం వుండేది.

అశ్వినీకుమారదత్త శ్రీ రామకృష్ణునిదగ్గరకు మొట్టమొదటిసారి వచ్చాడు. ఈయన క్రొత్తవాడు, ఏమనుకుంటాడో అని అనుకోకుండ, నాకు లిమనేడ్, (Lemanade) తెచ్చిపెట్టమన్నాడు. మాటల్లో నేను అచలానంద స్వామిని చూచానన్నాడు అశ్వినీకుమార్. 'మాలో ఎవరంటే నీకిష్టం అన్నాడు శ్రీ రామకృష్ణుడు. ''ఆయనకు మీకు ఏమి సామ్యం?

ఆయన పండితుడు, పేరుప్రతిష్ఠ లున్నవాడు.'' అన్నాడు అశ్వినీకుమార్. అదివిని చిన్నబుచ్చు కొని మౌనం దాల్చాడు రామకృష్ణుడు. అశ్వినీ కుమార్‌కు శ్రీ రామకృష్ణుని చూచేటప్పటికి జాలివేసి, ''ఆయన విద్వాంసుడైనా మీలా హాస్యంగా నవ్వుతూ మాట్లాడలే''డన్నాడు. ఇది విని ''నిజం చెప్పావు; బాగా చెప్పావు'' అని జరిగిందంతా మరచిపోయాడు. తోతాపురి సన్యాస మిస్తానంటూ వచ్చినప్పుడు 'అమ్మనడ గాలంటూ పరుగెత్తాడు. వివేకానందుడు' మీ అనుభూతులన్నీ అసత్యాలనేటప్పటికి రామకృష్ణుడు అమ్మదగ్గిరకుపోయి ఏడ్చే వాడు.

సుఖదుఃఖాలకు అతీతంగా వుండడం పరమహంస మరియొక లక్షణం. అహంకార మమకారాలు వుంటే ఈ సుఖదుఃఖాలు వుంటాయి, ఈ అహంకారాదులు జీవభావం పోతేకాని పోవు. దానికి పరమాత్మ భావాన్ని పొందాలి. శ్రీ రామకృష్ణునికి హృదయరామ్ అనునతడు సేవలుచేస్తూ దక్షిణేశ్వరంలో ఉండే వాడు. హృదయ్ ఏదో పొరపాటుచేస్తే యజ మానులు గుడినుండి పొమ్మన్నారు. గుడి నుండి పొమ్మన్నారని హృదయ్ చెప్పేటప్పటికి, తననికూడా పొమ్మన్నారనుకొని ఎలావున్న వాడలాగే బయటకు బయలుదేరాడు. అది చూచి అధికారులు పరుగెత్తుకుంటూవచ్చి ''అయ్యా మీరు వెళ్లనవసరంలేదు, దయచేసి వెనుకకు మరలండి'' అని వేడుకున్నారు. అసలు ఏమీ జరగనట్లే ఆయన తనగదికి వెళ్లిపోయాడు.

జీవనాధారానికి మించి దేనిని ఆశించడు పరమహంస. మహేంద్రనాథగుప్తుడు శ్రీ రామకృష్ణుని ముఖ్య గృహస్థశిష్యుడు. ఆయన్ని 'నాకు రెండు కోరాబట్టలు కావాలని' రామకృ ష్ణుడు అడిగాడు. ఆయన ఎంతో ఆనందంతో కోరావి రెండు, చలువచేసినవి రెండు బట్టలు శ్రీ రామకృష్ణుని కిచ్చాడు. వాటిని చూచి ''నేనడిగినవి రెండు బట్టలే'' అని కోరాబట్ట లుంచుకొని తతిమ్మావి యిచ్చివేసాడు.

ఎప్పుడూ ధ్యానంలో మునిగిపోయి భగ వంతునికి అతి చేరువలో వుండేవాడు శ్రీ రామ కృష్ణుడు. సమాధిస్థితి ఆయనకు పిలిస్తే పలికేది. 'భగవంతుని ధ్యానించడమే తడవు నేను బాహ్యస్మృతిని కోల్పోయేవాడిని' అనేవాడు శ్రీ రామకృష్ణుడు. ఒకసారి జంతుప్రదర్శన శాలకు వెళ్ళాడు. అక్కడ సింహాన్నిచూచి సమాధిస్థితి నొందాడు. సింహాన్నిచూచి ఇది జగన్మాత వాహనం అని ఆలోచనరావడమే దీనికి కారణము.

శుద్ధమైన మనస్సు కలిగియుండడం పరమ హంస మరియొక లక్షణం. సత్త్వగుణంతో నిండిన జీవితం వీరిది. కావాలని ప్రయత్నించినా తక్కినగుణాలు వీరి కంటవు. ఒకసారి జరీపంచ కట్టుకొని, వెండిహుక్కా పీలిస్తే ఎలా వుంటుం దో చూడాలనుకున్నాడు శ్రీ రామకృష్ణుడు. ఆ కోరిక కాస్తా మధురబాబుకు చెప్పాడు. మధురబాబు మంచి జరీపంచె, వెండిహుక్కా పంపించాడు. దీన్నిగురించి శిష్యులకు యిలా చెప్పాడు రామకృష్ణుడు. 'నేను ఆ జరీపంచ కట్టుకొని వెండిహుక్కాతో మంచంమీద కూర్చున్నాను. ముందుకువంగి, వెనక్కు జార కిలబడి, కాలుమీద కాలువేసుకొని యిలా అనేక భంగిమలలో హుక్కాను పీల్చాను– వెండిహుక్కా అంటే యిదని. జరీపంచెతో యిటు అటు తిరిగి జరీపంచ అంటే యిదని నామనస్సును సంబోధించి చెప్పాను. ఓ మనసా యివన్నీ నిన్ను దేవునిదగ్గరకు చేర్చలేవు. పైపెచ్చు నీలో రజోగుణాన్ని ఎక్కువ వృద్ధిచేసి,

డాబు, దర్పం కలిగించి దేవునినుండి నిన్ను దూరం చేస్తాయి అని చెప్పి వాటిని పారవేశాను.'

చంద్రహల్దార్ అనే బ్రాహ్మణుడు కాళికాశయ అధినేతైన మధురుని ప్రాపు పొందాలని చాలా ప్రాకులాడేవాడు. కాని అది సాధ్యపడ లేదు. శ్రీ రామకృష్ణునికి మధురుడు సేవచేయడంచూచి యిందులో ఏదో వశీకరణతంత్రం వుందని తలచి దానిని చెప్పమని సమాధిస్థితిలో ఉన్న రామకృష్ణుని ఒకసారి అడిగాడు. సమాధిలోఉన్న రామకృష్ణుడు జవాబు చెప్పలేదు. అందుకని కోపంతో తన బూటుకాలుతో తన్ని వెళ్ళిపోయాడు. తరువాత తెలుసుకున్న రామకృష్ణుడు ఈ విషయం మధురునకు తెలిసే ఆ బ్రాహ్మణుని ప్రాణానికి హానని ఎవరికి చెప్పలేదు. మానావమానాలకు అతీతుడు పరమహంస.

శరీరధారులందరూ ఆకలిని తీర్చుకోవాలి. దీనికి గృహస్థుడు తన సంపాదనపై ఆధారపడితే సన్యాసి తన మధుకరిపై ఆధారపడతాడు. భిక్షమెత్తుకోడానికి పాత్రకూడా ఉండదు పరమహంసకు. తన ఉదరమే భిక్షాపాత్ర. శ్రీ రామకృష్ణు డొకసారి బనిపాల్ అనే భక్తుడు ఆహ్వానిస్తే కలకత్తా వెళ్ళాడు. తిరిగి వెళ్లేటప్పుడు బనిపాల్ కొన్ని తినుబండారాలను తెచ్చి 'దక్షిణేశ్వరంలో మీతో వుంటున్న రామ్‌లాల్‌కు యివ్వండన్నాడు.' 'నేను దేనిని వెనుకవేయలేను. అదినా ప్రకృతి కాదు. అందుకని నేను వీటిని తీసుకువెళ్లలేన'ని చెప్పాడు. ఎంతోమంది ధనవంతులు ఆయనదగ్గిరకు వచ్చేవారు. కాని ఎవరిని ఏమీ అడగలేదు. చివరి దశలో మందులకు భక్తులందరు ధనసహాయం చేయవలసి వచ్చింది. మధురుడు రామకృష్ణునికి కొంతభూమిని, ధనాన్ని యివ్వబోతే నాకక్కర్లేదని చెప్పాడు.

అంతిమసమయంలో ఎటువంటి విచారం లేకుండా దేహాన్ని వదలివేస్తాడు పరమహంస. ఈ సృష్టి మిథ్య అని తెలిసినవాడెపడు దేహానికై విచారిస్తాడు? శ్రీ రామకృష్ణుడు జబ్బుతో మంచంపట్టాడు. ఆయనబాధ చూడలేక వివేకానందుడు 'మీ మనస్సు దేహంమీద ఉంచండి, మీ కారోగ్యం చేకూరుతుం'దని చెప్పాడు కాని రామకృష్ణుడు వినలేదు.

కంఠంలో వ్రణంవలన, ఆహారం తీసుకోలేదు రామకృష్ణుడు. ఆహారం తీసుకుంటే ఆరోగ్యం బాగుపడుతుందని నరేంద్రుడు 'ఆహారం తినడానికి వీలు కలిగించమని దేవిని ప్రార్థించండ'ని రామకృష్ణుని వేడుకున్నాడు ఇక తప్పనిసరియై దేవిని ప్రార్థించాడు. ఆ ప్రార్థనాఫలితాన్ని నరేంద్రునికి యిలా చెప్పాడు. 'నువ్వు చెప్పినట్లు దేవిని ప్రార్థించాను. ''ఇందరినోళ్ళనుండి భుజిస్తూ యింకా నన్ను ప్రార్థిస్తావేమిటి'' అని అడిగింది. అవమానంతో తల వంచుకున్నాను.' సర్వాత్మాభావము అనుభవించు పరమహంస అన్నగతమైన స్థూల దేహానికి విచారిస్తాడా? శ్రీ రామకృష్ణుడే ఒకసారి 'భగవంతునికి అర్పించిన ఈ మనస్సును శరీరంమీదకి ఎలా మళ్ళించేది' అని వాపోయాడు.



# మాతృదేవి చరణసన్నిధి

ఆంగ్ల గ్రంథము:

ఎట్ ది హోలీమదర్స్ ఫీట్

అనువాదము:

పి. గణపతిశాస్త్రి

వారణాసి. 5, నవంబరు, బుధవారము.

అమ్మ వారణాసిలో అద్వైతాశ్రమం చేరుకునేసరికి దరిదరిగా మధ్యాహ్నం ఒంటిగంట అయింది. మరునాటి ఉదయమే ఆమె అన్నపూర్ణా విశ్వనాథుల సందర్శనానికి ఒక పల్లకిలో దేవాలయం చేరుకున్నారు. కాళీపూజ ముగిసిన మరునాడు అంటే నవంబరు 9 వ తేదీన ఆమె తిరిగి అద్వైతాశ్రమానికి విచ్చేశారు. అదే సమయంలో సేవాశ్రమం కూడా సందర్శించారు. పూజ్యమూర్తులు స్వామి బ్రహ్మానంద, స్వామి తురీయానంద, స్వామి సుబోధానంద, డాక్టరు కంజీలాల్ మొదలయినవారు అప్పుడు అక్కడే ఉన్నారు.

కేదారబాబు [స్వామి అచలానంద] అమ్మ పల్లకీ ఎక్కి పక్కనే ఉండి, సేవాశ్రమంలో రోగుల పడకల గదులన్ని ప్రత్యేకించి చూపించారు. ప్రతిదాన్ని గురించి చక్కగా వివరించారు. అదంతా చూసిన తరవాత అమ్మ దక్షిణపు వరాండాలో కుర్చీలో కూర్చుని, కేదారబాబుతో ప్రసంగించారు. సేవాశ్రమం భవనాలకేసి, తోటలకేసి, చూచి తమ సంతృప్తి వెల్లడించారు. అక్కడ చేసిన ఏర్పాట్లన్ని గమనించి చాలా మెచ్చుకున్నారు. "ఠాకూర్ స్వయంగా దీనికంతటికి అధ్యక్షులుగా వ్యవహరిస్తున్నారు. ఇక్కడ సర్వే సర్వత్ర స్వయంగా ఆ లక్ష్మీ దేవి నివశిస్తున్నది."

తాము సందర్శించిన ప్రతి విషయాన్ని గురించి తమ ఆనందం వ్యక్తీకరిస్తూ "ఈ ప్రదేశం అంతా చాలా సొగసుగా ఉంది. వారణాసిలో ఉన్నంతకాలము నాకిక్కడే ఉండాలని ఉంది" అని అన్నారు.

మరి కొంతసేపటికి అమ్మ తిరిగి తమ బసలోకి వచ్చేశారు. ఆ పైన అమ్మ శిష్యులొకరు సేవాశ్రమాధికారి దగ్గిరికివచ్చి "దయచేసి ఈ పది రూపాయలు అమ్మ సేవాశ్రమానికి అర్పించిన దానంగా జమ కట్టుకోవలసినది." అని వేడుకున్నాడు.

అమ్మ ఒకప్పుడు వారణాసిలో ఇద్దరు సన్యాసులను సందర్శించారు. వారిలో ఒకరు గురునానక్ సంప్రదాయానికి చెందినవారు. రెండవవారు చమేలీపురి పంథాకు చెందినవారు. గోలాప్‌మా వీరిని "మీకు అన్నపానాలు ఎవరు సమకూరుస్తున్నారు?" అని అడిగింది. "ఆ దుర్గామాత తప్ప ఇంకెవ్వరున్నారమ్మా! నాకు అన్నపానాలు సమకూర్చడానికి?" అని దృఢ గంభీరస్వరంతో సమాధానం చెప్పారు చమేలీపురి.

ఆ ప్రత్యుత్తరం మాతృదేవి కెంతయినా ఆనందం కలిగించింది. ఇంటికి తిరిగివచ్చిన తరవాత సాయంత్రం మాతో "నేనా వృద్ధ సన్యాసిముఖం గుర్తు పెట్టుకోవాలని ప్రయత్నిస్తున్నాను. ఆయన అచ్చంగా పసిపిల్లవాడి లాగే ఉన్నారు." అని అన్నారు. మరునాడు ఆమె చమేలీపురికి నారింజపళ్లు, మిఠాయీలు, ఒక దుప్పటీ పంపించారు. నేను కాశీలో ఉన్న మిగిలిన సన్యాసులనుకూడా సందర్శిద్దామా?" అని సూచించాను. అది విని అమ్మ ఆశ్చర్యపడ్డారు. "ఏ సన్యాసులమాట నీవంటున్నది? ఇంతకుమునుపే మన మొక మహనీయవ్యక్తిని సందర్శించాము. అటువంటివక్తి మరి ఇంకెవ్వరున్నారు?" అన్నారు.

వారణాసి, కిరణ్ బాబు గృహము, ఉదయము.

నేను : పగలంతా అనేకరకాల మానవులు విశ్వనాథుని శిలామూర్తిని స్పృశిస్తారు. అందుచేత సాయంకాలం హారతికి, నైవేద్యానికి మునుపు పవిత్ర కరణోత్సవం ప్రతిదినము జరుగుతూంటుంది.

అమ్మ : సొమ్ము ఆశించి అర్చకులు అందరిని ఆ మూర్తిని స్పృశించనిస్తారు. నిజానికి విశ్వనాథమూర్తిని దూరంనించే దర్శించవలసినదని ఒక కట్టడి ఏర్పరచవచ్చునుగదా! కాని అందువల్ల రకరకాల పాపులు ఆ మూర్తిని స్పృశించడంతో వారి పాతిత్య ఫలితాల పరిణామాలు ఆ మూర్తికి ఆవేశిస్తాయి.''

ఈ సందర్భంలో ఆమె పాపులు తనను స్పృశించడంవల్ల తన కెన్నో యాతనలు కలుగుతున్నాయని వివరించారు. ఆ పైన నేను 'మీ సందర్శనానికి వచ్చేముందు ముందుగా అనుమతి తీసుకోవాలన్న నియమం ఏర్పరిచారని, అందువల్ల గుంపులు గుమిగూడకుండా అరికట్టవచ్చున'ని అన్నాను.

అమ్మ : నిజమే మరి. అయితే మాటి మాటికి అనుమతి తీసుకోవాలన్నంత శ్రద్ధ ఎవ్వరికి ఉంటుంది ?

మతి చెదరిన అమ్మ మరదలు ఇటీవల ఇక్కడే ఉంటూ చీటికి మాటికి ఆమె ప్రాణాలు తోడేస్తున్నది. ఈ సంగతి ప్రస్తావిస్తూ ఆమె అందుకున్నారు.

అమ్మ : నేను శివపూజా సమయంలో బిల్వదళాలతోబాటు ముళ్లుకూడా ఆ దైవం నెత్తిమీద పెట్టిఉంటాను. లేకపోతే ఈ మరదలివల్ల నా కిన్ని యాతనలెందువల్ల కలగాలి?... ఎప్పుడు చెడుపనిచేసినట్టు నాకు గుర్తులేదు. అయిదేళ్ల వయస్సులోనే నేను ఠాకూరును స్పృశించాను. అది అవగాహన చేసుకోవడానికి నేనింకా చిన్నదాన్ని. అలాగే ఠాకూరుకూడా నన్ను స్పృశించారు. అయినా నేనెందుకిలాగ బాధ లనుభవించాలి? ఠాకూరును స్పృశిస్తున్నవారందరికి ముక్తి చేకూరుతున్నది. అటువంటప్పుడు నా కొక్కదానికే ఈ మాయావరణలేల? రాత్రింబగళ్లు నా మనస్సు ఉన్నతివైపు పురోగమిస్తున్నది. అయినా దీనులమీద జాలితో నేను బలవంతంగా దానిని కిందికి మళ్లిస్తున్నాను. అయినా నన్ను ఎన్నెన్నో యాతనలు పట్టి పల్లార్చి వేస్తున్నాయి.

నేను: అమ్మా, ఆమె ఏమి చేసినా చెయ్యనీ! అదంతా నీవు ఎంతో ఓరిమితో సహించక తప్పదు. తగినంత మనస్తిమితం తగినంత మనోధైర్యం ఉన్నవారెవ్వరు ఆగ్రహావేశానికి లొంగిపోరు.'' అంటూ ఓదార్చాను.

అమ్మ: అవును నాయనా, నీ వన్నది నిజమే. ఓరిమివంటి పెన్నిధి ఇంకేదిలేదు. అయితే నేను మానవశరీరధారిణి నన్నసంగతి నీ వెరుగుదువుగదా! అందుచేత ఒక్కసారిగా ఆగ్రహంతో మైమరిచి పరుషంగా ప్రసంగించవచ్చును.''

ఆ తరవాత ఆమె తమతో తాము ''సరి అయిన తరుణంలో ఉన్నది ఉన్నట్టు మాట్లాడే వారే నిజమయిన మిత్రులు. ఆ తరుణం కాస్తా మించిపోయిన తరవాత, ఎంత సానుభూతి ఒలకబోసినా ప్రయోజనమేమి లేదు.

11, డిసెంబరు, 1912 మాతృదేవి గృహంలో మేము సాయంకాలం కాశీఖండం చదువుతూండేవాళ్లము. అది పూర్తిఅయిన తరవాత అనేక విషయాలనుగూర్చి అమ్మతో ప్రసంగిస్తూండేవాళ్ళము. ఒకనాడు అమ్మ ఇలా అన్నారు,

అమ్మ: శాస్త్రాల్లో చెప్పిన ఆచారాలన్నీ తు, చ తప్పకుండా ఎవ్వరు అనుసరించలేరు. వట్టి ఆచారాలే మతం కాజాలవని ఠాకూరు ఒకప్పుడన్నారు. ఆయన దివంగతులయిన తర వాత నేను బృందావనయాత్ర ముగించుకుని కామార్పుకూరులో ఇంటికి తిరిగివచ్చాను. ఆ సమయంలో అక్కడ ఇరుగు పొరుగులు నన్ను గుసగుస లాడుకోవడం మొదలుపెట్టారు. ఆ పైన ఆ పల్లెలో జనంఅంతా ఏమని ఆడిపోసు కుంటారో అన్న భయంతో నేను గాజులు తీసివేశాను.

ఆపైన గంగానది లేనిచోట నేనెలాగ నివసించగలనని ఆశ్చర్య పడుతూండేదాన్ని. గంగానదిలో స్నానం చెయ్యాలని ఉవ్విళ్లూరి పోతూండేదాన్ని. నాలో ఈ విధమయిన దౌర్బల్యం ఎప్పుడు ఉంటూనే ఉండేది.

నేనొకనాడు భూతీర్ కాల్ ప్రాంతంనించి ఠాకూరు నా ముందునించి నడిచిపోతున్నట్టు కనుగొన్నాను. నరేంద్రుడు, బాబూరామ్, రాఖాల్, మొదలయిన శిష్యులు చాలామంది ఆయన వెనకాల సాగిపోతున్నట్టుకూడా నా కగపడింది.

ఠాకూరు పాదాల ప్రాంతంనుండి నీటిజల ఉవ్వెత్తుగా కిపొంగి ప్రవహించడం ప్రారం భించింది. తీవ్ర ప్రవాహంలో కెరటాలు ఉవ్వె త్తుగా పై పైకి పొంగాయి!

'ఠాకూరే సమస్తమూను! కనకనే ఆయన పాదపద్మాలనుండి గంగ సముద్భవించినది' అని భావించుకున్నాను నేను.

వెంటనే రఘువీరమందిరం పక్కనుండి బిళ్లగన్నేరుపూలు కొన్ని కోసి దోసిలిలో ఉంచుకుని ఆ గంగానదికి అర్చన చేశాను. ఆ తరవాత ఠాకూరు నాతో "గాజులు చేతుల నుండి తీసివెయ్యవద్దు! వైష్ణవ తంత్ర సంప్ర దాయం నీ వెరుగుదువా?" అని అన్నారు. నా కదిఏమి తెలియదన్నాను. వెంటనే ఆయన "ఈ సాయంత్రమే గౌర్మణి వచ్చి నీకు అది అంతా విశదపరుస్తుంది." అన్నారు.

నిజంగా ఆ మధ్యాహ్నమే గౌర్దాసి వచ్చి, అది అంతా వివరించింది. "భర్త కేవలము శుద్ధ చైతన్య స్వరూపుడని ఆమె ముఖతః నే నప్పుడు విన్నాను.

"పాపభూయిష్ఠమయిన ఈ కలికాలంలో అచంచలమయిన సత్యనిష్ఠతోనే భగవానుని సందర్శించవచ్చును." అని ఠాకూరు అంటూండే వారు. "సత్యాన్నే నమ్ముకున్నవారు ఆ భగ వానుని ఒడిలోనికి చేరుకుంటారు." అనికూడా ఆయన సెలవిచ్చారు. ఠాకూరుకు జబ్బుచేసిన సమయంలో దక్షిణేశ్వరంలో ఉన్నప్పుడు నేను పాలు పూర్తిగ గడ్డ కట్టేదాకా మరిగించే దాన్ని. అలాగ చేసినపాలు శేరు ఇచ్చినా అర్ధశేరే అని చెబుతూండేదాన్ని. ఇచ్చిన పాలెప్పుడు తక్కువగానే చెబుతూండేదాన్ని ఒకనా డాయన అది అంతా కనిపెట్టి "ఇదే మిటి? నీవు సర్వదా సత్యాన్నే ఆశ్ర యించాలి! చూడు, ఎక్కువగా పాలు తాగి నేనెలాగ జబ్బు పడ్డానో చూశావా?" అన్నారు. ఆ అభిప్రాయం ఆయన మనస్సులో ప్రవేశించగానే అజీర్ణరోగం రుగ్మత ఆయన శరీరంలో ప్రవేశించింది."

చిట్టచివరకి నేను మాతృదేవితో "అమ్మా, ఈ ప్రశ్నలంటే నా కేమాత్రము ఆసక్తిలేదు. నేనేమని అడిగినా అసలు నా లక్ష్యమే వేరు! నిన్ను నేను "అమ్మా, అని పిలుస్తున్నాను గదా! నిజంగా నీవు నా అమ్మవేనా?"

అమ్మ: లేకపోతే నేనింక ఎవర్ని? నిజం గానే నేను నీ స్వకీయ జనయిత్రిని.

నేను : నీ విలాగంటున్నా ఆ మాటల అర్థం నేను పూర్తిగా అవగాహన చేసుకోలేక పోతున్నానమ్మా ! నన్ను కడుపారా కన్నతల్లిని సహజంగా అమ్మగా గుర్తించ గలగడంలో ఆశ్చర్య మేమిలేదు! అయితే నిన్ను నేను అలాగ గుర్తించుకోగలనా ?

అమ్మ : నీ వన్నది నిజమే నాయనా ?

అలాగన్న తరవాత మరుక్షణంలోనే తిరిగి అన్నది.

అమ్మ : ఆ భగవానుడే జనని, జనకుడు. నాయనా ! ఆయన తల్లి దండ్రుల స్వరూపంతో స్వయంగా మనల నాదుకుంటాడు.

16, డిసెంబరు 1912 నేను సాక్షాత్కారాల మాట ఎత్తి ఆ సంగతి ప్రశ్నించాను.

నేను : అమ్మా ! ఏవేవో సాక్షాత్కారాలు కలిగాయని అంటూంటారు. అవన్ని కేవలము మానసికంగా సందర్శించినవా? లేక వాస్త వికంగా మన స్వకీయనేత్రాలతో యథార్థంగా సందర్శించవచ్చునా ?

అమ్మ : అవన్ని మానసికంగా కలిగేవే నాయనా ! కాని ఒకప్పుడు ప్రత్యక్షంగా నా కళ్లతో నే నొకటి చూశాను. కామార్పు కూరులో నే నొకప్పుడు పది పన్నెండేళ్ల వయస్సున్న బాలిక నొకదానిని చూశాను. ఆమె వయస్సు రాధు వయస్సు ఇంచుమించుగా ఒకటే. ఆ చిన్నది కుంకుమపువ్వు వన్నెదుస్తులు వేసుకున్నది. జుట్టంతా పొడిగా చిందర వంద రగా ఉన్నది. ఆమె మెడలో రుద్రాక్షమాల వేలాడుతూండేది. నేను ఎక్కడికి వెళ్లినా ముందుగాని వెనకగాని నడుస్తు వెంబ డిస్తూండేది.

ఆ తరవాత బేలూరులో నీలాంబరబాబు గృహంలో నేను పంచాగ్ని మధ్య తపశ్చర్య కొనసాగించాను. యోగిన్ మా కూడా అదే విధంగా తపస్సు చేసింది. ఆ తరవాత ఆ అమ్మాయి మరి కనిపించలేదు ! తిరిగి ఆ బాలిక నెన్నడు నేను చూడలేదు !

ఉద్బోధన కార్యాలయము. 11, ఫిబ్రవరి 1913.

నేను : అమ్మా, వివేకానందస్వామి ఎంద రెందరికో మంత్రదీక్ష అనుగ్రహించారు. నీవు కూడా అలాగే చేస్తున్నావు. బిచ్చగాళ్లైవ రయినావస్తే ఒక్కొక్కరికి రెండేసి రూపాయ లిచ్చి ఆపైన వారిసంగతే పూర్తిగా మరిచి పోవడంలా ఉంది ఈ మంత్రదీక్ష వ్యవహారం అంతాను.

అమ్మ : మంత్రదీక్ష కావాలని అర్థించేవా రనేకులున్నారు. వారినందరిని జ్ఞాపకం ఉంచు కోవడ మెలాగ? దీపం వెలిగించగానే చుట్టూరా పురుగులెన్నో గుమిగూడు తున్నాయిగదా! ఇదీ అంతే!

నేను : వారికి మంత్రోపదేశం జరుగుతుంది. అయితే అందువల్ల వారికి లాభించే దేమిఉంది ? మా బాహ్యదృష్టికి వారు కేవలము పూర్వం మాదిరిగానే కనిపిస్తారు.

దానిమీద అమ్మ ఇలాగ వివరించారు

అమ్మ : ఆ మంత్రంద్వారా గురువునుండి శిష్యునికి శిష్యునినుండి ఆచార్యునికి శక్తి ప్రవ హిస్తుంది. అందుచేత మంత్రదీక్ష ఇవ్వగానే గురువు శిష్యుని పాపాలన్ని స్వీకరిస్తాడు. ఆపైన గురువు ఆరోగ్యానికి భంగం కలుగుతుంది. కనకనే గురుత్వం చాలా కష్టంతో కూడుకున్న పని. మంత్రదీక్ష ఇచ్చిన గురువు శిష్యుని పాపాల కన్నింటికి బాధ్యత వహించివలసి ఉంటుంది......శిష్యుడేదయినా పాపకార్యం చేస్తే, దాని ఫలితం గురువు స్వీకరించవలిసిన ఆవశ్యకత కలుగుతుంది. ఒకవేళ శిష్యుడు సత్పురుషుడయితే అందువల్ల ఆచార్యునికి కూడా సత్ఫలితం కలుగుతుంది. —సశేషం.

# సోదరి నివేదిత

బి. ఎస్. ఆర్.

ప్రపంచమున అధికభాగము స్వసుఖమునే చూచుకొందురు. కొందరు స్వలాభమును కొంత త్యజించి యితరుల మేలు తలపెట్టు చుందురు. ఏ కొలది మందియో, కష్టములనే వరించి యితరుల మేలు తలపెట్టుదురు. ఈ కోవకు చెందినదే సోదరి నివేదిత. ఎక్కడనో ఐర్లెండులో పుట్టి, ఇంగ్లండులో పెరిగి, భారత దేశమునకే తన సర్వస్వమును ధారపోసిన విదుషీమణి సోదరి నివేదిత. అప్రతిహతమైన కార్యదక్షత, అకుంఠితమైన పట్టుదల, నిస్వార్థ సేవ, పరిపూర్ణమైన త్యాగము, – ఆమెయందు మూర్తీభవించినవి.

సోదరి నివేదితయని ప్రఖ్యాతినొందిన మార్గరెట్ నోబెల్ క్రీ.శ.28–10–1867న ఐర్లెండులోని టైరోమున, జన్మించెను. తండ్రి శామ్యూలు నోబెలు. అతడు, అతని తండ్రి ఐర్లెండు స్వాతంత్ర్యమునకై పోరాడిరి. ప్రొటస్టెంటు చర్చిలో బోధకులుగా పనిచేసిరి. నాల్గవ సంతానమైన మార్గరెటునకు, ఆధ్యాత్మిక రాజకీయ సంస్కారములు వారినుండియే సంక్రమించినవి. శామ్యూలు తన 34 వ యేటనే మరణించెను. అవసానసమయమున ఆయన భార్యతో యిటు చెప్పెను. "మార్గరెటునకు భగవంతుని పిలుపు వచ్చినప్పుడు ఆమెను పోనిమ్ము, ఆమె తన రెక్కలనుజాపి మహత్కార్యములు చేయును."

మార్గరెటు కళాశాలవిద్య ముగించుకొని ఇంగ్లండులో తన కిష్టమైన ఉపాధ్యాయవృత్తి నవలంబించెను. మొదట ప్రాథమిక పాఠశాలలో పనిచేసెను. తర్వాత యొక అనాథ శరణాలయములో పనిచేసి విద్యార్థులతో సమముగా కాయకష్టమొనర్చెను. తన 21 వ యేట ఉన్నతపాఠశాలలో చేరెను. ఆ సమయమున, విద్యాబోధతోపాటు, ఆ పట్టణ పరిసరములలోనున్న అనాథులను, పతితులను కని పెట్టి వారి సంక్షేమమునకై పాటుపడెను. చివరకు రాజధానీ నగరమైన లండను నగరమున తన 28 వ ఏట 'రస్కిన్‌స్కూలు' అనుపేర స్వంత విద్యాలయము నెలకొల్పెను. నూతన విద్యావిధానములలో కృషి సల్పెను.

లండనునగరము, ఆమెయందు దాగియున్న రాజకీయ, సారస్వత, విద్యావిషయికమైన అభిరుచులు అభివ్యక్త పరచుటకు, అవకాశమిచ్చెను. మొదట ఆమె అచ్చటి 'స్వాతంత్ర్య ఐర్లెండు' అను సంస్థలో సభ్యురాలయ్యెను. క్రమముగా, సుప్రసిద్ధ విద్యావేత్తలగు బెర్నార్డుషా, హక్స్లీవంటి మేధావులు చర్చలు సాగించిన 'సీసమిక్లబ్' అను సంస్థకు కార్యదర్శి యయ్యెను. 'శిశు మానసికవిధానము', 'స్త్రీ హక్కులు', అను విషయములపై ఆమె అచ్చట ప్రసంగములు చేసెను. ఈ విధముగా మార్గరెటు తన భావిభారత జీవితములో చేయవలసిన విధానములకు, వివేకానందస్వామిని దర్శించుటకుముందే పునాదులు వేసుకొనెను.

దైవవిధి దురూహ్యము. మార్గరెటు జీవిత విధానమునే పూర్తిగా మార్చివేయు సంఘటనలు యీ కాలమున సంభవించెను. తాను ప్రేమించి, వివాహముహూర్తముగూడ నిర్ణయించిన తర్వాత ఆ యువకుని ఇంకొక యువతి వివాహమాడెను. అంతకు క్రితమే మరియొక యువకుని వివాహమాడ సంసిద్ధమైనపుడు, ఆతడు క్షయవ్యాధికి గురియై అకాలమరణమొందెను. ఇట్లు గాయబడిన మార్గరెటు మనస్సు ఆధ్యాత్మిక విషయములవైపు మరలెను.

అమెరికాలో జగద్విఖ్యాతినొంది వివేకానందస్వామి యింగ్లండు వచ్చెను. ఆయనపేరు అన్నిచోట్లను చర్చింపబడెను. ఒక సంపన్నురాలి యింటియందు యేర్పరుపబడిన సమావేశమునకు మార్గరెటు హాజరయ్యెను. అదే ఆమె స్వామిని దర్శించుటకు మొదటిసారి. సంఘర్షణాయుతమును, స్వాతంత్ర్య పూరితమునగు ఆమె మనస్సు, స్వామి భావములను పూర్తిగా అంగీకరించలేకపోయెను. కాని ధ్యానసిద్ధుడైన స్వామి, ఆయన వాక్కులు, ఆమె నాకర్షించెను. తర్వాత ఆయన ఉపన్యాసములనన్నింటిని వినెను. ఆయనతో తర్కించెను. చివరకు ఆయన యింగ్లాండు వదలునప్పటికి ఆయనను తన గురువుగా అంగీకరించెను. 'భారతస్త్రీ సముద్ధరణకు నీవు తగిన వ్యక్తివని' ఆయన చెప్పినప్పుడు, సందిగ్ధస్థితిలోయున్న ఆమె మనస్సు ఒక నిర్ణయమునకు వచ్చెను. అది దివ్యాదేశముగా తలంచెను. భారతదేశమునకేగి తానా పని యొనర్పవలయునని తహతహలాడెను.

వివేకానందస్వామి మరల అమెరికా వెళ్లి భారతదేశమునకు తిరిగివచ్చితర్వాత మార్గరెటు తాను భారతదేశమునకువచ్చి తన జీవితమును స్వామి యుద్యమమునకు అంకితమొనర్తునని వ్రాసెను. వెంటనే స్వామి ఇట్లు వ్రాసెను.

'భారతదేశ కార్యములలో నీకు గొప్ప భవిష్యత్తున్నదని నాకు తెలియును. కావలసినది పురుషుడు గాదు, స్త్రీ. భారతస్త్రీలమధ్య పని చేయుటకు వీరనారీమణి కావలెను.

మార్గరెటు 28-1-1898న కలకత్తాచేరెను. స్వామి స్వయముగా హార్బరులో స్వాగతమిచ్చెను. గంగాతీరమున తనకై ఆయన యేర్పరచిన బసచూచి, తాను యింగ్లండులో వున్నదానికన్న గొప్పగాయుండుట గమనించి ముగ్ధురాలయ్యెను. మార్గరెటు రెండునెలలు, నూతనవాతావరణమునకు అలవడుచు, ప్రఖ్యాతులైన రవీంద్రనాథ టాగూరు, జగదీశచంద్రబోసు మొదలగువారి పరిచయమును పొందెను. శ్రీ రామకృష్ణుడు సాధన చేసిన దక్షిణేశ్వరాలయమును, ఆయన గదిని అమితభక్తితో దర్శించెను. ఆ సంవత్సరము బేలూరు మఠములో జరిగిన శ్రీ రామకృష్ణ జయంతిలో ప్రసంగించెను. 11-3-1898 న స్టారు థియేటరులో బహిరంగోపన్యాసము గావించెను.

మార్గరెటు జీవితములో అతి ప్రధాన సన్నివేశము శ్రీ శారదాదేవిని దర్శించుట. అది 17-3-1898 నాడుజరిగెను. దానినిగూర్చి మార్గరెటు వ్రాయుచు 'ఎంతో శాంతము, ప్రేమ గలది. చిన్నపిల్లవంటి ఉత్సాహము, యెంతో ఆచారపరాయణత. కాని మొదటిసారి తన ముందు యిరువురు పాశ్చాత్యవనితలనుచూచి నప్పుడు అదంతయు కరగిపోయెను.'

వివేకానందస్వామి 15-3-1898న మార్గరెటుకు శివపూజానంతరము బ్రహ్మచర్య దీక్ష యిచ్చి 'నివేదిత' యని నామకరణము చేసెను. నివేదిత, దీక్షానంతరము స్వామిజీతో ఆల్మోరా, అమరనాథము యాత్ర గావించెను. కదలియాడు సజీవ సర్వవిజ్ఞానసర్వస్వమగు స్వామి శిక్షణవలన ఆమె భారతీయచరిత్రను మతమును, సంస్కృతిని, వివిధదృక్పథములలో గ్రహించెను. తన సంస్కృతిని, తన మతమును, తన సర్వమును పూర్తిగా విస్మరించి, తన సర్వవ్యక్తిత్వమును భారతీయతలో లీనమొనర్చుకొనెను.

అమరనాథ్ నుండి వచ్చినతర్వాత నివేదిత స్త్రీ విద్యావిషయమై ఆలోచించసాగెను. శ్రీ మాతృదేవికి దగ్గరగా కలకత్తాలో తన నివాసమేర్పరచుకొనెను. పవిత్ర కాళీపూజాదినమున

స్వామిసమక్షమున ఒక పాఠశాలను స్థాపించెను. శ్రీ మాతృదేవి ప్రారంభోత్సవము గావించెను.

ఆ సమయములో కలకత్తాలో ప్లేగువ్యాధి సంభవించుటవలన పాఠశాలపని సాగలేదు. శ్రీ రామకృష్ణమిషను సాధువులతోగూడి నివేదిత యెంతో సేవచేసెను. తన ఆహారములో ముఖ్యభాగమైన పాలనుగూడ రోగులసేవకై వినియోగించెను.

1899లో వివేకానందస్వామి రెండవసారి పాశ్చాత్యదేశములకు వెళ్లినప్పుడు నివేదిత గూడ తన పాఠశాలకు ధనము సేకరించుటకై వెళ్లెను. అమెరికాలో క్రైస్తవ మిషనరీలు దుష్ప్రచారము గావించినను, ఆమె అనేక చోట్ల భారతదేశమునుగూర్చి ప్రభావితమైన ఉపన్యాసములు గావించెను.

పాశ్చాత్యదేశములనుండి ఆమె తిరిగివచ్చిన ఆరునెలలకే స్వామిజీ మరణించెను. తాను రెండురోజులకు సమాధి చెందుదుననగా ఆమెకు స్వామిజీ స్వయముగా భోజనమిడి ఆమె చేతులపై నీరుపోసి తువాలుతో తుడిచెను. అదే ఆమె ఆఖరుసారి ఆయనను దర్శించుట.

తన గురు నిర్యాణానంతరము పూర్తిగా పనిలో మునిగిపోయెను. స్త్రీవిద్యకై పాఠశాలను సాగించెను. ఇంటింటికి తిరిగి పిల్లలను పంపమని కోరెను. బెంగాలీ నేర్చుకొనెను. బోధనలో, కుట్టు, యింటిపని, వయోవిద్య, చరఖా (గాంధీజీ ఉద్యమమునకు చాలముందు) మొదలగునవి చేర్చెను. యీ పాఠశాల కాలక్రమేణ 'శ్రీ రామకృష్ణ శారదామిషన్' అను స్త్రీ మఠసంస్థకు పునాదియయ్యెను.

ఈ కార్యము లన్నింటిలో మునిగియున్నను ఆమె తన ఆధ్యాత్మికజీవనమును మానలేదు. నైష్ఠిక బ్రహ్మచారిణివలె మెలగుచు, నేలపై పరుండి, పాలు పండ్లుమాత్రమే భుజించుచు కఠిననియమముల పాటించెను. సామాన్యమానవులతో తాదాత్మ్యము చెంది అట్టి జీవితమే గడపెను.

'భారతదేశమునకు పట్టిన అరిష్టములు రెండు. ఒకటి స్త్రీల ననగద్రొక్కుట. రెండవది బీదలను కాలరాయుట' అని వివేకానంద స్వామి ఒక ఉపన్యాసమున చెప్పియుండెను. సోదరి నివేదిత యీ విషయమై తలపోసి భారతదేశమునకు స్వాతంత్ర్యము కలిగినగాని దేశము గోల్పోయిన వ్యక్తిత్వము తిరిగి లభింపదని గుర్తించెను. ఆ కారణమున, భారతదేశ స్వాతంత్ర్యమునకై నమకాలీన రాజకీయవేత్తలగు గోపాలకృష్ణగోఖలే, చిత్తరంజన దాసు, అరవిందఘోషు, విపినచంద్రపాలు, ఆర్. సి. దత్తు, రామానందఛటర్జీ మొదలగు వారందరి పరిచయము కలిగియుండెను. 1905 జూలైన, బెంగాలు విభజన జరిగి ప్రజలలో ఉద్రిక్తత యేర్పడెను. నివేదిత అనేక వ్యాసములను పత్రికలలో ప్రకటించెను. ఉద్రేకపూరిత ఉపన్యాసములు గావించెను.

సోదరి నివేదిత చేయుచున్నపని, ఆమె అనారోగ్యతవలన కుంటుపడెను. 1905 లో ఒకసారి జబ్బుపడెను. వరద, కరువుబాధితమైన తూర్పు బెంగాలులో 1906 లో పర్యటన గావించి మలేరియావ్యాధికి గురి అయ్యెను. 1907 లోను, 1910-11 మధ్యలో 6 మాసములు పశ్చిమదేశముల కేగెను. 1910 లో ఆమె కేదార్ నాథ్, బద్రీనాథ్ యాత్రసల్పి అందులో తాను గుర్తించిన కళాత్మక, చారిత్రాత్మిక విషయములనుగూడ గ్రంథస్థ మొనర్చెను.

విశ్రాంతియనునది లేక, ఆమె అవిరామ కృషి సల్పెను. 1911 లో శలవులలో డార్జిలింగు వెళ్లినప్పుడు, ఆమె అస్వస్థతకు

గురియై తన నలువదినాల్గవ సంవత్సరము పూర్తి గాకుండగనే 13-10-1911 న కన్నుమూసెను.

ఆ నాటి ప్రముఖులందరు ఆమె అకాల మరణమునకు యెంతో విచారము వ్యక్తపరచిరి. శ్రద్ధాంజలు అర్పించిరి. తమ సంతాపమును వ్యక్తపరచిరి. రవీంద్రనాథ టాగూరు యిట్లనెను. "ఆమెయందున్న ఆ అద్భుత సమర్పణాశక్తి, యే మానవమాత్రునిలోను నేను గుర్తించియుండలేదు. సోదరి నివేదిత మనకిచ్చిన జీవితము మహోన్నతము. ఆమె మన నుండి యేమాత్రము గైకొనక, భారతదేశ సేవలో తన సర్వస్వమును సమర్పించినది. తిన స్వప్రయోజనమునకే మాత్రము మిగుల్చుకొనలేదు."

"భారతదేశములోని ఎండిన యెముకలు చలింపసాగినవనినచో సోదరి నివేదిత వానికి పోసిన ప్రాణమే కారణము" అని డా॥ రాసబిహారిఘోషు అనెను. ఇదేవిధమైన అభిప్రాయములను మహాత్మాగాంధి, సురేంద్రనాథ బెనర్జీ, గోపాలకృష్ణగోఖలే మొదలగువారెందరో వకపరచిరి.

వివేకానందస్వామి ఒక ఉపన్యాసములో 'భగవంతుడు తప్ప నాకింకేమియు లేద'ని నడివీథిలో నిలచి చాటెడు ధైర్యముగల నిస్వార్థపరులు కొందరున్నచో ఈ ప్రపంచమంతటిని మార్చివేయవచ్చున'ని చెప్పెను. సోదరి నివేదిత యీ వాక్యములకు ప్రతిరూపము. తనదనునది లేక, వేదాంతమునకు, తన గురువునకు, తన అభిమానదేశమగు భారతదేశఉన్నతికి, భారత స్వాతంత్ర్యమునకు, తనను సమర్పించుకొనినది. ఆమె నడచిన మార్గమందలి ప్రతి అడుగునందు సమర్పణకన్న వేరులేదు.

డార్జిలింగులో ఆమె చితాభస్మముపై నిర్మించిన సమాధిపై లిఖించిన 'ఏ సాధ్వి తన సర్వస్వమును భారతదేశమునకు ధారపోసెనో, ఆ సోదరి నివేదిత యిచ్చట విశ్రమించుచున్నది' అనుదానికన్న ఆమెనుగూర్చి వర్ణించుటకు మాటలు చాలవు.

అహో! అతి గంభీరము, దురవగాహ్యము, విచిత్రము కదా ఈ మాయ! ప్రతి జీవుడు, వాస్తవముగా పరబ్రహ్మస్వరూపుడై యుండియు, శాస్త్రములచే, ఆచార్యులచే అట్లే బోధింపబడుచుండియు, 'నేను పరమాత్మను'-అని భావింపలేక పోవుచున్నాడు. పైగా 'నేను ఫలానావాని కుమారుడను'-అను భావమునకు కట్టుబడి, దేహేంద్రియాది సంఘాతమునే—అది ఘటపటాదులవలె దృశ్యమానమై యుండినను - ఆత్మగా గ్రహించుచున్నాడు. నిశ్చయముగా పరమేశ్వరుని మాయచే జీవుడు మోహముహ్యమానుడై ఇట్లు సంభ్రమించుచున్నాడు. ఈ మాయాప్రభావమునే 'నాహం ప్రకాశః సర్వస్య యోగమాయాసమావృతః'—అని భగవానుడున్ను గీతలో చెప్పియున్నాడు.

కఠోపనిషత్ శంకరభాష్యం : 13.1.2.

# పరీక్ష

## సదాశివం

సంస్కృత మహాభారతం ఆదిపర్వం మొదట్లోనే ఉన్నది ఈ ఇతివృత్తం.
తెనుగు మహాభారతంలో దీన్ని వెదక్కండి. ఇది అందులో లేదు.

ఆయోదధౌమ్యుడనే మహర్షికి, ఆరుణి, ఉపమన్యు, వేద – అను ముగ్గురు శిష్యులుండిరి. ఒకనాడు ప్రొద్దున గురువు ఆరుణిని పిలిచి, 'మన వరిపొలం కట్ట తెగిపోయిందట. నీవు వెళ్ళి దాన్ని కట్టిరా' – అని ఆజ్ఞాపించాడు.

ఉఱుకులపరుగులమీద ఆరుణి కేదార ఖండం (వరిపొలం) చేరుకొని తెగిపోయిన కట్టను కట్టడానికి ప్రయత్నించాడు. ఎంత ప్రయత్నించినా, ఎంతశ్రమపడినా దాన్ని కట్టడానికి సాధ్యపడలేదు. వరిపొలంలోని నీళ్లు ఒక ప్రవాహంగా బైటకు వెళ్ళిపోతూనేఉంది. ఆరుణి చాల అలసిపోయాడు. దీనికేమి ఉపాయం? అని కొంతసేపు ఆలోచించి, ఇదే ఉపాయం అని అడ్డంగా పడుకొన్నాడు – నీటిని బైటకు పోనీయకుండ.

సాయంకాలం కాగానే ధౌమ్యుడు శిష్యుల నడిగాడు: 'ఆరుణి ఎక్కడ? కనిపించడం లేదే!' అని. 'భగవానులేకదా ప్రొద్దున ఆజ్ఞాపించారు ఆరుణిని, కేదారఖండం కట్టి రమ్మని!' అని అన్నారు శిష్యులు. 'అవునవును, ఆ సంగతే మరచిపోయాను. ఏమైందో మఱి? మనం అందరం అక్కడికి వెళ్ళిచూస్తాం రండి' అని బయలుదేరాడు, గురువు.

కేదారఖండం దగ్గర శిష్యుడు కనిపించక పోయేసరికి, ఉపాధ్యాయుడు 'ఓ ఆరుణీ! ఓ ఆరుణీ! ఎక్కడున్నావు? నాయనా? ఇక్కడకురా' – అని గట్టిగా పిలిచాడు.

గురువు పిలుపు వినీవినగనే ఆరుణి తటాలున కేదారఖండంనుండి లేచి ఒక్కపరుగున గురువును చేరుకొన్నాడు. 'భగవాన్! మీరు ఆజ్ఞాపించినట్లే కట్ట కట్టడానికి నా శాయశక్తులా ప్రయత్నించాను. కాని మట్టిని త్రోసికొని నీళ్లు బైటకు పోతూనే ఉండినది. దాన్ని ఆపడానికి వేరే మార్గం కనబడక నేను ఇంతసేపు నీటికి అడ్డంగా పడుకొన్నాను. మీ కంఠం వినపడగానే పరిగెత్తుకొనివచ్చాను. ఇప్పుడు నేను చేయవలసిందేమిటో మీరు ఆజ్ఞాపించండి' అని చెప్పుచూ గురువు పాదాలకు నమస్కరించాడు.

ఉపాధ్యాయుడు అతడ్ని అతివాత్సల్యంతో వీక్షించి 'నాయనా నీవు నా ఆజ్ఞను చక్కగా పాలించావు. గురుభక్తి అంటే ఇదేకదా! సకల శ్రేయస్సులు నిన్ను వరించుగాక! సకల వేదాలు, ధర్మశాస్త్రాలు నీకు ప్రతిభాసించుగాక!' అని ఆశీర్వదించి స్వగృహం మరలుటకు ఆరుణికి అనుజ్ఞ ఇచ్చాడు.

ఆ తరువాత ఒకనాడు ధౌమ్యుడు రెండవ శిష్యుని పిలిచి 'ఉపమన్యూ! కొన్నాళ్ళు నీవు గోవులను సంరక్షించే పని చూడు!' అని ఆజ్ఞాపించాడు.

పగలంతా గోవులను మేపుతూ అరణ్యంలో గడిపి, సాయంకాలం కాగానే గోవులను మళ్ళించి గురుగృహం చేరాడు ఉపమన్యుడు. గురువుకు ఎట్టఎదుట నిలిచి నమస్కరించాడు. ఉపాధ్యాయుడు శిష్యుడ్ని చూచాడు. శిష్యునిలో నీరసం కనపడలేదు. లావుగానే ఉన్నాడు. బలంగాను దృఢంగాను ఉన్నాడు. 'ఉపమన్యూ, లావుగానూ దృఢంగానూ ఉన్నావు.

ఆహారనిర్వాహం ఏలా జరిగింది నీకీ రోజు?' అని అడిగాడు.

'జీవన నిర్వాహం నాకీ రోజు భైక్ష్య భోజనంతో జరిగింది –' అని బదులు చెప్పాడు శిష్యుడు.

'భైక్ష్యాన్ని గురువుకు నివేదించకుండ శిష్యులు భుజింపకూడదుకదా! కాబట్టి రేపటి నుండి నీవు "భైక్ష్యాన్ని" నాకు సమర్పించ కుండ భుజించరాదు.' అని శాసించాడు గురువు.

మరుసటిరోజు భిక్షాటనలో తనకు లభించిన భైక్ష్యాన్ని గురువుకు సమర్పించాడు ఉప మన్యుడు. దాన్నంతా గురువే స్వీకరించాడు. శిష్యుని కేమీ మిగిల్చి ఇవ్వలేదు.

ఆ తరువాత ఉపమన్యుడు యథాప్రకారం పశువులను తోలుకొని అరణ్యం ప్రవేశించాడు. సాయంకాలం అయినవెంటనే మరలివచ్చి గురువు సమ్ముఖంలో నిలబడి నమస్కరించాడు.

గురువు శిష్యుణ్ని చూచాడు. ఆశ్చర్యంతో అడిగాడు. 'నీ భిక్షాభోజనమంతా నేనే గ్రహిం చానుకదా! అయినా నీవు ఈ రోజున్నూ లావుగానే కనపడుతున్నావు. బలంగాను, దృఢంగాను, ఉన్నావు? ఈ రోజు ఆహార నిర్వాహం నీ కేలా జరిగింది?'

'భగవాన్! మొదట భిక్షాటనచేసి, లభిం చింది మీకు సమర్పించాను. రెండవసారి భిక్షా టనచేసి ఆ లభించిందాంతో ఈరోజు సరిపెట్టు కొన్నాను'– అన్నాడు శిష్యుడు.

'రెండుసార్లు భిక్షకుపోవడం న్యాయంకాదు. ధర్మంకాదు. గృహస్థులు వారు వండుకొన్న దానిలో కొంతభాగం భిక్షాజీవులకని అట్టే ఉంచుతారు. అందులో, రెండుసార్లు నీవు వెళ్ళి గ్రహిస్తే తక్కిన భిక్షాజీవులకు బాధ కలిగించ ట్లవుతుందికదా! ఇకమీదట అట్లా చేయకు' అని మందలించాడు గురువు.

మరునాడు సాయంకాలం యథాప్రకారం ఉపమన్యుడు గురువు ఎదుట నిలబడి నమస్కరిం చాడు. ఎప్పటివలె లావుగాను బలంగాను దృఢంగాను అతడు ఉండుట చూచి గురువు విస్మయంతో అడిగాడు. 'నీ భిక్షనంతా నేనే తీసుకొంటున్నాను. రెండవసారి భిక్షకు నీవు వెళ్ళడం లేదు. కాని లావుగానే ఉన్నావు. దృఢంగాను బలంగాను ఉన్నావు. ఎట్లా జరుపు కున్నావు ఈ రోజు?'

'భగవాన్! ఈ ఆవులపాలు త్రాగి ఈ రోజు జీవననిర్వాహం సరిపెట్టుకొన్నాను' – అన్నాడు ఉపమన్యుడు. 'రామ రామ! నిన్ను ఆవులను మేపమన్నానా? ఆవుపాలను త్రాగ మన్నానా? యజమాని అనుమతిలేకుండ, యజ మానియొక్క గోవులపాలు త్రాగుట చౌర్యం తో సమానంకదా! ఇది నీకు న్యాయంకాదు. ధర్మంకాదు. ఇకమీదట అలా చేయకు' – అని శాసించాడు గురువు.

మరునాడు సాయంకాలం తనపని ముగించు కొని గురువు సమ్ముఖంలో నిలబడి నమస్క రించాడు ఉపమన్యుడు. అతణ్ని చూసి గురువు అన్నాడు, 'నీ భైక్ష్యమంతా నేనే గ్రహిస్తు న్నాను. రెండవసారి భిక్షకు నీవు పోవడంలేదు. ఆవులపాలు త్రాగడంలేదు. కాని యథా పూర్వంగానే లావుగా ఉన్నావు, బలంగాను దృఢంగాను ఉన్నావు. ఎట్లా జరుపుకొన్నావు ఈ రోజు?'

'భగవాన్! తల్లులపాలు త్రాగే సమ యంలో ఈ దూడలనోటినుండి నురుగు బైట పడుతూ ఉంటుంది. నేను దాన్ని ఉపయోగించి ఈ రోజు సరిపెట్టుకొన్నాను' – అన్నాడు శిష్యుడు.

'నాయీ పసిదూడలది చాల మంచి స్వభావం. నీ మీదగల దయతో అవి అధికంగా నురుగు వెళ్ళగక్కుచుండవచ్చు. నీవు ఆ నురుగు త్రాగుతూఉంటే ఈ పసిదూడలకు ఉపరోధం కలిగించి నట్లవుతుంది. కాబట్టి ఇక మీదట నీవు నురుగును ఉపయోగించరాదు'– అని శాసించాడు గురువు.

మఱునాడు ఉపమన్యుడు పశువులను తీసుకొని అరణ్యం ప్రవేశించాడు. ఆహార విషయంగా గురువుచే అన్ని వైపులనుండి ప్రతిషేధింపబడినందువలన అతడారోజు భిక్షాన్నం తినలేదు, రెండవసారి భిక్షకు వెళ్ళలేదు, ఆవుపాలు త్రాగలేదు, నురుగును ఉపయోగించలేదు.

కాని కొంతసేపటికి ఉపమన్యుడు ఆకలిచే పీడింపబడి, ఆ బాధ సహించలేక అక్కడ కంటికి కనబడిన 'అర్కపత్రాలను' భక్షించాడు. ఆ అర్కపత్రాలు–క్షార, తిక్త, కటు, రూక్ష, తీక్ష్ణగుణాలు గలవి గనుక, వాటిని భక్షించడంవలన ఉపమన్యుని ఉదరంలో దారుణ పరిణామంకలిగి, పర్యవసానంగా 'చూపు' నష్టమై, అతడు అంధుడైపోయాడు. అంధుడైపోయినా, ఒకచోట కూర్చొనిఉండక అటు ఇటు తిరుగుతూ ఒక కూపంలో పడిపోయాడు.

సూర్యుడు అస్తమించినా ఉపమన్యుడు కనబడకపోయేసరికి ధౌమ్యుడు శిష్యుణ్ణి అడిగాడు 'ఉపమన్యుడెక్కడ? ఇంకా రాలేదా?' అని. 'గోవులన్నీ వచ్చిచేరాయి. ఉపమన్యుడు మాత్రం ఇంకా అడవినుండి తిరిగి రాలేదు'– అన్నాడు శిష్యుడు.

'ఆహారవిషయంలో ఆ అమాయకుని అన్ని వైపులనుండి ప్రతిషేధించాను. నిశ్చయంగా వానికి నా మీద కోపంవచ్చి ఉంటుంది, అందుకే ఇంత ఆలస్యమైనా వాడు రాలేదు. మనం వెళ్ళి వాణ్ణి అనునయించి పిలుచుకొని వస్తాం. పద' అని ధౌమ్యుడు అరణ్యానికి వెళ్ళి అక్కడ 'ఓ ఉపమన్యూ! ఓ ఉపమన్యూ! ఎక్కడున్నావు? అని గట్టిగా పిలిచాడు.

ఉపాధ్యాయుని కంఠం ఉపమన్యునికి వినపడింది. 'భగవాన్! ఇక్కడ ఈ కూపంలో పడిఉన్నాను' అని గట్టిగా బదులు పలికాడు. 'కూపంలో ఎట్లా పడిపోయావు' అని గురువు అడిగాడు. ఆకలివల్ల అర్కపత్రాలు భక్షించాను. ఆ తరువాత నాకు 'చూపు' నష్టమైంది. ఈ కూపంలో పడిపోయాను! అని జవాబిచ్చాడు శిష్యుడు.

ధౌమ్యుడదివిని కరుణార్ద్ర స్వరంతో ఇట్లా అన్నాడు: 'నాయనా! నీవు అశ్వినులను స్తుతించు. వారు దేవలోకవైద్యులు. నీ కన్నులను బాగుజేయగలరు. నిన్ననుగ్రహించగలరు.'

గురువు ఆదేశానుసారం ఉపమన్యుడు, శ్రద్ధాభక్తులతో అశ్వినుల స్తుతి ప్రారంభించాడు.

ప్రపూర్వగౌ పూర్వజౌ చిత్రభానూ
గిరా వా శంసామి తపనావనంతౌ
దివ్యౌ సుపర్ణౌ విరజౌ విమానా
వధిక్షియంతౌ భువనాని విశ్వా.

అశ్వినీకుమారులారా! మీరు ఈ విశ్వ సృష్టికి పూర్వమునుండియే ఉన్నటువంటివారు. అందరికిని మీరే పెద్దవారు. అనంతులై ప్రకాశించుచున్న మిమ్ములను ఇప్పుడు నా వాక్కులతో స్తుతించుచున్నాను. దివ్యమైన రూపసంపదగలవారు మీరు. ఎడబాయక ఎప్పుడూ జంటగా ఉండువారు మీరు. రజోగుణ తమోగుణ శూన్యులైన శుద్ధాత్ములు మీరు. అభిమానదోషము లేనివారు మీరు. సకల భువన

ములకు ఆరోగ్యమును విస్తరింపజేయుచు సదా సంచారము చేయువారు మీరు.

ఉపమన్యు ఈ విధంగా స్తుతిని ప్రారంభించి మొత్తం పన్నెండు ఋక్కులలో స్తోత్రం చేశాడు. చివరి మంత్రం ఇది.

స్తోతుం న శక్నోమి గుణైర్భవంతౌ
చక్షుర్విహీనః పథి సంప్రమోహః
దుర్గేఽహమస్మిన్ పతితోఽస్మి కూపే
యువాం శరణ్యౌ శరణం ప్రపద్యే.

అశ్వినీకుమారులారా! మీ గుణగణములను స్తుతించుటకు నాకు సాధ్యము కాకపోవుచున్నది. అంధుడనై మార్గములో నడచు వివేకమును కోల్పోయి, దుర్గమమైన ఈ కూపములో పడిపోయితిని. శరణాగత వత్సలులైన మీరే నన్ను ఉద్ధరించగల సమర్థులు. అట్టి మహిమాన్వితులైన మిమ్ములను నేను శరణు జొచ్చుచున్నాను.

స్తుతిచే సంతుష్టులై అశ్వినీకుమారులు ఉపమన్యునకు దర్శనమిచ్చారు. 'హే ఉపమన్యూ! నీయందు మాకు అధికమైన ప్రీతి కలుగుచున్నది. ఇదిగో నీకొఱకు ఈ అపూపమును (భక్ష్యవిశేషము) తెచ్చితిమి, భక్షింపుము' అని సానునయంగా అన్నారు.

'భగవానులైన మీరు పలుకునదంతయు సత్యమై తీరవలసిందే. కాని నేనీ అపూపమును మా గురువుకు నివేదించక భక్షించలేను.' అన్నాడు ఉపమన్యుడు.

దానికి అశ్వినీదేవతలు ఇలా అన్నారు. 'పూర్వం ఒకప్పుడు మీ ఉపాధ్యాయుడైన ధౌమ్యుడున్ను మమ్ములను ఇట్లే స్తుతించాడు. మేము పరితుష్టులై అప్పుడతనికిని ఇట్లే అపూపమును ఇచ్చితిమి. అతడు దానిని గురువుకు నివేదించక తానే స్వయంగా భక్షించాడు. గురువు నడచుకొన్నట్లే శిష్యులున్ను నడవాలికదా! కాబట్టి నీవు దీనిని గురువునకు నివేదించకయే భక్షించవచ్చు. దోషమేమీ లేదు.'

'అశ్వినీకుమారులారా! మిమ్ములను వేడుకొనుచున్నాను. నన్ను దీనిని తినమని నిర్బంధింపకుడు. గురువునకు నివేదించక తినుటకు నేను సాహసించలేను. ఈ విషయమున నన్ను మీరు క్షమించవలసినది' అన్నాడు ఉపమన్యుడు.

ఉపమన్యుని గురుభక్తిని చూచిన అశ్వినీకుమారులకు చాల ఆనందం కలిగింది. ప్రసాదభరితులై అతనికి దృష్టిని ప్రదించారు. అతని దంతములు సువర్ణమయములగునట్లును వరం ఇచ్చారు. సకల శ్రేయస్సులను పొందగలవనియు ఆశీర్వదించి అంతర్ధానులైనారు.

లబ్ధచక్షుడైన ఉపమన్యుడు గురువున్న చోటకు వేగంగా వెళ్లి నమస్కరించాడు. జరిగిన సంగతి గురువుకు విన్నవించాడు. ధౌమ్యుడు అమితానందంపొంది శిష్యుని అప్యాయంగా చూచి 'వత్సా! అశ్వినీకుమారులు ఆశీర్వదించినట్లే నీవు సకల శ్రేయాలను పొందగలవు. సకల వేదాలు, ధర్మశాస్త్రాలు నీకు ప్రతిభాసించగలవు. నేను నీకు అనుమతి ఇస్తున్నాను. ఇక నీవు స్వగృహానికి మరలవచ్చు.'

ఇట్లా సమాప్తమైంది పరీక్ష, ఉపమన్యునకు.

ఆ తరువాత మూడవ శిష్యుడైన 'వేద'ను చూచి గురువు అన్నాడు. 'నాయనా! నీ సహాధ్యాయులు ఇరువురున్ను వెళ్ళిపోయారు, వాళ్ళ గృహాలకు. వాళ్ళు చేస్తూండిన పనులు చేయడానికి ఇప్పుడెవరున్నారిక్కడ? నీవు తప్ప. కాబట్టి కొన్నాళ్ళు నీవు ఇక్కడే నిలువు. నాకు సహాయంగా ఉంటుంది. నీకున్ను శ్రేయస్సు నిశ్చయంగా కలుగుతుంది.'

గురువు ఆదేశించినట్లే 'వేద' దీర్ఘకాలం అక్కడే గురు శుశ్రూషణాపరుడై ఉండి పోయాడు. గురువుయొక్క కార్యభారాన్నంతా 'వేద'యే విసుగు విరామం లేకుండ మోయుచుండెను. శీతోష్ణాలు, ఆకలిదప్పులు – ఇత్యాది దుఃఖాలను సహిస్తూ సర్వదా గురు సేవా తత్పరుడైయుండెను. 'వేద' ఇట్లు గురువుకు మిక్కిలి అనుకూలుడై గురుకులవాసం చేయుచుండగా, దీర్ఘకాలానంతరం ధౌమ్యుడు అతణ్ణికూడ ఆశీర్వదించి స్వగృహం మరలుటకు అనుమతి ఇచ్చాడు. గురువునకు పరితోషం కలిగించిన 'వేద' కూడ సకల శ్రేయస్సులు పొందాడు. సర్వజ్ఞుడున్ను అయ్యాడు.

ఆ తరువాత 'వేద' గృహస్థాశ్రమంలో ప్రవేశించాడు. స్వగృహంలో సుఖంగా వాసం చేస్తుండిన 'వేద'నుకూడ ముగ్గురు శిష్యులు ఆశ్రయించారు. 'వేద', తన శిష్యులను 'ఈ పని చెయ్యి, ఆ పని చెయ్యి, ఈ సేవ చెయ్యి, ఆ సేవ చెయ్యి' – అని ఒక్క మాటకూడ చెప్పేవాడు కాదు. గురుకులవాసంలోని శ్రమ, దుఃఖం బాగా తెలిసినవాడు, అనుభవించినవాడు కాబట్టి శిష్యులను ఏ కొంచమైనను పరిక్లేశం పాలు చేయడానికి అతని మనస్సు అంగీకరించ లేదు.

మృత్యువునకు రెండు రూపములు. ఒక రూపముతో వస్తు నష్టమును, ధన నష్టమును కలిగించును. మఱియొక రూపముతో ప్రాణ నష్టమును కలిగించును. ఈ రెండు రూపములతోను మృత్యువు, ఆ రాత్రి ఆంధ్రదేశసాగర ప్రాంతములందు రౌద్రవిహారముచేసి, నందనవనముగా ఉండిన ఆ ప్రాంతమును ఒక పెద్ద శ్మశాన వాటికగా మార్చివేసెను.

ఊహించుటకైనను భయమును కలిగించు ఆ కష్టనష్టములను సాక్షాత్తుగా అనుభవించి క్రుంగిపోయియున్న ఆ దీన ప్రజానీకమునకు మా గాఢ సంతాపమును, సానుభూతిని తెలియజేయుచున్నాము.

విష్ణువుయొక్క అంశయే, ప్రభుత్వయంత్రాంగమని ఒక నమ్మకము. అట్టి ప్రభుత్వయంత్రాంగపు కృషివలన, విషమించిన ఆ పరిస్థితులు త్వరలో అక్కడ చక్కబడగలవని ఆశించుచున్నాము.

# శివానందస్వామితో సంభాషణలు

క్రీ. శ. 1922 న శ్రీ శివానందస్వామి ఢాకాకు వెళ్ళినప్పుడు మఠమువారు ఒకనాటి సాయంకాలము ఒక సభ ఏర్పాటు చేసియుండిరి. అందు భక్తులనేకులు మఠములోని సన్న్యాసులు, బ్రహ్మచారులు సమావేశమై యుండిరి.

''మనోభ్రమరమా! రామకృష్ణుని చరణ సరోజముల నాశ్రయింపుము'' అను గానముతో సభ ప్రారంభమైనది. తర్వాత 'శ్రీ రామకృష్ణ కథామృతము' చదువవలసిట్లుగా నిర్ణయింపబడి యుండినను సభికులందరును స్వాములవారి ఉపదేశము విన అమితోత్సాహము ప్రకటించిరి. కాని స్వాములవారి ఇచ్ఛానుసారము మొదట 'కథామృత' పఠన ప్రారంభమైనది.

అందు ఒక్కచోట శ్రీ రామకృష్ణుడు సన్న్యాసజీవనమందలి కఠోర నియమములను గురించి ప్రసంగించుచు, 'సన్న్యాసులు స్త్రీల చిత్రపటము సహితము వీక్షింపరాదు' – అని పేర్కొనియుండెను.

ఆ సమయమున ఒక బ్రహ్మచారి స్వాముల నిట్లు ప్రశ్నించెను. 'స్వామీ! స్త్రీల చిత్రపటము సహితము సన్న్యాసులకంట పడరాదని ఠాకూరు పేర్కొనియున్నారు. కాని మేము మా నానావిధకర్తవ్యముల నెరవేర్చవలసి యున్నప్పుడు స్త్రీలతో మాట్లాడవలసికూడ వస్తున్నది. ఇట్టి సందర్భములందు మేమేవిధముగా నడచుకొనవలెను?'

స్వామి కొంతసేపు మౌనముగా ఉండి తర్వాత ఇట్లనెను. ''చూడు నాయనా! నీకు ఇంట, అమ్మ, అక్కచెల్లెండ్రు ఉండలేదేమిటి? వారివద్ద నీ వెట్లు సహజముగా కలిసి మెలసి మెలగుచుంటివో, అదే మనోభావముతో ప్రయోజనానుసారముగా స్త్రీలవద్ద మాట్లాడుము. వారు నీ స్వంత తల్లులనీ, అక్కచెల్లెండ్రనీ మనస్సున భావింపుము. అవశ్యము, విశేష ప్రయోజనము లేనిదే స్త్రీలవద్ద, వారు భక్తులైనను – విశేషముగా నిర్జనస్థలములో – మాట్లాడకుండు టే మంచిది. ఐదుమంది సమక్షములో కార్యకలాపముల విషయముగా మాట్లాడవచ్చును. సన్న్యాసులగుటకు వచ్చియున్న మీరు, స్వలాభాపేక్షను వదలి, మీ ఆదర్శముపట్ల సర్వదా దృష్టినుంచి మెలగవలయును. మహిళలను సాక్షాత్తు జగన్మాత అంశములని గ్రహింపవలెను. ఇదియే సాధన!'

బ్రహ్మచారి: అట్లు నడచుకొన్నప్పుడు కూడ మనస్సులో చెడు తలంపులు వచ్చిన ఏమి చేయాలి మహరాజ్?

స్వామి తదుత్తరముగా కొంత గంభీరముగా అనిరి. ''ఎక్కడి కక్కడ స్త్రీలను చూచినదే తడవుగా ఎవరి మనస్సులందు చెడు తలంపులు ఉదయించునో, వారు సన్న్యాసులగుటకు మాత్రమే కాదు, ఈ సమాజములో ఉండుటకు కూడ అర్హులు కారు. అట్టివారు స్త్రీలే కంట పడని, స్త్రీల సంచారమే లేని ఏ నిర్జన స్థలానికో వెళ్ళి దీర్ఘకాల కఠోరతపస్సుతో వారియందలి పశుప్రవృత్తిని సంపూర్ణముగా ధ్వంసము చేసి కొన్నతరువాతనే సమాజములోనికి తిరిగి వచ్చుట ఉచితము. సమాజము నందుకూడ నీతినియమము లున్నవికదా!''

మరి కొంతసేపు 'కథామృతము' చదువబడినది. తర్వాత భక్తుడొకడు 'భగవత్సాక్షాత్కారమునకు ప్రకృష్టమార్గమేది స్వామీ?' అని ప్రశ్నించెను.

స్వామి: శాస్త్రములందు భగవత్సాక్షాత్కారమునకు నానావిధ సాధనలు ఉపదేశింపబడియున్నవి. కాని చరమ సందేశమన్నచో— శరణాగతి! శరణాగతి! శ్రీ భగవానుని చరణసన్నిధిన ఆత్మనివేదన, సర్వతోముఖ శరణా

గతులతో పడియుండ జాలినచో, ఎట్టి చింతయు లేదు. గీతలో అర్జునునకు కర్మ, భక్తి, జ్ఞాన, యోగములను ఉపదేశించిన భగవానుడు, చిట్టచివర ''సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ! అహంత్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః॥'' అని ఉపదేశించెను. ఇదియే సమగ్ర గీతాసారము. ప్రతిజ్ఞచేసి భగవానుడు చెప్పెను.

కాని భగవంతునిపట్ల సర్వతోముఖ ఆత్మ నివేదన, శరణాగతి ఒకేరోజున రాదు. ఇది చాల కఠినమైన కార్యము. పూజాపఠనలు, ధ్యానజపములు, కఠోరసాధనలు – ఇవన్నియు ఒక్క 'శరణాగతి'ని సాధించుటకు మాత్రమే! వీటికంతకూ మించి కావలసినది – ఈశ్వరకృప. అవ్యభిచారబుద్ధితో ఆతని ధ్యానమననములు, ప్రార్థనలు చేసుకొనుచు వెళ్ళినపుడు ఆతడు కృపతో ఆ దుర్లభశరణాగతిని ప్రసాదించును.

మఱియొకప్పుడు ఢాకా మఠమునకు చెందిన ఒక సన్న్యాసి శోకగ్రస్త హృదయముతో స్వామిని సమీపించి ఇట్లు విన్నవించుకొనెను. '''ఎన్ని పనులున్ననూ, ప్రాతః సంధ్యా సమయములందు జపముచేయుట మాత్రము మరువకు'మని శ్రీ బ్రహ్మానంద స్వామివారు నాకు ఆదేశించియుండిరి. కాని నా పని ఎటువంటిదనగా – ఉపన్యాసములు, భజన మున్నగునవి కొనసాగింప వారమున ఐదు రోజులు సాయంసమయమున బయటికి వెళ్ళవలసియున్నది. సంధ్యాసమయమున జపము చేయుటకు తీరిక లభించుటలేదు. అందుచే మనస్సున అత్యంతము అశాంతి ఏర్పడియున్నది ''

స్వామి: చూడుము! ఆ చేయు ఉపన్యాసములు, భజన మున్నగువానిని జపధ్యానముల వలె ఒక సాధనయని గ్రహించి చేయుము. శ్రీ భగవానుని నామసంకీర్తనము, ఆయనను గుఱించిన ఉపన్యాసములు, ఆలోచన ఇవన్నియు ఆధ్యాత్మసాధనలోని అంశములే! నీవు సర్వదా ఆయన కార్యమునే కొనసాగించుచున్నావని ప్రతిక్షణము మనస్సున భావించుకొనుము. ఈశ్వరారాధనగా చేయు కర్మవలన పరమ శ్రేయస్సు లభించును. ఉపన్యాసములు మున్నగునవి అయినతర్వాత సమయ ముండినపుడెల్ల నియమిత జపధ్యానము లాచరింప ఉద్యుక్తుడవగుము అంతగా కానిచో నిద్రించుటకు పూర్వమైనను నియమిత జపము ఆచరించుటయే శ్రేయము. శ్రీ బ్రహ్మానందస్వామి వారి ఆదేశమును అక్షరాల పాటింపవలసినదే సుమా!

భక్తుడొకడు స్వామిని ప్రశ్నించెను. ''దారమునందలి చిక్కుపడినను సూదిన దూరనట్లు, విషయ వాసనలు లేశమాత్రము శేషించియున్నను భగవత్సాక్షాత్కారము సాధ్యపడదని శ్రీ ఠాకూరు చెప్పువారు. కాని, మా మనస్సులన్నో అసంఖ్యాక విషయవాసనలతో నిండియున్నది. అట్టి మాకు తరుణోపాయమేమి ?''

స్వామి కొంతసేపు మౌనము వహించి తర్వాత ఇట్లనిరి ఉపాయమున్నది, చిత్తమనెడు దారమును భక్తి విశ్వాసములనెడు తైలముచే తడిపి, విషయవాసనలనెడు పోగుల నన్నిటిని చక్కగా ఒక్కటిగా చేర్పించినపుడు, చిత్తము అనాయాసముగా భగవానుని పాద పద్మములందు లగ్నమగును. పరమ వ్యాకులతతో ఆయనను ప్రార్థింపుము. విలపించుచు నీ హృదయ పరితాపమును ఆయనకు ఎఱిగింపుము – ఆశ్రిత వత్సలుడగు ఆయన తన శరణాగతుల నెప్పుడును త్యజింపడు.

# తపస్సు

## రామదేవానంద

శ్రీ రామచంద్రుడు దండకారణ్యంలో శరభంగాశ్రమానికి వెళ్ళినప్పుడు, ఆయన్ను దర్శించడానికి, నానారకాలైన తపస్సులు చేస్తుండిన మునులు, గుమిగూడి అక్కడికి వచ్చారు.

వారిలో కొందరు, దేహం లోపలిభాగాన్ని నీటిచే బాగుగా కడుగుకొనుచుండుటయే తపస్సుగాకలవారు (సంప్రక్షాళురు). మరికొందరు, పగటివేళ సూర్యకిరణాలను, రాత్రివేళ చంద్రకిరణాలను త్రాగనేర్చియుండి, అదియే తపస్సుగా జీవించియుండువారు (మరీచపులు). మరికొందరు, దేహాన్ని మాటిమాటికి రాళ్ళతో కొట్టుకొనుటయే తపస్సుగాగలవారు (అశ్మకుట్టులు). మరికొందరు, ఆకులను మాత్రమే భుజించుటయే తపస్సుగాగలవారు (పత్రహారులు). మరికొందరు, పొట్టుగల ధాన్యములైన వడ్లు మొ॥ వానిని దంతములతో నమిలి పొట్టును విడిచి ఆ గింజలను మాత్రమే ఆహారముగా గ్రహించుటయే తపస్సుగాగలవారు (దంతోలూఖలినులు). మరికొందరు, కంఠములోతు నీటిలో నిలిచి ఉండుటయే తపస్సుగాగలవారు (ఉన్మజ్జకులు). మరికొందరు, తలను బొమ్మమీదనో, భుజముమీదనో మాత్రమే ఉంచి నిదురించుట అనునది తపస్సుగాగలవారు (గాత్రశయ్యులు). మరికొందరు, నిదురించకుండ సదా జాగరూకులై ఉండుటయను ప్రయత్నమే తపస్సుగాగలవారు (అశయ్యులు). మరికొందరు, ఎండను, వానను, గాలిని, చలిని - అన్నిటినీ సహిస్తూ బయలున ఉండుటయే తపస్సుగాగలవారు (అభ్రావకాశకులు). మరికొందరు, నీటినిమాత్రమే ఆహారముగా గ్రహించి జీవించుటయే తపస్సుగాగలవారు (సలిలాహారులు). మరికొందరు, వాయువును మాత్రమే ఆహారముగా గ్రహించి జీవించుటయే తపస్సుగలవారు (వాయుభక్షులు). మరికొందరు, అనాధారముగా ఆకాశములో ఉండనేర్చి అట్లు ఉండుటయే తపస్సుగాగలవారు (ఆకాశనిలయులు). మరికొందరు వట్టినేలపై సదా పడుకొనియుండుటయే తపస్సుగాగలవారు (స్థండిలశాయులు). మరికొందరు, చీటికి మాటికి వ్రతములనుపూని ఉపవసించుటయే తపస్సుగాగలవారు (వ్రతోపవాసులు). మరికొందరు, ఎప్పుడూ తడిబట్టలను కట్టుకొనియుండుటయే తపస్సుగాగలవారు (ఆర్ద్రపటవాససులు) మరికొందరు, ఎప్పుడూ జపము చేయుటయే తపస్సుగాగలవారు (సజపులు). మరికొందరు, గ్రీష్మఋతువులో పంచాగ్నుల మధ్యనుండుటయే తపస్సుగాగలవారు (పంచతపోన్వితులు).

ఈ విధంగా ఎన్నో చిత్రవిచిత్రమైన కఠోర తపస్సులను ఆచరించేవారిని గురించి మనము వినియున్నాము. పురాణాలల్లో చదివియున్నాము: ఒంటికాలిమీద సదా నిలిచియుండడం, సదా చేతులనెత్తి పట్టుకొనియుండడం - ఇత్యాదులును.

వేలాదిభక్తుల చరిత్రల్లో, యోగుల చరిత్రల్లోకూడ ఇటువంటి కొన్ని అసాధారణమైన తపస్సులనుగుఱించి మనము చదివియున్నాము. బుద్ధునికి సమకాలీనుడైన 'అజితకేశకంబళి' అనునాతడు ఎప్పుడును కేశములచే తయారు చేయబడిన బట్టలనే ధరించెడివాడట! కేశములచే తయారైన బట్టలను ధరించుటకూడ కఠోరమైన తపస్సే. ఆ బట్టలు, వేసవికాలంలో ఎక్కువ వేడిని, చలికాలంలో ఎక్కువ చలిని కలిగించి దేహాన్ని నొప్పించే సామర్థ్యం కలవి.

పురాణాల ప్రభావంవలన, ఈ భక్తుల యోగుల కథలవలన 'తపస్సు' ను గుఱించి

ఒక తప్పు అభిప్రాయం ప్రజలలో బాగా నాటుకొనిపోయింది. 'తపస్సు' అనగా అదేదో ఒక అసాధారణచర్యగా, అసాధ్యమైనదిగా, అనుపయోగమైనదిగా, అసహజమైనదిగా – ఒక 'అపోహ' ప్రజలలో బాగా వ్యాపించియున్నది.

మన జీవితలక్ష్యాలను, ఆదర్శాలను, ఆశయాలను సాధించడానికి ఉత్తమోత్తమసాధనం తపస్సే కనుక ఈ 'తపస్సు' విషయంలో అపోహలను, అపార్థాలను ఎంతత్వరగా తొలగించుకొంటే అంత మంచిది.

తైత్తిరీయోపనిషత్ భృగువల్లిలో, భృగువు తన తండ్రియైన వరుణుని మాటిమాటికి ప్రార్థిస్తాడు 'అధీహి భగవో బ్రహ్మ' 'అధీహి భగవో బ్రహ్మ' (బ్రహ్మనుగురించి చెప్పండి, బ్రహ్మనుగురించి చెప్పండి) అని. కుమారుడట్లా అడిగినప్పుడల్లా 'తపసా బ్రహ్మ విజిజ్ఞా 'తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ' (తపస్సుచే బ్రహ్మను తెలిసికో, తపస్సుచే బ్రహ్మను తెలిసికో) అని వరుణుడు బదులు చెప్పాడు.

బ్రహ్మను ఎలా తెలిసికోవడం? బ్రహ్మను తెలిసికోవాలంటే అజ్ఞానాన్ని తొలగించాలి. అజ్ఞానం ఎలా తొలగుతుంది? జ్ఞానంచేతనే తొలగుతుంది. జ్ఞానం ఎట్లా కలుగుతుంది? సత్త్వాధిక్యాన్ని సంపాదిస్తే కలుగుతుంది. సత్వాధిక్యం ఎలా కలుగుతుంది? తమోగుణము, రజోగుణము అణగద్రొక్కబడినపుడు కలుగుతుంది. తమోగుణమును, రజోగుణమును అణగద్రొక్కుట ఎట్లా? తపస్సుచే.

ఈవిచారంవలన మనం తెలిసికొన్నదేమిటి? ఈ విచారం వలన మనం తెలిసికొన్నది, తమో రజోగుణాలను మర్దించుటకు, అణగద్రొక్కుటకు తపస్సు ఉద్దేశింపబడినదని. తపస్సుకు ఈ మహాత్మ్యం ఉన్నది గనుకనే భృగువు, తపస్సు చేసి తపస్సుచేసి ఒక్కొక్క మెట్టుగా అధిరోహించి చివరకు బ్రహ్మను (ఆత్మస్వరూపాన్ని) తెలిసికొంటాడు.

తపస్సును గురించిన అపార్థాలు, అపోహాలు, ఊహాగానాలు తొలగిపోవాలంటే గీతలో పదునేడవ అధ్యాయంలో కృష్ణుడు చెప్పిన మూడు శ్లోకాలను స్మరించుకొనవలెను. అక్కడ కృష్ణుడు చెప్పిన తపస్సు, మన నిత్య జీవితంలో ప్రతిక్షణం ఆచరణలో పెట్టుటకు తగినంత సాధ్యగుణములు కలిగియున్నది. శారీరతపస్సు, వాఙ్మయతపస్సు, మానస తపస్సు – అని మూడు విధములుగా తపస్సును విభజించి వివరించియున్నాడు శ్రీకృష్ణుడు.

శారీర తపస్సు :

శరీరసుఖాన్ని లక్ష్యపెట్టక, సాధ్యమైనంత వరకు మన పనులను మనమే చేసికోవడం. అంటే మన గుడ్డలను, గదులను, పరిసరాలను మనమే స్వయంగా శుభ్రం చేసికోవడం అన్న మాట. ద్దలకు, వృద్ధులకు, బలహీనులకు, రోగార్తులకు – పై పనులు మనమే సంతోషంగా చేసిపెట్టడంకూడ ఇందులో చేర్తుంది. నడిచేటప్పుడు, కూర్చున్నప్పుడు వెన్నుపూస చక్కగా నిటారుగా ఉండేటట్లుగా అభ్యసించడం; మెత్తలు, పరుపులు, సోఫాలు, కుర్చీలు, ఫాన్‌లు, ఏర్‌కండిషన్‌లు – ఇత్యాది శరీరసుఖ సాధనాలను వదలిపెట్టడంకూడ శరీర తపస్సుగా పరిగణించవచ్చు. మన శరీరపోషణలో, మన శరీరప్రవర్తనలో, తక్కిన ప్రాణులకు హింస కలుగని విధంగా జాగ్రత్త పడడంకూడ శరీరతపస్సే : మాంసాహారాన్ని త్యజించడం, ఇటు అటు తిరుగునపుడు (ముఖ్యంగా వర్షాకాలములందు) మన కాలిక్రింద

అల్పప్రాణులు నలిగి చావకుండ ఉండునట్లుగా జాగ్రత్తపడడం–ఇత్యాదులు.

మనలోని ఎక్కువ తమస్సుకు కారణం ఏమిటి? అని అన్వేషించి చూచుకుంటే, ఈ శరీరసుఖానికి కట్టుబడిపోయి శారీరతపస్సు చేయకుండ కాలము త్రోయుటయే ప్రధాన కారణమని స్పష్టముగా తెలిసిపోతుంది.

వాఙ్మయ తపస్సు :

మనం మాట్లాడే మాటల్లో నాలుగు లక్షణాలు ఉండేటట్లు జాగ్రత్తపడడం. మాటలు, ప్రియమైనదిగా హితమైనదిగా సత్యమైనదిగా దుఃఖమును కలిగించనిదిగా ఉండవలెను. మన మాటల్లో ఈ నాలుగు లక్షణాలు కలిసి ఉండటం అసాధ్యమే. కాబట్టి పై నాలుగు లక్షణాలలో కనీసం మూడు లక్షణాలనైనా మన మాటలు కలిగిఉండేటట్లు ప్రయత్నం చేయవలెను. వాఙ్మయ తపస్సులో ఇది ఒక భాగం మాత్రమే.

'స్వాధ్యాయ అభ్యసనం' అనేది వాఙ్మయ తపస్సులో మరొక ముఖ్యమైన అంశం. మనం పూర్తిగా విశ్వసించగలిగే కొన్ని ముఖ్యమైన ఉదాత్త గ్రంథాలను (వేదములు, ఉపనిషత్తులు, భగవద్గీత – ఇత్యాదులు) మాటిమాటికి పఠించుటయే స్వాధ్యాయ అభ్యసనం. వేలాది గ్రంథాలను చదువుచు కాలక్షేపం చేయడం వాఙ్మయ తపస్సు కాదు. దానివలన లౌకిక ప్రయోజనాలు కలిగితే కలుగవచ్చు గాని ఆధ్యాత్మికంగా ప్రయోజనం లేదు. పైగా నష్టం కలిగినా కలుగవచ్చు.

వాఙ్మయం తపస్సు కొంత శ్రమకరమే. కాని మనం కొంత పట్టుదలతో, జాగరూకతతో ఆచరించగలిగితే నిశ్చయంగా మనకు శాంతి సంతోషాలు లభిస్తాయి. తోటి మానవులతో ఏ ఘర్షణ లేక మనజీవితం మృదువుగా హాయిగా సాగిపోతుంది. ఇంతేగాక ఈ వాఙ్మయ తపస్సు మానస తపస్సుకు ఆధారమై, కారణభూతమైకూడ ఉన్నది.

మానస తపస్సు :

రాగం, ద్వేషం, క్రోధం, ఈర్ష్య, అసూయ, దురభిమానం, సంకుచితత్వం, కుటిలత – ఇత్యాది దుర్గుణాలు మనస్సును కలుషితం చేయనీయకుండ జాగ్రత్తపడడం. దీని వలన మనస్సు ప్రశాంతంగా, నిర్మలంగా, స్వచ్ఛంగా ఉంటుంది. ఈ ఉన్నతమైన మనస్సు యొక్క ప్రభావం ముఖంమీదకూడ ప్రసరిస్తుంది. అటువంటి ప్రసాదభరితమైన ముఖం చూచుట కెంతో ఆహ్లాదంగాను, ఆనందంగాను ఉంటుంది.

దేవద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచమార్జవం
బ్రహ్మచర్యమహింసా చ శారీరం తప ఉచ్యతే
అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే
మనః ప్రసాదః సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః
భావసంశుద్ధిరిత్యేతత్తపో మానసముచ్యతే॥

లోకములసారం గ్రహించవలెనను కోరికతో ప్రజాపతి ధ్యానించగా, మూడు వేదములు అతనికి మనస్సులో ప్రతిభాసించినవి. ఆ మూడు వేదముల సారమేమిటో గ్రహించవలెనను తలంపుతో తిరిగి ప్రజాపతి ధ్యానించగా అతనికి మనస్సులో భూర్భువః స్వః–అను వ్యాహృతులు స్ఫురించినవి. ఈ వ్యాహృతులసారమేమిగా నుండునో అను ఔత్సుక్యముతో ప్రజాపతి తిరిగి ధ్యానించగా అతనికి మనస్సులో 'ఓంకారము' ప్రతిభాసించినది. ఈ 'ఓంకారము', ఈనెలు ఆకులను వ్యాపించియున్నట్లు సమస్త శబ్దజాలమును వ్యాపించియున్నది.

—ఛాందోగ్యోపనిషత్ : 2–23.

# బాలల శారదాదేవి

బి. ఎస్. ఆర్. ఆంజనేయులు

## దక్షిణేశ్వరమునకు తొలి ప్రయాణము

శ్రీ రామకృష్ణుడు దణేశ్వరానికి వెళ్లినతర్వాత శారద జయరాంబాటి వెళ్లిపోయింది. ఆమెలో యిప్పుడు చాలా మార్పు వచ్చింది. ఇదివరకటికంటే ఎంతో శాంతంగాను, యెంతో గంభీరంగాను, యెంతో ప్రేమ, దయ గలదిగాను, మారిపోయింది. ఇలా నాలుగు సంవత్స రాలు గడచినవి.

దక్షిణేశ్వరం దూరంలో వుండటంవల్ల మళ్ళీ జయరాంబాటిలో వదంతులు బయలు దేరినయి. శారద భర్త పిచ్చివాడని ఒకరు, దిగంబరిగా యుంటాడని యింకొకరు, పిచ్చిగా గొణుగుతాడని మరొకరు చెప్పుకోటం మొదలుపెట్టారు. ఇంట్లోనుంచి శారద బయటకు వస్తే చాలు, స్త్రీలు యిలా అనేవాళ్లు. "శ్యామ కూతురిని పిచ్చివాడి కిచ్చారే." శారద యివన్నీ లోలోన మింగుకుంటూ ఇంట్లోనే వుండేది. ఆమెకు యిలా అనిపించేది. "ఆయన, నిజంగా పిచ్చివాడా! నే చూచినప్పుడు అలా లేడుగదా! నిజంగా పిచ్చే అయితే నేను ఆయనదగ్గర వుండటం మంచిదిగదా?" కాని వయస్సువచ్చిన పిల్ల గావున ఈ విషయం బయట పెట్టలేదు.

పవిత్రమైన మనస్సుగల ఆమె ప్రార్థన దేవుడు విన్నాడు. కలకత్తాకు ఒక హోలీ పండుగనాడు గంగలో స్నానం చేయటానికి చాలామంది జయరాంబాటినుండి ప్రయాణ మైనారు. శారద తానుకూడా పోవాలనే ఉద్దేశ్యం తండ్రికి చెప్పింది. ఆమె మనస్సును కనిపెట్టి రామచంద్రముఖోపాధ్యాయ శారదను తీసుకొని బయలుదేరాడు. కలకత్తా 80 మైళ్ల దూరం. నడచిపోవాలి. శారదకు అలవాటులేదు. నడచి, నడచి, అలసిపోయింది. దానికితోడు లోపల దిగులుకూడాను. మూడవరోజు ఒళ్లు కాలిపోతూ జ్వరం వచ్చింది.

బాటసారుల విశ్రాంతికై వేసిన ఒక గుడిసెలో వాళ్లు ఆగారు. ఆ రాత్రి ఆమె విపరీత మైన జ్వరంవల్ల స్పృహ తప్పింది. అప్పుడు ఆమెకు ఒక దృశ్యం కనుపించింది. నల్లగా యున్న ఒక పిల్ల కనుపించింది. నల్లగాయున్నా ఆ అమ్మాయి ముఖం యెంతో అందంగాను, ప్రకాశవంతంగాను వున్నది. ఆమె శారద ప్రక్కన కూర్చుండి చేత్తో రాస్తున్నది. శారద యిలా అడిగింది. "నీ వెవరమ్మా." ఆ అమ్మాయి "నేను నీ అక్కను. నిన్ను తీసుకొనిపోవ టానికే దక్షిణేశ్వరంనుండి వచ్చాను."

శారద ఆశ్చర్యంతో లేచి చూచింది. జ్వరం పూర్తిగా తగ్గిపోయింది. మరునాడు బయలుదేరటానికి శక్తికూడా వచ్చింది. ఆ రోజు నడకలో మళ్లీ జ్వరం తగిలినా రామచంద్ర ముఖోపాధ్యాయ ఏదోవిధంగా రాత్రి 9 గంటలకు ఆమెను దక్షిణేశ్వరం చేర్చాడు.

'ఇంత చల్లని తల్లి వీ వెవర' వనిన
ప్రేమ పొంగార నిమురుచు శ్యామ పలికె
'అక్క నీకౌదు. అతని నచటయుంచి
వచ్చుచున్నాను దక్షిణేశ్వరమునుండి.'

సంపాదకులు : శ్రీ చిద్ఘనానందస్వామి

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు - 600 021) న ముద్రింపబడి,

శ్రీ చిద్ఘనానందస్వామిచే శ్రీ రామకృష్ణ మఠము (మద్రాసు—6 0 001) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము 34 | 1977 - డిసెంబరు : పింగళ - మార్గశిరము | సంచిక 12

## విషయ సూచిక




## శ్రీ రామకృష్ణ ప్రభ

**సంవత్సర చందా : 7-00.** **జీవిత చందా : 100-00.**

**విడి ప్రతి : 70 పైసలు.**

### శ్రీ రామకృష్ణ మఠము

మైలాపూరు

మద్రాసు 600004.

# శ్రీ రామకృష్ణ మిషన్ - రాజమండ్రి

## ఒక విన్నపము

దివి తాలూకాలోని ఊటగూడెం, గొల్లపాలెం, ద్వారక, ఈరాలి, శ్రీరాంపురం, హంసలదీవి, బాపన్నపాలెం, పాలకాయలతిప్ప - అను ఎనిమిది గ్రామము లందుగల 950 కుటుంబములకు చెందిన 3,114 మంది ప్రజలకు సహాయ కార్య క్రమములను కొనసాగించుచున్నాము. ఇంతేగాక, ఇండ్లు కోల్పోయిన వీరందరికి పునరావాసము కలిగించుటకై 50 లక్షల రూపాయల వ్యయముతో 1,000 గృహ ములను నిర్మించవలెనని నిశ్చయించినాము. మీ అందరి సహకారముతో ఈ పథకము త్వరలో పూర్తికాగలదని భావించుచున్నాము. విరాళములకై మిమ్ములను అభ్యర్థించు చున్నాము. ఈ క్రింది విలాసమునందు **విరాళములు** కృతజ్ఞతతో స్వీకరింప బడును.

శ్రీ రామకృష్ణ మిషన్,
వీరభద్రపురం,
రాజమండ్రి - 533 101.

స్వామి నందానంద,
కార్యదర్శి.



ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్యవరాన్నిబోధత.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము 34 1977 – డిసెంబరు : : పింగళ – మార్గశిరము సంచిక 12

## ప్రార్థన

ఓం తచ్ఛం యోరావృణీమహే, గాతుం యజ్ఞాయ, గాతుం యజ్ఞపతయే, దైవీస్స్వస్తిరస్తు నః,
స్వస్తిర్మానుషేభ్యః, ఊర్ధ్వం జిగాతు భేషజం, శం నో అస్తు ద్విపదే, శం చతుష్పదే.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

వర్తమానకాల దుఃఖములకు, భవిష్యత్కాల దుఃఖములకు, ఉపశమమును కలిగించు శుభకర్మలు ఏవియో, వాటిని మేము చక్కగా ఆచరింపగలుగునట్లుగా అనుగ్రహించమని భగవంతుని ప్రార్థించుచున్నాము.

మేము చేపట్టిన శుభకర్మలు, ఏ విఘ్నములును లేక వర్ధిల్లునట్లుగా అనుగ్రహించమని భగవంతుని వేడుకొనుచున్నాము.

శుభకర్మలను చేపట్టి దీక్షగా నిర్వహించుచున్న యజమానులకు (కర్తలకు) సత్ఫలితములు కలుగునట్లుగా అనుగ్రహించమని భగవంతుని వేడుకొనుచున్నాము.

శుభకర్మశీలురమైన మనము ప్రకృతిశక్తుల అనుగ్రహమునకు పాత్రులమగుదుముగాక.

సకల మానవ సంఘములకు క్షేమము కలుగునుగాక.

క్షుధారోగమును పోగొట్టెడి భేషజములైన పైరుపచ్చలు నిండుగా మెండుగా పెరుగును గాక.

ద్విపాదులైన సకల మానవులకు, చతుష్పాదులైన సకల జంతువులకు మంగళము కలుగునుగాక.

మా ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక తాపములన్నియు శమించును గాక.

# వివేకానందవా

ఒకప్పుడొక రాణి యుండెను. ఆమె పేరు మదాలస. ఆమె తన బిడ్డలందఱును జీవన్ముక్తులు కావలయునని కోరి యందులకై స్వయముగా శ్రద్ధ వహింపసాగెను. ఊయెలలో పరుండబెట్టి వారిని ఊచునపుడు – "తత్త్వమసి, తత్త్వమసి" (నీవే పరబ్రహ్మవు, నీవే పరబ్రహ్మవు) అని యామె జోల పాడుచుండెడిది.

వారిలో ముగ్గురు సన్న్యాసులైరి. నాల్గవ బిడ్డడు చక్రవర్తి యగుటకు దగిన శిక్షణము బొందుటకుగాను మఱియొక కాపురమునకు తీసికొని పోబడియెను. బిడ్డడు ఇల్లు విడుచునపుడా తల్లి వానికొక చీటినిచ్చి దాని నాతడు ప్రాయము వచ్చినపిమ్మట చదువుకొనవలయునని తెలిపెను.

దానిపై నిట్లు వ్రాయబడియుండెను :— "బ్రహ్మమే సత్యము. జగత్తంతయు మిథ్య, ఆత్మ హంతకాని, హతమగునది కాని కాదు. నిస్సంగుడవై జీవింపుము, లేదా సాధుసంగమున మసలుము." యువరాజై దానిని చదువుకొనినంతనే యాతడును సంసారమును త్యజించి సన్న్యాసి యయ్యెను.

త్యజింపుము, సంసారమును త్యజింపుము. వంట యింటిలోనికి జొరబడి యొక మాంసపు ముక్కను దినుచు, ఇంతలో ఎవ్వరైనను వచ్చి తమ్ము తఱుమగొట్టుదురేమో యను భయమున అటు నిటు జూచుచుండు కుక్కలవలెనున్నాము మనమిపుడు. దానికి బదులు సార్వభౌముడవై యుండి సమస్త ప్రపంచమును నీదియే యని గ్రహింపుము.

సంసారమును త్యజించిననే కాని యీ మనోభావము నీకు అలవడదు, సంసార త్యాగానంతరమే అది నిన్ను బద్ధుని జేయుట మానును. శారీరకముగా గాకున్నను మానసికముగా నైనను త్యజింపుము, మనఃపూర్వకముగా త్యజింపుము వైరాగ్యము నవలంబింపుము. ఇదియే నిజమైన త్యాగము. ఇది లేనిదే పరమార్థమును బొందుట అసాధ్యము.

దేనిని గోరకుము; ఏలన దేనిని గోరుదువో అదియే నీకు లభించును, దానితో పాటు ఘోర బంధము ప్రాప్తించును. ఇక యొకప్పుడు మూడు కోరికలను బొందినవాని విషయమున సంభవించినట్లు మనపై 'కుక్కలను దెచ్చుకొనుటయే' యగును. ఆత్మతృప్తులమైననే కాని మనకు మోక్షము లభింపదు. "ఉద్ధరేదాత్మనాత్మానమ్—తన చేతనే తనను ఉద్ధరించుకొన వలయును."

ఇతర శరీరానుభవములను నీవిగనే భావించుట నేర్చుకొనుము; మనమందఱము ఒక్కటియే యని గ్రహింపుము. అర్థరహితములగు ఇతర విషయములనన్నిటిని తృణీకరింపుము. మంచివి కానిమ్ము, చెడ్డవి కానిమ్ము—నీ కర్మములను కన్నెత్తియైనను చూడకుము, వానిని స్మరింపనే స్మరింపకుము. ఐనదేదో ఐనది. మూఢ విశ్వాసములను విడనాడుము. మృత్యుముఖమున నైనను దౌర్బల్యమునకు అధీనుడవు గాకుము.

ఊరక పశ్చాత్తాపపడకుము. ఐన కార్యములనుగూర్చి అదేపనిగా చింతింపకుము, మఱియు నీ సత్కార్యములను స్మరింపకుము. విముక్తుడవుగమ్ము. దుర్బలులు, భయగ్రస్తులు, అజ్ఞులు—వీ రెవ్వరును ఆత్మను పొందజాలరు. పూర్వకర్మమును నీవు మార్పజాలవు, తత్ఫలితము కలిగి తీరును. ధీరుడవై దానిని అనుభవింపుము. కాని, ఒకసారి యొనర్చిన దుష్కర్మమును మరల చేయకుండుటకుగాను జాగరూకుడవుగమ్ము. సత్కర్మఫలమైనను, దుష్కర్మఫలమైనను సమస్త కర్మభారమును భగవంతునిపై బెట్టుము. దుష్కర్మములను మాత్రమే

భగవంతునకు సమర్పించి సత్కర్మములను నీవు ఉంచుకొనకుము.

''వాంఛామధుపానమున లోకులు ఉన్మత్తులగుచుందురు.'' రాత్రింబవళ్లు ఒక్కచో నుండజాలవు; రాముడును కాముడును ఒక్కచో నుండజాలరు. కామమును విడనాడుము.

'అన్నము అన్నము' అనుటకును దానిని తినుటకును చాల భేదమున్నది; 'నీరు, నీరు' అనుటకును దానిని త్రాగుటకును చాలవ్యత్యాసమున్నది. ఇట్లే 'దేవుడు, దేవుడు' అని పదే పదే ఉచ్చరించినంత మాత్రాన సాక్షాత్కారము నొందజాలము. తీవ్ర ప్రయత్నము చేయవలయును. సాధన చేయవలయును.

అల, మరల సముద్రమున పడుటవలన మాత్రమే అపరిమితము కాగలదు,—అల రూపమున అది యెన్నటికిని పరిమితమే. అది సముద్రమైన తరువాత తిరిగి తన యిచ్చవచ్చినంత పెద్ద అల కాగలదు. సంసార ప్రవాహముతో తాదాత్మ్యమును త్రెంపుకొని నీవు ముక్తుడవని గ్రహింపుము.

మానవుల ఆయుష్కాలము నూరేండ్లే అయినను, పూర్వము భరద్వాజుడను నాతడు తీవ్ర తపశ్చర్యవలన 300 ఏండ్ల ఆయుష్కాలమును సంపాదించెను. ఆ ఆయుష్కాలమంతయు, అతడు బ్రహ్మచర్యమును పాటించి వేదాధ్యయనమునందే తత్పరుడైయుండెను. చివరకు ముసలితనము పైబడగా, దానివలన అతడు చాల కృశించిపోయి కదలలేని స్థితికివచ్చి మంచము పట్టెను. అప్పుడు ఇంద్రుడు అతనికి దర్శనమిచ్చి ఇట్లు అడిగెను. ''మఱొక నూరేండ్లు నీ ఆయుష్కాలము పొడిగింపబడినచో, దానితో నీవేమి చేయగలవు?'' భరద్వాజు డిట్లు బదులుచెప్పెను. ''వేదములను సమగ్రముగా తెలిసికొనవలెనను వాంఛతో, ఈ మూడు వందల సంవత్సరములకాలము వేదపఠనముతో గడిపితిని. కాని నా వాంఛ పూర్తికాలేదు. దైవానుగ్రహమువలన మఱియొక నూరు సంవత్సరముల ఆయుష్కాలము లభించినచో ఆ వేదపఠనమును కొనసాగించి నా ఆశయమును సాధించుకొనగలను.'' అప్పుడు ఇంద్రుడు, కని విని ఎఱుగని మూడు మహాపర్వతములను, వానికి చూపించి, ఆ మూడు పర్వతములనుండి మూడు పిడికిళ్ళ మట్టిని గ్రహించి ఇట్లనెను. ''ఈ మూడు పర్వతములే, సత్యములు అనంతములునైన ఋక్. సామ, యజుర్వేదములు. ఇంతకాలము, నీవు నేర్చినదంతయు ఈ మూడు పిడికిళ్ళ అల్ప పరిమాణమే. ఇంకను నేర్వవలసినది ఎంత యున్నదో ఊహించుకొనుము! ఎన్నియుగములు జీవించినను, దీనినంతను గ్రహించుటకు నీకు సాధ్యమా! ఏమి! కాబట్టి నా మాట వినుము. నీకు శ్రేయస్సు కలుగును'' – అని, తరువాత అతనికి, సూర్యనారాయణ ప్రీతికొఱకు ఉద్దేశింపబడిన ఒక యజ్ఞమును బోధించెను. భరద్వాజుడు ఇంద్రు డాదేశించినట్లనే, భగవాన్ సూర్యనారాయణుని, ఆ యజ్ఞనిర్వహణరూపమున ఆరాధించి, ఆ దేవుని అనుగ్రహమునకు పాత్రుడై అమృతత్వమును పొందెను.

# శ్రీ రామ ఉవాచ

అయోధ్యాకాండ, నూట ఐదవ సర్గలో
భరతునకు రాముడు చె. ...

కూడబెట్టిన ధనము ఒకప్పుడు క్షయము కాక తప్పదు. ఉన్నతస్థానము పొందినవాడు ఒకప్పుడు పతనము పొందకతప్పదు. భార్యా పుత్ర మిత్రాదుల సంయోగము ఒకప్పుడు వియోగము కాకతప్పదు. పుట్టినవాడు ఒకప్పుడు మరణించక తప్పదు.

బాగుగా పండిన ఫలములకు అన్య భయ కారణ మేదియు లేకపోయినను, చెట్టునుండి రాలిపోవుట అను భయము తప్పనట్లు, పుట్టిన మానవుడు ఎంత నేర్పుగా జీవించినను మరణ భయమునుండి ఎల్లకాలము తప్పించుకొనలేడు.

గట్టి పునాదులతోను, దృఢమైన స్తంభములతోను నిర్మించిన గృహమైనను ఒకనాటికి శిథిలమై కూలిపోవునట్లు, మానవుడున్ను ఒకనాటికి జరాభారజర్జరీకృత దేహుడై చివరకు కూలిపోకతప్పదు.

ఈ నదీప్రవాహము సముద్రుని చేరుచున్న దేగాని తిరిగి వచ్చుచున్నదా? అట్లే గడచిన రాత్రి గడచినదే. ఇక ఎన్నటికైనను తిరిగి రాబోవుచున్నదా?

వేసవికాలములో సూర్యకిరణములు జలములను పీల్చి కాసారములను శోషింపజేయునట్లు, దినములు రాత్రులు ఒకటివెంబడి ఒకటి వెళ్ళిపోవుచు ప్రాణుల ఆయుస్సును శోషింపజేయుచున్నవి.

నీవు నడుస్తున్నను, నిలిచినను, కూర్చున్నను, వంగినను, పడుకున్నను – ఎట్లయినను సరియే నీ ఆయుస్సు క్షీణించిపోవుచున్నదే కదా! కాబట్టి నిన్ను జూచి నీవే అనుక్షణము శోకించవలసియుండగా ఇతరులను గూర్చి నీ కెందుకు సంతాపము?

మనుష్యు డెక్కడికయినను పోవునప్పుడు, మృత్యువు కూడనే పోవుచున్నది. ఎక్కడైనను కూర్చున్నప్పుడు కూడనే కూర్చొనుచున్నది. సుదూర దేశమునకు పయనించి తిరిగి వచ్చినప్పుడు కూడనే మృత్యువున్ను సుదూర దేశమునకు పయనించి తిరిగ వచ్చుచున్నది. ఈ విధముగా ఛాయవలె వెంబడించుచున్న మృత్యువునుండి, కాలము తీరినప్పుడు మానవుడు ఎన్ని ఉపాయములు పన్నినను తప్పించుకొనుటకు సాధ్యమా?

ఆదిత్యుడు ఉదయించుచుండగా తూర్పు దిక్కునుచూచి మానవుడు, 'ఆహా ఎంత రమణీయ దృశ్యము!' అని ఆనందించుచున్నాడు. ఆదిత్యుడు అస్తమించుచుండగా పశ్చిమదిక్కునుచూచి మానవుడు, 'ఆహా ఎంత రమణీయ దృశ్యము!' అని ఆనందించుచున్నాడు. ఈ ఉదయాస్తమయములు తన ఆయుస్సును క్షీణింపచేయుచున్నవే, అని ఆలోచన చేయడు కదా!

క్రొత్తక్రొత్తగా వచ్చుచున్న ఋతు ముఖములనుచూచి మానవుడు, 'ఆహా! వసంత ఋతువు సమీపించుచున్నది! ఆహా! శరదృతువు సమీపించుచున్నది!' అని సంతోషముతో ఉప్పొంగుచుండునేగాని, మృత్యువు వైపునకు తాను, తనవైపునకు మృత్యువు వేగముగా అడుగులు వేయుచుండుటను గుర్తింపలేకపోవుచున్నాడు కదా!

ఈ లోకములో, ఏ ప్రాణికి స్వాతంత్ర్యముగా తన ఇష్టము వచ్చినట్లు నడచుకొను సామర్థ్యమున్నది? ఈశ్వరుడు ఎట్లు లాగుచుండునో అట్లు పోవలసినదియే గదా ప్రతి ప్రాణియును. కాబట్టి మృతిని పొందినవారిని గూర్చి ఎంత ఏడ్చినమాత్రమున ఏమిలాభము? ఆ ఏడ్పులవలన వారిని తిరిగి బ్రతికించుటకు సాధ్యమగునా?

నదీప్రవాహమువలె వయస్సు తిరుగు లేక గడచిపోవుచున్నది. ఆత్మసుఖమును పొందు యోగ్యతగల మానవులమైన మనము దీనిని ఉపేక్షింపదగునా? కాబట్టి మనము, ఆత్మసుఖమును ఆవిర్భవింపజేయు ధర్మాచరణయందే జాగరూకత వహించెదముగాక.

# శ్రీ రామకృష్ణ కథామృతము

(రెండవ భాగము)

అనువాదము: ప్రవ్రాజిక శ్యామాప్రాణ

భక్తుడు: సంసారములోనుండి భగవంతుని దర్శించుట సాధ్యము కాదనియే తోచుచున్నది

శ్రీరామకృష్ణులు: ఎందులకు సాధ్యము కాదు? నిజమైన విశ్వాసమున్నచో ఎక్కువ శ్రమపడనక్కరలేదు. గురూపదేశములందు విశ్వాసముండవలెను. ఒక కథ వినుము. కొందరు గోపికలు యమునను దాటి ఇంకొక పల్లెకు పోవలెనని నదిఒడ్డున చాలసేపు కాచుకొనియుండిరి. ఒక్క పడవైనను లేదాయె. ఇంతలో వ్యాసమహర్షి కూడ నది ఆవలి ఒడ్డునకు పోవలెనని నదీతీరమునకు వచ్చెను. అంత గోపికలు వ్యాసమహర్షిని 'స్వామీ! మేము ఈ నదిని దాటుటెట్లు?' అని ప్రశ్నింప వ్యాసుడు 'చింతింపకుడు. నేను దాటించెదను. నాకు చాల ఆకలి వేయుచున్నది. ఏమైన తినుటకు మీ వద్ద కలదా?' అనెను గోపికలు తమవద్దనున్న పాలు, పెరుగు, వెన్న, వ్యాసునకు సమర్పించిరి. వ్యాసుడు అన్నియు పూర్తిగ భక్షించెను. అటుపై గోపికలు మరల వానికడకేపోయి 'స్వామీ! నది దాటు ఉపాయమేమి?' అనిరి అంత వ్యాసుడు నదిగట్టువద్దకేపోయి 'ఓ యమునాదేవీ! నేను ఈరోజు ఉపవాసము ఉండినచో నీవు మాకు దారి ఇవ్వవలసినది. మేమందరము ఆవలి ఒడ్డునకు పోవలెను' అని పలుకుటతోడనే నదిలో దారిఏర్పడెను. గోపికలు ఒకరిముఖము నొకరు చూచుకొనుచు 'ఇదేమి ఆశ్చర్యము! ఈయన ముందుగనే అన్ని పదార్థములను తినెనుకదా! అట్లయ్యు నేనేమియు తినని పక్షములో' అని పల్కిరి. యమునానదియును దారి నిచ్చెను!!

ఇదేమియో తెలియునా? వ్యాసునకు దృఢవిశ్వాసము. ఏమన తనలో నారాయణుడు కలడు. అతడే తినెను అని వాని నమ్మకము సుమా!

శంకరాచార్యులు గొప్ప బ్రహ్మజ్ఞాని. అట్లయ్యు ఆయనకు మొట్టమొదట భేదభావము ఉండెను. గురువాక్యములో దృఢవిశ్వాసము కలుగలేదు.

శ్రీ శంకరాచార్యులు గంగాస్నానము చేసి ఆశ్రమమునకు తిరిగిపోవుచుండెను. చండాలుడొకడు మాంసఖండములు గల మూటను తీసికొని దాటిపోవుచు శంకరాచార్యులను తాకుకొనిపోయెను. వెంటనే శంకరాచార్యులు 'నీవు నన్ను ముట్టుకొంటివేల?' అని కసరగా చండాలుడు ఇట్లు బదులు చెప్పెను. 'స్వామీ! మీరు నన్ను తాకలేదు. నేనును మిమ్ములను తాకలేదు. శుద్ధ ఆత్మ శరీరము కాదు.' ఇది వినిన వెంటనే శంకరునకు జ్ఞానము కలిగి బ్రాహ్మణ – చండాలుడను భేదబుద్ధి నశించెను.

జడభరతునకు సర్వదా 'నేను శుద్ధాత్మను' అను జ్ఞానముండెను.

జ్ఞానులు 'సోహం' (అహం బ్రహ్మాస్మి) అందురు. అసలు విషయమేమన మనస్సును స్థిరపరచుకొనవలెను. మనస్సు స్థిరపడనిచో ఏ మార్గమును అవలంబించినను యోగము కుదురదు. యోగికి మనస్సు వశమగునేకాని, మనస్సునకు యోగి వశముకాడు. మనస్సు స్థిరమైన వాయువు స్థిరమగును. అదియే కుంభకము. రాజయోగము ద్వారానేగాక భక్తియోగమువలనకూడ కుంభకము కలుగును.

భగవన్నామస్మరణ వలనను కుంభకము సిద్ధించును. ఒక ఉపమానము చెప్పెదను. ఒకావిడ ఇల్లు చిమ్ముచుండ ఒకతనువచ్చి 'చూడమ్మా ఫలానా ఆమె మరణించెను.' అని చెప్పును. మరణించిన వ్యక్తి తనదగ్గర బంధువు కానిచో అది వినిన గృహిణి 'అయ్యో! పాపము. అటులనా! చాల మంచిమనిషి' - అనుచు ఇల్లు చిమ్ముచునేయుండును. మరణించిన వ్యక్తి తన దగ్గరబంధువైనచో వినుటతోడనే 'ఆ' అని కూలబడును. నోట మాటరాదు. కాళ్ళు చేతులు కదలవు. వాయువు స్థిరమగును. అర్థమైనదా?

'సోహం' అని నోటితో పల్కినంతమాత్రమున జ్ఞానము కలుగదు. జ్ఞానుల లక్షణములే వేరు. వారి కన్నులే పట్టిఇచ్చును. నరేంద్రుని నేత్రములను చూడుము!

జీవులు నాలుగు రకములు. బద్ధజీవులు, ముముక్షువులు, ముక్తజీవులు, నిత్యజీవులు. ప్రతి ఒక్కడు సాధనల చేసియే సిద్ధి నందునని తలంచరాదు. కొందరు పుట్టుకతోనే జ్ఞాన సిద్ధులు, ప్రహ్లాదునివలె. కొందరు ఎంతో కష్టపడి సాధన భజనల చేసినతరువాతనే సిద్ధి నందుదురు. ప్రహ్లాదునివంటి భక్తులకు మొదట భగవత్సాక్షాత్కారము, అటుపైననే సాధనలు కొనసాగినవి. సొర, గుమ్మడి తీగలను గమనించలేదా? ముందు కాయ, అటుపై పూలు.

అంతియేగాక శక్తి తారతమ్యములును కలవు. విద్యాసాగరుడు నన్ను ఈ ప్రశ్నయే వేసెను. 'మహాశయా! ఈశ్వరుడు కొందరికి తక్కువ శక్తి, కొందరికి ఎక్కువ శక్తి ప్రసాదించెనా?' నేనిట్లు జవాబు చెప్పితిని. 'విభురూపములో అతడు సర్వత్ర కలడు. అట్లయ్యు శక్తి తారతమ్యములు కలవు. లేనిచో నిన్ను చూచుటకు మేమేల వచ్చితిమి? నీకేమైన రెండు కొమ్ములు మొలిచినవా? నీకు పాండిత్యము కలదు. దయకలదు. అదే మమ్ముల నిక్కడికి ఆకర్షించినది.'

క్రీ. శ. 1883, సెప్టంబరు. 26 వ, తేది.

నేడు బుధవారమయినందున భక్తుల సంఖ్య తక్కువ. సాధారణముగ ఆదివారము ఎక్కువ మంది భక్తులు శ్రీ రామకృష్ణునికడకు వచ్చెడివారు. మధ్యాహ్నము $1\frac{1}{2}$ గంటలకు మాస్టరుకు సెలవు దొరికెను. వెంటనే బయలుదేరి సుమారు 3 గంటలకు దక్షిణేశ్వరమునకు చేరుకొనెను. రాఖాల్, లాటూ, శ్రీరామకృష్ణులవద్దనే నివసించుచుండిరి. రెండు గంటల క్రితమే కిశోరి వచ్చియుండెను. గదిలో చిన్న మంచముపై శ్రీ రామకృష్ణులు కూర్చొనియుండిరి. మాస్టరువచ్చి వారి పాదపద్మములకు ప్రణమిల్లెను. రామకృష్ణులు భక్తుల క్షేమ సమాచారముల నడిగిరి. అటుపై నరేంద్రుని మాట వచ్చెను.

శ్రీ రామకృష్ణులు: (మాస్టరుతో) ఈ మధ్య నరేంద్రుని చూచితివా? (నవ్వుచూ) అతడు నన్నుగూర్చి ఇట్లు పల్కెనట. 'నేనింకను కాళికాలయమునకు పోవుచున్నాననియు, యథార్థము తెలిసికొన్నచో ఆలయమునకు పోవుట మానుదుననియు!

నరేంద్రుడిచ్చటికి మాటిమాటికి వచ్చుట ఇంటివారికి ఇష్టములేదు. ఈ మధ్య ఒకరోజు బండిలో అతడిచ్చటికి వచ్చెను. బండి బాడుగ సురేంద్రుడిచ్చెనట. అది విని వాని మేనత్త సురేంద్రుని ఇంటికిపోయి తగవులాడి వచ్చెనట. అది సరేగాని నేడు ఈ సమయములో నీ వెట్లు రాగలిగితివి? స్కూలు లేదా?

మాస్టరు: నేడు మధ్యాహ్నము $1\frac{1}{2}$ గంటలకే బడి వదలిరి.

శ్రీ రామకృష్ణులు: అంత తొందరగా ఎందుకు వదలిపెట్టిరి?

మాస్టరు: విద్యాసాగరు స్కూలు చూచుటకు వచ్చిరి. ఆ స్కూలు ఆయనదేకదా. అందుచే ఆయన అక్కడకు వచ్చినప్పుడు సంతోష సూచకముగా పిల్లలకు రెండవపూట సెలవు ఇచ్చుచుందురు.

శ్రీ రామకృష్ణులు: విద్యాసాగరుకు సత్యమును నిలబెట్టుకొనలేదే? ఇక్కడికి వచ్చెదనని నా కాలోజు చెప్పెను. కాని రానేలేదు సత్యమును ఆధారము చేసికొన్నవారికి భగవద్దర్శనము నిశ్చయము.

సత్యవచనె పరస్త్రీ మాతృసమానె
ఇసే హరి న మిలే తులసీ ఝూట్ జబాన్.

వట్టి పండితునకు, సాధువునకు చాలభేదము కలదు. కేవలము పాండిత్యమువలన ప్రయోజనమేమి? కామినీ కాంచనములమీదనే వారి మనస్సు. కాని, సాధువుల మనస్సు శ్రీహరి పాదపద్మముల మీదనే. పండితుడు చెప్పునదొకటి, చేయునదొకటి. సాధువులు అట్లు చేయరు. సాధువులమాట అట్లుండనీ. భగవంతుని పాదపద్మములపై భక్తిగలవారి పల్కులు, పనులన్నియు వేరుసుమా! కాశిలో నానక్ పంథీ సాధువును చూచితిని. నీ వయస్సే యుండును. నన్ను 'ప్రేమ్‌సాధూ' అని పిల్చెడివాడు. కాశిలో వారి మఠము కలదు. ఒకదినము నన్ను వారి మఠమునకు పిలుచుకొనిపోయెను, మహంతును చూచితిని. మంచి లౌక్యుడు. గ్రంథమును చదువుచుండెను తరుణోపాయ మేమి? అని వాని నడిగితిని. 'కలియుగములో నారదీయభక్తి' అని చెప్పెను.

పాఠము ముగిసిన పిదప 'జలేవిష్ణుః, స్థలే విష్ణుః, విష్ణుః పర్వతిమస్తకే, సర్వం విష్ణుమయం జగత్' అని పల్కెను. చివర, 'శాంతిః శాంతిః ప్రశాంతిః' అనెను. ఒకనాడతడు భగవద్గీత పఠించుచుండెను. విషయాసక్తుల నతడు కన్నెత్తియైనను చూడడు. నావైపునకు తిరిగి చదువ నారంభించెను.

మాస్టరు: ఆ సాధువులు వేదాంతవాదులా?

శ్రీ రామకృష్ణులు: వారు వేదాంతవాదులైనను, భక్తిమార్గమునుకూడ అంగీకరింతురు. ఎందుకనగ ఈ కలియుగములో వైదిక మతము పూర్తిగా అనుసరింపజాలము.

కొన్నేండ్లకుముందు వేదాంత వాదియైన సాధు వొకడిచ్చటికి వచ్చెను. మేఘమును చూచి నృత్యము చేయువాడు. గాలివానను చూచి ఆనందించెడివాడు. ధ్యానించునపుడు వానిదగ్గరకు పోయినచో కోపగించుకొనువాడు. 'బ్రహ్మసత్యము, జగత్తు మిథ్య' అని సదా వివేచన చేయుచుండెడివాడు. ఎప్పుడూ ఒక గాజు ముక్కను (Prism) చేతబట్టుకొని తిరిగెడివాడు. దానిగుండ చూచిన సూర్యుని వెలుతురు ఇంద్రధనుస్సువలె ఏడువర్ణములుగ అగపడును. కాని, నిజమునకు ఏ రంగు లేదామె! అట్లే బ్రహ్మ యొకడే సత్యము, అది మాయ వలన పలురకములుగా కనిపించుచున్నది. ఆసక్తి కలుగునను భయముతో అత దేవస్తువు నైనను రెండవసారి చూచెడివాడుకాడు. స్నానము చేయుచుండగ ఆకాశమున పక్షులు ఎగురుటనుచూచి విచారణ ఆరంభించెడివాడు. వ్యాకరణము బాగుగ నేర్చియుండెను. హలధారి వ్యాకరణ సంబంధమైన ప్రశ్నలు వేయగ చక్కని సమాధానము లిచ్చెను. వ్యంజన వర్ణములనుగూర్చి అద్భుతముగా ప్రసంగించెను ఇచ్చట మూడురోజులు మాత్రమే ఉండెను. ఒకనాడు గంగ ఒడ్డున కూర్చొనియుండగ వానికి సన్నాయినాదము వినపడెను. వెంటనే ఇట్లు పలికెను. 'బ్రహ్మజ్ఞాని ఈశబ్దమును వినిన వెంటనే సమాధిస్థితి నందును. —సశేషము.

# వివిధమతముల సదవగాహనావశ్యకత

కామఋషిసత్యనారాయణవర్మ

మతమనగా ఒక జీవితవిధానమని రాధాకృష్ణపండితుని నిర్వచనము. మతము మానవతను తీర్చి దిద్దును. మతము క్రమశిక్షణ కలిగించును. మతము ఆత్మవిశ్వాసమును బలపరచును. గనుక మానవునకు మతము ప్రాణప్రదమైనది. నైతికజీవమునకు, త్యాగమునకు, విశ్వమానవ సోదరభావమునకు, మానవసేవకు మతధర్మము మూలకందము.

"నా మత విశ్వాసమే నన్ను రాజకీయములలో ప్రవేశపెట్టి ప్రజాసేవ చేయుటకు ప్రేరకమైనది"ని గాంధిమహాత్ముడు వక్కాణించెను. కాని చరిత్రలో మతవిద్వేషాలతో, ఎన్నో యుద్ధాలు, కల్లోలాలు సంభవించి రక్తం ప్రవహించిన ఘట్టాలు, సంఘటనలు, ప్రపంచమంతటా గలవు. వివిధ మతముల మధ్యనేగాక ఒకే మతమందలి అంతశ్శాఖలలో విభేదాలు కల్లోలాలు స్పర్థలు చెలరేగిన సందర్భాలు చాల గలవు. క్రైస్తవులలో రోమను కేథలిక్కులు, ఆంగ్లికనులు, లూథరన్సు. బాప్టిస్టులు, ప్రోటస్టెంటులు ఒకరి కొకరు సూక్ష్మ విభేదాలతో మత ప్రబోధలవల్ల రావలసిన శాంతిని భంగపరుస్తారు. హిందువులలో శైవ, వైష్ణవభేదాలు లేక ద్వైతాద్వైత విశిష్టాద్వైత విభేదాలు – ఇస్లాంలో షియ్యా, సున్నీ విభేదాలు, సూఫీ సిద్ధాంతాలు విభేదాలకు దారి తీసినవి. దయామయుడైన మహమ్మదు ప్రవక్తపేర కత్తులు సాన పెట్టబడినవి. బౌద్ధంలో హీనయాన, మహాయాన, తాంత్రిక పద్ధతులు పరస్పరం పొందిక లేకుండ బోయినవి. ఇటువంటి విభేదాలు ప్రవక్తల ఆశయాలకు కళంకం తెచ్చిపెట్టినవి. ప్రవక్తల్లో లేని అసహనం, విద్వేషం, స్వమత దురభిమానం, పరమత దూషణలు వారి అనుచరులలో ప్రకోపించి వారి మార్గాన్ని నిరోధిస్తున్నాయి. భారతదేశంలో స్వాతంత్ర్యం సిద్ధించిన తొలి దినాలలో ఆగస్టు 15 న ఢిల్లీలో అగ్రనాయకులు స్వాతంత్ర్యోత్సవం వైభవంగా జరుపు[illegible] గా నవఖాళీ [illegible] దురహంకారంతో దేశభద్రతకు భంగం కలిగించిన వారిమధ్య "ఈశ్వర్ అల్లా తేరా – మందిర మస్జిద్ తేరాధామ్ – సబ్ కో సన్మతిదే భగవాన్" అని శాంతిమంత్రోపదేశం చేస్తూ ఉండిపోయాడు.

మతములన్నీ సదవగాహనతో, సోదర మైత్రితో మనగలిగిననాడు మతములెన్నియున్నను ఉపకారకములేగాని అపకారకములుగా నేరవు. "మతములన్నీ గమ్యస్థానమైన భగవంతుని చేరుటకు వివిధమార్గములేనని శ్రీ రామకృష్ణ పరమహంస తన జీవితంలో ఆచరించి చూపిన [illegible]యం. మనుష్యులలో స్వభావములు చిత్తవృత్తులు అనేకములు. 'లోకో భిన్న రుచిః' – ఆత్మలక్షణములు వికసించినవారు – వికసింపనివారు ఉన్నారు. ఒకే సత్యము వేయివిధములుగా ప్రకటింపబడును. అందువలన ఒకరిమార్గము మరొకరికి అనుకూలింపదు. గీతలలో 4-11. శ్లో. లో నన్నెవరు ఏ యీమార్గమున సమీపించినను వారి నా మార్గముననే ఆదరింతును – ఎవరెటు వచ్చినను నా వద్దకే చేరుదురని కృష్ణభగవాన్ అభయమిచ్చాడు. మత సహనం, సామరస్యం లేకపోవుటవలననే మానవాళి మనుగడ తీర్చిదిద్దవలసిన దివ్యజ్ఞానం జాతుల పతనానికి దారితీసింది. వివిధ మతాలలో ప్రవచింపబడిన సత్యాలు, సూక్తులు ఆ ఒక్కమతానికి పరిమిత

మైనవిగావు. అది మానవాళి దివ్యసంపద. భగవద్గీత, జైన, బౌద్ధ ధర్మాలు, బైబిలు, ఖొరాను జొరాష్ట్రురు సిద్ధాంతాలు మానవాళి కందరికి పనికివచ్చే సత్యశాస్త్రాలు. అనేక ప్రవక్తలపేర్లతో పిలువబడుతూన్న మతాలు ఉద్భవించనికాలంలో సకలమానవాళి నుద్దేశించి భగవద్గీత ప్రబోధింపబడినది. జైన తీర్థంకరులు, బుద్ధభగవాన్, క్రీస్తు, మహమ్మదు ప్రవక్త మొదలగువారందరు మానవకళ్యాణం కోరినారేగాని - నా మతమే గొప్పదని ఎవరు భావించలేదు. నా మతమే ముక్తికి మార్గమనలేదు. 'లోకాస్సమస్తా సుఖినోభవంతు'. 'సర్వేజనాః సుఖినోభవంతు' అని సనాతన ఆర్షధర్మ నినాదాలు. ఏ కాలంలో, ఏ ప్రాంతంలో అప్పటి మానవాళియొక్క అజ్ఞానం తొలగించి - వారిలో జ్ఞానోదయం కలిగించి శాంతియుత సహజీవనం కల్పించుటకే ఆయా కాలంలో ఆయా అవతారమూర్తులు - ప్రవక్తలు జన్మించి లోకంలోగల పశుత్వాన్ని పారద్రోలి - మానవత - దివ్యత్వం నెలకొల్పుతుంటారని దివ్యజ్ఞానసమాజ మూలపురుషుల విశ్వాసం. ధర్మం క్షీణించి, అధర్మం పెరిగినపుడు దుష్టశిక్షణకు, శిష్టరక్షణకు నేనవతరిస్తానని భగవంతుడు అభయమిచ్చాడు. అలాగే తనకు శిలువవేసిన అజ్ఞమానవులను క్షమించమనికోరి దేహంవిడిచిన క్రీస్తు పునరుత్థానమొందెను.

'ఏకంసత్ విప్రా బహుధావదంతి' - 'ఏకో దేవః సర్వభూతేషు గూఢః'' అని సనాతన ఆర్షమతం అంటుంది. అలాగే భగవంతుడొక్కడేనని అన్నిమతాలు ఉద్ఘోషిస్తున్నాయి. భగవంతుని పరిపూర్ణత నెఱుంగుటకు ఏ ఒక్క మతం సంపూర్ణమనవీలుకాదు. ఈ జగత్తు అంతా ఆయన ప్రతిబింబంగదా. భగవంతునిలో సర్వజగత్తు నిండిఉన్నదని ప్రతిమతం బోధిస్తుంది. అనంతమైన ఈ గోళాలన్ని సృష్టికర్త వైభవాన్ని చాటలేవు, ఒక నక్షత్రంలో ఆయన తేజస్సు ప్రకటితం కావచ్చు. నక్షత్రాలన్నిటికీ ఆయన సూర్యుడు. ఒకానొక గ్రహగోళం తనలోతాను పరిభ్రమిస్తు ఆయనలోని గమనాన్ని సూచిస్తుంది. ఒక మనోహరత్వం ఆయన సౌందర్యాన్ని - ఒక పర్వతం ఆయన ఉన్నతిని, శక్తిని - ఒక నది ఆయనలోగల సౌఖ్యప్రదమైన ప్రాణశక్తిని - విశాలసాగరం ఆయనలోగల గంభీరతను ప్రకటిస్తుంది. సకలేశ్వరుని యొక్క అనంత దివ్యస్వరూపాన్ని ఏ ఒక్క వస్తువుగాని - ఆ రూపంలోగల అందంగాని, రంగులశోభగాని, చివరకు ఆ భగవంతుని నివాసస్థలమైన మానవ హృదయకుహరంగాని ఆయన పరిపూర్ణతను వెల్లడింపజాలవు. సృష్టిలోని ప్రతివస్తువులో, ప్రతిప్రాణిలో ఆయన వైభవంలో ఒక అంశమాత్రమే ప్రకటితమౌతుంది. భూత భవిష్యద్వర్తమాన కాలలోగల సకల వస్తుజాలం యొక్క మొత్తంలో ఆయన అనంత ప్రతిబింబం గోచరిస్తుంది. కాబట్టి జగత్తు అంతటా నిండి ఉన్నా ఆయనశక్తియొక్క ఒక అంశమాత్రమే ఒక మతం వెల్లడించి ఉండవచ్చునని డా॥ అనిబిసెంటు వివరించింది. శ్రీకృష్ణభగవానుడు విభూతియోగంలో, విశ్వరూప సందర్శనయోగంలో తన సృష్టివిలాసాన్నే వివరించి అర్జునుని వంటి యోగికి చక్షుర్గోచరం చేశాడు.

ఇక ప్రవక్తలేమంటారో ఒకమారు అనుకుందాం. సనాతన ఆర్షమతం ఏమంటుంది? 'అసతోమాసద్గమయ తమసోమాజ్యోతిర్గమయ - మృత్యోర్మా అమృతంగమయ' అనగా అసత్యంనుండి సత్యానికి - చీకటినుండి వెలుగువైపు - మృత్యువునుండి అమృతత్వమునకు గొనిపొమ్మని

ఉపనిషత్తు లంటున్నాయి. న్యాయం, క్రమ శిక్షణ, సమత్వం, కర్తవ్యనిష్ఠ, విధి నిర్వహణ విధేయత కావాలంటుంది. ప్రేమకు అంకితమైన విజ్ఞానం, మానవసేవ, సత్యము, అహింస. బలహీనులకు కరావలంబనం, నైతికనిష్ఠ, కావాలని బుద్ధుని ప్రబోధం. ఆత్మత్యాగం - మానవులలో గల నీచస్వభావాలను శిలువవేసి ఉన్నత భావాలను భగవంతునిపై మరల్చుటయే శిలువ యొక్క సాంకేతికంగా ఏర్పరచాడు క్రీస్తు 'అంతటా నిండిఉండి ప్రపంచాన్ని నడిపిస్తున్న భగవంతుని సంకల్పానికి అత్యల్పమైన మానవ సంకల్పాన్ని ప్రభావితం చేసుకొని దానికే ఆత్మార్పణ గావించుకొనుటయే లక్ష్యమని ఇస్లాం ప్రబోధిస్తుంది. ఈ ప్రబోధనలలో దేనిని మనం వదలుకోగలము. వివిధ మతాలలోగల బాహ్యవిభేదాలనుగాక అందలి ఆంతరంగిక సమానధర్మాలను గుర్తిస్తే అన్నీ ఒకే లక్ష్యానికి మార్గాలని గుర్తిస్తే అవి ఒకే భగవంతుని దరిచేర్చు వివిధ మార్గాలన్న పరమహంస సూక్తిలో యదార్థ్యము బోధపడుతుంది.

మరొక కోణంనుండి మత సాంకేతికాలు అవగాహనం చేసుకున్నను, అందలి సమన్వయం బోధపడుతుంది. హిందుమతమందలి సత్, చిత్, ఆనందములు బ్రహ్మవిష్ణు మహేశ్వరులు - బౌద్ధమందలి - అమితాభ (అనంత జ్యోతి) అవలోకితేశ్వర - మంజుశ్రీలు - పార్శీల అహురమజ్ద, స్పింహా, అంగ్రోమిన్యిక్షు అర్మైనేలు, క్రైస్తవమందలి తండ్రి, కుమారుడు. పవిత్రప్రేతము (హోలీఘోస్టు) మొదలగు త్రిపుటీకరణతత్వ మన్నింటిలో గోచరిస్తుంది. పవిత్రగ్రంథమైన కొరాన్‌లో పరమేశ్వరుని మహత్వము దయాపూర్ణత, జ్ఞానశక్తి అను మూడు లక్షణాలు వివరింపబడినవి. భగవంతుని జగన్మాతగాగాని, జగత్పితగాగాని, భావించినపుడు మానవులందరు సోదరులు కారా? అందరిలో గల ఆత్మను నిరసిస్తే తన ఆత్మను-ఆత్మస్వరూపుడైన భగవంతుని నిరసించినట్లు భావించాలిగదా!

"వేయి దేవుళ్లపై విశ్వాసముంచి తన ఆత్మవిశ్వాసం కోల్పోయినయెడల, అది లక్ష్య సిద్ధికి తోడ్పడదని వివేకానందు లంటారుగదా. ఎంతటి ధనవంతులైనా తీరని అశాంతిని మత ప్రబోధలు తీర్చగలవు. ఎంత ధనంతోనైనా తీర్చజాలని అసంతృప్తి మహాత్ముల ప్రవచనాలవల్ల తీర్పబడుతుంది. గనుక నేటి సమాజంలో మతసూత్రముల సదవగాహన శాంతి యుత సహజీవనమునకు తోడ్పడగలదనుట అతిశయోక్తి గానేరదు.

సబ్‌కో సన్మతి దే భగవాన్.

---

నా శిష్యులారా! నా బిడ్డలారా! మహాకవుల కావ్యములను మీరెందుకు చదువకూడదు? 1. అవి సద్బుద్ధిని ప్రేరేపించును. 2. పరిశీలనాపాటవమును పెంపొందించును. 3. చిత్తమునకు ఉన్నతసంస్కారమును కలిగించును. 4. నిత్యజీవితమున ఎదురగు విసుగు విచారములనుండి కొంత విముక్తిని కలిగించి ఆత్మకు శాంతినిచ్చును. 5. సన్నిహితులగు తల్లి దండ్రుల యెడ గల బాధ్యతలనుగూర్చియు, దూరస్థుడైన రాజ్యాధిపతియెడగల బాధ్యతలనుగూర్చియు, అవి చక్కగ బోధించును. 6. రమణీయ ప్రకృతి వర్ణనల నెపమున అవి విజ్ఞానాభివృద్ధిని కలిగించును.

—కన్‌ఫ్యూషియస్.

# మహారతి

సంధ్యాసమయమున పరమశివుడు తాండవ నృత్యము చేయుచుండ దేవతలందరు మృదంగ తాళాది వివిధ వాద్యములతో ఆ సంకీర్తనయందు పాల్గొనుచుందురని ప్రతీతి. అందుచేతనే సంధ్యాసమయము పవిత్రమైనదనియు, ముల్లోకములు ఆ సమయమున శివమయమైయుండుననియు నమ్మిక.

శివలీలను వర్ణించు ఈ గీతికను ఉత్తర భారతమున విరివిగా సంధ్యాసమయమున గానము చేయుచుందురు. కాశిలోను, ఇతర స్థలములలోగల దేవాలయములలోను, గంగా తీరమునను భక్తులు ఆరతి సమయమున ఇది గానము చేయుచుండుట గాంతుము. అట్లు చేయుటచే శివ సాయుజ్యము లభించునని ఫల శ్రుతి.

సంక్షిప్త భావము : కైలాస శిఖరమందు కల్పవృక్షముల వనము. శివ మయమైన ఆ వనమందు తుమ్మెదల పుంజములు నాదము చేయుచుండ కోకిలలు కూయుచున్నవి. లలితములైన హంసలు వరుసలై క్రీడించుచు నృత్యకలాపము చేయుచు మహాదేవుని కీర్తించుచున్నవి. ఆ సుందర ప్రదేశమున మణిమయ శాలయందు శివసన్నిధిని గౌరీదేవి ఆనందముగా క్రీడారచన చేయ సురసేవితుడైన ఇంద్రుడు, మునిసేవితులైన బ్రహ్మాదులు హర హర హర మహాదేవ యని శిరసా ప్రణమిల్లుచున్నారు. విబుధస్త్రీలు శివ స్వరూపులై నాట్యము చేయుచుండ, సప్త స్వరయుక్తముగా కిన్నెరలు గానము చేయుచున్నారు. విష్ణుదేవుడు మృదంగము వాయింప, సరస్వతి వీణను, లలిత వేణువును వాయింపుచున్నారు. వీరందరు శివస్వరూపులై హర హర హర మహాదేవ యని గానము చేయుచున్నారు. చరణములయందలి నూపురములు సుస్వనము చేయుచుండ చక్రాకారముగ నర్తించుచు తిరుగుచు తాళములు, డమరు, చిటికెలు వేయుచున్నారు. గౌరవర్ణుడు, పంచాననుడు, త్రినేత్రుడై చంద్రమౌళియై, నీలకంఠుడై, సుందరమైన జడలు ధరించి, డమరు, త్రిశూలము, పినాకము, నృకపాలము చేత ధరించిన శివుడు మైమరచి శంఖనాదమునకు నృత్యము చేయ, బ్రహ్మ విష్ణువు నీరాజనము చేయుచు వేదపఠనము చేయుచున్నారు. వామ సంస్థయైన గిరిజ, ఆ మనసిజవైరిని ఆనందముగా అవలోకించుచు సేవించుచు వినోదించుచున్నది.

తాపత్రయ హారకమై సుందరమైన శివుని ఈ రూపమును ధ్యానించుచు ఆరతి సమయమున భక్తితో గానము చేయువారికి, వినువారికి శివసాయుజ్యము లభించునని ఈ మధుర గీతిక తాత్పర్యము.

—కె. శివకుమార్

ఓం జయ గంగాధర హర శివ జయ గిరిజాధీశ। శివ జయ గౌరీనాథ।
త్వం మాం పాలయ నిత్యం, త్వం మాం పాలయ శంభో, కృపయా జగదీశ।
ఓం హర హర హర మహాదేవ

కైలాసే గిరిశిఖరే కల్పద్రుమవిపినే, శివ కల్పద్రుమవిపినే
గుంజతి మధుకరపుంజే గుంజతి మధుకరపుంజే కుంజవనే గహనే।
కోకిల కూజతి ఖేలతి హంసావళి లలితా శివ హంసావళి లలితా,
రచయతి కలాకలాపం రచయతి కలాకలాపమ్, నృత్యతి ముదసహితా
ఓం హర హర హర మహాదేవ ॥ 1

తస్మిన్ లలితసుదేశే శాలా మణిరచితా శివ శాలా మణిరచితా
తన్మధ్యే హరనికటే తన్మధ్యే శివ నికటే గౌరీ ముదసహితా।
క్రీడా రచయతి భూషారంజిత నిజమీశం శివ రంజిత నిజమీశం
ఇంద్రాదిక సురసేవిత బ్రహ్మాదిక మునిసేవిత ప్రణమతి తే శీర్షమ్
ఓం హర హర హర మహాదేవ ॥ 2

విబుధవధూ ర్బహు నృత్యతి ముదసహితా శివ హృదయే ముదసహితా
కిన్నర గాయన కురుతే కిన్నర గాయన కురుతే సప్తస్వర సహితా।
ధినకత థై థై దినకత మృదంగ వాదయతే శివ మృదంగ వాదయతే
క్వణక్వణ లలితా వీణాం క్వణక్వణ లలితా వేణుం మధురం నాదయతే
ఓం హర హర హర మహాదేవ ॥ 3

రుణ రుణ చరణే రచయతి నూపురముజ్జ్వలితం శివ నూపురముజ్జ్వలితమ్
చక్రావర్తే భ్రమయతి చక్రావర్తే భ్రమయతి కురుతే తాంధిక తాం తాం
లుప చుప తాళం నాదయతే శివ డమరూ నాదయతే
అంగుష్ఠాంగుళినాదం అంగుష్ఠాంగుళినాదం లాస్యకతాం కురుతే
ఓం హర హర హర మహాదేవ ॥ 4

కర్పూరద్యుతిగౌరం పంచాననసహితమ్ శివ పంచాననసహితమ్
త్రినయనశశిధరమౌళిం త్రినయనశశిధరమౌళిం విషధరకంఠయుతం
సుందరజటాకలాపం పావకయుతఫాలం శివ పావకయుతఫాలం
డమరుత్రిశూలపినాకమ్ డమరుత్రిశూలపినాకమ్ కరధృతనృకపాలమ్
ఓం హర హర హర మహాదేవ ॥ 5

శంఖనినాదం కృత్వా ఝల్లరి నాదయతే శివ ఝల్లరి నాదయతే
నీరాజయతే బ్రహ్మా నీరాజయతే విష్ణుర్ వేదఋచాం పఠతే
అతిమృదుచరణసరోజం హృదికమలే ధృత్వా శివ హృదికమలే ధృత్వా
అవలోకయతి మహేశం శివ లోకయతి సురేశమ్ ఈశం అభినత్వా
ఓం హర హర హర మహాదేవ ॥ 6

రుద్రై రచయతి మాలా పన్నగముపవీతం శివ పన్నగముపవీతమ్
వామవిభాగే గిరిజా వామవిభాగే గౌరీరూపం అతిలలితమ్
సుందరసకలశరీరే మనసిజ కృతభస్మాభరణమ్
ఇతి వృషభధ్వజరూపమ్ హర శివ శంకరరూపమ్ తాపత్రయ హరణం
ఓం హర హర హర మహాదేవ

ధ్యానం ఆరతి సమయే హృదయే అతి కృత్వా
శివహృదయే అతి కృత్వా రామం త్రిజటానాథం
శంభో త్రిజటానాథమ్ ఈశం అభినత్వా
సంగీతమేవం ప్రతిదిన పఠనం యః కురుతే, శివ పఠనం యః కురుతే
శివ సాయుజ్యం గచ్ఛతి హర సాయుజ్యమ్ గచ్ఛతి భక్త్యా యః శృణుతే
ఓం హర హర హర మహాదేవ

జయ గంగాధర హర శివ జయ గిరిజాధీశ శివ జయ గౌరీనాథ
త్వం మాం పాలయ నిత్యం త్వం మాం పాలయ శంభో కృపయా జగదీశ
ఓం హర హర హర మహాదేవ

నమ శ్శివాభ్యాం నవ యౌవనాభ్యామ్ పరస్పరాశ్లిష్ట వపుర్ధరాభ్యామ్
నగేంద్ర కన్యావృష కేతనాభ్యామ్ నమోనమ శ్శంకరపార్వతీభ్యామ్.

సర్వమంగళమాంగళ్యే శివే సర్వార్థసాధికే।
శరణ్యే త్ర్యంబకే గౌరి నారాయణి నమోస్తుతే॥

## సచ్చిదానందము

పూరి బాలస్వామిగుప్త

(శ్రీ) వినోబాభావేగారిచే రచింపబడిన సమాదయః అను హిందీ వ్యాసములోని కొంతభాగమునకిది అనువాదము.

ఈ విశాలమైన విశ్వము 5 భాగములుగా వున్నది.

1. అస్తి, 2. భాతి, 3. ప్రియం—ఈ మూడు పరమాత్మకు సంబంధించినట్టివి.

4. రూపము, 5. నామము—ఈ రెండు జగత్తునకు సంబంధించినవి.

భగవానుడనగా ఎట్టివాడో మొదటి మూడు పదములు విశదీకరించుచున్నవి. అస్తి అనగా వుండుట, భాతి యనగా ప్రకాశించుట, ప్రియమన ఇష్టమైనదిగా ఉండుట – అని ఈ పదముల కర్థములు.

మంచిదిగా అనగా ప్రియమైనదై ప్రేమ నొసగునదై ప్రకాశించునట్టిదే పరమాత్మ యని భావము. దీనినే సచ్చిదానందమనియు అందురు. స్వయంప్రకాశశక్తి కలదియే మంచిది. కావున ప్రకాశమే భగవానుడనియు చెప్పవచ్చును.

ఈ జగత్తాంత్తయూ పంచభూతములచే నిర్మితమైనది. అయిదింటిలోనూ ఆకాశము అతి సూక్ష్మమైనది. దానికంటెను క్రమేణ స్థూలమైనవి: వాయువు, తేజస్సు, జలము, పృథివి అనునవి.

ఈ పంచభూతములలోనూ, దేవ, తిర్యక్, నరరూపములలోనూ సచ్చిదానందము అభిన్న రూపములో సమానముగా వున్నది. దేవతలు మానవులకంటె ఉన్నతులు. తిర్యక్కులు అనగా పశు పక్షి కీటకాదులు మానవులకన్న క్రింది స్థాయికి చెందినవి.

'బ్రహ్మసూత్రముల'లో బాదరాయణుడు ఈ విధముగా చెప్పాడు. "తదుపర్యపి బాదరాయణః సంభవాత్" (మానవునికంటె ఉన్నత స్థితిలో ఉన్నవారికినీ పురుషార్థము సంభవనీయమే) అని. అయితే ఇప్పుడు తిర్యక్కుల లోనూ పురుషార్థము కలదా? అన్న ప్రశ్న ఉదయించును. మానవునికన్ననూ తగ్గు స్థాయి లోగల జీవులలోనూ పురుషార్థము సంభవమే నని నా అభిప్రాయము. చిన్నవైన చీమల్లోనూ పురుషార్థమున్నది. వర్షాకాలములోని నాలుగు మాసములూ అవి మనకంటికే కనిపించవు. అప్పటికి అవి తగు ఆహారమును సమకూర్చు కొనివుంటాయి.

ఒకసారి ఒక సర్పమునకు గాయము తగిలినది. ఇంకను అది చనిపోలేదు. దానిక్రింద పడి ఎన్నో చీమలు చనిపోయినవి. వానిలో ఒక చీమ బ్రతికి బయటపడి తనవారికి చెప్పినదికాబోలు వెంటనే కొన్ని వేల చీమలు వచ్చి పామును చుట్టుముట్టి పీక్కుతిన్నాయి. అది చచ్చినపాము కాదుసుమా! ప్రతికిన పామునే చిన్నిప్రాణులైన చీమలు ఐక్యతతో ఒక్కుమ్మడిగా దాడిచేసి ఆ విధముగా సంహరించాయి. తలా ఒకముక్కను నోట కరుచుకొని ఆ చీమలు ఇళ్లకు వెళ్లాయి. కొన్ని వేల ప్రాణుల త్యాగములు, బలిదానములు ఈ పోరాటములో జరిగినవి. పానిపట్టు యుద్ధమున కన్నా ఇది తక్కువదికాదేమో అనిపించింది.

ఒక చీమ తన మనస్సులో ఏమి తలచుచున్నదో, స్వర్గమునకు ఆవల ఏమి జరుగుచున్నదోగూడా నిజమైన యోగి చెప్పగలడని యోగిలో అంతటి మహత్తు గలదని 'జ్ఞాన దేవుడు' యోగివర్ణనలో చెప్పాడు.

చీమలలోనూ పురుషార్థమున్నది. త్యాగము, సహకారము, ఐకమత్యము, సామూహిక కార్యము, దీక్ష, పట్టుదల, ముందు కాలానికి ఆహారసంగ్రహము ఇవన్నియు చీమలలో గలవు. అంతేకాదు. అవి భువనేశ్వరం లోని మందిర గోపురాలను జ్ఞాపకం తెచ్చేలా అందమైన ఇళ్లను నిర్మించుకొంటాయి. ఎంత వర్షము పడినా వానియిండ్లలో వర్షము కురియదు. ఇలాంటి పురుషార్థము వానిలో వుంది. పాపపుణ్యములు వాని నంటవచ్చును. ఉన్నతయోనులలో అవి జన్మించవచ్చును. కాని వీనిని గురించి బాదరాయణుడసలు పేర్కొనలేదు.

ఆకారములు వేరైననూ, జడములైనను, జీవములైననూ, ప్రతిదానిలోనూ, పంచభూతాల్లోనూ సచ్చిదానందము అభిన్నరూపంలో సమానముగా వున్నది. శంకరాచార్యులును ఇదే విషయమును చెప్పాడు.

నామరూపములలో, నామము, రూపము అను రెండు అంశములున్నవి. సచ్చిదానందనములో సత్, చిత్, ఆనందమను మూడు అంశములున్నవి. నామరూపములను త్యజించి

సచ్చిదానందములో లీనమగుటయే సమాధి యనబడును. సమాధిస్థానము హృదయము.

వెలుపల ఒక తేలు కలదనుకొనుడు! అది కరవగలదని తెలిసినప్పటికీ బాహ్యముగానూ అంతరములోనూ సచ్చిదానందమునే అనుభవింపవలెను. పసిపిల్లవానికి తేలును చూస్తే కలిగేది భయం కాదు. ఆనందము. ఇలాంటి ఆనందమునే లోపలనూ, వెలుపలనూ పొందాలి.

పసివారియొక్క నిర్మలత్వపు ప్రభావము. తేలు సర్పములవంటి క్రూరజంతువులు వానిపైని గూడా పడును. ఉదాహరణకు నేను కళ్లారా చూసిన ఒక సంఘటనను చెబుతాను. ఒక మావటీడు ఏనుగును పెంచాడు. దానికి ఒకసారి మత్తెక్కింది. అదుపులో లేకుండా పరుగెత్తుకొని, మావటివాని భార్య ముందుకు వచ్చింది. ఆమె ఆ మదించిన ఏనుగునుచూచి మిక్కిలి భయపడి తన చిన్నకుమారుని ఎత్తుకొని ముందుకు పరుగెత్తినది. అయినను, ఏనుగు ఆమెను వదలలేదు. ఇక విధిలేక పసిబాలుని ఏనుగు ఎదుట పడవేసి దాని కెదురుగా నిలిచి నమస్కరించి "నన్ను చంపదలిస్తే ముందుగా ఈ బాలుని చంపు" అని అంది. ఏనుగు ఆ బాలుని స్పృశించి శాంతముతో వెనక్కి వెళ్లి పోయింది.

ఏనుగు ఆ పాపను ఏమీ చేయకపోవడంలో రెండు మానసిక భావనలు స్ఫురించును. 1. రాగద్వేషములులేని నిర్మలమైన ఆ పాప వద నమునుచూచి హాని చేయకపోయింది. 2. రోజూ తనకు ఆహారాన్ని ప్రేమతో పెట్టే ఆ చెల్లెలి కుమారుని ఎలా చంపమని అని పించవచ్చును. నిజమే, నిర్దోషిత్వము ఎదుట నిర్దోషిత్వమే ప్రకటింపబడుతుంది. నిశ్శత్రుత్వపు పరిసరములలో నిశ్శత్రుత్వమే ప్రకటిత మాతుంది.

సెయింట్ ఫ్రాంసిస్ ఆఫ్ ఆసిస్ ఒడిలో సర్పము నాట్యముచేస్తూ ఆడెడిదట! నిర్వికారుడైనవానికి హాని కలుపగూడదని పాముకు గూడా జ్ఞానముగలదు.

కావున నామరూపభావనలు త్యజింపవలెను. బాహ్యముననూ, అంతరముననూ సచ్చిదానందమునే అనుభవింపవలెను.

మన దుర్గుణాలు వెల్లడయేటప్పుడు వెనుక ఒక నటనగాని డంభముగాని ఉండదు. ఆ దుర్గుణాలు వాస్తవముగానే వెల్లడవుతాయి. కాని వచ్చిన చిక్కల్లా సద్గుణాలు వెల్లడించేటప్పుడే. పరిశీలించిచూస్తే ఆ సద్గుణాల ప్రకటన వెనుక దంభము, నటన దాగిఉన్నట్లు తెలుసుంది. ఈ విపరీతప్రవర్తనను చూసే డెమాక్రిటిస్ నవ్వాడు హెరాక్లిటస్ విచారించాడు. సాక్రటిస్ సరిదిద్దడానికి ప్రయత్నించాడు. కాని సరిదిద్దడం ఒక భగవంతునికిమాత్రమే సాధ్యం.

—Marsicino Ficino.

* తప్పుపనులు చేయకుండ ఊరక ఉంటేనే చాలును-అదే లోకానికి ఎంతయో మేలు చేసినట్లగుతుంది.

* నీవు పెద్దవారికి విధేయుడవై యుండుము. నీకు చిన్నవారు విధేయులై యుందురు.

—అలీ.

# మాతృదేవి చరణసన్నిధి

ఆంగ్ల గ్రంథము:
ఎట్ ది హోలీమదర్స్ ఫీట్

అనువాదము:
పి. గణపతిశాస్త్రి

ఆధ్యాత్మిక సాధనలలో కొందరు త్వరితంగా పురోగమిస్తారు. కొందరు నెమ్మది నెమ్మదిగా సాగిపోతారు. అంతా పూర్వకర్మ ఫలితాల ధోరణులమీద ఆధారపడి ఉంటుంది. మంత్ర దీక్షలోగల బాధ్యతలవల్లనే రాఖాల్ మంత్ర దీక్ష ఇవ్వడానికి ఇష్టపడడు. అతడు ఒకసారి ఇలాగన్నాడు "అమ్మా, ఎవ్వరికయినా మంత్రోపదేశం చేసినంతలోనే జబ్బు చేస్తుంది! కనకనే ఎవ్వరికయినా మంత్రదీక్ష ఇవ్వాలన్న ఆలోచన కలగగానే నా గుండెలో దడ బయలుదేరుతుంది!"

మఠంలో ఉన్న స్వామి ఒకాయన ఒక చిన్న పిల్లవాడికి మంత్రదీక్ష ఇవ్వవలిసిందని అమ్మ దగ్గిరికి పంపించారు. ఆ అబ్బాయికి సంబంధించిన వివరాలన్ని అమ్మ ఎంతో జాగ్రత్తగా విన్నారు. ఆ పైన "నాయనా, నీకు సాంప్రదాయికులయిన వైష్ణవగురువు లున్నారుగదా! వారిదగ్గిర మంత్రదీక్ష తీసుకో!" అని సలహా ఇచ్చారు. కారణం ఏదయినా ఆ పిల్లవాడికి ఆమె మంత్రదీక్ష అనుగ్రహించలేదు...

వారణాసినుండి తిరిగి వచ్చినతరవాత కొన్నాళ్లు మాత్రమే అమ్మ కలకత్తాలో ఉన్నారు. ఆ పైన వెంటనే జయరాంబాటికి వెళ్లిపోయారు. ఫిబ్రవరి 25 వ తేదీన దారిలో ఆమె కోల్పారామఠానికి చేరుకున్నారు. పూజాగృహం పక్కనే ఉన్నగదిలో మాతృదేవికి బస ఏర్పాటుచేశారు. నేనొక చిన్న మర్రి విత్తనం ఆమె దగ్గిరికి తీసుకువెళ్లి, "అమ్మా, ఎర్రమూలికల విత్తనాలకన్న ఇది చాలా చిన్నది. ఈ మర్రివిత్తనంలోనించే బ్రహ్మాండమయిన వృక్షం బయలుదేరుతున్నది! ఎంత విచిత్రము!" అన్నాను.

అమ్మ: అవును! నీ వన్నట్టు గొప్ప వృక్షం అవుతుంది! కాని ఇలాగే భగవానుని నామధేయం ఎంత చిన్న విత్తనమో చూడు! కాని క్రమ క్రమంగా కొంతకాలానికి దానిలో నుండే గంభీరసమాధి, ప్రగాఢభక్తి, ప్రేముడి కలిగి ఆధ్యాత్మికసిద్ధి కరతలామలకం కాగలదు!

ఆ తరవాత మేము జయరాంబాటి చేరుకున్నాము. సాయంత్రం భోజనానికి కూర్చున్నాము. అంతలోనే మాలో ఒకాయన "ఈ మనుషులు [అమ్మ సహోదరులు] ఎంత నిర్లక్ష్యంగా ఉన్నారో చూశావా అమ్మా! నీ విక్కడికి వస్తున్నావుగదా! అయినా నది ఒడ్డున నిన్ను కలుసుకోవడానికి వారు ఎవ్వరిని పంపించలేదు!" అని గట్టిగా అన్నాడు.

ఆ సంగతి ప్రస్తావించి, అమ్మ తన పెద్ద సహోదరునితో "మమ్మల్ని కలుసుకోడానికి నీవు నదీతీరానికి ఎవ్వరిని పంపించలేదేమి? ఎవ్వరిని పంపించనేలేదు సరికదా, నీవైనా రాలేదేమి?" అని అన్నది. దానిమీద ప్రసన్న మామ అందుకున్నారు.

"కాళీవల్ల భయంకొద్దీ నే నెవ్వరిని పంపించలేదు. 'అదిగో, అక్క నెలాగయినా తన దగ్గిరికి రప్పించుకోడానికే పన్నాగం పన్నుతున్నాడు!' అని అతడు దుయ్యబడతాడేమో అని నా భయం! నీ శిష్యు లెంతటివారో, నీ వెంతటి దానివో నే నెరగనను కున్నావా? నా కంతా తెలుసును, కాని కాళీ ఏమన్నా అంటాడేమో అన్న భయంకొద్దీ నే

నేమీ చెయ్యడానికి సాహసించలేక పోతున్నాను. భగవంతుడు నాకీసారి అంతటి శక్తి ఇయ్యలేదు! ఈ జన్మలోలాగే ముందు జన్మలన్నిటిలోను నీవీ విధంగా అక్కవుగా అవతరించేటట్టు నన్ను అనుగ్రహింతువుగాక!''

అమ్మ: ఏమి టేమిటి? మళ్లీ జన్మలో కూడా నన్ను మీ ఇంట్లో పుట్టమంటున్నావా? ఇది చాలు! తా నెప్పుడు తిరిగి కౌసల్య గర్భంలో జన్మించకూడదని శ్రీ రాము డొకప్పుడు ప్రార్థించాడట! మళ్లీ మీ కుటుంబంలో జన్మించడమా! నాయన శ్రీరామభక్తులు. ఆ పైన ఎల్లప్పుడు ఇతరులకు సాయపడుతూండే వారు. ఆ పైన అమ్మ చాలా జాలిగుండె కలది! కనకనే నే నిక్కడ జన్మించాను! అంతే!

ఒకనాడు ప్రసన్నమామ అమ్మదగ్గిరికివచ్చి అడిగాడు. ''అక్కా! నీవు ఒకాయన కలలో కనిపించి మంత్రోపదేశం చేశావట! ఆ పైన జన్మ మృత్యువులనుండి తరించగలవని కూడా ధైర్యం చెప్పావట! నీవు మమ్మల్ని అందరిని నీ ఒడిలో పెట్టుకుని పెంచి పెద్దవారిని చేశావు. మరి మే మంతా శాశ్వతంగా ఇలాగ ఉండి పోవలసిందేనా?''

దానికి అమ్మ ఇలా గన్నారు.

అమ్మ: అంతా ఠాకూరు సంకల్పానుసారంగానే జరిగిపోతుంది. ఇదిగో చూడు! శ్రీ కృష్ణుడు గొల్లపిల్లలతో ఆడుకున్నాడు. వారితో కలిసి నవ్వుతూ విహరించాడు. వారిచ్చిన అన్నపానాలానందంతో స్వీకరించాడు. ఆరగించాడు. అయితే ఆయన నిజస్వరూపమేమో వారి కేమాత్రమయినా తెలుసునా?''

ఇంకొకనాడు, మా భోజనాల య్యాక, శిష్యులు కొందరు పాత్రలు తోమడానికి ముందుకి వచ్చారు. అయితే అమ్మవారిని ఆ పని చెయ్యనివ్వలేదు. ''వద్దు! వద్దు! మీ రా పని చెయ్యవద్దు! ఆ దేవతలుకూడా గౌరవించే పెన్నిధులు మీరు.''

జయరాంబాటి 14, మార్చి 1913.

శ్యామబజారు లలితబాబు, ప్రబోధబాబు వచ్చారు. మాతృదేవిని సందర్శించి తమ గౌరవం వెల్లడించుకోడానికి వారు మధ్యాహ్నం వచ్చారు. ఆ పైన ఆమెతో ప్రసంగం ప్రారంభించారు... ఆ తరుణంలో ఆహార నియమాలను గురించి ప్రసంగిస్తూ అమ్మ ఇలా గన్నారు.

''మీరు ఏ ఆహారం స్వీకరించినా ముందుగా అది భగవానునికి నివేదించాలి. అలాంటి ఆహారం కాక వేరువిధమైన ఆహారమేది స్వీకరించరాదు. మీరు తీసుకున్న ఆహారంమీదే మీ రక్తం పరిశుద్ధత ఆధారపడి ఉంటుంది. దైవానికి నివేదించిన ఆహారం స్వీకరిస్తే మీ మనస్సు పునీత మవుతుంది. మీకు శక్తి కలుగుతుంది. మీ మనస్సు పవిత్రమయితే మీ నమ్మిక ప్రేముడి మిక్కిలి పవిత్రాలవుతాయి.''

అంతలోనే ప్రబోధబాబు ఇలాగ ప్రశ్నించారు.

''అమ్మా, ఠాకూరుకు త్యాగమంటే ఎంతైనా ప్రీతి. అయితే మాలో అలాంటి త్యాగం ఎక్కడ ఉన్నది?''

అమ్మ: ఆ త్యాగ వైరాగ్యాలు క్రమ క్రమంగా స్థిరపడతాయి. ఈ జన్మలో కొంత వరకు బలపడితే మరు జన్మలో మరింతగా బలపడతాయి. జీవుని బాహ్యావరణం మాత్రమే మారుతుంది. అంతరాత్మ అలాగే ఉండి పోతుంది.

ఠాకూరు అప్పు డప్పుడు అంటూండేవారు. ''నేను తలుచుకుంటే కామార్పుకూరు అంతా బంగారంతో మలామా చెయ్యగలను! మేజోబాబును [మథురబాబును] అడిగితే సరి!

ఆయన వెంటనే నా కోరిక నెరవేర్చి తీరతాడు! కాని దానివల్ల ప్రయోజన మేమిటి? అవి శాశ్వతాలు కావుగదా!

"ఇది వారి చిట్టచివరి జన్మ అని కొందరిని గురించి ఠాకూరు అంటూండేవారు. 'ఇదిగో, చూడు' ఇప్పుడు తనకి దేనిమీదా కోరిక లేదు! కనకనే ఇది ఆఖరిజన్మ."

వారిద్దరు మాతృదేవికి పాదాభివందనం చేసి, సెలవు తీసుకున్నారు.

సాయంత్రం మేమంతా మాట్లాడుతూ అమ్మగారికి ఎదురుగా ఉన్న వరండాలో కూర్చున్నాము. ఆ సమయంలో నేనన్నాను.

నేను: ఒకప్పుడు కొంతమంది శూద్రునికి సన్యాసాధికారం ఎక్కడనించి వచ్చిందని వివేకానందస్వామిని ప్రశ్నించారు. దానిమీద ఆయన వర్ణాన్ని బట్టి కాయస్థులు క్షత్రియులని, అందుచేత అతనికి సన్యాసాధికారం కలదని సమాధానం చెప్పారు.

ఆ తరవాత దానిని గురించి అమ్మ ఇలాగ సెలవిచ్చారు.

అమ్మ: నా కివ్వన్ని తెలియవు! కాని నరేన్ సప్తర్షులలోనుంచి భూమిమీదికి అవతరించాడని నేనెరుగుదును. ఇంక ఠాకూరు శిష్యులందరు జ్ఞానసంపన్నులయిన సన్యాసులు. జ్ఞాని సన్యాసి కావచ్చును. ఉదాహరణకు గౌర్దాసిని తీసుకో! నిజానికి ఆమెను స్త్రీగా పరిగణించవచ్చునా? ఆమె నిజంగా పురుషుని వంటి వ్యక్తి. ఆమెవంటి పురుషులు ఎంతమంది ఉన్నారు? స్కూలుకోసము, గుర్రపుబండి కోసము, గుర్రాలకోసము ఆమె ఎలాంటి చక్కటి ఏర్పాట్లు చేసిందో చూడు! ఒక మహిళ సన్యసిస్తే ఆమె ఆపైన మహిళగా ఉండిపోజాలదని ఠాకూరు అంటూండేవారు. ఆమె నిజంగా పురుషుడుగా మారిపోతుంది,

జయరాంబాటి 1913, మార్చి, 28.

మేమంతా మధ్యాహ్నం భోజనం చేస్తున్నాము. మాతృదేవి మతిలేని వదిన ఒక పసిపాపకోసం కూర్చోవడానికి అనువయిన పీట, గ్లాసుతో మంచినీళ్లు తన వరండాలో పెట్టింది. ఆ గ్లాసునీళ్లతో నింపించినంతలోనే ఒక పిల్లి వచ్చి ఆ నీళ్లన్ని తాగివేసింది. పిన్ని అది గమనించి మండిపడింది. ఆ పిల్లిని హతమార్చివేస్తానని కేకలు పెట్టింది. మాతృదేవి ఆ సమీపంలోనే ఉండి, అది అంతా గమనించి "వద్దు! వద్దు! పాపం దాహం వేస్తూందిలా ఉంది! దాన్ని అడ్డుకోవద్దు! అదేగాక అది ఇంతకు మునుపు ఆ నీటిలో మూతి పెట్టింది!" అని వారించింది. దానిమీద ఆ మతిలేని వదిన మరింతగా మండిపడింది.

"నీ జాలి అంతా ఆ పిల్లిమీద చూపించి వ్యర్థం చెయ్యకు! మరి మనుషులమీద నీకే మాత్రం జాలి ఉంది? మనుషులమీద జాలి పడవేమిటి?" దానిమీద అమ్మ తీవ్ర స్వరంతో బదులు చెప్పింది,

అమ్మ: నేను జాలిపడని వ్యక్తి నిజంగా దురదృష్టవంతుడే! నేను జాలిపడని వారెవ్వరు లేరు! అల్పాల్పమయిన జీవిని గురించి కూడా నేను జాలి పడుతూనే ఉంటాను.

మేము రాత్రి భోజనానికి కూర్చున్నాము. బంగాళాదుంపలతో మరికొన్ని కాయగూరల ముక్కలు కలిపి అమ్మ మంచి వంటకం సిద్ధం చేసింది. అది మా దగ్గిరికి తీసుకువచ్చి, "ఇది ఎలాగుందో, కాస్త రుచి చూడండి!" అన్నది. నేనది కొంచెం నోట పెట్టుకుని "అచ్చం పథ్యం కూరలాగుంది! బొత్తిగా రుచి, పచిలేకుండా చప్పగా ఉంది! ఎవరు వండారిది?" అన్నాను.

అమ్మ: నేను,

నేను : స్వయంగా నీ చేతులతో నేనా అమ్మా?

అమ్మ : అవును.

నేను : దానిలో నా కేమి ప్రత్యేకత కనిపించలేదు. మా ప్రాంతంవారి కది బొత్తిగా రుచించదు.

అమ్మ : అయితే ఈ రసం కొంచెం వేసుకో. అంతలోనే నళిని అందుకుని అడిగింది.

"అత్తా! నీ వెన్నడు వంటకాలలో ఎర్ర మిరియాలు వాడనే వాడవు! అలాంటప్పుడు అతడు అది ఎలాగ నోట పెట్టుకోగలడు?"

అమ్మ : ఇదిగో, నళినీ, నీవు అతని మాటలేవీ చెవిని పెట్టవద్దు! నీ అంతట నీవే స్వయంగా రుచి చూసిన తరవాత నీకే తెలుస్తుందిలే!"

ఆ పైన నే నందుకున్నాను.

నేను : అమ్మా, కొన్నాళ్లనించి నీ వే మేమి వంటకాలు తయారు చేస్తున్నావో, ఎలాగ చేస్తున్నావో అని జాగ్రత్తగా పరిశీలిస్తూనే ఉన్నాను. రుచి చూస్తూనే ఉన్నాను, కాని అన్నీ నాకు ఒకేలాగున్నాయి.

అమ్మ : సరేలే! అయితే ఒకనాడు మీ ప్రాంతాలలో ఎలాగ వండుతారో సరిగ్గా అలాగే వంటకాలన్నీ తయారు చేస్తాను. దానికేముంది? మీ ప్రాంతంలో ఎర్ర మిరియాలపొడి ఎక్కువగా వేస్తారు. అంతేకదూ?

నేను : కాని అంత ఎక్కువగా ఎర్ర మిరియాలపొడి వెయ్యకూడదుసుమా! అంతేకాదు. తగినంత ఎర్ర మిరియాలపొడి వెయ్యక పోయినంతమాత్రాన రుచి పాడై పోదు.

ఆ తరవాత అమ్మ నళినికేసి అన్నది.

అమ్మ : రేపు చిక్కుడుగింజలు తీసుకురా! నేను చక్కగా వండుతాను. పూర్వం నే నెంతో గొప్పగా వంటకాలు తయారుచేసే దాన్ని. ఇటీవల ఆ అలవాటు అంతా హరించుకుపోతూంది. లక్ష్మీఅమ్మ, నేను కామార్పుకూరులో వంట చేస్తూండేవాళ్లం! ఒకనాడు హృదయ్‌తోబాటు ఠాకూరు భోజనం చేస్తున్నారు. లక్ష్మీతల్లి చెయ్యితిరిగిన వంటమనిషి. ఒకనాడు ఠాకూరు ఆమె తయారుచేసిన వంటకం నోట పెట్టుకుని, హృదయుని కేసి తిరిగి "హృదు! ఇది వండినవ్యక్తి ప్రత్యేకించి వంటలో బాగా ఆరితేరిన మనిషి. ఆ తరవాత ఆయన నేను తయారుచేసిన వంటకం నోట పెట్టుకుని "ఇది తయారుచేసిన మనిషికి వంట బొత్తిగా రాదు!" అన్నారు.

దానిమీద హృదయ్ ఇలా గన్నాడు.

నిజమే! కాని నీ వన్న ఆ వంట చేతగాదనుకున్న మనిషి ఎల్లప్పుడు నీ అందుబాటులో ఉంటుంది...ఆవిణ్ణి నీవు ఒక్కసారి పిలిస్తే చాలు! వెంటనే నీ ముందు నిలబడుతుంది. ఇంక వంటలో నేర్పరి తన పనికి సొమ్మెక్కువగా తీసుకుంటుంది. అదీగాక అటువంటిమనిషి ఎల్లప్పుడు అందుబాటులో ఉండదు.

దానిమీద ఠాకూరు "అవును! నీ వన్నమాట అక్షరాలా నిజం! ఆవిడ ఎల్లవేళలా అందుబాటులో ఉంటుంది." అన్నారు.

అమ్మ : ఒకసారి దక్షిణేశ్వరంలో ఠాకూరు నరేంద్రునికి ప్రత్యేకించి రుచి అయిన వంటకం వండుతున్నారు. నేను చపాతీలతోపాటు ఒక విధమయిన పప్పువంటకం తయారుచేశాను. భోజనం అయ్యాక "వంట ఎలాగుంది నరేన్?" అని ఠాకూరు నరేన్‌ని అడిగారు! "బాగానే ఉంది గాని రోగి పథ్యం భోజనంలా ఉంది" అన్నాడు నరేన్. దానిమీద ఠాకూరు "నీ వేమి వండావు? నరేన్‌కి ఈ సారి చిక్కుడుగింజల పప్పుతో చపాతీలు దళసరిగా తయారుచేసిపెట్టు" అన్నారు. చిట్టచివరికి నే నలాగే

వండాను. నరేంద్రుడు ఆ వంటకంతో ఎంతైనా సంతృప్తిపొంది సంతోషించాడు.

జయరాంబాటి, 8, మే 1913.

రాధుకి జబ్బు చేసింది. మతి స్తిమితంలేని ఆమె తల్లి తిట్లు మొదలుపెట్టింది. ఆమె అదే ధోరణిలో అమ్మ నుద్దేశించి, "నీవు నా కూతురిని చంపివెయ్యడానికే మందు లిస్తున్నావు!" అంటూ ప్రారంభించి, నోటికి వచ్చినట్టు దుమ్మెత్తిపొయ్యడం మొదలుపెట్టింది. చిట్టచివరికి వరదా మామని అక్కడికి రప్పించడం జరిగింది. ఆయన రాధుని గట్టిగా కూకలేశారు. అదే సమయంలో అమ్మ మరి ఆ తిట్లన్ని భరించలేక తిరిగి తిట్టడం మొదలుపెట్టింది.

"నేనీ వేళ నీ అంతు చూస్తాను నేనే తలచుకుంటే ప్రపంచంలో ఎవ్వరు నిన్ను రక్షించలేరు! అందువల్ల పాపం రాదు! పుణ్యమే వస్తుంది! అంతే!"

ఆ తరవాత అమ్మ మాతో ఇలా గన్నారు.

"ఠాకూరు నన్నెన్నడు ఏ విధంగాను చిన్నబుచ్చుతూకూడా మాట్లాలేదు. అటువంటి మహనీయవ్యక్తిని వివాహం చేసుకున్నాను నేను! అటువంటి వ్యక్తి నా పెనిమిటి! దక్షిణేశ్వరంలో నేనొకనాడు ఆయన గదిలోకి భోజనం తీసుకునివెళ్లాను! ఆపైన తిరిగి వస్తూంటే నేను లక్ష్మి ననుకుని 'నీవు వెళ్లిపోయేటప్పుడు తలుపువేసి వెళ్లవే!' అని ఏకవచనంతో సంబోధిస్తూ ఆదేశించారు.

'అలాగే తలుపువేసి వెడతాను.' అని నేను సమాధానం చెప్పాను. నా మాట గుర్తుపట్టినపిమ్మట ఆయన ఎంతయినా నొచ్చుకున్నారు. 'అయ్యో! నీవా లక్ష్మివని భ్రమపడ్డాను. నీతో అలాగ మాట్లాడినందుకు, దయచేసి మరోలాగనుకోకు!' అన్నారు. ఆ మరునాడుకూడా నేనున్న గదికివచ్చి, గుమ్మంలో నిలబడి, ఎంతో ఆప్యాయంగా పిలిచి "నీతో అంత మోటుగా ప్రసంగించినందుకు నిన్న రాత్రి అంతా నా కొక్క కునుకయినా పట్టలేదు! నేను అలాగ ఎలా మాట్లాడగలిగానని రాత్రి తెల్లవార్లు ఆశ్చర్యపడుతూనే ఉన్నాను." అన్నారు.

"అటువంటిదానిని నన్ను ఈ రాధు రాత్రింబగళ్లు ఎలాగ తిట్టిపోస్తూందో చూడు!"

జయరాంబాటి. మాతృదేవి పురాతన గృహము 8, జూన్, 1913.

డాక్టరు దుర్గాపాదఘోషు, సురేంద్రనాథ భౌమికు, ఇద్దరు కలిసి ఇక్కడికి వచ్చారు. ఈ వేళ సాయంత్రం తిరిగి వెళ్లిపోతున్నారు.

ఆ ఇద్దరు పొద్దున్నే స్నానాలు ముగించుకుని మాతృదేవిని సందర్శించి నమస్కరించారు. అమ్మ ఆ ఇరువురి శిరస్సులమీద హస్తం ఉంచి, ఆశీర్వదించి, విశ్రమించవలిసిందని ఆదేశించింది. రవంతసేపు ప్రసంగం జరిగిన తరవాత, సురేన్‌బాబు ఆమె నిలాగ ప్రశ్నించారు.

"అమ్మా, నే నెప్పుడు శ్రీరామకృష్ణుల నర్చించినా ఒక సమస్య ఎదురవుతూంది. ఒక వ్యక్తి ఇష్టదైవతము, శ్రీరామకృష్ణులు ఒకరే అనుకుందాము. మాతృస్వరూపిణి అయిన ఇష్టదైవతానికి ఆ భక్తుడు ఆరాధన కొనసాగిస్తున్నాడనుకుందాము. ఆ సమయంలో ఆ ఇష్టదేవత మహిళామూర్తిని ఠాకూరు స్వరూపంలో ఆరాధించడం కొంత ఇబ్బంది కలిగిస్తూంది. పూజ ముగించే సమయంలో ఠాకూరును మహిళగా భావించి నమస్కరించవలిసి వస్తూంది. ఇదే నా కెదురయిన ఇబ్బంది."

దానిమీద అమ్మ చిరునగవు చిందించి అన్నారు.

-సశేషం

# ఓంకార ప్రాశస్త్యము

సుబ్బరాయుడు

సర్వ వేదమంత్రములకు ఓంకారము మకుటాయమానము. సర్వ ప్రాణులను పరమాత్మ యందు చేర్చు సాధనముకాన దీనిని ప్రణవ మనియు వ్యవహరింతురు. పునాదులులేని కట్టడములవలె ప్రణవములేని మంత్రముగూడ దుర్బలమే. ప్రతి మంత్రము ప్రణవాక్షరము తోనే ప్రారంభమగును. ఉదా:—ఓం నమో నారాయణాయ, ఓం నమశ్శివాయ - ఇత్యాదులు. అక్షరోచ్చారణవల్ల నేర్పడు ధ్వనినిబట్టి దీనిని "శబ్దబ్రహ్మము లేక నాదబ్రహ్మము" అనియు అక్షరమునే ప్రధానముగ తీసికొని "అక్షర పరబ్రహ్మ"మనియు పిలుతురు. క్షరము అనగా నశించునది యని యర్థము. నశించనిది అక్షరము. నశింపులేనివాడు భగవంతుడు. అనగా భగవంతుడు అక్షరరూపుడు. నాశములేని పరబ్రహ్మనుగూర్చి బోధించు భగవద్గీతలోని యెనిమిదవ అధ్యాయమునకు శ్రీ కృష్ణపరమాత్మయే అక్షర పరబ్రహ్మ యోగమని నామకరణము గావించిరి. "ఓమిత్యే కాక్షరం బ్రహ్మ" యను వేదసూక్తి యను ప్రణవప్రభావమునే చాటి చెప్పు చున్నది.

ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్
యః ప్రయాతి త్యజన్దేహం సయాతి పరమాంగతిమ్.

బ్రహ్మవాచకమగు "ఓం" అను ఒక్క అక్షరమును ఉచ్చరించుచు నన్ను గురించి ధ్యానించుచు, ఎవడు శరీరమును విడచునో అతడు మోక్షమును పొందును" అని గీతలో శ్రీ కృష్ణపరమాత్మయే చెప్పియున్నాడు. దీనినిబట్టి ప్రణవము మంత్రములకు మకుటమగు మంత్ర మనియే స్పష్టమగుచున్నది.

అకారం బ్రహ్మరూపం చ ఉకారం విష్ణురూపకం
మకారం రుద్రరూపం చ త్రిమూర్తి ప్రణవాత్మకం.

అ, ఉ, మ అను మూడక్షరముల సమన్వయమే ఓంకారము. ఈ మూడక్షరములును సృష్టి, స్థితి, లయకారులగు బ్రహ్మ, విష్ణు, మహేశ్వర రూపములు. ఓంకారమే త్రిమూర్తి స్వరూపమని విశదమగుచున్నది.

భృకుటి, నాసికాగ్రము మొదలైనవానిపై మనస్సును నిలిపి చేయబడు ధ్యానముకంటెను శివలింగము, సాలగ్రామము, దేవాలయములందు ప్రతిష్ఠించి యుండబడు దేవతామూర్తులపై మనస్సును స్థిరీకరించి చేయబడు ధ్యానము కంటెను, ఓం అను అక్షరముపైన మనస్సును స్థిరపఱచి చేయబడు ధ్యానము ఉత్తమోత్తమము.

ప్రపంచములో జీవించియున్న సర్వప్రాణుల స్థితి నాలుగు విధములు. అకారరూపస్థితియగు జాగ్రదావస్థ, ఉకారరూపస్థితియగు స్వప్నావస్థ, మకారరూపస్థితియగు నిద్రావస్థ, అర్థమాత్రారూపస్థితియగు తురీయావస్థయని నాలుగువిధములు. ఒక్కొక్క మాత్రయు భిన్నమాత్రలతో లయస్థితి పొందును. అకారము ఉకారములోను, ఉకారము మకారములోను, మకారము అర్థమాత్రయందును లయించును. కాన అర్థమాత్రయందు మకారము, మకారమందు ఉకారము, ఉకారమునందు అకారమును కలుగును. ఇవి యన్నియు స్వయం ప్రకాశితములు. వీటిపైననే ధ్యానము నిలుపవలెను.

ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఏతద్ధ్యేవాక్షరం పరం
ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్య తత్.

ఓంకారమే బ్రహ్మము, ఓంకారమే పరమపదము. ఓంకార బ్రహ్మోపాసకులకు ఏ కోరికలు కలిగినను వానిని వారు పొందెదరు.

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ ధ్యేయం సర్వ ముముక్షుభి
పృథివ్యగ్నిశ్చ ఋగ్వేదో భూరిత్యేవ పితామహః
అకారేతు లయం ప్రాప్తే ప్రథమే ప్రణవాంశకే.

ప్రణవాక్షరుడైన బ్రహ్మము మోక్షము కోరువారిచే ధ్యానింపదగినది. అగ్ని, ఋగ్వేదము, భూలోకము, బ్రహ్మ అకారరూపమగు ప్రథమ మాత్రయందు కలవు.

అంతరిక్షం యజుర్వాయుర్భువో విష్ణుర్జనార్దనః
ఉకారేతు లయంప్రాప్తే ద్వితీయే ప్రణవాంశకే.

అంతరిక్షము, యజుర్వేదము, వాయువు, భువర్లోకము, విష్ణువు, ప్రణవాంశముయొక్క ద్వితీయ పాదమగు ఉకారమున గలవు.

ద్యౌపి సూర్యః సామవేదశ్చ స్వరిత్యేవమహేశ్వరః
మకారేతు లయంప్రాప్తే తృతీయే ప్రణవాంశకే.

ప్రణవాక్షరముయొక్క మూడవ పాదమగు మకారములో ద్యులోకమును, సూర్యుడును, సామవేదమును స్వర్గలోకమును మహేశ్వరుడును గోచరింతురు.

ఓంకార ప్రభవాదేవా ఓంకార ప్రభవాః స్వరాః
ఓంకార ప్రభవం సర్వం త్రైలోక్యం సచరాచరమ్.

ఓంకారమునుండి బ్రహ్మాది దేవతలు, స్వరములతో కూడిన సమస్తవేదములు కలిగినవి. చరాచరాత్మకమగు ఈ మూడులోకములు ఓంకారమునుండి పుట్టినవే.

అవాచ్యం ప్రణవస్యార్థం యస్తంవేద సవేదవిత్
ఓంకార ప్రభవో విష్ణుః త్రినేత్రో వచసాంపతిః

ప్రణవార్థమును తెలిసికొనినవాడే వేదవిదుడు. త్రిమూర్తులు ఓంకారమునుండి పుట్టినవారే.

సకృదుచ్చరితమాత్ర ఊర్ధ్వమున్నామ యతీత్యోంకారకః.

ఒక్క పర్యాయము ప్రణవము నుచ్చరించిన మోక్షమునం దించునదిగాన ఓంకార మనబడును.

"ఓంకారం సర్వ మంత్రాణాం ఉత్తమః పరికీర్తితః"

ఓంకారము సప్తకోటి మహా మంత్రములలో ఉత్తమోత్తమమైనదని సూత సంహితలో చెప్పబడినది.

"సర్వేషామేవ మంత్రాణాం ప్రణవః ప్రాణముచ్యతే"

సర్వ మంత్రములకు ప్రణవము ప్రాణము వంటిది.

శంకరాచార్యులకు శక్తియందు పూర్ణవిశ్వాసము కలదు. ఆయన ఆమెనుగూర్చి ఎన్నియో స్తోత్రములు రచియించియున్నాడు. నీకీకథ తెలియునా? శంకరు డొకనాడు గంగాస్నానముచేసి, తిరిగివచ్చుచుండెను. అప్పటికి ఆయనకు శక్తియందంతగా విశ్వాసము లేదు. శక్తి యొక వృద్ధస్త్రీరూపమున అతనిమార్గమున కడ్డుగా పరుండియుండి, తన దుఃస్థితి నతనితో చెప్పుకొనెను. శంకరుడు ఆమెను తాకెను. వెంటనే అతనిలోగల ప్రభావమంతయు అదృశ్యమయ్యెను. అప్పుడతడు ఆమె శక్తియగుట గ్రహించి, ఆమెను స్తోత్రరూపముగా సంకీర్తింప నారంభించెను. అదియే 'ఆనందలహరి' కి మూలము. ఆ స్తోత్రముచే ఆమెను సంతోషిపజేచి, తన ప్రభావము తిరిగి పొందెను. స్తోత్రములన్నిటిలో మహిమ్నస్తోత్రము అత్యుత్తమమైనది. హరిద్వార్‌లో నున్నప్పుడు నేను దానిని అనుదినము పఠించుచుండువాడను. పుష్పదంతుడను నొక గంధర్వుడు శివనిర్మాల్యములగు పుష్పములను త్రొక్కి వాయుగమనశక్తిని కోల్పోయెను. అందుపై నతడు శివమహిమ్నస్తోత్రమును రచించి సంకీర్తింపగా, మరల అతనికి ఆ శక్తివచ్చెను. అది అత్యద్భుతమగు స్తోత్రము.

—తురీయానందస్వామి.

# ప్రహ్లాద కథాతత్త్వ విచారము

ధూళిపాళ శ్రీరామమూర్తి.

ధర్మరాజునకు సందేహము తీరినది. కాని యిప్పుడు ఆ కథ యెట్లు జరిగినదో తెలిసికొనవలయునని కుతూహలము కలిగినది. ఆయన నారదు నడిగినాడు. ''స్వామీ! మీరు చెప్పిన రెండు విషయములు నాకన్వయమగుట లేదు. హిరణ్యకశిపునకు ప్రహ్లాదుడు పుత్రుడుగదా! అంతేకాక మహాత్ముడుగూడ గదా! అతని యందు తండ్రికి విద్వేషమెట్లు? మరి యీ ప్రహ్లాదుడు దైత్యుడుగదా! ఆయనకు భగవద్భక్తి యెట్లు? ఈ కథ నాకు తేటపడునట్లు చెప్పుడు.

నారదుడు హిరణ్యకశిపుని వృత్తాంతము నిట్లు చెప్పెను. ''హిరణ్యాక్షుని వరాహరూపమున విష్ణుమూర్తి వధించినమాట విని హిరణ్యకశిపునకు చాలా కోపము వచ్చినది. అతడు దైత్యదానవ నాయకులను త్రిమూర్థం త్ర్యక్ష శంబర శతబాహు హయగ్రీవ నముచి పాక విప్రచిత్తాదులను పిలిపించి సభజేసి 'దేవతలు విష్ణుమూర్తిచేత నా తమ్ముని జంపించినారు. వాడు మాయా వరాహరూపమున వచ్చి యీ పని జేసెను. వానిని పట్టుకొని ఈ శూలముతో మెడ నరికి వాని రక్తముతో నా తమ్మునికి తర్పణము జేసి దుఃఖము డిగెదను. వాడు చాలా కపటశత్రువు. ముందు వానిని జంపవలెను. అపుడు చెట్టు నిర్మూలమైన తరువాత కొమ్మ లెండిపోయినట్లు, దేవతలు నశింతురు. కాబట్టి మీరు భూలోకమునకు బోయి తపోయజ్ఞ స్వాధ్యాయ వ్రత దాన నిరతులగువారిని హింసింపుడు. వారిని హింసించిన కాని యీ విష్ణువు బయటపడడు. బ్రాహ్మణులు, గోవులు, వేదములు, వర్ణాశ్రమాచారములు కల చోటులకు బోయి యీ ప్రదేశములను కాల్చుడు, భగ్నముచేయుడు. విష్ణువు యజ్ఞములందు ధర్మములందుండును. దేవర్షి పితృభూతములకు ధర్మమునకు విష్ణువుగతి.' అని చెప్పెను.

''రాజాజ్ఞబొంది యీ రాక్షసులందరు పురములు, గ్రామములు, ఉద్యానములు, క్షేత్రారామములు, ఆశ్రమములు, కర్షకుల పల్లెలు, కొండలోయలయందున్న గ్రామములు, గొల్లపల్లెలు, పట్టణములు మొదలైనవాని నన్నింటిని కాల్చిరి. సేతువులను (ఆనకట్టలను), ప్రాకారములను, గోపురములను పలుగులతో పగులగొట్టిరి. వృక్షములను గొడ్డళ్ళతో నరికి, ప్రజా గృహములను మండుచున్న కొరవులతో గాల్చిరి. వీరి యాగడములు చూచి దేవతలందరు స్వర్గమును వదలి కంటికి కన్పించకుండ నోచిన దిక్కులకు పారిపోయి దాగికొనిరి.

''హిరణ్యకశిపుడు వారి కాజ్ఞ పెట్టిన తరువాత, తమ్మునికి తిలోదకాదుల నిచ్చి వారి కుమారులైన శకుని శంబర ధార్ష్టి భూత సంతాపన వృక కాలనభ మహానాభ హరిశ్మశ్రు మదోత్కచులను వారిని, వారి తల్లి వృషద్భానువును, తన తల్లియైన దితిని పిలిచి వారి ననునయించుచు నిట్లు చెప్పెను. 'మీ రందరూ మహావీరుడైన హిరణ్యాక్షుని గురించి శోకింప వద్దు. శూరుడైనవానిని యుద్ధమునందు మరణము కోరదగినది. అంతకంటె ఉత్తమమైన చావులేదు. కావున వారికొరకై శోకింప నక్కరలేదు.'

'కాదయ్యా అతనిని గురించి మాకు శోకము లేదు. అతడు మమ్ము వదలిపోయెనని వాని విరహము నోర్వలేక చింతించుచున్నాము. అందుచేత, అప్పుడును చింతింపవలసినది లేదు.

చూడండి, ఈ ప్రాణికోటి, చలిపందిరి యందువలె ఈ సంసారమునందు కలియుచు విడిపోవు చుండును. కలియుటకుగాని, విడిపోవుటకుగాని వారు స్వతంత్రులుగారు. దానికి దైవము కారణము. ఆ దైవము వారి వారి జన్మాంతర కర్మఫలము నొసంగునట్టిది. కాబట్టి లోక దృష్టితో చూచినను విచారింపదగదు మరి తత్వదృష్టితో విచారించినచో శోకమునకు తావెక్కడిది? ఈ కన్పించు కార్యకారణ ప్రపంచమంతయు మిథ్య. వట్టి ఇంద్రజాలము.

'ఆత్మ యొక్కటియే సత్యమైనది. అది నిత్యము, అవ్యయము, శుద్ధము, సర్వగతము, సర్వజ్ఞము, పరమును. నిత్యము కావున దానికి మృత్యువులేదు. అవ్యయము కావున దానికి తరుగులేదు. శుద్ధము కావున దానికి మాలిన్య మంటదు. సర్వగతము కావున దానికి తెలియ కుండుటలేదు. ఎందుచేతనన అది దేహాదుల కంటె వ్యతిరిక్తముగా నుండునట్టిది. కాబట్టి అట్టిదానిని మృతుడని, కృశుడని, మలినుడని, వియుక్తుడని, అజ్ఞుడని శోకింపరాదు. ఇట్టి యాత్మకు సంసారమెట్లు కలిగినదని యడుగు దురా, చెప్పెదను వినుడు.'

'ఈ సంసారము ఆత్మకు ఉపాధిభూతమైన లింగశరీరముయొక్క ధర్మము ఈ లింగశరీర మునకు కారణము అవిద్య. అవిద్య యాత్మకు ఆవరణము గానుండి లింగశరీరమును సృష్టించి నది. కావున నిదియంతయు అవిద్యాకార్యము. నీటిలో చెట్లు ప్రతిఫలించినవి. ఆ నీరు కదలు చున్నదనుకొనుడు. ఆ ప్రతిబింబించిన చెట్లు కూడా కదలుచున్నట్లు కన్పించును. ఈ ప్రతి బింబిత వృక్షములకు ఉపాధి యా నీరు. దాని ధర్మము కదలుట. అది చెట్లకు సంక్రమించినది. అట్లే ఆత్మ అవిద్యా కార్యమైన సూక్ష్మ శరీర మున (లింగశరీరమున) ప్రతిబింబించినది. లింగ శరీరధర్మమైన సంసారము ఈ యాత్మ ప్రతి బింబమునకు సంక్రమించినది.'

ఆత్మ స్థిరమైనను, నిర్వికారమైనను, మనస్సుయొక్క ధర్మమైన సంసారమును తాను పొందుచున్నట్టు కన్పించుచున్నది. ఈ కలవర మంతయు మనస్సుకు సంబంధించినదే. గుణ ములచేత అనగా సత్వరజస్తమస్సులచేత ఈ కలవరము మనస్సునందు కలిగింపబడును. ఈ వైకల్యమును ఈ కలవరమును పరిపూర్ణ మైన యాత్మయందారోపించుకొని జనులు దుఃఖింతురు. ప్రియవియోగము, అప్రియ యోగము, కర్మ, సంసారము, జన్మము, మర ణము, శోకము, అవివేకము, చింత, వివేకము, స్మరింపకుండుట ఇవంతయు ఆత్మకు లక్షణము గాదు. దానికి వ్యతిరేకమైన సంసారలక్షణము. అనగా ఇది తన లక్షణముగాదు. దేహాలక్ష ణము. ఆ దేహాభిమానమువలన దేహమునే తా ననుకొనుటవలన తనయందు ఈ సంసార మంతయు నారోపించుకొని దుఃఖించుట.'

''ఏష ఆత్మ విపర్యా సోహ్యలింగే లింగభావనా'

శరీరముకాని యాత్మయందు శరీర భావనయే యాత్మ విపర్యాసము. దాని లక్షణ మైన సచ్చిదానందమును మరగుపరచి శరీర లక్షణమైన సుఖదుఃఖ రూపసంసారము నారో పించుట. ఈ విషయము మీకు చక్కగా తెలియుటకు పురాతనమైన యొక యితిహాస మును చెప్పెదను వినుడు.

'ఉశీనరములను జనపదములు గలవు. వానికి సుయజ్ఞుడనువాడు రాజు. అతడు యుద్ధములో శత్రువులవలన చంపబడెను. యుద్ధభూమికిపోయి రక్తపుమడుగునందు పడియున్న అతని చూచి, అతని భార్యలు భర్తృవిరహమును భరించలేక అతని చుట్టునుచేరి మిక్కిలి కరుణముగా విలపించుచుండిరి. అతని శరీరమును కొనిపోయి

దహనాదిక్రియలు చేయుటకైనను వారంగీకరింపలేదు. సూర్యుడస్తమించినాడు. వారి పరిదేవనమంతయు విని యముడు బాలవేషముతో వచ్చి వారితో నిట్లనెను. "ఔరా! వీరెంత వయోవృద్ధులు. లోకగతిని చూచుచు ... వీరికీ వ్యామోహమేమి? ఎక్కడినుండి వచ్చెనో యక్కడకు పోయిన మనుష్యుని గురించి వ్యర్థముగ శోకించుచున్నారు. వాని తోపాటు వీరికిని మరణధర్మము సమానమే గదా. చిన్నప్పుడే తల్లిదండ్రులు మమ్ము వదిలి పెట్టినను మేము దానికి బాధ పడుటలేదు. మేము చాలా ధన్యులము. దుర్బలులమైనను తోడేళ్ళు మొదలైన క్రూర జంతువులనోటబడకయుంటిమి. గర్భములో నుండగా నెవడు రక్షించెనో వాడే మాకు రక్షకుడు. ఆ పరమేశ్వరుడు, స్వేచ్ఛగా నీ విశ్వమును సృజించును. రక్షించును. నాశనము చేయును. ఆయన ఈ చరాచర ప్రపంచమునకంతకు నియామకుడు. దీనిని సంహరించుటకు, పాలించుటకును సమర్థుడు. దుర్బలులమైన మనమందర మాయనకు ఆటపావులవంటి వారము. స్రోవలో జారిపోయిన వస్తువు ఈశ్వర రక్షితమై యట్లే యుండును. ఆయన యుపేక్షించెనా గృహమందున్నది కూడా వినష్టమగును అడవిలో నివసించు అనాథులు కూడా ఆయన కటాక్షమువలన జీవింతురు. ఆయన యాగ్రహించెనా గృహమునందెంత చక్కగా మనము రక్షించినను వాడు జీవింపడు."

ఇంకా ఉంది

# చిత్తశాంతి I

## ప్రభాకర్

చిత్తశాంతిని సకల మానవులూ కాంక్షిస్తారు. మానవులలో జాతిభేదం మతభేదం వర్ణభేదం వృత్తిభేదం రుచిభేదం ఆచారభేదం అభిప్రాయభేదం విశ్వాసభేదం లక్ష్యభేదం – ఇట్టి భేదాలు ఎన్ని ఉన్నా, చిత్తశాంతిని అభిలషించడంలో ఎట్టి భేదమూ లేదు. ఐనా, ఆశ్చర్యమేమంటే, చిత్తశాంతిని కోరువారి సంఖ్య ఎంత ఎక్కువో దానిని పడయగాంచే వారిసంఖ్య అంత తక్కువ. అంతేకాదు, పెక్కు దేశాలలో, అభివృద్ధిగాంచినవనిపించుకొన్న దేశాలలో, మానసికవ్యథ లనుభవించువారి సంఖ్య నానాటికీ హెచ్చౌతూఉన్నది. బ్రతికి నన్నినాళ్ళు మానముతో మనోవ్యథలనుభవించువారు ఎందఱో! అనేకులకు కావలసినంత సిరిసంపద లున్నప్పటికిని భోగములు మీరి యున్నప్పటికిని చిత్తశాంతి ఉండదు. వారు శాంతిని అన్వేషిస్తూ ఈ ఉత్సుకతాగ్రం నుండి ఆ ఉత్సుకతాగ్రానికి దానినుండి దీనికి ఆవేశంతో మాఱుతుంటారు కాని, ఆయన్వేషణకు ముందుండిన విషాదమును మించిన విషాదమే వారికి తదనంతరమున్నూ కలుగుతూఉన్నది: వారు బాగానే భోంచేస్తారు కాని వారికి మంచి నిద్ర పట్టదు. వెలపొడుగు దుస్తులు ధరిస్తారు కాని మనస్సేమో సదా కుములుతూనే ఉంటుంది. శాంతిలేదు, నెమ్మదిలేదు, మనస్సంతాపము సదా సాగుతూనే ఉంటుంది. ఒక్కొక్కప్పుడు ఆ మనోవ్యథలు పైకి తీవ్రములై అగపడక పోవచ్చు నులు చేసుకుంటూ, మిత్రులతో కలుస్తూ గుళ్ళకు పోతూ, సాంఘిక కార్యక్రమాలలో పాల్గొంటూ ఉంటారు. కాని లోలోన మెల్లగా రగులు నిప్పువలె మనస్సులో సంతాపం ఎక్క

తెంపులేక ఉంటుంటుంది. ఇంత సంతాపమూ అనావశ్యకం నిష్ప్రయోజనం అవివేకం. జీవిత ప్రయోజనముల బడయ తోడ్పడేది ప్రశాంత మైన మనస్సొక్కటే.

దేహానికి పెద్దవ్యాధులు దాపురిస్తే ఘన వైద్యులను ఆశ్రయించక తప్పదు. కాని మామూలు సమయాలలో దేహారోగ్యం కాపాడుకునే విధానాలు మన సొంతానికి తెలిసి ఉండాలి. అదేవిధంగా మనస్సుకు కూడా పెద్ద వ్యాధులు వస్తే దాన్ని చక్కజేయగల నిష్ణాతులను ఆశ్రయించాలి. మామూలు సమ యాల్లో మనః [illegible] కాపాడుకొను విధా నాలు మనకే తెలిసిఉండాలి. సదా చిక్కులు పెరుగుచుండు కాలమిది. కావున ఈ కాలంలో చిత్తారోగ్యమును కాపాడుకోవడం మఱింత ముఖ్యం. దీనిని మనం జీవిత ప్రథమదశలోనే అలవఱచుకోవాలి. వేఱులూనిన తర్వాత మనోవ్యథలని సరిపఱచడం సుకరంకాదు.

స్థూలంగా చెప్పాలంటే చిత్తశాంతి సాధిం చుటకు రెండు దారులున్నాయి – ఒకటి మనస్తత్త్వ శాస్త్ర చోదితమైన విధానం, మఱొకటి వైదికవిధానం. మనస్తత్త్వశాస్త్ర చోదిత విధానంలో మనస్సే సాధనం, దానిని చక్కగా గుర్తించి శాంతిసాధకమైన రీతిలో దానిని వినియోగించుకోవాలి. వైదికవిధా నంలో కొన్ని సాధనలున్నాయి, వానిని అభ్య సిస్తే శాంతి సిద్ధిస్తుంది. ఈ రెండు విధానా లున్నూ అమోఘములని నిరూపితములైనవే. కాబట్టి ఈ రెంటిలో ఏ ఒక్కటైనా చిత్త శాంతిని సమకూర్చి తీఱుతుంది.

## మనస్తత్త్వశాస్త్ర బోధితవిధానము

పతంజలి నేర్పిన మనస్తత్త్వ శాస్త్రరీతిలో చూదాం. అతని శోధన హిందు సంప్రదా యానుసారం కట్టకడకు ఆత్మయొద్దకే మనలను తీసుకుపోతుంది. మనస్సును నిర్వచింపజాలం. మనస్సును నిర్వచింప బూనుకుంటే అందు మనకు వినియుక్తమగు సాధనము మనస్సే. శాంతిని అలవఱచుకోవడం అనేది మనః కార్యం. శాంతిని చెడగొట్టునది యూ మనస్సే. మనస్సు సూక్ష్మాతిసూక్ష్మం అది మన కంటికి గోచ రించకపోయినా. మన వివ్యాలు ఏష్యలు భయ ములు సంతోషములు బొబ్బిలిపాలు కోలా హాలములు మున్నగునవన్ని మనస్సువల్ల కలి గేవే. ఆలోచన అనుభూతి సంకల్పం సందేహం ఎఱుక ఇవి అన్ని వివిధ మనఃకార్యాలే.

మఱికొంచెం లోతుకు దిగుదాం – దిగి చూచి నామంటే మనస్సులో మూడు స్థాయిలను గుర్తించగలుగుతాం — స్మృతికి పైస్థాయి, స్మృతికి క్రిందిస్థాయి, స్మృతిస్థాయి. స్మృ స్థాయి సామాన్యులకు తెలిసేది కాదు. దాన్ని అందుకోగలిగిన విశిష్ట పురుషుని – వ్యష్టి మనస్సు సమష్టి మనస్సులో భాగమే అనిన్నీ విశుద్ధమైన మనస్సును ఆత్మనుండి వేఱుపఱుప జాలమనిన్ని స్పష్టమౌతుంది. స్మృతికి క్రింది స్థాయియు సామాన్యులకి తెలిసేదికాదు. ఇండ్లలో ప్రస్తుతోపయోగంలో లేనివస్తువు లను భవిష్యత్తున కావలసివచ్చు వస్తువులను వెలుపలికి చూపరాని వస్తువులను పడవేసి యుంచు కొట్లు ఉంటాయికదా ఆ కొట్టువంటిదే మనస్సులో స్మృతికి అడుగుస్థాయి. మన మునుపటి తలంపులు పనులు – ఈ పుట్టుక లోనివి మాత్రమే కావు, సకల పూర్వజన్మ ములవి – ఆ స్మృతి కడుగుస్థాయిలో సంస్కార ములుగా ప్రోగుపడిఉంటాయి, స్మృతిస్థాయి కెక్కి వెలువడటానికి ఆ సంస్కారాలు సదా ప్రయత్నిస్తూఉంటాయి. మంచివో చెడ్డవో

ఇవే మన కోరికలు ప్రవణతలు గుణాలు లోపాలు. మనసున జొచ్చిన సంగతులు స్మృతిస్థాయినుండి అడుగుస్థాయికి దిగుతూ, అడుగుస్థాయినుండి స్మృతిస్థాయికి ఎక్కుతూ ఉంటాయి. ఆ ప్రవృత్తిని గుర్తించడమే మనకు సాధ్యంకాదు, దాన్ని అదుపులో ఉంచుకోవడాన్ని గూర్చి చెప్పాలా?

హిందువుల మనస్తత్త్వ శాస్త్రానుసారం మనస్సు తమోరజస్సత్త్వముల నెడి త్రిగుణాలతో రూపొందింది. ఇవి వరుసగా మృగ - మానవ - దివ్యాంశ జనకములు. కాబట్టి ఒక్క మనస్సే మృగమార్గమును మానవ మార్గమును దివ్యమార్గమును బట్టవచ్చు. మానవులలో సుజనులు దుర్జనులును ఉండడానికి దే కారణం. పాపులు పరమ యోగులుగా మార్పొంది అఖండ మనశ్శాంతి పొందడం మనం ప్రత్యక్షంగా చూస్తున్నాము. ఎవని మనస్సు ఎప్పుడు ఏ స్థాయిలో ఉంటుందో తదనుగుణముగా అతని స్వరూప స్వభావాలుంటాయి. వివిధ స్థాయులతోడి మనస్సు ఇంద్రియములు అనేవే సూక్ష్మ దేహం. అందులో జీవుడున్నాడు. సూక్ష్మదేహం స్థూలమైన భౌతిక దేహంలో ఉంది. మనం ధరించే దుస్తులు వేఱు మనం వేఱు, మనం వసించుగృహం వేఱు మనం వేఱు. అట్లే ఆత్మ వేఱు అది ఉన్న దేహం వేఱు. పతంజలి మన మనస్సుకు, సదా కెరటములు పొటెక్కిన తటాకమును ఉపమానంగా చెప్పినాడు. శబ్దాదివిషయములు బాహ్యేంద్రియములకు, బాహ్యేంద్రియములు అంతరింద్రియమునకు, అంతరింద్రియం దేహాబద్ధ జీవునకూ కలిగించే సంచలనమే ఆ కెరటాలు, మనోవీచికలు. ఆ సంచలనంవల్ల ఆలోచన అనుభూతి సంకల్పం అనేవి ఏర్పడతాయి. సంచలనం హృదయాని కంటె మెదడు కెక్కువగా కలిగితే, అదే ఆలోచన. మెదడుకంటె హృదయాని కెక్కువ సంచలనం కలిగితే అదే అనుభూతి. మెదడుకు హృదయానికి సమ సంచలనం కలిగితే అదే సంకల్పం.

ఈ మనోవీచికలు అంతరాత్మను సదా మఱుగు పఱుస్తుంటాయి. అంతే కాదు కెరటములు పొటెక్కిన మనస్సే ఆత్మ అనెడి భ్రాంతికూడా కలుగుతుంటుంది. మన సుఖ దుఃఖాలకు కారణం 'మనస్సే జీవాత్మ' అను భ్రాంతి. మన బాధలూ అశాంతీ తొలగాలంటే ఆ భ్రాంతి తొలగాలి, ఆ కెరటాలపోటు అణగాలి. ఈ నిజాన్ని గుర్తించడం మనశ్శాంతి సంపాదనకు తోడ్పడవచ్చు. కాని మనశ్శాంతి భారతీయ మనస్తత్త్వ శాస్త్రపరిజ్ఞానం పైన ఆధారపడిందికాదు. ఏ మనస్తత్త్వ శాస్త్రపరిజ్ఞానం పైనికూడా అది ఆధారపడింది కాదు. మనశ్శాస్త్రపరిజ్ఞానం బొత్తిగా లేకే మనశ్శాంతి పడయగాంచినవారు ఉన్నారు. మనస్తత్త్వ శాస్త్రోపాధ్యాయుగ ఉన్నవారిలో ఎందఱికో మనశ్శాంతి అంటే ఏమో తెలిసిన జాడ కనిపించదు. మనశ్శాంతి ప్రదములగు పనులకు పూనుకోవడం ముఖ్యం. ఆ లాగు పూనుకొని నిర్వహించినవారు ప్రపంచమునందంతటా మనశ్శాంతి గన్నవారే.

# దుర్గా దేవి

## గోడా వెంకటేశ్వరరావు

పూర్వకాలమందు మహాబలశాలియు, మహా తేజస్వియునగు దుర్గముడు అను అసురుడు. బ్రహ్మదేవునిగూర్చి తపస్సుచేసి ఆయన వర ప్రసాదమువలన నాల్గు వేదములను పొంద గల్గెను. ఇతడు మహా బలపరాక్రమశాలియై దేవతలకు సైతము భయంకరుడాయను. కాల క్రమముగా వేదములు దుర్గమునివద్దనే యుండి పోవుటవలన ప్రజలు దురాచారపరులై వేద మందు చెప్పిన యజ్ఞాదులను చేయుట మాని వేసిరి. యజ్ఞాదులు లోకమందు లేకపోవుటచే దేవతలు ఆహారము లేక కృశించిపోయిరి. దానములు, తపస్సులు, యోగములు, యాగ ములు ఏవియు లేక లోకము నాస్తికవశ మైనది. దీనివలన శతవర్షముల అనావృష్టి కల్గి ప్రజలు దుఃఖ పూరితులైరి. ప్రజలందరు ఆకలి దప్పులచే బాధపడసాగిరి. జీవనదులు సైతము నిర్జలములగుటవలన చెట్లు చేమలన్నియు ఎండి భూమిఅంతయు మరుభూమిగ తయారైనది.

ప్రపంచమందలి ప్రజల కష్టములను చూచి ఓర్వలేక దేవతలందరు త్రిలోక రక్షకియగు పరమేశ్వరిని శరణాగతి పొంది 'తల్లీ! పర మేశ్వరీ; మహామాయా! నీ బిడ్డలందరు బాధ పడుచున్నారు. రక్షింపుము, రక్షింపుము. నీవు రక్షించనిచో లోకములన్నియు నశించును. బిడ్డలు అపచారములు చేసినను తల్లులేకదా రక్షించి వారి నాదరింతురు. లోకమందు బిడ్డల యపరాధములను తల్లులు తప్ప వేరెవరు క్షమింతురు? ఓ కరుణాకరీ! అవ్యాజ కరుణా మయీ! మమ్మీ విపత్తునుండి రక్షింపుము. నీ కరుణవల్లనే మేము బ్రతుకగలము. దేవతలకు, మానవులకు విపత్తు గల్గినప్పుడెల్ల నీవు అవత రించి కాపాడుచున్నావు. మధుకైటభులను, చండ, ముండ, రక్త, ధూమ్రాక్షులను మహిషా సురుని ఏ విధముగ సంహరించితివో, ఆ విధము గనే దుర్గముని సంహరించి ప్రపంచమును కాపా డుము' – అని అనేక విధములుగ వేడుకొనిరి.

దేవతల ప్రార్థనకు కరుణించి జగన్మాత యగు పరమేశ్వరి అనేక నేత్రములుగల రూప ముతో వారిముందు ఆవిర్భవించి తన నాల్గు చేతులయందును, పద్మము, పాశము, ధనుస్సు, కందమూలఫలములు ధరించి, సర్వదా ప్రసన్నమగు ముఖముతో దీనులగు ప్రజలను గాంచి అశ్రువులు గార్చ నారంభించెను. అంతమాత్రముననే లోకమంతయు అఖండ ముగ వర్షములు కురియ నారంభించెను. ఆమె కన్నీరునుండి ఓషధులు చిగురించెను. ఎండిన నదులు మరల పూర్తి ప్రవాహాముగా ప్రవ హించుచు సాగరమును జలపూరితము గావిం చెను. కందమూలముల ననుగ్రహించుటవలన భూమియందు సమృద్ధిగా కందమూల ఫలములు పండనారంభించెను. దేవతలు, ప్రజలు, పశు పక్ష్యాదులు సంతోషపడిరి. దేవి, దేవతాదు లనుచూచి, 'మీ స్తుతికి సంతసించితిని. కావల సిన వరము కోరుకొనుడ' ని ఆనతీయగా దేవ తలు 'దుర్గముడు తన స్వాధీనము చేసికొనిన వేదములను మాకిప్పించవలసినద' ని ప్రార్థిం చిరి. దేవి 'ఏవమస్తు' అని చెప్పి అంతర్హిత యైనది.

దేవతలు మహాకోలాహలము చేయుచు పరమేశ్వరిని అమితముగ స్తుతింపుచుండుటను గాంచి దుర్గముడు దేవతల పట్టణమగు స్వర్గ మును ఆక్రమించుటకు పయనమాయెను. దేవి ఈ తరుణమును వదలరాదని దుర్గమునికి మును

పే స్వర్గ ద్వారమును చేరి తన అమితమైన ప్రకాశవంతమగు చక్రమును ధరించి యుద్ధమునకు సన్నద్ధమై యుండెను. దుర్గము ఉచ్చట దేవినిగాంచి స్త్రీయే కదా యని నిర్లక్ష్యముగా యుద్ధము నారంభించెను. దేవదానవులమధ్య ఘోరమగు యుద్ధము ఆరంభమాయెను. దుర్గముడు అతి బలపరాక్రమముతోను, యుద్ధ విద్యాకౌశలముతోను దేవతలను, వారి సైన్యములను ఛిన్నాభిన్నముచేయ నారంభించెను. తన భక్తులగు దేవతలకుకల్గు నాశమునుచూచి దేవి సహింపలేక తన దివ్యమూర్తినుండి, కాళీ, భువనేశ్వరి బగళా, భైరవి, ధూమ్రమాతీ, తారా, త్రిపురసుందరి, మాతంగి, శ్రీవిద్యా యను పది రూపములతో దశశక్తులు ఉద్భవింపజేసి అసురసైన్యమును నాశనము చేయ నారంభించెను.

ఈ దశరూపములనుండి అనేక మాతృగణములు ఉద్భవించెను. వారందరు ఘోరమైన యుద్ధము గావించి అసుర సైన్యమును హతము కావించిరి. పరమేశ్వరి దుర్గముని తన శూలముతో చంపి అతనివద్దనున్న వేదములను దేవతలకు అనుగ్రహించెను.

దేవతలు పరమానంద భరితులై పరమేశ్వరికి అనేక సాష్టాంగ నమస్కారములు చేసి వేనోళ్ళ కొనియాడసాగిరి. వారందరు బ్రహ్మదేవుని ముందుంచుకొని పరమేశ్వరిని స్తుతింప సాగిరి. 'ఓ పరమేశ్వరీ! జయము. జయము. ప్రాణదాయీ! అనేక నమస్కారములు. అనేక నేత్రములు గలదానవై మమ్మనుగ్రహించితివి గాన నీవు శతాక్షివి. శాకములను చేతిలో ఉంచుకొన్నందువలన నీవు శాకంబరివి. త్రిభువనములను అసురులనుండి కాపాడితివి కాన భువనేశ్వరివి. అసురులను నిప్పులు గ్రక్కు ఉగ్రనేత్రముతో నాశనము చేయుట వలన ధూమ్రమాక్షివి. భయంకరమగు రాక్షసులను సంహరించితివి గాన భీమాదేవివి. అరుణాసురుడను రాక్షసుని భ్రమరమువలె తిరుగుచు సంహరించితివి కాన భ్రమరాంబవు. సర్వవిద్యలకు, బ్రహ్మవిద్యకును కారణము గాన శ్రీవిద్యవు. మూడు లోకములందును అనుపమమగు సౌందర్యవతి యగుటవలన త్రిపురసుందరివి. మతంగ మహామునిని అనుగ్రహించుటవలన మాతంగివి. నక్షత్రమువలె ప్రకాశించుట వలన తారవు. దుర్గముని సంహరించుట వలనను, భక్తులను దుర్గములనుండి కాపాడుట వలనను దుర్గవని నీకు పేర్లు. నీ యొక్క కారుణ్యమును పరాక్రమములను చెప్పనలవిగాదు. నీవు రాక్షసుల సంహరింపకున్న మేమందరము ఎటుల జీవించి యుందుము? మాకెట్లు సంతోషము చేకూరియుండును? నీ భక్తులగు మమ్ములను సదా కాపాడుచుండుము. ఓ పరమేశ్వరీ. అనేక నమస్కృతులు. నీవు తత్త్వమస్యాది వేదాంత వాక్యములచే తెలియజేయబడుచున్నావు. మనస్సువలనకూడ చింతింప శక్యము కానిదానవు. నిన్ను స్తోత్రము చేయ అల్పులగు మాకు వీలుకాదు. కావున మమ్ము కాపాడుము. ఏ భక్తుడు నిన్ను దుర్గాదేవిగా స్మరించునో వాని సర్వదుఃఖములను అప్పుడే పోగొట్టుము.' అని ప్రార్థించిరి. ఆ పరమేశ్వరియు దేవతల స్తోత్రమునకు సంతసించి యట్లేనని చెప్పి తిరోహితయ్యెను. ప్రజల దుఃఖములను దుర్గాదేవి పోగొట్టును కావున అందరు దుర్గాదేవిని పూజించి తమ కష్టములను బాపుకొని, సకల సౌఖ్యములను ఇహలోక పరలోక సుఖములను, మోక్షమును పొందుదురు గాక!

దుర్గాత్సంత్రాయతే యస్మాత్ దేవీ దుర్గేతి కథ్యతే।
ప్రపద్యే శరణం దేవీం దుందుర్గే దురితం హర॥

# రామకృష్ణమిషన్ - నివేదిక

నవంబరు 19 వ తేదీ రాత్రి సంభవించిన తుఫానువల్లను ఉప్పెనవల్లను కృష్ణా గుంటూరు జిల్లాలలో అపారమైన జననష్టము, ఆస్తినష్టము సంభవించినదని తెలియగానే రాజమండ్రి రామకృష్ణమిషనునుండి స్వామి బోధ స్వరూపానంద బయలుదేరి విజయవాడకువెళ్ళి రామకృష్ణ సేవాసమితి కార్యకర్తలను వెంటబెట్టుకుని ఎక్కువగ నష్టపోయిన అజిత్ సింగ్ నగర్ సందర్శించిరి. సుమారు ముప్పదివేల మంది నివసించే పూరిగుడిసెలలో 70 శాతము నేల మట్టమయినవి. జనులు భోజనమునకు లేక సతమతమగుచుండిరి. కనీసము 2 రోజులకైనను ఆహారదినుసులు వారికి యివ్వవలసి యుంటుందని నిశ్చయించి, వెంటనే యింటింటికి వెళ్లి అవసరమైనవారికి కార్డులు పంచిపెట్టి, 23 వ తేదీ 11 గంటలకు సమితి హైస్కూలులో, కుటుంబమునకు 5 కేజీల బియ్యము ¼ కేజి పప్పుదినుసులు చొప్పున 200 కుటుంబములకు 20 బస్తాల బియ్యము 1 బస్తా పప్పులు పంచిపెట్టిరి.

తరువాత స్వామి బోధ స్వరూపానంద గుంటూరు రామకృష్ణ సేవాసమితికి వెళ్లారు.

గుంటూరులో ఎక్కువ దెబ్బతిన్నవి, చుట్టగుంట, నల్లచెరువు ప్రాంతములని తెలుసుకుని చుట్టగుంటకు పోయిరి. బెజవాడలోవలెనే రామకృష్ణమిషను కార్యకర్తలు ఇంటింటికి వెళ్ళి 250 మంది కుటుంబములకు కార్డులు పంచిపెట్టిరి. మరునాడు 20 బస్తాలు బియ్యము 1 బస్తా పప్పుదినుసులు సేకరించి కుటుంబమునకు 5 కేజిల బియ్యము ¼ కేజి పప్పులు చొప్పున నగరంపాలెంలో శ్రీ రామకృష్ణ సమితిలో పంచిపెట్టిరి.

తరువాత నల్లచెరువు ప్రాంతమునకు పోగా ఆ ప్రదేశమంతా జలమయమయి ఉండెను. ఆ జలము తోడించినగాని ఎంత ప్రాణనష్టము ఆస్తినష్టము సంభవించినది అని అంచనా వేయుటకు కూడా అలవికాకుండెను. ప్రజలు యింజెనులు సంపాదించుకున్నారు కాని నడుపుటకు ఆయిల్ లేకుండెను. వెంటనే రు 700/- వారి కిచ్చి నీరు తోడించే యేర్పాటు చేశారు. నల్లచెరువు బాధితులకుగాను 5 బస్తాల బియ్యము ¼ బస్తా పప్పులు రామనామ క్షేత్రమున పూర్వపు విధముగానే పంచిపెట్టుటకు ఏర్పాటు చేశారు.

25-11-77 ఉదయము బాపట్లకు బయలుదేరారు.

అక్కడ, చిల్లర గొల్లపాలంలోఉన్న 176 కుటుంబాలకు బియ్యము పప్పు, ఉప్పు ఇచ్చుటకును; పల్లిపాలెం ముత్తయ్యపాలెం ప్రజలకు భోజనవిషయంలో లోటులేకపోవుటవల్ల వారికి కిరసనాయిలుమాత్రము యిచ్చుటకు నిర్ణయించారు. Social welfare Secretary గారు 11 బస్తాల బియ్యము 2 పీపాల కిరసనాయిలుకు వెంటనే పర్మిట్లు యిచ్చారు. 1 బస్తా పప్పులు ½ బస్తా ఉప్పు బజారులో కొని, సాయంకాలం 5-15 కి 855 ప్రజలకు మనిషికి 1 k g. బియ్యము. 1/8 k. g పప్పులు ¼ k, g ఉప్పు పంచిపెట్టారు. 26-వ తేదీ భీమవారిపాలెం చూచారు. అందరకు కార్డులు ఇచ్చి కుటుంబానికి 5 k g. ల బియ్యము ¼ k. g. పప్పులు చొప్పున 140 కుటుంబాలకు పంచిపెట్టారు.

27-11-77 తేదీ విజయవాడలో మాజీ మంత్రి శ్రీ కె. ఎల్. రావుగారితో దివిసీమ

విషయాలు చర్చించి తరువాత అవనిగడ్డలో కలుసుకొనుటకు నిర్ణయించుకున్నారు. ఆరోజు సాయంకాలము 4 గంటలకు మచిలీపట్టణం చేరుకున్నారు. చుట్టుప్రక్కల ప్రాంతాలలో నిర్వాసులయిన 3,000 ప్రజలు అక్కడ హిందూ కాలేజీలో తలదాచుకున్నారు. వారికి గవర్నమెంటు 2 పూటలా భోజనము, పాలు, బట్టలు ఇస్తున్నారు. వారికి పరుండుటకుగాను 2,000 చాపలు స్వామి పంచిపెట్టారు. మధ్యాహ్నము 12 గంటలకు అవనిగడ్డ చేరుకున్నారు. నిర్ణయించుకున్నట్లు అక్కడ K. L. రావుగారిని కలుసుకున్నారు. వారిద్దరు కలసి కోడూరు చేరుకొని, అక్కడ సహాయ కేంద్రము స్థాపించుటకు నిశ్చయించారు.

ఈ కోడూరు కేంద్రంనుండి, ఊటగూడెం, గొల్లపాలెం, ద్వారక, ఈరాలి, శ్రీరాంపురం, హంసలదీవి, బాపన్నపాలెం, పాలకాయల తిప్పలలోని 950 కుటుంబములకు చెందిన 3,114 జనులకు సహాయకార్యక్రమము జరిపింప నిశ్చయించారు. డిసెంబరు 11 వ తేదీని వీరందరకు పప్పులు, ఉప్పు, నూనె, చింతపండు, అగ్గిపెట్టెలు, బంగాళాదుంపలు వారమునకు సరిపోవునట్లు పంచిపెట్టిరి. తాటాకు చాపలు, కప్పుకొనుటకు దుప్పట్లు, వంటపాత్రలుకూడా పంచిపెట్టారు. ట్రంకుపెట్టెలు, లాంతర్లు వగయిరా సామానులు యిచ్చుటకు ఏర్పాట్లు జరుగుతున్నాయి. వీరందరకు పునరావాసము కలిగించువరకు ఈ విధముగా ఆహార పదార్థములు పంచుటకు ఏర్పాట్లుచేశారు.

ఇండ్లు కోల్పోయిన కుటుంబాలకు గృహమునకు రు. 5,000/- ఖర్చుతో ఒక వెయ్యి గృహములు నిర్మించియిచ్చుటకు రామకృష్ణ మిషనువారు నిర్ణయించారు. ఈ సహాయకార్యక్రమము నిర్వహిస్తున్న స్వామి బోధస్వరూపానంద గృహనిర్మాణమునకు కావలసిన నిధులకై ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రితో సంప్రతించగా మిషనువారు ప్రజలనుంచి సేకరించిన నిధులకు సమానముగా, ఆంధ్రప్రభుత్వము ద్రవ్యము నిస్తుందని హామీ చేశారు.

రామకృష్ణ మిషనువారు ప్రస్తుతము సహాయ కార్యక్రమము నిర్వహిస్తున్న గ్రామములలో, గృహనిర్మాణమునకు 50 లక్షల రూపాయలు వ్యయం అవుతుంది.

పై విషయములను గ్రహించి బాధిత ప్రజానీకానికి సహాయము చేయువారు విరాళములను పంపించవలసినదిగా ప్రార్థన.

బేలూరు రామకృష్ణ మిషన్ కేంద్ర సంస్థ ర్యవేక్షణక్రింద రామకృష్ణమిషన్ రాజమండ్రి కేంద్రము ఈ సహాయకార్యక్రమము నిర్వహిస్తున్నది.

బేలూరు మఠంనుండి ఇద్దరు ట్రస్టీలు (స్వామి గీతానందజీ మహరాజ్, స్వామి గహనానందజీ మహరాజ్) ఈ మధ్యనే బాధిత ప్రాంతములను పర్యవేక్షించి వెళ్ళిరి.

ఈ బాధిత మానవాళికి చేయు సహాయ కార్యక్రమంలో సహకరించుచున్న వారందరికి మేమెంతయు కృతజ్ఞులము.

స్వామి నందానంద,
రామకృష్ణ మిషన్
వీరభద్రాపురం, రాజమండ్రి

## బాలల శారదాదేవి

బి. ఎస్. ఆర్. ఆంజనేయులు

### షోడశీ పూజ

రామచంద్రముఖోపాధ్యాయ, శారద, రావటం రామకృష్ణుడు చూచాడు. శారదకు జ్వరం రావటం, అప్పుడు రాత్రికావటంవల్ల ఆదుర్దాపడ్డాడు. తానే స్వయంగా ఆమెకు ప్రక్క పర చాడు. తినటానికి కొన్ని మరమరాలిచ్చాడు. రాత్రింబవళ్లు తానే స్వయంగా సేవచేశాడు. మూడురోజులలో ఆమె ఆరోగ్యం బాగుపడింది. అప్పుడామెను తన తల్లియున్న నహబత్తులో వుండటానికి పంపాడు. ఆమెకూడా కొత్తగా వచ్చిన కోడలిని ఎంతో ప్రేమించింది. కూతురు సుఖంగా ఉండటంచూచి రామచంద్రుడు జయరాంబాటి వెళ్లిపోయినాడు.

శారదకు ఎంతో ఆనందం కలిగింది. ''నాఆరోగ్యంకొరకు యింత ప్రేమ, ఇంత దయ, ఇంత జాగ్రత్త తీసుకున్న ఈయన పిచ్చివాడా? కాదు.'' అని అనుకున్నది. రోజూ ఆయనగదిలోనే పరుండేది. శ్రీ రామకృష్ణదేవుడు అప్పుడు తన మనస్సును పరీక్ష చేసు కున్నాడు. ప్రక్కనే భార్యయున్నా తనమనస్సు నిర్మలంగా వుంది. ఆయన యిలా ప్రార్థిం చాడు. ''అమ్మా, నా భార్యమనస్సుకూడా ఎప్పుడూ నిర్మలంగా యుండేటట్లు చూడు.'' కొన్ని రోజులయినతర్వాత శారదలోకూడా కాళికాదేవిని చూడాలనుకున్నాడు.

అది కాళీపూజ రోజు. దానిని ఫలహారిణి కాళీపూజ అంటారు. శారదవచ్చిన రెండు న్నరనెలలకు ఆ పండుగ వచ్చింది. గుళ్లో గొప్పగా పూజ జరుగుతుంది. కాని రామకృష్ణుడు శారదతో ''ఈరాత్రి నాగదిలో కాళీపూజ చేస్తాను. ఎనిమిదిగంటలకు నీవుకూడా వచ్చిచూడు'' అని చెప్పాడు. ఆమె 'సరే' అన్నది. శ్రీరామకృష్ణుడు పూజకు కావలసిన ఏర్పాట్లన్నీ చేశాడు. అమ్మవారికి పీఠం చక్కగా అలంకరించాడు. పూలు, పండ్లు, నైవేద్యానికి మంచి మధుర పదార్థాలు ఏర్పరచాడు. దీపాలు పెట్టాడు. గదిఅంతా ధూపంతో నిండింది. అమ్మవారికి అర్పించ టానికి చీరకూడా తెచ్చాడు. ఆ పీఠానికి ఎదురుగా తాను కూర్చున్నాడు. చెప్పినసమయానికి శారద నెమ్మదిగా తలుపుతీసుకొని వచ్చింది. లోనికిరాగానే ఆమెకు ఒళ్లు తెలియలేదు. అమ్మ వారిపీఠంపై కూర్చోమని రామకృష్ణుడు సంజ్ఞగా చేతితోచూపాడు. ఆమె అలాగే చేసింది. ఆమెకు యిప్పుడు యేమిచేస్తున్నది తెలియటంలేదు. ఆయనకు ఆమె కాళికాదేవిగా కన్పిస్తు న్నది. అందుకే అమ్మవారిని పూజించినట్లు ఆమెను పూజించాడు. పూలమాల వేశాడు. చీర యిచ్చాడు. తనచేతితో నైవేద్యాన్ని ఆమెకు తినిపించాడు. హారతి యిచ్చాడు. తర్వాత దోసిట్లో పూలుపట్టుకొని ఆమె పాదాలమీద వేశాడు. తాను పదమూడుసంవత్సరాలుగా చేసిన తపస్సు ఫలితాన్నంతా శారదాదేవి పాదపద్మాలముందు ధారపోశాడు. సాగిలబడి మ్రొక్కినాడు. ఆ మిగతారాత్రంతా వాళ్లిద్దరూ సమాధిలో ఉండిపోయారు. తెల్లతెల్లవారుచుండగా స్మ వచ్చింది. ఆ దివ్యభావంతో శారదాదేవి నహబత్తుకు వెళ్లిపోయింది.

పుణ్యదినమున షోడశీ పూజచేసి, దేవి దర్శించె శారదా దేవిగాను<br>
శారదా రామకృష్ణులాసమయమందు అధివసించిరి గాఢసమాధియందు,




ముప్పదినాలుగవ సంపుటము

1977 జనవరి నుండి 1977 డిసెంబరు వఱకు

సంపాదకులు :

స్వామి చిద్ఘనానంద

ప్రకాశకులు :

స్వామి చిద్ఘనానంద




శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 600004.

# అకారాది విషయానుక్రమణిక

# let your money grow more than 7 times




**A Cash Certificate of Rs. 1000.00 will yield Rs. 7328.07 in 20 years.**

Plan ahead for future needs and invest in UBI Cash Certificates.
Watch how your money grows !

You can buy UBI Cash Certificates in denominations of Rs. 100.00 or its multiples for a fixed period—7, 10, 15 or 20 years. On maturity, you will get back a lump sum amount which may be more than seven times of your initial deposit.

Choose the amount and term you think suit you best.
Buy a UBI Cash Certificate today.

**A few examples**

| Issue Price (Rs) | Encashment value after 7 years | 10 years | 15 years | 20 years |
|---|---|---|---|---|
| 100 | 200.79 | 270.70 | 445.39 | 732.81 |
| 500 | 1003.96 | 1353.52 | 2226.95 | 3664.04 |
| 700 | 1405.54 | 1894.93 | 3117.74 | 5129.65 |
| 1000 | 2007.92 | 2707.04 | 4453.92 | 7328.07 |
| 5000 | 10039.60 | 13535.21 | 22269.60 | 36640.37 |
| 10000 | 20079.20 | 27070 41 | 44539.19 | 73280 73 |

***For details, come to your nearest UBI branch***




# United Bank of India

---

సంపాదకులు : శ్రీ చిద్ఘనానందస్వామి

శ్రీ ఎమ్ బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు–600 021) న ముద్రింపబడి,

శ్రీ చిద్ఘనానందస్వామిచే శ్రీ రామకృష్ణ మఠము (మద్రాసు–600 004) నుండి ప్రచురింపబడినది